THE

# COMPLETE WORKS

OF

## *Chilakamarti Lakshmi Narasimham.*

*Vol.* I. NOVELS.



PRINTED AT SCAPE & CO.,

COCANADA,

1913.

బ్రహ్మశ్రీ

# చిలకమర్తి లక్ష్మీనరసింహకృత గ్రంథములు.



శ్రీ

ఒకటవ సంపుటము.

## చిత్రవచనకావ్యములు.



కాకినాడ:

స్కేపు అండు కో., ముద్రాక్షరశాల.

1913.

# విషయసూచిక.

# రామచంద్రవిజయము.



## మొదటి ప్రకరణము.



శ్రీమంతంబై సమస్తసంపదలకు నిలయమైన యీభరతఖండము నందలి దేశములందు ఫలవంతంబై, యతి పురాతనంబై, యనేక పావనరాజవంశసమేతమై యాంధ్రదేశము దనరుచుండును. ఆదేశమునందు సమస్తజనసేవితంబై, బహుపుణ్యక్షేత్రశోభితమై గోదావరీనది ప్రవహించుచుండును. ఈగోదావరీనది ప్రవహించుచున్న మండలముల యందన్నిటిలో జన్మమెత్తినందులకు ఫలము ఘనులకు నల్వురకుం గూడ సహజముగ నందవలయునని యెంచియో యన్నట్లు గెలలభారము చేత భూమికిం దగులునట్లు వంగి యతిమనోహరమైన ఫలములచేత నాంకొన్న యాపన్నజనంబుల కెల్ల నవ్యవధానముగ నాంకలిందీర్చుచు, శృంగారతరమైన పుష్పములచేత నేత్రములకపూర్వమొనర్చుచు, సమస్తపుష్ప జాతములనుండి వీతెంచు వాయువులచేత ఘ్రాణేంద్రియమునకుం దృప్తిం గావించుచు, దూరప్రయాణములచేత నలసిసొలసి వచ్చు పాంథజనంబులకు జల్లనినీడనిచ్చుచు, సర్వావయవములకును నేకకాలముననే మహానందము గల్గించుచు, ధరణీరమణికిం జేసిన యపూర్వాలంకారములో నెలయు తియ్యమామిళ్లు, పనసలు, అనంటులు, కొబ్బరులు, పోం మొదలగు ఫలవృక్షములకుం గన్నతల్లియై కోనసీమ భాసిల్లుచుండు ఆకోనసీమయందెల్ల సౌందర్యసీమయు సుఖములకు నాపురంబును పురముగదా! ఆగ్రామము మొదటం జిన్నదైనను పుణ్యపు[illegible] లు తమకీర్తి యాచంద్ర[illegible]తారార్కముగ భూమండలమున [illegible] ట్లు బ్రాహ్మణోత్తములకు సుక్షేత్రములయిన భూములనిచ్చి, వా

నివాసార్థమై, కట్టించిన యగ్రహారములచేతఁ జుట్టుప్రక్కలనున్న గ్రామములకంటె పెద్దదై, లౌకులుమిక్కలి నివసించుటచేత నొకపట్టణము వలెనుండును. కోనసీమయం దంతటను, ముఖ్యముగా నాగ్రమునందును, భూలోకకల్పవృక్షములని ప్రసిద్ధికెక్కిన సార్థకనామమును ధరించిన కొబ్బరితోఁటలనేకములు గలవు. ఎంత ధన్యమైన జన్మమోగాని కొబ్బరిచెట్టును జక్కఁగాఁబరీక్షించినయెడల వేరు మొదలు మొవ్వవఱకును జనుల కుపయోగించునుగాని యొకతృణమాత్రమైనను వ్యర్థముగాఁ బోదు. మహాత్ముల జన్మము పరోపకారార్థమేగదా? అట్టి కొబ్బరితోఁటయందు తోఁటకొక యిల్లుండును. అందాఁతోఁటయజమానుఁడు నివసించును. వేయేల కొబ్బరితోఁటల మాహాత్మ్యము వర్ణింపనేల? పదివరహాలు గలవానికంటె పదికొబ్బరిచెట్లుగలవాఁడు ధన్యుఁడను మాట సత్యమేయగు. అమలాపురమునం దుత్తరమునందొక చెఱువును దక్షిణమునందొక చెఱువును గలవు. మొదటిచెఱువునకు చుట్టును రెండుప్రక్కల నూరుండును. చెఱువునోదిగుటకు రెండుప్రక్కల మెట్లు గలవు. రాజవీధి యొక్కటే పెద్దదియున్నది. వీధికి రెండుప్రక్కలను గుమ్మములముందట కొబ్బరిచెట్లుండును. ఆగ్రామమునకు పశ్చిమమునందుంచి వారి యగ్రహారమున్నది. ఆగ్రామమునకుఁజేరినయే యొకమామిడి తోఁట కలదు. వెలుగఁగాసిన యామామిడిచెట్లకాయ లెవ్వరైన దొంగిలించు కొనిపోదురేమో యను భయముచేత చెట్లకు నిలువెత్తున [illegible] వేసి, పండుటకర్హమైన కాయలు దొరబారఁగనె బుట్టలుగట్టి [illegible] మొదలగు పక్షులు కొట్టకివేయకుండఁ జేతిలో నొకయుం[illegible] పుచ్చుకొని మధ్యమధ్య పచ్చని మామిడాకులసందునఁ గూ[illegible] [illegible]గు తెలియకుండ మోసముజేయుచున్న చిలుకవైపున [illegible] వేయుచు నొకకాఁపువాఁడు కాఁపుకాచుచుండెను. అవల [illegible]నేక మార్గస్థుల దృష్టిదోషమునఁ దోటకు భంగమేమియుఁ [illegible]

గాఁపుదలిగాఁ గాఁపువాఁడు తన శిల్పశాస్త్రచమత్కారము నంతను వినియోగించి చేసిన వికృతాకారముగల యొక దృష్టిబొమ్మగలదు. అది వేసవికాలమగుటచే నతిమనోహరమైన యావసంతఋతువునందు శృంగారలక్ష్మికిఁ బుట్టినింటివలెనున్న యాతోఁటలోనికి వచ్చి విశ్రమించకుండ మార్గస్థులను బెదరించుచుండును. కలిసిమెలిసి దట్టముగా గుమిగూడుకొన్న వారిని సహస్రకరములవాఁడైన భేదింపఁజాలఁడని యైకమత్యోపయోగములను జనుల కుపదేశించుచున్నవోయన గుజ్జుమామిడిగున్నల యాకులు దట్టమై సూర్యకిరణదుర్గమంబుగా నుండెను. ప్రభాకరుఁడు తన సహస్రకిరణములను జగమునందు వ్యాపింపఁజేయుచు సర్వభూతభయంకరుఁడై భూమండలమెల్ల దహించుచుండెను. మృగవారంబులు మృగతృష్ణల జలాశయంబులుగ భావించి దాహనివారణార్థము పరుగులెత్తుచుండెను. చల్లని పందిళ్ళవలెనున్న క్రొమ్మావిగున్నలును మామిడిగున్నల వ్రేలాడుచున్న యలరు జొంపముల మెక్కి మెక్కి కూయుగండుఁగోయిలలును, కోయిలకూఁతల నాలకించుచు మార్గాయాసనివారణ మొనర్చుకొనుచున్న పాంథజనసమూహంబులును వేసవికాలలక్షణంబుల వెలిసేయుచుండెను. భూమిమీఁదరాలి యెండిన యాకులన్నియు గలగల ధ్వనిఁజేయుచు గాలికిఁ గదలుచుండెను. అగ్నివర్షము గురిసినఁ చాప్పన గాడ్పులు వెచ్చగ వీచుచుండెను. అట్టిసమయమున ప్రభవ సంవత్సర వైశాఖశుద్ధ చతుర్థినాఁడొక మార్గస్థుఁడు మార్గాయాస నివారణార్థ మొక మామిడిచెట్టునీడకువచ్చి మూటను గ్రిందవైచి దానిమీఁద [illegible]డి చెయ్యూణచుకొని భుజముమీఁదియంగవస్త్రముతో మొగమునస్నానముజేసినట్లు పట్టిన చెమటను దుడుచుకొనుచు తలకుఁజుట్టిన సెనగపువ్వంచు జరీయుత్తరీయము చెంగుతో విసరుకొనుచు నేదియో దీర్ఘాలోచనఁజేయుచుఁ గూర్చుండెను. పచ్చసి నిమ్మపండువంటి దేహచ్ఛాయయు, గుండ్రనివ గ్రమును, సొగసైన కాటుకకన్నులును, [illegible]

యవయవములును గలిగి, సహజమైన లావణ్యముగల యాతనిశరీరము నకు ఛాగికడ్డీలమీఁదనమర్చిన బంగారుమురుగులును, పుష్యరాగములు వేసి తాపిన తమ్మంట్లును నొక వింతయందమును గలిగించుచుండెను. అప్పుడప్పుడే నూతనముగా నంకురించుచున్న నూనూగు మీసములు చెప్పనక్కఱలేకయే యతఁడు పదునెనిమిదివత్సరముల ప్రాయముగల బాలుఁడని తెలియఁజేయును. ఆకుమారుఁడుతనలోఁదానేదో వితర్కించు కొనుచుండఁగా నప్పుడొక ముప్పదియయిదువత్సరముల చామనచాయ గల బక్కపలచని పొడుగు బ్రాహ్మణుఁడామార్గమునఁ బోవుచు దూర మున నతనిఁజూచి, కొంచెము నిదానించి, యెవరాయని యాలోచించి, క్రొత్తమొగమని తెలిసికొని, కిఱ్ఱుకిఱ్ఱుమని చెప్పులజోడు ధ్వనులఁజేయ, నీబాలకుఁడున్నవైపునకువచ్చి యెదుట నిలువఁబడి యిట్లుపలుకరించెను.

బ్రా—అబ్బాయీ! మనదేయూరు?

బాలు—మాది తాటిపాక కాఁపురము.

బ్రాహ్మ—మీరెవ్వరు? మీయింటిపేరేమి? [రాజువారు.

బాలు—మేమారువేల నియోగులము. మాయింటిపేరుమాచి

బ్రాహ్మ—నీపేరెవరు? నీతల్లిదండ్రులు బాగున్నారా?

బాలు—నాపేరు రామచంద్రుఁడందురు. నాకుతల్లిదండ్రికూడ లేరు. తండ్రిగారు చనిపోయి నాలుగుసంవత్సరములయినది. తల్లిగా రు పోయి యీవేళ కిరువదిదినము లైనది.

బ్రాహ్మ—పాపము! చిన్నతనమునందేతల్లిదండ్రులు లోకాంతర గతులయినారా? పూర్వజన్మకృతము. అయితే మీతండ్రిగారి నామ ధేయము.

బాలు—మాతండ్రిగారు శ్రీరాములుగారు.

బ్రాహ్మ—ఓహోహో! శ్రీరాములుగారి కుమారుఁడవటయ్యా? సరే. అయితే మీరన్నదమ్ము లెందఱు?

బాలు—అన్నదమ్ములును లేరు. అక్కసెల్లెండ్రును లేరు. నేనొక్కఁడనే. మాబాబయ్యగారిని మీ కేమైన నెఱుఁగుదురా యేమి?

బ్రాహ్మ—ఎఱుఁగుదురాయని యడుగుచున్నావా సరి సరి. మాకూచిమంచివారికి మీరు మిక్కిలి యత్యావశ్యకమైన బంధుకోటిలోనివారే. బాంధవ్యమటుండఁగా మాతాతగారికిని శ్రీరాములుగారి తండ్రిగారికిని ప్రాణస్నేహమని మాతండ్రిగారు సెప్పుచుండఁగా నేననేక పర్యాయములు విన్నాను. మాముత్తాతగారి తమ్మునికిచ్చినది మీయూరిలోనున్న సత్యరాజువారి యాఁడుపడుచే.

బాలు—మాగ్రామములో సత్యరాజువారు లేరే!

బ్రాహ్మ—నీ కేమి తెలియును? నిన్నఁగాక మొన్న కన్ను దెఱచినవాఁడవు. నక్కఁ నేనుపుట్టి మూఁడువారములు గాలేదు. ఇంతగాలివాన యెన్నఁడు నెఱుఁగనన్నదఁట. సత్యరాజువారిప్పుడు గన్నవరములోనున్నారు. మీగ్రామములో లేరు.

బాలు—నామధేయము?

బ్రాహ్మ—నాపేరు శోభనాచలము. మాసంగతినీవు కుఱ్ఱవాఁడవగుటచే నెఱుఁగవుగాని మీపెద్దలందఱు నెఱుఁగుదురు. పెద్దాపురమునందు మహారాజుగారియొద్ద మంత్రులుగానున్న యనపపిండివారు మాకు దగ్గఱబంధువులు. రాజమహేంద్రవరములో మాడభూషివారు మా మాతామహులు. మాతండ్రిగారికి మాడభూషివారు పిల్లనిచ్చినపుడు వెయ్యినూటపదార్లు కట్నమిచ్చినారు.

అని శోభనాచలము చెప్పఁగానే రామచంద్రుఁడుగొప్పవారితో మాటలాడుట తటస్థమైనదని సగౌరవముగా మాటలాడఁదలంచి "తమ దర్శన మెన్నఁడును జేయలేదు" అనెను.

శోభ—అవును. దూరమునందున్నపు డెవరికివారే. నియోగములో బీరకాయపీచు సంబంధము. కదిపినఁగాని యెవరికిఁదెలియదు

కుబ్జవాఁడవయినను బుద్ధిమంతుఁడవు. అయితే నీవీగ్రామమెందుకువచ్చి నావు? ఇక్కడ బంధువులెవరు?

రామ—నాకందఱు బంధువులే. నేనీగ్రామమున నుపాధ్యాయుల విశ్వనాథశాస్త్రులవారు వచ్చియున్నారని విని యాయనదగ్గఱఁ జదువు కొనవలెనని వచ్చినాను. లక్ష్మీసహస్రము జదువుకొనవలెనని యున్నది. ఆయన చక్కఁగా పాఠములు జెప్పగలరా?

శోభ—లక్ష్మీసహస్రమా? ఆలక్ష్మీసహస్రములు విశ్వనాథ శాస్త్రులవారికి రావు. ఆయనకు కావ్యపరిశ్రమమేగాని వైదికమునందుఁ బ్రవేశము లేదు. లక్ష్మీసహస్రనామములు, విష్ణుసహస్రనామములు, మాగ్రామపురోహితుఁడైన సోమావధానులకు వచ్చును.

రామ—ఆపుస్తకము కూడ నొకకావ్యమే. సహస్రనామము లు గావు.

శోభ—ఏమో! చిన్నప్పుడు కావ్యపంచకమువఱకు జదువు కొన్నాను. వ్యవహారములోఁ బ్రవేశించినతరువాత తిరిగి యావిషయమై పనిచేయలేదు. అందుచేత జ్ఞాపకములేదు. ఆయనపాఠములు చక్కఁగాఁ జెప్పఁగలరుగాని నీవు బసయెక్కడచేయవలెనని యాలోచించినావు?

రామ—వంటపూటయింటనుండి చదువుకొనవలెనని యున్నది.

శోభ—ఏమీ సదుపాయముగా నుండదు. అందులో మాగ్రా మములో నున్న పూఁటకూళ్ళముండ దిక్కుమాలినముండ. డబ్బు చేతి లోవేసికొని కడుపుగాల్చును. ఉన్న యిల్లదియొకటే. అబ్బాయి! నీవుమాకు గావలసినవాఁడవు రెండుమూఁడుదినములు మాయింటనుండి తరువాత పూఁటకూళ్ళయింటఁ బ్రవేశించు. గ్రామములోనికి వెళ్ళుదము రా పొద్దుపోయినది.

రామ—మీయింట నెందుకు? వంటపూఁటయింట నే నీదినమే ప్రవేశించి చదువుకొనవలెనని యున్నది.

శోభ—నీకు; మొగమాట మండవనిలేదు. మాయిల్లు నీకత్యా వశ్యకమైన చోటుగాని మఱియొకటికాదు. మనమందఱము నొకకంచము లో భోజనము చేయవలసినవాళ్లము లే. మాటపుచ్చుకో.

బంధువులు బలవంతము జేయుచున్నపుడు వారియింటికిఁ బో కుండుట బాగుండదని యాలోచించియును రామచంద్రుఁ డెన్నఁడును పర గృహనివాసము జేయుటయందు మిక్కిలి యనిష్టముతోనే లేచి శోభనా చలముతోఁగూడ పోవుచు మార్గమధ్యమందు తా నీగ్రామము వచ్చిన వెంటనే గొప్పవారిస్నేహము దొరికినదనియుఁదనకది శుభసూచకమనియు సంతోషించుచుండెను. శుష్కప్రియములయందుఁ దనకుఁగల యావత్తు సామర్థ్యము నుపయోగపఱచి, తన జన్మమధ్యమం దెప్పుడు లక్ష్మి సహస్రమనుకావ్యము పేరయిన విననిపోయినను, పంచకావ్యముల నైనను జదువుకొనకున్నను, తానుగూడ చదువుకొన్నవాఁడేయని రామ చంద్రుని మనస్సునకు తోఁచునట్లు పలికెను. రామచంద్రునకుఁ దల్లి దండ్రులు లేరని విన్నప్పటినుండియు నీతనికి వంటపూఁటింటికి ధనమెట్లు వచ్చునని పెద్దసందేహము శోభనాచలమునుఁబట్టి బాధించుటచేత శంకా నివృత్తిఁ జేసికొనఁ దలంచి మెల్లగా నిట్లు ముచ్చటించెను.

శోభ—అబ్బాయి! వంటపూఁటిముండకు నెలకు నాలుగురూపా యీలు దక్షించవలెనే. పాపము నీకుతల్లిదండ్రులుకూడ లేరు. ఏలాగున చదువుకొందువో యని నాకు సందేహముగానున్నది.

రామ—అయ్యా! చేతులనున్న మురుగు లేబదిరూపాయీలు విలువగలిగి యున్నవి. తమ్మంట్లు పాతికరూపాయీలు. ఆ రెంటినివిక్ర యించినయెడల నొకసంవత్సరమువఱకు చదువవచ్చును "నందోరాజాభవి ష్యతి" తరువాత దైవమున్నాఁడు నేనున్నాను. అప్పుడుద్యోగస్థులపిల్ల లకు పాఠములు చెప్పి యేమాత్రమైన సొమ్ము సంపాదించగలనని నాకు ధైర్యమున్నది.

శోభ—సరే. చక్కని యాలోచన చేసినావు. చదువుకావలసిన వాఁడు సొమ్ముపావనముగాఁ జూచుకొనఁడు. చదువునందాసక్తిగలవానిని నిన్నొక్కనినే చూచినాను. కాని యీగ్రామమునందు కోమట్లు చెడ్డ వాళ్ళు. మోసముజేసి వరహావస్తువుదమ్మిడీకి కొనఁగలసామర్థ్యము వారి దగ్గఱనున్నది. పెద్దకోమట్లతో నాకు పెక్కువ్యవహారము లున్నవి. నేను వారిని మనయింటికిఁ బిలిపించి చక్కఁగా బేరముజేసి నష్టములేకుండ నీ సొమ్ము నీకువచ్చునట్లమ్మఁగలను. నీవుతొందరపడి సొంతముగా వ్యవ హరింపఁబోకు. ఇక్కడ తలలుదీసి తలలు బెట్టువార లున్నారు.

అనిచెప్పఁగానే రామచంద్రునకు శోభనాచలముమీఁద మును పటికంటె నెక్కువ నమ్మకముగుదురఁగా నాతనిసహాయముచేత నెల్లయుఁ నాగ్రామమునందుండి సుఖముగాఁజరుపుకొనఁదలంచెను. ఇట్లువారిద్దరు మాటలాడుచు గ్రామములోనికి వచ్చిరి. గ్రామమునను వచ్చి రాజ వీథిలో కొంతవఱకు పోయి కుడిచేతిమీఁదుగా నున్న సందులో రెండు గుమ్మములుదాఁటి మూఁడవగుమ్మముదగ్గఱకుపోయి కొంచెము వెనుకగా వచ్చుచున్న రామచంద్రుఁడు వచ్చువఱకునిలుచుండి "ఇదేమనలోగిలి" అని చిన్నవీథియరుగులును కొబ్బరియాఁకులపడియును గలయొకపాత పెంకుటింటిలోనికిఁ దీసికొనిపోయి చావడిమీఁద నున్న తాటియాఁకుల చాపమీఁదఁ గూర్చుండుమనిచెప్పి తాను లోపలికిఁబోయి "అమ్మా" యని పిలిచి మెల్లగా నామెతో నిట్లని చెప్పెను.

శోభ—అమ్మా! నీవేమియు విసుగుకొనవద్దు. ఈవేళ మన యింటికిబంధువుడొకఁడు వచ్చియున్నాఁడు. త్వరగా వంటకావలెను.

తల్లి—నీవేదో తెచ్చిపెట్టి నన్ను చంపుచుండువని నేనీదివఱకే యనుకొనుచున్నాను. నీకుప్రతిదినము నెవఁడోయొకబంధువువచ్చుచు నేయుండును. నీయుద్యోగమునకు నీసంపాదనకు తోడు చుట్టాలనుగూడ దాపురము చేయవలెనఁటరా? నాయనా!

శోభ—అబ్బా! యూరకుండవమ్మా. అవతల పెద్దమనుష్యుఁడు కూర్చున్నాఁడు పెద్దలేదు పిన్నలేదు. నీగోలయెప్పుడు నీలాగేయున్నది.

తల్లి—ఏమి యూరకుండను? ఎన్నాళ్ళు? ఒకనాఁడా యొకకథ. ఎల్లకాలము నాకథ యీలాగే యున్నది. కాటికి కాళ్ళుజాపుకొన్న నుండను. చాకిరీచేయలేక నానాహింసలఁ బడుచు నేలాగైన గంజికాచి పోయుదమని యనుకుంటే నీవు పేల్చుకొని తినుచున్నావు. ఎముకలు చిట్లి కట్టె పోవుచున్నవి. రామ రామ! దిక్కుమాలిన దేవుఁడు నాకు చావు పెట్టఁడు. అయినదియేమో వచ్చినందుకు సుఖములేదు, వల్లకాడు లేదు. తల్లికడుపునఁ బుట్టినదిమొదలు చచ్చినదాకనొక్కటే మచ్చుగదా? నిప్పు డెస్సెసరు పెట్టవలెను. నీకేమి? మాట చెప్పఁగలవు.

అని తన్నుతానుదిట్టుకొనుచు, శోభనాచలమునుదిట్టుచు, మరల బియ్యము కడిగి పొయ్యిమీఁదఁ బెట్టుటకుఁ బ్రయత్నము సేయుచుండెను. శోభనాచలమును తనతల్లియన్న మాటలను రామచంద్రుఁడు విన్నాఁడేమో యని భయముతో నీవలకు వచ్చెను. చావడిముందున్న కొబ్బరి యాకుల పందిరినలఁ జల్లగానుండుటచేతను, పందిరి కావలివాకిట నున్న కొబ్బరిచెట్లమీఁదనుండి వచ్చెడి గాలిచేతను, మార్గాయాసనివారణము కాఁగా నేదో యోచనఁ జేయుచు రామచంద్రుఁడు వీరికిజరిగిన కలహముఁ బూర్తిగ వినలేదుకాని కేకలుమాత్రము వినెను. శోభనాచలము రాఁగానే వారిద్దఱిట్లు మాటాడిరి.

రామ—అయ్యా! లోపల నెవరు కేకలు వేయుచున్నారు?

శోభ—ఏమిటో మాయమ్మ నల్లమందు పిచ్చచేత నామీఁద నెప్పుడైన కేకలు వేయుచుండును. అంతేకాని నీనామాటేదియులేదే.

రామ—ఏదో వంటసంగతి యనుకొన్నానులెండి. అందుచేత నడిగినాను.

శోభ—ఆబిడపెద్దది. పుట్టిబుద్ధియెఱిఁగిన తరువాత నతైసరయిన,

అని చెప్పఁగా రామచంద్రుఁడు తమలపాకు లలవాటులేదని చెప్పి విశ్వనాథశాస్త్రులవారిదర్శనము త్వరితముగాఁ జేయవలయుననియు త్సాహముతో శాస్త్రులవారి యింటికిఁ దోవఁజూపుమనియు, పూఁటకూళ్ళయిల్లు గ్రామమున కేప్రక్క నున్నదనియు, తనదగ్గఱ నున్నవస్తువుల నమ్మివేయుటకు కోమటిని బిలిపించుమనియు రామచంద్రుఁడు శోభనాచలమును తొందరపెట్టెను. శోభనాచలమునకు వస్తువుల నమ్మివేయుటయందు రామచంద్రునికంటె నెక్కువయాత్రము కలిగియున్నది. కనుక శాస్త్రులవారింటికి మఱునాఁడు వెళ్ళవచ్చుననియుఁ, బూఁటకూటియిల్లు సాయంకాలము జూపుదుననియుఁ జెప్పి కోమటినిమాత్ర మప్పుడే పిలిపించుటకు నిశ్చయించి యెవరిచేత నయినను మద్దులకింకిరన్నమునకు వర్తమానము బంపవలెనని యనుకొనుచుండఁగా నిరువదియేండ్ల వయస్సుగల యొక కమ్మవారి చిన్నవాఁడు వచ్చెను. ఆతఁడు శోభనాచలమునకు గుండెకాయ. ఇతని పేరు వెంకటస్వామి. మార్గాయాసముచేత సీలోఁగా రామచంద్రునకుఁ గొంచెమునిద్రపట్టెను. అతఁడు నిద్రించుచుండఁగా వెంకటస్వామిని వీధిలోనికిఁ దీసికొనిపోయి యరుఁగుమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని శోభనాచల మతనితో నేదో గుసగుసలాడి పంపెను. యజమానుని కార్యనిర్వాహమునందు హనుమంతునితో సాటియని చెప్పఁదగినయాకుఱ్ఱవాఁ డతివేగముగఁ బోయి కోమటితోఁ గూడ నక్కడనున్నట్లు మరలివచ్చెను.

కనకరత్న మెప్పుడు వచ్చునాయని యెదురుచూచుచున్న శోభనాచల మతఁడు రాఁగానే తటుక్కునలేచి వీధిగుమ్మము వద్ద కెదురు పోయి కమ్మకుఱ్ఱవాని దగ్గఱనుండి కోమటిని చెయ్యిపట్టుకొని దూరముగాఁ దీసికొనిపోయి చెప్పవలసిన సంగతులన్నియుఁ జెప్పి యాతని వెంటఁబెట్టుకొని రామచంద్రుని యొద్దకువచ్చి యాతని నిద్రలేపెను. లేచి తన యెదుట నల్లని లావుశరీరమును, భూలోకమున నవతరించిన ప్రత్యక్ష విఘ్నేశ్వరుఁడేమో యను భ్రాంతి కలుగఁజేయు పెద్దపొట్టయు, నుదు

పట్టునామములును జేతులను మురుగులును నెడమచంకక్రింద వస్తువులున్న చారల సంచియు, కుడిచేతిలోఁ జిన్నత్రాసును గల కోమటిని జూచి రామచంద్రుఁడు కూర్చుండుమని చెప్పెను. అప్పుడు వారందఱీప్రకారము గా మాటాడిరి.

శోభ—కనకరత్నము! ఈపిల్లవాఁడు మురుగులను విక్రయించ వలెనని నాతోఁజెప్పినాడు. నీవు నాకు నమ్మకము గలవాఁడ వౌటచేతను, మాకు మీకు చాలవ్యవహారము లుండుటచేతను నేనునీకు వర్తమానము నంపినాను. ఒకడబ్బునా మ్మెక్కువ కమ్మవలెనుగాని తక్కువ కమ్మవద్దు. మాకీతఁడు కావలసినవాఁడు బంధువులతో పని సామ్యాగ్యమైన వచ్చినపక్షమున నాకు మాటవక్కను. ఇద నివ్యవహారముగాఁ జూచుకోవలెను. వేఱే నేచెప్పనక్కఱలేదు.

కన—సరిసరి, మీమనాతో సెలవియ్యవలెనా ? ఇంతికాలము నుండి మీకునేను వస్తువులు నమ్మకముగా నిచ్చుచున్నాను. ఎన్నఁడయిన దమ్మిడిదగ్గఱనైన తేడావచ్చినదా? మనుష్యునకు మాట నమ్మక ముండ వలెఁగాని ధనమా పావనము? భోగముదిగఃశించఁగలము. తమవంటివారి దగ్గఱ మర్యాద కావలెనుగాని రొయికడబ్బటయితే నేమి? అటయితేనేమి. ఏవీ? మురుగులు తీయుండి.

అని కనకరత్నము జెప్పఁగానే శోభనాచలము రామచంద్రుని దగ్గఱగా జరిగివచ్చి అబ్బాయీ ! మురుగులు దీయునా యని యడుగ నతఁడు తీయుమని తలయూఁచి యూరకుండెను. చేతిని మురుగులు చిన్న తనములో చక్కగా నెక్కించుటచేత చేతులతో లాగినపుడు మురుగులు రాలేదు. తరువాత త్రిప్పితోసి వారు లాగుచుండఁగా, తల్లి దండ్రిలు చిన్నవాఁడు తన కావస్తువు చేయించి పెట్టిన నాఁటికి నిప్పటికి తన యవస్థలో నెంత తారతమ్యము గల్గినదో తలంచుకొని, మురుగుల నమ్ముకొనుటచేతఁ గాని తనకుభోజనంబు జరుగకున్నదని కొంచెము విచా

రించి రామచంద్రుఁడు దుఃఖమును పైకి రానీకుండ దిగమ్రింగి బేరమును జూచుచుండెను. కనకరత్నము మెఱుగులు దీసినతరువాత కొన్ని రాళ్లు త్రాసులో వేసి మురుగులు తూచి గొలుచెను నోఁగ చప్పరించెను. అప్పుడు వారిట్లు మాటాడిరి.

రామ—ఏమోయి ! అలా గనుచున్నావు ? ఎన్ని తులముల యెత్తున్నవి.

కన—ఏమని మనవిచేయుదునండీ? పాతికతులములు. చూడఁగానే నేనేమాత్రమో యుండునను కొన్నాను. అబ్బే ! మాయనన్నుతుండండీ. ఏ కంసాలి చేసినాడండీ? లాభము బాగుగాఁ గొట్టినాడు. ఇవి రెండు తులములు లున్నవి. తులము పదునెన్మిది రూపాయలధర.

రామ—నూనాన్నగారు నమ్మకముగల కంసాలిచేత చేయించినారు. అదికాక యిది మేలిమి బంగారము. తులము పాతిక రూపాయల ధర. గీటురాయి యేదీ?

కన—పిచ్చిమాట. ఎంతనమ్మకమున్నను కంసాలి తిన్నఁగా జేయునా? అదికాక యిదివరహావన్నె కాని మేలిమి కాదు. కావలసినయెడల నింక నెవరికయినఁ జూపించుకొనుఁడు. నేను గీటురాయి మఱచి పోయినాను.

శోభ—గీటురాయి యెందుకయ్యా? అతఁడు నానము కట్టినట్లు మాగాత్రమునం దెవ్వరును గట్టలేరు. ఒకవేళ పొరపాటు వచ్చిన నతఁడు పాడిపోవునా? నిప్పువారిపోదువా? వచ్చినమట్టుకు సొమ్ము పుచ్చుకో నిలకడమీఁదను జూచుకొనవచ్చును. పుష్యరాగములు కుడ విక్రయించవలెనని యున్నదా?

రామ—అవి యిప్పుడు విక్రయించను. ఈ రూపాయ లయిన తరువాతగాని చూడను. అయితే కనకరత్నము ! నీవిప్పుడు రొక్కము నీయఁగలవా?

కన—తక్షణము పుచ్చుకొండి. ముప్పదియైదురూపాయలు నా దగ్గఱ నున్నవి. తక్కినరూపాయలు రేపుదయమునఁ బంపించెదను." అనిలెక్కపెట్టి సొమ్మిచ్చెను. రామచంద్రుఁడు సొమ్ము పుచ్చుకొని బొడ్డుకొంగునఁ గట్టుకొనెను. అంతట కోమటయ్యయు నింటికి వెళ్లిపోయెను.

అపుడు రామచంద్రుఁడును శోభనాచలమును లోకాభిరామాయణమును జెప్పుకొనుచుండఁగా పాతికసంవత్సరముల వయస్సుగలయొక పుట్టువాఁడు, రెండుభుజములమీఁద కాయలు స్పష్టముగఁ గనుపడుచుండ, జుట్టును జుల్పములను నున్నగ దువ్వి, చేతిలో నొకపేపబెత్తము బట్టుకొని, తలకు నుత్తరీయము కుచ్చువచ్చునట్లు చుట్టి, నోట నొక చుట్టను బెట్టుకొని కాల్చి గుప్పుగుప్పున పొగలువదలి చిన్నమేఘములను గల్పించుచు, చేతిలో గుప్పెడాకులును చెక్కలును బట్టుకొని, నాగరికత యంతయు తనమొగముననే తాండవమాడునట్లు లోపలికి వచ్చెను. లోపలికి వచ్చిన యామనుష్యుని జూడఁగనే శోభనాచలమున కొకవిధమయినతొందరకలిగెను. వచ్చినక్రొత్తమనుష్యుఁడు తనచంకక్రిందగుడ్డలోఁ జుట్టఁబడి యున్న చీట్లపేకను దీసి చాపమీఁద వేయఁగనే, శోభనాచలమునకు తొందరయెక్కువై, మొగము వెలవెలఁబాఱి, రామచంద్రుఁడు తనతోఁ బ్రసంగవశమునఁ జెప్పుచున్నమాటలు వినఁబడకుండెను. ఆతఁడు వచ్చి కూర్చుండి చుట్టకాల్చుకొనుచు, తమలపాకులతొడిమలఁ దీయుచు శోభనాచలమునకు లేశమయిన నిష్టములేకపోయినను నాతఁడు చేసిన కనుసంజ్ఞనైనఁ జూడక మాటలాడ నారంభించెను. ఈతనిపేరు నరసయ్య.

నర—"ఓరీ ! శోభనాచలము! మనవాండ్రెవ్వరు రాలేదా? నీవుకూడ మొద్దులాగున కూరుచుంటివేమి? దొడ్డిలో చింతచెట్టుక్రింద చాపలు వేయించినావా? నీపద్ధతిజూడఁగానీవేళ యిక్కడనే యాడుటకు నిశ్చయించినట్లున్నది. ఏమి బెల్లముగొట్టినతాయిలాగునమాటాడవేమిరా?

అని కొ్రత్తమనుష్యుఁ డిట్లు మాటలాడుచుండఁగా పంగనామములు బెట్టుకొని యింకొక బ్రాహ్మణుఁడు వచ్చి కూరుచుండెను. శోభనాచల మాతని జూడఁగనే "దయచేయండి. వెంకటరత్నముగారు" అని పలుకరింపఁగా వెంకటరత్నము మిక్కిలి తెలివిగలవాఁడును, ప్రపంచ వ్యవహారములయం దారితేరినవాఁడును, గావున కనుమర్యాదగాఁ గూరుచుండెనుగాని తమలపాకులు వేసికొనుచు మొదటవచ్చిన బ్రాహ్మణుఁడు వెంకటరత్నమును జూచి యిట్లు పలుకరించెను.

నర—ఏమిరో! వెంకటరత్నము! నీవుకూడ యింత యాలస్యము చేసినావేమి?

వెంక—ఈవేళ భోజనము ప్రొద్దుపోయినది. వైశాఖపూజ చేసినాము.

నర—ఇది చైత్రమాసముగదా! వైశాఖపూజ యేమిటికి?

వెంక—ఏడ్చినావులే. నీవూరుకో. నీకేమియుఁ దెలియదు.

నర—మీయింట వైశాఖపూజ జరిగిన శరభరాజుగారు నాకు వర్తమానము బంపరూ? మీయింట నేను రెండుకావిళ్లు మంచినీళ్లను మాత్రముపోసి వెళ్లిపోయినాను.

వీ రీప్రకారముగా మాటలాడుకొనుచుండఁగా మఱి నలుగురు మనుష్యులు శాలువలుఁ దలువుఁ దోసికొని వచ్చిరి. అందులో నొకఁడు శోభనాచలమును జూచి "ఏరీ! పిల్ల కుదిరినదఁట. సోమావధానులు చూడివచ్చినాఁడు" అని చెప్పెను. అప్పుడు వెంకటరత్నము మొగము చిట్లించుకొని యా క్రొత్తమనుష్యునివైపు దిరిగి పంక్తుకొాటికి మాటాడవద్దని సంజ్ఞచేసి "మన మందఱము దొడ్డిలోనికిఁ బోదమురండి" యని వారినందఱిని వెంటఁబెట్టుకొని యదివఱకే చింతక్రింద కమ్మకుట్టువాఁడు పఱచిన చాపల మీఁదఁ గూరుచుండి చీట్లపేక నాడ నిశ్చయించిరి. శోభనాచల మాదినమున రామచంద్రుఁడు వచ్చుటచేత నాటకు కొన్ని

కూరుచుండెను. మెడలో పిడికెడు యజ్ఞోపవీతము లుండుటచేత శోభ నాచలమునకు వివాహమైనదని నమ్మియున్న రామచంద్రునకు నొకఁడు వచ్చి పిల్లకుదిరినదని చెప్పఁగానే భనాచలము చెప్పినమాటల యందును, వాని పెండ్లివిషయమందును, కొంచెము సందేహము గలుగుటయేకాక యతనియింటికి వచ్చి సంభాషించినవారి మాటలను బట్టి వీరందఱు వంటబ్రాహ్మణులు నిత్యబ్రాహ్మణులు మఱి యితరమైన నీచులనికూడ నాలోచన తోఁచి భనాచలము నడిగి చూడవలెనని బుద్ధిపుట్టెను. వారిట్లు మాటాడిరి.

రాము—ఏమండీ! ఆ మొదట వచ్చినబ్రాహ్మణుఁ డెవఁడు?

శోభ—(వినివినుపించుకొనునట్లు మనస్సులో నేదో యాలోచించుచుండెను.)

రామ—ఏమండీ! ఆమనుష్యుఁ డెవరండీ?

శోభ—ఈగ్రామమునందు నిత్యబ్రాహ్మణుఁడు. (అని మెల్లఁగాఁ జెప్పెను.)

రామ—అతఁడు పరువు మర్యాద లెఱుఁగకుండ మాటలాడినాఁడేమి?

శోభ—ఏమిటో చిన్నతనమునందు మేమిద్దఱము నొక బడిలోనే చదువుకొన్నాము. అప్పటి చనువుచేత నిప్పటికిని నన్నాలాగున నాతఁడు పిలుచుచుండును స్నేహితులయెడ నాకంత పట్టింపు లేదు.

రామ—పిల్లకుదిరినదని యొకమనుష్యుఁ డన్నాడు. ఆ పెండ్లి యెవరికి?

శోభ—నాకు వివాహ మనుకొన్నావా యేమి? మా పినతండ్రి కుమారునికి వివాహము కాలేదు. అతనివిషయమై పిల్లను వెదుకఁ బంపినాను.

రామ—ఇప్పుడు వారందఱు దొడ్డిలో నేమి చేయుచున్నారు

శోభ—చీట్లపేక నాడుచున్నారు. నీవుగూడ నాడఁగలవా?

రామ—నాకు చేతఁగాదు. నేనాడఁ దలంచుకొనను లేదు.

శోభ—ఆడిన తప్పులేదు, చేతఁగాకున్న నేర్చుకొనవచ్చును. డబ్బు పట్టియాడరు. ఒకవేళ సంతోషమునిమిత్తమాడినను తిరిగి యెవరి డబ్బు వారికే యిచ్చివేయుదురు.

రామ—అటువంటి యాటను నేను నేర్చుకొనను.

అని యిద్దఱు ప్రసంగము చేయునపుడు లోపల చీట్లపేక నాడుచు కొంచెముధనము ఋణము కావలసి యొకస్నేహితుఁడు శోభనాచలమును నవలకుఁ బిలిచి ప్రస్తుతమాడుకొనుట కభ్యంతరము గల్గిన దని యు, తానింటిదగ్గఱ నుండి తెచ్చిన యిరువదియైదురూపాయలు నోడిపో వుటచేత పదిరూపాయ లప్పు కావలెననియుఁ జెప్పఁగా శోభనాచలము రామచంద్రునియొద్ద కాతనిఁ దీసికొనివచ్చి యాతఁడు మహాధనికుండని యు, సంవత్సరమున కతనికి వేయిరూపాయలు భూములమీఁద వచ్చు ననియుఁ జెప్పి తన నమ్మకముమీఁద పదిరూపాయలు ఋణమిప్పించె ను. అప్పుఁ దీసికొనుచున్న యామనుష్యుఁడు ధనవంతుఁడు గాకపోయి నను, జూదరియు, నిర్భాగ్యుఁడు నైనను, శోభనాచలమునకు కలనియం దుఁ గల యభిమాన మతని విషయమై యంత చక్కఁగాఁ జెప్పునట్లు చేసెను. శోభనాచలము మాటలునమ్మి రామచంద్రుఁడు తాను దిగు చున్న మహావిపత్సముద్రము నెఱుఁగక యే కొంగునఁగట్టినఁ సొమ్మువి ప్పి బిళ్ళకుడుములలాగున పదిరూకలు లెక్కపెట్టి చేతిలోఁ బెట్టెను. రూ పాయకు దినమున కొకయణా వడ్డీ యిచ్చెదనని చెప్పి యతఁడు సొమ్ము నుబట్టుకొని పోయెను. మఱికొంతసేపటి కామనుష్యుఁడే తిరిగి మఱి యైదు రూపాయల నిమ్మని యడిగి పట్టుకొనిపోయెను. ఇప్పటికి రామచం ద్రునియొద్ద నిరువది రూపాయలుమాత్రముండును. శోభనాచలముగా రి పెరటిలో జరుగుచున్న మహద్యూతము నందు కొంతకాలము, వరహా

లు, రూపాయలు, అణాలు, డబ్బులు కూడ పందెములుగాఁ బెట్టి, వారి పుత్రాదు లన్నవస్త్రములులేక మలమల మాడుచు నిత్యశివరాత్రులను నేకాదశులును సలుపుచున్నను దానిని లక్ష్యపెట్టక, యహోరాత్రములు వేదాంతులవలె బంగారమును చిల్లిపెంకులుగఁ జూచుచు వినోదసముద్రమునందు మునిఁగి తేలుచున్న యనేకనలచక్రవర్తులును ధర్మరాజులును నాచింతచెట్టుక్రిందఁ గొలువుఁ దీర్చియుందురు.

వారంద ఱాదినము ట్లవిచ్ఛిన్నముగా జూదమాడుచున్న సమయమునందు వాకిటఁగూరుచున్న రామచంద్రశోభనాచలముల కొకవిధమైన యల్లరి వినఁబడెను. అది వినఁబడినతోడనే శోభనాచలమునకు మనసు తాళకపోయినందున నెంటనే యరుగుమీఁదనుండి చివాలున నేల కుఱికి లోపలి కతఁడు పరుగెత్తుకొనిపోవుచుండఁగా నీతని కెదురుగా పయిమీఁద బట్టలేక జుట్టుముడి విడిపోయి, వెక్కి వెక్కి యేడ్చుచు, కుచ్చెళ్ళకొంగుతోఁ గన్నీళ్ళుఁ దుడుచుకొనుచు, నొకపిల్లవాఁడు వచ్చెను. అతనిఁజూచి రామచంద్రుఁడుకూడ లేచి పిల్లవాని యెదుటకుఁ బోయెను. అప్పు డాపిల్లవాఁడిట్లు చెప్ప నారంభించెను.

"అయ్యా! ఈసంగతి మీరు వినండి. నేను బడిలో నుండి మాయింటికిఁ బోవుచుండఁగా నీకమ్మకుఱ్ఱవాఁడు నన్ను లోనికిఁ దీసికొని పోయెను. వెంకటరత్నముగారు నన్నుఁగూడ చీట్లాడుమని బలవంతపెట్టిరి. ఒకటి రెండు పందెములయందు నన్ను గెలిపించి తరువాత నాచేతి నున్న బంగారపు ముద్దుటుంగరమును బందెము పెట్టించిరి. పైమీఁదనున్న జరీయుత్తరీయమును కూడ లాగుకొని నేనిమ్మనిగట్టిగా నడిగి నప్పుడు నన్ను వీరందఱుఁ దిట్టి కొట్టినారు. ఇవిగో చరుపులు చూడండి. దెబ్బ లేలాగున నట్టలు కట్టియున్నవో. నేనిప్పుడు శరభరాజుగారియొద్దకుఁబోయి యీసంగతిఁ జెప్పెదను." అని చెప్పుచున్న కుఱ్ఱవానిమాట కడ్డమువచ్చి నరసయ్య మహాకోపములో నిట్లనియెను.

నర—కాలుకూఁతలు కుయ్యకు. చెప్పుదెబ్బలు తినఁగలవు. శరభ రాజుగారితోఁ జెప్పి తలఁగొట్టి మొలవేయించఁ గలవా యేమి? నీది కన్నన్న చోట చెప్పుకో. (అనిశోభనాచలమువంకఁ జూచి) ఊరక మంగ నిమును బెట్టుకొనిరాలేదు. ఉత్తరీయము నేను పుచ్చుకొన్నమాట సత్యమే. నాదగ్గఱ రెండురూపాయలప్పుఁదీసికొని నాలుగు నెలలయినది. ఇంకను నీయలేదు. అందుచేత బట్టలాగుకొన్నాను. ఇతఁడు రాను లేదు. ఆడను లేదు. అంతయు నబద్ధమే.

ఇట్టిదఱు చెప్పఁగనే విని శోభనాచలము తన స్నేహితుల శక్తియు సాహసమును నెఱిఁగినవాఁడు గావున తప్పక వారాయుంగరమును నపహ రించి యుందురని నిశ్చయించి శరభరాజుగారిసంగతి విన్నపక్షమునఁ దనకు మాట వచ్చునని యేలాగైన నతని సాముతనికిప్పించ వలెనని నిశ్చయించుకొని బలవంతముగా రానికోపమును దెచ్చుకొని యీప్ర కారముగాఁ జెప్పెను.

శోభ—పుణ్యమునకుఁ బోఁగా పాప మెదురైనదఁట. స్నేహి తులుగదా యని యీయుకొనుటకు స్థలమిచ్చినందుకు దెబ్బలాటలును, తుదకు నిష్ఠురములునా? నాయనా నీసొమ్ము నాయింటఁబోయినందులకు నేనాదండుగ నిచ్చుకొందును. తెచ్చుకొన్నందుకు చచ్చినట్లనుభవింప వలెను. నాసొమ్మెందఱు తినుచుండుటలేదు? అందులో నీవొకఁడవు. ఇంత మాత్రముతో నేను చెడిపోను. (అని రామచంద్రుని వంక తిరిగి) అబ్బాయి! నీదగ్గఱనున్న యిరువదిరూపాయలు నాకుబదులియ్యఁగలవా సాయంకాలము తిరిగి నీ కిచ్చివేయుదును.

రామ—చిత్తము. పుచ్చుకొనుఁడు. అని చెప్పి యాసొమ్ము నంతను నిచ్చెను. ముప్పదిరెండురూపాయలు బదులడిగినవనే యిచ్చి వేయుటచేత రామచంద్రునకు భార మంతయుఁ దగ్గి దేహము చులుకన యయ్యెను. ఆరూపాయలు పుచ్చుకొని యాపిల్లవాఁ డుత్తరీయమును

గూడ మరల నరసయ్యాయొద్దనుండి తీసికొని యింటికిఁబోయెను. అప్పుడు సాయంకాల మగుటచే రామచంద్రుఁడు సంధ్యావందనమును జేసికొనుటకు చెఱువునకుఁ బోఁగా వెంకటరత్నమును, శోభనాచలమును వానిని వెంబడించిరి. వెంకటరత్నము చెఱువుగట్టున నున్న యొకయింటఁ బ్రవేశించెను. శోభనాచలము మాత్రము చుట్టఁగాల్చుకొనుచు గట్టు మీఁదఁ గూరుచుండి రామచంద్రుని సాంధ్యకృత్యము లయినతరువాత నతనితోఁ గలిసి ప్రదోషకాలమున శివాలయమున కరిగి యాలయము చుట్టును మూఁడుప్రదక్షిణములు చేసి నందీశ్వరుని చెవుల సందులనుండి ముందుగా నీశ్వర దర్శనముచేసి, గర్భగుడిఁ బ్రవేశించి తన కందకుండ నున్న గంట నెగిరికొట్టి శివునిదర్శించి "వందేశంభుముమాపతిం" అను శ్లోకమును బఠించి పూజారి యిచ్చిన రుద్రపాదముల నందుకొని మాహేశపత్రి నంది తల నుంచి విభూతి మొగమునఁదాల్చి, కనుబొమ్మల సందున నమ్మవారి కుంకుమను బొట్టుబెట్టుకొని యీశ్వరప్రసాదమును దినఁగూడదు గనుక కొబ్బరి ముక్కల నక్కడనుంచి, కొంతసేపచటఁ గూరుచుండి యింటికి శోభనాచలముతోఁ గలిసి వచ్చునప్పటికి భోజనపువేళ యయ్యెను.

తన యదృష్టముపుచ్చి రామచంద్రుఁడు వచ్చుటచేత తన కుమారుని వలన తగిలెడు దెబ్బలు తప్పినందులకు సంతోషించుచు, నల్లమందు లేకపోవుట చేత కాళ్ళులాగుచున్నందున వంటమాత్రము చేసికొని శోభనాచలముతల్లి పరుండెను. శోభనాచలమువచ్చి తానే యన్నము వడ్డించి రామచంద్రునితోఁ గలిసి సుఖముగా భోజనము జేసెను. భోజనమగువఱకు వెంకటస్వామి వచ్చి సిద్ధముగా నున్నందున శోభనాచలము వానినక్కడనే పండుకొనుమని సహాయార్థ ముంచుకొనెను. రాత్రి జామయిన తరువాత రామచంద్రునికి నిద్రపట్టెను. కొంతసేపటి కందఱు బుసకొట్టి నిద్రపోవుచుండిరి కాని వెంకటస్వామిః

మాత్ర మేకారణముననో నిద్రపట్టదయ్యెను. తరువాత రెండుజాముల వేళ నేలఁగొట్టినట్టు చప్పుడయ్యెను. ఏదో స్వప్నమువచ్చి మెలఁకువఁ గల్గిన రామచంద్రుఁడాచప్పుడువిని 'ఎవరువారు' అని కేకవేసెను. ఆ కేకవేయఁగనే యాచప్పుడాఁగిపోయి మరల నాకిరెండు గడియలయ్యెను. అప్పటికి రామచంద్రుఁడు గాఢముగ నిద్రించుచుండెను. అప్పుడొక దొంగ చప్పుడుగాకుండ మెల్లమెల్లగా నడుగులఁ బెట్టుచు రామచంద్రునియొద్దకువచ్చి, తలక్రైపునఁ గూర్చుండి తమ్మంట్లుఁ దీసికొని దురాశచేత, శోభనాచల మిదివఱకే రూపాయ లన్నియు కన్నముచేసినాడన్న మాట నెఱుఁగక, తలక్రింది మూఁటలో నేమో యున్నదనుకొని మెల్లగి మూఁటలాగెను. మూఁటలాగఁగనే తల భూమిమీఁదఁ బడి టక్కున తగులుట వలన మెలఁకువ వచ్చి రామచంద్రుఁడు తలయెత్తి చూచి 'దొంగ దొంగ' యని కేకవేసెను. వెంటనే దొంగ మూఁటఁ బారవైచి యేమూలకో పారిపోయెను. రెండుమూడు పిలుపులు పిలిచినతరువాత శోభనాచలములేచి దొంగలు పడినందుల కాశ్చర్యపడి దీపము వెలిఁగించి కళ్లు పుచ్చుకొని యిల్లు నాల్గుమూలలు వెదకెను గాని వాని కెక్కడను దొంగ కనఁబడడయ్యెను.

కమ్మకుర్రవాఁడు మాత్ర మీకేకలు వినఁబడక కాఁబోలు, చెమట పోయుచున్నను ముసుఁగు బెట్టికొని పండుకొనెను. రామచంద్రుఁడొక్కఁడు పండుకొనుటకు భయముగలుగుట చేత, కాఁదలఁచిన పని కొంచెమైనది గనుక శోభనాచలము రామచంద్రునిమీఁద నతిదయఁగలిగి దగ్గఱగాఁ బండుకొనెను. రూపాయలు శోభనాచలము దగ్గఱనుండుటచేతను, తమ్మంట్లు దొంగలెత్తుకొనిపోవుటచేతను, రామచంద్రునకు భయపడవలసిన యావశ్యక మంతయుఁబోయి సుఖముగా నిద్రపట్టెను. కాని మధ్యమధ్య స్వప్నములు, పలువరింతలు, నాతనినిద్రకు నంతరాయములు గల్పించుచుండెను. మురుగుల నమ్ముకొనుట చేత వచ్చినసామ్ముతో కొంతకాల

క్షేపము చేయనచ్చునను ధైర్యమున తమ్ముంట్లుపోయిన విచారమంతగా రామచంద్రున కగుపడలేదు. వయస్సునందు బాలుఁడయ్యు, తెలివితేటలం దసమానుఁడయిన యాశమ్మకుఱ్ఱవాఁడే రామచంద్రుని తమ్ముంట్ల బాధ పడలించిన సాహసవిక్రమాఢ్యుఁడని చెప్పనక్కఱలేకయే మీరు తెలిసికొనవచ్చును. జూదరియు, వంచకుఁడును, ద్రోహియు నగు నీశోభనాచలము, రామచంద్రుని తండ్రియగు శ్రీరాములుగారి నెఱుఁగక పోయినను నెఱిఁగినట్లుచెప్పి నిరక్షరకుక్షియయ్యు కావ్యపంచకము వల్లెవేసినట్లు చెప్పి పరమనీచుఁడయ్యు గొప్పవారికి బంధువుఁడని చెప్పి బ్రహ్మచారియయ్యు గృహస్థుఁడని చెప్పి, మోసముచేసి, రామచంద్రుని తన యింటికి రప్పించుకొని చేయఁదలంచిన పనినంతయుఁ జేసి సఫలమనోరథుండై యారాత్రి శమ్మనిచేత దొంగతనము చేయించి, తమ్ముంట్లు తానే యపహరించి మిగిలిన రాత్రియంతయు సుఖముగా నిద్రించెను. ముద్దుల కనకరత్నమును శోభనాచలమున కేవిషయమునను దీసిపోనివాఁడేకనుక నేఁబదిరూపాయల విలువగల మురుగులను ముప్పదియారు రూపాయలకే తీసికొని యందులో నొకరూపాయ నరువుపెట్టి తనచేతి నయి సంతవఱకుఁ దానును రామచంద్రుని వంచించెను. అందఱు నుదయమునందు లేచి కాల్యకృత్యముల నిర్వర్తించుకొనిరి.

## మూఁడవ ప్రకరణము.



ప్రాతఃకాలమందు కాల్యకృత్యములు నిర్వర్తించుకొని విశ్వనాథ శాస్త్రులవారి దర్శనము చేయుటకుఁ బోవలయు నని రామచంద్రుఁడు శోభనాచలమును గూడ రమ్మనియడుగ నతఁడు వచ్చుటకు వీలు లేదనియు, శాస్త్రులవారు మిక్కిలి మంచివారనియు, స్వయముగానే వెళ్ళవచ్చుననియుఁ జెప్పి వారి యింటికి మార్గమును జూపుటకు మాత్రము

వెంకటస్వామిని జత యిచ్చెను. ఆతఁడును రామచంద్రుని వెంటఁబెట్టుకొని శాస్త్రులవారి యిల్లు చూపిపోయెను. విశ్వనాథశాస్త్రులుగారి యిల్లు రాజవీథిలోనున్నది. విశాలముగా నున్న రెండువీథియరుగుల మీఁద తాటియాకుల చాపలువేయఁబడి యున్నవి. ఆచాపల మీఁద విశ్వనాథశాస్త్రులవారి విద్యార్థులందఱుఁ గూరుచుండి యుండిరి. అందులోఁ గొందఱు తామిదివఱకుఁ జదువుకొన్న పాఠములఁ జింతనఁ జేసికొనుచుండిరి. కొందఱు ముందు చెప్పుకొనవలసిన పాఠములను జూచుకొనుచుండిరి. కొందఱాకులు, గంటములు, బుచ్చుకొని క్రొత్తపుస్తకములఁ జూచి ప్రతులవ్రాయుచుండిరి. ఉదయముననే స్నానముజేసి, విభూతిపుండ్రకట్లఁ బెట్టుకొని, మొగిలితుర్తి సంస్థానమునం దష్టావధానముఁ జేసినపుడు మహారాజుగారిచ్చిన పట్టుశాలువ మీఁదఁ గప్పుకొని, బరువైన బంగరు కుండలములు చెవులను క్రిందకు దిగలాగుచుండ విశ్వనాథశాస్త్రులవారు గోడకుఁ జేరగిలఁబడి కొంచెము తలవంచి కన్నులకు సులోచనములు పెట్టుకొని ప్రాఁతదగుటచేత నకిరము లగుపడకున్నందున శిష్యుఁడొకఁడు మధ్యమధ్య పత్రములకు కాకిపసరు రాయుచుండఁ దాటియాకుల పుస్తకమొకటి చదువుచుండెను. శాస్త్రులవారి కిప్పటికి రమారమి యేఁబది సంవత్సరము లున్నందున తలకొంచెము నరసి యుండెను. ముసలితనమైనను సుందరముగా, దార్ఢ్యముగానున్న యాయన శరీరమును జూచినవారందఱు పసితనమం దాయన స్ఫురద్రూపియై యుండునని యనుకొనక మానరు. రామచంద్రుఁ డక్కడకుఁ బోగానే శిష్యులందఱు నితని నెగాదిగఁజూచి తమలోఁదాము ముసిముసినవ్వులు నవ్వుకొనుచుండిరి. రామచంద్రుఁడు వచ్చి శాస్త్రులవారికి నమస్కారముచేయ నాయన యాతని దీవించి కూరుచుండుమని చెప్పెను. కూరుచున్నతరువాత రామచంద్రుని సంగతులన్నియు నడిగి యాతఁడు తన దగ్గఱ చదువుకొనుటకు వచ్చినాఁడని తెలిసికొని శాస్త్రులవారు సంతో

షించిరి. అంతట నొక శిష్యుఁడు రామచంద్రునితో ముచ్చటింపఁ దలఁచి యిట్లు సంభాషించెను.

శిష్య—అయ్యా ! తమ రెంతవఱకుఁ జదువుకొన్నారు?

రామ—కావ్యపఠనము వఱకుఁ జదువుకొన్నాను.

శిష్య—ఎంతకాలమయినది కావ్యము లారంభించి?

రామ—మూఁడుసంవత్సరములైనది, ఇంక నేమాత్రమో కొన్ని నెలలుతక్కువే.

శిష్య—ఏమి బడాయ లయ్యా ! ఎన్నఁడు కావ్యముల ముఖము గనివారి దగ్గఱ చెప్పినట్లు చెప్పుచున్నావు. నీ వెంత తెలివిగలవాఁడ వైన నేఁడాది కొక కావ్యమునకంటె నెక్కువఁ జదువఁగలవఁటయ్యా? నీవే చదువుకొన్నావా? ఇంతవరకు చదువుకొనలేదా మేము నీకంటె తెలివిగల వారము కాక పోయినను కొంచెము చదువుకున్నవారమే

రామ—నేను బద్ధములు చెప్పుచున్నా ననియా మీ యభిప్రాయము? మూఁడు సంవత్సరములలో కావ్యములు జదువుకొనుట యొక వింతటండీ? నేనిలాగున జదివినాను.

శిష్య—మీరు గాదుగదా బ్రహ్మరుద్రులైనను సరే యేఁడాదకొక్కటి చదువునప్పటికి చచ్చిచెడి చేయంగల విన్నపములగును. మాట లండీ? మాగ్రామమునందు బ్రాహ్మణుఁ డొకఁడు నవద్వీపము వెళ్ళి యిరువదినాలుగు సంవత్సరములు వ్యాకరణశాస్త్రము చదివినాఁడు. ఇంకను గ్రంథము తిరువాయి. నివాకారేను మీఁదినుండి యూడి పనావా యేమిటి? అయితే దినమున కెన్ని శ్లోకములు చదివెదువాఁడవు.

రామ—పది, ఎనిమిది యీప్రకారముగాఁ జదివెదువాఁడను.

శిష్య—(గుండె చేతితో బాదుకొని) అబ్బా ! లోకములో లేనివింత. నీతలమీఁద దాఁటి కొమ్ములు దిరిగినవారైనను రెండు మూఁడు శ్లోకముల కంటె నెక్కువఁ జదువలేదు, (అని శాస్త్రులవారి

వంకఁ జూచి) ఏమండీ శాస్త్రులవారు! ఇతని మాటలఁ జిత్తగించినారా

విశ్వ—ఆశ్చర్య మేమున్నది? కుశాగ్రబుద్ధు లున్న పక్షమున నన్నీ చదువఁగలరు. ఇట్లు వారు సంభాషించు నప్పటికి జాముప్రొద్దెక్కఁగాఁ గొందఱు శిష్యులు మాధుకరమునకును గొందఱు వారముల కును గొందఱు ప్రాఁటకూళ్ళ గుంపులకును బోయిరి. రామచంద్రుఁడు శాస్త్రులవారి దగ్గఱ సెలవుపుచ్చుకొని శోభనాచలమును దీసికొనిపూఁట కూళ్ళయింటికిఁ బోయెను. ఆపూఁటకూళ్ళయింటియరుగుమీఁద భోజనార్థ మువచ్చిన కొందఱుదారులును, బ్రాహ్మణులును గూరుచుండిరి. లోపల నడవలో నున్న దండెమునకు పట్టుబట్టలు వరుసగాఁ జుట్టఁబడి యుం డెను. ఉదయాస్తమయములు తడికొన్నాళ్ళో మనుష్యులు తిరుగుచుం డుటచేత నిల్లంతయు తేమగలిగికొంచెము జారుగా నుండెను. చేతులను పోఁచీలును, మురుగులును, బంగారు తీఁగెలువేసిన రాగి పట్టెలును మెడలో పలకసరులు, పట్టెడ, నానును గలిగి చలువచేసిన జరీపంచె శరీర మంతయుఁ గనుపడునట్లు గట్టి, జుట్టు సిగముడివేసి, యింటఁ గొందఱికిని వాకిటఁ గొందఱికిని వడ్డించుచు, భోజనముచేసినవారిచ్చుచున్న డబ్బుల నడుముచేతఁ బుచ్చుకొనుచు, మిక్కిలి పనితొందరచే నూపిరి యాడక తిరుగుచున్న యొక తలవెండ్రుకల విధవనుజూచి, శోభనాచలము "రా జమ్మా! బాగున్నావా? ముసలాయన యేమైనా దార్ఢ్యముగాఁ దిరుగు చున్నాఁడా?" యని పలుకరించెను.

రాజ—తమదయవల్ల బాగున్నాము. మానాన్న మునుపటి వలెనే తిరుగుచున్నాఁడుగాని దగ్గుమాత్రము వదలలేదండి. ఏమి యీ వేళ మామీఁద కటాక్షము వచ్చినది.

శోభ—మరేమిలేదు. తాటిపాకనుండి మన మాచిరాజువారి చిన్నవాఁడువచ్చినాఁడు. అతనికిమీయింట నుండవలెననియున్నది. అతని నిక్కడ నొప్పగించుటకువచ్చినాను. పిల్లవాఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు.

ఈకాలపుపిల్లలవలె నల్లర చిల్లరవాఁడు గాఁడు. నీవందఱి నొకయెత్తు నీపిల్లవాని నొకయెత్తుగాను జూడవలెను. ఇతఁడొకరిజోలికి నొంటికిఁ బోవువాఁడు గాఁడు. తన చదువేమో, తానేమో.

రాజ—వాని కభ్యంతర మేమి? తమరింతదూరము శ్రమపడి రావలెనా? ఆపిల్లవానికి మఱొక లోపము రాకుండ జాగ్రత్తపెట్టు భారము నాది.

శోభ—రూపాయి లతని కొసఁగివచ్చు. నెలకాఁగానే నేనిచ్చి వేయుదును. ఇంక వంట యెంత యాలశ్యముగా నగును నాలుగు గడియలకు రావచ్చునా?

రాజ—అక్కఱలేదు. రెండు గడియలలోగా రావచ్చును, స్నానము చేసిరా నాయనా

అప్పుడు శోభనాచలమును, రామచంద్రుఁడును వెళ్ళిపోయిరి. రాజమ్మది పూర్వము పలినెల నివాసస్థలము. ఆమె పెనిమిది వివాహమైన రెండుమాసములకే దౌర్భాగ్యము నొందుటచేతను పుట్టినింటివారి సంసారము చితికిపోవుట చేతను రాజమ్మ తల్లిని, తండ్రిని, తమ్ముని దీసికొని యమలాపురము వచ్చి యచట పూఁటకూళ్ళను బెట్టుచు నహోరాత్రములు, వేసెడువిస్తరి వేయుచుఁ, దీసెడివిస్తరిఁ దీయుచు, వంటలు చేయించుచు, వచ్చినవారికి వడ్డించుచు కాశిలోనున్న యన్నపూర్ణాసత్రము నందువలె నిరంతరాన్నదానము జేయుచు నమలాపురమునందేకాక కోనసీమయందంతటను మహాప్రసిద్ధికెక్కి విస్తారము ధనము నార్జించెను. పూఁటకూళ్ళను బెట్టుట కారంభించి మూఁడుసంవత్సరములైనను పండ్రెండువందలరూపాయీల నార్జించెను. ఆమె మొదట నాగ్రారము వచ్చినపుడు వండుటకు పాత్రసామాగ్రియైన లేనియిల్లు గంగాళములు మొదలయినవానితో నిండియుండఁగా మొదట కేవలము

రాగిపట్టెలయిన లేని రాజమ్మశరీరము బంగారపు నగలతో నిండియుం
డుట యొక యాశ్చర్యముగాదు.

పాపము! దైవ మోహ్వాఁజాలక యామెకు వైధవ్యమును దెచ్చి
పెట్టి మనసువచ్చినన్ని నగలు పెట్టుకొనుట కభ్యంతరము గల్పించినాఁడు
గాని లేనిపక్షమున పుణ్యస్త్రీలుపెట్టుకొను నగ లన్నియుఁ బెట్టుకొనుట
కామె దగ్గఱ సామర్థ్యమున్నది. ధనము హెచ్చినకొలఁది సుకుమారత
కూడ హెచ్చినందున రాజమ్మ వంటఁజేయుట కష్టమనితోఁచి యొక
వంటబ్రాహ్మణుని పెట్టెను. మొదట నచ్చినప్పుడు రాజమ్మతండ్రి పెసరట్లు
నమ్ముటచేతను, తల్లి నిప్పుబిందెలు మోయుటచేతను, తమ్ముఁడు చలిపం
దిరిలో దాహమునకు నిచ్చుచ్చుటచేతను, తాను పూఁటకూళ్లు పెట్టుట
చేతను సంపాదించిన ద్రవ్యముతో రాజమ్మ యిప్పుడు వడ్డీవ్యాపారము
చేయుచుండెను. మొదట నందఱినిఁ బ్రతిమాలి కాలక్షేపము చేయుచుఁ
గొంతధనము చేతఁజిక్కఁగనే గర్వించి మనుష్యులను రాజమ్మనిరాకరింపఁ
బ్రారంభించెను. ఇంతేగ రాజమ్మ పెద్దాఁడుపడు చగుటచేత తలిదండ్రు
లును తమ్ముఁడును నామె యడుగు దాఁటక నామెపేరు జెప్పిన గడగడ
వణఁకుచుందురు. తన యొడల నాలుగయిదువందల రూపాయిల నగలఁ
బెట్టుకొని, తమ్మునకై దువంద లిచ్చి పెండ్లిఁ జేసి తా మున్న యింటివా
రికి నూరురూపాయ లింటిమీఁద బదులిచ్చి తరువాత నింకొకమాఱేబది
రూపాయిలు వారిచేతిలోఁబెట్టి యాయిల్లుకొనెను. రాజమ్మ సంగతి
నటుండనిచ్చి యింక కథారంభము జేయుదము. తరువాత రామచం
ద్రుఁడు స్నానముజేసి మడిఁ గట్టుకొనఁగా భోజనము లారంభ మా
యెను. ఆసమయమునందు రాజమ్మ వడ్డనఁ జేయుచు, రామచంద్రుని
వృత్తాంతమును దెలిసికొని యతఁడు నియోగియని చెప్పినతరువాత నిట్లు
మాటాడ నారంభించెను.

రాజ—మొగమోటపడకు నాయనా! నియోగపు బిడ్డవు. కొంచెము పరువుప్రతిష్ఠలకు దేవులాడువారు మన నియోగులే. మేముకూడ నియోగులమే యని చెప్పుటకు నీవంటివారిదగ్గఱ సిగ్గుగానుండును. నగము చచ్చినమండీ యీపనిఁ జేయుచున్నది.

రామ—అవును. కాలము తప్పివచ్చినపు డేమి చేయఁగలము?

రాజ—నీవు చెప్పిన నమ్ముదువో లేదోకాని మాసంసారస్థితి, యేబదియావులపాడి. కావలసినంత ధాన్యపుపంట. ఏవస్తువునకైన నొకరియింటికి వెళ్ళనక్కఱలేకుండ కాలిమీఁద కాలువేసికొని కూర్చున్నవాళ్ళము. ఇవతలచెంబవతలఁ బెట్టి యెఱుఁగనుసుమీ. అలాటి దానిని, మాయశక్తియెక్కడనుండి వచ్చినదో బిందెలకుబిందెలు దింపుచున్నాను. నేఁటికాలమున కింతకర్మమును దెచ్చిపెట్టినావా దైవమా యని పొట్టకోసర మీపనిఁ జేయుచు తగుదునమ్మా యని తిరుగుచున్నాను. ఎంత సుకుమారముగఁ బెరిగినానో యంతకష్టము వచ్చినది.

రామ—నియోగు లిటువంటిపనిఁ జేయవలసిన పక్షమున కష్టముగానేయుండును.

రాజ—కూచిమంచివారు, మాచిరాజువారు, మంత్రిప్రగడవారు మాకు బంధువులే. వారెవరైన కంటఁబడినప్పుడు ప్రాణము చచ్చినట్టుగానుండును. ఇప్పుడయిన నొకడబ్బుసొమ్ము మిగిలించుకొనవలెనని లేదు. వాళ్ళడబ్బు వాళ్ళకుఁ బెట్టి యేలాగునైన మాటదక్కించుకోవలెనని యుద్దేశమే.

ఇల్లువారు మాటాడుకొనునప్పటికి భోజనమునకు మఱికొందఱు వచ్చి చిరకాలముక్రిందటఁ దడిపినపట్టుబట్టలఁ గట్టుకొని యన్నముఁ దినుచుండిరి.

ఒకమనుష్యుఁడు—రాజమ్మగారూ! కొంతయన్నము చల్లగాను, కొంతయన్నము వెచ్చగాను నున్నదేమండీ! పాడియన్న మేమయినఁ గలిసినదాయేమి?

రాజ—ఊరుకోవయ్యా! ఎవరయినను మీమాటకు నవ్వుదురు. అన్నము చల్లారినదేమో.

రెండవ—పప్పులో గంజివాసన వేయుచున్నట్లు గనఁబడు చున్నదేమి?

రాజ—మీకుకొంచెము రొంపపట్టినదేమో. పప్పులో గంజి వాసన యేమిటండీ.

మూఁడవ—ఏమిటండీ! అవతల రాజులకు వడ్డించఁగా మిగిలిన యన్నము మాకువడ్డించినారేమండి అంత బొత్తుగా మాలకూడా! కొంచెము కుడి యెడమ వడటండీ!

రాజ—చాలు లేవయ్యా! నేర్చుకొనిపోయినావు. నీమాటలు నీవు సరే. నీవేయాచారవంతుఁడవా? ఇవతలివాళ్ళే యంత మాలకూడు తినువాళ్ళా! నేనింటనుండి పళ్ళెముదెచ్చి వడ్డన చేయుచున్నందుకా యీలాటిమాటలు.

నాల్గవ—అన్నట్లు, జ్ఞాపకమువచ్చినది. రాజమ్మగారూ! మీము ఱఁదిభార్య ప్రసవమైనదఁట. పురుడు వెళ్ళలేదుగదా! మీరుం మడిగట్టు కొన్నారేమి?

రాజ—అయ్యో! మాకు వారికి తరములు తప్పిపోయినవండీ!

నాల్గవ—మఱిఁదికి మీకు తరములేలాగునవిడిపోవునండీ! జ్ఞాతులు గనుకనా,

రాజ—పురుటిదినములు వెళ్ళిపోయినవి.

నాల్గవ—పదిహేనుతొమ్మిది. శుద్ధ స్నానముగా లేదు. రామ రామ. పురుటికూడుతినినందుకు కేపందఱము స్నానము చేయవలెను.

మీ రెప్పుడు నీలాగే. వెనుక చద్దియన్నముఁ బెట్టుమన్నపుడు మైలబట్ట తోనే పెట్టినారు. ఈయాచార మెక్కడను జూడలేదు.

మొదట — పచ్చడిలో మెతుకులు కనబడుచున్న వేమండీ?

రెండవ — ఇందాఁక నెవరో దగఁబెట్టిన పచ్చడి వేరేతీసి దాఁచు చుండఁగా నేనుచూచినాను. అదిపొరపాటుచేత నీకుఁ బడినదేమో.

మొదట — నారాయణ! నారాయణ! ఎంగిలికూడ నెక్కడ తినఁ గలమమ్మా. ఛీ! నాకీయన్నము వద్దు. (అని యాపోసనముపట్టి లేచి పోయినాఁడు.)

రాజ — (కోపమువచ్చి) వెళ్లవయ్యా! గడియగడియకు కొదిరించి యెంతకాల ముండఁగలవు. పాపము! పొరుగూరి నుండి వచ్చినారు. తల్లిదండ్రు లెవరు దగ్గఱలేరు గదా యని సమస్తసముపాయములు చేసి సొంతయింటికంటె నెక్కువ నాదరణ చేయుచున్నందుకా మీరీలాగున చెవులుపట్టుకొని యాడించుట? పైపైనున్నది మనమాటలు వినుననిమీ రనుకొనుచున్నారు గాఁబోలు. నేనాలాగున మాటలు వినుదాననుకాను. మీయిష్టమయిన నుండుడి, కష్టమయినపక్షమున వెళ్లండి. నావంటివారు లక్షమంది మీకున్నారు. మీవంటివారు లక్షమంది మాకున్నారు. మాలెక్కలు చల్లఁగా నున్నంతసేపు భయములేదు. ఇప్పటికయిన లె క్కఁజూచి యిచ్చి మరి వెళ్లండి. అందాఁక పట్టుపంచె పట్టుకొని వెళ్లవద్దు.

నాల్గవ — సరే! ఉంచుకొండి పట్టుపంచె. నాకు భయములేదు.

రాజ — అవతలవీధి నున్నముండ డబ్బులు పుచ్చుకొని కనుపుఁ గాల్చెడిది. అదే మంచిది. పరమార్థ మాలోచించెడు మావంటి పరు వుగలవాండ్రకు కాలముగాదు. వాండ్రు దగ్గఱ నోరే యెత్తరు. ఆ మాయముండ కేలాగున డబ్బు దక్కునో తెలియదమ్మా?

అని యనఁగానే పట్టుపంచవదలి యతఁడుపోయెను. రామచంద్రుఁడును భోజనానంతరము పాఠశాలకుఁ బోయెను. శిష్టాచారసంపత్తి గల సాంప్రదాయమునందుఁబుట్టిన రామచంద్రుఁడు పూఁటకూటియింట బొట్టుఁ బెట్టుకొనక, కాళ్ళు గడుగుకొనక మడిబట్టలఁ గట్టుకొనక భోజనము చేయువారలను జూచి పట్టణవాసములయందుఁ గల నైచిత్ర్యముల కాశ్చర్యము నొందెను. అంతతో నతని యాశ్చర్యము సమాప్తము నొందక రాజమ్మ చర్యలు, భోజనమునకు వచ్చినవారి సంభాషణలు విన్నపిదప నధికమాయెను. రామచంద్రుఁడాదినము మొదలు విశ్వనాథశాస్త్రిలవారి యింటనే పండుకొనుచు నచటి సహాధ్యాయులతో సుఖముగాఁ గాలముగడుపుచుండెను. ప్రతిదినము మధ్యాహ్నము భోజన మైనతరువాత శాస్త్రిలవారు గేదెకు గడ్డినిమిత్తము పొలమునకుఁ బోయినప్పుడు గురుశుశ్రూషయం దొకరికంటె నొకరు మించవలెనని పనిఁ జేయుచున్న శిష్యులతోఁ గలిసి, శాస్త్రిలవారికి తనచేత పని జేయించుట కష్టము పేసున్నను, తానుగూడ శక్తిలోపము లేక శుశ్రూషఁ జేయుచుండెను. విశ్వనాథశాస్త్రిలవారికి రామచంద్రుని మీఁదఁ గల మంచి యభిప్రాయ మంతకంతకు హెచ్చెను. జనమనోహరము నైన యాకారమును, నాకారమునకుఁ దగిన బుద్ధిసంపదయు, బుద్ధిసంపద కనుగుణ మయిన విద్యాసక్తియు, విద్యాసక్తి కలంకారము పెట్టుచున్న వినయసంపత్తియు, సద్గుణునియందు ద్రోణాచార్యునకు వలెనే రామచంద్రునియందు విశ్వనాథశాస్త్రిలవారికి మంచిప్రేమను గలిగించెను. శాస్త్రిలవారి యింటి యెదుటనే గ్రామమునందెల్ల తగు పెద్దమనుష్యులును సంపన్నగృహస్థులు నయిన్న మంత్రిప్రగడ శరభరాజుగారి యిల్లు గలదు. ఆయన కుమారుఁడు రామచంద్రుని యీడుగలవాఁడు. శాస్త్రిలవారి దగ్గఱ చదువుకొనుచు రామచంద్రుని సత్ప్రవర్తనమునకును, బుద్ధికిని సంతోషించి యతనితో స్నేహముఁజేసి యతఁ

డెక్కడనుండిన తానక్కడ నుండుచు, నీతని కేలోపము తటస్థమయినను సహాయముజేయుటకు తాను సిద్ధముగా నుండి యతని నతిగౌరవము తోఁ జూచుచుండెను. వారిద్దఱును కృష్ణార్జునుల వలె నతిశయస్నేహ ముచేతఁ బ్రసిద్ధికెక్కిరి. సహజముగా మంచిశారీరముగల రామచంద్రు నకు రాగజ్ఞానము నన్నెతేఁగా పుస్తకము నతిశ్రావ్యముగాఁ జదువఁగలు గుటచేత శోభరాజుగా రప్పుడప్పు డతనినిఁ బిలిపించి పుస్తకముఁ జదివిం చుచుండురు. పుష్పసౌరభ్యమువలెనే వ్యాపించిన రామచంద్రుని కీర్తి వలన నతనియందు మంచియభిప్రాయముగల శోభరాజుగారి మనస్సు నకు, విశ్వనాథశాస్త్రులవారును, కుమారుఁడును జేయు న్యాయమైన స్తుతులు చక్కఁగా నాటి పిల్లవానియం దొకవిధమైన యనురాగ మును గలిగించెను. ఇది యిట్లుండఁగా రామచంద్రుఁడు పూఁటకూటి యింటఁ బ్రవేశించి రెండుమాసము లయినది. ఒకపర్యాయము రాజమ్మ లెక్కకు తొందరపెట్టఁగా శోభనాచలము రెండురూపాయల నిచ్చెను. కాని తరువాత నొక దమ్మిడీ నయిన నియ్యలేదు. తరువాత రామ చంద్రుఁడు తన సహాధ్యాయునియొద్ద రెండురూపాయలు బదులుచేసి రాజమ్మ కిచ్చెను. ఇట్లు రాజమ్మ కొకమాసపు సొమ్ము మాత్రము ముట్టినది గాని రెండవమాసపు సొమ్ము ముట్టనందున నామె రామ చంద్రుని నిలువ నీయక బాధపెట్ట నారంభించెను. శోభనాచలమే సొమ్ము నిత్తునని మొదట నొప్పుకొని, తరువాత నీయవలసిన యవ సరము లేదనియు, రామచంద్రుఁడే యడుగు మనియు, రాజమ్మకు రహ స్యముగా వర్తమానము నంపెను. శోభనాచలము తన స్నేహితునకు పదునైదు రూపాయలు బదులిప్పించి, తానిరువది రూపాయలు బదులు పుచ్చుకొని స్నేహితునిచేత సొమ్మిప్పించను లేదు తానీయను లేదు. ధనము పుచ్చుకొన్నప్పుడున్న చొరవయు, ధైర్యమును మరల సొమ్ము నిచ్చునప్పు డాతనియందుఁ గానఁబడవయ్యెను. తనస్నేహితుఁ డీయవలసిన

ఋణమునకుఁ దా నుత్తరవాదిని గాననియు, తనసొమ్ము తా[illegible]గల ననియుఁ జెప్పి, శోభనాచలము, రామచంద్రుఁడు తనయింటికి [illegible] పొడిమ న్నగునట్లు తిరిగినను నొక డబ్బయిన నీయక వచ్చినపుడెల్ల సాయంకాలము రమ్మని యొకమాఱును, నుదయమున రమ్మని యొక మాఱును సొమ్ముందలేదని యింకొకమాఱును మనసులో నేమీ యనుకొన వద్దని యొకమాఱును తనకు చాలమొగమోటముగా నున్నదని మఱియొక మాఱును చెప్పినమాటఁ జెప్పక వానిని దిప్పుచుండెను. రామచంద్రుఁ డేవేళప్పుడు సొమ్మిచ్చెనో కాని శోభనాచలమునకు సొమ్మెన్నఁడు నందనే లేదు. అవసర మెక్కువై తనయింటి కతఁడు వచ్చినకొలఁది శోభనా చలమునకు సొమ్మీయవలె నను నభిప్రాయము తగ్గి పలుమాఱతఁడు వచ్చినందులకు విసుగు హెచ్చెను. రామచంద్రుఁ డింటికి వెళ్ళినపుడు శోభనాచల మగుపడక, యింటనుండక, నొకవేళ నింటనుండిన లేదని పించుచు, వీధిలో నెదురైనప్పుడు ప్రక్క సందులోనికైనను, దగ్గఱ యింటికైనను, బోవుచు, నట్లు జేయవీలుగానపుడు ముసుఁగు వేసికొని స్నేహితులమధ్య దాగుచు మొగమున కేదయిన నడ్డము పెట్టుకొనుచు, కాలము గడుపుచు వచ్చెను. అతిస్వల్పకాలసంపాదిత మైన వారి స్నేహము, క్రమక్రమముగా, మొగమోటమై, లజ్జయై, మనస్పర్థయై, నిష్ఠురమై యాగ్రహమై తుదకు రానురాను కలహముగాఁ బరిణమించెను. తుదకు రాజమ్మయొక్క బాధ పడఁజాలక యొకనాఁ డుదయాస్తమయములు వాకిటఁగూర్చుండి వెంకటరత్నముతోఁ గూడ వచ్చుచున్న శోభనాచలమును బట్టుకొని రామచంద్రుఁడు విధిలేక యీప్రకారముగా మాటాడ నారంభించెను.

రామ—అయ్యా! శోభనాచలముగారు! ఎంతకాలము తమ యింటిచుట్టు నేను తిరిగినను నామీఁద ననుగ్రహ మింకను రాలేదు గదా? రాజమ్మగారు నన్ను నిలువనిచ్చుట లేదు. తేపోమాపో యింట

నుండి చిన్నామె వెడలఁగొట్టును. నామనవి చిత్తగించి లెక్క దయ చేయుదురూ. తమ రుచితముగనిచ్చినట్లు సంతోషించెదను. పుచ్చుకొన్న సొమ్ముగాని మఱొకటి కాదుగదా.

శోభ—(ఆగ్రహముతో, కన్నులెఱ్ఱజేసి) నీకేమయిన కొంచెము బుద్ధి యున్నదా లేదా? పెద్దపిన్న లున్నారను సందేహ మేమియు నక్కఱలేదా? అందఱు నీవలె తుచ్ఛులే యనుకొన్నావా? నీవు బ్రతికిన బ్రతుకు కొద్ది నీపరువుకొద్ది యడిగినావు. నీసంప్రదాయ మెఱుఁగం టిది? నీసంగతి నేనాదినముననే గ్రహించినాను.

రామ—అయ్యా! తమకంతకోప మెందుకు? నేనేమన్నాను! నావల్ల తప్పున్న క్షమింపుఁడు.

శోభ—మేము నిన్ను క్షమించదగ్గవారమా! నీవే నన్ను క్షమించవలెను. చచ్చి చెడి యేలాగో రెండుగుల్లలు తెగనమ్ముకొని నీవుకాఁగా సొమ్ము సంపాదించినావు. నీదగ్గఱ బదులుపుచ్చుకొనుట నాదే బుద్ధితక్కువ. నీవీస్వల్పమునకు మొగము చిందుకొనుచున్నావు గానియీలాటివి లక్షలు సంపాదించినాము. లక్షలు వ్యయము చేసినాము. నావంటివాని కిది యొకలెక్క కాదు.

రామ—అందుచేతనే త్వరగా దయచేయించండి, నేరమంతయు నాదే.

శోభ—ఇయ్యక మానుదుమా యేమిటి? ఇచ్చినదాఁక చచ్చి నట్లుండు. అప్పుదనుకురాదు. నీసొమ్మెంతచేయును? నీవెంతచేయుదువు? నీసైజము కనఁబఱచుకొన్నావు. నీసొమ్ము వారమునాటికి గిరగిరఁద్రిప్పి పాఱవేసెదను. నీకంటె నిర్భాగ్యుఁడుగాని నీసొమ్ము నపహరించఁడు. నీకు గతిలేదు గాని మాకు తేకపోలేదు. ఉపకారమునకుఁ బోఁగా నప కార మెదురయినదఁట! వచ్చిననాఁడు మాయింట నుంచుకొని బంధు వుఁడుగదా యని సమస్తవిధముల నాదరించినందుకా యీమాటలు

నాటి నియోగపువాఁడవని నీకింత నిర్వాహము చేయవలెనని యనుకొన్నాను. అయ్యా! వెంకటరత్నముగారు! ఆరాత్రి దొంగలుపడినప్పుడు తాను కుఱ్ఱవాఁడు భయపడునని దగ్గఱగా మీఁద చెయ్యివేసికొని పండుకొన్నాను. ఆవిశ్వాసమయిన లేదు. ఈకాలములో నెవరికి నుపకారము జేయఁగూడదండి, నాయనా! రేపు నిసొమ్ము నీకుఁ బంపెదను. ఇప్పటికి వెళ్ళు.

వెంక—ఇంత మంచివారు, మీతోనే పడినదికాదు. ఇంక నీ గ్రామమునం దెవరితో సరిపడును? బాగానే సార్లాపడఁగలఁడు. సరసముగానే యున్నది.

రామ—మీచిత్తము. ఇఁక నేనడుగను. ఆమాట మీరే దక్కించుకోవలెను.

శోభ—అమలాపురము నీళ్ళాడలఁబట్టినవి. పెంకెతనము ముదిరినది. మాట దక్కించుకోవలెనుగాదూ? ఇది జ్ఞాపక ముంచుకో.

రామ—మీరాచంద్రార్కము నాకుజ్ఞాపక ముండునట్లు చక్కని పనిఁ జేసినారు.

అనిమెల్లఁగా ననుకొని మాటలతోఁ దెమల్చి తన్ను శిక్షింపక దయఁదలఁచి పోనిచ్చినందులకు మనసులో సంతోషించుచు దేవున కనేక వందనములఁ జేయుచు పూఁటకూటిదానికేమి ప్రత్యుత్తరము చెప్పుదునాయని యాలోచించుకొనుచు రామచంద్రుఁడు వచ్చెను. రాఁగానే రాజమ్మ వానిని జూచి యిట్లనియె.

రాజ—లెక్క తెచ్చినావయ్యా?

రామ—శోభనాచలముగారు—

రాజ—(మాటకడ్డమువచ్చి) శోభనాచలములేదు గీభనాచలము లేదు. నాయింటఁ దిన్నవాఁడవు నీవా శోభనాచలమా? నాకతనితో నేమి? ఒడ లెఱుఁగవు. ఎవరియబ్బసొమ్మని తిన్నావు. డబ్బులిచ్చి పో

కుండ నీకు మూఁడుపూఁటలు వండి కుంభముతో నుంచుట కెవరు నీకిచ్చి యున్నారు. పోపో. నాయింటనుండి లేచిపో. చెంబు, పట్టుపంచె, నేనియ్యను అనును.

అంతకఠినముగా రాజమ్మ మాటలాడినప్పుడిఁక నచట నుండ రాదని చివాలున లేచి రామచంద్రుఁడు వెళ్ళుచుండెను. అంతట నాతని మార్గమధ్యమందు వెనుక తనకు రెండురూపాయల నప్పిచ్చిన సహాధ్యాయుఁ డగుపడి రామచంద్రుని నిలువఁబెట్టి తనసొమ్ము తన కిమ్మని యడిగెను. వారిట్లు మాట్లాడిరి.

సహా—ఏమోయి! అప్పు పుచ్చుకొని తిరిగి యిచ్చినావు కావు? ఒకనాఁడా, రెన్నాళ్ళా? అంత గతిలేనివాఁడ వెందుకుపుచ్చుకొన్నావు. పోనీ యెగవేయి. దీనితో నీవు పెద్దకాఁపురముచేయవు నేను చెడిపోను. మర్యాదగాను. నేనేలాటియవసరములో నీకిచ్చితినో నీవు నాకాలాగు రెండవకంటివాఁ డెఱుఁగకుండ నీయవద్దా? జేపు నివీయకపోతివా నీకు నాకు బాగుగా జరుగదు. అని చెప్పి వెళ్ళిపోయెను.

అతని యదృష్ట మేమో కాని రామచంద్రునకు బాకీ లిచ్చిన వారును నతనియొద్దబదులు పుచ్చుకొన్నవారును గూడ నతనిని సందించుచుండిరి. శోభనాచలము సొమ్మిచ్చుననునాశ వానికి లవమును లేదు. గ్రామమందు తన్నెవరు నెఱుఁగరు. రాజమ్మ లేవఁగొట్టినది. మద్దుల కనకరత్న మియ్యవలసిన యామూఁపాయ కూడ తానీయనక్కఱలేదని చెప్పెను. అందుచేత మహావిచారముగలిగి నిర్విణ్ణుఁడై సాయంకాలము వఱకు భోజనము లేనందున కడుపులో మలమల మాడుచుండఁగాఁ బ్రదోషకాలమున నెప్పటియట్లాలయమునకుఁ బోయి దేవదర్శనముఁ జేసి యచ్చట మంటపము మీఁద నుత్తరీయముఁ బఱచుకొని గ్రుడ్లనీళ్ళు గ్రుక్కుకొనుచు, తల్లిదండ్రులు చనిపోవుటయు, పినతండ్రి యన్యాయముగ సొత్తునపహరించుటయు, దారిద్ర్యకష్టమును, పరీక్షలమున [illegible],

తలఁచితలఁచి విచారించుచు వెల్లకిలఁబండుకొనెను. రామచంద్రుని సంగతి యంతయు నెవరివలననో విని శరభరాజుగారి కుమారుఁడు గోపాలము గ్రామమంతయు వెదకి దేవాలయమునకు వచ్చి మంటపముమీఁద నున్న రామచంద్రుని గనుఁగొని, మొగమోటముచేత నతఁ డేమియుఁ జెప్పకున్నను, భోజనము చేయనట్లు గ్రహించి "రామచంద్రుఁడా! మా బాబయ్యగారు నిన్నొక్కసారి రమ్మన్నారు" అని చెప్పి తీసికొని వెళ్లెను.

## నాల్గవ ప్రకరణము.

అమలాపురమునందు గల యిండ్లన్నిటిలో మంత్రిప్రగడ శరభరాజుగారి యిల్లే పెద్దది. రెండు వీధియరుగులకు గచ్చు చేయఁబడియున్నది. ఇటికలతోఁ గట్టిన స్తంభములు రెండరుగుల మీఁదను గలవు. రాతిమెట్లతో నిండిన గుమ్మముదాఁటి లోపలికి పోఁగా నెడమచేతి వైపున పెద్దకచేరిచావడి యడుగువేసిన జారునట్లున్నయి తెల్లనిపాల గచ్చుతో నిండియుండును. చావడికి రెండుప్రక్కల రెండుగదులుండును. అందులో నొకగదిలో శరభరాజుగారి జ్యేష్ఠకుమారుఁడైన రాజగోపాలము చదువుకొనుచుండును. చావడి కెదురుగా నున్న వాకిట వేసవికాలము గనుక నొక కొబ్బరియాకుల పందిరి కలదు. చావడిమీఁద కూర్చుండుటకు వెనుకపేముచాపయు దానిమీఁద తివాసులును గలవు. గోడదగ్గఱ మూఁడుమూళ్ల పొడుగుఁ నొకపెద్దదిండు, జేరగిలఁబడుటకు వేయఁబడియున్నది. ఇనుపజాలకట్లుగల యొకగవాక్షము దిండుపై నుండుటయేకాక చావడిలోనుండి దొడ్డిలోనికిఁ బోవుటకు కిటికీకి రెండుప్రక్కల రెండుగుమ్మములును, వానికి జెక్కతలుపులును గలవు. వీధిగుమ్మమునకు నెదురుగా లోగిటియొక్క లోపలిభాగమున్నది. అందు [illegible]

యును, దాని కిరుపక్కలను రెండుగదులును, వానికిఁ జేరి పడమటి యిల్లునునున్నవి. దొడ్డిలో నొకయుప్పునీళ్ళనుయ్యి త్రవ్వఁబడియున్నది. నూతికిఁ గొంచెము పక్కగా తులసికోట వేయఁబడి యున్నది. ఇంటికి దక్షిణభాగ మందు పశువులసాల యొకటికలదు. ఈయింటి యందు శరభరాజుగారు తండ్రితాతలనాఁట నుండియు కాఁపుర మున్నవారు. శరభరాజుగారి కిప్పటికి నలువది సంవత్సరము లుండును. మొలకు బంగారపు గోవత్రాడును, చేతుల నగిషీ చెక్కిన గుల్ల మురుగులును వ్రేళ్ళకు బటువులును, శరభరాజుగా రెప్పుడును దీయక ధరించుచుందురు. ఆయన పచ్చనైన కొంచెము స్థూలశరీరము, బట్టతల యుఁ గలిగియుందురు. శరభరాజుగారికి తొలిచూలు మగపిల్లవాఁడు పుట్టుటచేత సంతోషించి రాజగోపాలమని తమతండ్రిగారిపేరు పెట్టు కొనిరి. రాజగోపాలము తరువాత తొమ్మిదిసంవత్సరములవఱకు శరభ రాజుగారికి బిడ్డలు లేరుగాని పిమ్మట నొకకుమార్తె గలుగ నేడవపురిటి నాఁటికి నాలుఁగుమాసముల క్రిందట చనిపోయిన శరభరాజుగారి చెల్లెలు స్వప్నములోఁ గృష్ణవేణమ్మకు కనఁబడి పేరు పెట్టుమనినందున, సీకోమా ర్తెకు పార్వతియను పేరుపెట్టిరి. ఆమె వెనుక మరల నొకకుమారుఁడు గలిగెను. అతనిపేరు నరసింహము. కృష్ణవేణమ్మ శరభరాజుగారి భార్య. శరీరమున ధరించిన యాభరణంబుల కాంతిని వెలవెలఁ బాఱఁజేయు చాయయు, నాకర్ణాంతములైన నేత్రములును, దానిమ్మగింజలవంటి పండ్లును, సన్నని నడుమును గలిగి కృష్ణవేణమ్మ, లావణ్యమందేకాక సత్ప్రవర్తనమందును స్త్రీలలో శిరోభూషణమై మగనిమాట జవ దాఁటక సత్కార్యములయం దాయనకుఁ దగినప్రోత్సాహము నిచ్చుచు ననుకూలదాంపత్యమునకు నిదర్శనము వీరేయని జనులుస్తోత్రము చేయు నట్లు మహాకీర్తిని గాంచెను. శరభరాజగారికి సంవత్సరమునకు గొబ్బి తోఁటలమీఁదను, భూములమీఁదను, మూఁడువేలరూపాయలు వచ్చు

ను. గ్రామమునం దాయన తగుపెద్దమనుష్యు లగుటచే వివాదములు గల వార్రందఱు శరభరాజుగారి యెదుటకు వచ్చి తగవులు పరిష్కరించు కొందురు. వెంకటరత్నము శరభరాజుగారి కొకవేలువిడిచిన పినతండ్రి కొమరు. బాంధవ్యమునందేకాక గుణములయందుఁగూడ వెంకటరత్నము శరభరాజుగారికి దూరమేకనుక నతనితనయింటనుంచుకొనుటకు నిష్టము లేకపోయినను తల్లిప్రోద్బలముచేత నతఁ డింటనుండుట కాయన సమ్మతించెను. చిన్నతనమునందే తలిదండ్రు లార్జించిన సొక్కమంతయు విచ్చలవిడిగా వ్యయముచేసి యన్నవస్త్రములకు లోపమురాఁగానే వెంకటరత్నము వీరియింటఁ బ్రవేశించెను. వివాహము కాకపోయినను, నతనికి సంసారికంటె నెక్కువ తాపత్రయములు గల్గియుండెను. ధనము వచ్చుబడి లేకపోయినను, ద్రవ్యముతో నావశ్యక మెక్కువగ నుండెను. రామచంద్రుఁ డమలాపురము వచ్చిన నాఁటిరాత్రి వెంకటరత్నము చెలువుగట్టునఁ బ్రవేశించిన యిల్లు వాని భోగస్త్రీయైన చంద్రముఖి యిల్లే. లావణ్యమునం దామెకుఁ జంద్రునితో సమానమైనకాంతి లేశమును లేదు సరికదా చంద్రునివలె గుండ్రని ముఖముగల్గి చంద్రముఖనామము సార్థకముజేసికొనునేమో యనుకొన్నను మొగము కొంచెమించుమించుగా మూరెడుపొడుగుండును. కొమార్తెకు సార్థకనామము లేకపోయినను తన చిన్నతనమునుండియు నింటికివచ్చిన యనేకసరసుల ప్రాణముల హరించి హరించి యప్పటికి జవసత్త్వము లుడిగియున్నదాని తల్లికి నరహరి యనునామము సార్థకమై యుండెను. చంద్రముఖికి చప్పిదవడ లుండుటచేత తమలపాకు లావశ్యక మెక్కువగ నుండెను. అట్లు రామచంద్రుఁడు రాజగోపాలముతో రాఁగానే శరభరాజుగా రతనిని తమయింట నుండుమని బలవంతపెట్టిరి. నియోగపు కుటుంబమునందుఁ బుట్టిన రామచంద్రునకు పరగృహనివాసము చేయుట యభిమానమని తోఁచినను కాలము తప్పివచ్చినందున శరభరాజుగారి యింట నుండి

రాజగోపాలముతోఁ గలిసి, చదువుకొనుచుండెను. వచ్చినప్పటినుండియు రామచంద్రునకును వెంకటరత్నమునకును గొంచెము సరిపడకుండెను. శోభనాచలమునకు స్నేహితుఁ డగుటచేత వెంకటరత్నమునకు రామచంద్రునిమీఁద కొంచెము కోపముండుట సహజమే. అది యటుండఁగా వెంకటరత్నము నిలువుబొట్టువాఁడగుటచేత రామచంద్రుఁ డాబొట్టు పెట్టుకొననందుకు నాతనిమీఁద కోపము వచ్చెను. తరువాత కొన్ని దినములకు శరభరాజుగారొకనాఁడు రామచంద్రునితో నేదో రహస్యమును జెప్పిరి. ఆరహస్యము తనకుఁ జెప్పుమని వెంకటరత్నము రామచంద్రు నెంత బలవంతపెట్టినను, నతఁడు చెప్పనందున వానిపై కోపము ద్విగుణ మయ్యెను. అందుచేత వెంకటరత్నము రామచంద్రుఁ డొంటరిగా తనకంటఁబడినప్పుడెల్ల పొట్టకూటికిఁ జేరినవాఁడనియు, సర్వజ్ఞత్వము పొందనియు, నిఁక యిటువంటి యెత్తిపొడుపుమాటల ననుటయే కాక రామచంద్రుని గుఱించి తానెవరితోఁ బ్రసంగించినను తనశక్తి వంచన లేకుండ నతఁడు మంచివాఁడు కాఁడని వారి మనస్సులయందు నాఁటునట్లుగాఁ జెప్పుచు వచ్చెను. శరభరాజుగారును, కృష్ణవేణమ్మయు రామచంద్రుని తనకుమారునితో సమానముగాఁ జూచుకొనుచున్నను వెంకటరత్నము తనయెడల చూపుచున్న యసహ్యతవలన రామచంద్రునకు మనస్స్థిమితము లేకపోయెను గాని సద్గుణసంపన్నుఁ డగుటచే రామచంద్రుఁడు శరభరాజుగారితో నైనను, లేక తనప్రాణసమానముగాఁ జూచుకొనుచున్న రాజగోపాలముతో నైనను, నీసంగతిఁ జెప్పఁడయ్యె. రామచంద్రునకు తనయిల్లు వెడలినతర్వాత పూర్వము తనకిష్టములేని వస్తువు లెల్ల నిప్పు డిష్టమయ్యెను. అతఁ డమలాపురమున జదువుకొనుచున్న కొలంది విశ్వనాథశాస్త్రులవారికి వాత్సల్యమును, సహాధ్యాయులకు గౌరవమును, శరభరాజుగారికి ప్రేమయు, రాజగోపాలమునకు మైత్రియు, గ్రామస్థులకు మంచియభిప్రాయమును గలుగఁ

జొచ్చెను గాని వెంకటరత్నమునకు మాత్రము ప్రేమాదులు వచ్చి యసహ్యత హెచ్చనారంభించెను. ఇప్పటికి రామచంద్రుఁడు శరభరాజు గారియింటికి వచ్చి పదిమాసము లయ్యెను. అమలాపురమునందు గొబ్బరివేళ్ళనీళ్లు పడక దేహమునందు రామచంద్రునకుఁ గొంచె మప్పు డప్పు డజీర్ణముగాను ననారోగ్యముగా నుండుచు వచ్చెను. ఆసంవత్సర మునందు జ్యేష్ఠమాసమున నతనికి తీవ్రమైన జ్వరమువచ్చినది. జ్వరము తగులఁగానే శరభరాజుగారు తమదగ్గఱనున్న శీతాంశురసము మాత్రల నిచ్చిరి. విశ్వనాథశాస్త్రులవారు కొంచెము జలముమాత్రము మంత్రించి త్రాఁగుమని యిచ్చిరి. అంతటిలోనే యెక్కడనుండియో రెండుపొట్ల ములఁ దెచ్చి రాజగోపాలము తేనెతోఁగలిపి దగ్గఱనుండి మ్రింగించెను. కాని వెంటనే గుణము కనఁబడనందున సాయంకాల మతఁడు కషా యము నిప్పించెను. శరభరాజుగారి తల్లి యొకపూఁట కంటిలో [illegible] ముల కలికము వేసెను. ఎన్నిచేసినను రోగ మెక్కువేకాని తక్కువ కానందున శరభరాజుగారు తమయింటివైద్యుఁడు గ్రామమందు లేఁడని తెలిసికొని, పూర్వమున వృత్తియేదియు దొరకక వైద్య మారంభించి యనేకజనుల కకాలమరణపూర్వకముగ స్వర్గలోకసుఖముఁ గలుగఁజేసి ప్రాణము విసిగి వైద్యము చాలించి సంచి మూలఁ బడవైచిన యొక ముసలివైద్యుని బిలిపించి కుఱ్ఱవానిని జూపి చేయి చూచుమని చెప్పిరి. అంతట వైద్యుఁ డిట్లు పలికెను.

వైద్యు—చేయి చూడనక్కఱలేదు. లంకణములఁ గట్టుఁడి. ఎన్ని లంకణములు కట్టిన నంత మంచిది.

రామ—అయ్యా! చిన్నతనమున నుండియు నాకు లంకణములు పడవు. అన్నము తినవలయును.

వైద్యు—ఎందుకు పడవు? కమ్మనిరోగములు తియ్యనిమందులు

సరిపడఁగలవా ? ఉండలేకపోతే జాడ్యములొంగునా ? కన్నులుమూసి కొని పరుండు.

శర—అయ్యా! ఎన్నిలంకణములు పడవచ్చును.

వైద్యు—ఇది పురాణజ్వరము. శరీరమున జీర్ణించెను. పది లంకణములమీఁదిమాట.

రామ—అయ్యయో ! నేనుండలేనండి. శరభరాజుగారు ! నా తత్త్వమున కది సరిపడదు.

శర—పథ్యము త్వరగానే పెట్టింతునులే నాయనా. (అని వైద్యునితో) అయ్యా! ఏమిమందు వేయఁదలఁచుకొన్నారు ? ఆనందభైరవి వేయవచ్చునా?

వైద్యు—ఆనందభైరవి యేమిపని చేయఁగలదు ? ఇది భడవా జాతి జ్వరము. రాకడ వేఱుగానున్నది.

శర—ఏదోయొకటి వేయించండి.

అని చెప్పగానే వైద్యుఁ డొకమాత్రనిచ్చి వెళ్ళిపోయెను. జ్వరముకొద్దిదైనను నది యెక్కువజ్వరమనిచెప్పియెక్కువధనము గ్రహించవలెనని దురుద్దేశము గలిగి రోగమెక్కువగుటకు వైద్యుఁడు మందిచ్చెను. తరువాత తాను లొంగఁదీయవలె ననుకొన్నను, రోగము త్వరగా లొంగలేదు. ఉష్ణముని శ్లేష్మముగా తగ్గినను లంకణము లింకను గట్టించి వైద్యుఁడు పథ్యము పెట్టించుట మానిపించెను. ఆమహానీరసముచేత నొకనాఁ డర్ధరాత్రి రామచంద్రునకు నిస్త్రాణ వచ్చి మాటరాక కాలుసేతులు చల్లఁబడెను. ఆసంగతి నెఱుఁగక యాగుణములు మతొకవిధముగా భావించి వెంకటరత్నము శరభరాజుగారి చెవిలో మెల్లఁగా "రామచంద్రునిపని బొత్తుగా నపస్మారముగానున్నది. మనకు దక్కఁడని తోచుచున్నది" యని చెప్పెను. ఆమాట వినఁగానే శరభరాజుగారు దదిరిపడి లేచిరి. ఇంట నందఱు తొట్రుపాటుతో లేచిరి.

వెంకటరత్నము చాకలివానిచేత వీధిలోగోడదగ్గఱ రెండువెదుళ్ళుపాతించి రెండువెదుళ్ళడ్డమువేయించి నాలుగుచాపలడ్డము గట్టించెను. శరభరాజు గారి తల్లిచప్పచప్పన రెండుచేదల నీళ్ళు మీఁదఁ బోసికొని తడిగుడ్డతో నటకమీఁదికెక్కి యూరుగాయకుండల దింపుచుండెను. శరభరాజుగారు వైద్యునికొఱకు వర్తమానము నంపిరి; కాని జరుగుచున్న సంగతి యంతయు విని వైద్యుఁడు తన యౌషధప్రభావము తానెఱుఁగును గనుక మరణమే కాని మఱొకటి జరుగదని నిశ్చయించుకొని రాక, తుదకు వర్తమానము లెక్కువకాఁగా శరభరాజుగారికిఁ గోపమువచ్చునని యచటికివచ్చి చూచి "చేతిలో చాల జబ్బుగానున్నది. ఇది విషమజాతి. నెగ్గదని నేను మొదటనే యనుకొన్నాను. మందు లియ్యఁగలము గాని యాయుర్దాయము పోయఁగలమా" యనిచెప్పి యొకచోట గుమిగాఁ గూడికొనియున్న రాజగోపాల శరభరాజ వెంకటరత్నము గారుల దగ్గఱఁ గూర్చుండెను. అప్పుడు శరభరాజుగారి తల్లి యన్న పూర్ణమ్మ వచ్చి యిట్లనియెను.

అన్న—ఏలాగున్నదిరా? నాయనా!

వెంక—ఏమిచెప్పను ఘడియలమీఁద నున్నది. ఇప్పుడో యింకనో.

అన్న—ఆ మంచము తీసి వీధిలోఁ బారవేయండిరా? ఇంకా యింట్లోయెందుకు?

శర—తొందర యేమిటమ్మా? ఇంక కొంచెముసేపుండు.

అన్న—కొంచెముసేపేమిటి? ప్రాణము గుటగుటలాడుచున్నది.

శర—నాకా పిల్లవానిఁజూడఁ గనుపులో జాలిగానున్నది. అవతలఁ బెట్టించలేను.

అన్న—సామానంతా తగులఁబడిపోతుంది. ఎక్కడో దిక్కుమాలిన ముండాకొడుకు కోసరము నిక్షేపమువంటి యిల్లు పాడువడ

వెయ్యాడాని కాలోచిస్తావేమి చెప్పినమాట వినరు. ఏగంగలో దిగేదమ్మా? మాయసంతవచ్చింది. ఈనిర్భాగ్యపు చచ్చినాడు మాయింటికి కోసరమే దాపరించినాఁడు. [లెందుకు?

రాజ—తిట్టకమ్మా. యేమియులేదు, ముందుగా చావుమాట

అన్న—చావక యీవెధవ బ్రతుకుతాఁడు? మీరుకూడా వాడితో కట్టగట్టుకొని గంగలో దిగండి. ఒక్కయేము పేడిచి నోరు మూసికొని యూరకొంటాము.

వెంక—అన్నయ్యా! వాడతిప్రాది నక్షత్రి మఁట. ఇల్లారు మాసములం వదలిపెట్టవలెను. పశువులసాలలో నైనఁ బెట్టించండి. పోవునప్పు డెక్కడయిన నొక్కటే.

వైద్యు—ఆయుర్దాఁయు మున్నపక్షమున చంపినను చావఁడు. వెనుక నాకొక పర్యాయ మీలాగే ప్రాణముమీఁదికి వచ్చినపుడు మావారందఱు నన్నుక్రిందఁబడవేసికొని కూర్చున్నారు. అంతటనాప్రాణము పోయినది. నలుగురు యమదూతలు నల్లలాగులు తొడుగుకొని రోకళ్ళతో వచ్చి నన్ను దీసికొని మాలకాకివలె నల్లని దేహము గలిగి యొక సింహాసనముమీఁదఁ గూర్చున్న యొకరాజున కెదుట నిలువఁ బెట్టిరి. అతఁడు యమధర్మరాజు. నరకములోఁబడి యేడ్చువారి కేకలను విన్నాను. అప్పుడు యముఁడు నన్నుఁజూచి దూతలతో "ఓరీ మూర్ఖులారా! మీకొకనిఁ దీసికొనిరమ్మని పంపినవీనిని దీసికొనివచ్చినారేమి" యని చెప్పినన్ను క్రిందికిఁ బడఁద్రోసెను. అప్పుడు మావాండ్రు నా శరీరమును దీసికొని వెళ్ళుటకు సిద్ధముగా నుండఁగా నేబ్రతికినాను. ఏ[illegible]లాగున నీతఁడును బ్రతికిన బ్రతుకవచ్చును.

[illegible]—ఏ[illegible]వింతలండీ! ఎవరయిన నమ్మవద్దా?

వెంక—ఆశ్చర్య మేమున్నది? ఈపిల్లవాఁడు బ్రతుకఁడండీ. రాత్రినాకలలో యమదూతలు మట్టిలాగులు తొడుగుకొని దుడ్డుకఱ్ఱలతో

వచ్చి గుమ్మములో నిలుచుండి యెవరినో రమ్మని పిలుచుచున్నారు. దూతదర్శనమైన నింక బ్రతుకుట యబద్ధము. నేననేకపర్యాయములు చూచినాను.

అని చెప్పినంతలోన విశ్వనాథశాస్త్రిలవారీ కలవలపాటంతయు విని లేచి రామచంద్రునకు తటస్థమయిన యాపదకు విచారించి శరభరాజుగారితో నిట్లనిచెప్పెను.

విశ్వ—అయ్యా! రామచంద్రుఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు. ఆతని కీలాగునకాలము తప్పివచ్చినది. ఇన్నాళ్ళనుండియు మీరే తండ్రివలె సంరక్షణఁ జేయుచున్నారు. అతఁడు పిల్లవాఁడయినను యోగ్యుఁడు. అవతల పెట్టించుట భావ్యముగాదు.

వెంక—ఏమిటయ్యా! అంత జాలిగానున్న పక్షమున మీయింటఁ బెట్టుకొండి. శ్రీరంగనీతు లెన్నియైనను జెప్పవచ్చును. మాయిల్లు కాకపోయినసరి.

అని పలుకుచున్న సమయమునందు శరభరాజుగారితల్లి వచ్చి వెంకటరత్నమును బిలిచి యుతఁడును తానును, తోడుపట్టి రామచంద్రుని మంచముఁ బశువులపాకలోఁ బెట్టిరి. మిక్కిలి పరిశుద్ధమయిన వాయువు గల శుభ్రమయిన చోట నుండవలసినరోగిని దీసికొనిపోయి, చుట్టును రొచ్చును దోమలు మొదలగుకీటకముల ధ్వనులును, కడుపులోఁ బ్రేగులు తెగునట్లు వమనము కలుగఁజేయు పేడకంపుగల యాపాకలోఁ బెట్టుచుండఁగా శరభరాజుగారు చూచియు స్త్రీలమాట కడ్డముచెప్పలేక, స్నేహితునికొఱకు విచారించుచున్న రాజగోపాలము నూరడించుచు విశ్వనాథశాస్త్రిలవారితో మాటలాడుచుండిరి. తరువాత కృష్ణవేణమ్మ రామచంద్రునియొద్దకుఁబోయి యాతనిస్థితినిజూచివిచారిఛి యాతనిసంగతిని బట్టి యవి నిస్త్రాణలక్షణములుగాని మరణచిహ్నములుగావని గ్రహించి, కొంచెము చిల్లుమకునీళ్ళు పోసినచో నదికుదురునని తనయభి

ప్రాయమును శరభరాజుగారితోఁ జెప్పెను. ఆయన దాని కిష్టపడఁగా తరువాత చిట్టుముకునీళ్లుగిద్దెడు రామచంద్రున కామె లోపలపోసెను. అవి త్రాగిన నాలుగుగడియలకు రామచంద్రుఁడు కొంచెము తెల్విఁదెచ్చుకొని యొత్తుగిలి పండుకొనెను. తక్కిన రాత్రియంతయు రామచంద్రుని యొద్ద రాజగోపాలము పరుండవలెననుకొని యది తండ్రితోఁ జెప్పుచుండఁగా విని ముసలమ్మ యిట్లని చెప్పెను.

అన్న—ఓరీ! కుఱ్ఱవాఁడా! నీవక్కడ పడుకోకు. అనకజడుసు కొన్న పక్షమున దేవుళ్ళాడలేము. నీవు సావిట్లోపరుండు.

రాజ—అక్కడ పరున్నమాత్రముననే జడిసికొందునా? అంత భయము లేదు.

అన్న—చెప్పినమాట వినవేమిరా? వాఁడెవరు? నీవెవరవు? నీ యమ్మవంకచుట్టమా? అబ్బవంకచుట్టమా.

రాజ—నీవు వెయ్యిచెప్పినా నేను వినను. నేనిక్కడనే పడు [కొనియెదను.

అని రాజగోపాలము చెప్పినమాటలకు మనసులోసణుగుకొనుచు నామె వెళ్లెను. ఆమిగిలిన రాత్రియంతయు వెంకటరత్నమును రాజగోపాలమును రామచంద్రునియొద్ద పశువులపాకలోఁ బరుండిరి; కాని దుర్వాసనచేత కొంతసేపటికి రాజగోపాల మావలకు వెళ్ళెను. అదివఱకు రామచంద్రుఁడు జబ్బుపడకమునుపు రాజగోపాలముయొక్క యుంగరమును తనవ్రేలను బెట్టుకొనెను. అది తీయకముందే రోగపీడితుఁడగుటచే నా యుంగర మతనిచేతనే యుండెను. రామచంద్రుఁడు కొంచెము కను మూసి నీరసముచేఁ బరున్నవుడు పంగనామములఁ బెట్టుకొన్న యొక బ్రాహ్మణుఁడా యుంగరమును మెలమెల్లగా లాగుచుండెను. రామచంద్రుఁ డులికిపడిలేచి నీరసముచేత మాటలు తిన్నగారానందున నక్షరములు స్పష్టముగాఁ దెలియకున్నను, హీనస్వరముతో నొక కేకవేసెను. పంచ ప్రాణములను స్నేహితునిమీఁదనె పెట్టుకొనియున్న గోపాలమా మాటలు

విని పరుగెత్తుకొనివచ్చి యేమని రామచంద్రు నడుగఁగా నతఁ డేదో గోపాలముయొక్క చెవిలోఁ జెప్పెను. ఆమాటనాలకించి గోపాలము మహా కోపముతో "ఏమయ్యా! వెంకటరత్నము! అతనిచేతియుంగరము నీవెందుకు లాగినావు?" అనియడిగెను. వెంకటరత్నము మిక్కిలి కోపముతో నిట్లని చెప్పెను.

వెంక—ఏమిటయ్యా! జబ్బుచేత సంధించి చావునకు సిద్ధముగా నున్నవానిమాటలునమ్మి నన్నీలాగున నడుగదగినమాట యనరానిమాట తెలియకుండ నిందించెదవా? అతఁడు చెప్పను నీవు నమ్మనూనా? బాగున్నది యెంతమాట!

రాజ—పంగనామములు పెట్టుకొన్న మనుష్యుఁడు లాగినాడఁట. నీవుగాక యింకెవరు.

వెంక—ఆ! ఈమాట బాగున్నది. కనులుమూసికొని మత్తుగా నతఁడు పరున్నపుడేమో యతనికి వెంకటేశ్వరులు వచ్చి ప్రత్యక్షమై యుంగరములాగినట్లు భ్రమకలిగినది. వెంకటేశ్వరులు నిలువుబొట్టు దైవమే కదా. ఈతని కేదో మొక్కున్నది, త్వరగా నాయుంగరము మీఁదుకట్టు. ఇది వెంకటాచలపతి మాహాత్మ్యమే?

రాజగోపాల మామాటల నమ్మి, వెంకటరత్నమునందు నిందారోపణ చేసినందులకు నొచ్చుకొనుచు, రాత్రి యంతయుఁ గడపెను గాని, యాపని చేసినవాఁడు మనవెంకటరత్నమే తప్ప మఱొకరు కారు. గోపాల ముంగరమును మీఁదుకట్టి జోతిష్కులు వచ్చినపుడెల్ల రామచంద్రుని నక్షత్రమును జెప్పి యతని కాదినముల యందు మరణ మున్నదేమో యని యడుగుచు, నిది నీచ మిది ఘనమని యెంచక సమస్త విధములైన యుపచారములఁగూడఁ జేయుచుండెను. అహాహా? స్నేహమెట్టిదో యోచింపుఁడు. ఇది జరిగిన నాలుగుదినములకు రామచంద్రుని పినతండ్రి జగన్నాథ మమలాపురమున కేదో పనిమీఁద వచ్చి వెంకట

రత్నముతో మాటలాడుచు, తనయన్నకుమారుఁడు శరభరాజుగారి యింట నున్నాఁడనియు, ప్రాణముమీఁదికి వచ్చిన దనియు విని యిట్లనియెను. "వెంకటరత్నముగారూ? వాఁడుమాయన్నకొడుకని చెప్పు కొనుటకు సిగ్గుగానున్నది. నియోగులయింటఁ బుట్టి సాటివారి యింట పొట్టకూటికుండి మాకవమానము దెచ్చినాఁడు. వీఁడు పుట్టకపోయి నను బ్రతికి పోదుము." అనిచెప్పి వెళ్ళిపోవుచుండఁగా వెంకటరత్న మతఁడుకూడ రామచంద్రుని ప్రవర్తనాదులలోఁదనయభిప్రాయముతో నేకీభవించినందులకు సంతసించుచు "మీపిల్లవానికి జబ్బుగా నున్నది. చూచిపొండి" యని చెప్పెను. జగన్నాథముగా రామాటవిని "వాని కేమి భయములేదు. వాఁడు మనవంటివారి నెందఱినో కడతేర్చికాని పోఁడు." అనిచెప్పి పశువులసాలలోనికిఁబోయి రామచంద్రుని యెదుట నిలిచెను. అతనిని జూడఁగానే రామచంద్రుఁడు కన్నులనుండి గిఱ్ఱున నీళ్ళు తిరుగ మాటరాక, ప్రక్కమీఁద పినతండ్రిని గూర్చుండుమని సంజ్ఞచేసి యతఁడు కూర్చున్న పిమ్మట నాతని మెడమీఁద చేతులు వేసికొని కౌఁగిలించుకొని యిట్లనియెను.

రామ—బాబూ ! వచ్చినావా ? నిన్ను చూడఁగనే మాబా బయ్యను మాయమ్మను జూచినట్లు పంచప్రాణములు లేచి వచ్చినవి. నాకు రోగము కుదిరినదాఁక నాలుగుదినములు నీవిక్కడనుండుము. నిన్ను చూడఁగనే నారోగము సగము కుదిరినది." అని చెప్పిన రామచంద్రుని మాట లతని రాతిగుండెను భేదింపలేకున్నను సమీపమున నన్ను వారందఱికి జాలిని బుట్టించెను. అంతట జగన్నాథమిట్లు చెప్పెను.

జగ—"నాకుండుటకు తీరుబడిలేదు. ఇంకొకమాఱు వచ్చి యుండెదను. నీకు వారే తల్లి, తండ్రి నేను పోవుచున్నాను" అని చెప్పి వెళ్ళిపోయెను. రోగము కొంచెము తిరుగుమొగమునకు రాఁగానే శరభరాజుగారు రామచంద్రుని మంచమును లోపలఁ బెట్టించిరి. రామ

చంద్రునకు క్రమక్రమముగా నన్నియు హితమై, నల్లరక్తముపట్టి బలముచేర నారంభించెను. అతఁడు పూర్ణదార్ఢ్యవంతుఁ డగునప్పటికి రెండుమాసము లయ్యెను. ఆరోగ్యస్నానము జేసిన తరువాత రామ చంద్రుఁడు యథాప్రకారముగాఁ బాఠశాలకుఁ బోయి చదువుకొన నారంభించెను. ఇప్పటికి లక్ష్మీసహస్రమును, నైషధమును ముగించి యలంకారశాస్త్రముఁ జదువఁ దలంచి కువలయానంద మారంభించెను. కావ్యముల యందేకాక వేదమునందుగూడ పరిశ్రమఁ జేయఁ దలంచి విశ్వనాథశాస్త్రులవారు చతుర్వేదవేత్తలు గనుక రామచంద్రుఁ డాయన దగ్గఱ నమకచమకము లారంభించెను. ఈసంగతి వెంకటరత్నమునకుఁ దెలిసి యొకనాఁడు ప్రసంగవశమున నతఁ డిప్రకారముగా మాటలాడ నారంభించెను. [చున్నావా యేమి?

వెంక—ఏమోయి! నీవు కూడ నమక చమకములు చెప్పుకొను

రామ—ఆ. మొన్న విదియనాఁ డారంభము జేసినాను.

వెంక—సరిసరి! బాగుగాఁ జేసినావు. కొంచెము పెద్దవాండ్ర మున్నాముగదా! మాతో నాలోచనఁ జేయఁ గూడదా? మన కేమిటి వేద మేమిటి? అదిబ్రాహ్మణులకుఁజెల్లినది. మన నియోగులకుఁదగదు.

రామ—నియోగులుమాత్రము బ్రాహ్మణులుగారా? మనము వేదములు చదువుకొనఁ గూడదని యెక్కడ నున్నది? అందఱము బ్రాహ్మణులమే.

వెంక—నీకు తెలియను దెలియదు. ఒకరు చెప్పిన వినను వినవు. పాత్తరలుపట్టి సంభావనకువెళ్ళువారు బ్రాహ్మణులు. మనముకరణాలము. బ్రాహ్మణుల మగుదుమా? కుఱ్ఱవాఁడవు. నీవిట్టువంటి తెలివితక్కువ మాట లాడఁబోకు. మనవాండ్రు విన్న తప్పు పట్టుకొందురు.

రామ—నియోగులకు వైదికులకు వేదోక్తకర్మ సమానమే ఆచారభేదములేకాని శాస్త్రభేద [illegible]న్నది.

వెంక—మీసములఁ బెంచుకొని లౌక్యవ్యవహారములుచేయుచు వ్రాఁతకోఁతలు చేతనైనవారునియోగులు. మనకేమి మహరాజులము మనయిండ్లలో పురోహితులుగా నుండి ప్రాతస్స్నానము జేసి బిచ్చ గోచులను బెట్టుకొనవలసిన వారును నిత్యకర్మలు చేయవలసిన వారును బ్రాహ్మణులు. వారి మంత్రములు మనము నేర్చుకొనఁ గూడదు. ఇంతేకాక నియోగులకు స్వరము రాదు. అపస్వరము నెత్తి నడచును.

రామ—వైదికులనియూ బ్రాహ్మణుల కర్మము. వేదమును జదువుకొన్న మాత్రముచేత మన నియోగమునకు భంగములేదు. మీసము లెవ్వరును బెంచఁ గూడదు. మనము పెంచవచ్చునని ధర్మ శాస్త్రములో లేదు.

వెంక—నీదగ్గఱ నేనీసంగతిఁ జెప్పిన పక్షమున నీవు నమ్మవు. నీకు మనవాళ్ళ సంప్రదాయములు తెలియవు. మఱియెవరినైన నడుగు. తద్దినపుమంత్రము చదువుకోవలె నని దిక్కుమాలినబుద్ధి పుట్టిన దేమి? ఇంక దేవతార్చన మంత్రములుకూడ నేర్చుకో. మనచేతిక్రిందబ్రతుకు వైదికులకును, మనకును, సాపత్యమా? నీయిష్టము వింటె విను లేక పోయిన మాను. నీక్షేమముకొఱకే చెప్పినాను.

అని బ్రాహ్మణులకర్మము వేదాదివిద్యాభ్యాసము జేయువారని యు, నియోగులను బ్రాహ్మణు లనఁగూడ దనియు, మూర్ఖమైన యభి ప్రాయముతో నున్న వెంకటరత్నముయొక్క మనమునకు వాదమూల మున యదార్థముఁ దెలుపవలె నని రామచంద్రుఁడు ప్రయత్నము చేసి నాఁడుగాని, బుద్ధిహీనులలో చక్రవర్తియగు వెంకటరత్నకు ముందర ని నిలని వాదము పనికిరాకపోయెను. ఇప్పటికిని ననేకనియోగులు తమ నెవ్వరైన బ్రాహ్మణు లన్నప్పుడు, కరణము లనినందులకు కోప

నిందాస్పదమనియెంచి, వానితోఁ గయ్యమునకు డీకొందురు. అంతేకాక యాచారసంపత్తిలేని నియోగులవిషయమై మాటలాడుచు, వైదికులు "వారికేమి నియోగప్రభువులు? ఈమంత్రములు వారికెందుకు" అని చెప్పుచుందురు. సాహిత్యమునకుఁ దోడు సంగీతమును, దానికిఁ దోడు వేదమును నాతఁడు నేర్చుకొనుచుండెను. ఇట్లుండఁ గొన్నాళ్లకు శరభరాజుగారి రెండవకుమారుఁడగు నరసింహమునకు నక్షరాభ్యాసముఁ జేసి చదువవేసిరి. ఆదినమున గ్రామమునం దందఱిని భోజనమునకుఁ బిలిచిరి. ఆదినమున వెంకటరత్నముగారి సొంతమేళమే యక్కడ గానవినోదమును జరిగించినది కనుక నాయనయానందము మితము నెఱుఁగదు. అక్షరాభ్యాసమైన వెనుక నాగ్రామమందున్న తెనుఁగుబడి కతనినిబంపి యలవాటయినదాఁక పిల్లవానితోఁగూడ రామచంద్రుని వెళ్ళుమని శరభరాజుగారు పంపుచువచ్చిరి. ఆగ్రామమునం దిదితప్ప వేరుపాఠశాలలు లేవు. రమారమి డెబ్బదిసంవత్సరములు వయసుగల యాబడిపంతులు పూర్వము పెద్దాపురము సత్రమునందు పద్దులు వ్రాయుటకుఁ గుదిరి, యక్కడ దొంగలెక్కలు వ్రాసినందులకుఁ దఱుముఁబడి, పిమ్మట ముక్తేశ్వర గ్రామమునందొకరియింట దేవతార్చన బ్రాహ్మణుఁడుగాఁ బ్రవేశించి, యక్కడ నొక ముండనుంచుకొన్నందులకై వారు పొమ్మనఁగా పిమ్మట పలివెలగ్రామమును వెళ్ళియక్కడ పరులకుపకారము జేయుటకు వైద్యమునారంభించెను. ఆయూరిప్రజలట్టి మహానుభావుండు వైద్యము చేయుచుండఁగా నది వినియోగపఱచుకొనఁజాలక యెవరు నతనియొద్ద మందుఁబుచ్చుకొననందున వారందఱిమీఁద కోపమువచ్చి చెప్పకుండ నాగ్రామమువదలి యమలాపురమువచ్చి వృత్తులన్నిఁటిలో సౌఖ్యకర మయినది యుపాధ్యాయత్వమేయని బాలురను బాగుచేయుట కతఁడు బడియొక్కటిఁ బెట్టెను. అమలాపురమం దాబడి కరణముగారి వీధియరుగుల మీఁద నుంచఁబడెను. బడి స్థాపింపఁబడి నపుడందుఁ జేరిన

వారు మఱిసంవత్సరమునకుఁ గూడ నాపుస్తకమే చదువుచుండిరి. చదువుచెప్పెడు దినములు తక్కువయుఁ సెలవుదినము లెక్కువయుగ నుండెను. పిల్లలాటవిడుపుడబ్బు లెన్నిపర్యాయములు తెత్తురో యన్ని సెలవలుండును గనుక, సెలవుల నిర్ణయము డబ్బులనుబట్టిగాని పంచాంగులనుబట్టిగాదు. రామచంద్రుఁడొకనాఁడు నరసింహమును దీసికొని బడికిఁబోయెను. ఆపాఠశాల యమలోకమును, చదువవచ్చిన బాలురు నరక మనుభవింపవచ్చిన పాపకర్ములును పంతులొక యమధర్మరాజును గానుండెను. రామచంద్రుఁడు నరసింహమును దీసికొనివెళ్ళి కూర్చుండఁగానే కొందఱు బాలురు వీఁపులమీఁద చదరలువేసికొని, కఱ్ఱపలకలను, జొన్నకలములను, తాటియాకుపుస్తకములను, గంటములను బట్టుకొని కొందఱు గోణములను గట్టుకొనియు, కొందఱులాగులఁదొడుగుకొనియు, కొందఱు మీఁద రుమాళ్లువేసికొనియు బడికివచ్చి చదరులక్రింద పఱచుకొని కూర్చుండిరి. పదెనిమిది చింతబరికెలను రెండుప్రక్కలఁ బెట్టుకొని యొకనున్నని బొబ్బిలిపాముకాయ నెడమచేత నుంచుకొని, వార్ధకదశచేత రక్తమాంసహీనమగు తనశరీర మెముకలపోగువలె చూచిన వారికి భయము గలుగఁజేయుచుండ కేకనేదైనవిన్నపు డులికిపడి లేచుచు పంతులొక స్తంభమునకుఁ జేరగిలఁబడి యొక చిరుగుగోనెగుడ్డమీఁద కూర్చుండి, కునికిపాట్లుఁబడుచుండెను. కొందఱునేలమీఁదద్రవ్విన గుంట ఓనమాలను దిద్దుచుండిరి. పంతులు బాలరామాయణమం దొకశ్లోకమును జెప్పఁగా నది బాలురకు నోటఁబట్టనందున మహాకోపమువచ్చి అతఁడు శ్లోకములోనున్న యక్షరమున కొకదెబ్బచొప్పున కొట్టి పిల్లల వీఁపుమీఁద చింతాకంత యెడమైనను లేకుండ దెబ్బలతోనింపి, దానితోతృప్తిఁబొందక కొందఱిని గోడకుర్చీలు వేయించి, మఱికొందఱాటవిడుపు డబ్బులు తేనందునకు ముట్టికాయలతోను, చెంపకాయలతోను తొడపాశములతోను, వారిని చేతనైనంత శిక్షచేసి, చెయ్యి నొప్పిపెట్టిన

తరువాత నెండలో నిలువఁబెట్టి, కొంతసేపు కొందఱిని నూఱుగుంజీలు దీయించి విసిగి యూరకుండెను. ఇంతలో నొక పెద్దధ్వని వారందఱకు వినఁబడెను. అప్పుడు నలుగురుపిల్లలొకపిల్లవానిని కాళ్ళుచేతులను చేతులిద్దఱు బట్టి తీసికొని వచ్చుచుండిరి. ఆబాలుఁడు కాళ్ళుతన్నుచు, చేతులకందినవానిని రక్కుచు, నోటికి దొరికినవానిని గఱచుచు, మధ్యమధ్య "అమ్మో! నాయనో! చచ్చినానురో వదులురా" యని మొఱఁబెట్టి యేడ్చుచు దండనములు పెట్టుచు చూచినవారికందఱకును మహావిస్మయమును గలిగించుచుండెను. అతఁడు గడికిగానందున పంతులవారు పంపినపిల్లలతనిని మోసికొనివచ్చుచుండిరి. గ్రామదేవతగుడికిఁ దీసికొనిపోఁబడు మేకపిల్లవలెనే యాబాలుఁడు యమకింకరులనంటి యానలుగురుపిల్లలచేత పంతులవారియెదుట నిలువఁబెట్టఁబడగా నతఁడు కోదండము దీయించుమని యాజ్ఞాపించెను. వెంటనే యానలువురును నిదివఱకేయొక దూలమునకు వేయఁబడిన జనపనారత్రాడుదగ్గఱ కతనిని దీసికొనిపోయి, నరహత్యఁజేసినవారిని నురిస్తంభము నెక్కించునట్లు త్రాడును బట్టుకొనునట్లుచేసి, క్రిందగంటములఁబాతిపెట్టి తాటియాకుల మంటవేసి కాళ్ళు క్రిందఁ బెట్టకుండఁజేసిరి. ఆలోపుగా పంతులవారు బెత్తమును పుచ్చుకొని చేయవలసిన పనినంతను జేసి, నరసింహావతారమువలె శాంతినొందక బడిలోనున్న బాలురనందఱిని, పక్షపాతములేకుండ బాదఁగొట్టెను. అందులోనొకపిల్లవాఁడు "అయ్యా! నేనల్లరి జేయకుండఁ గూర్చున్నాను. నన్నెందుకుఁ గొట్టినారండి" యని యడుగఁగా పంతులు "వెధవా! ఆవల నీవుఱ్ఱూతలు) మల్లరిచేయనా? అప్పుడు నీకోసర మింకొకపర్యాయము పని చెరుపుకొని యెవరురాఁగలరు? అందుకని పనిలోపని యిప్పుడే కొట్టినాను" అని మాటలఁగొట్టెను. ఈచిత్రవిధ జరుగుటచే బాలురందఱు శోకమూరింటిమీఁదపెఱకు లేగిరిపోవునట్లు గొల్లునగోలెత్తిరి. వైద్యుల దొంగతనము మొదలయిన క్రూరకృత్యములను జేయు మహాద్రో

హులను గూడ చెరసాలకంపక యీబడికిఁబంపిన, నేరములనువారెన్నఁ డును జేయరు. ఈబడికివచ్చిన తరువాత నేపిల్లవాఁడును పుస్తకము పట్టి యెఱుఁగఁడు గనుక పంతులవారి కావిధమైన పంచెలచాపెన్నఁడును జన్మమధ్యమున దొరకనేలేదు. ఈవిధముగానున్న యాపాఠశాలనైఖరి యంతయుఁజూచి రామచంద్రుఁ డాశ్చర్యము నొందెను. నరసింహముసు నోటివెంట మాటలేక నిశ్చేష్టుఁడయ్యెను. కోదండ మొక్కనయాపిల్లవాఁ డును, కొంతసేపటికి దేహము తెలియుటకు క్రిందఁబడఁగా చెప్పిన పంతులు చల్లనినీరుదెచ్చి మొగముపఁగొట్టి, చెప్పులుమూసి, మంచితీర్థము దాహ మిచ్చి చావఁగొట్టి చెప్పులనూసినను సామెతను సార్థకముచేసెను. తలి దండ్రుల కీసంగతి తెలియసేయవద్దని పంతులవారనేకానేకమంతయును మాని బాలుని బ్రతిమలాడనారంభించిరి. ఆపిల్లవానిని శిక్షించుచున్న ప్పటి కోపముకంటె పదిరెట్లెక్కువగా నున్న యామునలిబ్రాహ్మణుని తొందర చూచితీరవలెను. చెప్పనలవిగాదు. పంతులుగారికి పొగాకును, పండ్లును, మజ్జిగదాహమును దెచ్చిపెట్టు బాలుండెట్టు దెబ్బలుతక్కువ దినుచు నాయన దయకు పాత్రులగుదురు. రామచంద్రుఁ డింటికి వెళ్ళినతరువాత మన నరసింహము నీపాఠశాలకంపుటవలన నుపయో గము లేదని చెప్పెనుగాని శరభరాజుగారామాటను వినిపించుకొన లేదు. ఈదారుణమైన శిక్షలఁ జూచి నరసింహము బడికి వెళ్ళవలసి నప్పుడు కడుపునొప్పి వచ్చినదని చెప్పి బడిమానుచు, నాలాగునఁ జేయుటకువిలు లే నప్పుడు చదివియున్నమతిని బడికిపోదునని చెప్పి యెక్కడికో పోయి, యీ సంగతి తెలిసిన పక్షమున తమవారు కోపింతురని యింటికిరాక, యున్న వస్త్రములులేక యెండలపాలై తిరుగుచు, తల్లిదండ్రులు వెదకునప్పు డెవ్వరిలోనో తోఁటలోనో కనఁబడుచు, తనప్రాణమునకుఁగూడ భయ ముగల్గునేమో యని తలిదండ్రులకుఁ దోఁచునట్లు నడచుచుండెను. ఒకా నొక దినమున రామచంద్రుఁడు పంతులవారినిట్లు ప్రశంసించెను.

రామ—అయ్యా! పంతులుగారూ! మీరీలాగున కొట్టిన పక్షమున పిల్లలురారండి. పిల్లలుమీఁద నింతకంటె కొంచెము దయగా నుండవలెను.

పంతు—నాకంటె పిల్లలమీఁద నింకాదయగా నెవ్వరుండఁగల రయ్యా? నేనెప్పుడైన కొంచెము బెత్తముతో బెదరించి యొకముక్క చెప్పుతానుగాని గట్టిగాకొట్టను. అయినను "దండం దశగుణం భవేత్" అని శాస్త్రమున్నది. ఎంతకొట్టితే యంతమంచిది. దెబ్బ దేవేంద్రలోకము.

రామ—అంతచేతఁగొట్టఁగూడదు. చక్కఁగాబోధించి పాఠములు చెప్పవలయును.

పంతు—ఏమిబోధించ నండి? ఱాతిబండముండాకొడుకులు. ఎన్నిపర్యాయములు చెప్పినా ముక్కరాదు. మాచిన్నతనములో మేము చదువుకొన్న సంగతులు మాకథలు విన్నపక్షమున మీ రేమందురో. పంతులపేరు చెప్పిన గడగడవణఁకి లోపలికిపారిపోయేవారము. నేనుకొట్టే దెబ్బలొకదెబ్బలా?

రామ—మానరసింహ మేమయిని చదువుచున్నాఁడా?

పంతు—నరసింహునికేమి? మహారాజు. అతనికి చదువెందుకు పిల్లవాఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు. అటవిడుపుడబ్బు లెప్పటి వప్పుడిచ్చివేయును. ఎన్నఁడు నాలస్యముచేయఁడు.

రామ—అతనికి నాలుగునెలల క్రిందట నక్షరాభ్యాసమయినది కదా? ఇప్పటికి ఓనమాలయినా రాలేదేమి?

పంతు—తొందరేమిటి చదువు రాకపోతే మిగిలిపోయిన దేమిటి? అన్నమునకు లోపమా? వస్త్రమునకు లోపమా? ఎవ్వఁడోకూడు గుడ్డలేని దౌర్భాగ్యునకు గాని హాయిగా జరుగువానికి చదువెందుకు?

రామ—చదువు వందలకొలది గావలయును. విద్యలేనివాఁ డెంత ద్రవ్యవంతుఁడైనను గౌరవింపఁబడఁడు. విద్యవంటి దొకటిలేదు.

విద్యావిహీనులగు మూర్ఖులు విద్యాభ్యాసమువలని మహోపయోగము తెలియక భాగ్యవంతులు చదువుకొన నక్కఱలేదనియు, నుద్యోగములఁ జేయఁదలఁచినవారే చదువుకొనవలె ననియుఁ జెప్పుచుందురు! ఆబడికిఁ బోవుటవలన నరసింహాయున కభివృద్ధి కనఁబడ నందున రామచంద్రుఁ డింటియొద్దఁ గూడ తగుశాస్త్రీయ పాఠములను జెప్పుచుండెను.

ఏడవ ప్రకరణము.

ఈప్రకారముగ రామచంద్రుఁడు శరభరాజుగారి జ్యేష్ఠకుమారునకు సహాధ్యాయుఁడై రెండవకుమారునకు గురువై యందఱకును తలలో నాలుకవలె మెలఁగుచుండెను. శరభరాజుగారి కుమార్తెయగు పార్వతి కప్పటికి తొమ్మిది సంవత్సరములు దాఁటి పదియవ యేఁడు ప్రవేశించెను. వివాహము చేయవలయు నని శరభరాజుగారు సంబంధముల నిమిత్తము వెదకుచుండిరి కాని తగిన సంబంధము దొరకదయ్యెను. అదివఱకు వచ్చిన సంబంధములలో పిల్లవానికి భూస్వాస్థ్యము ద్రవ్యసంపత్తియుఁ గలిగియున్నయెడల విద్యాగంధము లేదు. విద్యగలవానికి ద్రవ్యము లేదు. శరభరాజుగారి తల్లికి విద్య లేకపోయినను ద్రవ్యవంతున కీయవలెనని యున్నది. కృష్ణవేణమ్మకు విద్యాధనసంపత్తులు రెండును గలవాఁడే కావలెనని యున్నది. శరభరాజుగారి యాలోచనయు రాజగోపాలముయొక్క యాలోచనయు నీవిధముగా లేదు. ద్రవ్యవంతుఁడుగాకున్నను విద్యయు సౌందర్యమును గలవాని కీయవలెనని

వారి కభిప్రాయమున్నట్లు వారప్పుడప్పుడు మాటలాడుచున్న మాటలనుబట్టి కృష్ణవేణమ్మ తెలిసికొనెను. రాజగోపాలము పార్వతి కింటి నప్పు చదువుచెప్పుచుండుటచేత నానాఁటికి బాలిక చదువను వ్రాయను నేర్చి శుక్లపక్షచంద్రునివలె వృద్ధిఁబొందుచున్నందున విద్యావిశారదుఁ డగువానికిచ్చి పెండ్లిచేయుట యావశ్యక మయ్యెను. ఇట్లుండ రామచంద్రుఁ డొకనాఁడు రాజగోపాలముతోఁ గూడ సాయంకాలమున దేవాలయమునుండి యింటికివచ్చుచుండఁగా నొకబ్రాహ్మణుఁడు కనఁబడి రామచంద్రునిఁజూచి "నాయనా రామచంద్రుఁడవు నీవేనా?" యని యడిగెను.

రామ—అవును నేనే. ఏమండి! మీ రేయూరు?

బ్రాహ్మ—మాది రాజవోలు. మీరింకా యిక్కడనే యున్నారా?

రామ—(భయముతో) అలాగనుచున్నా రేమి? రాజవోలులో మామామయ్య పిల్లలు బాగున్నారా?

బ్రాహ్మ—ఏంకా నీకు తెలియదూ? మీ మేనమామగారు మొన్నరాత్రి తెల్లవారుజామున పరలోకాంతరగతు లయినారు. ఆ దుఃఖము పట్టఁజాలక మీ మేనత్తకూడా నూతిలో దిగినదికాని వెంటనే దగ్గఱనున్నవారు దిగి యామెను దీసినారు. ఆకస్మిక మరణమగుట చేత నెక్కడ నేమేమి యాస్తియున్నదో చెప్పలేదు. మరిడిజాడ్యము వచ్చి పోయెను.

రాజ—అయ్యో! మేనమామగారే; మొన్న మధ్యాహ్నము రాజవోలునుండి వచ్చినరాజు మీమామను జూచి వచ్చినానని చెప్ప లేదటోయి రామచంద్రుఁడు!

బ్రాహ్మ—రాత్రి పాముకఱచి చచ్చిపోయినాఁడు. అప్పట్టు మఱచిపోయినాను మరిడిజాడ్యము వచ్చినదంటో.

రామచంద్రుఁ డామాట వినఁగానే నేలచదికిలఁబడి మాటరాక చెప్పరాని దుఃఖముతో వాపోవుచుండెను.

రాజ—మీ పేరేమండి? మీకాంచీపురము రాజగోపాలే లేనా?

బ్రాహ్మ—నా పేరు కిట్టా రామయ్య. ఇందులో మీకనుమాన మెందుకు? మా రాజగోపాలే కాంచీపురము. నేను దివాస్తమైన దాకా దగ్గఱనుండి వచ్చినాను. నేను ముక్తేశ్వరం మీఁదాఁటి వెళ్ళవలెను. అని చెప్పి వెంటనే వెళ్ళిపోయెను.

నడుమట్టకైన సత్వములేకయున్న రామచంద్రుని చేయిపట్టుకొని మధ్యమధ్య నూరడించుచు రాజగోపాల మింటికిఁ దీసికొనిపోయి తల్లిదండ్రుల కావార్త నెఱిఁగించెను. వారందఱుఁ గూడి రామచంద్రుని స్థితికి విచారించిరి. రామచంద్రుఁడు చాపమీఁదఁ గోరగిలఁ బండుకొని కంటికి నేలకు నేకధారగా నేడ్చుచు మధ్యమధ్య మేనమామగుణములను రాజగోపాలమునకును శరభరాజుగారికిని ప్రకారముగాఁ జెప్పుచువచ్చెను. అయ్యా! నాచిన్నతనమునందే మాతండ్రిచనిపోయెను. ఆయన పోయిన తరువాత మా పినతండ్రి నాయాపదాస్తి తన స్వాధీనము చేసికొని యింటికి తాళమువేసి మాతల్లిని నన్ను లేవఁగొట్టెను. అప్పటినుండియు మా మేనమామ తనకుమారునివలెనే నన్నాదరించుచు నాతల్లిని నన్ను పోషించెను. ఆయన నేనడిగిన దెల్లనిచ్చి మాతండ్రి పోయినలోపము లేకుండఁ జేసెను. మాతల్లి యింతలో చనిపోయినది. మంచివాఁ డగుటచే మామామకు ఋణముకూడ వచ్చినందున నాయనకు భారము కలుగఁజేయఁగూడదని నేను వచ్చినాను. నాకర్మ మెప్పుడు నీలాగుననే యున్నది. తల్లిని దండ్రిని చిన్నతనమునందే దిగమ్రింగి నందుకు నాక్షేమము కోరు బంధువుఁడు మా మేనమామ యొక్కఁడే యనుకొన్నాను. ఆనాఁటికి నాకుఁగూడ ఋణము నేఁటితోఁ దీరిపోయినది. అని చెప్పి యేడ్చుచుండఁగా శరభరాజుగారు రామచంద్రునితో "నాయనా!

నీవిప్పుడు రాజోలు వెళ్ళవలెనా? అలాగైన పక్షమున రేపుదయమున మనుష్యుని సహాయమిచ్చి పంపుతాను వెళ్ళవచ్చును.” అని చెప్పఁగానే రామచంద్రుఁడు వెళ్లుట కిష్టపడెను. ఇంతలో వెంకటరత్నము వచ్చి సంగతి యంతయు విని మైలవాఁడవు చావడిలోఁ గూరుచున్నా వేమని యతనిని గేలిచేసి యావలఁ గూర్చుండఁ బెట్టెను. అప్పుడు శరభరాజుగారితల్లి వచ్చి మైలవార్త వినఁగానే స్నానముజేయవలెను గనుక రెండుబిందెల చల్లనినీళ్ళు తెచ్చి దుఃఖభారముచేత శరీరమెఱుఁగక యున్న రామచంద్రుని మీఁదఁబోసి స్నానము చేయించెను. భోజనము చేయుమని యింటనున్న వారందఱు బలవంతపెట్టినందున పఙ్క్తిఁజేరనొల్లక వాకిట విస్తర వేయించుకొని కొంచె మెంగిలిపడి, యతఁడు లేచిపోయెను.

తెల్లవారినదాఁక కంటిమీఁద నొక్కమాఱయిన కునుకు లేక విలపించుచు రామచంద్రుఁడు కోఁడికూయఁగానే రాజగోపాలమును లేపి తనకు మనుష్యుఁ డక్కఱలేదనియు తాను మార్గమంతయు నెఱుఁగుదు ననియుఁ జెప్పి యతనియొద్ద కొంచెము లెక్కపుచ్చుకొని దొడ్డవరముపోయి మధ్యాహ్న మక్కడ భోజనము చేసి కొంచెము చల్లఁబడిన తరువాత గోదావరినిదాఁటుటకు వెళ్లెను. అప్పుడు గోదావరి జ్యేష్ఠమాసమగుటచే విస్తారభాగ మెండిపోయి తాను ధవళేశ్వరము దగ్గఱ నీప్రకారముగనే పాయ లయితినని తెలియఁ జేయుటకో యనునట్లు చిన్న చిన్న చీలిక లయ్యెను. కాలము మాఱిపోయి నప్పుడు గొప్పవారికి నైన తిప్పలు గలుగుట సత్యమని తెలుపుటకుఁ గాఁబోలు నడుమ నిసుకతిప్పలుగలవు. ఆపాయ లన్నిఁటి యందును చివరపాయ మిక్కిలి వెడల్పుఁ గలదై యున్నదికాని తక్కినవన్నియు పేరునకు మాత్రము నీరుగల్గి మనుష్యులు చులకనగా నడచి పోవుటకు పాటి రేవులు పడియుండెను. మెత్తని మనస్సు గలవారి నేమన్నను నీప్రకారముగనే నాటునని తెలియ

జేయుటకో యనునట్లు మినుగులు వేయఁగానే దించుకొనిపోవుచున్న యిసుక తిప్పల నుండి మూటలు తలమీఁదఁ బెట్టుకొని పాటిరేవుల దాఁటి చివర పాయ దాఁటవలెనని రేవుపడవ నెక్కుట కనేకమార్గస్థులు పోవుచుండిరి. వారితోఁ గూడ రామచంద్రుఁడు పోవుచు పూర్వకాలమునందు వఱదలు వచ్చి యిద్దరద్దరులకు నీరు దాసినపుడు తేరచాపకైనఁజాలని గాలకులు గూడ నేఁడు సునాయాసముగ దాఁటుచున్న యీ మహానదియొక్క శుష్కస్థితినిజూచి తనతండ్రిగారు సజీవులగునప్పుడు తన్నతిగౌరవముతో నాదరించినవారును, తనతో మాటలాడుట కవసరమైనవారును నేఁడు తన్నవమాన పఱచుచున్నందున తన హీనావస్థాజ్ఞాపకము వచ్చి కొంచెము విచారించి యూరకుండెను. ఆ వచ్చిన జనులలో ముక్తేశ్వరగ్రామ వాస్తవ్యుఁడగు నొక బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు లక్షాధికారియని చుట్టుపక్కల నున్న యూరను లందఱు చెప్పిరి కాని యతఁడు కట్టుకొన్న జేపరాపంచెను, మీఁదనున్న మాసినచిఱుగుల యుత్తరీయము చేతిలో నున్న పెద్దమూటనుజూచి రామచంద్రుఁడు, లక్షాధికారి నుండఁదగిన యీమహాలక్ష్మియొక్క సంపదల కాశ్చర్యపడెను. మూటఁ దెచ్చిపెట్టుట యొక్క చాకలివానికైన నతఁడు దయ్యకొన లేదు. వారందఱు నిరీక్షించుచుండఁగా నింతలో పడవ యద్దరినుండి రాఁగా పడవవాండ్రిది వఱకచ్చట గుట్టవేయఁబడి యున్న చింతపండు కట్టములను పడవ పడి చెక్కవఱకును మునుఁగునట్లు వేసిరి. పడవప్రయాణము కాఁగానే తెఱచాపఁ ద్రొక్కి పడవవాండ్రు దానిని నడుపఁ జొచ్చిరి. పడవ నడచినకొలఁది దానితోఁ గదలి నడిచి వచ్చుచున్నట్లున్న గట్టుమీఁది వృక్షములను లంకలో మేసి గోదావరి యందు నీరు ద్రాగుచున్న పసులును లంకల యందు కాఁపులు పెట్టిన పుచ్చ, దోస, గుమ్మడి మొదలగు పచ్చని పాదులును, "అత్యుగ్రభయః పతన హేతుః" అనునీతిని తెలియఁజేయుటకో యన మొదట నుత్తుంగముగా లేచి తుదకు పడిపోవుచున్న కెరటములును

నదిమీఁదనుండి వచ్చుచున్న మలయ మారుతము రామచంద్రుని దుఃఖమును గొంత పోఁగొట్టెను. తప్పతాగి స్మారకము తెలియకుండ నున్న యాముగ్గురు పడవవాండ్రిలో నొకఁడు కూర్చుండి కునుకుపాట్లు పడుచు మక్కానిఁ బెట్టుచుండెను. తక్కిన యిద్దఱును పడవలో మర్యాద గలస్త్రీలు కూర్చున్నను, సందేహము లేక నోట నుచ్చరింపరాని బండ బూతులు గల కీర్తనలను బాడుచుండిరి. కొంతదూరము పడవ నడవఁ గానే సరంగు డబ్బులను పుచ్చుకొనుటకు వచ్చెను. పాప మొకకాఁపువాని దగ్గఱ మొకటి నాలుగుడబ్బులను పుచ్చుకొనుటకు నొప్పుకొని సగము నదిని దాఁటిన తరువాత నాలుగుడబ్బులను పుచ్చుకొందు ననియు, న ట్లియ్యని యెడల మధ్య నొక దిబ్బమీఁద దింపుదు ననియు, నతఁడు బాధపెట్ట నారంభించెను. ఆతని దగ్గఱ సొమ్ము పుచ్చుకొని సరంగు రెండవవాని దగ్గఱకుఁ బోయి యడిగెను. అతఁడు, "నేను రేవుదగ్గఱ పడవ యజమానుని కిచ్చినాను. అతఁడు నీతోఁ జెప్పలేదా"? అని యడుగఁగానే సరంగు కోపముతో "నాకాసంగతి పనికిరాదు. డబ్బు లియ్యఁ గలిగిన నియ్యి లేనిచో దిగిపో" అని చెప్పి మొదట పడవ యజమానుఁడు డబ్బులు పుచ్చుకొన్న సంగతి తా నెఱిఁగియు తిరిగి సొమ్ము పుచ్చుకొనెను. ఇట్లు పడిపోక నడుకును పూర్తి మైన పడవ దైవవశము చేత సుడిగాలికి వశ మయ్యెను. రామచంద్రుఁడు తనకు దాహమగుటచే ముక్తేశ్వర గ్రామనివాసుని దగ్గఱ నున్న నీరు బొకమూ అడిగెను. అతఁడు మహాకోపముతో "మాలవాఁడవు. నీకు బ్రాహ్మణులము చెంబేలాగు నియ్యఁగలము." అని చెప్పెను. తరువాత నెండ బాధచే రామచంద్రుఁ డా బ్రాహ్మణుని యొద్దఁ గూర్చుండుట కాఁగా నతఁడు కోపముతో "ముట్టుకొనుచున్నావు కళ్లు కనుపడవా యెవరనుకున్నావు" అని కోపపడి వానిని లేవఁ గొట్టెను. అప్పుడు సుడిగాలితో గాలిదుమారము వచ్చి భూమ్యాకాశమధ్య

మంతయు నౌకయనుక శోభిల్లోలింపి పడవ కపాయమును కలుగఁజేయు నట్లు చేసెను ఆసమయ మిట్లుండెను.

మ. నటదుత్తుంగతరంగ సంఘములచేఁ బాత్రౌఘమై; రంగము
ద్భట గోదావరి గాఁగ; భూగగనమధ్యవ్యాప్తసూత్రిస్రజం
బట నేపథ్యము గాఁగ; రావ్రిగస దృశ్యప్రక్రియ మాడించెనా
బటుజంఝానిలసూత్రధారుఁడు మహాపాండిత్య మేపారఁగన్

కెరటములు మహోత్తుంగముగ లేచి పడవను పగులునట్లు కొట్టు చుండెను. దోనె యిటునటు మునుగుచుఁ గొంచెము కొంచెము నీరు పోసికొన నారంభించెను. పడవలో స్త్రీలు, బాలురు, వృద్ధులు, నల్లకల్లోలముగా ధ్వనిఁ జేయుచు సరంగును శెలవిచ్చి దింపుమని ప్రార్థించిరి కాని యాతఁడు భయము లేదనియు త్వరగా దింపుదు ననియు జెప్పెను. ఒక పర్యాయము నదికి వంగినంగి నమస్కారము చేయుచున్నదో యనునట్లు దోనె మిక్కిలి యొరుగఁగా నందఱును పెద్దపెట్టున గోల పెట్టి యేడ్చిరి. పడవమునుఁగక మానదని యందఱకును తోఁచెను. ఆ సమయమందు తల్లులను గౌఁగిలించుకొని యేడ్చు బిడ్డలును, బిడ్డలనుజూచి యేడ్చు తల్లులును, పడవవాండ్రను గట్టిగాఁ దిట్టి కొట్టఁబోవువారును, నారాయణ నారాయణ యని ధ్యానము చేయువారును, గంగాస్తవము పఠించువారును, కొబ్బరికాయలు, పసుపు, కుంకుమ, చీరెలు, గంగకు సమర్పించువారును దేవతలకు మ్రొక్కు వారును చేయుధ్వనులు ప్రతి ధ్వను లిచ్చుచుండెను. ఆసమయమందు ముక్తేశ్వరబ్రాహ్మణుఁడు రామ చంద్రుని యొద్దకు వచ్చియతని క్షేమైన కొంచె మింత వచ్చునేమోయని యడిగెను. రామచంద్రుఁడు మాటాడకుండెనుగాని యతని శాంతిమును మన స్థిమితమునుజూచి యీతనచ్చునని యూహించి యాబ్రాహ్మణుఁడు రామ చంద్రుని గట్టిగను కాళ్లును, చేతులును, బట్టుకొని తనప్రాణము నెట్లయిన రక్షింపుమని బతిమలాడ నారంభించెను. ఇప్పటికి దోనె దాదాఁపు

గా నొక్కున కేఁబదిగజములదూరములో నుండెను. పడవ మునుఁగుటకు సిద్ధముగా నుండినప్పుడు రామచంద్రుఁడు జందెము మొదలుఁబెట్టి సమము నకు బట్టగట్టిగాఁగట్టి ముందుగా నదిలోనికి దుమికి పడవలోనున్న యిద్దఱుపిల్లలను తనమీఁదనెక్కించుకొని యీఁదనారంభించెను. అది చూచియందఱును "మమురక్షింపుము మమురక్షింపు" మని వేఁడుకొనిరి. ఈలోపుగానొకపెద్దగాలిరాఁగా పడవతలక్రిందై మునిఁగిపోయెను. త్వర గాదింపుమనని వారానముచేసిన సరంగు తనమాటఁదప్పకుండ వారిని త్వ రగా గంగలోదింపెను. ముక్తేశ్వరబ్రాహ్మణుఁడు కొందఱుమునుఁగులు ము లిఁగి నాలుగుగ్రుక్కలు నీళ్ళుత్రాగి మూర్ఛపోయినట్లు తేలినంతలోనే, పిల్లల నుదింపి తిరిగి యొకరికైన సహాయముచేయుటకు పడవదగ్గఱకు వచ్చుచు న్న రామచంద్రుని గొంతు గట్టిగాఁబట్టుకొనెను. రామచంద్రుఁడు వద లుమని ప్రార్థించెనుగాని వదలుమనుకొలఁది మరింతగట్టిగా బ్రాహ్మ ణుఁడు పట్టుకొన నారంభించెను. రామచంద్రుఁడును బ్రాహ్మణుఁడును గూడ చచ్చిపోవునట్టి సమయము వచ్చినట్లు కనఁబడెనుగాని రామచం ద్రుఁ డుపాయశాలి గనుక బ్రాహ్మణుఁడు తనగొంతును వదలనప్పుడు వానిని గట్టిగాఁ గరచెను. అప్పుడే బ్రాహ్మణుఁడు పట్టువదలెను. రామచంద్రుఁడు భూతదయాళుఁడు కాఁబట్టి యాబ్రాహ్మణుని యందు మహాదయ గల్గి వెనుకకు వచ్చి కొంచెముమూర్ఛితుఁడైనవానిని గట్టుకుఁ జేర్చెను. పిమ్మట రామచంద్రుఁడు బ్రాహ్మణుని గట్టునకుఁ దీసికొనిపోయి నీరు త్రాగుటచే నెత్తుగా నుబ్బియున్న పొట్టమీఁద నడుగువేసి త్రొక్కి, నీటిని వెలికిఁదీసి వానిని బ్రతికించెను. ఇంతలోనొకపడవవచ్చి యీజనులను రక్షించుటకుఁ బ్రయత్నముచేసెనుగాని సగముకంటె నెక్కువజనులు లోతుప్రవాహమునందు మృతి నొందిరి. రామచంద్రుఁడు సహాయ మియ్యనియెడల ముక్తేశ్వర బ్రాహ్మణుఁడు పడవవచ్చునప్పటికి స్వర్గమునకు బాటసారియై యుండును. అంతట బ్రాహ్మణుఁడు రామచంద్రునితో "అయ్యా! మీఋణము

నేనెన్నటికైనను దీర్చలేను. నాయావదాస్తిని నీకిచ్చినను మీ ఋణము తీరదు. మీకు తగినబహుమాన మేదైన నియ్యవలెనని యున్నది. మీరు నాతోఁగూడ ముక్తేశ్వరము దయచేయవలెను. నాప్రార్థన మంగీకరింపవలసినది." అని చెప్పఁగా రామచంద్రుఁడు "సరిసరి; ఈమాత్రపుఁ బనికి బహుమాన మీయవలెనా? నాచేతనైన సహాయమును నేను చేసినాను. మీరేమియు నియ్యనక్కఱలేదు. దయమాత్రముంచండి! తమరు పెద్దలు" అని ప్రత్యుత్తరము చెప్పి వానికృత్యమైనను పుచ్చుకొనకయే రామచంద్రుఁడు రాజగోలునకుఁ బోయెను. ఆబ్రాహ్మణుఁడు గూడ శివకోసుగ్రామమును జేరెను. రామచంద్రుఁడు రాజగోలు వెళ్లినప్పటికి సాయంకాలమైనందున మేనమామకుమారుఁడు వీధియరుగు మీఁదఁ గూర్చుండెను. ఆపిల్లవానిని జూడఁగానే రామచంద్రుఁడు "నాయనా! యెంతకష్టమువచ్చిన" దని యతనిని కౌఁగిలించుకొని యేడువ నారంభించెను. ఈతఁడెందుకేడ్చుచున్నాఁడో తెలియకుండ కుఱ్ఱవాఁడు కూడ పెద్దపెట్టున నేడువసాగెను. ఇద్దఱును లోపలికిఁ బోఁగానే వారిని జూచి మహావిపత్తు తటస్థమాయె ననుకొని మేనత్తగూడ నేడువ నారంభించెను. చుట్టుపట్ల నున్న మనుష్యులందఱును జేరి "యేమి యేమి?" యని యడిగిరి కాని వారు ప్రత్యుత్తరమును జెప్పకయే వెక్కి వెక్కి యొకరి సంగతి నొకరెఱుఁగకుండ వారందఱును దుఃఖపడుచుండిరి. ఆవినోదమును జూడవచ్చినవారును, కష్టమేమో కలిగినదని యూరడింప వచ్చినవారును సంగతిని దెలిసికొనవలెనని వారును గుమిగూడి యింటిచుట్టును జేరిరి కాని యొకరికిని దుఃఖకారణమేమో తెలియదయ్యెను. అప్పుడు రామచంద్రునివలెనే యున్న యొకనలువదియేండ్లబ్రాహ్మణుఁడు గుంపుగూడిన జనుల సందడిని జేతులతోఁ ద్రోసికొని యతిత్వరితముగా వచ్చి గుండెబాదుకొనుచు "ఏమి? నాయనా! ఏమి? నాయనా" యని రొజుచు లోనికి వెళ్ళెను. అతనిని జూచి రామచంద్రుఁడు మిక్కిలి యాశ్చర్యపడి

నోటివెంట మాటరాక నిశ్చేష్టుఁడై తెలివితెచ్చుకొని లేచి యావచ్చిన మనుష్యుని కౌఁగిలించుకొని "మామయ్యా! నీవు బ్రతికియున్నావా? ఎవరోదుర్మార్గులు నీవు చచ్చిపోయినావని చెప్పినారు. అందుకు నేనిక్కడికి వచ్చినాను" అని చెప్పిన యావిపరీత వృత్తాంతమునంతను మేనమామ విని యెవరో విరోధులాపనిఁజేసినారని నిశ్చయించి యింటనందఱిని నూరకుండుఁడని చెప్పి తరువాత రామచంద్రుఁడును తానును కష్టసుఖములఁ జెప్పుకొనుచుండిరి. మేనల్లుఁడు మేనమామతో తాను రాజవోలుబయలుదేఱి వెళ్ళినది మొదలుకొని యానాఁటివఱకు జరిగినయావద్వృత్తాంతమును పూసగ్రుచ్చినట్లు చెప్పఁగా మేనమామయు, శోభనాచలము మొదలైనవారి చరిత్రవిన్నపుడాశ్చర్యమును, కష్టములు విన్నప్పుడు విచారమును, కష్టనివారణమగునప్పుడు సంతోషమును, కనబఱచుచు, శరభరాజుగారి యుదారగుణముల స్తోత్రము చేయుచు, రామచంద్రునితో మాటాడుచుండెను. అతఁడక్కడ నొకవారము దినములుండెను. ఆలోపుగా నాగావ్రమనివాసుఁడొకఁడు మంత్రిప్రగడ వెంకటరత్నమునకు తమపిల్లనియ్యవలెనని యాతని గుణాములనుగూర్చి రామచంద్రునడుగఁగా నతఁడు వెంకటరత్నముయొక్క దుర్గుణాములనుగుఱించి తనకు తెలిసినంతమట్టుకు నిజముచెప్పెనుగాని కల్లలాడి యిల్లునిల్లుపు మనుశాస్త్రము నతఁడనుసరించలేదు. వారముదినములక్కడ నిలిచిన తరువాత మేనమామయొద్దసెలవుపుచ్చుకొని ప్రయాణమై సుఖముగా రామచంద్రుఁడమలాపురము జేరి యక్కడి వారందఱితో నీఘోరమయిన వృత్తాంతమును జెప్ప వారందఱు నాశ్చర్యమగ్నులఁ జేసెను. రాజవోలులో రామచంద్రుఁడు వెంకటరత్నముయొక్క వివాహమునుగుఱించి మాటలాడినమాట లతనికి నేలాగుననో తెలిసినందున రామచంద్రుఁడు తనకుఁజేసిన మహాపకారమునకు మిక్కిలి కోపించి యతఁ డొకనాఁడు రామచంద్రునితో నిట్లు మాటాడ నారంభించెను.

వెంక—ఏమోయి! రాజవోలు విశేషములు. మీమామగారు బాగున్నారా?

రామ—ఆఁ బాగున్నారు. విశేషము లేమియు లేవు.

వెంక—రాజవోలులో నాకు వివాహవిషయమై సహాయము నీవు చక్కఁగాఁ జేసినావు.

రామ—నేనుచేసిన దేమున్నది. వారునన్ను వచ్చి యడిగినారు.

వెంక—అడిగితే నన్నుగురించి నీవేమిచెప్పినావు? నీకునామీఁద నున్న కసియంతఁ దీర్చుకొన్నావు కాఁబోలును!

రామ—నాకు మీమీఁద కసియేమున్నది. నాపెద్దలను మీరు చంపినారా మీపెద్దలను నేనుచంపినానా? నాకు మీమీఁద కోపమునకు నేనెంతవాఁడను?

వెంక—ఎంతవాఁడవు కాకేమి? ఎంతవాఁడవు కాకుండ మా యమలాపురము వచ్చినావు? నీవు పొట్టకూటికై మాయింటియొద్దనున్నను నీకుకృతజ్ఞత కొంచెమైన లేదు. నీకు కన్నులు నెత్తికివచ్చినవి. నీముందఱ మేమెంతవాళ్ళము? పీటలమీఁద పెండ్లి చెడఁగొట్టి యేమిబాముకొన్నావు? నీకు సిగ్గుబిడియములు లేవేమి!

రామ—అయ్యా! తమకంత కోప మెందుకు? నాకు తోఁచిన యభిప్రాయమును నేను దైవముఖమునుజూచి నిశ్చయముగాఁ జెప్పినాను.

వెంక—నీకు నాసంగతి యేమి తెలుసును? నేను ముండమోపుకొని నీకేమి? నాయంతవాఁడను నేను నీయంతవాఁడవు నీవు. ఒకరిదగ్గఱ నావృత్తాంతము నీవెందుకెత్తవలెను? నీవు మంచివాఁడవా యేమిటి? గురివెందగింజ తన క్రిందినలు పెఱుఁగదఁట. నీయిష్టమువచ్చినట్లు ప్రేలుటకు నేనెవరమనుకొన్నావు? పెండ్లివచ్చినప్పుడు వేయియబద్ధములాడియైన నొక కొంప నిలుపఁబెట్టవలెనన్న మాటయయినను నీవు వినలేదు. నీచదు వెందుకు తగులఁబెట్టనా ఒకరు చెప్పగావున్న పక్షమున నీవింతయొర్వ

లేనేమి? ఆహాహా! యెంతబుద్ధిమంతుఁడవయ్యా ! సత్రములో రాత్రి
వేయునట్టి మచ్చులాగున నున్నది.

రామ—నేను మీయందుఁగల మొగమోటముచేత నబద్ధము
చెప్పిన పక్షమున నాప్రాణమున కుసూరుమని యూపిల్ల యేడ్చును. నా
త్రేన్పు బ్రతుకనలసిన బ్రతుకు.

వెంక—సత్యవాదివి నీవు బయలుదేరినావు. భూలోక హరిశ్చం
ద్రుఁడవు. తిన్నయింటివాసములు లెక్క పెట్టుటలోఁ జెలివిగలవాఁడవు.
తల్లిపాలు త్రాగి రొమ్ముగుద్దినాఁడన్న సామ్యము నీదగ్గఱనె నిజమైనది.
ఇందుకే నియ్యోగపువానిని జేరఁదీయఁగూడదని శాస్త్రము చెప్పినవాఁడు
వెఱ్ఱివాఁడా?

అని యిట్లు వెంకటరత్నము తానుగూడ శరభరాజుగారియింట
పొట్టకూటికిఁ జేరినవాఁడే యనుమాట మఱచిపోయి రామచంద్రుఁడు
తనయింటనేయుండినట్లును, వానిని తానేసంరక్షించుచున్నట్లును తలఁచి
తలవాఁచిపోవునట్లు వానిని జివాట్లు పెట్టి మాటలతో తనవాదము
ముగింపక చేతులుకూడ కలుపుటకు సిద్ధముగానుండెను. కాని రామచం
ద్రుని యదృష్టము బాగుండి యింతలో లోపలినుండి వచ్చి శరభరాజు
గారు వెంకటరత్నమును రామచంద్రుని కూకలువేసి వారి వివాద నివా
రింపఁజేసిరి. రామచంద్రుని సత్యవాద మతనిని మహాపదలపాలుజేసెను.
ఒకనాఁడు వెంకటరత్నము మనస్సులో నేదో తలంచుకొని రెండువ్రేళ్లు
చాపి యిందులో నొకవ్రేలుపట్టుకొమ్మని నరసింహమునడిగెను. అతఁడు
రెంటిలో పొడుగువ్రేలు పట్టుకొనఁగా నది యతనిమనస్సులోనున్న
యభిప్రాయమునకు సరిపడనందునను, నశుభసూచకముగా నున్నందు
నను వెంకటరత్నము, కోపమువచ్చి "శకునపక్షి వెధవా! ఎప్పుడు నింతే;
చవటచేతులపెద్దమ్మ" యనిటంగున నొక మొట్టికాయ మొట్టెను. దాని
తో కుఱ్ఱవాఁడు కెవ్వున గుక్కతిరుగకుండ నేడ్వఁగా లోపలినుండి

కృష్ణవేణమ్మగారువచ్చి యెవరుకొట్టినారని యడుగఁగా రామచంద్రుఁడు సంగతియంతయుఁ జెప్పెను. కృష్ణవేణమ్మ వెంకటరత్నమునుగొంచెము చీవాట్లు పెట్టెను. ఇట్లాకదానికంటె నొకటి బలమైన కారణములచే వెంకటరత్నమునకును రామచంద్రునకును మనస్పర్థ హెచ్చగుటచేత వెంకటరత్నము తనకసిఁదీర్చుకొనుటకు రామచంద్రుఁడు చదువుకొను చున్నప్పు డతని కేదైన పనిఁ జెప్పి యతఁడు చేయుటకు వీలులేదనఁగానే ధూమాతీక శరభరాజుగారితోను వారితల్లితోను జెప్పి “తిండికిసిద్ధముగా నుండును గాని పనివల్లగాదు. మాయింటనున్న వారికి మాకంటె నెక్కువ రాజసము” అని చెప్పుచు తనచేతనైన యిబ్బందులు పెట్టుచుండెను. దేవుఁడు వరమిచ్చినను పూజారివరమియ్యఁ డన్నట్లు శరభరాజుగారికి దయ యున్నను వెంకటరత్నమునకు కటాక్షములేకుండుట యొక పెద్ద చిక్కుగానే యుండెను. ఒకనాఁడురాత్రి భోజనములయినతరువాత శరభరాజుగారు లోపల చావడిలోఁ బచారుచేయుచుండఁగా రామచంద్రుఁడు దీపముపెలుఁగున చదువుకొనుచుండెను. అప్పుడు వెంకటరత్నము రామచంద్రుని మెల్లఁగాఁబిలిచి యిట్లనిచెప్పెను.

వెంక—అబ్బాయి! ఆమధ్య నిన్ను నేనన్నమాటలుమనస్సులో నుంచుకోవద్దుసుమీ! నామనస్సులో కల్మషములేదు. అప్పటికప్పుడు కోపమువచ్చినప్పుడు పిచ్చముండాకొడుకువలె నాలుగు కేకలు వేయడమే గాని దీర్ఘక్రోధముంచుకోను. మనమందరము కూడ నొకయింట నుండే వారము. ఈవేళ నాలుగనుకొన్నను రేపు తిరిగి కలిసేవాళ్ళము మన ము. నన్ను నీవన్నను నిన్ను నేనన్న నదిలెక్కలోనిదికాదు. నేను వయి కీలాగున కోపముతో కనఁబడుదుకాని నీవిషయమైన సంగతి నేదయిన శరభరాజుగారితోఁ బ్రసంగించవలసినపుడు నేనెంతెకట్టుదిట్టముగఁ జెప్పుచుందునో పరమాత్మునకుఁ దెలుసును.

రామ—చిత్తము. మీదయ యున్నపక్షమున నాకేకొఱఁతయు నుండదు. నేను మిమ్ము నందఱను నమ్ముకొన్నవాఁడనే కనుక నా భారమేమీది.

వెంక—ఒకపర్యాయము వీధిలోనికి రా (అనివీధిలోనికిఁ దీసికొని వెళ్ళి), సూర్యనారాయణగారూ! దయచేయండి.

అని యతఁడు పిలువగానే తెల్లని తలపాగాను బెట్టుకొని నిలువు టంగీ దొడుగుకొని మంచి జరీపంచెఁగట్టి, చేతిలోనొక వెండిపొన్ను వేసిన కఱ్ఱ పట్టుకొని యున్న యొక బ్రాహ్మణుఁడు వచ్చెను. అతనిని జూచి రామచంద్రుఁడు "తిరిగివచ్చినారా?" యని యడిగెనుగాని వెంకట రత్నమును బ్రాహ్మణుఁడును, వద్దని చెప్పఁగా వారిందఱు వీధియరుగు మీఁద మూలఁ గూర్చుండిరి.

వెంక—రామచంద్రుఁడూ! నీవొక్క సహాయము చేయవలయు ను. ఈయన దేశిరాజు సూర్యనారాయణగారు. వీరు దేశపాండ్యులు, కోటిపల్లి కాఁపురము. తాతముత్తాతలనాఁటినుండియు శ్రీవిజయనగర మహారాజుగారిదగ్గఱ పెద్దయుద్యోగములను జేయుచున్నవారే. వారిది నూఱుపుట్లభూమి. వెనుకటి నందనసంవత్సరపు కఱవులను వీరు చేసిన యన్నదాన మింతింతయని చెప్పనలవికాదు. మూఁడేండ్లు జనులు కుటుంబములతో వచ్చి వారిగ్రామములోఁ గాఁపురమున్నారు. నీవు వినియుం దువు జగత్ప్రసిద్ధులు.

రామ—నేనెన్నఁడు నెఱుఁగను. మహానుభావులువీరు.

సూర్య—అవి యన్నియునెందుకు? ఆదినములువేరు. ఆకథలు వేఱు. చావలేకయీలాగున బ్రతుకుచున్నాము. ఈస్థితియీవేషమువేరు.

వెంక—అందుచేత నప్పులు విస్తారముకాఁగా భూములు తాకట్టు లోనున్నవి. ఇంటనున్న జవాహిరీనంత విక్రయించి వీరు కాలక్షేపము చేయుచున్నారు. అయినే యీనగలను కోటిపల్లిలోనుచుట్టుపట్లనువారిలో

మున్నారు. పూర్వులమ్మిన వోటనే కట్టెలమ్మవలసి వచ్చెను. అనగలను మాగాణము తెచ్చి యమ్ముచుందురు.

రామ—నేనిప్పు డేసహాయము చేయవలెను? పాపమునాకు విచారముగానే యున్నది.

వెంక—మఱేమి గొప్పసహాయము లేదు. నీయందు కోమట్లకు మహాగౌరవముకలదు. నీనమ్మినపక్షమున మోసము చేయరు. నీకు బంగారమునాణెము తెలుసును. ఈవస్తువులు నీవమ్మిపెట్టియతనిమర్యాదగా పాడవలెను.

రామ—యీమాత్రపుపని కింత మనవికావలెనా? నాచేతనైన దానిలో మీకుఁ దగినంత సహాయము చేయఁగలవాఁడను.

సూర్య—అయ్యా! యిది రెండవవానికి తెలియనియ్యవద్దు. నాకు సిగ్గుగానున్నది. అందుచేతనే యీవస్తువుల నంతదూరమునుండి యింత దూరము తెచ్చి యమ్ముచున్నాను. అక్కడ ధర రానపోలేదు.

రామ—మీరు చెప్పిన తరువాత నెవరికైనఁ దెలియనిత్తునా నాకు బంగారమునాణెము చక్కఁగాఁ దెలియును.

వెంక—తెలిసినంతి మట్టుకు చాలు. రాజగోపాలమునకైనఁ దెలియనీయకు. ఇవిగో వస్తువులు. కంటె నూరురూపాయలుధర. ఉంగర మేబదిరూపాయలు. ఈయన తిరిగి రేపురాత్రి మనదగ్గఱకు వచ్చి యీ సొమ్ము పుచ్చుకొందురు. రేపు పగలు దీనిని విక్రయించుము.

రామ—ఆయన రాత్రి రావడ మెందుకు? పగలు రారాదా?

వెంక—పగలు వచ్చినపక్షమున శరభరాజుగారు బలవంతపెట్టి భోజనమునకు రమ్మనుమని నిష్ఠురము లాడఁగలరు. ఎందుకు? రాత్రియే మంచిది.

ఈసంభాషణ ముగిసిన తరువాత సూర్యనారాయణగారు వెళ్లిపోయెను. రామచంద్రుఁ డావస్తువులను రాత్రి జాగ్రత్తపెట్టి మరునాఁ

నుదయమున కోమట్లకుఁ జూపించి వారుచెప్పిన ధరప్రకారముగా రెండు వస్తువులను నూటయేఁబదిరూపాయల కొకబ్రాహ్మణునకు విక్రయించి యాసొమ్ము మరునాఁడు రాత్రి సూర్యనారాయణ రాఁగా నతనిచేతి కిచ్చెను. ఆపని యైనతరువాత వెంకటరత్నము రామచంద్రుని బిలిచి "నాయనా! యింకొక్క పనియున్నది. గంటము నాకు నొక్కపర్యాయము పుచ్చుకొనుము. పెద్దాపురము నుండి జగన్నాథరాజుగారు వచ్చినారు. ఆయనతోఁగూడ మామేనల్లుఁడు వచ్చినాఁడు. అతని కక్కడ ముప్పది రూపాయలు పని. వాఁడొక్క మారు నాకు మోము జూపించి తిరిగి కనఁబడలేదు. ఒకయుత్తరము వ్రాసిపంపెదను. నీవు వ్రాసిపెట్టవలెను. అనఁగానే రామచంద్రుఁడు గంటమును తాటియాకును పుచ్చుకొని సిద్ధముగా నుండఁగా వెంకటరత్న మీప్రకారముగ వ్రాయించెను. "నీవు నాకీవేళ నొక్కమాఱు మొగము జూపించి తిరిగి లోపలికి వెళ్ళినావు. నీతో మాటాడవలెననియున్నది. నీకు వీలెప్పుడో తెలియఁ జేసినపక్షమున నేనుతప్పకవస్తాను. నీతోమాటాడకుండ నేనుండలేను." ఆయుత్తరమువ్రాసి రామచంద్రుఁడు "వ్రాలుచెయ్యండి వెంకటరత్నముగారు" అని యనుఁగా "వ్రాలెందుకు? ఈమాత్రపు చీటిముక్కకు వ్రాలును పైపేరునుగూడ కావలెనా" అని చెప్పి చీటిని బుచ్చుకొనెను. ఇదియైన నాలుదినములకు నరసింహము పుట్టినదినము వచ్చెను. అతఁ డాశ్వయుజబహుళ త్రయోదశీనాఁడు జన్మించినందున నాదినము పిల్లవాని నభ్యంగనము చేయించి గ్రామములో నున్న నలుగురు నియోగులను శరభరాజుగారు భోజనమునకుఁ బిలిచిరి. మధ్యాహ్నము నరసింహమునకు సంపెంగనూనెతోఁ గృష్ణవేణమ్మ తల దువ్వి బంగారపు కుప్పెలుగల నల్లపట్టుజడబొందుతో జడవేసి జడ మీఁద చిన్న చేమంతిపువ్వును, దానికి పైభాగమున నడినెత్తిమీఁద ముంగలి రేకును నమర్చి, మొగమున చక్కని యగరు చుక్కను బెట్టి

రావిరేకవేసి పచ్చని పట్టునొక్కా తొడగి దానిమీఁద జందెమువలె వరహాలపేరువేసి మెడలో సిర్యాల పేరును, చంద్రహారమును వేసి దానిమీఁద బంగారపు కస్తికంటె పెట్టి కుడిచేతిమీఁద బంగారపు భుజకీర్తులు బొందుకట్టి రెండుదండలమీఁద వంకీలు పెట్టి, చెవులకు వజ్రపుపోగులు వేసిన తమ్మంట్లనుంచి కుడిచేతియైదువేళ్లకు బటువులుంచి మొలకట్టు దగ్గఱనుంచి బంగారపు కడ్డీముగుగులును, మురిడీగొలుసులును, ధగధగలాడుచుండ నెత్తిపట్టులాగుతోడఁ బంగారుపుబిళ్లలమొలత్రాను లాగుమీఁదకుఁ దీసి కాళ్లకు వెండియందెలును, గజ్జెలును, కడియములును, కేలించి మెడకు తెల్లచారలుగల యెఱ్ఱపట్టుమాలు ముడివేసి శృంగారించి కుమారుని బడికిఁ బంపను. పిల్లవానిమీఁద వైచిన వెండి బంగారము లతనికంటె బరువుగానున్నందున వస్తువులనుమోయలేకవగర్చుచు పుస్తకములుమోయలేనందున చాకలివాఁడు వెనుక పుస్తకములఁ దెచ్చుచుండెను. తమలపాకులవంటి చెక్కిళ్లను, తాంబూలము వేయ నక్కఱలేకయే పండుపంటువలె నెఱ్ఱగానున్న క్రిందిపెదవియు, పూర్ణచంద్రసమానమైన గుండ్రనిముఖమున కందమునొసఁగ కాలియందియలు ఘల్లుఘల్లుమని మ్రోఁయ దుర్మార్గుల కనులు కుట్టునట్లును, విరోధుల కసూయకలుగునట్లును, బిడ్డలులేనిస్త్రీలు ముచ్చటపడునట్లును, ముద్దుల మూటగట్టుచు బాలుఁడు బడికిఁబోయెను. బడిలో నెవ్వఁడును చదువు లేమికనుక పంతులవారు గాఢముగా గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచున్నందున పిల్లలందఱును, 'దాహమున కనియు, నింక కొన్నిపనులకును నానా ముఖములై పారిపోయిరి. నరసింహముగూడ నొకమూలకుఁబోఁగా నెవరో యొకబ్రాహ్మణుఁడు చేతిలో నొకపటికబెల్లపుగడ్డయు, నొకపంచదార చిలుకయు, నాలుగుచక్కెరకేళీపండ్లును బట్టుకొని నరసింహమును రమ్మనుమని చేతితో సంజ్ఞచేసెను. ఎఱకొఱుకఁబోయిన చేపవలెనే నరసింహము గూడ నాబ్రాహ్మణుని యొద్దకుఁబోయి యాలించుపెట్టిన పంచదార

చిలుకను దినుచుండఁగా నాబ్రాహ్మణుఁడతని నెత్తుకొని ముద్దాడి తన యింటికిఁ దీసికొనిపోయెను. పాపము ముద్దుచేత వదలలేకయేకాఁబోలును పిల్లవానిని బ్రాహ్మణుఁడు వదలనేలేదు. అతనితోఁగూడ వెళ్ళిన చాకలివాఁడు నరసింహము పుట్టినదినముగనుక శరభరాజుగారు బహు మతియిచ్చిన నాలుగు డబ్బులతోఁ గల్లునీళ్ళుత్రాఁగి బాలకుని సంగతి స్మరణకురాక యెక్కడనో దొల్లియుండెను. పిల్లవాఁ డెంతసేపటికిని యింటికిరాలేదని కృష్ణవేణమ్మ విచారించుచుండఁగా చాకలివాఁడక్కడికి వచ్చెను. నరసింహ మెక్కడనున్నవాఁడని చాకలివాని నామె యడుగఁగా వాఁ డేదో కొంపమునిఁగినదనుకొని "నేనిందాక తీసికొనివచ్చి యింటిదగ్గఱ దిగవిడిచినానండి" యని చెప్పెను. కానివాని మాటయందు నమ్మకముచాలక శరభరాజుగారితో నాసంగతి కృష్ణవేణమ్మ చెప్పెను. ఆమాట వినఁగానే యింటివారందఱు కలవలపడ నారంభించిరి. నగలు శరీరమునిండ నుండుటచేత నెవరో గొంతుపిసికి చంపి నగలను దీసికొనిరని కృష్ణవేణమ్మ యేడ్పుచుండెను. శరభరాజుగారు కదలుటకుఁ గాళ్ళాడక దిగులు మొగముతో నుండెను. శరభరాజుగారితల్లి కృష్ణవేణమ్మను నగలుపెట్టి పిల్లవానిని బయటికిఁ బంపినందుకుఁ దిట్టసాగెను. వెంకటరత్నమొకప్రక్కకును చాకలివాఁ డింకొకప్రక్కకును నిరుగుపొరుగువారందఱు తెలియుకప్రక్కకునుబోయి సందులు, గొందులు, పాడుదొడ్లు, ప్రాఁతయిండ్లు, బోడిగోడలు, తోఁటలు మొదలయిన రహస్యస్థలములన్నియు వెదకిరికాని యెందును బాలుఁడగుపడలేదు. నగలు పోయినను సరే జీవముతో మన కుమారుఁడు కనఁబడినఁ జాలునని తల్లి యూరడించుటకు వచ్చిన స్త్రీలతోఁ జెప్పిచెప్పి విలపించుచుండెను. రాజగోపాలమును రామచంద్రుఁడును గూడ నమలాపురమంతయు వెదకిరికాని పిల్లవాఁడు కనఁబడలేదు. తుదకు రాత్రి జామయినతర్వాత రామచంద్రుని కొక్క యూడిగవాఁడగుపడి నాలుగుగడియలప్రొద్దువేళ తాను తాఁటిచెట్లునక్క

కల్లుదీసికొనుచుండఁగా నొక నగలపిల్లవానిని, మఱియిద్దఱుమనుష్యులను తాఁటితోఁటలోఁజూచినానని చెప్పిపోయెను. అతోఁటలోపలికి రామచంద్రుఁ డొక్కఁడునుబోయి నాలుగుమూలలు వెదకి తుదకొకమూలనొక్క కంచెదగ్గఱ నోటిలోగుడ్డలు క్రుక్కఁబడియున్నందున మాటరాక దిగంబరియై నిలిచిన యొకబాలకునిఁజూచి చీఁకటిచేత మొదట తాఁటిమొక్కయేమో యనుకొని సందేహనివారణార్థము దగ్గఱకుఁబోయి చూచి పిల్లవాఁడె యని తెలిసికొని "నరసింహము" అని పిలిచెను. మాటలాడుటకు వీలు లేక నతఁడు కన్నీళ్లతో ప్రత్యుత్తరమిచ్చి యెత్తుకొమ్మని చేతులుసాచెను. రామచంద్రుఁడు నరసింహము నెత్తుకొని నోటిలో గుడ్డలు తీసివేసి నగలింతపని జేసినవిగదాయని పిల్లవానిస్థితికిఁ గొంచెము కన్నీళ్లుదెచ్చుకొని దొరికినందున సంతోషించుచు నింటికిఁ దీసికొని పోయెను. పిల్లవాఁడు కొంతదూరమున నుండఁగానే యీసంగతి తెలిసి యింట నందఱువచ్చి పిల్లవాని నెత్తుకొని ముద్దాడిరి. కృష్ణవేణమ్మయుఁ దొట్రుపాటుతోవచ్చి బాలునిఁజూచి దుఃఖము పొరలిపొరలి రాఁగా నెత్తుకొని కంటఁబడి సుఖముగానున్నందుకు మహా సంతోషముతో లోపలికిఁ దీసికొనిపోయి కొంచెమన్నము దిగఁదుడిచి నైచి గుప్పెడుమిరపకాయలను లోపలనున్న వారందఱు గొంతులు బ్రద్దలగునాఁగున దగ్గునట్లు ప్రొయిలోఁబోసి పిల్లవానిని జరిగినసంగతినడుగుచు మధ్యమధ్య నేడ్చుచు వచ్చినస్త్రీలకు వానిని జూపుచుండెను. తరువాత మగవా రందఱు కాఁగడావేయించుకొని యాతాఁటితోఁటకుఁ బోయిరి కాని దొంగ వాఁడును బుద్ధిమంతుఁడగుటచే పెంబాటుచేనైన నెక్కడనైన దిగబెట్టకుండ నన్నిఁటిని దీసికొనిపోయెను గాని నరసింహము యొక్క- చొక్కాయను, లాగును, రుమాలును విడిచిపోయెను. ఆ తొందరలో దొంగలు తివఁచేతి తెల్లరుమాలుకూడ విడిచిపోయిరి. అది రామచంద్రునికిఁ గనఁబడఁగా నదిఁ జేర్పడి శోధించిచూచి యొకకొంగున

జేసితో వేసిన పేరుయొక్క పొడియక్షరములు చా. జ. యని చదివి యూపే రెవరిదో యెఱుఁగక యందఱును త్వరితముగా నింటికి వచ్చిరి. ఆమఱునాఁడు నరకచతుర్దశియు దానితరువాత దీపావళియునై యుండెను. నగలు దొరకక పిల్లవాఁడుమాత్రమే దొరకినందుకు శరభరాజుగారితల్లికి విచారముగా నున్నందున నాసంవత్సరము పండుగ చెయ్యవద్దని చెప్పినది కాని శరభరాజుగారును కృష్ణవేణమ్మయు పిల్లవాఁడు దొరకుటయే చాలు నని మునుపటికంటె పండుగ ఘనముగాఁ జేసికొనుటకుఁ బూనిరి. వారందఱు తమకుమారుని వెదక తీసికొనివచ్చి నందులకు రామచంద్రున కనేక వందనములు చేసి వేఱువిధముల వానిని స్తోత్రము చేసి యతని ఋణము దీర్చుకొనలేమని చెప్పిరి. నరక చతుర్దశినాఁడు తెల్లవారు జాముననే లేచి యెంతమందికి తల లంటిన నంతపుణ్యము గనుక తన స్నేహితులను బంధువులను బిలిచి శరభరాజుగారు కొందఱికిని గోపాలము కొందఱికిని స్వయముగాఁ దలల నంటిరి. కొందఱికి మంగలవాళ్ళ చేత తల లంటింపించిరి. అభ్యంగన సమయమందు శరభరాజుగారికి పార్వతి మంగళహారతిఁ బట్టఁగా నాయన పాతికరూపాయలు పళ్ళెరములో వేసిరి. రామచంద్రుఁడును, రాజగోపాలమును బాణాసంచాగాల్చి దొడ్డినంతను వెలిగించిరి. ఆమరునాఁడు దీపావళి యమావాస్య యయ్యెను. అమావాస్య యింక నొకనెలకు వచ్చుననఁగా పని పాటలను మానుకొని గంధకమును సూరేకారమునుకొని బొగ్గుతెచ్చి పాళ్ళువేసి టపాకాయలను తిక్కిన యితరబాణసంచాయును గట్టువారును మందులను మండిగలలోఁ బోసి నూరువారును, మందు కుట్టువారును, తాము గట్టిన వస్తువులు చక్కఁగాఁ గాలునో లేదో యని పట్టపగలు చీఁకటిగదిలోనికిఁ బోయి తలుపులు మూసి యావస్తువుల నక్కడగాల్చి వాని సార మెఱుఁగువారును తప్పుపాళ్లు పడుటచేతనైన మందులనుగురించి వగచువారును చాలరేగి యుండిరి. పట్టణమందు ప్రతిగృహమున గంధకపువాసన గొట్టు

చుండెను. అమావాస్యనాఁ డుదయమునఁ గొంచెము మబ్బువేసినందున వర్తకు లందఱికి తమసొమ్ము నమ్ముకొనుటకు వీలుండదని గుండెలలో ఱాయిపడిన ట్లుండుటయేగాక బాలురందఱును సంతోషభంగమగునేమో యని మేఘునిఁదిట్టుచుండిరి. కాని కొంతసేపటికి వర్తకులపాలిటి యదృష్ట దేవతయో యనునట్లు ఫెళ్లుమని యెండరాఁగా వర్తకులు దుకాణములను దెఱచి సరకు నమ్మ నారంభించిరి. భాగ్యవంతులు తమ బిడ్డలకు విస్తారధనము వ్యయపఱచి వస్తువులను గొనిపెట్టుచుండుటఁ జూచి బీద బిడ్డలు తమ తలిదండ్రుల బాధపెట్టఁగా వారు బిడ్డలకుఁ దగినయుత్సాహము తీర్పలేకపోయినందులకు విచారించుచు స్వల్పముగాఁగొనియిచ్చుచుండిరి. గొప్పయుద్యోగస్థుల యనుగ్రహము సంపాదింపవలెనని చిన్నయుద్యోగస్థులు తమపిల్లలకు లేకపోయినను బహుమతులపేరుపెట్టి వారి యిండ్లకు పెద్దపెద్ద బాణసంచాబుట్టలను బంపుచుండిరి. అంతకంటె మహాభిమానముగల పౌరుషవంతులు తమను సేవించుచున్న ప్రత్యక్ష దేవతలగు వేశ్యకాంత లేమనుకొందురో యనియు మంచివస్తువులఁ బంపని యెడల మఱునాఁడు వారిమొగ మెట్లుచూతు మనియుఁ దలంచి పదిమందిలో నగుబాటు రాకుండ పరువు నిలుపఁ బెట్టుకొనుటకు ధనము లేకున్నను ఋణము జేసియో, యింటనున్న వస్తువులను దెగనమ్మియో బాణసంచకొని యొకరసికునికంటె నొకరసికుఁ డెక్కువఁగా నుండవలెనని వర్తకులదగ్గఱ బదులు పుచ్చుకొని పెద్దపెద్దబుట్టలను వారియిండ్లకంపిరి. తాఁటిచిదుగులను సంపాదించి కాల్చి పొడుముచేసి గుడ్డలువేసి తాఁటికమ్మచీరి యందులో నీగుడ్డ పెట్టి పొట్లములుగాఁ జుట్టి గట్టి పైని పేడపూసి బాలు రెండఁబెట్టుకొను చుండిరి. వృద్ధు లగువారు తాఁటి యాకుల యీనెలఁదీసి చిత్రముగా కత్తిరించి యడ్డముగా నొకయాకును నిలువుగా నొకయాకునువేసి గుమ్మపుపంచులఁగట్టి వ్రేలాడఁదీయుచుండిరి. పురుషు లందఱు తమతమ గుమ్మముల ముందఱ నరఁటిచెట్లు తెగఁ

గొట్టించియు బొప్పాయిచెట్టు నతికించి పాతించి వానికి వెదురుకఱ్ఱముక్క లను దిగఁగొట్టించి వానిమీఁదఁ బ్రమిదలను రాశిపెట్టి గురుజులను బెట్టించి యంతలోఁ దృష్టిఁబొందక రెండువీధియరుగులక్రిందను గడలను బాతించి వాని కడ్డముగ వెదురుకఱ్ఱలను నాలుగైదంతస్థులుగఁ గట్టించి వానిమీఁదఁ గుమ్మరివాండ్రు దెచ్చియిచ్చిన క్రొత్తప్రమిదలను బెట్టించు చుండిరి. అప్పుడు సాయంకాలముకాఁగా నారాత్రి పెట్టఁబడు దీపముల కాంతి ముందు తనకాంతి వెలవెలఁబోవునను సిగ్గుచేతనోయన సూర్యుఁ డపరసముద్రముఁ బ్రవేశించెను. స్త్రీలందఱును మడిగట్టుకొని దీపములు పెట్టిరి. ఆకాశమండలము నున్న నక్షత్రములెల్ల భూమండలమునఁ బ్రతి ఫలించుచున్నట్లు దీపములు కోట్లకొలఁది వీధుల కిరుప్రక్కలను వెలయుచుఁ డెను మఱియును సువర్ణభూషణాలతో నున్న స్త్రీల యవయవములకపూర్వ మైన లావణ్యము గలిగించుచు పట్టపగటియందువలె సమస్తవస్తువులను గాన్పించుచు సొగసు మిగిలియుండెను. మహారాష్ట్రదేశ వర్తకులు తమకొట్లనలంకరించి పళ్లెరములయందు వెండిబంగారు నాణెములనుంచి ధనపూజఁ జేయుచుండ బ్రాహ్మణోత్తములు పూజఁజేయించి సంభా వనల గ్రహించి బొజ్జల నాశించుకొనుచు నిండ్లకుఁ బోవుచుండిరి. ఈ దీపికాసమూహమునకు వెఱచి యంధకార మంతయు వాని వెనుక శరణా ర్థము దాఁగియున్న దన్నట్లు క్రిందిదీపముల వెనుక నుండెను. ఎక్కడఁ జూచిన దీపములవెలుతురు నెక్కడఁ జూచిన రంగురంగుల మహ తాబులకాంతియు నెవ్వఁడుఁగాంచిన నానందమును నేచాయఁగనుగొన్న మహాధ్వనియు గ్రామమున నిండి యుండెను. బాలకులు కాల్పుట కసమర్థు లగుటచే నగ్నిబాణముల వెదురుకఱ్ఱలకుఁ గట్టించి కాల్పించు తండ్రులును, చమత్కారముగాఁగాల్చుచిన్నబిడ్డలనుజూచి సంతోషించు తల్లులును, వస్తువు లయిపోయిన వని రోదనము చేయు బాలకులును, భార్యల యొద్దను, తమ రుంచిన వేశ్యకాంతల యొద్దను తమచమత్కార

మంతయుఁ జూపఁదలఁచి చిత్రవిచిత్రముగా నగ్నిబాణములఁగాల్చి వారి మెప్పు నొందుచున్న మహారసికులును, మార్గమునఁ బోవుచున్న జనుల కాళ్లనడుమ తూటాలును సిసింద్రీలనువేసి వారు తత్తరపడి పరుగెత్తు చుండఁ జూచి యానందించు కొంటెవాండ్రును, సంభావనలకుఁ బోయి వచ్చుచు దూరమం దెక్కడనో కాలుచున్న యగ్నిబాణములఁ జూచి, తమయొద్దకు వచ్చుచున్నవని పరుగెత్తుపిరికిబ్రాహ్మణులును. చిన్నబట్టలఁ గట్టుకొని దుప్పటులఁగప్పుకొని వినోదముఁ జూడవచ్చిన శృంగారపురుషులును నడివీధులయందు ధూర్తు లగ్నిబాణములఁ గాల్చుటచేతఁ దమ గృహములు పరశురామప్రీతి యగునని భయఁపడి కేకలువేయు నాతిజనంబును, జనుల కుపకారము చేయఁదలంచి చేతులయందు నవనీత ముంచుకొని శరీరములఁ గాల్చుకొనువారి కిచ్చునట్టి పుణ్యజనులును, గ్రామమం దంతటను, పిక్కటిలియుండిరి. ఊరున కుత్తరపుదిక్కుననున్న మందబయలుమీఁదికిఁ బోయి, మహావీరులందఱు నొకరిదేహములనొకరు తగులఁబెట్టుకొనుటకు రెండుకక్షులయిరి. మొడనుగట్టుకొన్న సంచిలోనుండి తూటాలనుదీసి కత్తింగా సాగను దెగఁగ్రోసి, జానకత్రాటనున్న నిప్పుతో నంటించి రెండుచేతులను రెంటి నుంచుకొని నోటనొకటి పెట్టుకొని చిత్రవిచిత్రముగాఁద్రిప్పుచుఁ గూర్చుండియు, నంగియు, చేతనైన కసరతులఁ జేయుచు వానిని గొందఱు కాల్చుచుండిరి. తోలుచేతులు దొడుగుకొని లాగులను గట్టుకొని, తలలకు టోపీలఁ దాల్చి, తమ కెన్నఁడుపకారము చేయక యూదినమునమాత్ర మెదుటికక్షులోనిల్చిన జనులమీఁద వెలగకాయలు, గారకాయలు, తూటాలును, విసరివారి దేహములనుగాల్చుచు, వారు తమమీఁదవైచిన వానిని మరల నంది పుచ్చుకొని యుపయోగించుచు, మధ్యమధ్య నంటుకొన్న సంచులను తెగఁగొట్టి పారవైచుచు, దేహములను గాల్చుకొన్న తమమిత్రుల నిండ్లకుఁ బంపుచుఁ దమదగ్గఱ సరకు ముగిసిన వెనుక స్నేహితులవద్ద పుచ్చుకొనుచు, చాలకిందనున్న

పొట్టికఱ్ఱలతో నెదుటివారు ప్రయోగించిన వాని నాఁపు చేసికొనుచు, మీఁదికి బాణము వచ్చినప్పుడు పరుగెత్తుచుఁ గోయుటకు వ్యవస్థచాలక తూటాలను నోటితోఁ గొఱుకుచు, చూచుటకువచ్చిన జనసమూహమును బరుగెత్తించుచుఁ గొందఱు వినోదసముద్రమగ్నులైరి. ఆసమయమునం దాభూమి కేవలమహాగ్నిహోత్రమయమై నిప్పులఁ గ్రక్కు మనుష్యులతోఁ గూడి యాగ్నేయాది మహాస్త్రసమేతమగు రామరావణ మహాభారత యుద్ధభూములవలెఁ దేజోవంతమై యతిభయంకరమై ప్రజ్వరిల్లుచుండెను. అప్పుడు రామచంద్రుఁడును, వెంకటరత్నమును, రాజగోపాలమును, చూచుటకువచ్చి దూరముగా నిలుచుండిరిగాని యొకగారకాయ మహావేగముతో రాజగోపాలముమీఁదికివచ్చెను. అదిచూచి రామచంద్రుఁడు తనప్రాణమునకు వెఱవక స్నేహితునిమీఁదికి వచ్చుచున్న యాకాయ కెదురుగాఁ బోయి చేతికఱ్ఱతో దానిని గొట్టెను. అది వెంటనే పగుల రామచంద్రుని శరీరమునిండ నగ్నిహోత్రపుముద్దలు పడెను. వెంటనే బట్ట యంటుకొన్నందున రామచంద్రుఁడు పరుగెత్తఁగా గాలితగిలి మఱికొంచె మంటుకొనెను. అప్పుడు రాజగోపాల మతనినాఁపి చేతితో నలిపి నార్పెనుగాని శరీరమం దక్కడక్కడ కాలెను. వెంకటరత్నము మంచి యుద్దేశము చేతనే త్వరగా బాధ నివారణ కావలెనని కొంచెము నీళ్లు మీఁదఁబోసెను. అంతట బాధపోవుటకుబదులుగాఁ గాలినచోట వెంటనే పొక్కులెక్కి బాధద్విగుణ మయ్యెను. దఱువాత వారందఱు నింటికిఁ బోఁగా శరభరాజుగారు నవనీతమును దెప్పించి శరీరమంతటఁ గాలినచోట్ల పట్టించి వారి నాఘోరసమయమునందు నిర్భయముగా వీధులయందుఁ ద్రిప్పిన పడుచుతనపు గర్వమును నిందించుచుఁ దనకుమారుని రక్షించిన రామచంద్రుని ధైర్యసాహసాదుల కాశ్చర్యపడెను. రామచంద్రుని శరీరమున బాధ నెలనాఁటికిఁ గుదిరెను.

## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

---

పార్వతి వివాహవిషయమై శరభరాజుగారు బెంగపెట్టుకొనిరి. పిల్లకు దాదాఁపు పదిసంవత్సరములు నిండవచ్చినను తగిన సంబంధ మెక్కడను దొరకక పోవుటయేగాక, యింట నొకరి యభిప్రాయముతో నొకరి యభిప్రాయ మేకీభవించుట లేదు. భాగ్యవంతులగు నియోగు లందఱు తమ కుమారులు, కురూపులై, విద్యావిహీనులై యేవిషయము నందును పార్వతితోఁ బోలకున్నను పంచువేలరూపాయలు, వెయ్యిన్నూట పదార్లు కట్నమునిచ్చినఁగాని, శరభరాజుగారి పిల్లను జేసికొనము చెప్పుచుండిరి. సంప్రదాయమునఁ బుట్టి ప్రస్తుతము కొంచెము చిక్కుపు స్థితిలోనున్న నియోగులు, శరభరాజుగారితో వియ్య మందవలెననుకొన్నను తమస్థితికిని వారిస్థితికిని గల తారతమ్యమును బట్టి తమకు వారు పిల్ల నియ్యరని యనుకొనుచు సందేహించి యూరకుండిరి. శరభరాజుగారి తల్లి 'పిల్లకట్టుతప్పిపోవుచున్నది. మన మందఱము గంగాప్రవేశము జేయ వలసివచ్చును. త్వరగా ముడిపెట్టు' మని తొందరచేయుచుఁ, గట్న మెంతయిచ్చినను నేఁ గొంచె మన్నవస్త్రములకు లోపములేనివారి కియ్యవలెనని చెప్పుచుండెను. రాజగోపాలము రామచంద్రునకు తన చెల్లెలి నిప్పించవలెనని తల్లిదండ్రులతో నప్పుడప్పుడు నామాట సూచాయగాఁ జెప్పుచువచ్చెను. శరభరాజుగారు విశ్వనాథశాస్త్రులవారితో, కుమార్తె వివాహవిషయమై ప్రసంగించినపుడు శాస్త్రులవారును, రామచంద్రుని గుణముల శ్లాఘించి యతనిని తమమనసులోనుంచుకొని యన్యాపదేశముగ "భాగ్యవంతులను బ్రతిమిలాడుటకంటె బీదవాని కిచ్చుట మంచిది" యని చెప్పుచు వచ్చిరి. శరభరాజుగారును పిల్లను, ధనమునుఁగూడ గ్రహించి తగనిపిల్ల సకలహింసలఁ బెట్టునట్టి భాగ్యవంతులను రాకుసులతో

వేఁగుట కష్టమని యెంచి కుమార్తె యొక్కతే గనుక, తమకు లోఁబడియుండువాని కెవ్వనికైన నిచ్చి పెండ్లిచేసి యల్లు నిల్లరికముంచఁ దలఁచుకొనుభాగ్యముతప్ప, తక్కినశుభలక్షణములన్నియు రామచంద్రు నియం దుండుటచేత నతనికిఁ బార్వతి నీయఁదలంచి యావార్త తల్లి కెఱుఁగఁజేయఁగా నామె ప్రతిదినము కలహమాడుచుఁ గొడుకును గోసి పెట్టుచు, రామచంద్రుని దిట్టుచు, తన వార్ధకలక్షణములన్నియుఁ జూపుచుండెను. వెంకటరత్నము వివాహ మెట్లయిన కానీయకుండవలె నని మనసులో సంకల్పించుకొని సహజముగ నీనియం దయిష్టముగల శరభరాజుగారితల్లిచెవిలో విషపుమాటలఁ జెప్పి యామె కసహ్యము త్పన్న చేయసాగెను. చుట్టుపక్కలనున్న యమ్మలక్కలందఱు, పార్వతి కనఁబడినపుడెల్ల "ఓహో హో హో! రామచంద్రునిగారిభార్య కాఁబోలు? మాచిరాజువారికోడలా?" యని పరిహాసము చేయ నారంభించిరి. వారలట్లనుకొనుట మొదల దివఱకు రామచంద్రునితో స్వేచ్ఛగా మాటాడుచున్న పార్వతి కెక్కడనుండియో మిక్కిలిసిగ్గువచ్చి మాటలాడుటమానెను. మాటలుపోఁగానే చూపులుకూడ తప్పెను. తనస్నేహితు లెవరైనఁ దన్నాలాగు నన్నప్పుడు వారితోఁ గలహమాడుచు, పెద్దలన్నపుడు సిగ్గునఁ దలవంచుకొనుచు, తల్లిదండ్రుల దగ్గఱనెవరైన హాస్యమాడినపుడు వారిచాటునకుఁబోవుచుఁ బార్వతి లజ్జాచిహ్నములఁ గనుపఱచుచుండెను. అదిగాక త్రోవలో రామచంద్రుఁడు తారసిలినపుడు తలుపుచాటునకైనను, గోడమూలకునైనను నొదుఁగుచువచ్చెను. రామచంద్రుఁడు తన స్నేహితులు తన్ను పార్వతిమగఁ డనుటచేత కొంచెము సిగ్గుగ[illegible] వస్తువైనఁ బార్వతినడుగవలసివచ్చినపుడు ముభావముగ నడుగుచువచ్చెను. ఆమెయు గోడచాటుననుండి ముసిముసినవ్వులు నవ్వుచు ముభావముగనే ప్రత్యుత్తరము చెప్పుచువచ్చెను. అది యట్లుండ శరభరాజుగారొక నాఁడు మధ్యాహ్నము నిద్రలేచి గదిలో మంచముమీఁదఁ గూర్చుండఁగా

గృష్ణవేణమ్మ తలుపునకుఁ జేరగిలఁబడి నిలుచుండెను. వెంకటరత్నము గూడ నక్కడ నొక బల్లమీఁదఁ గూర్చుండెను. వారిట్లుమాటాడిరి.

శర—ఏమిరా వెంకటరత్నము! జ్యేష్ఠమాసమునందు తప్పకుండా పార్వతికి వివాహము జేయవలెను. రామచంద్రున కియ్యడము నీ కిష్టమేనా?

వెంక—నాయిష్టము చెల్లఁగలదా! అదిగో మావదినె యున్నది గదా. ఆమె నడగండి.

కృష్ణ—నామాట పాటికిరాదు. మీరాయన్నగారు మీరు నాలోచించండి మీకిష్టమైన సంబంధమే నాకిష్టమైన సంబంధము.

శర—అయ్యో! మనమంతాకూడా కూడఁబలుకుకొననద్దా. వాఁడు సద్గుణములు గలవాఁడు, బుద్ధిమంతుఁడులాగే కనుపడుతాఁడు.

వెంక—అగఁబడుటమాత్రమే. నామడపమున కతని కివ్వడము మంచిదికాదని తోఁచుచున్నది. ఏమిటండీ? కూడు గుడ్డలేక యిల్లు వాకిలి లేక పొట్టకూటికిఁ జేరిన నిర్భాగ్యునకు మాణిక్యమువంటి పిల్లను గట్టి పెడుతామంటారు? ఎవరైన నవ్వరఁటయ్యా? యావజ్జీవ మాపిల్ల మన జీవమున కుసూరుమనిపోదూ?

శర—అదృష్టమున్నపక్షమున వాఁడే బాగుపడుతాఁడు. లక్ష రూపాయల యాస్తియున్నవాఁడికిచ్చినా, యదృష్టముచాలకపోతే ముష్టి చెంబు చేతికి వస్తుంది. [నటయ్యా!

వెంక—అలాగని ముష్టిముండా కొడుకునకుఁ గట్టిపెట్టవచ్చు

కృష్ణ—ఏలా గాలోచనచేసినా సరే పిల్లయరిపేవది. కష్టమున కోర్వలేదు. పనిపాటులు చేయనక్కఱలేకుండాయుండే యిల్లుచూచి యివ్వండి.

ఇంతలో, బ్రాహ్మణోత్తముఁడువచ్చి "బాబయ్యా! నాగరాజుమామ గారువచ్చినారు" అనిచెప్పెను. తోడనే శరభరాజుగారు కృష్ణవేణమ్మను

లోపలికి వెళ్లుమని తానెదురుగాఁబోయి, మూలనున్న తివాసి వెంకటరత్నముచేత చావడిలో వేయించి నాగరాజుగారినిజూచి "బావగారు! దయచేయండి" అని తివాసిమీఁదఁ గూర్చుండఁబెట్టెను. వారి కీక్రిందిసంభాషణ జరిగెను. [న్నారా?

శర—బావగారు! అక్కయ్యా పిల్లలూ సంతోషముగా

నాగ—మీదయవల్ల బాగానున్నారు. మీకు శరీరములో సుఖముగా నున్నదా?

శర—సుఖముగానేయున్నది. మీరేపనిమీఁద దయచేసినారు?

నాగ—పనియేమున్నది. మీలోపల కార్యమీయేఁడు చేయవలెనుగదా. మీకు మాకు పూర్వకులములనుండి సంబంధములువిడిపోకుండా కలిసి వచ్చుచున్నవి. మాకంటె మీకత్యావశ్యలు వేఱేలేరు. మీయిష్టమువచ్చిన యంత వరదక్షిణ యిచ్చి మీపిల్లను మాపిల్లవానికివ్వండి.

వెంక—ఔను. వీరిపిల్లవానిని నేను జూచినాను. మనపార్వతికంటె నాలుగేండ్లు పెద్దకాని పిల్లవాఁడు కొంచెము పొట్టికుఱ్ఱవాఁడు తెలివిగలవాఁడు.

శర—ఏమిచదువుకొనుచున్నాఁడు. ఇంగ్లీషా? గీర్వాణమా

నాగ—చదువునకేమి నాలుగయిదేండ్లయినది రఘువంశమారంభించినాఁడు. కాని మధ్యమధ్య నభ్యంతరములువచ్చి మానుట చేత విస్తారము జదువలేదు. అయినా వాని యీడుకుఁ దగినచదువున్నది.

శర—ఈయేఁడు వివాహముచేయుట తప్పదు. ఒకనెలలోపుగా మీకు వర్తమానము నంపుతాను.

నాగ—మీయమ్మగారెక్కడ నున్నారు?

వెంక—"ఆమె పరున్నది. నేనువెళ్ళి లేపుతానుండండి" అని వెళ్ళి వెంకటరత్నమన్నపూర్ణమ్మను లేపి నాగరాజుగారు వచ్చినార

చెప్పఁగానే యామె లేచి యొక గదిలోనికి వెళ్ళి రెండురెక్కతలుపులలో నొకతలుపుఁదీసి రెండవతలుపుచాటునఁ గూర్చుండెను. అంతలో నాగరాజువచ్చి గదియవతల గోడదగ్గఱఁ గూర్చుండెను. తోడనే యన్నపూర్ణమ్మ యెలుఁగెత్తి “అయ్యో! కూఁతురా! ఎంతపనిచేస్తివే యమ్మా నాకడుపులో చిచ్చు పెట్టిపోతివే యమ్మా” అని రోదన మారంభించెను.

నాగ—అత్తా! ఊరుకో. ఇది యొకనాఁటితో పోయేదికాదు. నీ వున్నన్నాళ్ళు నీలాగున నుండేదే. పెద్దదానవైనందుకు వాళ్ళచేతి మీఁదుగా నీముప్పదాఁటలేదు.

అన్న నాగరాజుతండ్రీ! చెట్టంతబిడ్డను దిగమ్రింగి సిగ్గులేక తిరుగుచున్నాను.

నాగ—నీవు కడుపగలకు. ఆపిల్లలను బెట్టుకొని కాలక్షేపము చేయవలయునుగాని దుఃఖపడితే కార్యమే మున్నది? చచ్చినవాళ్లు లేచి రారుగదా?

అని నాగరాజు చెప్పఁగా విని దుఃఖమును జాలించి గద్గదస్వరముతో నన్నపూర్ణమ్మ—నాయనా! కుఱ్ఱవాఁడికిఁ బెండ్లయినదీ? నాకే సంగతీ తెలియడములేదు.

నాగ—కాలేదు. శరభరాజుగారితోఁ జెప్పి మీపార్వతిని మా పిల్లవానికి యిప్పించు. కలిసిన సంబంధము విడఁగొట్టఁగూడదు.

అన్న—శరభరాజూ పెళ్ళామూ యున్నారు. వాళ్ళయిష్టమేగాని నాపెత్తనమే మున్నది? సగముచచ్చి నేనున్నాను. మునుపటి యన్నపూర్ణమ్మను గాను. నామాట వింటారా నాయనా? లోపములేకుండా చెప్పతాను.

నాగ—సరే యోగమున్న పక్షమున కాకమానదు. నేను వెళ్ళుతాను. అనిచెప్పి శరభరాజుగారియొద్ద సెలవుపుచ్చుకొని వెళ్లిపోయెను. అన్నపూర్ణమ్మయేడ్చినకారణమిది. అప్పటికి రమారమి పదునొకండు

సంవత్సరములక్రిందట నన్నపూర్ణమ్మకూఁతురు పార్వతి చనిపోయినది. అప్పటినుండి నాగరాజెన్నఁడు నామెను జూచి పరామర్శ చేయలేదు. కూఁతురుపోయినతరువాత నాగరాజామెనుజూచుటకదే ప్రథమముగావున తనకూఁతు రాదినముననే చచ్చినట్లు రానిదుఃఖమును దెచ్చుకొని యొక విధముగా నన్నపూర్ణమ్మ సంప్రదాయమును నిలిపెను. తరువాత జాము ప్రొద్దుండగాఁ జుట్టుపక్కలనున్న స్త్రీలందఱు శరభరాజుగారి యింటికి కెప్పటివలెనే వచ్చుచుండిరి. అన్నపూర్ణమ్మ తులిసికోట దగ్గఱ తాటియాకులవత్తులపెట్టె ముందుంచుకొని వత్తులఁ జేసికొనుచుండెను. కృష్ణవేణమ్మ మొక్కలపీటమీఁదఁ గూర్చుండి నరసింహామునకు జప వేయుచుండెను. అప్పుడు రంగమ్మవచ్చి యిట్లనెను.

రంగ—అన్నపూర్ణమ్మత్తా! నీమనుమరాలికిఁ బెండ్లివారు వచ్చి నారఁట. చెప్పనే చెప్పవయితివి?

అన్న—ఏమిగనుసుదానవే యమ్మా? ఇంకా వచ్చికూర్చొనై నా లేదు. ఇంతలోనే యెప్పుడు చెప్పను? [యేమిటి.

రంగ—అయినా మనుమరాలిపెండ్లిముందర నీకుకనఁబడ తామా

అన్న—మరే, పెండ్లియంతా నామొగము మీఁదనే నడుస్తుంది. మధ్యనాకుగర్వ మెందుకు? ఆవ్రా దూషా యుండఁగా గుంజార్చిన దఁట.

రంగ—అలాగినకత్తా. పెద్దదానవు. ఈచలవంతా నీది. నీతరు వాతనే యెవరైనా. అయితే యేమినగలు పెడుతా మన్నారు?

అన్న—నాకుతెలియదు. ఆసంబంధము వీరికి సరిపడదమ్మా. మాయింట నున్న రామచంద్రునికి నిస్తారఁట. ఈలాటిసంబంధము దొరక దని కోరితెచ్చినారు.

ఇంతిలో మంగమ్మ వచ్చెను.

రంగ—మంగమ్మా! విన్నావఁటమ్మా, వీళ్ళ పార్వతిని రామచంద్రునికి దన్నపిల్లవాఁడి కిస్తారఁట.

మంగ—(బుగ్గను చేయి పెట్టుకొని) ఆయెత్తపిల్లవానికా? ముష్టిసంబంధ మదేమిసంబంధమమ్మా. కొంచె మైనయింటివానికి పిల్లనియ్యవలెనుగాని వీని కేమిటి? పిల్లయేమిటి?

అప్పుడు పాపమ్మ వచ్చి కూర్చుండి యిట్లుమాటాడ నారంభించెను.

పాప—కృష్ణవేణమ్మా! నీకూతురిని రామచంద్రుని కివ్వడము నిజమేనా?

కృష్ణ—నా కేమి తెలుసునమ్మ మాయత్తగారున్నారు. తల్లికొడుకూ యోజించి యెవరి కిచ్చుకొంటారో. నా కెందుకమ్మా ! నామాట వినేవా రెవరు!

అన్న—పైకి నాపెత్తనము. మగఁడూ, పెళ్ళాము, కూడఁబలుకుకొని చేస్తారమ్మా. నామాట లక్ష్యమెవరికి నేనింత పిడచదానినే.

రంగ—నీకేమి యదృష్టవంతురాలవు. మనుమలు, మనుమరాండ్రు నీకేమమ్మా.

ఇంతలో శరభరాజుగారు వచ్చి 'అమ్మా' యని పిలువఁగానే తల్లి వెళ్లిపోయెను. అప్పుడు కుడిపైటను వేసికొని జానికమ్మ వచ్చికృష్ణవేణమ్మా! నీకూతురికి పెండ్లి నేస్తారట. మీవారిబొట్టు కలుగుతుంది.

కృష్ణ—నాబ్రతు కేలాగున్నదో వివాహ మాలాగున్నది.

రంగ—ఓవిడా కృష్ణవేణమ్మ! మీయింటి కెవరమ్మా వచ్చినారు. అప్పు డేడ్చినవా రెవరు.

కృష్ణ—మాయింటికిబంధువులు వచ్చినారు. మాయత్తగారికూతురు పోయినతరువా తామెను పరామరిశ చేయలేదు. అందుచేత నా విడ దుఃఖపడినది. జానకమ్మా యేమైనా పాటలు పాడుదూ. నీకంఠము బాగా సన్నముగా నుంటుంది.

రంగ—లంకాయాగము పాడవో,

మంగ—గోవిందనామములు పాడవమ్మా. నీకు బాగావచ్చును.

పాప—సీతసమర్త పాడనమ్మా. కొంతసేపదిపాడి తరువాత దక్షునియజ్ఞము పాడవచ్చును.

జాన—మీరు పడుచువాళ్ళు పడుచుపాటలు పాడమంటారు. కృష్ణారామాయని రెండుముక్క లనుకొనివ్వరుగదా. తరుణోపాయము చూచుకొనవద్దటమ్మా? గోవిందనామములు పాడుతాను. మొన్నపాడి వదలిపెట్టిన దగ్గఱ నుంచి పాడుతాను.

"ఉగ్రుఁడై శత్రుఘ్నుఁడు గోవిందారామ

కంఠమెత్తుఁజేసెను గోవిందా

కంఠము తెలియని పసిబాల గోవిందారామ

శత్రుకేలి కనుఁగులు నేమో గోవిందా

అంతట పాటలు వినకుండనే పాపమ్మ యిట్లు మాటాడ నారంభించెను.

పాప—మంగమ్మా! నీకూఁతురికి నెలతప్పినదఁట. నిజమేనఁటోయ్?

మంగ—అప్పుడే యేలాగు తెలిసిన దమ్మా. ఎంతదాఁచవలె నన్నా దాఁగదు. మాకర్మము. నీకు వీరమ్మ చెప్పినదా యేమి పెద్దదిగదా యని వీరమ్మతోఁ జెప్పినాను.

రంగ—వింటే నేమమ్మ. ఇంతలో తప్పా? విని సంతోషించే వాళ్ళముగాని విచారించము. పోసి నాకెందుకమ్మా? జానకమ్మా! పాట పాడవమ్మా. ఈగోడవ లెప్పుడూ యిలాగుండేవే.

పాప—నీకు మనుమరాలు పుట్టినపక్షమున నాకొకముక్కప్పించ వమ్మా. కలిసినవాళ్ళము.

మంగ—నీకొమరకు పాతికయేండ్లవాఁడు. ఏలాగున నివ్వగల మమ్మా?

పాప—అదొకపెద్దఁటమ్మా? నామగనికి నాకు ముప్పదియేండ్లు

హెచ్చుతగ్గు. నేనాఱునెలల పిల్లనై యుండఁగా మాతల్లినన్ను జేతిలోఁ బెట్టుకొని పెండ్లి చేసినది.

మంగ—మాపిల్లను మేమియ్యము. మీకున్న భాగ్యములకుఁ దోడు పిల్లకూడానా?

పాప—(కోపముతో) నీపిల్లయెంత నీవెంత. ముష్టిపిల్ల యెవరికి కావలెను. నీభాగ్యము నీది నాభాగ్యము నాది. నాకొమరుకు పెండ్లిగాక పోతే బ్రహ్మచారి యయి యుంటాడు.

మంగ—బ్రహ్మచారికాకపోతే సన్యాస మిప్పించుకో నాకేమి?

పాత—అట్టిమాటలు రానీకు. కావలిస్తే నీకొమరుకు సన్యాస మిప్పించుకో (కృష్ణవేణమ్మవైపు దిరిగి) చూచినారమ్మా. నే నన్నమా టలలో తప్పేమున్నది. లోపముంటే నానోటిలో గడ్డిపెట్టండి.

మంగ—కృష్ణవేణమ్మగారు! దీనికి వచ్చినయేం డ్లెవరికి వచ్చిన వమ్మా? ఆవిడన్నమాటలు విన్నారా?

కృష్ణ—అలులేదు చూలులేదు. కొమరుకు పేరుసోమలింగమన్నట్లు మొదలు పిల్లపుట్టనే నా లేదు. దెబ్బలాట లెందుకు? ఊరుకోండమ్మా. అవతలచావడిలో మావారున్నారు. ఆనక నాగొంతుకు పిసికి చంపుతారు.

రంగ—నేవెళ్ళిపోతానమ్మ సాయంకాలమైనది. సందెగుమ్మము లూడ్చుకోవలెను.

ఇట్లు మూఢపురంధ్రిగు స్త్రీలు వృధాప్రసంగములతోడను, వ్యర్థకలహములతోడను, నసంబద్ధప్రలాపములతోడను కాలము గడుప యుచుండఁబోయిరి. అన్నపూర్ణమ్మకు రామచంద్రునియందు కోపము నిక్షేతుకముగానే వచ్చినది. రామచంద్రునియందేమియు లోపము లేకున్నను, వెంకటరత్నముతోడి సహవాసముచేతనతనికిఁ గొన్నిక్రొత్త కష్టములుగూడ వచ్చెను. ఒకనాఁడు జాముప్రొద్దెక్కినతరువాత, శరభ

రాజుగారుచావడిలోఁ గూర్చున్నప్పుడు బ్రాహ్మణుఁ డొకఁడువిఱిగిన కంటెను జేతఁబట్టుకొని, ఱాయి నూడఁదీసిన యొకయుంగరమును బుచ్చుకొని యతిత్వరితముగా వచ్చి శరభరాజుగారి యెదుట నిలిచి యీప్రకారముఁగాఁ జెప్పనారంభించెను.

బ్రాహ్మ—అయ్యా! శరభరాజుగారు! చూచినారా, మీయింట నున్నపిల్లవాఁడు చేసినపని.

శర—ఎవరు? మారామచంద్రుఁడా? ఏమిపనిఁ జేసినాఁడు?

బ్రాహ్మ—రెండునెలలక్రిందట నాకొక కంటెను, ఱాయిచెక్కిన యుంగరమును దెచ్చి యమ్మినాఁడు. ఆపిల్లవాఁడు మీయింటిదగ్గఱనున్నవాఁడేకదాయని నేను సందేహింపక యావస్తువులను కొన్నాను. అది కరిగించగా యిత్తడివస్తువై పోయినది. ఇత్తడికంటె నాకమ్మినాఁడు. ఇదివజ్రమని యుంగరములో ఱాయిచూపించినాఁడు. ఇదేదోగాజురాయి. నాకొంప త్రివ్వినాఁడు. వ్యాయనారము చేసిచేసి యాచించిన సొమ్ముపెట్టి యీనగలు కొనుక్కొన్నాను.

ఈమాటలు వినఁగానే శరభరాజుగా రాశ్చర్యపడి, రాజగోపాలమును బిలిచి యతని కేమయిన నీసంగతి తెలియునేమోయని యడిగెను. కాని యతఁడును మహాశ్చర్యనిమగ్నుఁడై తానెఱుఁగనని చెప్పఁగా రామచంద్రుని బిలువుమని యాతనికి శరభరాజుగా రాజ్ఞనిచ్చిరి. రామచంద్రుఁడును స్వచ్ఛమైన మనస్సుతోను, భయముతో వెలవెలబాఱు మొగముతోను వచ్చి శరభరాజుగారియెదుటఁ గూర్చుండెను. అతనిఁ [illegible]డఁగానే బ్రాహ్మణుఁడు గుండెబాదుకొని "ఎంతవాఁడవురా నాయనా! నాకొంపత్రివ్వినావురా" యని యఱచెను. శరభరాజుగా [illegible]వస్తువు[illegible] జేతఁబట్టుకొని యతనిమీఁదవచ్చిన యీనేరమునంతను జెప్పి యిట్లని మాటలాడ నారంభించెను.

శర—రామచంద్రుఁడా! ఈవిషయములో నీ[illegible]

వస్తువులను నీవీబ్రాహ్మణున కమ్మినావా లేదా?

రామ—ఈవస్తువులను నేనీబ్రాహ్మణునకు విక్రయించినాను.

బ్రాహ్మ—చిత్తగించండి. నే నబద్ధమాడలేను. అయ్యో! అయ్యో! చంపినాపురా.

రామ—వెంకటరత్నముగారిని పిలిపించండి. రాజగోపాలము! వెంకటరత్నముగారిని దీసికొనిరావయ్యా.

అనిరామచంద్రుఁడు చెప్పఁగా రాజగోపాలము వెంకటరత్నమును దీసికొనివచ్చెను.

రామ—అయ్యా! నేను దీనిరహస్యమంతయు మీకుఁ దెలియఁ జెప్పెదను వినండి. రెండునెలలక్రిందట నొకనాఁటిరాత్రి నేను దీపమువెలుఁగునఁ గూర్చుండి చదువుకొనుచుండఁగా, వెంకటరత్నముగారు నన్ను బిలిచి సూర్యనారాయణగారి చేతిలోనుండి యీవస్తువులను బుచ్చుకొని నన్నమ్మిపెట్టుమన్నారు—

వెంక—ఛీ! నోరుముయ్యి. నామీఁద—

శర—(మాటకడ్డమువచ్చి) అతఁడు చెప్పవలఁచుకొన్నదంతా చెప్పనియ్యి. ఆసూర్యనారాయణ యెవరు. అతని దేగ్రామము? వారి యింటిపే రేవరు?

రామ—ఆయనయింటిపేరు నే నెఱుఁగను. ఆయన కోటిపల్లి కాఁపురస్థుఁడనియు, మిక్కిలి గొప్పవాఁడనియు నాతో వెంకటరత్నముగారు చెప్పి నాచేత నీవస్తువుల నమ్మించిరి.

శర—వెంకటరత్నము! నీవేమెఱుఁగుదువు?

వెంక—అన్నయ్యా! వస్తువులను కొన్నవాఁడు దగ్గఱనున్నాఁడు గదా! నే నమ్మినానో దొంగతనముచేసినానో అందులో నాజోక్యమున్న దేమో కనుక్కోండి. నేనిందులో నాప్రమాణముగా నేపాపము నెఱుఁగను. ఆసూర్యనారాయణ డెవరో యిప్పుడు విన్నాను.

రామ—నాప్రమాణముగా నేనింతకంటె నేమియు నెఱుఁగను. ఆవస్తువులు నావి కావు. నన్ను మీరు చిత్తమువచ్చినట్లు శిక్ష చేయవచ్చును. కాని న్యాయము కనఁగొనండి.

బ్రాహ్మ—అయ్యో! ఈపనియంత రామచంద్రునిదే కాని మఱి యొకరిది కాదు. వెంకటరత్నముగారు దీనిలో నేమియు నెఱుఁగరు.

రాజ—బాబయ్యా! ఈవిషయము పూర్తిగా విచారించినగాని యేపని చేయవద్దు.

శర—విచారించుట కేమున్నది. వస్తువుల నమ్మినవాఁడు రామచంద్రుఁడే. ఇటువంటి దొంగపిల్లవానిని మనయింటఁ బెట్టుకొనుట మనకు ముప్పే.

వెంక—మహారాజులుగారు మీరింతయన్నము బట్టపట్టి సంరక్షణ చేయుచున్నందుకుఁ దినియుండలేక దొంగపనిఁ జేయ మొదలు పెట్టినాఁడు. తినఁగాతినఁగా గారెలు చేదైనవఁట. ఓరీ రామచంద్రుఁడు! నీకంత డబ్బు కావలసినపక్షమున వారి నడిగితే వారేయిత్తురుగదా. దొంగగడ్డి తిని మామీఁదఁగూడ నేరము పెట్టవలెనని యనుకొన్నావు. నేను లేదిన వేళ మంచిదే.

బ్రాహ్మ—ఓరీ దిక్కుమాలిన ముండాకొడుకా! నాకు నీవు డబ్బెక్కడనుండి తెచ్చియివ్వఁగలవు? శరభరాజుగారు! మీ రింటిలోనుండి యీరామభాగ్యుని లేవఁగొట్టివేసెదరు నకే నాడబ్బుమాట యేమిటి? నే నిఁక నీళ్ళు వదులుకోవలసిన దేనా?

శర—నేనేమిచేయుదును.

బ్రాహ్మ—అయ్యో! అయ్యో! మూటయేబదిరూపాయలు పిండాకుడు మీఁదఁ బెట్టినాను. నీజీవమున కుమూడున యేమ్పుచున్నావు (అని యేడ్వఁజొచ్చెను.)

ఇంతలో నొకదాసి చేతితోఁ జీటి బట్టుకొనివచ్చి

చంద్రుఁడుగా రెక్కడ నున్నారండి” యనియడిగెను.

శర—ఎందుకు? ఆచేతిలోని చీటి యేమిటి?

దాసి—మాయమ్మగా రుత్తరమిచ్చినారు. ఆయనకేగాం నే నివ్వను.

శర—మీాయమ్మగా రెవరు? నీవెవరిదాసివి?

దాసి—చంద్రముఖమ్మగా రిచ్చినారు. ఆయన యెక్కడండీ.

శర—ఆచీటి యీాలాగియ్యి (అని లాగికొని చదువుచున్నాఁడు) “ప్రాణేశ్వరా! మీారు వ్రాసినయుత్తర మందినది. ఈవేళ సాయంకాలము మీారును రాజగోపాలముగారును రావచ్చును. వెంకటరత్నముగారు డింటివద్దనుండరు.” అనిచదివి యిదేమిటి? భోగముదానికుత్తరములువ్రాసి తెప్పించుకొనుటఁగూడ సాగించినావు. విధవా! రాజగోపాలము! అతఁడు, నీవు, చేసినస్నేహమింతుకా? ఓరి దౌర్భాగ్యుఁడా! ఆవిధవనుగూడి చెడిపోయినావా?

రామ—అయ్యో! నేనెన్నఁడు దాని కుత్తరమువ్రాయ లేదు. ఇది యంతయు వెంకటరత్నముగారి మాయోపాయము. నేనేమియు నెఱుఁగను.

శర—వెంకటరత్నము! ఇతఁడువ్రాసిన యుత్తరముతోఁగూడ చంద్రముఖని దీసికొనిరా.

తోడనే వెంకటరత్నము రామచంద్రునికి జరిగిన మహాపరాభవమునకు సంతోషించుచుఁ దన ప్రియురాలిని బిలుచుకొనివచ్చి వారియెదుట నిలువఁబెట్టెను.

శర—ఏమే చంద్రముఖీ! నీకితఁ డుత్తరమును వ్రాసినాఁడా?

చంద్ర—(తలవంచి) వ్రాసినారండి. ఇదిగో నాయుత్తరము.

శర—(తీసి, పుచ్చుకొని యిట్లు చదివెను,)

“నీవు నాకీవేళ నొక్కమాఱు కొంగముఁజూపించి తిరిగి లోపలకు

వెళ్ళినావు నీతో మాట్లాడవలెననియున్నది. నీకు వీలెప్పుడో తెలియఁజేసినపక్షమున నేను తప్పక వస్తాను. నీతో మాట్లాడకుండ నేనుండలేను." ఈ వెనుకటి యుత్తరమును చదువఁగానే శరభరాజుగారు రామచంద్రునితో నిట్లనెను.

శర—రామచంద్రుఁడా! నీవ్రాఁత యవునా కాదా?

రామ—వ్రాఁతనాదేకాని, వెంకటరత్నముగారు తన మేనల్లునకు నాచే వ్రాయించినారు. పై పేరును, క్రిందవ్రాలు నక్కఱలేదన్నారు.

చంద్ర—ఈయుత్తరము నాకీదాసి పట్టుకొనివచ్చినదండి.

శర—ఏమే! దాసీదానా, నీకీయుత్తర మెవరిచ్చినారు?

దాసీ—ఆబాపనయ్య నాచేతికిచ్చి మాయమ్మగారి కిమ్మన్నాడండి.

శర—ఏగుణములున్నను దొంగతనము, లంజతనము, లేకపోతే భరింపవచ్చును. కాని యవియున్న వానిని భరింపలేము. రామచంద్రుఁడా! యీదినము మొదలు నీవు మాయింట నుండవద్దు. నీదారినీవు చూచుకో.

ఆమాట వినఁగానే రామచంద్రుఁడు తనమీఁద పిడుగుపడినట్లు దేహమెల్ల ఝల్లుమన దుఃఖము పట్టఁజాలక వీధిలోనికి లేచిపోయెను. ఇంతలో విశ్వనాథశాస్త్రులవారీసంగతి యంతయు వినవచ్చి కోపావేశముతో నోటమాటరాకయున్న శరభరాజుగారిని జూచి మాటలాడుట కదినమయముగాదని కొంచెముసే పూరకుండెను.

శర—ఎంతపనిచేసినాడండి? ఏమో మంచివాఁడనుకొన్నాను.

వెంక—నేను మొదటినుండి యీలాగేయనుకొన్నాను. వానివాటి ముచ్చుగుణములు, నంగినంగిమాటలు, దొంగచూపులు, నక్కవినయములుచూచి వీఁ డుత్తతుంటరియని నేనిదివఱకే యనుకొన్నాను. మీరే పొరబాటుపడినారు.

విశ్వ — ఇంతపనిచేసేవాఁడుకాఁడు. చిన్నతనముచేఁ బొరఁబడ వచ్చును.

వెంక — చిన్నతనమా వాఁడెక్కడి చిన్నవాఁడు. టంకంభరగా మెక్కుచున్నవి. సిద్ధాన్నము బొజ్జ దోపకొన్నాఁడు. మీఁదుమిక్కిలి రాజగోపాలమునుగూడ చెఱుపుచున్నాఁడు. ఇంటతిని యింటివాసములు లెక్కపెట్టినాఁడు. ఎంతబాగుచేయఁదలఁచుకొన్నాము. వానికియోగము లేదు.

శర — మా పార్వతిగొంతుకకోసినాఁడుగాదు నయమే. నామెత్తఁదనము లోకువగట్టి యిష్టమువచ్చినయాటలాడినాఁడు. దొంగతనము దాఁగదండీ. చిత్రము.

వెంక — ఎప్పటికైనా పాపము బయలుపడక మానదు.

బ్రాహ్మ — అయ్యా! మీ సెలవుపుచ్చుకొని వెళ్లెదను. శరభరాజుగారు నాకర్మమింతే. ఈయుంగరమునకు నాకొఱకు దాపరించినాఁడు (అని వెళ్లెను.)

అందఱును సంధ్యాజపములయినంతట భోజనములకు లేచిరి. వెంకటరత్నము మాయోపాయమునందుఁ దనకుఁగల ప్రజ్ఞనుజూపించి, యిచ్చినవస్తువులను, గాజులపెట్టెయందు వేసిన యుంగరమును రామచంద్రుని చేతి కిప్పించి రామచంద్రుఁడు పాదిరిమున వ్రాసిన యుత్తరమును దాఁచి తాను కొంగున చంద్రయ్యకు కొంచెము వ్రాసినాఁడని చెప్పి విశ్వామిత్రము తెలిపి యందులో కష్టవానిని బతకనిచ్చి కృతకృత్యుఁడై, సఫలమనోరథుఁడై సుఖముగా నుండెను. రాజగోపాలము మాత్రము కంటను రామచంద్రుఁడమ్ముట చేతను, చీఁటిలో నున్నవారికి యతనిదే యగుటచేతను, రామచంద్రుని మీఁద కొంచెము ననుమానపడుచు నతఁడట్టివాఁడు కాఁడని దృఢపఱచుకొనుచు, తండ్రిగారు తగిన విచారణ చేయక తొందరపడినారని నొచ్చుకొనుచు, స్నేహితుని కొఱకు విచారించుచు, తనమీఁదఁ గూడ నింద వచ్చినందుకు సిగ్గుపడుచు, తండ్రి

గారు భోజనానంతరమున నిద్రించునపుడు విశ్వనాథశాస్త్రులవారి వీధి యరుగుమీఁదఁ గూర్చున్న రామచంద్రునియొద్దకు మెల్ల మెల్లఁగాఁబోయి యతనిప్రక్కఁ గూరుచుండెను. రామచంద్రుఁడును సిగ్గుచే వంచినతల యెత్తక నేత్రములనుండి బాష్పములు రాల గోడకు జేరఁగిలఁబడి యుండెను రాజగోపాలముకూడ మిక్కిలి విచారించుచు తనకు తానే ముందుగాఁ బలుకరించెను.

రాజ—రామచంద్రుఁడా! ఎందుకువిచారించెదవు; కాలవశమును గాని నీలోపములేదు. ఇంతలో జరిగినసంగతి నీ వామూలాగ్రముగ నాకుఁ దెలియఁజెప్పు. స్నేహితులవద్ద దాఁచవలసిన సంగతులుండవు గదా!

రామ—రాజగోపాలమూ! నీకుఁగూడ నామీఁద ననుమాన మున్నదిగదా. ఈవిషయమున నేదోషము నాయందులేదు. అని రామచంద్రుఁడు యావద్వృత్తాంతమును రాజగోపాలమునకుఁ దెలియఁజెప్పెను. అది విని రాజగోపాల మిట్లనియెను. [చింపలేదు.

రాజ—మా బాబయ్య తొందరపడినాడు. చక్కఁగా నాలో

రామ—నన్ను నీ రీతిగనుండి పొమ్మనుటలో నా కన్న పుత్రులకు లోపము వచ్చునని విచారములేదు. లోకములో నా మీఁద వచ్చిన యీనింద యాచంద్రతారార్కము పోదుగదా యనియు, నన్నందఱు దుర్మార్గుఁడనుకొందురనియు నాకువిచారముగా నున్నది. దాదాఁపుగ రెండుసంవత్సరములు మీయింటనున్నను, శరభ రాజుగారు నాగుణ మింతమాత్రము తెలిసికొనలేకపోయిరి. పయిగా నిన్నుగూడ పాడుచేయుచున్నాడని యన్నారు. ఈవిషయమయి నే నేమి యు నెఱుఁగను. వెంకటరత్నముచేయుచున్నమాయ నెఱుఁగక యందు లోఁబడిపోయినాను. ఏమొగముఁ బెట్టుకొని యీగ్రామమం దుందును; న్నెవ్వరు గుమ్మములోనికి రానియ్యరు. నాకన్నగతి యింతమట్టుకు

డతనియొద్దకువచ్చి యిచ్చకము లాడువా రందఱును దనకుఁ బ్రాణస్నేహితు లనిన వారందఱును లేశమును వానికి సహాయము చేయరైరి. రామచంద్రుఁడు సద్గుణుఁడనియు సత్ప్రవర్తనఁగలవాఁడనియు స్తోత్రము చేసిన వారిప్పు డితఁడు మహా దురాత్ముఁడని నిందించిరి. అప్పుడు సాయంకాలముకాఁగా దేవదర్శనముఁజేసి రామచంద్రుఁడు శాస్త్రుల వారి పీఁటయరుగుమీఁదఁ గూర్చుండఁగా నతని సహాధ్యాయుఁడొకఁడు వచ్చి రామచంద్రునితో నిట్లు మాటాడెను.

సహా—రామచంద్రుఁడూ! నీకు తటస్థ మయిన మహాపదను గూర్చి నాకు విచారముగానున్నది. నీ వమలాపురములోనే యుందువా? ఎక్కడి కయినను బోవఁదలఁచుకొంటివా?

రామ—నేఁడురాత్రి ముక్తేశ్వరము వెళ్ళిపోతాను. ఈయవమానమును నేను భరింపలేను.

సహా—నిజమే. నామాట విని నాలుగు గడియలు రాత్రియయిన తరువాత బయలుదేరి ముక్తేశ్వరమునకు వెళ్ళు. ఇఁక నీవీగ్రామమున నుండఁ గూడదు. నీకు నేనొకయుపాయము జెప్పఁ దలఁచుకొన్నాను. నీక్షేమముకొఱకే. నీయిష్టమైన పక్షమున వినుము.

రామ—అయ్యో! నీకేమి యీసమయమునందు నామేలు గోరువారు రాజగోపాలము నీవుగాక యింకెవరు?

సహా—నాతోఁగూడరా. అని చెప్పి యతఁడు రామచంద్రుని జెఱువుగట్టునకుఁ దీసికొనిపోయి యొకచెట్టుక్రిందఁ గూర్చుండెను. సందె చీఁకటిగనుక మొగమున ముసుఁగువేసికొని యుండిన మనుష్యులు కొందఱు పుచ్చుకొని తప్పతాగినకంటె ముందుగా వారి రాకను దెలియఁజేయ వచ్చి గట్టుక్రిందఁ గూర్చున్న సహాధ్యాయుని బట్టుకొని తలమీఁద దయదాక్షిణ్యములు లేక కొట్టుచుండిరి. అప్పుడు సహాధ్యాయుఁడు "నేనుకో, నేనుకో, కొట్టకండికో" యని కేకలు వేయుచున్నను స్మార

కము తెలియదుగనుక వారి కామాటలు తెలియక తమపని మాన రయిరి. అట్లు వారు తమపనిఁ గడతేర్చిపోయిన వెనుక రామచంద్రుఁడు తనకు సహాయము చేయవచ్చిన వాని కింత మహాపద గలిగినదని విచారించుచు నతనితల పగిలి రక్తమువచ్చుచున్నందున దానిమీఁద తడిగుడ్డవేయుటకు గుడ్డతెచ్చుటకయి చెఱువుగట్టునకు వచ్చెను. నీళ్లలో దిగి గుడ్డతడిపి మునుఁగఁబెట్టుచుండఁగా నొక చాకలివాఁడు పరుగెత్తుకొనివచ్చి రామచంద్రుని జూచి యిట్లనియెను.

చాకలి—అయ్యా! రాజగోపాలము గారు తమ కీచీటిని యీమాటను నిమ్మని చెప్పినారు. (అని రహస్యముగాఁ జెప్పి వెళ్లిపోయెను.)

రాజగోపాల మిచ్చిన యుత్తరమును జెఱువుగట్టున నెవరో దృష్టిఁ దీయుటకుఁ బెట్టిన గూటి మూకుడులో నున్న దీపముముందఱ చదువుకొనుచు బాధపడుచున్న సహాధ్యాయుని మొగముఁజూడక తిరిగి యక్కడకు రాక వెళ్లిపోయెను.

## ఏడవ ప్రకరణము.

శోభనాచలమును, వెంకటరత్నమును, వారి మిత్రమండలమును, రామచంద్రునిమీఁద కసిదీరక, యతఁ డారాత్రి ముక్తేశ్వరము వెళ్ళు ననుకొని, వారుగూడ వెంబడింపవలెనని నిశ్చయముఁ జేసిరి. రామచంద్రుఁ డారాత్రి విశ్వనాథశాస్త్రులవారి యింటికి భోజనమునకుఁగాని, పరుండుటకుఁగాని రాలేదు. శాస్త్రులవారి శిష్యులు గ్రామమునం దంతటను వెదకిరి కాని రామచంద్రుఁడుమాత్రము వారి కగపడలేదు. శాస్త్రులవారు రామచంద్రుఁ డేటిలోనో దిగి చచ్చినాఁడని యోచించిరి. రామచంద్రుని బట్టుకొనుట కద్దియు నాశిష్యులను వెంటఁబెట్టుకొని శోభనా

చల మారాత్రి జామయిన తరువాత బయలుదేరెను. ఎంతదూరము వెళ్ళినను రామచంద్రుఁడు వారి కగపడలేదుగాని చీఁకటిలో వచ్చుచున్న వారి కొకవిధమైన యాపద తటస్థమైనది. ఒక పురాతమార్గమునుండి కొంతదూరము పోయినతరువాత మార్గమునకిరుప్రక్కలను క్రిక్కిరిసి, యొకదానియగ్రము నొకటి స్పృశించి పొనరించినట్లు నల్లగాయియున్న దట్టమైన చెట్లక్రిందినుండి వారు నడచుచుండఁగా దైవవశమున శోభ నాచలమునకుఁ బాము కఱచెను. కఱచినతోడనే యతఁడు, తనతోఁగూడ వచ్చుచున్నవారి కాసంగతిఁ దెలియఁజెప్పి, యొకయడుగైనను బెట్టఁ జాలక, యొకచెట్టుక్రింద పయిమీఁదబట్టను బఱచుకొని పరుండెను. అక్కడ నౌషధము లేవియు లేవు. అతని చెలికాండ్రిద్దఱును శోభనా చలమునకయి విచారించుచు మార్గమున నెవ్వరైన వత్తురేమొ వారి సహాయము బుచ్చుకొందుమని రెండుగడియలు జాగు మానిరి. అప్పుడిఱు వది సంవత్సరముల వయస్సుగల యొకవైష్ణవుఁ డామార్గమునఁ బోవుచు, మాటిమాటికి వెనుకకుఁ దిరిగి చూచుచు, వీరు చిక్కుకున్న నక్కడ కొంతసేపు నిలిచి యాధ్వనికారణమును దెలిసికొనుచు ధ్వనియైనపుడెల్ల నులికిపడుచు, సన్ననైన పట్టునామములఁ బెట్టుకొని, శరీరమున ద్వాదశోర్ధ్వపుండ్రములు లేకయే, దక్షిణదేశపుపట్టుపంచె నొకటిఁ గట్టుకొని రెండవపంచెను తలమీఁదకు ముసుఁగువచ్చునట్లు శరీరమునిండఁ గప్పుకొని యామార్గమునఁ బోవుచుండెను. అతనిఁజూడఁగనే శోభనాచలము యొక్క స్నేహితు లిద్దఱును, సంతోషించి యతని సమీపమునకుఁ బోఁగా వైష్ణవుఁడు భయముతో వడవడ వణఁక నారంభించెను. అంతట వారిట్లు మాటలాడ నారంభించిరి.

ఒకఁడు—అయ్యా! మేము దొంగలము గాము. మీరు భయ పడ నక్కఱలేదు. మేము మిక్కిలి యవసరమైన పనిమీఁద ముక్తేశ్వర మునుండి యమలాపురమునకుఁ బోవుచున్నాము. దైవవశముచేత మా

యజమానుని బురుగు ముట్టుకొన్నది. తమకేమైన మంత్రము వచ్చిన పక్షమున నాయనను బ్రతికింప వేఁడెదము.

వైష్ణ—అయ్యయ్యో! నాకు మంత్ర మేదియు రాదు. నా దగ్గఱ మం దున్నది. ఆమనుష్యుని నన్నుఁ జూడనివ్వండి. ఆమందు నూరిపోస్తాను.

రెండ—తమపే రెవరండీ యాచార్యులుగారు.

వైష్ణ—రామానుజాచార్యులు. నన్ను మీ రేమైనా యెఱుఁగుదురా?

రెండ—ఎఱుఁగను. కాని మొగముచూచినట్లున్నది. అమలాపుర మెప్పుడైనా వచ్చినారా?

వైష్ణ—అమలాపురములో నన్ను మీరు చూడలేదు. మాది కాటిపాకకాఁపురము నీవు నన్నెఱుఁగవు, మాది యమలాపురముగాదు.

ఒకఁడు—అయ్యా! ఈలాగు దయచెయ్యండి. ఇదుగో పాము కఱచినమనుష్యుఁ డిక్కడ పడున్నాఁడు. బొటనవ్రేలిమీఁద కఱచినది. దేహమంతా చెమటలు పట్టినవి. కాలు వాఁచినది. నోటనుండి నురుగులు గ్రక్కుచున్నాఁడు.

వైష్ణ—స్మారకము తెలియునట్లున్నది. (అని దగ్గఱకుఁ బోయి చూచెను.)

సర్పదష్టుఁడైన శోభనాచలమును జూడఁగనె వైష్ణవునకు మొగమున వికాసము తప్పిపోయెను. శోభనాచలమునకు స్మారకము తెలియకపోవుట వైష్ణవున కావహించెను. ఆసేవకు లిద్దఱును శోభనాచలమున కెట్లున్నదనియు, మందువేయుమనియు వారనుచున్నమాట లతనికి వినఁబడవయ్యెను; కాని కొంతసే పాలోచించి ధైర్యము దెచ్చుకొని, మాటనున్నకుప్పె నొకదానిని రాతిమీఁద నరగఁదీసి మందుపోసి, మొద టమాటాదు కొంచెము పనిఁ జేయువఱకును వైష్ణవుఁ డక్కడనుండి, తా

నతిత్వరితముగా ముక్తేశ్వరము పోవలయునని వారితోఁ జెప్పి మఱిరెండు మోతాదుల యౌషధము వారికిచ్చి, రెండుగడియల కొకమారు మం దిమ్మనిచెప్పి తాను వెళ్ళిపోయెను. అతఁడు పోకముందే శోభనాచలము నకుఁ గొంచెము నెమ్మదిగా నుండెను. పొరబాటుచేత నావైష్ణవుఁడచటఁ దన తాటియాకులపుస్తక మొకదానిని విడిచిపోయెను. కొంతసేపటికి శోభనాచలమునకు చలివేసినందున, స్నేహితులిద్దఱును తాటియాకులను బోగుచేసి చలిమంటవేయుచు, దాని వెలుతురున నాపుస్తకమును జూచి యందులో దోపఁబడిన యొక తాటియాకు నీవలికిఁదీసి యందులో కొకఁడిట్లు చదువనారంభించెను.

“ఓ రామచంద్రుఁడా! శివరాత్రి యమలాపురమున నున్నపక్ష మున బ్రతుకలేవు. నీవొక సహాధ్యాయునితోఁ బయనమగుచున్నావఁట. వాఁడు నీస్నేహితుఁడుకాఁడు. శోభనాచలము మొదలగువారు నిన్నుఁ గొట్టవలెనని యోచించి నిన్ను చెఱువుగట్టునకుఁ దీసికొని రమ్మని వానిని బంపినారు. శివరాత్రి యకాయకిని ముక్తేశ్వరము వెళ్ళవలసినది. నేను బంపిన మూటలో తిరుచూర్ణము, తిరుమణి, దక్షిణదేశపుబట్టలు తేలు పాములవలని భయమురాకుండఁ గొన్ని మందులు నున్నవి. వైష్ణవ వేషమును వేసికొన్నపక్షమున వారు నిన్నానవాలు పట్టలేరు. నిన్ను నేను త్వరలోనే చూడఁగలను.” అని యామనుష్యుఁడు చదువఁగానె రెండవ వాఁడు నాలుక కఱచుకొని, చేయిజాడించుకొని విచారసూచకముగా నిట్లు మాటాడెను.

రెండ—అయ్యయ్యో! తెలివితక్కువ నిర్భాగ్యులము. ఇప్పుడు మనకు మందిచ్చిన యీవైష్ణవుఁడే రామచంద్రుఁడు. మనమెంత యదృష్టహీనులము! ఆకుఱ్ఱవాఁడు మంచి యదృష్టవంతుఁడు. వాఁడు చెఱువుగట్టునఁ గూర్చున్నప్పుడు మనము పంపిన మనుష్యులు త్రాఁగి రామచంద్రుఁడనుకొని మన మనుష్యునే కొట్టినారు. వాఁడు చెప్పినది

నిజమే. వీఁడు ముక్త్యేశ్వరమే వెళ్లుచున్నాఁడు. వీనిని దిగి తెలుసుకొని వెళ్లుదమా?

ఒకఁడు—వద్దు. వద్దు. ఈవల శోభనాచలముయొక్క స్థితి బాగుండలేదు. అవైష్ణవుఁడు తప్పకుండా రామచంద్రుఁడే. ఆహాహా! ఎంత మంచివాఁడో వాఁడు! శోభనాచల మతనికి పరమశత్రువైనను వానికెంతో మంచి మందులిచ్చి వాని ప్రాణము నిలిపినాఁడో చూడు. అతఁడూరకున్న పక్షమున శోభనాచలము చచ్చును.

రెండ—వాఁడు పరిక విరోధి. చావవలెనని మందులిచ్చినాఁడేమో. ఆమందు వేయవద్దు. అనక ప్రాణస్థితి రాఁగలదు. వాఁడు దొంగ ముండాకొడుకు.

ఒకఁడు—రాజగోపాలము కొన్ని మందులు పంపినట్టు తాను జాబులో వ్రాసినాఁడు. అవి మంచిమందులు. అవే రామచంద్రుఁడు మన కిచ్చినాఁడు. ఆతఁడు మహానుభావుఁడు. అతనికి మనము నమస్కరించవలెను.

రెండ—శోభనాచలమూ! ఇప్పు డేమిచేయుచున్నావు?

శోభ—మాయింటికిఁ దీసికొనిపోయి మాయమ్మను జూపించండి. నేను బ్రతుకను.

అంతట వారిద్దఱును శోభనాచలము నెట్లయినఁ దీసికొనిపోవలెనని యాలోచించుచుండఁగా నొకబండి యామార్గమునఁ బోవుచుండెను. ఆబండివాని కర్ధరూపాయినిత్తుమని చెప్పి శోభనాచలము నాబండిమీఁద నేసి తీసికొనిపోయిరి.

అట్లు శోభనాచలము మొదలగువారిచేతఁ దెలియఁబడకుండ దాఁటి రామచంద్రుఁడు ముక్త్యేశ్వరమునకుఁ బోవుచుండెను. ఆదినము కృష్ణపక్షనవమిగనుక పదునెనిమిదిగడియలరాత్రివేళకు, శత్రువులఁ దప్పించుకొని వచ్చినందులకు రామచంద్రున కుదయించిన యల్పసంతోషమువలెనే

చంద్రోదయమయ్యెను. కాని రామచంద్రుని ముఖవికాసమువలెనే చంద్ర కాంతియు, వికాసహీనముకాఁగా గ్రుడ్డివెన్నెలవచ్చెను. గ్రుడ్డిలో మెల్ల యన్నట్లు లాస్వల్పకాంతికే రామచంద్రుఁడు సంతోషించుచుండఁగా నప్పుడు త్రిభాగమందు చేటంతమబ్బు పట్టి, యాగ్రుడ్డివెన్నెలను దిగ మ్రింగుటయేకాక, యామబ్బు వృద్ధియై, మునుపటికంటెఁ బదిరెట్లెక్కు వ చీఁకటిని దెచ్చెను. శోభనాచలాద్రుల యంకీర్తనలవలెనే యంతకంత కాచీఁకటియెక్కువకాఁగా, రామచంద్రుఁడు గోదావరియొడ్డునకుఁ బో యి, రేవుకడ వీలైన పడవమీఁద దాఁటి యారాత్రి కోటిపల్లిపోవలెనని యోజనఁజేయుచు, దారితప్పి స్థలముగాక మఱియొకచోటఁ గూ ర్చుండెను. ఆకాశమునందలి నక్షత్రగణంబులున్నుఁ, దమస్వల్పకాం తులను గూడ నిచ్చుటమాని రామచంద్రుని స్నేహితులవలెనే క్రమ క్రమముగాఁ గనఁబడుటమానెను. అంధకార మంతకంతకు మిక్కుట మై, త్రోవనేకాక, యెదుటనున్న వస్తువునుగూడఁ గనఁబడనిచ్చుటలేదు. నల్లని మబ్బులును, మబ్బులలోనుండి మధ్యమధ్య గుండెలువ్రక్కలు చేయునట్లు బయలువెడలుచున్న యుఱుములును, మొగమునఁ గొట్టుకొండ వీచుచున్న ఝంఝామారుతములును, రామచంద్రుని మనస్సును గలఁచ నారంభించెను. తన్నుఁ గప్పుచున్న యిసుకచేత నది యిసుకతిన్నె యని యు, మహావాయువుచేతఁ గదల్పఁబడుచున్న తరంగముల ధ్వనిచేతఁ దన యెదుటనున్నది గోదావరియనియు, రామచంద్రుఁడు తెలిసికొనెను. అతఁ డక్కడఁ గూర్చుండి కొంచెము కాలుజాపఁగా కాలికేదో మెత్తమె త్తఁగాఁ దగిలెను. అది యేదో పరీక్షించి చూచునప్పటికి నది శవమే యయ్యెను. తన ముందున్న స్థలమంతయు బాగు చేసికొనుచుండఁగా చేతి కొక చిన్న యెముకముక్క గ్రుచ్చుకొనెను. అంతటితోఁ బోక కఱ్ఱతో నతఁడు తడవి యవతలఁ గొట్టఁగా నా దెబ్బ యెక్కకుండ మూఁడు దగుల నది ఫెడేలున పగిలెను. దానితో నాతని కాస్థలము శ్మశానమై యుండ

నని యనుమానము తోఁచెను. భయపడి పరధ్యాన్నముగా యోజించు
చున్న యాబాలునివెనుక చెవులు గింగురుమన నొకనక్క కూసెను.
అది కూయఁగానే యతని యనుమానము నిజమయ్యెను. అది శ్మశాన
మను నమ్మకముగలిగినతోడనే రామచంద్రునికి ముచ్చెమటలుపోసెను.
గుండె ఝల్లుమనెను. ధైర్యము చెదరిపోయెను. లేచి పారిపోవుటకైనఁ
గాళ్లలో సత్తువ లేక యుండెను. చేతులాడవయ్యెను. ఏపని జేయుటకును
తోఁచవయ్యెను. అతఁడు దీపములేదని విచారించుచుండెనుగాని, మధ్య
మధ్యవచ్చిన మెఱుపులు హానిభయమును దగ్గించి, ధైర్యమును హె
చ్చించుటకు మారుగా నారద్రభూములయందున్న సగముసగము కాలిన
కొఱవులను శవములను గాల్చిన స్థలములను, కట్టెతాళ్లను, కపాల
ములను రామచంద్రునికగుపఱచి భయమును వెయ్యిరెట్లధికముచేసెను.
అయర్ధరాత్రిమునం దా భయంకరమైన శ్మశానమందు గాఢాంధకార
మునం దొంటరిఁగాఁ గూర్చున్న యాకుమారునకు, భయంకరముగాఁ
జచ్చినవారిచరిత్రములును, ముసలమ్మలుచెప్పిన దయ్యములకథలును
నప్పుడప్పుడు తానువిన్న దయ్యముల రూపములును, జ్ఞాపకమువచ్చి,
భయోద్రేకముచేతఁ దన కక్కడనే మరణము కల్గునని రామచంద్రుఁడు
నిశ్చయించుకొనెను. నడుమనడుమమబ్బులనుండి మెఱుపులువచ్చి, క్రొత్త
వస్తువులను జూపించినస్మరవశముఁ జెందన యతని కప్పుడప్పుడు తెలివి
వచ్చి క్రొత్తసంగతులు జ్ఞాపకమై భయ మధికమగు చుండెను.

ఇంతలో రామచంద్రుని కన్నులనుండివచ్చిన నీళ్లవలెనే యాకా
శమునుండివర్షబిందువులు పడ నారంభించెను. చినుకు లంతకంత
కెక్కువై యాకాశము చిల్లిపడినట్టు కుంభవృష్టిగా నేనుఁగుతొండము
లావు ధారలతో వర్షము కురిసెను. ఆవర్షమున భూమి నంతను దేజో
వంతముగాఁ జేసిన యొక మెఱుపు వచ్చి, రామచంద్రునికన్నుల మిఱు
మిట్లు గొలిపెను. దానితోడనే దిక్కులు ప్రతిధ్వనులు సేయ బ్రహ్మాండము

బద్దలగునట్లు పెద్దపిడుగు పడెను. అప్పుడు రామచంద్రుడు తెలివిగా నుండుటచేత "అర్జునః ఫల్గునః పార్థః కిరీటి శ్వేతవాహనః" అనుశ్లోకము బఠించి పిడుగు తనమీఁదను రాకుండఁ జేసికొనెనుగాని, యామెఱుపుచేతఁ గన్నులకుఁ జూచునట్టిశక్తియుఁ జెవులకు వినునట్టి శక్తియుఁ దప్పి, నాల్గునిమిషముల వఱకును దిరిగి రాలేదు. కీడులో మేలన్నట్లు ప్రకాశమాన మైన యామెఱుపు వలన, నొక దిబ్బమీఁద వేయఁబడిన యొక తాఁటియాకులపాక వాని కగుపడగా, వర్షములోఁ గూర్చుండుట కష్టమని, గుడ్డలన్నియుఁ దడిసినందున గజగజ చలిచేత వణఁకుచుఁ బ్రాణములన్నిఁటికంటెను నెక్కువ పిపిగనుక నాబాధపడఁజాలక యాపాక మఱుఁగున తలదాఁచుకోవలెనని నిశ్చయించి లేచి మెల్లఁగాఁబోయెను. అక్కడకయినను వానిక మనస్థిమితము కలుగనందున పెద్దబానలవంటి కడుపులును, చిన్నతోఁకలును, వంకరకాళ్లును గల పిశాచములును, కామినీలును, బ్రహ్మరాక్షసులును, కన్నులకుఁగట్టినట్లు లాతనికి మానసవీథిని గనఁబడఁజొచ్చెను.

అప్పుడొక నల్లని బ్రాహ్మణుఁడు డంగవస్త్రమును గట్టుకొని యొక యంగవస్త్రమును మీఁదవేసికొని "నారాయణ నారాయణ" యనుచు పాకవైపునకు వచ్చుచుండెను. వానినిజూచి రామచంద్రుడు చేతిలో కొఱవి లేనందున కొఱవిదయ్యముగాదని నిశ్చయించి, యాబ్రాహ్మణుఁడు తిన్నఁగా నడచుచున్నను తనభయముచేత నతఁడువంకరగా నడచుచున్నట్లు కనఁబడినందున నేదో దయ్యమనుకొని తరువాత మనుష్యుఁడని యెఱిఁగి, శోభనాచలమో, వానిమిత్రులో తన్ను జంపుటకు వచ్చుచున్నారని భయపడుచు, నిశ్చేష్టుఁడై యుండెను. ఆబ్రాహ్మణుఁడు పాకలోనికి వచ్చి దుఃఖముతో "ఎంతపని జరిగినది. దైవమా!" అని విలపించుట చేతఁ దన శత్రుఁడుగాఁడని రామచంద్రుఁడు హీనస్వరముతో నిట్లు పలుకరించెను.

రామ—అయ్యా! మీ రెవరు బ్రాహ్మణులేనా?

బ్రాహ్మ—బ్రాహ్మణులమే. నీ వెవరవు ఇక్కడెందుకున్నావు?

రామ—నేనా ర్వేలనియోగుల చిన్నవాఁడను. అమలాపురము నుండి వచ్చుచున్నాను.

బ్రాహ్మ—అయ్యా! మేము వైదికులము. నేను మిక్కిలి బీదవాఁడను. నాభార్యయీవేళకు తొమ్మిదిదినముల క్రిందట ప్రసవమైనది. మగపిల్లవాఁడు కలిగినాఁడు. లేక లేక కలిగిన యామగపిల్లవాఁడీదినమున సందుకొట్టి చనిపోయినాఁడు. నాభార్యకు ప్రాణము మీఁదికి వచ్చినది. చచ్చినపిల్లవానిని దీసికొనిపోవుట కయినను, మాజాతివారును, మాబంధువులును, రాలేదు. కనుకదుఃఖముతో నేనే యీపసికూనను పాతిపెట్టవలసివచ్చెను. (అని యేడ్చుచుండెను.)

రామ—అయ్యా! దుఃఖపడకండి. మీరు పెద్దలు. అన్నియుఁ దెలిసినవారు. నావలెనే మీరును మహాకష్టవంతులు.

బ్రాహ్మ—నాయనా! నీకేమి కష్టములు కలిగినవి? ఇక్కడి కెందుకువచ్చినావు?

అని బ్రాహ్మణుఁ డడుగఁగా రామచంద్రుఁడు తనవృత్తాంతమంతయుఁ జెప్పి తనమీఁదికి వచ్చిన యాయపనిందయు, శరభరాజుగారు తన్ను సేవకొట్టుటయు, శోభనాచలాముల వైనమును దెలియఁజేయ బ్రాహ్మణుఁ డాశ్చర్యపడి యుతనికొఱకు విచారింప నారంభించెను. తరువాత వారిట్లు మాటాడిరి.

బ్రాహ్మ—పూర్వజన్మకృత మెవరు తప్పింపఁగలరు? నీవు మా యింటికివచ్చి రేపుమాయింటనుండి వెళ్ళుము. నీకు పాడిగుడ్డల నిచ్చి యీపూటకు కొంచెము చలిమంటవేస్తాను రా.

రామ—అయ్యా! నాకొఱకు నాశత్రువులు వచ్చుచుందురు. ముందు మీరు నడవఁడి మీ వెనుకనే నేనువచ్చెదను. ఎవరయిన వచ్చి

జాడ లడిగిన పక్షమున వెనుకనున్నావని చెప్పవద్దు. నాకేదో సంజ్ఞచే యండి. "రామానుజాచార్యులు" అని నన్ను పిలిచిన నేనుపారిపోఁగలను.

బ్రాహ్మ—నాప్రాణము నీప్రాణమున కడ్డమువేసి రక్షించెదను.

ఇట్లిద్దఱును పోవుచు గోదావరి గట్టుమీఁది కెక్కునప్పటికిజాము ప్రొద్దుమాత్రమేయున్నది. అప్పుడు తాఁటియాకులఁగొడుగు వేసికొని యొకపురుషుఁడు వెండిమురుగులు పెట్టుకొనియున్న చాకలివానిని వెంటఁ బెట్టుకొని వచ్చుచు తనయెదుట వచ్చుచున్న బ్రాహ్మణునిజూడక చీఁకటి చేత నాముసలిబ్రాహ్మణున కెదురుగాఁ బోయినందున గొడుగు ... గ్రుచ్చుకొనెను. బ్రాహ్మణుఁడును దెబ్బతగిలినందున 'అబ్బా యెవరు రా నీవు? చంపివేసినావు. కన్నులు కనఁబడవా?' అని యడిగెను. రాము. చంద్రుఁ డవివిని యెవరో వచ్చినారని దిగఁబడి రాడయ్యెను.

పురు—అయ్యా! చూడలేదు. క్షమించవలెను.

బ్రాహ్మ—నీదేయూరు? నీవెవరవు.

పురు—మాదమలాపురము. మీకీఱువ దేండ్లకుఱ్ఱవాఁ డగుపడినాఁడా?

బ్రాహ్మ—నేనెఱుఁగను. మీపిల్లవాఁడెవరో కావరో నాకుఁ దెలియదు. చేతిలో కఱ్ఱలూ మీరూ యెవరికొంపతిప్పుటకు వచ్చినారు. బుఱ్ఱలుపగులఁ గొట్టుటకు వచ్చినారా? దిక్కుమాల్నోళ్లారా?

పురు—అయ్యా! తిట్టకండి. మేమెవరిని గొట్టుటకు రాలేదు. వేరేపనియుండి వచ్చినాము. మీరు రాపిల్లవానిఁ జూచినపక్షమునఁ జెప్పండి.

బ్రాహ్మ—నేను జెప్పను. ఇప్పుడు మాగ్రామమునందు మా తల్లిదగ్గఱున్న వాళ్ళను కేకవేసి ... తగినట్లు బుద్ధిఁ జెప్పిస్తాను.

చాక—(కోపముతో) నోరుముయ్యి బాపనయ్యా! తొగసేలుగు తావేమి?

పురు—ఓరీ! ఆయనజోలికిఁ బోకురా. మనకు కావలసిన మనుష్యుఁడు దొరకలేదు. మధ్య నాముసలి బ్రాహ్మణునిజోలికి, వెళ్ళడమెందుకు?

బ్రాహ్మ—అయ్యో! దుర్మార్గుఁడా! నీకుకావలసిన వాఁడు దొరుకలేదూ? దొరికితే చంపివేస్తావా? నీకింత పాపిష్ఠికాలమేమిరా? అని మాటాడుచున్న బ్రాహ్మణునిదాఁటి యాక్రొత్తపురుషు లిద్దఱును ముందుకుఁ బోవుచుండఁగాఁ జూచి బ్రాహ్మణుఁడు "అలాగువెళ్ళడమెందుకు? అక్కడవాఁడు లేడు. అలావెళ్ళవద్దు. వద్దంటే మానవేమయ్యా" అని చెప్పెను. అతనియాటంకముఁజూచి యాపురుషులు రామచంద్రుఁడక్కడనున్నాఁడని నిశ్చయించి యటుపోవుచుండఁగా రామచంద్రుఁడు వారిబారిఁబడకుండ గబగబ పరుగెత్తసాగెను. ఈపురుషుని వెంటఁదరుముచు నెట్లయిన వానిని రామచంద్రునిగా నిశ్చయించి పట్టఁదలఁచిరి. కొంతదూరముపరుగెత్తి యాక్రొత్తవారిలోనొకఁడు "రామచంద్రుఁడా! నేను రాజగోపాలమును పరుగెత్తకు. నీవీలాగునరా. భయములేదు." అని పురుషుఁడు చెప్పఁగా రామచంద్రుఁడు ధైర్యముఁదెచ్చుకొని తన శత్రువులు రాజగోపాలముయొక్క పేరుఁబెట్టుకొనినా రనుకొని రాక మరల నాతని కేకను విని దగ్గఱకు వచ్చి రాజగోపాలమునుజూచిసంతోషించి యిట్లుపలికెను.

రామ—రాజగోపాలమూ! నీ వెందుకీరాత్రివేళ వచ్చినావు? నాకు సహాయము చేసినందులకు వీరాబోబయ్యగారు నిన్నుకూడ లేవఁగొట్టినారా యేమి?

రాజ—లేదు. చాకలివానిచేత మూట నీకుఁ బంపినపుడు నీకు లెక్క యేమైనఁ బంపడము మఱచిపోయినాను. పెట్టెలోనుంచి నాలుగురూపాయీలు తీసి యివతలఁబెట్టి చాకలివానిచేతి కిచ్చుట మఱచినాను. ఇది నాలుగురూపాయలు పుచ్చుకో. నీవు సురక్షితముగా వచ్చినావా?

రామ—ఏమిసురక్షితము? నావుతప్పి కన్ను లొట్టపోయినట్లున్నది. నేను నీయుత్తరమును జూడఁగానే కొంతసేపు చెఱువుగట్టుమీఁద నాగి కపటియయిన యాసహాధ్యాయుని జోలికిఁబోక మఱినాలుగు జాములకు బయలుదేరినాను. అప్పటికి శోభనాచలము ముందుగానే బయలుదేరి త్రోవలో—

రాజ—(మాటకష్టమువచ్చి) ఆసోది చెప్పకు నాకు ప్రొద్దుపోతుంది. మాయింటనందఱు నిద్రపోవుటఁగనిపెట్టి నేనిప్పుడు బయలుదేరినాను. నాపరుపుమీఁద నేను పరున్నట్లుగానె మొకదిండుపెట్టి మీఁద బట్టకప్పి యింటిదొడ్డి తలుపుఁ దీసియుంచి వచ్చినాను. మాబాబయ్య లేవకమునుపే నే వెళ్ళవలెను.

రామ—అయ్యో! నాకొఱకు నీవిట్లు శ్రమపడవలసివచ్చినదికదా?

అని రామచంద్రుఁడు పోకముందే రాజగోపాలమును చాకలివాఁడును బయలుదేరిరి. రామచంద్రుఁడు రాజగోపాలముయొక్క సద్గుణములను స్తోత్రముచేసి బ్రాహ్మణునితోఁ జెప్పుచు బ్రాహ్మణునియింటికిఁ బోయి పొడిబట్టలు కట్టుకొని సుఖముగా నిద్రఁబోయెను. మఱునాఁడు రామచంద్రుఁ డుదయమున గోదావరిలోస్నానముచేసి ముక్తేశ్వరస్వామివారిదర్శనము జేసి యాదిన మాబ్రాహ్మణునియింట వండుకొని భోజనము జేసి, కోటిపల్లి పోవుటకు సిద్ధముగానుండఁగా, బ్రాహ్మణునిభార్యకు బాలింతరోగము వచ్చి మరణమునకు సిద్ధముగా నుండెను. వరహా యిచ్చినఁగాని వైద్యుఁ డామెకొక్క మాత్రనైన వేయకుండుటఁ జూచి, నవనీతమువంటిహృదయముగల రామచంద్రుఁడు కనికరించి తనకు రాజగోపాల మిచ్చిన నాలుగురూపాయలును వైద్యునకిచ్చి యాబ్రాహ్మణునిభార్యకు మందు వేయించెను. రామచంద్రుని చేతిధనము వదలఁగానే బ్రాహ్మణుని భార్యకు రోగముగూడ వదలెను. బ్రాహ్మణుఁడు

రామచంద్రుని సాహాయ్యమున తనయాపదయను నది దాఁటెనుగాని, రామచంద్రునకుగోదావరినది దాఁటుట కెట్టిని యోగానిద్రైన లేదు. ధనములేక యోజించుచున్న రామచంద్రునకొక మంచియాలోచన దోచెను. పూర్వమొకనాఁడు తాను రాజవోలు వెళ్ళుచుండఁగా పడవ మునిఁగిపోయినపుడు ముక్తేశ్వర బ్రాహ్మణుని తాను రక్షించెను. అతఁడ నేక బహుమానములు తన కప్పు డిత్తు ననియును, ముక్తేశ్వర మొక్క పర్యాయము రమ్మని తన్ను బ్రతిమాలినసంగతియు, రామచంద్రునకు జ్ఞాపకము వచ్చి యాబ్రాహ్మణుని పేరు లింగరాజని తెలిసికొని, యట్టి స్నేహితుఁ డుండఁగాఁ దన కేక భయ మక్కఱలేదనుకొని లింగరాజు దగ్గఱకుఁ బోయెను. లింగరాజు రామచంద్రునిఁ జూచి యిప్పటికి రమా రమి యెనిమిది మాసము లయినందున, వెంటనే యతనిని యానవాలు పట్టఁజాలక కాఁబోలును, లింగరాజతనిఁ బలుకరింపఁ డయ్యెను. అవ సరము రామచంద్రునిదే కనుక తుద కతఁడు మానము విడిచి మాటాడెను.

రామ—లింగరాజుగారూ! నన్నెక్కడనైనఁ జూచినట్లు జ్ఞాపక మున్నదా?

లింగ—మొగముఁ జూచినట్లు జ్ఞాపక మున్నది కాని యెవరో చెప్పఁజాలను. మీ దేయూరు

రామ—మాదమలాపురము కాఁపురము. నాఁడు పడవ మునిఁగి పోయినపుడు—

లింగ—(మాటకడ్డమువచ్చి) ఓహోహో! నీవఁటయ్యా? నాఁడు పడవ మునిఁగిపోయినపుడు నీవుకూడ పడవలో నున్నావుకావూ. నాకా సంగతి జ్ఞాపకమా. అది యేమాత్రపు గొప్పసంగతి. నూరువ్యవహారము లలో నాకది జ్ఞాపకము రాదు. అయితే నివిప్పు డిగ్రామ మెందుకు వచ్చినావు.

రామ—నిన్న నొకబ్రాహ్మణునియింట వంటఁ జేసికొని భోజనము జేసినాను. మీదర్శనము చేయవలెనని వచ్చినాను. మీరొక సహాయము చేయవలయును.

లింగ—ఏమిపనిమీఁద వచ్చినావు. అది యేదో చెప్పు. నా సాధ్యమయినపక్షమునఁ జూచెదను.

రామ—నేను కార్యాంతరమున కోటిపల్లి వెళ్లుచున్నాను. నాకు మీరు నాలుగురూపాయిలు బదులిప్పించవలయును. నాలుగు మాసములలోఁ దిరిగి యిచ్చివేయఁగలను.

లింగ—అయ్యో! ఇప్పుడేమీరు రాకముందు నూఱురూపాయిలుండఁగా నొక పెద్దమనుష్యుఁడు వచ్చినాఁడు. ఒకఘడియ క్రిందవచ్చిన పక్షమున కావలసినన్ని రూపాయిల నిత్తును. నాలుగు కాకపోతే మఱి నాల్గు పుచ్చుకొనవచ్చును. మీ రెక్కడికిపోతారు. నే నెక్కడికిపోతాను. అయ్యయ్యో! రాకరాక మీరు వచ్చి యడుగఁడము నాదగ్గఱ సమయమునకు లేకపోవడము సిగ్గుగనున్నది.

రామ—సరిసరి. మీకు సిగ్గెందుకు. అదినా యదృష్టము. మీరేమిచేయఁగలరు పోనీ! రేపేమయిన సద్దినసంటు యీగ్రామములో నుంటాను.

లింగ—ఉండు. ఏమయిన లెక్క దొరకిన పక్షమునఁ జూచి యిస్తాను.

ఈప్రకారముగా లింగరాజుదగ్గఱ నాలుగువేలరూపాయిలున్నను దనకు మహోపకారము జేసిన రామచంద్రునకు నాలుగురూపాయిలు బదులిచ్చుటకుఁగూడ నతనిమనసు సమ్మతింపదయ్యెను. ధనమీయకున్నను మర్యాదార్థము రామచంద్రుని భోజనమున కుండుమనియైనఁ జెప్పఁడయ్యెను. ఆమరునాఁడు శరభరాజుగారియింటనుండి రామచంద్రుఁడు వచ్చుటకుఁ గారణ మేమని లింగరాజడుగఁగా రామచంద్రుఁడు సత్య

కాలపు మనిషిగనుక యున్నదున్నట్లు మాయమర్మములు లేకుండఁ జెప్పెను. మూఢవనాఁడు రామచంద్రుఁ డేదో యొకటి నిశ్చయముగాఁ దెలిసికొని లింగరాజువద్ద సెలవుపుచ్చుకొనిపోవలెనని యింటికివచ్చు నప్పటికి లింగరాజొక సంచి రూపాయిల ముందు వేసికొని పేరూరినుండి భూమి తాకట్టుపెట్టుటకు వచ్చిన యొక యరవ బ్రాహ్మణునితో వడ్డిని గురించి ముచ్చటించుచుండెను. రామచంద్రునిజూడఁగానే యతఁడాధన మును జూచుటచేత నసూయచేమోమువంచి భయపడి మహాకోపమువచ్చి దగ్గఱనున్న కుమారునిజూచి "విధవా! తలుపువేయుమని యెన్నిమాఱులు చెప్పినను వేయవుగదా" అని వాని రొక్కమప్పుడుచుట్టి లోపల సర్దుకొను చుండెను. అప్పుడు రామచంద్రుఁడు వానిని బలుకరింపఁగా వారిట్లు మాటాడిరి.

రామ—అయ్యా లింగరాజుగారు! తమకునేను జ్ఞాపకమందనదిగాఁ బోలును. నేను నాలుగుదినములనుండి తమకొఱకు నిరీక్షించియున్నాను. ఏదైన దయచేయించిన పక్షమున సెలవుపుచ్చుకొని వెళ్ళిపోయెదను.

లింగ—(అసూయతో) నానిమిత్తమై యెవరు నిన్ను నిరీక్షించుమన్నారు. నీపనిమీఁద నీవుండి నాకొఱకు నున్నాననియెదవేమి? నీకు రూపాయి లెవరు పోగుచేసికొని కూర్చున్నారు? ఈరూపాయి లెవనికిసొమ్మని నీకివ్వను? ఊళ్ళోబ్రాహ్మలు సొమ్మిచ్చినపక్షమున వాళ్ళేమనుకుంటారు?

రామ—తమదగ్గఱ లేకపోయినపక్షమున మరెక్కడనైన బదులిప్పించండి. మీరిప్పించియుంటే నా కవసరముబడితే వాపసిస్తాను. రెండు నెలలలోఁ దీర్చఁగలను.

లింగ—నాకెవరిస్తారు? నీవేలాంటివాఁడవో నేను నాలాంటివాఁడనే యేలినాటిశనిలాగున పట్టుకొని వదలకుండ నున్నావేమి? దీనికి వేళాపాళ లేదా? పోయవసరమే నిదా

రామ—ఆదినము పక్షమునిండినప్పుడు మిమ్మునే బ్రతికించఁగా

నాకు బహుమానము చేయుదుమని ముక్తేశ్వరము రమ్మనుమన్నారు గదా? నాలుగురూపాయలు బహుమతైన నివ్వలేరండీ?

లింగ—నీవు నన్ను బ్రతికించినావా? శరీరమంతా కాట్లకుక్కవలె తెగఁగఱచి వదలిపెట్టినావు. ఆపుండ్లు నాలుగుమాసములవఱకు మానవేలేదు. ఒకనినొకఁడు బ్రతికించఁగలఁడా చంపఁగలఁడా? దైవానుగ్రహమున్నదికనుక నేను బ్రతికినాను. నీకు బహుమానమియ్యడము నాకు విధిగాదు. దయాధర్మభిక్షము. ఇచ్చియున్నాను లేకపోతే లేదు.

రామ—అసంగతి నిదవఱకే చెప్పినపక్షమున నేను వెళ్ళిపోదునే. ఇన్నిదినములు నన్ను తోపుమాపని తిప్పుటయెందుకు?

లింగ—నోటికి సుద్ది బద్దము లేదని? నేను నిన్నుండమన్నానా పొమ్మందరని మొదటనే చెప్పినాను. అమలాపురములో దొంగవస్తువులమ్మి మాయూరఁ బాడుచెయ్యవలెనని వచ్చినావా? నిన్ను గుమ్మములోనికి రానియ్యఁగూడదు. ఇంతింత బుద్ధులుచెప్పుటచేతనే ధర్మరాజువంటి శంభురాజుగారు నిన్ను లేవఁగొట్టినారు. నేనొక దమ్మిడినైన నివ్వను. నాయింటికి నీవు రావలసినపనిలేదు. నడునడు.

అని లింగరాజుగారు చెప్పఁగానే గంపంత యాశఁబెట్టుకొన్న రామచంద్రునకుఁ గోపవికారము లొక్క సమయమునందే పుట్టెను; కాని కోపమును గనఁబఱచుటకిది సమయముగాదు కనుక తన స్వాధీనములో నున్న వికారమును మఱియొకమాఱుదెచ్చుకొనెను. లింగరాజువంటి పరమవిశ్వాసఘాతకుఁడెక్కడైన నుండునా? పడవమునుఁగుటకు సిద్ధముగా నున్నప్పుడు తాను రామచంద్రునెన్నివిధములఁ గాపాడుకొని వేడుకొనెనో నేఁడన్నివిధముల దయదాక్షిణ్యములులేక కసరికొట్టెను. అతని కేప్రకారముగ మనసుతాళెనో తెలియదు. రామచంద్రుఁడు తన కనుపడఁగానే యతనిని జ్ఞాపకము దెచ్చుకొనియు, లింగరా జెఱుఁగని వానివలెను జ్ఞాపకములేనివానివలెను నటింప నారంభించెను. తన ప్రాణ

సంరక్షణఁ జేసిన రామచంద్రునకు తానుబహుమానము లిత్తుననియుఁ దన యావదాస్తి నిచ్చినను ఋణముతీరదనియుఁ జెప్పి వానిని ముక్తేశ్వరము రమ్మని చెప్పిన లింగరాజు నాలుగుమాసాయి లతనికి బదులైన నివ్వలేక యతిదీనముగ నున్న యాపిల్లవాని సనవాని మాటలని దరికిఁ జేరకుండఁ గొట్టెను. లోకములో నిట్టి లింగరాజు లనేకులున్నారు. ఆశ్చర్యమేల?

ఇట్లు నిర్విణ్ణమనస్కుఁడై యాశాభంగముచేత నాకస్మికదుఃఖము గలిగి పనిపాటలు లోకవృత్తి లేక గోదావరిదగ్గరఁ గూర్చుండి రామచంద్రుఁడిట్లు విచారించెను.

"హా! దైవమా! మాచిరాజు శ్రీరాములుగారి గర్భమునఁ బుట్టి యాగర్భశ్రీమంతుఁడనైన నాకు జీవనోపాధికొక కానియైన లేకుండఁ జేసితివి. నేనెక్కడ పాపముఁ బెట్టితినక్కడ నిర్ధూమధామ మగుచున్నది. నాకుమరణమైన నేల కలుగఁజేయవు? ఎన్నిదినము లన్నవస్త్రములు లేకుండ బాధపడఁగలను? మాతండ్రిగారు పోయినది మొదలుకొని యీనాఁటివఱకుఁ గష్టమే కాని సుఖమెఱుఁగను. నావంటి దిక్కుమాలినవాఁడు ప్రపంచమునందెవ్వఁడు లేఁడు. కడుపులోనున్న దుఃఖమునంతను జెప్పుకొందమన్న నిరువురి మిత్రుల బంధువు లన్నమాట లేరుగదా. ఈశ్వరా! ఇప్పటికైన నీకు నామీఁదఁ గనికరము లేదుగాఁబోలును." అని కన్నీళ్లు కాలువలుగట్ట నేడ్చుచుండెను. ఇటువంటి పాపబ్రతుకు బ్రతుకుటకంటెఁ బ్రాణత్యాగము చేసికొనుట మంచిదని తనకష్టము లంతముఁ జేసికొనఁ దలఁచి, దుఃఖతాపముచేతఁ గల్గిన బాధ చల్లనియా నదీగర్భమునందుఁ బ్రవేశించి తీర్చుకొననిశ్చయించెను. అప్పుడు ప్రదోషకాలమగుటచేత ముక్తేశ్వరస్వామివారి దర్శనమునకుఁ బోయి, యీశ్వరదర్శనముచేసి కడపటిసారి యాదేవునకు మనసుదీర మ్రొక్కి తనకువచ్చిన స్తవములన్నియుఁ బఠించి దేవునకెదురుగాఁ గూర్చుండి తాను గవిత్వము చెప్పఁగలవాఁడే

కనుక తన హీనావస్థను దెలుపుకొనుచు నీక్రిందిపద్యములతో నీశ్వరుని స్తుతించెను.

చ. కడపితి నింతకాలమును ♦ గష్టచయంబుల నొందుచుంటి బూ
పుడమిని మాతృగర్భమునఁ ♦ బుట్టినదాది సుఖింప లేదు నీ
యడుగుల నాశ్రయించి యికనైన సుఖింపఁగఁ గోరుచుంటినా
యెడఁ గరుణించి వేగముగ ♦ నీయవె మోక్షసుఖంబు లీశ్వరా.

చ. జనకుఁడు నీవె నాకు సతి ♦ శైశవమందె గతించెఁ దల్లియున్
మనమున నన్నుఁ గూర్చి యొకమాత్రము పొక్కెడువారు లేరు నే
ననయము చేయిఁ జాపుకొని ♦ యన్యులపంచల నుండఁజాల నో
యనఘ! కటాక్ష ముంచి వడి ♦ నంతముఁ జేయవె కష్టజాలమున్.

ఆ. వె. అనఁగరానివాని ♦ నడిగితి ద్రవ్యంబు
చేయరానిపనులఁ ♦ జేసినాఁడ
నన్నవస్త్రములకు ♦ ననఘ! నన్ను క్షమించి
ముక్తినీయవయ్య ♦ భక్తవరద.

ఈశ్వరా! నేనిదివఱ కనేకపాపములను జేసినాను. నన్నేగతి కంపినను భారము నీదే. ఈదిక్కుమాలిన ప్రాణసంరక్షణార్థ మనేకులకు బాధ నిచ్చినాను. నేఁటితో నాకష్టములన్నియు గట్టెక్కఁగలవు. కరుణించి నీసాన్నిధ్యమునుమాత్రము జేర్పుము. ఇదిగో నాచివరనమస్కార మందుకో" అని చేతులుజోడించి మ్రొక్కి మరల "నాకష్టములన్నియు సత్ప్రవర్తనమువల్లఁ గలిగినను నాకెన్నిజన్మములకైన సత్ప్రవర్తనమే దయచేయుము. నా కనేకోపకారములను జేసిన రాజగోపాలమును రక్షింపుము" అని గుడివదలి గౌతమీనదియొడ్డునకుఁ బోయి, బలవన్మరణము, పాపహేతువని యెఱిఁగియు దుఃఖములచేత నామాట మఱచిపోయి వంశమునకుఁదానొక్కఁడే కనుక తలిదండ్రులకుఁ గడసారి తర్పణము వదలి బట్టబిగియఁ గట్టుకొని నడుమున కుత్తరీయమును జుట్టి జందెము

మెడకుఁ జుట్టి నదికి నమస్కారము జేసి కంఠములోఁతు నీళ్ళవఱకును బోయెను. పోయి యక్కడ నిలుచుండి యెక్కడనో తాటిపాకలోఁ బుట్టి యతిసుకుమారముగాఁ బెఱిగి రాజగోపాలు మేనమామయుండను గొన్నాళ్ళుండి, యమలాపురమునఁ జదువుకొనుటకు వచ్చి యపనిందపాలై ముక్తేశ్వరము వచ్చి గోదావరిలో బలవంతముగాఁ జచ్చుచున్న తన్నుగుఱించి విచారించి రాజగోపాలమును దలఁచుకొని యొకమాఱును మేనమామను దలఁచుకొని యొకమాఱు నేడ్చి చూచిచూచి యింతనిండుప్రాణము నిట్లు పోఁగొట్టుకొందునా యని భయపడి నాలుగడుగులు వెనుకకువచ్చి, చచ్చెడివానికి భయ మెందుకని మరల లోఁతునకుఁ బోయి, యెవరును లేరుగదా యని నాలుగుమూలలఁ బారఁజూచి, కన్నులు మూసికొని "హా దేవా" యని గుభాలున లోఁతునీళ్ళలోఁ జేతులజోడించుకొని మునిఁగిపోయెను.

అతఁ డొకమాఱు మునిఁగి యీఁతవచ్చినవాఁడు గనుక వెంటనే నీళ్లుత్రాగక తేలెను. అప్పు డొకమనుష్యుఁడు తడిగోచితో వచ్చి రామచంద్రుని జుట్టుపట్టుకొని మొలలోఁతునీళ్ళవఱకును దీసికొనివచ్చి యక్కడ వానిని నిలువఁబెట్టి తానును నిలుచుండెను. అతనిని జూచి రామచంద్రుఁడు నిర్ఘాంతపడి కొంతసేపటికి "నీ వెవ్వఁడ"వని యడుగఁగా నామనుష్యుఁ డిట్లు చెప్పెను. "అయ్యా! నేను పల్లెవాళ్ళ చిన్నవాఁడను. నేనును, మావాళ్ళు కొందఱును భద్రాచలమునుండి కలప తెప్పలుకట్టి సీలపల్లి తీసికొనిపోవుచున్నాము. గడియప్రొద్దువేళ మాపిల్లవాఁడు రేవులో నీఁతలాడుచు చేతియున్న వెండియుంగరమును బాఱవేసినాఁడు. రెండుగడియలుక్రిందట నేను నీళ్ళలో మునిఁగి యావస్తువునిమిత్తము ముణుఁగు గూర్చుండి వెదకుచున్నాను. ఇదిగో వస్తువు దొరకినది. నేను నీటిలోనుండి బయటికివచ్చినప్పటికి మీరు తేలి మునుఁగుచున్నారు. తక్షణమే నేనువచ్చి జుట్టుపట్టుకొన్నాను. నావస్తువేకాకుండ బ్రాహ్మ

ణుని బ్రతికించిన పుణ్యముకూడ దక్కినది. బాబూ ! నేను సెలవుతీసి
కొని తెప్పమీఁదకు వెళ్ళుతాను."

అని పల్లెవాఁడు చెప్పఁగా తాను బలవంతముగాదిగినట్లువానితోఁ
జెప్పక నీవు మంచివాఁడవు. నాప్రాణ మీదినమున రక్షించినావు. అని
వానిని బంపి తానును మెల్ల మెల్లఁగా బట్టలారవేసికొని బ్రాహ్మణుని
యింటికిఁ బోవుచు నిట్లాలోచించుకొనెను. "నేనుజచ్చిపోవుట దేవునకిష్ట
ములేదు. నేనేదో గొప్పయదృష్టమునకే బ్రతికినాను. నేఁటికి చావను.
నామీఁద దైవమునకు సంపూర్ణముగా ననుగ్రహముగలదు." అని
నిశ్చయించుకొని, బ్రాహ్మణునియింటికిఁ బోయి పుగుడు వెళ్ళిపోయినది
గనుక వానితోఁగలిసి భోజనముచేసి రేపుదాఁటుటకు సొమ్ములేదని
యారాత్రితోఁ జెప్పి కొంచెముసొమ్ము గలదేమో యని సిగ్గుపడుచు
నడిగెను. భూలోకమునం దవతరించిన కుచేలుఁడగు నాబ్రాహ్మణుఁడు
గృహదారిద్ర్యమగుటచేత సొమ్ములేక ప్రతిబింబ నొకకోమటివద్ద
తాకట్టుపెట్టి పదునాలుగణాలు తెచ్చి రామచంద్రునకిచ్చి క్షమింపుమని
వేఁడుకొనెను. ఉదయమున లేచి రామచంద్రుఁడు రేవుదాఁటి కోటిపల్లి
వెళ్ళెను. గోదావరిలోఁబడి తేలుటచేఁ దనకష్టమునుండి తాను
తేలినట్లు రామచంద్రునకుఁ దోఁచెను. కోటిపల్లివెళ్ళి రామచంద్రుఁడు
మహారాజుగారియొద్ద నేదైన నుద్యోగము దెచ్చుకొనవలెనని యోచిం
చెను. కోటిపల్లి శ్రీమద్విజయనగరపుమహారాజుగారిది. మహారాజుగారు,
రాజధానియగు విజయనగరము నందుండి యుద్యోగస్థుల మూలమున,
కోటిపల్లి సంగతియంతయుఁ దెలిసికొనుచు నప్పుడప్పుడా గ్రామమువత్తురు.

## ఎ ని మి ద వ ప్ర క ర ణ ము.



రామచంద్రుఁడు కోటిపల్లి వెళ్ళిన పూఁట, గుణములయందు రాజమ్మకప్పగారుగానుండఁదగిన యొకపూఁటకూటి పెద్దమ్మయింటభోజనము చేసెను. ఏరాగాగైన నొకచిన్నయుద్యోగమును సంపాదించుకొనవలెనని యతని కిష్టము గల్గియున్నదికాని తన కుద్యోగమునిచ్చువారును నిప్పించువారును లేరు. కోటిపల్లి పరగణాకు శ్రీవిజయనగరపు మహారాజుగా రధికారులుగనుక వారా పరగణాకు వల్లూరి శంకరరావుగారిని ప్రధానోద్యోగస్థునిగా నేర్పఱచిరి. ఆయన సద్గుణసంపన్నుఁడును, ధర్మకార్యనిరతుఁడును, బహుజనోపకారియునై మిక్కిలి కీర్తిఁగాంచెను. విజయనగర రాజ్యవిస్తారకులు ప్రస్తుతపు విజయనగరపుకోటఁ గట్టించిన ధన్యులు నగు శ్రీవిజయరామగజపతిమహారాజుగా రాకాలమున దేశమును బరిపాలించుచుండిరి. శంకరరావుగారి యధికారముక్రింద నున్నప్పుడు కోటిపల్లి పరగణా మిక్కిలి యభివృద్ధి నొందుచు వచ్చెను. రామచంద్రుఁ డాశంకరరావుగారి దర్శనము చేయించుమని కచేరిలోనున్న యుద్యోగస్థులలోఁ గొందఱి నాశ్రయించి ప్రతిదినమును వారివీధియరుగులమీఁద సర్వకాలములయందుఁ గూర్చుండుచుండెనుగాని వారు మాటలతోనేకాని క్రియలతో నాతనిని సంతోషపెట్టరైరి. తుదకుఁ బ్రాణము విసిగి రామచంద్రుఁడు తానే స్వయముగా శంకరరావుగారినిఁ జూడవలయునని యాలోచించి గుమ్మముదగ్గఱకు వచ్చి లోపలికిఁ బోవుటకుఁ బ్రయత్నించెనుగాని గుమ్మముముందట వెండిబిళ్ళలనువేసికొని పులితోలు ధరించి పూర్వాధికారమును జరుపుచున్న రాజభటులా నిరుపేదపిల్లవానిని లోనికిఁ బోనియ్యరైరి. రాజభటుఁ డొకఁడు శంకరరావుగారు నిద్రించుచున్నారనియు, మఱియొకఁడు క్రొత్తమనుష్యుని రానిచ్చినయెడ

మున పంతులవారు కోపింతురనియు, వేఱొకఁడు పంతులవారు వ్యవహారమును జూచుచున్నారనియుఁ జెప్పి యందఱు వాని సభ్యాంతరపెట్టిరి. ఒకభటుఁడు రూపాయి తన కిచ్చినచో రామచంద్రుని లోపలికిఁ దీసికొని పోదుననియు, మఱియొకఁ డర్ధరూపాయి యిచ్చినఁ దీసికొనిపోదు ననియు వారందఱు బేరములనాడ నారంభించిరి. లంచముల నిచ్చి రామచంద్రుఁడు శంకరరావుగారి దర్శనము చేయుట కిష్టములేక గుమ్మముముందఱ నాల్గుదినములు పడియుండియు, తుదకు కలఁడు పంతులవారి దర్శనము దొరకనందున విచారాక్రాంతుఁడై యుండెను. పూటకూటియింటనుండుటచేత తాను దెచ్చిన పదునాల్గురూపాయలును వ్యయమయ్యెను. రామచంద్రుఁడు కోటపల్లి గ్రామము ప్రవేశించిన యయిదవదినము సాయంకాలమునందు శంకరరావుగారు కుడిభుజముమీఁద నెఱ్ఱనిరుమాలు నెడమభుజముమీఁద నుప్పాడలోఁ బుటమాయించి నేయించి చలువచేసిన సన్నని జరీయుత్తరీయమును వైచి చేతిలో వెండిపొన్నగల యొకసన్నని సన్నపేపబెత్తమును బట్టుకొని, టక్కుటక్కుమని తొడుగుకొన్న ముచ్చెలు ధ్వనిఁ జేయ రాజభటుఁ డొకఁడు ముందుగా నడచి యెదుట వచ్చుచున్న మార్గస్థులనందఱ నొత్తిగించుచుండ, నెవరితోడనో మాటలాడుచు, గోదావరియొడ్డునకు చల్లగాలి నిమిత్తము వచ్చిరి. సమయమును నిరీక్షించి రామచంద్రుఁడు పంతులుగారి వెంటనే వచ్చి యాతనివైపు తిరిగి నపుడు నమస్కరించెను. శంకరరావుగారును తిరిగి నమస్కరించి రామచంద్రుని వృత్తాంత మడుగఁ గతఁ డామూలాగ్రముగా తన చరిత్రమును వినిపించెను. దానిని శంకరరావుగా రొకచిత్రమైన కథవలె విని యాశ్చర్యపడి రూపురేఖావిలాసములను బట్టి యాతఁ డొకగొప్పయింటివాఁడనియు హృదయ మిచ్చి మాటాడుటచేత నతఁడు నిర్దోషియనియు, చూపులనుబట్టిచాకచక్యము గలవాఁడనియుఁ దెలిసికొని తమకచ్చేరియందిరువది రూపాయలపని యుండఁగా దాని నతని కిచ్చిరి. ముత్యాల

కోవవలెనున్న యతనివ్రాఁతయు, పనియందుగల శ్రద్ధయు, పై యధికా
రులయందుఁ గలిగిన విధేయతయును శంకరరావుగారికి రామచంద్రుని
యందు దయఁ గలిగించెను. తనపని యతివేగముగా ముగించుకొని రామ
చంద్రుఁడు కచ్చేరీలోనున్న మందమతులయొక్కయు, సోమరిపోతులయొ
క్కయు, పనులు గూడ చేసిపెట్టసాగెను. శంకరరావుగారు తప్ప కచ్చేరి
లోనున్న యుద్యోగస్థులందఱును లంచగొండులయి ప్రజలను గ్రహము
లవలె పీకుకొని తినుటచేత రామచంద్రుని కాకార్య మయిష్టమగుటచే
లంచముల గ్రహించువారిని మందలించుచు, బాధఁబడుచున్న బీదకాఁపు
లకు సహాయముచేయుచు, నాతఁడు జనసమ్మతమైన పురుషుఁడయ్యెను.
శంకరరావుగారికి తరువాతి యుద్యోగస్థుఁడు దామరాజు పద్మనాభము
గారు. శంకరరావుగారికి నెలకు రెండునందలయేఁబదిరూపాయిలజీతము.
పద్మనాభముగారికి నెలకు నూటయేఁబది రూపాయిలజీత మున్నను
నతఁడు లంచగొండులకెల్ల నగ్రగణ్యుఁడై, తనకుఁ గావలసి నన్ని లంచ
ములను గ్రహించుచు, క్రిందియుద్యోగస్థుల కిప్పించుచు, భార్యమెడలో
నగలువిగవేసి లక్ష్మితోఁ దులతూఁగుచున్నందున. రామచంద్రుఁడు లంచ
ములపేరియున వినఁడుగనుక వారికందఱకుఁ బరమశత్రుఁడై యుండెను.
దేశమునన్నున్న కాఁపులందఱును, తమయిండ్ల కర్మములఁ జేయించి
యాచించు బ్రాహ్మణుల నెట్లో స్వల్పదానములచేతఁ దృప్తిపఱచుచుండిరి
కాని, తమయిండ్లకు నన్నఁడునురాని మాటమాటికి పాదపూజలు డెమ్మని
పత్రికల నంపుచుఁ దమ కుపవాసవ్రతము నేర్పుచుఁ గచ్చేరీలోనున్న
యీబ్రాహ్మణోత్తములను నెంతో ధనమిచ్చి ప్రార్థించియు, వారియను
గ్రహపాత్రులుగానే యుండిరి. ఈకారణములచేత రామచంద్రుఁడు
చిన్న యుద్యోగస్థుఁడయ్యు తనకంటె ననేక రెట్లెక్కువ జీతముకల
గొప్పయుద్యోగస్థులకుఁగూడ ప్రక్కలో బల్లెమై, తనపేరు చెప్పిన
మాత్రమున వారు భయపడునట్లు ప్రవర్తించుచుండెను. తక్కువ

వాఁడైనను సన్మార్గుఁడు, గొప్పవాఁడైన దుష్టునకు భయహేతువేకదా. రామచంద్రుఁ డాయుద్యోగమునకుఁ బ్రవేశించిన యారుమాసములకే శంకరరావుగా రతనికి ముప్పదిరూపాయిలపని నిచ్చిరి. రామచంద్రుఁడు చెప్పినను దురదృష్టవంతుఁడై గనుక నింతలో మహారాజుగారు శంకరరావుగారిని నాలుగునందలరూపాయిల జీతముమీఁద విజయనగరమునకు రమ్మని యుత్తరువుఁ జేసిరి. శంకరరావుగారు వెంటనే ప్రయాణమై శ్రీ మహారాజుగారితో రామచంద్రుని సత్ప్రవర్తనాదులఁగూర్చి విన్నవింతుమనియు, త్వరలో నతని నభివృద్ధికిఁ దెత్తుమనియు, వాగ్దానముచేసి వెళ్ళిరి. ప్రాంతికులు వెళ్ళిపోవుచున్నందునను మిగిలినవారు తనకు శత్రువులగుటను రామచంద్రునకు శంకరరావుగారి పోక విచారముగా నుండెను. లంచగొండుల కంకుశమువలెనున్న శంకరరావుగారు వెళ్లిపోయి నందులకు సంతోషించుచున్న చిన్నయుద్యోగస్థుల యదృష్టమువనో రామచంద్రుని దురదృష్టమువనో శంకరరావుగారి యుద్యోగము పద్మనాభముగారి కయ్యెను. పద్మనాభముగారు క్రొత్తయధికారమును వహించఁగానే, రామచంద్రునియందు క్రోధమును గూడ వహించి యతఁడు చక్కఁగాఁ బనిఁజేయుచున్నను, సోమరియనియు, నవిధేయుఁడనియు, పెంకెవాఁడనియు, వ్రాసిన దెల్ల తప్పనియుఁ దిట్టుచు, మహారాజుగారికీసంగతిఁ దెలియఁజేతునని బెదరించుచు, జీతములో సగము గునపాలక్రిందనే తగ్గించుచు నానాక్షోభలఁ బెట్టసాగెను. రామచంద్రుఁడును దైవముమీఁద భారమువేసి ధర్మమే జయించునని శాంతించి యూరకుండెను.

అక్కడ నమలాపురములో రామచంద్రుఁ డెందులోనో దిగి ప్రాణహత్యఁ జేసికొన్నాఁడని యందఱు ననుకొనిరి. కృష్ణవేణమ్మ తనకుమారుని నిమిత్తమే విచారించినట్లు విచారించెను. శరభరాజుగారును దన మూలమున నిష్కారణముగ బ్రాహ్మణహత్య లబ్ధమయినదని విచా

రించి సోమావధానుల నడిగి కొన్ని జపములు చేయించి దోషశాంతిని జేసికొనుచుండెను. రాజగోపాల మారహస్య మెఱిఁగినవాఁడేకనుక తానుగూడ విచారించినట్లు నటించెనేకాని నిజముగా దుఃఖింపను లేదు, తల్లిదండ్రులకావలె మానము నెఱుఁగఁజేయను లేదు. వెంకటరత్నము బ్రహ్మానందభరితుఁడయి తన కింద్రాధిపత్యము వచ్చినట్లుండెను. పార్వతికి వేరుసంబంధములు వచ్చెను. పార్వతివివాహపుమాట జ్ఞాపకమైనప్పుడెల్ల శరభరాజుగారు రామచంద్రుని మరణమునకుఁ దానె కారణుండని విచారించుచుండెను. గ్రామములోనివా రందఱు శరభరాజుగారితో నప్పుడప్పుడు రామచంద్రునివిషయమై మాటలాడుచు, నతఁడు మహాసద్గుణుఁడనియు, వాని నెట్టఁగొట్టినందున వారికిఁ బాపము కలదనియును జెప్పుచు వచ్చినందున శరభరాజుగారికి రామచంద్రుని వెడలఁగొట్టినందులకుఁ గొంచెము విచారము కలుగుచుండెను గాని యాయన కనుమానము సంపూర్ణముగా నివారణము కాలేదు. ఒకనాఁడు శరభరాజుగారును, చాకలివాఁడును గలిసి రాత్రి జామైనతరువాత దొడ్డివర మత్యావశ్యక మైన పనిమీఁదఁ బోవుచుండఁ ద్రోవలో నొకనూఱుగజములదూరమున నొకవివాద వినఁబడెను. ఆరాత్రివేళ చీఁకటిలో కలహమాడుచున్నవారెవరో తెలిసికొనవలెనని శరభరాజుగారు కొంచె మాగిరి. వివాదపడుచున్న యామనుష్యులిద్దఱును శరభరాజుగారినిగాని చాకలివానినిగాని చూడక తమ కడినజికు జరుగుచున్న కలహమును మానరైరి. శరభరాజుగారు వెళ్ళి యక్కడ నిలుచున్న తరువాత నాపురుషులకట్లు వివాదము జరిగెను.

ప్రథముఁడు—అంతకోపము గలవాఁడవైన పక్షమున నా భాగము నాకు బాకీచేయరాదా ? ఎంతన్యాయమో యంతనాకు నిచ్చివేయి.

రెండవవాఁడు—నీ కివ్వవలసినదేమో నేఁడివఱకే యిచ్చినాను.

నాదగ్గఱనిప్పుడేమియు లేదు. నే నిప్పుడు పెట్టెలోనికి వెళ్లుటలేదు నాకాలు తెగవాఁచినది. అడుగుతీసి యడుగుపెట్టలేక యల్లాడుచున్నా యని నే నేడ్చుచున్నాను.

ప్రథ—అవసరములు తీరినపిదప మఱుదారి చెప్ప తగులఁబెట్టి నావు. కావలసినదంతా నీచేతఁ జిక్కినదికదా. నీ వెన్నియాటలైన నాడెదవు. నాజుట్టు నీచేతిలోనున్నదికనుక నీవీలాగునఁ జేసినావు.

రెండ—(కోపముతో) నీవు నాకుఁ జేసిన సహాయము లేమిటి? నేనుచేసిన ద్రోహము లేమిటి? ఆవేళ నన్నువు లమ్మఁగా వచ్చిన సొమ్ములో పాతిక రూపాయిలు పుచ్చుకొంటివి. అంతకంటె నీకెక్కువ యేలాగున రాఁగలదు.

ప్రథ—ఛీ. నోరుముయ్యి; అమ్మినవారి కేఁబది, నీ కేఁబది నాకేఁబది, యనికాదా మొదటనేర్పాటుచేసికొన్నది. సొక్కినపాతిక నాకియ్యవలసినది లేదా? కష్టపడియమ్మి నానాశాపములు పడ్డవాళ్లము మేముండ పయినుండి కట్టెపెత్తనముచేసి యెక్కువలాభము కొట్టేవాఁడవు నీవునా?

రెండ—తెగనిల్లుతానేమి. పొట్టకూటికిఁ జేసిన వెధవవు. నీకివ్వను. నీయబ్బతోఁ జెప్పుకో. మెత్తమెత్తఁగా మూఁగనున్నందుకా వేషములు వేస్తావు. నీవేషములు నాదగ్గఱ తీసిపెట్టు.

ప్రథ—నీబెదరింపులు నాదగ్గఱ కావు. బ్రహ్మచారివిధవవు. నీ వీలాగే కొంతుకుఁ గోస్తావని నే నప్పుడే యనుకొన్నాను. నీమాటలు నమ్మి నిష్కారణముగ నేను రామచంద్రునితో విరోధము తెచ్చుకొని యేమియెఱుఁగని పిల్లవానిని నానాహింసలుపెట్టినాను. తిమ్మంట్లు నీవే తీసికొన్నావు. నీవ్రాతేనూ పోగయి వానికొంపఁ దగ్ధిచ్చినాము. ఇంత దిక్కుమాలిన బుద్ధులున్నవి కనుకనే పాముకఱచినది.

రెండ—నీవుమాత్ర మెన్నిపాములుగఱచినకుంట దాఁటఁగలవు? ఇల్లలుకఁగానె పండుగ కాలేదు. నీవు నన్నాక్షేపించ నక్కఱలేదు.

నాకంటె నీవు రెండాకులెక్కువచదివినావు. మంత్రిప్రగడవారి వంశమునఁ జెడఁబుట్టినావు. నీమూలమున శరభరాజుగారు తలయెత్తుకొని తిరుగడము లేదు.

ప్రథ—నీయంతదుర్మార్గుఁడనుగాను లే. ఇంట జూదమొకటి పెట్టి యందఱిని యింటికిఁ బిలిచి కొంపలు తీయడము లేదు. కూచిమంచివారంతా యగ్రహారములు కట్టించి కీర్తిసంపాదించుచున్నారు. నీవు బ్రహ్మచారివై లోకము తగులఁబెట్టుచున్నావు. సిగ్గులేక నీవు మాటాడవలెనా?

రెండవ—బ్రహ్మచారినై నా నీవలె ముండనుంచుకొని దాని చేతికూడు తినుట లేదు. అబ్రాహ్మణముండనుంచుకొని కూడుతింటున్నావు కా, నోరుముయ్యి, సిగ్గు లేదేమి?

ప్రథ—నాముండజోలినీకెందుకు. దానిసంగతి నీవెత్తకు. ఏమనుయిన నన్నను. రామచంద్రుని యుసురుకొట్టి చచ్చిపోతావు.

రెండవ—నేను తిమ్మంట్లు తీసికొన్నాను. నీవుదొంగవస్తువులమ్మించినావు.

ప్రథ—వానిమేనమామ చచ్చినాఁడని దొంగవర్తమానము చెప్పించిన మహానుభావుఁడవు నీవే కాదూ? నేనాలాటిపనులు చేయ లేదు.

రెండవ—ఛీ, విధవవు. చెప్పుదీసికొని చెంపలుపగులఁగొట్టుతాను.

ప్రథ—కొట్టకపోతే నీవు బ్రాహ్మణుఁడవుగావు. ఏదీ కొట్టు.

రెండవ—పాముగిఱచినప్పటినుండి నాకాలువాఁచి కదలనీయడము లేదు. అందుచేత లేవలేనుగాని లేకపోతే నిన్నిప్పుడే చంపివేతును విధవా.

ప్రథ—ఆపని నేనేచేస్తాను. చూడు (అని కఱ్ఱతోఁగొట్టెను.)

రెండవ—అఁఅఁ—కొట్టుకొట్టు. (అనిచేతులడ్డము పెట్టుకొనుచు) నీకాలాగు దొబ్బుదోవవచ్చినది. నీసంకటము కుదుర్చఁగలను లే.

ఇట్లాపురుషులిద్దఱు నొకరిరహస్యము లొకరుబయటఁబెట్టుకొను
చు కలహమాడుచుండఁగా శరభరాజుగారామాటలు విని యందులో
నొకఁడు వెంకటరత్నమనియు, రెండవవాఁడు శోభనాచలమనియుఁ గంఠ
ధ్వనినిబట్టి యానవాలుపట్టి చాకలివానితోఁగూడ వారియెదుటకుఁబోయి
నిలిచిరి. ఎదుటనిలిచిన శరభరాజుగారిని జూచి వెంకటరత్నమును శోభ
నాచలమును భయవిస్మయములతోఁ గదలలేకపోయిరి. అప్పుడు శరభ
రాజుగారు వారితో నిట్లుమాటాడిరి.

శర—ఏమిరా వెంకటరత్నము! ఈవివాదమేమిటి. నీకు శోభనా
చల మెందుకు సొమ్మియ్యవలెను? నీకును శోభనాచలమునకును గల వ్య
వహారమేమిటి?

వెంక—(తలవంచి యూరకొన్నాఁడు.)

శర—ఓరి దుర్మార్గుఁడా! నీవేమో నమ్మకముగలవాఁడవనియు
నాకుఁ బ్రీతిపాత్రుఁడవనియు నేననుకొన్నాను. సత్పురుషుఁడైన రామచం
ద్రునికూటిలో మన్నుబోసిన మహానుభావుఁడవు నీవేనా? మామంత్రి
ప్రగడవారి వంశమునఁ దప్పఁబుట్టినావురా! నీమాటలనునమ్మి నిష్కారణ
ముగా రామచంద్రుని నేవఁగొట్టినాను. అతనిమనస్సెంతక్షోభపడినదో!
మేనమామ చచ్చినాఁడని దొంగవర్తమానమతనికిఁజెప్పి వానిచేదొంగ
వస్తువుల నమ్మించి యాసొమ్మునుమీరు పంచుకొన్నారా? అవురా! ఎంత
వాఁడవురా! చండాలుఁడా!

(శోభనాచలముతో) ఏమయ్యా, నీకు బుద్ధిలేదు. అభము శు
భము నెఱుఁగనిక్షుద్రవాని తమ్మంట్ల నపహరించుటకు నీకు చేతులేలాగు
వచ్చిన వయ్యా! పాముగఱచి బాధపడుచున్నావు. నీకిప్పటికైన సిగ్గురా
లేదూ? మీరిద్దఱు మేకతోలును గప్పుకొన్న పెద్దపులులుగదా!

శోభ—(శరభరాజుగారి కాళ్ళమీఁదఁబడి) అయ్యా! రామచం
ద్రుని సమస్తవిధముల భంగపఱచినాను. ఈవెంకటరత్నమును నేనును

గలిసి చేయరాని పాపములన్నియుఁ జేసినాము. తమరు క్షమించినట్లయిన నింకొక్కసంగతినిగూడఁ జెప్పెదను. తమ పిల్లవాని వస్తువులు—

శర—(ఆశ్చర్యముతో మాట కడ్డమువచ్చి) అవితీసి కుఱ్ఱవాని నోట గుడ్డలుకుక్కినవారు మీ రేనా? అయ్యో! ఇఁకమిమ్ము బ్రతుకనీయఁ గూడదు. మీరు లోకములను మ్రింగివేయఁగలరు. ఎంతవాళ్ళయిన నవుదురు మీరు. అన్నా వెంకటరత్నము! మాయింటనుండి మాకుఱ్ఱ వానినే చంపఁదలఁచుకొన్నావా? ఛీ నాయెదుటనుండి లేచిపో. నీమొగ మును జూడఁగూడదు.

వెంక—(ఏడ్చుచు) అందులో నేనేమియెఱుఁగనండి. మీపాద ములసాక్షి.

శోభ—అయ్యో! మీవంశసింహముయొక్క వస్తువులు నేనును మ తియొక్కఁడును కలిసితీసినాము. వెంకటరత్నమందులో నేమియు నెఱుఁ గడు. నావంటి మహాపాతకుఁ డెక్కడను లేడు. నేను రామచంద్రుని గొట్టుటకు వెళ్లుచుండఁగా ముక్తేశ్వరము త్రోవలో నన్ను పాముగఱచి నది. నేను రోగముచేతఁ దీసికొనుచున్నాను. నాకు బుద్ధివచ్చినది. ఇఁక నేఁబ్రతుకను నన్ను క్షమించండి నాకభయమిచ్చినదాఁక మీకాళ్లువదలను.

శర—ఓరీ వెంకటరత్నము. మాయింటనుండి లేచిపో. రామచం ద్రుఁడు చచ్చిపోయినాఁడుగదా. నీమూలమున నాకు బ్రాహ్మణహత్య కూడ వచ్చినది.

వెంక—అతఁడు కోటిపల్లిలో నున్నాఁడట. చచ్చిపోలేదు.

శర—ఇఁక నాతో మీరు మాటాడవద్దు పొండి.

అని శరభరాజుగారుప్రయాణమును మానుకొని గ్రామము నకుఁ దిరిగివచ్చి యింట నందఱితో నాసంగతిని జెప్పఁగా వారందఱును నిజము నేఁటికిఁ దెలిసినదికదాయని సంతోషించిరి. రాజగోపాలము పరవ శత్వమును జెందెను. శరభరాజుగారు బ్రాహ్మణులను శోభపెట్టుట

సంపన్న గృహస్థులకు క్షేమముగాదని యోజించి శోభనాచలమును వెంకటరత్నమును క్షమించిరి కాని తిన్నగా విచారింపకుండ రామచంద్రుని క్షోభపెట్టినందున పరిపరివిధముల నొచ్చుకొనుచుఁ బశ్చాత్తాపమును జెందిరి. మఱునాఁ డుదయమున లేచి సోమావధానులను బిలిపించి, పార్వతిని రామచంద్రునకిచ్చి వివాహము చేతుననియు, ముహూర్తమును బెట్టుమనియుఁ జెప్పి మంచిలగ్నమును బెట్టించి, రాజగోపాలము శరభరాజుగారు సోమావధానులును గలిసి రామచంద్రునితో నీసంగతిఁ జెప్పుకొనుటకు మధ్యాహ్నము బయలుదేరి కోటిపల్లి వెళ్ళిరి.

శంకరరావుగారు విజయనగరమునకుఁ బోవుటవలన నేఁబది రూపాయలపని కచ్చేరిలో నూరికయున్నందున నాపని రామచంద్రునకు నియ్యఁగూడదని పద్మనాభముగారు వ్రాసినను, శంకరరావుగారి సాహాయ్యముచేత నది రామచంద్రునకే యయ్యెను. ఆపని యాతనికై న . నెలదినములకు కోటిపల్లి పరగణాయందుఁ గొన్ని తొందరలు గలిగినందున తన్నివారణార్థము మహారాజుగారు శంకరరావుగారి నక్కడకంపిరి. ఆయన వచ్చినతోడనే వ్యవహారములన్నియుఁ జక్కఁబడెను. ఆయన నాలుగుమాసము లక్కడనుండిరి. క్రమక్రమముగా శంకరరావుగారికిని రామచంద్రునకును బరస్పరానురాగ మభివృద్ధిఁ జెందెను. శరభరాజుగారును రాజగోపాలమును సోమావధానులును, వచ్చి రామచంద్రుని యిల్లు తెలిసికొని, యతని యొద్దకు రాఁగా వారిని జూడఁగానే రామచంద్రుఁ డాశ్చర్యపడెను. తరువాత వారి నందఱను రామచంద్రుఁడు మర్యాదచేసెను. ఒకరి యోగక్షేమముల నొకరడిగిన వెనుక వారిట్లు మాటాడిరి.

శర — రామచంద్రుఁడా! నీకు నేను మహాపకారమును జేసినాను. సిమెట్లు వాళ్ళమాయలోఁ బడినానో నేనును వట్లెపడినాను. నన్ను నీవు క్షమించవలెను.

రామ — మీరంతమాట సెలవియ్యవద్దు. మీరు పొరబడినారు.

మీ రదివఱకుఁ జేసిన యుపకారము నేను మఱువను. ఇది యెన్ని మీ చలవే కదా?

శర— నేను మా పార్వతిని నీకిచ్చి వివాహము చేసెదను. వివాహమీ వేళకు సరిగా నెలయున్నది. ఉభయులకుఁ గావలసిన సొమ్మంతయు నేనే వ్యయము చేసెదను. మీ బంధువుల నందఱి నీలోఁగాఁ బిలిచి మా బంధువులకు శుభలేఖలు వ్రాసి పంపెదను. అప్పటికి నీవు సెలవుఁ బుచ్చుకొని రావలెను. పాలకిఁ గూడ నక్కడకే నుదిప్పించియుంచుతాను. మే మింక ప్రయత్నములు చేసికొందుము.

రామ— మా పినతండ్రిని మా మేనమామను బిలువవలసినది. అంతకంటె నాకు బంధువులు లేరు.

రాజ— రామచంద్రుఁడా! శోభనాచలమును వెంకటరత్నమును తమలోఁ దామ కలహమాడి యొకరిగుట్టు నొకరు బయలుపెట్టుకొనిరి. అది మా బాబయ్య విన్నాఁడు. నిజము నేఁటికిఁ దెలిసినది. వెంకటరత్నమును లేవఁగొట్టినారు.

రామ— దైవానుగ్రహమున్నది కనుక నిట్లయినది.

ఇట్లు వివాహము నిశ్చయించి యా రాత్రి వారందఱు నక్కడ నుండిరి. రామచంద్రుఁడు శరభరాజుగారిని శంకరరావుగారియొద్దకుఁ దీసికొనిపోయి దర్శనము చేయించి యింతకాలపు విశ్వాసఘాతుకులవలెఁగాక తానుద్యోగము చేయుచున్నను ప్రాణము శరభరాజుగారి యింటఁ దానున్నట్లు చెప్పుకొనుట యభిమానము లేక యాయన తనకుఁ జేసిన మహోపకారముల నెల్ల సంగ్రహించి శరభరాజుగారి గుణములను మిగునట్లు శ్లాఘించెను. వారందఱును మఱునాఁడు ప్రయాణమైపోయిరి. రామచంద్రుఁడు వివాహ నిమిత్త మొక మాసము సెలవిమ్మని యడిగెను. పద్మనాభముగారు వీలు లేదని యుత్తరువు చేసిరి. ఈ వర్తమానము రామచంద్రుఁడు శంకరరావుగారితోఁ జెప్పఁగా నాయన పద్మనాభముగారిని చీవాట్లు పెట్టి సెలవు

నిశ్చయించిరి. వివాహ మొకవారమున్నదనఁగా రామచంద్రుఁ డొకనాఁడు వీథియరుగుమీఁదఁ గూర్చుండఁగా నతని పినతండ్రి జగన్నాథము వచ్చి కూర్చుండి రామచంద్రునితో నిట్లు చెప్పెను. 'నాయనా విన్నావా జరిగిన సంగతి. శరభరాజుగారు నీకుఁ బిల్లనిచ్చెదమని నిశ్చయించి ముహూర్తము పెట్టించి మిమ్ముల నందఱిని బిలిచి తిరిగి నాలుగుదినములక్రిందట, వేఱే క్రొత్తసంబంధము నిశ్చయించుకొన్నారఁట. మనసంబంధముకంటెఁ గొప్పది తెచ్చుకొన్నారు. వెయ్యిరూపాయలు వరదక్షిణకూడా యిచ్చినారఁట. గొప్పవారుగనుక చెల్లినది. మన మీలాఁటిపనిఁ జేసినపక్షమున నాలుగువాండ్రు తాటియాకులుగట్టుదురు. వారి నెవరు నొక్కమాట లనలేక పోయినారు. గొప్పవాండ్రందఱికిని కాలమీలాగె యుండును. చూఁడు వారుచేసిన నగుబాటుపని.

రామ—(విస్మయముతో) శరభరాజుగారాలాఁటిపనిఁ జేయుదురా.

జగ—చేయుటకేమి. ఆయన పైకాలా గగుపడునేకాని లోపల విషము. నిప్పు నీమఁడవఁట. ఆశరభరాజుగారికి నీకియ్యవలెనని యున్నది కాని నీచపుసంబంధమని బంధువు లందఱు నాక్షేపించినారఁట. అందుచేత నీకు నేనొకసంబంధముఁ గుదిర్చినాను. నీకిష్టమున్నపక్షమునఁ జేసికొనవచ్చును.

రామ—నీవే పెద్దవాఁడవు. నీకిష్టమైన సంబంధము తీసికొనిరా.

జగ—కపిలేశ్వరములో మనవాళ్లున్నారు. వారు శరభరాజుగారికన్న గొప్పవాళ్లు. సంవత్సరమునకు నాలుగువేలరూపాయిలువారికి భూములమీఁద వచ్చును. పిల్ల మకరమువంటిది. పెమ్మరాజు ప్రసాదరాయుఁడుగారి కొమార్తె. నీమంచియోగ్యతనుజూచి నీకు పిల్లనివ్వవలెనని వారికున్నది. ఆయన మిక్కిలిమంచివారు. ఆయన వారము దినములలో నిక్కడికి వచ్చి నిన్ను జూచి ముహూర్తము నిశ్చయించుకొందురు.

రామ—గొప్పవారిని నమ్మఁగూడదు. చెప్పెడుమాట యొకటి చేసెడిదొకటి.

జగన్నాథ మీవలె మాటమంతియు రామచంద్రునితోఁ జెప్పి మరునాఁడు వెళ్ళిపోయెను. శరభరాజుగారు వేఱుసంబంధము కుదుర్చుకొనుటచేత రామచంద్రుఁడు మునుపటి ముహూర్తమునకు నమలాపురము వెళ్ళలేదు. జగన్నాథముగారు వెళ్ళిన పదిదినములకు నొకనాఁటి రాత్రి పండ్రెండుగురుబోయీలు మోయు పాలకి నెక్కి యొకకాగడా వెలిగించుకొని మంచిబట్టలు ధరించుకొని పెమ్మరాజు ప్రసాదరాయుఁడుగారు వచ్చిరి. రామచంద్రుఁ డాయన కెదురుగాఁబోయి పిలుచుకొనవచ్చి మర్యాదచేసెను. ఆయనతోఁగూడ నొక బ్రాహ్మణుఁడు పసుపు, కుంకుమ, పండ్లు చాకలి వానిచేతఁ దెప్పించి యచటం బెట్టెను.

ప్రసా—అబ్బాయీ! మీపినతండ్రిగారువచ్చి నీతో మాటలాడినారా?

రామ—సంగతులన్నియుఁ దెలిసినవి. ఆయన వచ్చినారు.

ప్రసా—వివాహ మిప్పటికి కారున్నక్కదినములున్నది. సిద్ధముగా నుండుడు. మాపిల్ల చిన్నతనమందు జబ్బుపడినప్పుడు మేము వెంకటేశ్వర సాన్నిధ్యమందు వివాహము చేయుదుమని మ్రొక్కుకొన్నాము. అందుచేత వాడపల్లిలో నీకార్యము చేయఁదలఁచుకొన్నాను. ఇక్కడనే పెండ్లియని సందేహింపకుమని చెప్పి బ్రాహ్మణుఁడు దెచ్చిన పసుపు కుంకుమ రామచంద్రునికిప్పించెను. బోయీలు సవారీఁదీసికొని వెళ్ళిపోయిరి. బ్రాహ్మణుఁడును వారితో వెళ్ళెను. ప్రసాదరాయుఁడు గారిక్కడ మరునాఁ డుండిరి. ఆదినమున నాలుగుగడియల ప్రొద్దెక్కిన తరువాత రామచంద్రుఁడును ప్రసాదరాయుఁడుగారును మాటలాడుచుండఁగా రాజగోపాలమువచ్చి రామచంద్రునితో నీప్రకారము కఠినముగా మాటాడెను.

రాజ—ఏమోయి రామచంద్రుఁడా! పరువైన నియోగుల

యుంటిఁ బుట్టినావుగదా! నీవింతబుద్ధిలేక, ఈ కృత్యము చేసినావు? నీకు మాసంబంధ మిష్టమున్న యెడల రావలెను. ఇష్టములేని పక్షమున రానని స్పష్టముగాఁ జెప్పవలెను. నీమాత్రపు పెండ్లికొడుకు మాకు కుదురకపోఁడు. వచ్చెదనని చెప్పి ముహూర్తముఁ బెట్టించి రాక మోసము చేయఁదలఁచుకొన్నావా? నలుగురుబంధువులలో నగుబాటువచ్చి తలయెత్తుకొనలేక పోయినాము. ముహూర్తము దాఁటిన పిమ్మట నీవు రావని మీపినతండ్రిగారు చెప్పినారు. ఈమాటయైనను మాతోఁ జెప్పక పోయినావా?

ఆమాటలు విని రామచంద్రుఁ డాశ్చర్యపడుచుండఁగా ప్రసాదరాయఁడుగారు తొందరపడ నారంభించిరి. ఇంతలో శంకరరావుగారు గుమ్మముముందఱికి వచ్చి "కామయ్యా! ఇక్కడేనా" యని యడిగెను.

కామ—"ఇక్కడేనండి. అదుగో దిగో, మాయింటిముండకొఱకు నాకొంపఁదీసినాఁడు." అనియఱచెను.

శంక—కామయ్యా! తొందరపడకు. సంగతియంతయుఁ జెప్పు.

కామ—అయ్యా! అక్కాప్పన్నవాఁడు నాకొమార్తె నెత్తుకొని పోయి యీరామచంద్రునికిచ్చి దొంగతనముగా వాడపల్లిలోఁ బెండ్లిచేయఁ దలఁచుకొన్నాఁడు. ఈదుర్మార్గుఁడు దినమున కొక్క వేషము వేసికొని లోకమును మోసముచేయుచుండెను.

శంక—ఆతని చెప్పులనున్న తిమ్మాపురపు మాతమ్ముని చెప్పులవంటి వని తోఁచుచున్నది.

రాజ—ఓ యీ ప్రసాదరాయఁడా! నీసంగతియంతయుఁ జెప్పు. నిన్ను తక్కువశిక్షతోఁ బోనిత్తును. లేనిపక్షమున నీవెల్లశిక్షల ననుభవింపఁ గలవు.

ప్రసా—అయ్యా! నన్ను క్షమించవలెను. నేటికి నేను దొరికినాను. మాది నిడదవోలు కాఁపురము. నాపేరు చాముర్తి జనార్దనము.

రామ—అయ్యా! ఇతని పేరుయొక్క పొడియక్షరములున్న రుమాలు మాకు దొరికినది. దానిమీఁద ' చా. జ ' యని యున్నది.

శంక—అతని వృత్తాంతము నంతను జెప్పనిమ్ము.

ప్రసా—నేను చిన్నతనమునందె పితార్జితమగుద్రవ్య మంతయు జూదమునందు వ్యయపెట్టి జోగినై యమలాపురము ప్రవేశించి కూడిమంచి శోభనాచలమునకు స్నేహితుఁడనై యనేక పాపములను జేసినాను. శోభనాచలముయొక్కయు, వెంకటరత్నముయొక్కయుఁ బ్రోత్సాహముచేత కర్తాగామయ్యయను పేరుపెట్టుకొని, యీరామచంద్రుని మేనమామవచ్చినాఁడని కొంగవర్గమూపమును జెప్పినాను. దేశిరాజు సూర్యనారాయణ యను పేరుపెట్టుకొని యిత్తడికంటియు, గాజురాయి వేసిన యిత్తడి యుంగరమును రామచంద్రుని కిచ్చి బంగారపు వస్తువులని యమ్మించినాను. శరభరాజుగారి రెండవకుమారుని నగలన్నియు నేను శోభనాచలమును దీసికొని పిల్లవానినోట గుడ్డలుకుక్కినాము. తరువాత నాకునువారికిని వివాదమువచ్చినది. ఇప్పుడు రామచంద్రునిపినతండ్రి జగన్నాథము నాయొద్దకువచ్చి రామచంద్రునకు శరభరాజుగారి సంబంధము వచ్చుట కోర్వఁజాలక యాపెండ్లి చెడఁగొట్టి బీదపిల్లను జేయుమని నన్ను వేఁడుకొన్నాఁడు. కాఁబట్టి నేనీవిధముగా నీబ్రాహ్మణునికొమార్తెను దొంగిలించుకొని రామచంద్రునకుఁ బెండ్లిచేయఁదలఁచుకొన్నాను. నేఁటికి మీచేతఁ జిక్కినాను.

శంక—నిన్ను వదలరాదు. ఏమోయి వీరాస్వామి! ఈతనిని బట్టుకొని సంకెళ్లువేయండి.

అని సంకెళ్ళువేయించి చామర్తి జనార్దనమును విజయనగర మంపించెను. అక్కడ మహారాజుగా రితనికి నాలుగుసంవత్సరములు చెరసాలలో నుండునట్లు శిక్షవిధించిరి.

అందఱు నాదినమున నిండ్లకుఁబోయిరి. మఱునాఁడు శంకర

ఎల

గారువచ్చి రామచంద్రునితో నిట్లనిరి. "అబ్బాయీ; నీవు నాకొమార్తె నిచ్చి వివాహముచేయవలెనని యున్నది. నీకుఁ జేసికొనుటకు నేమైన నభ్యంతరమున్నదా? మాపిల్లనుజేసికొన్నయెడల నీవుమిగుల నభివృద్ధిని జెందఁగలవుసుమీ" యనిచెప్పగానే రామచంద్రుఁడు "మీరునన్ను క్షమించవలెను. నేనిదివఱకే శరభరాజుగారి కొమార్తెను జేసికొనుటకు నిశ్చయించుకొన్నాను. మధ్య నిజనాగ్రనమువచ్చి యంతరాయమును గల్పించినాఁడుకాని యీపాటికి వివాహమయియుండును. కాని మన నియోగులలోనెల్ల మంత్రిప్రగడవారు మిక్కిలి గొప్పవారు. శరభరాజుగారికి సంవత్సరమునకు మూఁడువేల రూపాయిలు వచ్చును. ఆయన జ్యేష్ఠకుమారుఁడు రాజగోపాల మిప్పుడు మాయింటనున్నాఁడు. అతనికి మీకొమార్తెనిచ్చి వివాహముచేయవలసినది. అన్నివిధముల నాకంటె గొప్పసంబంధము" అనిచెప్పగా శంకరరావుగారు "నీవువారిపిల్లనుజేసికోవలసినది. మాట తప్పఁగూడదు నీపెండ్లియైనతరువాత చూచుకొందము. నీవు వెళ్లుము" అని చెప్పిరి. రామచంద్రుఁడు శరభరాజుగారి సంబంధముకంటె శంకరరావుగారి సంబంధమెక్కువదనియు, దానివలన తన కనేకలాభము లున్ననియు నెఱిఁగి మాట ముందుగానిచ్చినందునను, చిన్నతనమునందు శరభరాజుగారియందున్న విశ్వాసముచేతను, శంకరరావుగారి సంబంధమును నిరాకరించి శరభరాజుగారి కొమార్తెనే చేసికొనుటకు నిశ్చయించి యమలాపురమునకు రాజగోపాలముతోఁ గూడ బోయెను. త్రోవలో వారిట్లు మాటాడిరి.

రామ—నేను పెండ్లికిరానని మీతో నెవరు చెప్పినారు. ముహూర్తమునాఁడు మీరేమనుకొన్నారు?

రాజ—ముహూర్తమునాఁడు నీవింకనువత్తువని కనిపెట్టుకొని కూర్చున్నాము. ఎంతసేపటికిని నీవు రాకపోఁగా సెలవుదొరక లేదనుకొన్నాము. ఆమఱునాఁడు మీపినతండ్రివచ్చి "మావాఁడు మీసంబంధము

ను జేసికొనఁడంట. ఆయన కింతకంటె నెక్కువవారెవరో వచ్చినారా? మీ యిష్టమువచ్చినట్లుమీరు చేసికొనండి" యని చెప్పెను.

ఆమాటలువిని రామచంద్రుఁ డాశ్చర్యపడి తనపినతండ్రియొక్క యౌదార్యలేమికి సిగ్గుపడుచుఁ, దనతో నతఁడు చెప్పినమాటలును, బ్రహ్మానాయుఁడుగారి సంబంధములును జెప్పి రాజగోపాలమును గడుపుబ్బలగునట్లు నవ్వించుచు నమలాపురముచేరి శరభరాజుగారు మొదలగువారికిఁ గూడ నీవృత్తాంతమును దెలియఁజేసెను.

శరభరాజుగారిదివఱకే వివాహప్రయత్నములను జేసినందున వైశాఖశుద్ధనవమినాఁడు రామచంద్రుఁడు సావిత్రినిబెండ్లియాడెను. రామచంద్రుని మేనమామయు నాతనికుటుంబమును దప్ప మఱి యేబాంధవులును బెండ్లికొఱకున్నపుడు రాలేదు. పెండ్లివారికి విశ్వనాథశాస్త్రిగారియింట విడిదినేర్పఱచిరి. ఉభయులకును గావలసిన ద్రవ్యమంతయు నాశరభరాజుగారే వ్యయముచేసి పెండ్లి సమస్తవైభవములతోడను జేసిరి. శ్రావ్యమైన తూర్యారావములతోడను, ముత్తయిదువల పాటలతోడను, పచ్చనిపందిళ్లతోడను, విప్రాశీర్వాదధ్వానములతోడను వివాహము మనోహరముగా జరిగెను. శరభరాజుగారు తక్కువసంబంధమును దెచ్చుకొన్నారని వారి బంధువులెవ్వరును రాలేదు. అమలాపురమునందే విద్యార్థిగానుండి యచ్చటనే యుపనిందపాలయి, మరల నాగ్రామమునందే కడుమర్యాదగా వివాహమాడుచున్న రామచంద్రునిఁ జూచి, యందఱును సంతోషించిరి. అయిదుదినములును వివాహమైన తరువాత పదునాఱుదినములపండుగ యగువఱకు నమలాపురమునందే యుండి పిమ్మట కోటిపల్లి వెళ్లెను. వివాహమైన రెండుమాసములలోనే శంకరరావుగారు తమకుమార్తెను శరభరాజుగారి జ్యేష్ఠకుమారుఁడగు రాజగోపాలమున కిచ్చి పెండ్లిఁజేసిరి. ఇట్లు శరభరాజుగారును శంకరరావుగారును వియ్యంకులగుటచేత రామచంద్రునియందు శంకరరావు

గారు మునుపటికంటె నెక్కుడదయగా నుండిరి. తరువాత రాజగోపాలమునకు శంకరరావుగారు విజయనగరమునం దుద్యోగము నిప్పించి యతనినచ్చటికిఁ దీసికొనిపోయిరి. వివాహమైన యెనిమిదిమాసములకే పార్వతి వ్యక్తురాలయినందున మఱినాలుగుమాసములకు శరభరాజుగారు పార్వతికిఁ దగినసారెపెట్టి కాఁపురమునకుఁ బంపిరి. పార్వతియు రామచంద్రునితోను కోటపల్లిలో కాఁపురము చేయుచుండిరి.





# హేమలత.

## మొదటి ప్రకరణము.



ఒకనాఁటి మధ్యాహ్నసమయమున శరీరమునందంతట భస్మముఁ బూసికొని కాషాయాంబరంబులఁ గట్టుకొనిన యొకమనుష్యుఁడు యమునానదివైపునకు వచ్చుచుండెను. అతఁడేగ్రామమునుండి వచ్చుచుండెనో యేగ్రామమునకుఁ బోవుచుండెనో యెఱిఁగినవా రెవ్వరును లేరు. మార్గమధ్యమున నొకరిద్ద ఱాతనిని బలుకరించిరి. కాని వారి కతఁడెట్టి ప్రత్యుత్తరమును నీయలేదు. అది వేసవికాల మగుటచేతను, సకల జంతుభయంకరముగా నామధ్యాహ్నమున గాడ్పువీచుటచేతను, నామనుష్యుఁడు మార్గాయాసమునంజేసి డస్సియుండెను. అతని యాయాసమునుబట్టి దూరప్రయాణము నతఁడు చేసెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అతఁడు రమారమి నలువదిసంవత్సరముల వయస్సు గలిగియున్నను, నంతవయస్సుగలవానివలెఁ గనఁబడఁడు. ఆమనుష్యుఁడు పొడుగరి కాఁడు కాని కేవలము పొట్టియని చెప్పుటకువీలులేదు. శరీరము చామనచాయఁ గలదియైయుండును. ఆయననుజూచినవా రందఱు నతఁడు సుందరపురుషుఁ డని యనకమానరు. లావుగానున్న శరీరమునం దాపాదమస్తకమును భస్మ మలఁదఁబడియుండుటచేతను మెడలో యజ్ఞోపవీతము వస్త్రమువాటువనుండి కనఁబడుచుండుటచేతను, నతఁ డేజాతిమనుష్యుఁడో తెలిసికొనుట దుర్లభముకాని యాతఁ డుత్తరహిందూస్థానవాస్తవ్యుఁడనియు నందు బ్రహ్మక్షత్రియ వైశ్యజాతులలో నొకజాతి

వాఁడనియుమాత్ర మూహింపవచ్చును. తీవ్రమైన సూర్యతాపమువలన బయలువెడలిన చెమ్మటచేత శరీరమునం దలఁదుకొన్న భస్మ మక్కడక్కడ కరఁగిపోయి యతనిసహజకోమలమైన శరీరము జూపుచుండెను. గడ్డమును జడలును నతఁడు యోగియని చెప్పుచున్నవికాని చక్కఁగా నవి పెరుఁగకుండుటచేత నూతనముగా నాశ్రమస్వీకారము నొనర్చెనట్లు చూపరు గ్రహింతురు. భగ్గుభగ్గుమని కాలుగాలుచుండినను నెండవేడిమిచే శిరస్సు మాడుచుండినను, నతఁడు పాదరక్షలుకాని గొడుగుకాని ధరింపకయే దినమంతయుఁ బ్రయాణము జేసెను. బైరాగులదగ్గఱనుండు కక్షపాల, యతనిదగ్గఱ నుండెనుగాని యోగిజనుల కత్యంతప్రియములగు గంజాయియుఁ జిలుమును నందులేవు. యమునానదీతీరముననున్న మథురాపుర సమీపమున కతఁడు నాలుగుగడియల ప్రొద్దువేళ వచ్చినను నేమికారణముననో పట్టణమునఁ బ్రవేశింపక క్రోసుదూరముననున్న మామిడితోఁపులో దాఁగియుండి సూర్యాస్తమయమయినతోడనే యాస్థలమునువిడిచి, చీఁకటి కాల మగుటచేత నొరులకంటఁబడకుండ యమునాతీరమునకుఁ బోవుచుండెను. నదీతీరమునఁ జేరినతోడనే చంకనున్న కక్షపాల యొకమూలఁబడవైచి కాలుసేతులఁ జన్నీటఁ గడిగి మొగముపై నానిర్మలోదకములఁ జల్లుకొని నాలుగుపుడిసిళ్ళ నీళ్ళుత్రాగి యచ్చట నిసుకతిన్నెపై నించుక శయనించెను. అప్పుడు యమునాజలబిందువులతోఁగూడ మలయమారుతమరుదెంచి యాప్తమిత్రుఁడువచ్చి మీఁదఁజేయివైచి తట్టునట్లు కనుమార్గాయాసము నొందియున్న యాతని శరీరమును స్పృశించి యాయాసము నపనయించెను. ఆతఁడును సకలజనసులభమైన యాదైవదత్త సౌఖ్యముచేత పరవశత్వమునొంది కనులు మూసికొని హాయిహాయియని కొన్నినిమిషములవఱకును దనకష్టములనెల్ల మఱచిపోయెను. ఆసమయమునం దాకాశమున ననంతకోటినక్షత్రములు మినుకుమినుకు మని జ్యోతులవలెఁ బ్రకాశించుచుండెను. అది

నిర్జనస్థల మగుటచే నీలకోడి, చిమ్మట, మొదలగుజంతువుల రొదతప్ప మఱియొకధ్వని యేదియు లేదు. నిశ్శబ్దముగనున్న యాస్థలమునందు శయనించినతోడనే యతనికిఁ దనపూర్వవృత్తాంతము జ్ఞప్తికివచ్చి వానిని విచారమునందు ముంచెను. వెంటనే యతండు 'హా దైవమా! ఎంతకష్టము గలుగఁజేసితివి. ఆహా! ఏమి తురకలదౌర్జన్యము. ఈమహమ్మదీయ ప్రభుత్వ మెన్నఁడైన నశించునా!' యని తనలోఁ దా ననుకొనుచు నశముగాక వచ్చిన బాష్పజలమును దుడుచుకొని యాకాశమువంకఁ జూచునప్పటికి చిన్నమబ్బు కనఁబడెను. అది క్రమక్రమముగా గొప్పదై యాకసమునంతను నాక్రమించుకొనుటచేతను, దానితో గాలిదుమారు వచ్చుటచేతను వర్షమువచ్చునని యోచించి యిసుకతిన్నెమీఁద బవ్వళించిన యీయోగి యెచట నిలఁదాఁచుకొందునాయని చింతింపనారంభించెను. కొంచెమాలోచించునప్పటికి తాను పగలుదాఁగుకొన్న మామిడితోఁపునకును నదికిని మధ్యనున్న పాడుదేవాలయ మతనికి జ్ఞప్తికిరాఁగా నటకుఁ బోవఁబ్రయాణమయ్యెను. ఆదేవాలయమునకును నదీతీరమునకును గొన్నిగజములదూరముమాత్రమే యుండుటచేత నీమనుష్యుఁడు త్వరితముగా నడిచి గుడిచైపునకువెళ్లెను కాని యంతకుముందే చినుకులారంభమై యెండచేఁగాఁగియున్న యోగిశరీరమును వడఁకునట్లుచేసి యాతనివస్త్రములఁ దడిపెను. ఒట్టితనపు జల్లువాన కురియునప్పటికి మన బాటసారి దేవాలయపు ముంగలిభాగమునకు నడిచెను.

ఆదేవాలయము మనమువ్రాయుచున్న యీకాలమునాఁటికి శిథిలావస్థనొందినను బూర్వకాలమునందుఁ గొన్నిదినము లున్నతదశయందుండెను. క్రీస్తుశకము ౧౦౧౮ వ సంవత్సరమునందు గుజనీమహమ్మదు హిందూదేశముపై దండెత్తి జగత్ప్రసిద్ధి పుణ్యక్షేత్రమగు మథురానగరమున తద్దేవాలయమును దోఁచుకొని స్వామివిగ్రహమును స్వహస్తములతోఁ బెకలించి దేవాలయములనెల్ల భూమితో మట్టముఁ

చేసెను. ఈదేవాలయ మూరుబయట నుండుటచేత మ్లేచ్ఛప్రభువు స్వయముగా నాశనము జేయలేదుగాని తద్భటులు విగ్రహనాశన మొనర్చి యందు సైన్య మచ్చోటనున్నంతకాలమును దాము వశించిరి. ఆనాఁట నుండియు నాకోనెల శిలావిగ్రహశూన్యమైయున్న నప్పుడప్పు డర్ధరాత్రములయందు మనుష్యవిగ్రహములతోఁ గూడియుండుటఁగలదు. దూరదేశప్రయాణములను జేయుచున్న బాటసారులను, ద్రవ్యవంతులను వణిజులను దోఁచుకొని స్త్రీలను జెఱఁబట్టి స్వచ్ఛంద విహారముసేయు దుర్నీతిపరులగు చోరులకును దురాచారులకును నాదేవళము శరణ్యంబైయుండెను. అందుచేత గ్రామము పెట్టినతరువాత మధురానగరవాస్తవ్యులెవ్వరు నాదేవాలయప్రాంతములకరుగరు. అరిగిన నపాయములేక రారు. ఒకనాఁడు శవదహనమైన గుర్తులు కనఁబడుటవలనను నింకొకనాఁడు మనుష్యులు ధరించు కొన్నివస్త్రములును జలమును గన్పడుటవలనను జనులా ప్రాంతమునకు మొత్తుగా వచ్చుటమానిరి. ఈప్రదేశమునకు నలుదసలను దట్టముగ నున్న వృక్షములు పెట్టనికోటవలె నుండుటంబట్టి చోరులకు సదుపాయ మెక్కువగనుండెను. ఆయాలయమునందుఁ బూర్వము ప్రాన్యమైన మురళీనాదమొనర్చుచుఁ గాళీయమహాపడగలపై నాట్యమునలుపు శ్రీకృష్ణుని విగ్రహముండెనని పట్టణమునఁగల వృద్ధులప్పుడప్పు డాస్థలమును జూచునప్పు డనుకొనుచుందురు. తురుష్కులుచేసిన నాశనమునకుఁ దోఁడు కాలముఁగూడ దేవాలయ ప్రాకారమును నాశనదేవత పాలుచేసెను. మనము వర్ణించెడు కాలమునాఁటికి ముఖ్యాలయమొకటి తక్క మరియేదియు లేదు. గర్భాలయము సహజముగా నంధకారబంధురమైయుండెను. నాఁటిరేయి మేఘములచే గుడియందుఁ జీఁకటి పదిరెట్లధికముగ నుండెను. మన తెరువరి తడిసిన వస్త్రముల నారఁగట్టి కక్షపాలయందున్న పొడిబట్టనుదీసి కప్పుకొని మహాగుహవలె భయంకరముగానున్న యాదేవళముఁ బ్రవేశింప జంకుచుఁ

జలిబాధ కోర్వఁజాలక లోనఁ జొరఁబడి తప్పటడుగు లిడుచుఁ గొంత దూరముపోయి పూర్వము విగ్రహముండునట్టి యున్నతస్థలమునఁ గూర్చుండెను. అతఁడక్కడఁ గూర్చుండి తన పూర్వాశ్రమ సంబంధమగు దుఃఖాలోచన సముద్రమున మగ్నుఁడై పరవశత్వముఁ జెందియుండ నా నిర్జన ప్రదేశమున నతిసిక మనుష్యుల యలికిడి వినఁబడి యాతనిఁ జింతాసమాధినుండి మేలుకొలిపెను. నిర్మానుష్య ప్రదేశమున నరుల యలుకుడగుట గతఁడాశ్చర్యపడి యది నిజమా యబద్ధమా యని వితర్కించుచుండగా నిద్దఱు మనుష్యులు చీఁకటియందుఁ దళతళ మెఱయుచున్న ఖడ్గములు హస్తములధరియించి గుమ్మముముందరనిలువఁబడిరి. అప్పటికి వర్షమాగిపోయినందున వారిదేహములంతగాఁ దడిసి యుండలేదు. చేతులనున్న ఖడ్గములను గోడకుఁ జేర్పైచి గుమ్మము ముందఱ నిలిచి దేహములను దుడుచుకొనుచు వారొకరితో నొకరు మాటలాడక యెవరి నిమిత్తమో నిరీక్షించుచుండిరి. ఇట్లుకొంత సేపుచూచి వారిరువురు లోనఁ బ్రవేశించిరి. అందొకఁడు మహారాష్ట్రుఁడు రెండవవాఁడు తురుష్కుఁడు. తురుష్కుఁడు దీర్ఘకాయముతోను గాలములనలెనున్న భుజద్వయముతోను గుండెలను దాఁకుచున్న నల్లని గడ్డముతోడను జూచువారి కందఱకును భయమును గల్గించుచుండెను. భయంకరమైన యాతని ముఖావలోకనఁజేసినవా రందఱును దయయనునది యతనియందు లేదని నిశ్చయముగఁ జెప్పఁగలరు. మహారాష్ట్రుఁడు కొంచెము గొప్పకుటుంబమునందుద్భవించినను గాలవశమున ధనాదులు గోలుపోయి దురాచారులస్నేహముఁజేసి దౌర్జన్యములం దారితేఱెను గాని ముఖవిలాసముఁజూడఁ గొంచెము జాలిగలవాఁడని తోఁచును. అయినను దొంగతనము మనుష్యవధ మొదలగు దుష్కార్యముల నాచరించు నెడ జంకును సందేహమును నిరుబ్బురకును లేవు. అదివఱకు గోడలకుఁ జారవైచిన ఖడ్గముల నొరలలోనుంచి వారు దేవళము మునుముందరఁ గూర్చుండి యేదో యాలోచించుచుండిరి.

అందు మహమ్మదీయుఁడు మహారాష్ట్రునిఁ జూచి యిట్లనియె.

'నందా! బాలాజీ యింకను రాకుండుటకు నేమి కారణము? అతనిమార్గమునం దెవరైనఁ బట్టుకొనియుందురా?

నందు—గులామల్లీ! నీకింత వెఱ్ఱియెందుకు? మన బాలాజీ యిదివఱ కెన్నఁడైనా నొకరిచేతఁ జిక్కినా? అతఁడు దేవాంతకుఁడని యెఱుఁగవా?

గులా—అవును? నేనెఱుఁగుదును. అందుచేతనే మన కీవఱకెన్నఁడును జక్రవర్తివలని భయము లేదు. మనరహస్యము బయలు పడలేదు?

నందు—మనచేత నీకార్యములఁ జేయించుచున్న రహిమాన్ ఖానులాయుద్దీను చక్రవర్తివద్ద గొప్పయుద్యోగమునం దుండఁగా మనకు నెవరిభయమును గలుగదు. అతఁడు సుఖవంతుఁడగుఁగాక!

గులా—మొన్నటిరాత్రి స్త్రీలను దోఁచుకొన్నప్పుడు దొరకిన నగలలో నెన్నవవంతు మనము తీసికొనునట్లు ప్రభువుగారేర్పఱచినారు?

నందు—ఎంతయిచ్చిన నంతే మనము పుచ్చుకొందము.

గులా—అది సరి. కాని యాదినమున మనుష్యులను నఱికినట్లు నీవిదివఱకెప్పుడు నఱికియుండలేదు. ఒకదెబ్బకు రెండుతునకలుగదా! వహవ్వా? శహబాస్. అటువంటి యేటు మఱిదొరకదు.

నందు—అదియొకలెక్కా? నెలదినములక్రిందటఁ బ్రయాగలో యాత్రార్థమరుగుదెంచిన మోఘలీలను దోఁచుకొన్నప్పుడు దయాదాక్షిణ్యములు లేక స్త్రీలను శిశువులను గూడ నఱికివేసినాను. నాఁడు నీవు చూడలేదా?

అని వీరిరువురు సంభాషించుకొనుచుండఁ బోతవిగ్రహమువలె నాలయమధ్యమున సుఖాసీనుఁడై యున్న మనఘోటసారి భయముచే గడగడ వడఁకుచు నేమియుఁ జేయలేకయుండెను. వారిసంభాషణమును బట్టి . ని మనుష్యహంతకులని యతఁడు తెలిసికొనెను. వారిదివఱ కితనిని జూచియు

తమరహస్యముల బయలుపఱచుకొనుచుండిరి. అప్పుడు నందుఁడు కొంచెము గంజాయిపీల్చవలెననికోరి సంచిలోనున్న చెకుముకిరాతిని యినుపముక్కను దీసి వానిరాపిడిచే నగ్నిని సృజించి చిలుములో గంజాయియాకును బొగాకును జేర్చి యందు నిప్పంటించి తాను నాలుగు గుక్కలను త్రాఁగి గులామున కిందిచ్చెను. ఈనిప్పువెలుతురున గులాము మనుష్యుఁ డాలయమున నున్నట్లు జాడకట్టి తనయనుమానమును నందుని చెవిలో నూఁదెను. సహజలక్షణమైన శౌర్యమునకు గంజాయి మత్తుతోడ్పడ, వెంటనే నందుఁడు త్రాఁచుపామువలె లేచి మన బాటసారి యున్నవైపున కరుగుచుండఁగా గులామాతని వెంబడించెను. అదివఱకే భయకంపితుఁడైన మన తెరువరి యీదురాత్ములు తనవైపు వచ్చుచుండుటఁజూచి కెవ్వున నఱచి స్మృతియెఱుఁగక తనయున్నస్థలము నుండి క్రిందఁబడెను. అతనిఁజూచి నందుఁడును గులామును నాశ్చర్యపడి యొండొరులతో నిట్లు సంభాషించిరి.

నందు—అరే! అన్నయ్యా! ఎవఁడువాఁడు?

గులా—ఏవఁడో మనమాటలువిని మనగుట్టు బైటఁబెట్టఁదలంచినదొంగ.

నందు—ఈఛండాలు నిప్పుడేమి చేయుదము? ఏదీ కత్తి యీలాగునతే

గులా—కత్తితోఁ గొట్టవద్దు. ఈలాగునఁ జేయుదము. (అని చెవిలో రహస్యముగాఁ జెప్పెను.)

అట్లిరువురుఁ గూడఁబలుకుకొని నిస్పృహాహృదయుఁడై యున్న యాదీనునినోట గుడ్డలఁగుక్కి శిరస్సునొకరును బాదములనొకరును బట్టుకొని మోసికొనిపోయి యతఁడు గిజగిజ తన్నుకొనుచున్నను వదలక నదీతీరముఁజేరి లోతునీటందిగి “చావుముండకొడక” యని వాని నందుఁ

బాష్పైచిరి. తరువాత వారిరువురు నాలయమునకువచ్చి యాతని కక్ష పాలను వెదకి యందుండి కొన్నివస్తువులను సంగ్రహించి తమప్రియ మిత్రుఁడైన బాలాజీ రాఁడని నిశ్చయించుకొని యాథేచ్ఛం జనిరి.

## రెండవ ప్రకరణము.

ఆగ్రామమునకు రమారమి పదునైదుక్రోసులదూరమున, 'పాలి' యను చిన్నగ్రామము కలదు. తత్పరిసరమునందున్న మండలమునకు దానిని ముఖ్యపట్టణముగ నొనర్చి యందొక ప్రతినిధి నేర్పఱచి యాతనికి సర్వస్వతంత్రాధికార మిచ్చి చక్రవర్తియగు నలాయుద్దీను పరిపాలన మొనర్చుచుండెను. పాలిసర్కారున కీసమయంబున రహిమాను ఖాను ఖిల్లాదారుగ నుండెను. అతఁడు మొదట పారసీక దేశమునుండి వచ్చిన బానిసవాఁడయ్యుఁ దనస్తోత్రపారమైన పుణ్యముననో దురాచార సంపత్తిచేతనో యలాయుద్దీను చక్రవర్తి కాప్తవర్గములోనివాఁడై నానాటికి నున్నతపదవుల నొందుచుఁ దుదకు నీయధికారము నొందెను. ఈతఁ డీయున్నతపదవి నొంది యిప్పటికి మూఁడుసంవత్సరములైనవి. అధికారప్రాప్తియైనదిమొద లాతఁడు గర్వోన్మత్తుఁడై రాజకీయోద్యోగస్థులనందఱ నగౌరవంబుతోఁ జూచుచు నిజాధికారమునకు లోఁబడిన ప్రజల ననేక కష్టములపాలుచేసి జనవిరోధియై యుండుటయేకాక యతఃపుర స్త్రీలను జెఱపట్టుటయు దురాచారులచే దొంగతనములఁ జేయించుటయు లోనగు దుష్కార్యధౌరేయుఁడై యహోరాత్రములు మద్యపానమత్తుఁడై స్త్రీజన మధ్యంబునఁ గాలము బుచ్చుచుండెను. అది చిన్నగ్రామ మగుటచే నచ్చటనున్న యుద్యోగస్థులలో నెల్ల ఖానుగారే మహోన్నతపదవినున్న కారణమున జనసామాన్య మాతని నవాబని చెప్పుకొనుచు నతని కటాక్షపాత్రు లగుటకు యత్నించుచుందురు.

వెయ్యేల, చండతరమైన ఖానుయొక్క పరిపాలనచేఁ బ్రజలు మలమల మాడుచు నన్నవస్త్రములకు దూరులై యాతని మరణమెదురుచూచుచు సాధ్యమగునేని తామె యాతనిఁ దుదముట్టింపఁ దలంచుచుండిరి. ఈతఁ డన్యమతస్థులగు హిందువులకేకాక సదాచారపరాయణు లగు మహమ్మదీయులకు ననిష్టుఁడుగ నుండెను.

క్రీ॥ శ॥ ౧౩౦౧ వ సం॥రమున వేసవికాలమున నొకనాఁటిమధ్యాహ్నము పదుగురుమనుష్యు లశ్వారోహణ మొనర్చి పాలిగ్రామసమీపమునకు వచ్చుచుండిరి. అందు ధవళతురంగమునెక్కి మన్మథునివలె లావణ్యనిధియైన యొకరాజపుత్రకుమారుఁడు సేనానాయకుఁడై తోడివారలను దనమృదుమధుర వాక్యములచే హెచ్చరించుచు నెండతాపమునకు నుస్సురనుచు వచ్చుచుండెను. మదనసింగు రమారమి యిరువదియైదు సంవత్సరముల వయస్సుగలిగి మూర్తీభవించిన ప్రాఙ్గయౌవనమువలె సర్వాంగసౌష్ఠవముతోడను నిరంతర మందహాసవిలసితమైన మొగముతోడను, విశాలవక్షస్థలముతోడను జూచువారెల్లరు మెచ్చునట్లుండెను. అతని ధవళాశ్వముమీఁద పారసీకదేశపుజీను వేయఁబడియుండెను. చలువచేసిన తెల్లనిపరాయి దొడుగుకొని విశాలమైన జరీకుట్టులోఁ దలతలమని సూర్యకాంతిచే మెఱయు తలపాగనుధరించి, నిగనిగకాంతులను గ్రక్కుచున్న నల్లమొహాము లంగరకదొడిగి, నడుమును పటకాతో బిగించి, పైనున్న కాస్మీరశాలువ నెండకడ్డముగ మీఁదవైచుకొని గుఱ్ఱమును మాటిమాటికిఁ జబుకుతో బెదరించుచుఁ బ్రయాణముసేయుచుండెను. క్షత్త్రియకులశిరోభూషణుండును, దన యేలికయుఁ జిత్తూరురాజ్యసంరక్షకుఁడునునగు భీమసింగునకు మదనసింగు బాలుఁడయ్యు నాంతరంగికుఁడగుటచేత స్వామికార్య నిర్వహణమునకై యప్పు డాగ్రానగరమునఁ గారణాంతరమున వసించుచున్న చక్రవర్తియొద్దకుఁబోయి తనప్రభువు పంపిన సందేశమును దృప్తికరముగా నిర్వర్తించి చక్రవర్తిదయసంపాదించి

తిరిగి చిత్తూరున కతఁడుపోవుచుండెను. అలాయుద్దీ నతనితోఁగూడ నాజరుజంగను నతనినిచ్చి పాలిగ్రామమునకును మదనసింగునకు సహాయ మొనర్పవలసినదని పంపెను. నాజరుజంగు హిందూస్థానవివాసులగు మహమ్మదీయులలోఁ బ్రఖ్యాతిగన్న వంశసంభూతుఁడై గుణములచేఁ దనవంశమునకుఁ గీర్తిఁ దెచ్చుచుండెను. చక్రవర్తి కాతనియందు గొంత నమ్మకముగలదు. మదనసింగును నాజరుజంగును సహజసద్గుణసంపన్నులు కనుక నాగారినగరమునం దున్నప్పు డిరువురకు స్నేహమయ్యెను. అట్లి ద్దఱును బయలుదేఱి పాలిగ్రామమునకు వచ్చుచుండఁగా మార్గమధ్య మున బందిపోటుదొంగల సంఘమొకటి వారిపైఁ బడ శౌర్యరాశియగు మదనసింగు నాజరుసహాయమున దొంగలనందఱఁ బాఱఁదోలి యందనే కులవధించెను. స్వభావసిద్ధముగ నతఁడు మోటుదొరవయుఁ దెగువయుఁ గల శరీరలక్ష్యములేనిసాహసుఁ డగుటచే సంపూర్ణజయము నొందినను మెడమీఁద చిటికెనవ్రేలు పొడవుగల గాయము నొందవలసివచ్చెను. ఎండవేడిమిచేతను, గాయపుమంటచేతను తాళఁజాలక రెండు మూఁడు పర్యాయము లతఁడు మూర్ఛిల్ల సిద్ధముగనుండి వెంటనే తెలివిఁదెచ్చు కొని కష్టముమీఁదఁ బ్రయాణ మొనర్చుచుండెను. ఏకధారగ స్రవిం చుచుఁ జూపరకుఁ గనులు మిరుమిట్లుగొలుపురక్తముచే నతనియంగరకా లన్నియుఁ దడిసి శరీరమున కంటుకొనిపోయి మిగులబాధకరముగనుండె ను. మదనసింగుతోఁ జిత్తూరునుండివచ్చిన సేవకు లేవురును భయకంపి తులై నోటమాటలేక హృదయస్థితవిచారమును నేత్రబాష్పములవలనఁ దెలియఁజేయుచుండిరి. స్వల్పకాల పరిచయుఁడైనను నాజరుజంగు తనమి త్రునియవస్థకు మిగులఁ గుందుచు నతనికి ధైర్యముఁ గలిగించుటకు బహువిధప్రయత్నంబులు సలిపెనుగాని యవియెల్ల వ్యర్థములయ్యెను. కొంతసేపు నిశ్శబ్దముగ నయ్యాశ్వికులు నడచిరికాని తుదకు నాజరుజం గు రజపుత్రకుమారునిఁ బలుకరించి “నాలుగుగడియ లోపిక గలిగి

యుండుము. గ్రామసమీపమునకు వచ్చినారము. ఆచెట్లచాటున నున్న దే వాలిగ్రామము" అని హెచ్చరించి కొంచెము మంచితీర్థ మతనికిఁ ద్రావనిప్పించెను. నీరుత్రాగి పరదేశి రజపుత్రుఁడు ధైర్యమునుబూని గుఱ్ఱముపైఁ గూర్చుండెగా మరల నాజరుజంగిట్లనియె. "ఈగ్రామమున మాబంధువుఁడును జక్రవర్తికిఁ బహుమాన్యుఁడునునైన రహిమానుఖానున్నవాఁడు. మనకు సమస్తోపచారములు నతఁడుచేయును" ఈమాటలతిరువాత నిశ్శబ్దముగా వారందఱునడచునప్పటికి గ్రామము వారిమెదుట ననతిదూరమునఁ గనఁబడెను. ఈయాత్రికులు గ్రామసమీపమున కరుగుట, ఖానుయొక్క సేవకులు కోటబురుజులమీఁదనుండి దూరముననే చూచి రహిమానుఖానున కెఱిఁగింప నతఁడును సముచితవస్త్రములు ధరించి వారినెదుర్కొని సగౌరవముగ నాదరించి మదనసింగుయొక్క దురవస్థనుజూచి గాయమునుమాన్పు మంగలివానికై వర్తమానము నంపెనుగాని యతఁడూరలేనందునఁ గొంచెమువిచారించి ఖాను నాజరుజంగుతో నిట్లనియె. "తమ్ముఁడా! మంగలివాఁడు లేఁడని మనము విచారింపనక్కఱలేదు. ఉపలమఠమున నొకవృద్ధుండగు బావాజీకలఁడు. అతఁడెంతటిదైనను గాయములను గిటునాగినుగి బాగుచేయును. ఈతని నటకుఁ దీసికొనిపొండు" అని చెప్పి తన సేవకులలో నొకనిని మఠమును జూపుమని పంపెను. మదనసింగును మెల్లమెల్లఁగా మఠమునకుఁ దీసికొనిపోవువఱకు రాత్రి నాలుగు గడియల కాలమైనది. బావాజీయును సాయంకాలానుష్ఠానములను దీర్చుకొని భోజనముచేసి పండుకొనుటకు సిద్ధముగనుండెను. ఖానుచేనంపఁబడిన పరివారము ద్వారముననుండ ఖానుయొక్క సేవకుఁడు "బావాజీ మహారాజ్" అని కేకలువేసి తలుపు దట్టెను. బావాజీ యాతని కంఠధ్వని నానవాలుపట్టి తనకడ కతఁడెవరినో గాయముపడినవారిని దోడుకొని వచ్చెననియెఱింగి తనప్రక్కను బవ్వళించిన మనుమరాలిని మెల్లగఁ జేతితోఁదట్టి 'హేమలత! హేమ

లత! తలుపుఁదీయుమమ్మ' యని పిలిచెను. సాధుశీలయు నవనీతహృదయయు నగు హేమలత తనపితామహుఁడు పిలిచినంతటనే లేచి తన్నుతాఁడు పిలిచినకారణ మరసి నిద్రాభారముచేఁ గనులు నులుముకొనుచు నతిదీర్ఘమగు వేణీభరమువిడి పిక్కలపైఁ బడ మెల్లమెల్లగఁదలుపుఁదీసెను. అపుడు రాజసేవకులనలఁ వేయఁబడిన కాగడాల వెలుతురున హేమలత ముఖము సంపూర్ణశరత్కాలచంద్రమండలమువలె ముద్దులమూటఁ గట్టుచుండుటచే నొకనిమిషమువఱకును వారందఱు నిశ్చేష్టులై మదనసింగునియొక్క యవస్థనుమఱచి యనిమిషత్వమునొంది యామెను జూచుచుండిరి. వారియాశ్చర్య మొకకొంతతగ్గునఱ కామె తాతదగ్గఱకుఁ బోయెను. అంతట సేవకులు వృద్ధునితోఁ దమరాకకుఁ గారణ మెఱిఁగించి [illegible]ంగకయున్న రాజపుత్త్రునిఁ జూపిరి. వృద్ధుఁడును వానికి బ్రక్కగదిలో నొకమంచము వేయించి పూర్ణాంధుఁడు గనుక గాయమును దనహస్తముతోఁ దడవి "యిది దిట్టమైనగాయమే. అయినను రామదేవుని దయచే నాకిది సాధ్యమగునని తోఁచుచున్నది. మీరందఱు నావలకుఁబొండు. ఒకరుమాత్రమిచట నుండుఁ"డని చెప్ప వారినందఱు నవల కంపకముందే యంధుఁడయ్యు నేత్రము లున్నవానికంటె నేర్పుగ గాయమునుగట్టి దానిపై నొక పట్టికనైచెను. అంత వార్ధకమున నతనికిఁ గలయోపికకును నపారప్రజ్ఞకును నందఱు నాశ్చర్యపడి కన్నులున్నపుడెంత నేర్పరియైయుండునో" యని యోజింప నారంభించిరి. తరువాతవారిపరివారమున నొక్కనిదక్క తక్కినవారలనందఱ నావలకంపి వృద్ధుఁడు మనుమరాలినిజూచి "అమ్మాయి ప్రొద్దుపోయినది పండుకొను" మని చెప్పెను. కాని యెందుచేతనో హేమలతకు నిద్ర రాకుండుటచేఁ "తాతా! ఈయనయవస్థను నేను కొంతవఱకుఁ గనిపెట్టియుండెదను. పెద్దవాఁడవు నీవు నిద్రపొమ్ము నే నిదివఱకు నిద్రపోయినా' నని ప్రత్యుత్తరమిచ్చి తా నామంచమువద్దఁ గూర్చుండి మదన

సింగు లక్షణములఁ జూచుచుండెను. యోగియు మదనసింగుయొక్క యనుచరునివలన నతఁ డుత్తమరసపుత్రవంశస్థుఁ డని యెఱిఁగి గాయము తగిలిన కారణ మడిగి తెలిసికొని పిమ్మట నిద్రపోయెను. రసపుత్రుం డును సుఖముగాఁ గొంతవఱకు నిద్రించెను. హేమలత యతనిమంచము దగ్గఱఁగూర్చుండి తెప్పవాల్పక చూచుచుండెను. హేమలత యసమాన రూపలావణ్యములయం దాకాలపు స్త్రీలలోనెల్ల శిరోరత్నమై యుం డెనని చెప్పుటకుసందియములేదు. నిరంతరము నామెను బాయకుండు సద్గుణములుతక్క తదితరభూషణము లామెకడ లేవు. ఆకర్ణాంతవిశాలనే త్రములును, దొండపండువలె సహజారుణ్యముగల మోవియు వంకరతి రిగి విండ్లవలెనున్న కనుబొమలును, నిరంతరమందహాసమును, నామెము ఖారవిందలావణ్యమును బరిపూర్ణత నొందించెను. ఆమె పితామహుఁ డాగ్రహము వచ్చినప్పుడు బాలికగ నుండుటచే శుక్లపక్షచంద్రమండల మువలె దినదినప్రవర్ధమానమగు, నామె రూపమును జూచి తత్పురవాసు లామెయెడ ననురాగసమేతులయిరి. ఆమె రాజవీధిని బోవుతఱి తేఱి పాఱి యామెను గన్గొనని బాటసారులును దక్కుంఠముసఁ బుష్పహార ములు వేయని పూలవర్తకులును, నామెకొఱకు జక్కెర పెట్టని కోమ టులును లేరు. కాని యాజగన్మోహనాకారము ప్రజలకనేకులకు విచా రకారణమయి యుండెను. ఇంత సౌందర్యవిలాసవతియగు కన్య యేమ హారాజు గర్భమునన్నైన నుదయింపక నిరుపేదయయిన జాత్యంధుని మనుమరాలయి పుట్టి సామాన్యస్త్రీవలె పాటుపడవలసివచ్చెనుగదా యని జనులందఱు విచార మొందుచుందురు. కెంజిగురాకులకు వన్నె దెచ్చు నామె పవిత్రహస్తములతో బావినీరు తోడునపు డామెవేళ్లు కంది నొప్పులెత్తుటఁజూచిన స్త్రీలందఱు నొకమారు కంట తడిపెట్టుకొని యామె నేపనిని జేయనీయక తామె యామెకయి సకలకార్యములఁ జేయుచుందురు. ఈమెసంప్రాప్త యౌవనయైనదిమొద లామెతాత

యామెను వీధిలోని కరుగవలదనియు, దురాత్ములదృష్టిని బడవలదనియుఁ బలుమాఱులు చెప్పుచుండుటఁబట్టి మునుపటివలె నిలువెడలక గృహమునఁ నేయుండుట కారంభించెను. అంధుఁడయిన పితామహుని పరిచర్య యం దతిశ్రద్ధగలిగి యతని కామె సమస్తోపచారములు విసుగక చేయుచుండును. అందుచేతనే నిద్రాభంగ మగుచేని తాత కనారోగ్యమగు నని యతని నిద్రపుచ్చి యామె భోగమందమువద్దఁ గూర్చుండెను. అప్పుడు రెండుజాములరాత్రియైనది. మదనసింగును గాఢనిద్రాసక్తుఁడై స దుమ "ఓరీ, దురాత్ములార రండిరండి మీ ప్రాణము లపహరింపక మానను సుడీ" యని రెండుసారులు పలవరించెను. ఒకపర్యాయము లేచి దాహముతీరఁగ యుత్తరిగలి పంపుకొన్నప్పుడు మనుష్యాకారముధరించిన సౌందర్యదేవతవలె కన్నులయెదుట నిలిచి తనకు దాహ మొసంగిన కాంతారత్నమును గన్నెత్తిచూచి మరల నిద్రపోయెను. హేమలత యాతని ముఖావలోకనముఁ జేయుచు సౌందర్యమందిరమైన యతని ముఖారవిందమున సంకురించుచున్న తాను లోనవ్వు నవ్వుచు, వానిశరీరమునఁ జెమ్మటపట్టుటచేఁ దనశరీరమునఁ జెమట పట్టువఱకును విసనికఱ్ఱతో విసరుచు గాయములవలన రాచకొమరుఁడు బాధపడుచుండె నని దానంతయు విచారపడుచు నతఁడు వ్యాధిపీడితుఁ డగుచేళ; తాతను లేపి యౌషధ మొసఁగుచు నతనితో సమస్తబాధలఁ దాను పడుచు సకలోపచారములఁ జేయుచుండెను. మదనసింగుయొక్క మనోహరాకారమును జూచినదాదిగ హేమలత కదివఱకెన్నఁడును జనియింపనిదియు నిట్టిదని నిరూపింపరానిదియు నగునొకానొక మనోవికారముదయించెను. దానితో బాలికకు రాచకొమరునియందు ననురాగము పుట్టెను. హృదయము గాఢముగ క్షత్రియపుత్రునియందుఁ దవుల్కొని మరల్చుకొందమని యయ్యబల ప్రయత్నించిన మరలకయుండెను. అందుచేత రాచకొమరుఁ డచిరపరిచయుఁ డయినను "గుణసముద్రుఁడై కనుపించెఁ దొరసీతని కంత బాల్యమునం

దింతకష్టమేల సంప్రాప్తింపఁజేసితివి దైవమా ! ఈగండము నిరపాయముంగ యుబ్రికితిమెన్నఁడయిన బట్టగట్టునా" యనిదైవము ననేకవిధంబుల వేఁడుకొనుచు నిష్టదేవతా ప్రార్థనమొనర్చుచు నామె చింతించుచుండెను. అపుడురసూరమి యొకజాముప్రొద్దుండుటచే కోడికూఁతవలన యోగి మేలుకొని మనుమరాలిని బిలిచి 'అమ్మా నీవు రాత్రియంతయు మేలుకొన్నావు. ఇఁక నేను కనిపెట్టుకొనియుండెదను. నీవు నిద్రపొమ్మ' అని చెప్పి రోగిమంచముదగ్గఱకుఁ బోయి యాతనినాడి చూచి జ్వర మతితీవ్రముగా నుండుటచే మఱియొక్క గొప్ప మందు వేసి మనుమరాలిని నిద్రపుచ్చి తానొంటరిగఁ గూర్చుండెను.

అపుడు తనకు జరిగిన మహాపకారము జ్ఞప్తికిరాఁగా 'ఆహాహా ! అల్లాయుద్దీను చక్రవర్తియొక్క క్రౌర్యము నన్నెంతవఱకుఁ దెచ్చినది. భగవంతుఁడు దుర్మార్గులకుఁ దోడ్పడుట కలియుగధర్మముకదా హా! జాలాలుద్దీనుచక్రవర్తీ ! ఎందున్నావు. అట్టి ధర్మశీలుఁడగు పినతండ్రినిఁ జంపి సింహాసనమెక్కిన యల్లాయుద్దీనునకు నామీఁద దయ యెట్లుండును ! ఇంతకు దైవానుగ్రహమేమో' యని స్వాత్మవిచార మొందునప్పటికి రోగి దాహ మడుగుటవలన యోగి తనతలంపు మాని దాహమునకిచ్చి శరీరముపైఁ జేయునైచి జ్వరము తగ్గినదని యోగి సంతోషించి రాచకుమారుఁడు జీవించునని నిశ్చయించుకొనెను. తరువాత కొంతసేపటికి కాకులుకూయ నుదయపర్వత శిఖర మలంకరించుచు సకలజనమిత్రుండగు సూర్యుఁ డుదయించి తన యరుణకాంతి దిగంతములయందుఁబర్వ బంగరుపూఁతవలె నలరు లేఁత నీరెండ సమస్తపదార్థములపై వ్యాపింపఁ జేసి వాని కపూర్వాలంకార మొసఁగెను. తనయాప్తమిత్రుని యవస్థ యెట్టులున్నదో యెఱుఁగఁగోరి సూర్యోదయ పూర్వముననే లేచి రహిమానుఖానుప్రముఖులను లేపి తన వెంటఁబెట్టుకొనివచ్చిన నాజరుజంగు తనమిత్రుస్థితి యపాయమును దాటినదని

సంతోషించెను. కాని రహిమానుఖాను రోగి యోగక్షేమములరయక యవల ప్రక్క గదిలో తలుపుచాటున నిలువఁబడియున్న హేమలత యొక్క యరుణపదపల్లవములఁ జూచి యాశ్చర్యపడి యాప్రక్కనే తనచిత్తమును నిలిపి నాజరుజఙ్గు మదనసింగులు తనతోఁ జెప్పుచున్న మాటల కసంబద్ధప్రత్యుత్తరంబుల నిచ్చుచు "నేను విన్నదానికిని నేఁను చూచినదానికిని సరిపోయినది. నందుఁను సమయమునకులేక పోయెను గద. అయిననేమి?" యని, మనశ్శాంతి కలుగమి వారితో "నాకీదినము న తల దిమ్ముగానున్నది. మీ రనుకొనుమాటలు నాకు వినఁబడుచుం డుట లేదు." అని చెప్పెను. మదనసింగును నాజరుజంగును ఖానుసాహే బుయొక్క ముఖలక్షణములు మారుటయు నతం డసంబద్ధసంభాషణుం డగుటయు గ్రహించి కారణ మూహింపఁజాలక యూరకుండిరి. త రువాత నందఱును కోటకుఁ జనిరి.



మూఁడవ ప్రకరణము.



మదనసింగునకు గాయము తగిలిన మఱునాఁడు రహిమానుఖా ను తనయంతఃపురమ న నొకగదిలో గీఘ్ఱవిచారమున బాధపడుచుఁ గూర్చుండెను. అపుడు వానియెదుట కిర్వురు సేవకులు వచ్చి భయ వినయములతో వంగివంగి సలాములుచేసి కట్టెదుట నిలువంబడిరి. అది సంధ్యాసమయముగనుక కార్యాంతర మాలోచించుచున్న ఖాను వారిని గుర్తింపక "ఎవరువారు?" అనిబిగ్గఱగ నఱచిచూచి ఓహో! నం దుఁడా! రెండవవాఁడెవఁడు? ఓరీగులామన్లీ! మీరు సుఖముగా వచ్చి నారా? యని పలుకరించెను. అంతట నాసేవకద్వయము "ఏలినవారి కటాక్షమువలన మే మీ గడియవఱకు సుఖముగానున్నాము స్వామీ" యని కంట నీరుపెట్టుకొనఁజొచ్చిరి. ఖానుసాహే బదిరిపడి జరిగిన

యావద్వృత్తాంత మెఱిఁగింపుమన వారిలో నందొకఁడిట్లు జెప్పసాగెను. “మ
హాప్రభూ! ముందుగ నిన్నటివృత్తాంత మెఱిఁగించెదను. నిన్నను దయమె
వరో పదుగురుమనుష్యు లాగ్రానగరమునుండి యెటకో పోవుచు మాక
గపడిరి. భాగ్యవంతులగు బాటసారుల విడువవలదని యేలినవారిచ్చిన
హుకుముప్రకారము వారు ధనవంతులవలె నుంటచే మే మిరువది
యెదుగురము వారిపైఁబడితిమి. తరువాత నేమి మనవిచేయుదును
మహాప్రభూ! అందొక సుందరుఁడగు రాజపుత్రుఁడు మాపైఁబడి
మాలో తక్షణమే పంద్రెండుగుర స్వర్గమున కంపెను. మిగిలినవా రా
ఱ్వురు గాయములఁ జెంది మరణమునకు సిద్ధముగ నున్నారు. కాని
యారాజపుత్రునకు గాయము దిట్టముగఁ దగిలినది స్వామీ” యని
చెప్పి కన్నీరు కాల్వలుగట్ట నేడ్చుచు గద్గదస్వరముతో మనశాలాశకూ
డ మృతినొందెను. మహాప్రభూ! యని రోదన మారంభించెను. ఈవృ
త్తాంతము సవిస్తరముగ నాలకించినంతనే నాహెబునకు మహాకోప
మును భయమును నాశ్చర్యమును నేకకాలమున జనియింప గడియదాఁ
క మాటాడలేక కొయ్యవలె నుండెను. తుదకు ధైర్యముఁ దెచ్చుకొని
“ఔరౌరా యెంతపనిఁ జేసితిరి. కొంప మునిఁగినది. పాపముండ కొడు
కులు మీ రొక కార్యము చక్కఁ జేయఁగలరా? అయ్యయ్యో! వారు చ
క్రవర్తికడకు రాయబారమువచ్చిన రాజపుత్రకుమారుఁడు మొదలగు
వారు. ఈగ్రామమున వారిప్పు డున్నారు. వారిలో మన నాజరుజంగు
కుమారుఁడు నున్నవాఁడు. నావిషయమై యతఁడెఱుఁగును. చక్రవర్తితో
సంభాషింపకమానఁడు. హా మౌలాఅల్లీ! హా మహమ్మద్! ఈగండ
ము గడిచినయెడల నూఱుగురు ఫకీరులకు నన్నముఁ బెట్టించెదను” అని
ధైర్యము వదలి పిఱికిస్వభావము గలవాఁడగుటచే సేవకుల నిందింపఁ
దొడఁగెను. అప్పుడు గులామల్లీ గడగడవడఁకుచుఁ దన యేలిక పాదము
లపైఁబడి మేమది యెఱుఁగక గోతిలోఁబడినాము. మహాప్రభూ మీ

గులాపువాండ్రను రక్షింపవలయునని స్వామిని బ్రార్థించెను. తరువాత ధైర్యముఁదెచ్చుకొని ఖాను తదనంతరవృత్తాంతము నెఱింగింపుఁడని వారల నడుగ నందుఁడు నోట మాటాడక నొకసంచిని దెచ్చి యందుండి యొక కాగితములకట్టను బైటకుదీసి "మహాప్రభూ ! ఇది యమునాతీరమున దేవాలయమునద్ద మాకొక యోగిదగ్గఱ లభించినది వానిని గడతేర్చి యిది తెచ్చినాము. ఏలినవారు చిత్తగింపవలెను" అని చేతి కందిచ్చెను. అతఁడాకాగితముల నందుకొని దీపముఁ దెప్పించి వానిని జక్కఁగఁ జదివి పరీక్షించినపు డందుమిగుల రహస్యమగు కాగిత మొకటి కనఁబడుటచే విచారసమేతమగు ఖాను మొగము మందహాసముతో వికసించెను. నూతనముగ సంభవించిన యీకాగితములయందు తాను జక్రవర్తికిఁ దయ సంపాదించుకొనుట కాధారములు కలిగినవి. అందుచే నానందపారవశ్యమున నెనుకటి చింతమఱచి గులామును భోజనమునకుఁ బొమ్మని పంపి, నందుని దూరముగఁ దీసికొని పోయి యిట్లు జెప్పఁదొడఁగెను. నందా నీవు మిగుల విశ్వాసము కలవాఁడవు. నీతో నాకు రహస్యకార్య మొకటి కలదు. ఆకార్యము జేసినయెడ నీచేతినిండ వరహాలు పోసెదను. ఈగ్రామమున నంధుఁడగు యోగినద్దనున్న యాసుందరాంగిని నాకడకు నీవు మాయోపాయమునను సమ్మతిను తీసికొనిరావలయును. దానిని వివాహమాడకున్న నేను జీవింపఁజాలను. నీనిమిత్తము నే నెదురుచూచుచుంటిని. అని చెప్పినతోడనే నందుఁ డులికిపడి శరీరము జల్లుమన "స్వామీ! ఆమె సద్గుణవంతురాలు. ముసలివాఁడును మిగుల మంచివాఁడు. జనుల కందఱకు నతనియందు భక్తి కలదు. అదినాకు సాధ్యమగునా?" యని నందుఁడు తనయసమర్థత నెఱిఁగింపఁ గోపోద్దీపితుఁడై ప్రక్కనున్న ఖడ్గమును జేఁబూని విశ్వాసఘాతుకుఁడా ! నాసొమ్ముదిని నాకార్యమును జేయలేవా? ఇది చేయవేని నీప్రాణములు దక్కవుసుమీ యని బెదిరింప నందుఁ

డగు నందుఁను మ్లేచ్ఛునిపదములపైఁబడి దేవా ఆగ్రహింపకుఁడు. నాప్రాణములనైన ధారపోసి యీకార్యము సాధించెదను. గోవింద శాస్త్రియింట దాఁపియగు రాధనలన నీకార్యమగును. నేనెలలోపున సమకూర్తును. అని వాగ్దానము చేసినతరువాత తురుష్కుఁడు సందు నివిడువ నతఁడు మృత్యువని ముఖమునుండి వెడలినట్లు సంతోషించుచు స్వామికార్యసాధనమం దుపాయములఁ బన్నఁదొడఁగెను. ఇదియిట్లుండ మదనసింగునకు గాయము నెమ్మదిగా నున్నదని హేమలత యిష్టదేవత లకెల్ల ముడుపులఁగట్టుచు సంతోషించుచుండ నాజరుజంగు నమితానంద భరితుఁడయి భగవంతునకు నమస్కరించెను. మదనసింగునకు నానాఁటి కారోగ్యముగలుగ నారంభించెను. రక్తక్షయమయినది గనుక అతనికి నీరసముదక్క తక్కినరోగ మేదియుఁ గానరాదయ్యెను. ముసలి వాని నేర్పుచే నరములకు బలము కలుగుచుండెను. తన ప్రియమిత్రుఁ డారోగ్యస్నాన మొనర్చునంతకు నాజరుజం గాగ్రముఁబాసి పోఁదలఁచుకొనందున దానచట నుండునంతకాలమును ఖానుగారియింట బసచేసి ప్రతిదినమును ఖానుయొక్క దుర్గుణములను, మర్కటచేష్టలను స్వానుభవమువలన గ్రహించుచుండెను. అందుచే సద్గుణసంపన్నుఁడై నందున, నన్యమతస్థుఁ డయినను సింగునం దనురాగంబును స్వమతస్థుఁడు నాప్తబంధుఁడునైనను దుర్గుణుఁడయిన ఖానునెడ నసూయయు నాజరుజంగునకు గలుగ నారంభించెను. హేమలతచేయు వివిధోపచారములును నామె రూపాతిశయమును సుగుణవైభవమును మదనసింగు హృదయమున నామెయెడ గాఢానురాగమును గల్గించెను. మధ్యాహ్నకాలమున సింగునకు నిద్రరాకుండఁగా చిన్ననాట తాతదగ్గఱ నేర్చుకొన్న హిందీభాషలోని భక్తిరసప్రధానములగు నీతికీర్తనల హేమలత శ్రావ్యతరకంఠముతో నప్పుడప్పుడు పాడుచుండును. ఒకప్పుడు తాఁ బెంచుచున్న చిలుకకు 'రామరామ' యని మాటల నేర్పుచు

వినువారి చెవులకు విందు సేయుచుండును. ఈకన్య తనయీడునకును స్థితికినిడగిన విద్యలను దన పితామహునిదగ్గఱ నేర్చియుండుటచే నెవ్వరెవరులేని సమయములయందు తాతకు వినుపించువంకఁబెట్టి తేనెతేట లొలుకుమాటలతోఁ బుస్తకములు జదివి సింగునకు హృదయానందమును గలిగించును. అదిగాక వారిద్దఱుపెద్దపురుషు వృద్ధుఁడును వినోదకరములగు కథలను మ్లేచ్ఛరాజవృత్తాంతములను దనచిన్ననాఁటియుద్ధములను గొంతఁ జమత్కారముతో వర్ణించి చెప్పుచుండును. ఆ గ్రామవాసులందఱును రహిమానుఖానుచేష్టలను హాస్యరస ప్రసంగములుగ మార్చి వానికిఁ జెప్పి నవ్వించుచుందురు. అందుచే నిరంతరానందమగ్నుఁడయి సింగు త్వరలో నారోగ్యస్నానము జేసెను. సింగు సద్గుణవంతుఁడనియు సద్వంశసంభూతుఁడనియు నెఱిఁగి వృద్ధయోగి తనదీన చరిత్రమును రాచకొమరునకుఁ దెలియపఱుపఁగోరి యాతనితోఁగూడ నొకటిరెండుసారులు తనయిచ్ఛఁ దెలిపెను. కాని యతఁడు విన నుత్సహించెనుగాని యోగి యే కారణమునో చెప్పలేదు. చిత్తూరునుండి బయలుదేరి చిరకాల మగుటచే భీమసింగుమహారాజు తనకయి యెదురుచూచుచుండునని ప్రయాణమై పోవుటకు సిద్ధముగనుండియు యోగి బలవంతపెట్టుటచే మఱికొన్నిదినాలు వారి మాట నుడుగనివ్వ్రతించి యొకనాఁడు రహిమానుఖానుగారి దర్శనముఁజేసి యాతనిచ్చెఁగయుఁ గోటయుఁ జూడవలెనని పోయి యనేకరాజకార్యములను ముచ్చటించుచుఁ బ్రసంగవశమున మదనసింగు ఖానుతో నిట్లనియె—

మద—మిత్రుఁడా! నన్ను కోపగింపకుందువేని నీకొక సలహా చెప్పుదును.

రహి—మంచిసంగతికి కోపమెందుకు! అవశ్యముగాఁ జెప్పవలసినదే.

మద—ఈగ్రామమున మీకీర్తి చక్కఁగా లేదు. మీరు ప్రజల నవమానము చేయుదురనియు బాధించుచుందురనియు నందఱుఁ జెప్పుకొనుచుండ వినుటకునాకుఁ గష్టముగ నున్నది. అదిగాక దొంగతనములు మొదలగునవి మీవలన జరుగుచుండునని జనులు దురభిప్రాయముఁ బడియున్నారు. అట్టి దురభిప్రాయమును మీసత్ప్రవర్తనము వలన మీరు పోగొట్టుకొనవలెను. మీదగ్గఱనున్న తుచ్ఛసేవకులను ద్వరితముగఁ బంపివేయుట మంచిది.

అని యివ్విధమున హితోపదేశమును జేయుచున్న రాజకులభూషణునిపయి మహమ్మదీయుఁడు త్రొఁచుపామువలె లేచి తన చేత నున్న ఖడ్గముతో నాతని నొకదెబ్బ వేయఁబూనెనుగాని నాజరుజంగాతనిఁ బట్టుకొని యాదౌర్జన్యము నివారించెను. వెంటనే సింగమువలె సింగును లేచి యాయుధపాణియై నిలువ ఖానును వెనుక కేగెను. అనంతరమామందిరము విడిచి మదనసింగు నాజరుజంగుతోఁ గలిసి సుఖముగ కరుదెంచెను. తన దురాచారమును చక్రవర్తికి నివేదించి తన కపాయమును గలుగఁజేయుదురని నాజరుజంగుమదనసింగులపై ఖానుసాహేబునకు కేవలకే యాగ్రహమును, ననుమానము నుదయించినవి. గోరుచుట్టుపై రోకటిపోటనునట్లు వేఁటికథ దాని నత్యున్నతస్థితికిఁ దెచ్చినది. రాజనందనుని సంబంధమున సజాతీయుఁడైన నాజరుజంగుపై నతనికి మహాగ్రహము కలుగి, వేయుపాయములను బన్నియైనను వే నేరములను జక్రవర్తితోఁ జెప్పియైనను తాను నిర్దోషియనిపించుకొని, వారిపరాధులని దండింపఁజేయవలెనని మహమ్మదీయుఁడు యోచింపుచుండెను. శత్రురాజ్యమున నుండుట ప్రాణాపాయకారణమని మదనసింగు ప్రయాణమగుచుండెనుగాని యతని ప్రయాణము హేమలతకు దుఃఖకారణముగ నుండెను. పై వాదము తటస్థమైన మరునాఁడు తెల్లవారునపుడు ప్రయాణము నిశ్చయింపఁబడెను. ఆరాత్రి హేమలత యన్నము ముట్టుకొన

లేదు. ఎట్లయినను రాకొమరుఁడు పోకతీరదని తలఁచి వృద్ధయోగి రహస్యముగ నొకగదిలో కాతనిం దీసికొనిపోయి రహస్యమును బయలుపరుపకుండ ననేకప్రమాణములఁ జేయించి యొట్టుఁబెట్టించి తన పూర్వాశ్రమ విచిత్రవృత్తాంతము సవిశేషముగాఁ జెప్పనారంభించెను. 'నాయనా! నీవు నాకుమారుని వంటివాఁడవు నిన్నుజూచిన నాబంధువులందఱు వచ్చినట్లున్నది. నాదీనమైన చరిత్ర నకుఁ దెలియఁజేయుమనియు నీవలన నా కుపకారము కలుగుననియు నా యంతరాత్మ నన్ను ప్రేరేపించుచున్నది. అంద అనుకొనునట్లు నేను బావాజీని కాను నేను ఉత్తమరాజపుత్రవంశస్థుఁడను మాకాపురము జయపురము. కాలవశమున నేను స్వదేశమును బాసి ఢిల్లీచక్రవర్తియొద్ద ఫౌజుదారుగ నుంటిని. నేనును నా కుమారుఁడగు జనార్దనసింగును ఖిల్జీవంశస్థాపకుఁడగు జలాలుద్దీనువద్ద సేనానాయకులుగా నుండి యతని యన్నకుమారుఁడును బ్రస్తుతచక్రవర్తియునగు నలాయుద్దీనుతోఁ గూడి దక్షిణహిందూస్థానముపై దండెత్తినారము. అచట మహారాష్ట్రరాజ్యమును జయించినపుడు నేను చాల సహాయ్యమును జేసినాఁడను. జలాలుద్దీనునకు నాయందు పుత్రవాత్సల్యముండెను. దక్షిణహిందూదేశమునుండి వచ్చిన తరువాత నలాయుద్దీనుకు బినతండ్రిని గపటముగ వధించి తాఁ జక్రవర్తియగుటకు దురుద్దేశము కలిగెను. ఆకాలమున నే నాతని కాంతరంగికుఁడ నగుటఁ జేసి నాతో నాతఁ డాలోచింపరాఁగా నే నట్టి దుష్కార్యమునకు నీయకొనక నిరుత్సాహము గల్గించి రాజభక్తవలన యువరాజును గొంచెము నిందించినాఁడను. అలాయుద్దీను మహాగ్రహముతో మండిపోయి యారాత్రి—హా యేమని చెప్పుదును—నా రెండుకన్నులును దనఖడ్గముతోఁ బొడిచివైచి నాకు శాశ్వతమైన యంధత్వమును దెచ్చిపెట్టెను. తరువాత నన్నుఁ జంపుమని సుబేదారులలో నొకనికతఁడుత్తరువిచ్చి నాప్రియపుత్రకు నారాత్రి చంపించెను. నాపూర్వస్నేహితులందఱు నన్నుఁ జంపకుండ

మాయోపాయములచే రక్షించి నన్నీ గ్రామమునకుఁ బిల్లకేలోఁబంపిరి. ఈపిల్ల యప్పటి కేడుసంవత్సరముల పసికూన. నిష్ప్రయోజనమైన యీజీవనముకంటె మరణమే యుత్తమమని తలంచియు నీపసికూన నిరాధారయైయుండునని జెట్టంతకొడుకును జంపుకొనియు మొండినై యిట్లు జీవించినాడను. ఆమసునాఁడలాయుద్ధమున తనపినతండ్రిని జంపించి మరికొన్ని దినములకు మహావైభవముతోఁ దాను జక్రవర్తియయ్యెను. ఈతఁడు నీతియుఁ బాపభీతియు గలవాఁడు. ఒకటితలఁచి యొకటి పలుకును కుమారా! నాదశయిట్లులున్నది. నెబ్బదియేండ్లవాఁడను. నాకుమరణము సమీపించుచున్నది. ఈబాల సంప్రాప్తయౌవన. నే మృతినొందిన దీనినెవ్వరైన బలాత్కారముగ నవమానింతురు. నాకుఁగల బెంగయిదియే. నాకిప్పు డెట్టులైనఁ జిత్తూరనగరము చూడవలెనని యున్నది. భీమసింగు మహారాజుతో నాదీనదశఁ దెలిపి నాపై ననుగ్రహము గలిగించిన నీకు మిగుల పుణ్యముండును. నాపేరు నారాయణసింగు. అహాహా నారాయణసింగుదశ యెంతవఱకువచ్చినది. ఇరుపార్శ్వముల నెచ్చట దిక్కులేక యనాథుఁడనై యున్నానుగదా నాయనా! అనుచు సహజధైర్యమును విడుచుచుఁ గొలకులనుండి వేఁడికన్నీరొలికి తన తెల్లగడ్డము దడియ నేడ్వసాగెను. వజ్రసమానహృదయమును గనికరమును స్ఫురియించు నారాయణసింగు దీనచరిత్రము విని మానసింగు క్షత్రియకాఠిన్యమును విడిచి యొక్కనిమిషము విచారించి పిమ్మట " తాతా నీవు విచారింపకుము కష్టములు దైవికములు. మీవిషయమును భీమసింగు మహారాజుతో నేను జక్కఁగాఁజెప్పి మీపై వారి కనుగ్రహము గలుగునట్లు చేసెదను. మీకష్టములు గట్టెక్కినవని నమ్ముఁడు, మీమనుమరాలికిఁ దగిన యుత్తమవంశజునిని వెదికి పెండ్లిచేయించెదను. నా మాటనమ్మియుండుఁడు. కొద్దిదినములలో మీకు నేను వర్తమానమంపెదను. అప్పుడు మీరురండు. రేపుదయమున నేను నిశ్చయముగఁ

బ్రయాణమైచిత్తూరుపోయెదను" అనిచెప్పియారాత్రి సుఖముగా నిద్రించెను. మఱునాఁడు రహిమానుఖానుకొద్ద సెలవుఁదీసికొని నాజరుజంగును నాగ్రినగరమునకుఁ బ్రయాణమయ్యెను.

మఱునాఁడు వేకువజామున రాజపుత్రిమహమ్మదీయు లొంటొరులవలన సెలవుగైకొనిపోవునపుడు మదనసింగు నాజరుజంగును రహస్యస్థలమునకుఁ గొనిపోయి గాఢాలింగన మొనర్చి "మిత్రుఁడా! మనమిరువుర మన్నదమ్ములవలెనుంటిమి మన మన్యజాతులవారమైనను మనకు భేదములేదు. ఇఁక ముందుండదు. నాకిదివఱకుఁ జేసినదిగాక యింకొక మహోపకారమును జేయవలయును. ఈవృద్ధుఁడును బాలికయు నిరాధారులయి యున్నవారు. వారికి రహీమానుఖానువలన భయము గలదు. అతనివలన నపాయము గలుగకుండ నీవు జాగ్రత్తపెట్టవలెను. ఈయూర నెనరికైనను వారి నప్పగింపుము" అన నాజరుజంగును నట్లే చేయుదునని యాపూటకుఁ బ్రయాణముమానెను. మదనసింగంతట నాజరునిజూచి "మనమింక మరల నెన్నఁడు కలియుదుమో? మామహారాజును మీచక్రవర్తియు సంధిచేసికొందురేని మనము రాకపోకలు కలిగి మన స్నేహబీజముయొక్క ఫలముల నందవచ్చును. కాదేని ప్రళయయుద్ధరంగమున మనము కలిసికొందుము. సాధ్యమైనపుడు నీక్షేమము నాకు దెల్పుచుండుము. నేఁ బోయివచ్చెదను సలాము" అని తనపరివారముతోడ బయలుదేఱి మాటిమాటికి హేమలతను దలఁచుకొని తిరిగిచూచి విచారించుచు వెడలిపోయెను. ఆనాఁటి మధ్యాహ్నము నాజరుజంగు తనతండ్రికిఁ బరిచయముండగు నబ్దుల్ ఖరీముఖాలవీ యను నాతని బిలిచి నారాయణసింగు నొప్పగించి వారికపాయము కలుగునపుడుసహాయుమొనరుగుమని చెప్పి వానిచేనట్లుచేయుటకు వాగ్దానముల గ్రహించి యారాత్రి బయలుదేఱివెళ్లెను. మాలవి యాగ్రామమునందు జనమిత్రుఁడును, భగవత్సేవాపరాయణుఁడునయి యుండుటచే

ప్రజల కతనియం దతిగౌరవము కలదు. నారాయణసింగును వైద్యమూలమున సకలజనోపకారి యగుటచేతఁ బ్రజలెల్ల నతనికాప్తులైరి. ఈపరిచయమువలన మాలవియు నారాయణసింగును మిత్రులై తమతమ మతములఁగూర్చి వాదములు సలుపుచు సుఖముగఁ గాలము బుచ్చుచుండిరి.



## నాల్గవ ప్రకరణము.



మదనసింగు పాలిగ్రామమును విడిచిపోయినతరువాత హేమలత కొన్నిదినములవఱకు మునుపటివలె సన్నపానాదులపై నిష్టము నిలుపక బెంగఁగొని చిక్కియుండెను. కాని ప్రాఁతబడినవెనుక యథాస్థితి కామె మరలవచ్చి సుఖముగానుండినను రాజకుమారుని యందమును, మృదుమధురభాషణంబులును మఱవక యెల్లప్పుడుఁ దలంచుకొనుచునుండెను. నారాయణసింగు, మదనసింగు తననిమిత్తమెన్నఁడు వర్తమానమంపునో యెన్నఁడు తాను తురుష్క రాజ్యపు సరిహద్దులఁ బాసి చిత్తూరురాజ్యమున సుఖముగనుండునో యని యెదురుచూచుచు నామార్గమునఁ బోవు బాటసారులనెల్లఁ బరీక్షించి యడుగుచు దినమొక యేఁడుగఁ గడుపుచుండెను. మాలవికిని, నారాయణసింగునకును స్నేహము నానాఁటి కధికమైనందునఁ బ్రజలు వారిమైత్రికి మిగుల నానందించుచుండిరి. నారాయణసింగునకును మనుమరాలికిని రహీమానుఖానుయొక్క దౌర్జన్యములం జూచినకొలఁది భయమధిక మగుచుండెను. ఖానుసాహేబునకు హేమలతయం దనురాగము క్రమక్రమముగ నభివృద్ధిసెంద రాజకన్య మ్లేచ్ఛనాయకుని హృదయమునం దెల్లప్పుడు నుండసాగెను. బలత్కారముగ నామెనుబట్టితెప్పించి తనయంతఃపురమున బంధించి సఫలమనోరథుఁ డగుట ఖానునకు సులభమేగాని యందున నేమికీడు మూడునో

యను భీతియు వారికాప్తుఁడైన మాలవి కాగ్రహము వచ్చునను భయమును వానిని బాధించు చుండెను. మాలవి సంపదలులేక సామాన్యస్థితిలో నున్నను, వాని విద్యాసంపదనుబట్టియు, సత్ప్రవర్తనమును బట్టియు, జనుల కాతనియెడ భయగౌరవములు గలిగియుండినవి. ధనము స్వీకరింపక దీనుల కుచితముగ నౌషధములిచ్చుటఁ బట్టియు, వయోవృద్ధుఁ డగుటఁబట్టియు నారాయణసింగునందు జనులకు మిగుల గౌరవముగలదు. వారిరువురకపకార మొనర్చినవారు ప్రజల కందఱకును విరోధులై యుందురు.

స్వామికార్యమునం దపరిమితోత్సుకుఁడై నందుఁడు శక్తివంచనలేక పాటుపడుచు నేవిధంబుననైన హేమలతను దనయజమానునకు సమకూర్పవలెనని సకల ప్రయత్నములఁ జేయుచు ముందుగ రాధతో స్నేహముచేసెను. ఈరాధ కిపుడు రమారమి పదునారు సంవత్సరము లుండును. దానితల్లి భర్తను విసర్జించి లేచివచ్చి వ్యభిచారవృత్తి వలన జీవించి రాధ కెనిమిదిసంవత్సరముల వయస్సున్నప్పుడు మృతినొందెను. అప్పటినుండియు రాధ బ్రాహ్మణులయిండ్లఁ బ్రాచిపనిఁజేసి బ్రతుకుచుండెను. అదియిప్పుడు గోవిందశాస్త్రియను బ్రాహ్మణునియింట నుండెను. ఆమె యుక్తవయస్కురాలైన వెనుక శాస్త్రి వివాహముచేయఁదలఁచెనుగాని రాధ తనతల్లివృత్తియందే ప్రవేశింప నిచ్ఛగలదగుటచే శాస్త్రియుఁ దనయుద్యమమును మానుకొనెను. రాధ మిగుల సౌందర్యముగల శూద్రాంగన యగుటచే స్వల్పకాలమున నామెగ్రామముననున్న పడుచువాండ్రకందఱకుఁ బ్రాణమిత్రురాలయి యఱచేతి నిమ్మపండువలె నుండుటయెగాక యొకపర్యాయము ఖానుగారి హృదయమునుగూడ నాకర్షించెను. ధనమును నధికారమునుగల ఖానుమైత్రి యామెకిష్టమెగాని తన కన్నవస్త్రముల నిచ్చుచున్న హిందువుల కాగ్రహమువచ్చునని యామె వెనుకదీయుచుండెను. నందుఁడు

దాసీపుత్రుఁడగనుక రాధతో సులభముగ స్నేహముచేసి తనస్వామి మనోరథమును దెలియపఱచి కార్యసాఫల్యముఁ జేయుమని ప్రార్థించెను. నందునిమాటఁ దీసివేయలేక రాధ యందున కియ్యకొని బావాజీ మఠమున కనుదినమునుబోయి హేమలతతో నేదోవంకఁబెట్టి మాటలాడుచు నామె పరిచయమును సంపాదించెను. పరిచయమయినది మొదలు హేమలత కామె పనిపాటలు చేయుచు వినోదకథలను జెప్పి యామెను సవిశ్వించుచు నుండెనుగాని దుస్సహావాసమొనర్చుట కిష్టములేక రాధతోఁ దిన్నఁగా మన హేమలత మాటలాడదయ్యెను. ఈ ప్రకారము మదనసింగు పాలిగ్రామమున నున్న కాలమునను రాధ రెండుసారులు హేమలతకొఱకు వచ్చి సింగును జూచి మోహించి యాతనితో మాటలాడఁ బ్రయత్నించినదయ్యు నతఁడు ప్రత్యుత్తర మొసఁగకుండుటచే మరలవలసినదయ్యెను. రాధకు మదనసింగునందుఁగల మోహ మతిశయింప దాసిగనున్న తనయంతరమును రాజపుత్రుఁడగు నతనియంతరమును నాలోచింపక నెట్లయిన నతనిని దనవలలో వేసికొనవలయునని యామె యత్నింపుచుండెను. హేమలతకు సింగునందనురాగము గలదని యెఱిఁగి యామెయందసూయ మనస్సున నిల్పి రహిమాన్ఖానున కీమెను సమకూర్చునెడలఁ దనకు సవతిగా నీమె యుండదనినమ్మి మదనసింగును దాను స్వాధీనపఱచుకొనవచ్చునని నిశ్చయించెను. అందుచే “ నేకక్రియాద్వ్యర్థకరీ ” యని యామె ఖానున కుపకార మొనర్చునట్లును దనమనోరథము నీడేర్చుకొన్నట్లును గూడ నగునని రాధ హేమలతమనస్సు విఱుచుటకయి ప్రయత్నించి యప్పుడప్పుడు ఖానుయొక్క గుణరూపముల నామెకడ వర్ణించుచుండెను. ఒకనాఁడు ఖానుయొక్క రూపాతిశయమును రాధ వర్ణింపఁగా శరీరము వడఁక హేమలత భయమంది యాతని ప్రసంగమును దనవద్ద నెన్నఁడును దేవద్దని యామెను కఠినముగా మందలించెను. అప్పటినుండియు

సీదురాత్మురాలు ఖానుపరిసంగములను మానుకొని నందునితో "నీక హేమలతపై ఖానుని కాశయుండఁ దగదు. ఆమె కీతనియం దిష్టము లేదు. మదనసింగున కామె ప్రాణములిచ్చును. అని చెప్పఁగా ఖానుతో నందుఁడావార్త విన్నవించునపుడు వానికిగల్గిన దుఃఖము వర్ణింప నలవిగాదయ్యెనని యిట నేను వ్రాయనక్కఱలేదు. కామోద్రేకమును విచారమును మల్లడిగొన మహమ్మదీయుఁడు హేమలత నెట్లయినఁ జేకొని తీరవలయునని కృతనిశ్చయుఁడై నారాయణసింగునకును మాలవికిని మిత్రభేదము గల్పింపఁ బ్రయత్నించెను గాని యందుఁ గృతార్థుఁడు గాలేకపోయెను. అందుచేత నందుఁడును, ఖానును, వాని యితర సేవకులును దగు నుపాయమును వెదకుచుండిరి.

ఇది యిట్లుండగ ఖానునకు హేమలతయందు దృఢమోహము గలుగుచున్నదని జనులు చెప్పుకొనుటవలన కర్ణాకర్ణిని నారాయణసింగును మాలవియు, హేమలతయు విని యేసమయమున నేయపాయము మూడునోయని భయపడుచుండిరి. విదేశీయులయిన వారిని రక్షించుట తనవిధియని మాలవి వారి కపాయమురాకుండ నేమి చేయుదునాయని చింతింపుచుండెను. మదనసింగునొద్దనుండి యిప్పటికి నాలుగైదు మాసములు గడచినను వర్తమాన మేదియు రానందున నతఁడు తమవిషయమును మఱచినాఁడని వారాలోచించి నిరాశపడి గతితోఁచక యుండిరి. తుదకు వారందఱు నాలోచించి వృద్ధుఁడును మనుమరాలును నక్కడకు నాలుగైదు క్రోసులదూరమున నున్న యలీఘరుపురమున కిఁక బోవలెనని నిశ్చయించిరి. అందుచేత మాలవి వారిని బ్రయాణము చేసి యాయూరఁ బేరుగల యిర్వురు ముఖ్యమిత్రులకు నుత్తరములువ్రాసియిచ్చి సాధ్యమైనంతశీఘ్రముగఁ బ్రయాణమై పోవలసినదని చెప్పి వారితోఁ బోవుటకిర్వుర సేవకుల నేర్పఱచెను. ఆ

మధ్య హేమలతకు జ్వరమువచ్చుటచేఁ బ్రయాణ మాగిపోయెను. మాలవి నారాయణసింగుతో స్నేహముచేయుట తన కనిష్టముగ నున్నందున, ఖాను వానితో స్నేహము చాలింపవలసినదని యాయనకు వర్తమానమంపెను. మాలవి దానిని లక్ష్యపెట్టనందున కోప మతిశయింప వారి గర్వభంజన మొనర్చుటకుఁ గృతనిశ్చయుఁడై సమయమున కెదురుచూచుచు సాహేబు దినములఁ గడపుచుండెను. ఈనడుమ హేమలత జ్వరమువలన మిగుల బాధనొందుచున్నందునను, అది యే యూషధముచేతను లొంగకున్నందునను వృద్ధుఁడు కొంచెతియోచనమీఁద, నాగ్రామమునకు వచ్చియున్న గోసాయిని బిలిపించి యాతనితోఁ దనమనుమరాలి వృత్తాంతముఁ జెప్పెను. గోసాయినిజూచి హేమలత నమస్కరించి యెదుట నిలువ నతఁడామె నాశీర్వదించి యామెమొగమువంక తేఱిపాఱఁజూచి ముసలివాని శరీరము నామూలాగ్రముగఁ బరీక్షించి మిగుల నానందమునొంది తన యానందసూచకముగఁ గొన్ని మాటల ననుటకు యత్నించియు, బలవంతముగఁ దనసంతోషము నాఁపుకొని "ఆహా మీ రిరువురును జీవించియున్నారా? ఎన్నిదినములకు మీఁగపడినారు! భగవదనుగ్రహము మనపైఁ బూర్ణముగఁ గలదు" అని తనలో ననుకొని హేమలత నాడిపరీక్షించి కొంచెము దృష్టిదోషము తగిలినదని రక్షరేకు నొకదానినిచ్చి కంఠమునఁ గట్టుకొమ్మని చెప్పి, యామెచేయి ముద్దుపెట్టుకొని తరువాత వృద్ధునియొద్దకుఁబోయి యనేకవ్యవహారముల ముచ్చటించుచు నడుమ నిట్లనియె. "అయ్యా! తమసంగతినంతను నే నెఱుఁగుదును. మీరు బ్రతికియున్నారని నే నిదివఱ కెఱుఁగను. నేఁడు సుదినము" అని గోసాయి పలుకఁగా, వృద్ధుఁడు భయపడి నాయనా నీవెవరు? నాసంగతి బయలఁబెట్టకుము. అని బ్రతిమాలుకొనెను. గోసాయియు వృద్ధుని హస్తమునుబట్టుకొని నే నెవ్వరయిన మీ కెందుకు? నాసంగతి ముందుముం

చెప్పఁగఁగలరు. నాప్రాణముమీఁద మీకునమ్మకము గలదేని మీరహస్యమును నేను బయలు పఱుపనని ప్రమాణము చేయుచున్నాను. భయపడకుఁడు. నేనింక నిట నుండఁగాదు" అని చెప్పి వారివలన సెలవుఁ గైకొని గోసాయి యరిగెను. ఆదినమున గోసాయి గోవిందశాస్త్రి యింట విందారగించి గ్రామమున నే యుండెను.

ఆనాఁటిసాయంకాలమున పాలికోటలో నొకవిషమయిన కళవళము పుట్టెను. అక్కడనుండి కన్నులార నది చూచినవారికెగాని యన్యులకు దెలియదు. దీపములు పెట్టినంతోడనే రహమానుఖాను సాధారణముగ యుద్ధరంగమునకుఁబోవు సమయములయందు దాను ధరించు వస్త్రములను, గవచమును, ఖడ్గమునుధరించుకొని తనయధికారముక్రిందనున్న రాజభటులందఱును నట్లు కలహసమయానుకూలమగు వేషముల ధరింపవలెనని యాజ్ఞాపించెను. అట్లు సర్వప్రయత్నములు జరిగించి రాజభటసమేతుఁడయి ముష్కరుఁడగు నాతురుష్కుఁడు రెండుజాములరాత్రియైన వెనుక గ్రామమంతయు నిశ్శబ్దముగ నున్నపుడు, వృద్ధుఁడు నివాసముచేయుచున్న మఠమును జుట్టవేసి లోపలివారిని బిలువుమని సేవకులలో నొకని నాజ్ఞాపించెను. అతఁడును బావాజీయని పిలువ రోగపీడితు లెవరో యాపదలోనుండి వచ్చినారని, విసుగుకొనక తడవుకొనుచు లేచివచ్చి తలుపుఁదీసెను. వెంటనే నిర్దయాత్ముఁడగు కటకుతురక డెబ్బదిసంవత్సరముల ప్రాయముగలిగి యశక్తుఁడయి నిరాధారుఁడయి గ్రుడ్డితనమునఁ గదలలేక యతిదీనుఁడయి కాలముఁబుచ్చుచున్న నారాయణసింగు చేయిపట్టుకొని కఠినస్వరముతో, "నీదౌర్జన్యములు కుట్రలును విని నిన్ను తక్షణమే పట్టుకొని చెఱసాలయందుంచవలసినదని, చక్రవర్తిగారు మాకు త్తరువు నంపినారు. అందుచేత నిదిగో నిన్నిపుడు పట్టుకొన్నాను" అనిచెప్పి, "రెక్కలు విఱిచికట్టుఁడు జాగ్రత" యని సేవకులతో నుడివెను. కణ్ణాసూలముల కు నున్నయా

పలుకులు విని నిశ్చేష్టుఁడయి వృద్ధుఁడు నిలువఁబడి, "అమ్మా హేమలతా!" యని యొకకేకవేసి 'అయ్యయ్యో! నే నేమిచేసినాను. నావలన నేమియపరాధము వచ్చినది. చక్రవర్తి యుత్తరువు నే నెన్నఁడు నతిక్రమింపలేదు. నన్నుఁ బట్టుకొనుట యన్యాయము నన్ను విడువుఁడు' అని దీనస్వరముతో మనవిచేసికొనుచున్న వృద్ధునిమాటలను జెవినిడక రాజభటులు గట్టిగ బిగియఁదీసి రెక్కలు నొప్పివెట్టునట్లు వెనుకకు విఱిచికట్టిరి. నారాయణసింగు దీనాలాపముల నాలకించి రాజభటులుగూడ దయ గలవారయిరి. కాని మూర్తీభవించిన పాపదేవతయగు రహీమానుఖాను వానివిలాపమును జూచి, 'ఓరీ! బద్మాషి! లుచ్ఛా! ముసలిదొంగ! నోరుమూసికొనుము; లేకున్న కొరడాదెబ్బలు తినెదవు. ఏమియు నెఱుఁగనివానివలె నఱచెదవేమి. నీవు రాజపుత్రులను గలిసి చక్రవర్తిమీఁదఁ గుట్రలుచేయుచున్నావు. మీయింట బసచేసిన మదనసింగుతో నీవు మాటాడిన రహస్యముల నే నెఱుఁగుదును. నాజరుజంగుఁ నీకుట్రలనెల్లఁ జక్రవర్తితోఁ జెప్పినాఁడు. అందుచేత నాతఁడు నిన్ను కారాగృహమున కంపుమని యాజ్ఞయొసఁగెను. నీపాపము నీవే యనుభవింపు" మని నిష్ఠురముగఁ బలుకఁ దనపైవచ్చిన యపవాదమునకును, దురవస్థకును మిగులఁ గుందుచు వృద్ధుఁడుండ నీకోలాహల మంతయు విని హేమలత దిగ్గునలేచి బంధింపఁబడియున్న పితామహుని గాలయమునివలె నెదుట నిల్చియున్న రహిమానుఖానుని, యమదూతలరీతిఁ దనపితామహుని బట్టుకొనియున్న రాజభటులను, జూచి వెఱఁగుపడి శరవేగముతో నతనికడకుఁబోయి 'దాదా! దాదా' యని కెవ్వున నఱచి, వానిని గౌఁగిలించుకొని రోదనము చేయసాగెను. రాజసేవకులకు వెఱచియో యనునట్లు, సహజగాంభీర్యమును ధైర్యమును నారాయణసింగును విడిచిపోవ, మనుష్యస్వభావమును బట్టి పొరలిపొరలి వచ్చుదుఃఖము నాఁపలేక యతఁడు మనుమరాలిని గౌఁగిలించుకొని స్త్రీవలె 'అమ్మా! నేను చెఱసాలకుఁ

బోవుచున్నాను' అని పెద్దపెట్టున నేడ్చెను. ఇట్లు వాపోవు వారి ని రువురను జూచి దయావిహీనుఁడగు రహిమానుఖాను విచారమును లేశ మునొందక, హేమలత సౌందర్యాదులను గని యానందించుచు వారిని విడదీయ భటుల కాజ్ఞయొసఁగి ముసలివానిని లాగ నారంభించెను. ఈ నడుమ గ్రామమున నున్నవారందఱు నీకలకలధ్వనులవలనను, మిన్ను ముట్టుచున్న వారి రోదనధ్వనులవలనను మేలుకొని, మఠమునఁ జుట్టుకొ ని యావిచిత్రమును జూచుచుండిరి. దుఃఖభారమున నిలువలేక తాత మెడకు దనబాహులతికలను బెనవేసి గాఢాలింగనము చేసికొని విల పించుచున్న హేమలతను విడఁదీయుట దుర్ఘటమని తలఁచి తురుష్కు లు ముసలివానిని లాగుచుండ నందొకఁడు కొరడాతో బాలికచేతుల మీఁద రెండుదెబ్బలు కొట్టెను. ఆనొప్పిచే బాలిక కౌఁగిలింత వదలెను. వెంటనే రాజభటులు నారాయణసింగును గెంటుకొనిపోవుటఁజూచి 'అయ్యో! అయ్యో! దాదా! దాదా! నే నెట్లు బ్రతుకఁగలను. న న్నె వరి కప్పగించిపోవుచున్నావు! నా కెవరుదిక్కు! నన్నుఁ దీసికొనిపోవే మి? నే చచ్చిపోవుదును నే నుండలేను. అయ్యో! మాటాడవేమి! దా దా' యని సకలజనుల హృదయములును నీరైపోవున ట్లఱచి మొదలున ఱికిన వృక్షమువలె నేలఁబడి మూర్ఛిల్లెను. ఆమె మూర్ఛిల్లినవెనుక నా రాయణసింగును రాజభటులు తీసికొని పోవుటకు వలనుపడెను.

అంతట రహిమానుఖాను సేవకులలోఁ గొందఱి కాతని నప్ప గించి 'ఓరీ ముసలివానిని దీసికొనిపోయి కోటలోఁ జెఱలో నుంచుఁడు నాకింకను బనియున్నది. నేనిప్పుడే వచ్చెదను' అని వారలఁ బంపి హే మలతయింటికి నిర్వురసేనకులఁ గావలియుంచి తా నావలివీధికి గొంచె ము సాగిపోయెను. అచట నారాత్రి గుమిగూడిన గ్రామస్థులలో హే మలతానారాయణసింగుల దురవస్థఁదలఁచి కంటఁ దడిపెట్టనివారును మ హామ్మదీయుని నిందింపనివారును లేరు కాని యాంత్రికపాటులయి

యున్న రాజభటులకు వెఱచి యెవరును సాహసించి యాదురాత్ముల దౌర్జన్యమును మాన్పరయిరి. గాఢమూర్ఛనొందిన హేమలత, శరీరము నెఱుంగక రెండుమూఁడుసారులు 'దాదా! దాదా! తెల్లవారినది లెమ్ము' అనియు 'మదనసింగు! మదనసింగు!' అనియుఁ బలవరించి మరల మూర్ఛల్లెను. గ్రామస్థులు కావలియున్న రాజభటులకు వెఱచి యామెను సహాయ మొసఁగకయె క్రమక్రమమున నొక్కొక్కరుగఁబోవ నారంభింపఁ గొంతసేపటికి నెవ్వరును లేకపోయిరి. ముష్కరితురుష్కుఁడు సపరివారముగఁ బట్టణములో మహమ్మదీయులు నివాసముచేయు భాగమునకుఁ బోయి యబ్దుల్ ఖరీము పాలవిగ్రహమును ముట్టడించి, సుఖముగ నిద్రించుచున్న పాలవిని బక్కమీఁదనే పట్టుకొని బంధించెను. అతని దారపుత్రులు కర్తవ్యము నెఱుఁగక గొల్లున నేడ్వసాగిరి. ఆవీథివారందఱువచ్చి ఖానును కారణ మడిగిరి. కాని మొదటనాతఁడు నిరుత్తరుఁడయి తుదకిట్లులనియె. 'ఈతఁడు మహమ్మదీయుఁడై యుండియు హిందువులతో స్నేహము చేయుచున్నాఁడు కాఫరులతో నాలోచనలుగల యీపాపాత్ముఁడు సత్యమతస్థుఁ డగునా! అదిగాక రాజపుత్రులఁ గలిసి చక్రవర్తిపైఁ గుట్రయు పన్నుచున్నాఁడు. మతవిరోధియు రాజద్రోహియు నగు నీ దురాత్ముని బట్టి బంధింపవలసినదని చక్రవర్తి వద్ద నుండి నాకు హుకుము వచ్చినది. అందుచేతఁ బట్టుకున్నాను' అని చేతులు వెనుకకు విఱియఁగట్టించి పాలవిని జెఱ కంపెను. కాని మును నిర్జ్యాపీడితుఁడగుటచే రహిమానుఖానుఁ డొక్కరాత్రి తరోధుల నిర్వురను బట్టుకొన్నందున కానందించుచు సఫలమయి వారినిర్వురిఁ జెఱయొకగదిలో నుంచి తలుపులు మూయించి తాళములు వేయించెను. తరువాత గడియరాత్రియుండ నతఁ డొంటరియలుదేఱి మఠముకకువచ్చెను. అప్పుడు తానచట కావలియుంచి వహు లిద్దఱును గాఢముగ నిద్రించుచుండిరి. హేమలత పరిశ్రమచే

వాని నెన్నఁడును బాయని చేతికఱ్ఱయు నటఁ బడియుండుటయు జూచి కఠినచిత్తయయ్యు నామె స్త్రీజనస్వాభావిక మగువిచారమును బొందక తప్పదయ్యెను. తరువాత రాధ గృహమునంతను వెదకి హేమలత మ్లేచ్ఛునిపాలఁ బడియుండునని, తన మనోరథ మీడేరినదని సంతోషించి హేమలత వస్తువుల నన్నిఁటిని వెదక నారంభించెను. తనదగ్గఱనున్న మాఱుతాళములతో బోషాణముదీసి యందున్న సందువాపెట్టెమూఁత తెఱచి హేమలత యాభరణములను దొంగిలించి యందున్న రెండుకాగితములను దీసి చదువుకొన్న దగుటచే వానిని మెల్లఁగఁ జదువుకొని, నగలకంటె వానికయి సంతోషించుచు నెవరును జూడకుండ రవికెలోఁ బెట్టుకొనిపోయెను. అట్లు మదోన్మత్తుఁడై చిత్తవైకల్యము గలిగి ప్రవర్తించు రహిమానుఖానునకు నలాయుద్దీనుచక్రవర్తిదగ్గఱనుండి ఫరమానాయొకటి వచ్చెను. చిత్తూరుదండయాత్రనుగూర్చి సర్దారులతో నాలోచింపవలసియున్నదని ఖానును జక్రవర్తి రమ్మనెను. నిరంకుశమగు చక్రవర్తి యుత్తరువు నతిక్రమింపఁజాలక యొకవారములో ఢిల్లీకిఁబోవుచు, సింగును మూలవిడిని విడువవలదని తనక్రిందియధికారితోఁ జెప్పి చనెను. గ్రామస్థులందఱును హేమలత బలవంతముగ మృతినొందెనని నిశ్చయించిరి.

ఆఱవ ప్రకరణము.

మహమ్మదీయులు భరతఖండమును బరిపాలించినంత కాలమును ఢిల్లీనగరము రాజధానియై యుండెను. ఈ ఢిల్లీచక్రవర్తులె రారాజులవలనఁ గప్పముల గ్రహించి మూర్ధాభిషిక్తులను బాదాక్రాంతులఁ జేసిరి. ఈ ఢిల్లీచక్రవర్తులె యాసేతుహిమాచలమగు భరతఖండము నేకచ్ఛత్రముగఁ బాలించిరి. గుజనీమహమ్మదు పండ్రెండుసారులు హిందూ

దేశముపై దండెత్తి దేశములనెల్ల కొల్లగొని లక్ష్మిని దనవెంటఁగొని దారిద్ర్యదేవత నిటనిలిపి చన్నయనంతరము మహమ్మదుగోరీయను నతఁడు ఢిల్లీమహారాజుగ నుండిన పృథివీమహారాజును ధనేశ్వరయుద్ధమున వధించి దేశమునాక్రమించెను. తన్మరణానంతరము బానిసరాజులు 1206 మొదలు 1290 వఱకు నుత్తరహిందూస్థానము నుపాలించిరి. వారుబలహీనులయినవెనుక వృద్ధుఁడయ్యు జలాలుద్దీను భుజబలముచే బానిసలను గెల్చి సింహాసన మెక్కి కిల్జీసంశస్థాపకుఁడయ్యెను. జలాలుద్దీనుచక్రవర్తి 1290 మొదలు 1295 వ సంవత్సరమువఱకుమాత్రమె పరిపాలించెను. రాజ్యకాలము స్వల్పమయినను మహమ్మదీయు లదివఱకు నెన్నఁడెఱుఁగని దక్షిణహిందూదేశముపై ప్రథమదండయాత్ర 1294 వ సంవత్సరమున జరిగెను. అదిజలాలుద్దీనునకు నన్నకొమారుఁడును, కపటోపాయధురీణుఁడును, రాజనీతివిశారదుఁడు నగు నలాయుద్దీను సేనానాయకుఁడై నడిపి మహారాష్ట్రదేశము నాక్రమించెను. ఆకాలమున మహారాష్ట్రదేశమునకు దేవగిరినగరము రాజధానియై యుండెను. అలాయుద్దీను మహారాష్ట్రదేశాధీశ్వరుఁడగు రామదేవమహారాజును గెల్చి యాతఁడు ఢిల్లీకి సామంతరాజుగ నుండునట్లును గప్పముఁగట్టునట్లును నొడంబఱిచి బహుసగరములను గొల్లఁగొన్న ద్రోవ్యధనముతోడను, తానుకలతోడను, బినతండ్రి నెదుర్కొనుట కరిగెను. అరిగినతోడనె యతఁడు పినతండ్రిని జంపించి తాను జక్రవర్తి క్యాఁగోరి యపారసేనాసమేతుఁడయి యుండుటచేఁ దనమనోరథమును సులభముగ నెఱవేర్చుకొని మహావైభవముతో 1295 వ సంవత్సరమున సింహాసనమెక్కి 1316 వ సంవత్సరమువఱకును రాజ్యము చేసెను. ఈతఁడు లోకవ్యవహారములయం దారితేఱిన దిట్టరియెగాని కుటిలుఁడు, కార్యసాధన మొనర్పఁగల బాహుబలియెగాని నీతిలేనివాఁడు. ఈతఁ డుత్తరహిందూస్థానమును దాహాప్వాధీనముచేసికొనినను, రాజపుత్రస్థానమును జయింపలేదు. అతఁడు

సింహాసనమెక్కునాటికి దక్షిణమున మహారాష్ట్రము దక్క తక్కిన దేశము లెవ్వియు వాని పాలనమునకు లోఁబడియుండలేదు. దేవగిరి మహారాష్ట్రసామంతుఁడగు రామదే నేలుచుండెను. ఓరుగల్లు రాజధానిగ త్రిలింగదేశము కాకతీయవంశజులు పాలించుచుండిరి. బల్లాలువంశస్థులు ద్వారసముద్రమునుండి మైసూరురాజ్యము నేలుచుండిరి. కర్ణాటకమును స్వదేశరాజులు పాలించుచుండిరి. రాజస్థానమును దక్షిణరాజ్యములను స్వాధీనపఱచుకొనవలయునని యల్లాయుద్దీను చిరకాలమునుండి కోరుచుండి, దక్షిణహిందూదేశముపై మాలికాఫరను సేనానాయకుని గొప్పసైన్యముతో నంపగా నతఁడును తనప్రభువువలె నీతిసంపత్తి లేనివాఁడగుటచే మాయచేతనో బలముచేతనో స్వదేశప్రభువుల నడఁచి రామేశ్వరమువఱకుఁగల దేశమును జయించి యనేక పురాతనరాజకుటుంబముల నిర్మూలన మొనర్చెను. ఈతఁడు దక్షిణదేశమందుండఁ జక్రవర్తి రాజస్థానదండయాత్రనుగూర్చి యోజించుచుండెను. ఢిల్లీనగరమునందున్న సైన్యమును జాలకాలమునుండి యుద్ధమునకు సిద్ధమగునట్లు చేయుచు నితరమండలములయం దుండు సైన్యంబులఁగూడ బిలిపించి సన్నాహ మొనర్చుచు సైనికులకెల్లఁ గావలసిన భోజనసామగ్రులను, అశ్వములను, గజములను, పశువులను సిద్ధపఱచుచుఁ జక్రవర్తి ప్రయత్నము చేయుచుండెను. ఒకనాఁటిసాయంకాలము సంధ్యారాగము దర్శనీయమయి ఢిల్లీనగరముపైఁ గట్టఁబడిన యెఱ్ఱనివితానమువలె వెలయుచుండెను. సంధ్యారాగము క్రమముగ నదృశ్యమయి వెన్నెల వ్యాప్తమయ్యెను. నల్లనియమునానదిజలమునందు ఢిల్లీనగరము మేడలతోడను మిద్దెలతోడను మహాగోపురములతోడను నీటఁగట్టఁబడిన పట్టణమువలెఁ బ్రతిబింబితమై కనుపట్టుచుండెను. సాయంకాలపు నమాదునకుఁ భక్తులఁ బిల్చువారి కేకలతో మసీదులు ప్రతిధ్వను లిచ్చుచుండెను. మసీదుల యగ్రభాగములును, హిందూదేవాలయశిఖరములును మహోన్నతగోపుర

ములను వెన్నెలలో . ధగధగలాడుచు నగరముయొక్క యున్నతస్థితిని
జను పాడవృచేఁ దెలియఁజేయుచుండెను. నగరమధ్యముననున్న కోటలో
సరోవరమధ్యమున విలసిల్లు తెల్లదామరవలె చక్రవర్తి వసియించు సౌధం
తస్తులమేడ క్రొత్త కాంతులతో నావెన్నెలయందుఁ గన్పట్టుచుండెను.

ఆనాఁటిరాత్రి నాలుగుగడియ లయినతరువాత చక్రవర్తి రహస్యములు మాటలాడుకొనుగదిలో మెత్తనిపరుపులు వేయఁబడిన యొకకుర్చీమీఁదఁ గూర్చుండి హుక్కా త్రాగుచునుండ నతివినయముతో నంతఃపురసేవకుఁడగు నొక నల్లని దీర్ఘకాయముగల తురక గదిఁ బ్రవేశించి చక్రవర్తి పాదములదగ్గఱ సాష్టాంగపడి భయవినయములతో, " మహాప్రభూ ! ఏలినవారి గులాపువాని దొక మనవి యున్న " దని మెల్లఁగఁ బలికెను. ఆమాటవిని యదివఱ కేదో యోజించుచున్న చక్రవర్తి మహాకోపముతో వానిని నొకతన్ను తన్ని, " ఏమిరా ! లుచ్ఛా ! నీవెందు కటుచెదవురా " యని భయంకరముగఁ గేక వేసెను. వానియు వడఁకుచు, " స్వామీ ! పాలిఖిల్లాదారు రహిమానుఖాను వచ్చి యున్నాఁడు, సెలవు దయచేసినపక్షమునఁ బసుపాదములన్ని ధిక్కి దోఁచుకొనివచ్చెద " నని పలుకుటయుఁ జక్రవర్తి తనయంగీకారసూచకముగఁ దలయూఁచిన, సేవకుఁడు ఖానుగారిని వెంటఁబెట్టుకొని వచ్చి గదిలోనికంపి తానావల నిలుచుండెను. ఖానుసాహెబు పాలిగ్రామమున వసించునప్పటిగర్వము నెదలి, చక్రవర్తి సముఖమ్మున నేలఁబడి తత్పాదములనంటి సలా మొనర్చెను. చక్రవర్తియు వానిని జూడఁగానే వానిదురాచారములఁగూర్చి నాజరుజంగు విన్నవించినయంశములు జ్ఞప్తికిరాఁగా మండిపడి, " ఓరీ ! రాజద్రోహి ! మాదేశమున గల ద్రవ్యవంతులను సామంతులను దోపించుటకా నీ కధికార మిచ్చినది ? ఛీ ! నీమొగము చూడరాదు. నివు నాయెదుటనుండిపో " యని తనపాదములపైఁబడియున్న యాతనిఁద్రోచివైచి రెండుతన్నులఁదన్నెను.

స్త్రీవలె రోదనముఁ జేయుచు, “ఓమహమ్మదీయమతసంరక్షకా! ఓసకలలోకచక్రవర్తీ! నేను మీబానిసను. నేనేపాప మెఱుఁగను. నిర్హేతుకముగ నామీఁద నోర్వలేక తుచ్ఛులెవరో నేరములఁ జెప్పినా” రని విలపించుచున్న యీ నిర్భాగ్యునిజూచి చక్రవర్తి యించుక కరుణించి, “నీనిర్దోషత్వమును నీవెట్లు స్థాపింపఁగలవు? అట్లు చేసికొనినపక్షముననే నీప్రాణములు దక్కఁగలవు. రేపు సాయంకాలమునఱకు నీకు గడువిచ్చినాను. రేపురాత్రి విర్వాపు. ఆసమయమునకు నీవు సంసిద్ధుఁడవై యుండవలె” నని పలికి యాపూఁటకు క్షమించెను. ఈవాక్యములతో మనశ్శాంతికలిగి రహిమానుఖాను సంతోషించి, “మహాప్రభూ! పలికినవారు ధర్మమూర్తులు. రేపుసాయంకాలము నేను నిర్దోషినని స్థాపించుకొనఁగలను. అంతేకాక రాజపుత్రస్థాన దండయాత్రనుగూర్చి యత్యంతరహస్యములగు కాగితములుకూడ నాకు లభించినవి. అవి యన్నియు నేను మీకు నిచ్చెదను. అప్పుడు నాసత్ప్రవర్తనమును మీ రెఱుఁగఁగలరు. ఇంక నేను సెలవుగైకొని పోయివచ్చెద” నని ఖాను చెప్పిన నలాయుక్తి నాశ్చర్యమును సంతోషమును గదురఁ జల్లనికటాక్షవీక్షణములు వానిపైఁ బఱపుచు, ‘నీకు లభించిన కాగితముల నీరాత్రి దెచ్చి మాకుఁ జూపవలయును. ఆకాగితములఁ జూచినదాఁక మాకుఁదోఁచదు. నీవతివేగ మేగి వానినిఁ దీసికొనిర’ మ్మని చక్రవర్తి పలికి మందహాసముతో ఖాను సెలవుగైకొని బసకుఁబోయెను.

## ఆఱవ ప్రకరణము.

ప్రపంచమునం దిప్పటికి నిలిచియున్న పురాతనపు కట్టడములలో నెల్ల మిగుల నున్నతమయి సర్వజనస్తవనీయమయి యున్నది ఢిల్లీ నగరమునకు నైదుక్రోసులదూరమునందున్న కుతుబుమినారను గోపుర

మని చెప్పవచ్చును. ఇది కుతుబుద్దీనను మహమ్మదీయఋషి పేరఁ గట్టఁబడినది. ఇది కట్టుట కారంభించిన యిఱువదియైదు సంవత్సరములకు ముగింపఁబడినది. ఇప్పటి కది నిర్మింపఁబడి యాఱువందలయేఁబది సంవత్సరములు గడచినను, నేఁటికిని జూపరకుఁ గనులపండువు సేయుచు నాశనదేవత పాలఁబడక మహమ్మదీయుల శిల్పిశాస్త్రనైపుణ్యమును బ్రకటించుచున్నది. అది యిన్నూటనలువదిరెండడుగులయెత్తుఁ గలిగి, గర్భమందు వంకరగఁ బాముమలికలవలెఁ దిరిగియున్న మున్నూటతొంబదితొమ్మిది మెట్లతో నెలయుచుండును. పూర్వకాలమున ఢిల్లీరాజ్యమును బరిపాలించిన మహమ్మదీయచక్రవర్తుల గోరీలు దీనిచుట్టు నున్నవి. నేఁడు దీనిసమీపమున నొక చిన్నగ్రామము బయలుదేరినది. మనము వర్ణించుచున్న కాలము నాటికిఁగూడ తత్సమీపమునఁ గొన్ని సమాధులుండుటచే జనులు రాత్రులయందుఁ దఱుచుగ నాప్రక్కకుఁ బోవుచుండుట లేదు. ఈగోపురముపైకిఁ బోవువారు శ్రమ కలుగకుండ విశ్రాంతిఁ గైకొనుటకు నడుమనడుమ నంతస్థులు మందిరములు కట్టఁబడియున్నవి. వీనినెల్లఁ గడచి చివరయంతస్తుపై కెక్కి చూచువారి నేత్రములకు క్రిందనుండుమనుష్యులు పిల్లలవలెఁ గన్పడుదురు. దీనియందు సాధారణముగా పరదేశగతులగు ఫకీరులు వసించుచుందురు.

ఆనాఁడు సూర్యాస్తమయమైన వెనుక నిద్దఱుశిష్యులు వెంటరా నొకఫకీరు మెల్లమెల్లగ గోపురపు మెట్లనుండి క్రిందికి దిగెను. మెట్లనన్నిఁటిని దిగి క్రిందికివచ్చి తనశిష్యులతోఁ గొన్నిరహస్యములను జెప్పి చెఱియొకవైపునకుఁ బంపి వారు బయలుదేరిన నాలుగుగడియల కతఁడు తత్ప్రదేశమును బాసి పురమువంకఁ బోవుచుండెను. ఆతఁడు షష్టివయఃపూర్ణుఁడగు వృద్ధుఁడని నెఱసిన గడ్డము తెలియఁజేయుచుండెను. కాని శరీరదార్ఢ్యముఁజూచువా రంత వయస్సుండునని నమ్మరు. తనశరీరమునఁ బ్రోలియుంగరకాధరించి తలగుడ్డను బెట్టుకొని పూసలతావళమును

దిప్పుచు నతఁడు పురముఁ బ్రవేశించి వీథులవెంబడిఁ దిరుగుచుండె ను. రహిమానుఖాను చక్రవర్తి వద్ద సెలవుఁగైకొని రాజమందిరమును బాసి వీథిలోనికి వచ్చువఱకు ఫకీరును దనచేతికారు చప్పుడు చేయుచు వినోదమును గల్గించు పాటఁ బాడుచు నాస్థలమునకు వచ్చెను. చక్రవర్తి తనవిషయమున నేమిచేయునో తన కాంతిములను దనవృత్తాంతి మును నమ్మునో నమ్మక ప్రాణములఁ దీయుంచునో యని భయపడుచు మందగమనముతో వచ్చుచున్న ఖాను, ఫకీరును జూచి వారు భూతభ విష్యద్వర్తమానముల నెఱిఁగినవారిగుటఁ దాను వినియుంటఁ దన భవిష్యదవస్థ నీఫకీరు నడిగి తెలిసికొనవలయునని తలంచి యాతని స మీపమునకుఁ బోయి వినయముతో, "అస్సలామాలేఖుం" అని స లాముచేసెను. ఫకీరును 'అలేఖుంస్సలాం' అని యచట నిలిచెను. అంతట వారిట్లు మాటాడిరి.

ఖాను—మీరు కులంగిరి ఫకీరులా? ముదార్యి ఫకీరులా?

ఫకీ—నేను కులందరిఫకీరునె. అయ్యా! నాసంగతి నీకెందుకు?

ఖాను—అయ్యా! తమరు మహాత్ములు. పైగంబరులవంటి వారు. నాకు నేఁడొక్కయాపద తటస్థించినది. అది యెట్లగునో మీరు తెలుపవలెను.

ఫకీ—(మాటువిని కొంచెము మాలోచించి) హా! మహామ్మదు! షుల్లాహాల్లీ! నామీఁద దయుగలిగి యుండుఁడు. అయ్యా! నాకుఁ దెలిసినంతవఱకు నియవస్థను దెలిపెదను. అది నిజమగునేని నీవు నూరు గురు ఫకీరులకు నన్నము పెట్టగలవా?

ఖాను—సందేహమేమి? మీయాసెలవుప్రకారము చేసెదను.

ఫకీ—అయ్యా! నీపేరు రహిమానుఖాను కాదా?

ఖాను—(ఆశ్చర్యముతో) చిత్తము. చిత్తము.

షక—నీపైని దుర్మార్గులు చక్రవర్తితో నేరములఁ జెప్పిరి కాని మహమ్మదువారి దయవలన నీదగ్గఱనున్న కాగితములనుబట్టి నీమాటనే పైనుండును. నీశత్రువులు నశింతురు.

ఈవాక్యముల నాలకించినంతోడనే ఖాను అత్యాశ్చర్యము నొంది "మీరు సర్వజ్ఞులరు నేను పాపాత్ముఁడను. నాపాపముల క్షమించునట్లును నాకు శుభములు గల్గునట్లును నన్ను మీ రాశీర్వదించి దేవతలఁ బ్రార్థింపవలెను." అని వేఁడుకొనెను. అంతట ఫకీరు సంతోషముతో 'నీపై నల్లాకు దయగలదు. మహమ్మదీయుఁడవగుట నీ పాపములు క్షమింపఁబడినవి. కాఫరులందఱు నీచేత హతులగుదురు. నీకు శుభమగు పొమ్ము' అని తాను సాగిపోయెను. ఖానును మహానందముతోఁ దనబసకరిగెను. ఆరోజునఁ జక్రవర్తి ఖానురాక కెదురుచూచుచు, నిర్హేతుకమైన యాలస్యమునకు వానిని నిందించుచు సమీపముననున్న బానిసలపై మండిపడుచుఁ, గొంతసేపటికి ముఖ్యమంత్రియైన జహాందరులోడిన వతీమానము నంపెను. అంతఁ ఖానును వచ్చి చక్రవర్తికి సలాముచేసి చేతులు జోడించుకొని యెదుట నిలువఁ జక్రవర్తి కూర్చుండుమని కనుసన్నఁ జేయ నాతఁడు ముష్టఁగ నుంపుమంపెను. అంతటఁ జక్రవర్తి వజీరునుఁజూచి 'రహిమానుఖాను కొన్ని రహస్యములగు కాగితములఁ దెచ్చినాఁడఁట. వానిని మనము పరీక్షింపవలెను.' అని చెప్పగా నావజీరు ఖానునిమిత్తము ఎదురుచూచుచుండెను. అంతలో రహిమానుఖానును కాగితములకట్ట చేతఁబట్టుకొని మెల్లమెల్లఁగా మేడమెట్లనెక్కి మూఁడవయంతస్తు మీఁదకువచ్చి చక్రవర్తియు వజీరును నున్న మందిరముఁ బ్రవేశించి, వినయపూర్వకవందనముల సల్పి యెదుట నిలిచెను. చక్రవర్తి వాని నుచితాసనమునఁ గూర్చుండ నియమించి యతనిచేతనున్న కాగితములకట్ట నందుకొని విప్పి చూడ నందు నాలుగైదు కాగితములుండెను. ఆకాగితములు మహారాష్ట్రభాషలో నుండుటవలన నాభావ

యం దేవరికిని దెలియకుండుటకు వారందఱు యోజించి రాజభక్తి గలిగి మాయోపాయములయం దారితేఱిన వసంతభట్టను మహారాష్ట్ర బ్రాహ్మణునకు వర్తమానము నంపిరి. అతఁడును నర్ధరాత్రివచ్చిన వర్తమానమునకు భయపడుచుఁ, జపలచిత్తుఁడైన పాదుషావలన నేమి కీడు మూడునోయని 'యీగండము గడిచినయెడల భవానికిఁ గుంకుమపూజ జేసెద' నని మ్రొక్కుకొని యచ్చటికి వచ్చెను. అతని నుచిత గౌరవముతోఁ గూర్చుండ నియమించి చక్రవర్తి యాకాగితముల నిచ్చి చదువుకొనెను. అతఁడును నామూలాగ్రముగ వానినెల్లఁ దనలోఁ జదువుకొని యైదు కాగితములలో నాలుగు బంధువులొకరికొకరు వ్రాసుకొన్న యుత్తరములనియు నైదవదిమాత్రము ముఖ్యమైనదనియుఁ జెప్పి దాని నిట్లుచదువ నారంభించెను.

"శ్రీ సూర్యకులప్రదీపకులగు భీమసింగు మహారాజువారికి దేవగిరిరాజు రామదేవు నమస్కారములుఁజేసి వ్రాయుచున్న దేమనిన:—ఈమధ్య మీకును గ్రూరుఁడైన యల్లాయుద్దీను చక్రవర్తికిని మనస్పర్థగ నున్నట్లును, జిత్తూరురాజ్యముపై నతఁడు దండెత్త నూహించుచున్నట్లును మేము వినుచున్నాము. అది నిజమగునేని మిగుల విచారము నొందుచున్నాము. ఈనడుమ దక్షిణహిందూస్థానమునకు వచ్చి మమ్మాతఁడు బాధించుట మీరు వినియుందురు. సమానాపదలోనున్న మన మిరువురమును క్షత్రియకులజులము నేకదేశీయులము నగుటచే నన్యమతస్థుఁడు దురాచారుఁడునగు చక్రవర్తిపైఁ గలిసి యుద్ధముచేసినపక్షమున గెలువకపోము. పౌరుషధనులును నభిమానసముద్రులునగు మీకు మేము దోడ్పడినయెడ దైవానుగ్రహమువలన డిల్లీనుండి మ్లేచ్ఛులను బాఱఁదోలవచ్చును. మ్లేచ్ఛుఁడగు చక్రవర్తి దురాచారుఁడగుటచే స్వబలమునం దనేకు లతనికనిష్టులుగ నున్నారని విని సంతోషించుచున్నాము. మీదేశముమీఁద దండయాత్ర ముందుగ జరుగునేని మాబలమును

మీకు సాహాయ్యముగనంపెదను. అదియుంతట జరుగదేని మాకు మీరు సహాయము చేయుఁడు. నీతివిశారదుఁడగు నీయోగి క్షేమ కుశలప్రత్యుత్తరములఁదెచ్చి యిచ్చుచుండును. దీనికి వెంటనే యుత్తరమునంపఁగోరుచున్నాము. త్వరపడవలయును. రామదేవురాయలు."

అని మహారాష్ట్రభాష నున్న యుత్తరమును పారసీకభాషలోని కి మార్చి చక్రవర్తికి విన్నవించి వసంత భట్టారకుండెను. చక్రవర్తి కాగ్రహమును నాశ్చర్యమును నేకకాలమున జనించెను. ఉత్తరహిందూస్థానమం దున్న గొప్పరాజ్యమగు చిత్తూరును దక్షిణమున గొప్పరాజ్యమగు దేవగిరియును గలిసిన జక్రవర్తి వారల గెలుచుట యసాధ్యము. అందుచేఁ జక్రవర్తి భయపడి కర్తవ్య మూహింపుచు 'ఈ కాగితము లెట్లులభించినవి' అని ఖాను నడిగెను. ఖానేమో యబద్ధములఁ జెప్పుట కాలోచించుచుండెను. 'ఈయుత్తరమునుబట్టి చూడ నీవలు కు రాజపుత్రులు మహారాష్ట్రుల కేమియు వ్రాసినట్లు కన్పడదు. మహారాష్ట్రులు ముందుగ రసపుత్రులకు వ్రాసిన కాగితములు మనకు దొరికినవి. కాఁబట్టి భీమసింగివార్త యెఱుఁగము'. అని వజీరు పలుకఁ దద్వచనములయందుఁ జక్రవర్తి విశ్వాసముంచి యౌనని తలయూఁచి 'నీ కెవరివద్ద నివి లభించినవి?' అని ఖానును మరల నడిగెను. అంతట ఖానులేచి చక్రవర్తి కభిముఖుఁడై నిల్చి చేతులుజోడించి, 'ఓ మహాప్రభూ! మదనసింగుపై మీకుఁ గల గొప్పయభిప్రాయమును జెఱుపుట నాకిష్టములేదు. అయినను మీయాజ్ఞ శిరసావహించి రాజ్యముకొఱకును మీకొఱకును బ్రాణపమునట్టివాఁడ నగుటచేఁ జెప్పక తప్పదు' అనెను. విని యాశ్చర్యమునొంది 'మదనసింగు సమాచారమెందుకు? అతనికీవృత్తాంతము తెలియునా యేమి? వేగముగఁ జెప్పు' మని చక్రవర్తి త్వరపెట్ట ఖా నిట్లనియె. 'ఈ కాగితములు నాకుమదనసింగునొద్దనే లభించినవి. అతనిదగ్గఱ నీకాగితము లున్నవని విని నాసేవకులనంపి బల

వంశమగ వీనిని దెప్పించితిని. నేనీపని కేవల రాజభక్తితో నొనర్చినను, దారులుగొట్టించి దోపుడు చేసితినని యేలినవారితో దుర్మార్గులు చెప్ప విశ్వసించి నాపయినలుక వహించినట్లున్నది. ఆమదనసింగునకును యోగికిని బంధుమైత్రి కలదు. అయ్యో యెవరో నిలుకడమీఁదఁ దెలియవలయును.' అనవుఁడు చక్రవర్తి యాగ్రహము పట్టఁజాలక 'తక్షణమే యాదుర్మార్గునిఁ బట్టి యేల చెఱలో వేయలేదు? నీవు సమయోచితబుద్ధిలేని గాడిదవు' అని తిట్టుచుండఁగా రహీమా నిట్లు చెప్పచొచ్చెను. 'మదనసింగును నఱకవలెననియే నేను రోషముతో ఖడ్గము నెత్తి యాపాపాత్మునిపయిఁ బడితిగాని నాజరుజంగు నన్నుఁ బట్టుకొని యాపెను.' అనవుఁడు మండిపడి పీఠమునుండి లేచి చక్రవర్తి 'నాజరుజంగ ట్లొనర్చెనుగా? అతఁడును వానిలోఁగలసెనా?' యని యడిగెను. అందుకు ఖాను మెల్లన నిట్లనియె. 'దేవరవారు నన్ను క్షమించినపక్షమున నాసంగతి మనవిచేసికొందును. మదనసింగునకు నాజరుజంగాప్తమిత్రుఁడు. అతఁడికుట్రలోఁజేరకున్న యెడ, విదేశీయులును విమతస్థులు నగువారి కీస్నేహమెట్లు కుదురును? దానికి నిదర్శనముగ నిప్పుడు చదివినయుత్తరములో మనబలములోఁ గొందఱు రాజపుత్రులతోను మహారాష్ట్రులతోను జేరుదురని యుండలేదా? నాజరుజంగు మొదలగువా రుండుటచేతనె యాయుత్తరముననట్లున్నది. అని చక్రవర్తికి సలాముజేసిఖానుకూర్చుండెను. తరువాత చక్రవర్తి వజీరును వసంతభట్టునుజూచి 'నాజరుజంగువిషయమున మీయభిప్రాయ మేమిఁ?' అని పలుక, వజీ రిట్లనియెను. 'ఆవిషయమున నాతఁ డెట్లు చెప్పకొనునో విని కర్తవ్యమూహించుట శ్రేయము' అనుచుండగా పాదుషా 'దీని కతనివలన వినుట యెందుకు? లిఖితనిదర్శన ముండఁగా నిం దబద్ధ మేమున్నది' అనెను. తాను త్రవ్వినగోతిలో మదనసింగును నాజరుజంగును దప్పక పడుదురని పూర్ణవిశ్వాసముతో రహీమానుఖానానంద మొందుచుండెను. చక్రవర్తి రాజపుత్రుల

పయి దండెత్తుట కర్తవ్యమగునా కాదాయని తనలోఁ దానాలోచిం చుకొనుచు 'రాజపుత్రుల దేశముపయి దాడిపెట్టుదమా వద్దా? మదన సింగుతో దండయాత్ర లేదని చెప్పినాము. ఈవిషయమున మీయభి ప్రాయమేమి?' అని యడిగిన రహిమానుఖా నిట్లనియె, 'మహాప్రభూ! రాజస్థాన దండయాత్ర మీరు మాననలదు. రాజపుత్రులు పైగాంభీర్య మేకాని నిజముగ పిఱికివారు. చిత్తూరు జయింపకున్న యెడల మహమ్మ దీయులు రసపుత్రులను జయింపఁజాలరని ప్రజలకు మనపై గౌరవము తగ్గును.' అని చెప్పగానే చక్రవర్తియు నదిసరేయని 'రేపురాత్రిదర్బా రగును. అప్పుడు దండయాత్రాసంగతి నెల్లరకుఁ దెలియఁజేయుదము. ఈ రాత్రి ప్రొద్దుపోయినది. మీరు రహస్యమును బయలుపఱుపకుఁడు.' అ ని చక్రవర్తి లేవఁగా రహిమానుఖా నప్పుడు మరల 'మదనసింగుతో దే వరవారు యుద్ధమునకు రామని చెప్పుట మిగుల లాభము. మనము దం డెత్తిరామని వారనుకొనుచుండ నాకస్మికముగ వారిపైఁ బడి యోడిం పవచ్చు' ననెను. పాదుషా పకపకనవ్వి శహబాస్ మంచియోజన చేసి నావు. నీవంటి బుద్ధిమంతుఁడు మారాజ్యములో నింకొకఁడు లేఁడు. అని నజీరును పిలుకొలిపి రహిమానుఖానును వసంతభట్టును దీ సికొనిపోయి వేఱువేఱుగ నిద్దఱికిని ఱటియొకరహస్యమును జెప్పిపుచ్చెను. ఖాను తనబసకుఁ బోవుచుండ మార్గమున గులందరుఫకీరు షురల న గపడి యతనిని బలుకరించి 'నీవని నేఁ జెప్పినట్లయినదిగదా?' యని యడుగఁగా నైనదని చెప్పి ఖాను ఫకీరుకొకకమీఁదఁ నతని కారాత్రి జరిగిన విశేషములన్నియు విన్నవించెను. మఱునాఁటి యుదయమున చక్రవర్తి రహిమానుఖానును దనసన్నిధికి రావించి దండయాత్రనుగూ ర్చి ముచ్చటించుచుండఁగా మఱింత ప్రోత్సాహము కలిగింపఁదలఁచి ఖాను 'దేవరవారికి నేనొక బ్రియము విన్నవించెద. చిత్తూరురాజ్యపం రక్షకుఁడగు భీమసింగు మహారాజుభార్య పద్మినియనునొక జగన్మోహ

నాకారము గలదు. ఆమెయిబోలు సుందరులు ప్రంచమున లేరు. మహాచక్రవర్తులైన తమకా సుందరి తగినది. ఈదండయాత్రవలన రాజస్థానము లోఁబడుటయేగాక పద్మినియు మీకు లభించును. అని విన్నవించినతోడనే యమితానందభరితుఁడై చక్రవర్తి వజ్రపుటుంగరము నతనికు బహుమానము నొసంగి, నాయంకాలపు దర్బారునకు మరలరమ్మని యాతని నంపివేసెను.



పదునేడవ ప్రకరణము.

ఆనాటిరాత్రి కొలువుకూటమున దర్బారుజరుగను, నానాభాగములనుండి జిల్లాదారులు, జమీందారులు, ఫౌజుదారులు వచ్చి చక్రవర్తికిఁ దమతమ యథాకాలగౌరవంబుల కుచితముగురీతి నజరుల నర్పించి యథార్హమర్యాదల నొందిరి. చక్రవర్తి వలన ననేకబిరుదములంద్గొనదగిన ఢిల్లీనగరవాసులగు మహమ్మదీయప్రభువులుగూడ వచ్చి దర్బారు నలంకరించిరి. అందఱితో నాజరుజంగువచ్చి యుచితాసనమునఁ గూర్చుండెను. సభ పూర్ణమైన వెనుక చక్రవర్తి రాజపుత్రస్థానదండయాత్రనుగూర్చి తన యభిప్రాయమును బూర్ణముగ నెఱింగించి సైన్యములును, సేనానాయకులును యుద్ధసన్నద్ధులై యుండవలయునని యాజ్ఞ నొసఁగెను. అదవఱకెన్నఁడును దర్బారులయందు నాజరుజంగు నతిగౌరవముతోఁ జూచి యాతని యాలోచన నడిగెడి చక్రవర్తి యాదిన మాతనివంక జూడక, 'దర్బారుముగిసెడువేళ కోపముతో 'మనలో ననేకులు రాజద్రోహులున్నారు. మాసొమ్ము దినుచు మాశత్రుపక్షమునఁ జేరి మాప్రాణములఁ దీయఁగోరుచున్నవారీసభలో ననేకులు గల' రని పలుక సభాస్థులమెల్ల నిశ్శబ్దమయ్యెను. అపలుకుఁజేరిన సామంతులందఱు నొకరిమొగమువంక నొకరుచూచు

నారంభించిరి. అప్పుడు జరుగుచున్న కలవలపాటు గనలోకించి చక్రవర్తి సభ నుద్దేశించి "మీరందఱు నిట్లనుమానము నొందవలదు. మాకిట్టి యవమానమునకు నెడ మొసఁగినవాఁడు మా కత్యంతాప్తుఁడని మే మిదివఱ కెంచుకొనుచువచ్చిన నాజరుజంగు. అతఁడు రాజపుత్రులలోఁ జేరి మనపైఁ గుట్రలఁ జేయుచున్నాఁడఁట. అతనికుటుంబమునకు మేము సలిపిన మహోపకారమునకు మాకితఁడు చేసిన ప్రత్యుపకార మిది" యని యెలుఁగెత్తి చక్రవర్తి పలుక, నాజరుజంగు గుండెలు ఝల్లుమనియెను. రహిమానుఖాను ముఖము మందహాసముతోఁ గూడుకొని యుండెను. మహమ్మదీయ సామంతుల హృదయము లాశ్చర్యవిషాద భరితము లయ్యెను. పిడుగువలెఁ దనపైఁ బడిన యపనింద భరింపలేక నాజరుజంగు ధైర్యము దెచ్చుకొని చక్రవర్తి కభిముఖుఁడై "మహాప్రభూ! నాచేసిన యపరాధ మేదియు నేనెఱిఁగినంతవఱకు లేదు. నాయపరాధమును నా కెఱింగించి యది యిందు ఋజువుచేసి యీమహాజనమధ్యమున నన్ను శిక్షించుట యుచితముగాని నిష్కారణముగ శూలములవంటి మాటలచే నన్ను బాధఁబెట్టుట తగదు. నేను నారాజునకును నాదేశమునకును వ్యతిరిక్తముగ నెన్నఁడుఁ బ్రవర్తింపలేదు." అని సభ్యులకెల్ల జాలి జనియింపఁ బలికిన నాజరుజంగు వచనంబుల చక్రవర్తి లక్ష్యపెట్టక మహాకోపముతో "నీవింక మాటలాడవద్దు. నీవుచేసిన యపరాధమునకు నీయుద్యోగము నూడదీసినారము. నీవు నిక నధికారిగ నుండఁదగదు. నీతండ్రితాతలయాదిగ గౌరవమునుబట్టి నిన్ను మేమింతటితో విడిచినాము. పొమ్ము" అని తక్షణము సభనుండి సాగదోలెను. నాజరుజంగు పరువుగల యుత్తరహిందూస్థాన మహమ్మదీయ కుటుంబములోనివాఁడు. అతనితండ్రి బానిసవంశమువారినుండియుఁ జక్రవర్తుల కొలువునందుండి యావంశనాశనానంతరమున జలాలుద్దీనువద్ద సేనానాయకుఁడుగ నుండెను. ఈకాలమున వృద్ధుఁడై

పని చేయఁజాలక తనకుమారుని రాజసేవయందు నియోగించి తానింటి వద్ద సుఖముగఁ గాలక్షేపముఁ జేయుచుండెను. చక్రవర్తికి నాజరుజంగుపై సివజికును నమ్మకమును దయయు నుండెనుగాని రహిమానుఖానుని దుర్బోధవలన నిప్పుడలుకపుట్టెను. అట్లు పరాభవము నొంది నాజరుజంగు తనగృహమున కరిగి జరిగిన వృత్తాంతమును జనకున కెఱిఁగింప నతఁడా వార్తవిని యద్భుతపడి రాజభక్తికిఁ బుట్టినిల్లని ప్రజలచే స్తోత్రమునందిన తనకుటుంబమున కిది గౌరవహీనతయని చింతాక్రాంతుఁడయ్యెను. ఇచటఁ జక్రవర్తి దర్బారునందున్నవారిని జూచి "యీకొలువులోని సరదారు లెవ్వరును లోలోపల కుట్రలు సలుపక నాకు ప్రతిపక్షులుగా నుండువారు నిరాటంకముగఁ నాకొలువు విడిచి పోవచ్చు" నని సెలవిచ్చెను. ఆమాట లాలకించి సభాసదు లెవ్వరును లేవరైరి గాని యొక పురుషుఁడుమాత్రము లేచెను. మాయలమారియగు వసంతిబట్టను మహారాష్ట్రుఁడు తనయాసనమునుండి లేచి నిర్భయముగఁ గంఠమెత్తి యేలికతో నిట్లనియెను. "ఓమహాప్రభూ! ఈనజరుఁ జాలకాలమునుండి తమవద్ద సేవఁజేసినవాఁడను. నేనింక తమవద్ద నుండఁజాలను. ప్రభువువారి క్రూరస్వభావముఁజూడ నాకిందుండుట కష్టముగ నున్నది. నాకు సెల వొసంగుఁడు" అని మహారాష్ట్రుఁడాడినతోడనే పండ్లు పటపటఁగొఱుకుచు "దురాత్మ! మాకొలువు నీకు భారముగ నుండినం బోదగును గాని యిట్టి కాఱుకూఁతలఁ గూయనేల? మాప్రతిపక్షులు నిర్భయముగఁ గొలువువిడిచి పోవచ్చునని మేమభయహస్త మిచ్చి యుండుటచే నిట్టి కాఱు లఱచియును బ్రాణములతోఁ బోఁగలిగితివి పొమ్ము" అని చక్రవర్తి "ఈతఁడు మాకిదివఱకుఁ జేసిన సేవఁబట్టి వధియింపక విడిచినారము. వెంటనే యీతనిఁ దీసికొనిపోయి కారాగృహమున బంధింపుఁడు." అని భటుల నాజ్ఞాపింప వారట్లు చేసిరి. ఇట్లు రాజస్థానదండయాత్రను బ్రకటించి చక్రవర్తి

దర్బారుఁ జాలించెను. అందఱును దమతమనిలయముల కరిగిరి. నాజరు జంగుతండ్రి మహావిచారమున మునిఁగి, తనకుమారుని వెంటఁబెట్టుకొని యారాత్రి చక్రవర్తి దర్శనముచేసి యుచితసత్కారముఁబొంది వేఁడుకోఁగాఁ జక్రవర్తి దండయాత్రలోఁ దనసైన్యముతోఁ గూడ నాజరుజంగు వచ్చుటకు మాత్రము సెలవొసంగెను. అంతటితోఁ దృప్తినొంది నాజరుజంగుఁ దండ్రియు నింటికిం జనిరి. మఱునాఁడు సూర్యోదయకాలమున ఖిల్లాగరిమునందు వసంతిభట్టు చెఱలోనుండి పాఱిపోయెనని యొకవార్త పడెను. అట్టిమహాద్భుత మిదివఱకు నెన్నఁడుఁ గని విని యెఱుఁగమని జనులు పలువిధములఁ జెప్పుకొనసాగిరి. కారాగృహాధికారి భయముచే వడఁకుచు వచ్చి బాదుషాపాదములపైఁబడి యేడ్చుచు నావార్తఁ దెలిపి క్షమియింప వేఁడుకొనెను. చక్రవర్తియు నాశ్చర్యముఁబొంది యాతని కభయ మిచ్చి, వసంతిభట్టును బట్టితెచ్చినవారికి నూఱువరహాలు బహుమానముగ నిచ్చెదమని పట్టణమునఁ జాటఁబంచి, యతనిని వెదకుటకై యనేకులను బంపెను.

అక్కడ నట్లు నారాయణసింగు చెఱలో నుంచఁబడినరాత్రి వర్ణింప నలవిగాని మహాదుఃఖము నంది తెల్లవాఱువఱకు నిద్రలేక తనకు సంభవించిన మహాపదకంటె ముద్దుమరాలి సంగతి యేమయ్యెనాయని యెక్కువ సంతాపముఁబొంద నారంభించెను. మఱునాఁడుదయమున హేమలత యెచ్చటఁ గనఁబడలేదని తెలిసినప్పు డామె మృతినొందియుండునని నిశ్చయించుకొని యతఁడు కంటికి నేలకు నేకధారగ నేడ్చుచు నడుమనడుమ మూర్ఛిల్లి యామూర్ఛలో 'హేమలతా? ముద్దులసంచి తే' మ్మని కలవరించుచు, గలతనిద్ర కలిగినప్పుడు ముద్దుమరాలిపై దుస్స్వప్నములఁగనుచు, లేచి విలపించుచు, మెలఁకువగ నుండునప్పుడు "అమ్మా, హేమలతా చిన్నతనమునుండియుఁ దల్లి దండ్రులులేని పసిపిల్లను నిన్ను బెంచి నేఁడు నేలపాలు చేసినాను. అమ్మా

నీ వేనూతిలోఁబడి చచ్చినావు. నాకడుపునిండఁ దలపెట్టుకొని నీవింక నెన్నఁడును నిద్రపోవుగదా. కథలను జెప్పుమని నన్నింక రాత్రి బలవంత పెట్టువారెవరు? అయ్యయ్యో! ఆనాఁటిరాత్రియే మనకుఁ గడసారి కాఁబోలును. అని పరిపరివిధముల హేమలత చేసిన చేష్టలను, ఆమె ముద్దుమాటలను, తియ్యని పాటలను, దలఁచితలఁచి విలపించుచుండెను. ఆమఱునాఁటిమధ్యాహ్న మతనికి గోవిందశాస్త్రి భోజనమును దెచ్చిపెట్టెను. ఈప్రకార మొకవారము గతించునప్పటికి ఖాను ఢిల్లీకిఁ బోవలసివచ్చెను. ఖానుస్థానమునం దింతకంటె కర్కోటకుండొకఁడు నియమింపఁబడెను. అతఁడు ఖాను చేతిక్రిందనున్న చిన్న యుద్యోగస్థుఁడేయైనను, నధికారి యైనతోడనె గర్వముగలవాఁడై జనసామాన్యముతో మాటలాడుట తన గౌరవమునకుఁ దగదనియుఁ దనతో సమానులు లేరనియు దురభిప్రాయము నొంది తనకంటె వెనుకటి ఖానే గుణవంతుండని జను లనుకొనునట్లు ప్రవర్తించుచుండెను. అతఁడా యుద్యోగమునకు వచ్చిననాల్గుదినములకుఁ జెఱసాలపరీక్ష చేసి నారాయణసింగును మసాలవిని జూచి 'నారాయణసింగు బ్రాహ్మణులు తెచ్చియిచ్చిన భోజనమును దినఁగూడదు. ఇచ్చట మహమ్మదీయులు వండినయన్నమును దినవలయును' అని యాజ్ఞనొసంగెను. ఈయుత్తరువలన మహమ్మదీయుఁడగు తనకు బాధ లేకపోయినను పరమత సహనముఁ గలవాఁడగుటచే మసాలవి నారాయణసింగుస్థితికి మిగుల దుఃఖింపనారంభించెను. మఱునాఁడు మధ్యాహ్నము తురక లిద్దఱన్నమువండి చిప్పలోవైచి తెచ్చి నారాయణసింగును భుజింపమనిరిగాని యాతఁడు తినక నుపవాసములు చేయుచుండగా, నతనికిఁ బ్రాణాపాయము వచ్చినయెడలఁ జక్రవర్తిచేఁ దనకు మాటవచ్చునని భయపడి యాకొత్త యధికారి యాతని కెప్పటియట్ల బ్రాహ్మణు లన్నము పెట్టవచ్చునని యుత్తరువు చేసెను. వారాప్రకారముగాఁ జేయుచుండిరి. ఈసాహేబు

మతవిషయమైన పట్టుదలగలవాఁడని మహమ్మదీయు లెఱిఁగి మాలవిని కారాగృహమునుండి విడువుమని సాహేబును బలవంత పెట్టసాగిరి. వారి ప్రోత్సాహమునకును స్తోత్రములకును సాహేబుమిగుల నుప్పొంగియొక నాఁడు చక్రవర్తివద్దనుండి తనకు త్తరువు వచ్చెనని మాలవిని విడుదల చేసెను. తోఁడివాన్నిని విడిచి తన్ను బాధించుట నారాయణసింగునకుఁ గష్టముగ నుండుటకు మాఱుగ మాలవి స్వేచ్ఛగా నున్న పక్షమునఁ దనవిషయమై పనిచేసి తనకు బంధవిమోచనఁ గల్గించునని సింగు సంతోషించుచుండెను. మాలవియును విడువఁబడినతోడనె తనముసలి [illegible]చ్చెలికి సాయము చేయుదునని వాగ్దానము చేసి తద్విషయమయి ప్రయత్నము చేయుచుండెను.



## ఎనిమిదవ ప్రకరణము.



ఉత్తరహిందూస్థానమందలి క్షత్రియకుటుంబములలో రాజస్థానములోని మీవారు రాజ్యమునేలు కుటుంబమే మొక్కవోనిపరాక్రమములోడను సత్కీర్తితోడను నగ్రగణ్యమై యొప్పును. మహమ్మదుగోరీ హిందూదేశముపై దండెత్తివచ్చి యాకాలమున నుత్తరహిందూస్థానమునందుండెడి రాజుల నెల్ల స్వదేశముల నుండి పారఁదోలెను. అప్పుడు రాజ్యభ్రష్టులయిన రాజకులశిఖామణు లందఱును తద్దేశమునస్వతంత్రరాజ్యముల నేర్పఱచుకొని వసించుటఁ జేసి యాదేశమునకు రాజస్థానమను పేరుగలిగెను. ఆరాజస్థానమునం దనేక రాజపుత్రకుటుంబము లున్నను వారిలోఁ జిత్తూరుకుటుంబము నేఁటికిని గౌరవమునందుఁ దొల్లిఁటిస్థితికిఁ దీసిపోకయున్నది. మీవారురాజ్యమునకుఁ జిత్తూరు రాజధానియై యుండెను. ఆకాలమునందు రాజస్థానమునఁ జిత్తూరునకు సమానమయిన పట్టణ మేవిషయమునను లేదు. చిత్తూరు రాజవంశము శ్రీరాముని

ద్వితీయపుత్రుఁడగు కుశమహారాజుసంతతి యని చెప్పుదురు. అందుచేత సూర్యవంశజు లనియు రాజకులప్రదీపకు లనియు వారిని రాజులందఱు గణింతురు. పరాక్రమమునందును సత్కులప్రసూనతయందును సద్గుణవైభవమునందును రాజస్థానమునందలి తక్కినరాజులు చిత్తూరు రాజులకుఁ దీసిపోవుటంజేసి వారందఱుఁ జాలకాలమునుండి చిత్తూరుకుటుంబగౌరవము నెఱంగి యారాజులను దమకు సార్వభౌములుగ నేర్పఱచుకొని వారియాజ్ఞలకు బద్ధులై యుండెడివారు. శత్రురాజులు, రాజస్థానముపైఁ దండెత్తినపుడు చిత్తూరురాజునకుఁ దక్కిన వారందఱు నొకకట్టుగ వచ్చి సాహాయ్యముఁ జేయుచుండుటయుఁ గలదు. మనము వర్ణించుకాలమున చిత్తూరునకు మహారాజు లక్ష్మణసింగను నొకబాలుఁడు. చిన్నతనమునందె యాతనితండ్రి పరలోకగతుఁ డగుటచే నాతని పినతండ్రియు శూరశిఖామణియు సింహపరాక్రముఁ డనగు భీమసింగుమహారాజు లక్ష్మణసింగునకు సంరక్షకుఁడయి రాజ్యపరిపాలన మొనర్చుచుండెను. అతఁడు యుద్ధమునం దెంత శౌర్యవంతుఁడో రాజకార్యములయందంత నిపుణుఁడు. అతనికి రణరంగమున నెంత సాహసమో న్యాయపరిపాలనమునం దంత శాంతత యుండెను. లక్ష్మణసిం గప్పటికిఁ బదునాలుగేండ్లప్రాయముఁగల కుమారుఁడైనను శౌర్యసద్గుణములచే మిగుల వృద్ధుఁడై యుండెను. రాజస్థానముపై ఢిల్లీచక్రవర్తియగు నలాయుద్దీను దండెత్తునని భీమసింగు విని చక్రవర్తి సమ్ముఖమునకు మదనసింగును రాయబారిగ నంపెను. చిత్తూరుసేనానాయకుఁడగు ప్రతాపసింగునకు మదనసిం గన్నకుమారుఁడు. అతఁడు బాలుఁడయ్యు దృఢరాజభక్తియుక్తుఁడు విమలగుణసంపన్నుఁడు నగుటచే మహారాజున కాంతరంగికుఁడై రాజకీయవ్యవహారములయందుఁ గొంతభాగము వహించి పాటుపడుచుండెను. అందుచేత నాతఁడు చక్రవర్తికడకు నంపఁబడి పాలిగ్రామము విడుచునంతవఱకును జరిగినవృత్తాంతమును మీ రందఱెఱుఁగుదురు.

చిత్తూరునుండి రాయబారిగ నేగిన మదనసింగు దర్బారునందుఁ గ నుచమత్కారముగ సంతరించుటచేఁ జక్రవర్తియాతని నెక్కుడుగౌరవ ముతో నాదరించెను. కాని కార్యములయందాతనితోఁ గపటము విడిచి మాటలాడలేదు. చిత్తూరుపై దండయాత్ర జరుపుటకుఁ దనకిష్టము లేద నియు, నెట్టి కారణముకూడ లేదనియు రాజపుత్రులతో నత్యంతమైత్రి నుండుటఁ దనమనోరథ మనియుఁ జక్రవర్తి యాతనితోఁ బలికి య తనిని సబహుమానముగ దేశమున కంపెను. మదనసింగు చిత్తూరునకు వచ్చిననాఁడె తనసందేశార్థమును భీమసింగుమహారాజునకు నిశ్శేషముగఁ దెల్పెను. అంతట మహారాజును దక్కినయుద్యోగస్థులును సంతోషము నఁ బొంగి మదనసింగునుస్తోత్రముఁ జేసిరి. మదనసింగింటికి వచ్చినతోడనే తనపినతల్లి యగు సువర్ణబాయికి నమస్కరించి యామె యాశీర్వచన ముల నంది యనేకాంశములఁగూర్చి యామెతో ముచ్చటించెను. మా టలాడునపుడు పరధ్యానముచేతఁ దడబడుచుండుటయు నారాత్రి నిద్ర లేక నటునిటు విహరించుటయు సువర్ణబాయి చూచి యతఁడు మో హపరవశుఁడై యుండెనని కనిపెట్టెను. మఱునాఁ డుదయమున మదన సింగుతోఁ గూడఁ బ్రయాణముఁ జేసిన కృష్ణసింగను సేవకునిఁ దత్కార ణమడుగనాతఁడు, హేమలతసమాచారమును, నామెయం దాతనిచిత్తము దగులుటయు సమగ్రముగ విన్నవించెను. సువర్ణబాయి యుత్తమకుల స్త్రీ యగుటచే హేమలతవంటి బీదకన్యను దనకుమారునకు భార్యగా గ్రహించుట కిష్టపడక తనభర్తయగు ప్రతాపసింగున కావార్త నెఱిఁ గించి యతఁడున్ దనతో నేకీభవించునట్లుజేసెను. మదనసింగు రెండు సంవత్సరముల ప్రాయము గలవాఁ డైనపుడు తండ్రిమాధవసింగు మ హాయుద్ధమున మృతుఁడయ్యెను. మృతినొందిన భర్తకళేబరముతో నా తనిభార్యయు మదనసింగు తల్లియునగు మోహిని యప్పటివాడుక ప్ర కారము సహగమనముఁ జేసెను. సువర్ణబాయికి బిడ్డలు లేరుగనుక

బావకుమారుఁడగు మదనసింగును బెంచుకొని యామెకడుగారామునఁ జూచుకొనుచుండెను. ప్రతాపసింగు మాధవసింగునకుఁ దమ్ముఁడగుటచేనాతనిసేనానాయకత్వమితని కిచ్చి చిత్తూరుప్రభువు లీతని గౌరవించిరి. ఆనాఁటనుండియు సువర్ణయను దనతల్లిగను బ్రతాపసింగును దండ్రిగను నెంచుకొని మదనసింగు తల్లిదండ్రుల మఱచి సుగుణసంపత్తిఁ గలవాఁడయి తండ్రికిని కుటుంబమునకును గీర్తిఁ దెచ్చుచుండెను. మదనసింగు చిత్తూరుఁ బ్రవేశించి హేమలతానారాయణసింగులను మఱవక యొకదినమున మహారాజాంటిగ నున్న పురుష పాలిగ్రామమున సకలకష్టములతోఁ గాలము గడుపుచున్న వృద్ధుని వాని మనుమరాలిని రాజస్థానమునకుఁ బిలిపింపవలయునని చెప్పి యనేకవిధములఁ బ్రార్థించెను. దయాళుండగు భీమసింగు వారల దైన్యమును విని విచారించి చక్రవర్తికిని దమకును జరుగుచున్న సందేశములుముగిసినతరువాతఁ గొన్నినాళ్ళకు వారిని రావింపనగునని చెప్పి మదనసింగును సంతోషపెట్టను. మదనసింగునకు హేమలతయందనురాగము నానాఁటికి దృఢమగుచుండ నామె యెంతదూరమున నున్నను సింగుహృదయ మామెసమీపముననె యుండెను. ఇట్లు మదనసింగు మదనాగ్నిచే వేగుచు నాగతానాగతవేది యని ప్రసిద్ధికెక్కిన చిదానందయోగి దర్శనముఁ జేయఁగోరి యొకనాఁడతఁడున్న రామదేవునిమఠమున కరిగి, యోగిని దర్శించి నమస్కారముఁ జేసి యతఁడు గనుసన్నఁ జేయ నొకచోటఁ గూర్చుండి యితఁడింత నిండుజవ్వనమందే యోగాశ్రమస్వీకార మేలచేసినోయని యోజించుచుండెను. చిదానందయోగి సాక్షాచ్ఛివావతారమని జనులుచెప్పుకొనుట కలదు. మదనసింగు ముఖవిలాసము జూచి యాతఁ డేదోపనిమీఁద వచ్చినాడని తెలిసికొని యోగి 'బాబా ! ఏమి నీ విటువచ్చినావు?' అని యడిగెను.

మద[illegible]స్వామీ ! మీదర్శనమునకే వచ్చినాను.

చిదా—నీ వేదో యడుగవలెనని వచ్చినట్లున్నావు. అడుగవచ్చును.

మద—అయ్యా! దూరదేశమున నాకాప్తులున్నారు. వారు సుఖులై యున్నారా

చిదా—వారు తురకలా! హిందువులా! ఏజాతివారు!

మద—హిందువులు. మారాజపుత్రులు.

ఇట్లు మదనసింగు చెప్పినతోడనే కొంచె మాలోచించి చిదానందయోగిపైకిఁ జూచి స్ఫటికాక్షసూత్రమును ద్రిప్పి సంచిలోనుండి యొక తాటియాకుల గ్రంథమును దీసి యొక చిన్న పుల్లతో మూఁడు మారు లాపుస్తకమునయిఁ గొట్టి గ్రంథమును విప్పి యేవియోఁ జూచి యోగి యిట్లనియె. 'బాబా నీవడిగినప్రశ్న రామదేవు ననుగ్రహము చే నాకుఁ బూర్ణముగఁ దెలిసినది. నీవడిగినవారిలో ముసలివాఁడొకఁడున్నాఁడు. పదునారేండ్ల కన్యయొక తెయుఁ గలదు. వారిద్దరు నాపదలో నున్నారు. ఆమె యతనివద్ద లేదు. పరదేశమందున్నది. వారికింతలోఁ గష్టము తొలఁగునట్లు తోఁచదు. అని చెప్ప మదనసింగునకు ముఖవికాసము తగ్గెను. తరువాత యోగివద్ద సెలవుఁగైకొని యాతఁడింటికరిగి యానెల మన్నమును ముట్టక విచారగ్రస్తుఁడై యుండెను. రాత్రిజాముపైనతరువాత మదనసింగు మంచముపై శయనించియుండఁ గృష్ణసింగు వచ్చి యాతనితో 'అయ్యా! మహారాజుగారు తమ్మొకసారి రమ్మని వర్తమానము పంపినారు. వీధిలో వారిసేవకుఁ డున్నాఁడు' అని నమ్రతతో విన్నవించుటయు వెంటనే మదనసింగుతల్లిదండ్రుల కావార్తఁ జెప్పి రాజసమ్ముఖమున కరుగుటకుఁ దగు వస్త్రాలంకారముల ధరించి యశ్వారోహణముఁ జేసి తిన్నఁగఁ గోటకుఁ జని, రాజపుత్రభటులు కావలియున్న యనేకద్వారములు గడచి మోతీమహాల్ బ్రవేశించి గుఱ్ఱముదిగి మహారాజు కూర్చుండియున్న గదిలోనికిఁబోయి

తన యేలికయెదుట నిలుచుండెను. భీమసింగతనిని జూచి ‘ కుమారా! ఇచ్చటఁ గూర్చుండు’ మని చెప్పి పీఠమును జూపెను. ఆగదిలోనొక యున్నతాసనమున భీమసింగు గూర్చుండి యుండగా లక్ష్మణసింగును బ్రక్కను గూర్చుండి పినతండ్రివైపుఁ జూచుచుండెను. వారికట్టెదుట నెఱ్ఱనివస్త్రముఁ గట్టుకొని నిలువఁబడియున్న యొక పురుషుఁ జూచి ‘కుమారా! ఈతఁడొక విచిత్రవృత్తాంతమును జెప్పుచున్నాఁడు. నీవు నువానిని విని కార్యాంశము నాలోచింపుము. అని మహారాజు మద నసింగుతోఁ జెప్పి యెదుటనున్న యాపురుషునివంకఁ జూచెనతఁడు ‘మ హారాజా! నేను మహారాష్ట్ర దేశస్థుఁడను. బ్రాహ్మణుఁడను. నా పేరు వసంతభట్టు. నే నీవఱకును ఢిల్లీచక్రవర్తియగు నలాయుద్దీను కొలువు లోనుంటిని. కాని యతని దౌష్ట్యమును దురాచారమునుజూచి స హింపలేక యాతనికొలువు విడిచివచ్చినాను. గోవులను జంపు పచ్చితురక కలదగ్గఱ నింతకాలము కొలువుసలిపిన పాపము నాకాశివిశ్వేశ్వరుఁడు క్ష మించునుగాక! స్వదేశీయులును వేదశాస్త్ర సంరక్షకులునగు మీకొ లువుసేయవలయునని మీపాదములచెంతఁ జేరినాఁడను’ అని విన్న వించిన యాకథవిని మదనసింగు మహారాజున కభిముఖుఁడై “స్వామీ! ఈతనిచరిత్రము నాకు సందేహాస్పదముగ నున్నది. దేవరవారును యో జింపవలె” ననెను. ఆమాటలువిని భీమసింగుతో “దేవా! ఈబాలుని మాటలు నమ్మి నాపై ననుమానపడఁబోకుఁడు. నేను చేయఁబోయెడి యుపకారము ముందుముందు నాకార్యములవలననే మీకుఁ బోధపడు ను. అలాయుద్దీనుయొక్క గుట్టుమట్టు నాదగ్గఱ నున్నందున నేను మీ రనాయాసముగ జక్రవర్తినిగెలుచునట్లు చేయగలను” అనిమహారా ష్ట్రుఁడు పలుక భీమసింగు సత్శీలుండగుటచే ననుమానపడక వానికి నెల కు పదివరహాలు జీతమేర్పరచి యుద్యోగ మిచ్చెను. మహారాష్ట్రుని చమత్కార సంభాషణమున బాలుఁడైన లక్ష్మణసింగు వానియెడ

ననురాగము గలిగియుండెను. మదనసింగున కేలనోగాని వసంతభట్టు చూపులును, రూపును జూచినవెనుక నాతనియందనిష్టము గలిగెను. కాని తనయేలిక వానినాదరించుటచేఁ దానును గౌరవముతో నాతనిఁ జూచుచుండెను. అందఱును సంభాషణ చాలించినతరువాత లక్ష్మణసింగు మహారాష్ట్రునిజూచి "అలాయుద్దీను మాదేశముపై దండెత్తునా" యని యడిగెను. వసంతభట్టు కొంచెము యోజించి "స్వామీ తమ దేశముపైఁ జక్రవర్తి దండు వెడలఁడు. అతనికి రాజపుత్రుల పేరువిన్నఁ గడుభయము" అనిపలికిన వసంతభట్టు మాటలను మహారాజును లక్ష్మణసింగు విశ్వసించిరి. మదనసింగు వారివలె దృఢవిశ్వాస ముంచలేదు కాని కేవలము నమ్మకపోలేదు. ఆసంభాషణము ముగిసినపిమ్మట భీమసింగు, మదనసింగు ప్రముఖులకు సెలవు నొసంగెను. ఆనాఁడుమొదలు కుమారుఁడయిన లక్ష్మణసింగుమహారాజునకు వసంతభట్టు ప్రాణమిత్రుఁడయ్యెను. భీమసింగునకు నతఁ డాంతరంగికుఁడై యుండి సర్వకాలములందు నాలోచనముఁ జెప్పచుఁ బ్రభుసమ్మానముచే జనులకును గౌరవాస్పదుఁడై యుండెను. అదియట్లుండ మదనసింగు త్రికాలవేదియగు చిదానందయోగి మఠమున కనేకపర్యాయము లరిగి వేదాంతవిషయములను రాజకీయవ్యవహారములను ముచ్చటించుచు నుండుటచే యోగికిని మదనసింగునకును స్నేహమయ్యెను. అందుచేత మహారాజునకుఁగూడ యోగిని రెండుసారు లాతఁడు చూపి వారి కాతనియందు గౌరవము కుదురునట్లు చేసెను. యోగి రాజపుత్రులయం దత్యంతాభిమానమును మహమ్మదీయులయం దసూయయు మెండుగఁ జూపుచు, మదనసింగునకును రాణాకును ఢిల్లీవిషయవర్తమానముల నెట్లో తెప్పించి యనుదినమును దెలియఁజేయుచు వచ్చెను. అందుచేత యోగితోఁ బలుమారు రాజు లర్ధరాత్రమున రహస్యములు మాటాడుచువచ్చిరి. ఇట్లునాలుగుమాసములు గడిచెను.

## తొమ్మిదవ ప్రకరణము.

ఒక నాఁటిరాత్రి దీపములు పెట్టిన నాలుగుగడియలకు మదనసింగును బ్రతాపసింగును గూర్చుండి రాజకీయ వ్యవహారముల ముచ్చటించుకొనుచుండిరి. ఆసమయమున వ్రేలాడుచున్న జడలతోడను, శరీరమునిండ నలఁదుకొన్న భస్మముతోడను తెల్లమచ్చలుగల కృష్ణాజినముతోడను మెల్లమెల్లఁగాఁ జిదానందయోగి వచ్చి వారి కెదుర నిలిచెను. అతఁడు ప్రతిదినముగా రాత్రులయందు ప్రతాపసింగు గృహమునకు వచ్చుటకలదు. కాఁబట్టి యాతఁడరుదెంచిన కార్యము నెఱిఁగి ప్రతాపసింగు వెంటనే లోనికిఁజనెను. మదనసింగు లేచి 'నమోనారాయణ! బావాజీ!' యని నమస్కరించి యాతనిని దోడ్కొని గదిలోనికిఁ బోయి వచ్చినకార్య మేమని యడుగ, యోగి యిట్లనియె. "బాబా! నీవు రాజభక్తిగల రసపుత్రులలో నగ్రగణ్యుఁడవు. రాజునిమిత్తము ప్రాణములనైన ధారవోయఁగల సాహసికుఁడవు గనుక నేను నీనిమిత్తము వచ్చితిని. ఈరాత్రి చిత్తూరునగరమునందు నేను ముందుగా మీతోఁజెప్పఁదగని ఘోరకృత్యములు జరుగఁదలఁచి యున్నవి. మనమీరాత్రి యేమాత్రమశ్రద్ధ చేసినను మన మాజన్మాంతము విచారింపవలసి వచ్చును. తెల్లవారినదాక నీవు నాతో నుండుము" అని యోగిపలుక మదనసింగుశరీరము వడఁక నారంభించెను. యోగి యాతనిపైఁ జేయివైచి 'నాయనా! భయపడకుము. నే నుండఁగ నీనగరమునకాపద కలుగదు. నీవువచ్చునపుడు యుద్ధములయందు నీహస్తమలంకరించు ఖడ్గమును దీసికొనిరమ్ము. నీవు నీరాజపుత్రవేషమును మార్చి బ్రాహ్మణవేషమును ధరించి జామునరాత్రయైనతరువాత యోగానందమఠము దగ్గఱ నన్నుఁ గలిసికొనుము. 'జయశ్రీరనాగరశయన' యనినీవు పలికిన వెంటనే నేను నిన్నానవాలు పట్టెదను. నేను మఱొకరితో మాటలాడు

చుండిన యెడ నీవు నాకడకు రావద్దు. ఈరాత్రి నీరాజ్యమును నీదేశ
మును నీవు కాపాడుకొందు' వని యోగి చెప్పి వెడలిపోయెను. ఆతని
సాగనంపి రెండునిమేషమ్ములు మదనసింగు వానిమాటలసారాంశ మేమై
యుండునా యని యోచించెనుకాని తెలియరాలేదు. అంతట లోనికిం
జని ప్రతాపసింగును జూచి యోగికిని దనకును జరిగినసంభాషణమును
సవిస్తరముగఁ దెలియఁజేయ నాతఁడు విస్మయము నొంది కుమారునితో
నాయనా! నీ వాలస్యమును జేయక త్వరిగ నరుగుము. యోగిమాటల
యం దర్థమువిస్తారముగ నున్నదని నేనూహించెదను. అతఁడు మనరా
జ్యముపై మిగుల భక్తిగలవాఁడగుటచే కారణాంతరమున యోగిగాను
న్నట్లు లగపడుచునుగాని నిజముగా యోగికాఁడని నాయభిప్రాయము.
త్వరిగా నీవు బ్రాహ్మణవేషము వేసికొనుము. అని యాతని కుత్సాహ
జనకములగు మాటలఁ జెప్పెను. మదనసింగు తక్షణమె లోనికిఁబోయి
తన రాజచిహ్నములనెల్లఁ దీసివైచి మొగమునిండ బూదిఁ బులుముకొ
ని చిన్న యంగవస్త్రమును గట్టికొని చేతితో నొక చెంబును భుజము
పై నొకదర్భాసనమును బట్టుకొని తండ్రియెదుటికి వచ్చి నమస్కరించె
ను. అంతట ప్రతాపసింగు కుమారునిఁ జూచి 'నాయనా! నిజముగ
బ్రాహ్మణునివలె నున్నావు' అని లోపల కత్తియమర్పఁబడిన చేతికఱ్ఱ
నతనికిచ్చెను. అది గైకొని మదనసింగు పోఁబోవుచుండఁగా నర్ధరాత్రి
మగుటయు దుర్జనసంచారములగు వీధుల కొంటరిగఁ దనకుమారుఁడరు
గుట కష్టములేక ప్రతాపసింగు తనసహాయముగ నిద్రించుచున్న కృష్ణ
సింగును లేపి, నిద్రమత్తునకు గంజాయిమత్తు తోడుగఁ దూలుచున్నవాని
ని వెంట నంపెను. అపుడు వారిరువురును గృహమువిడిచి పోవునపుడు
ప్రతాపసింగు 'నాయనా! కడుజాగ్రత్త. శత్రువు లనేకు లుందురు,
నీకపాయమేదైన నుండునేని కృష్ణసింగును నావద్దకుఁ బంపిన నేను వెం
టనే తగుబలములతో నీసహాయార్థము వచ్చెదను.' అని చెప్పి వారిల

నంపెను. వారరిగిన వెనుక ప్రతాపసింగు తనశరీర మింటనున్నను మనస్సు కుమారునిమీఁది కేపోఁగా, నానాఁటి సంగతులనెల్ల మదిలోనూహించుకొనుచుఁ, జిత్తూరు రాజ్యక్షేమమునుగూర్చి భయపడుచు, పురమునఁ గుట్రలు జరుగుచున్నవని విచారించుచు నడుమనడుమ 'ఓభగవంతుఁడా! అతిపురాతనమైన చిత్తూరురాజ్యమున కాపద రాకుండఁ జేయుము. ఆవశ్యకమైనచో నాప్రాణమునైన నిచ్చెదను. నాకుఱ్ఱవానిని సుఖముగ నింటికిఁ దెమ్ము' అని ప్రార్థించుచు; నిద్రరాక పలుమాఱు వీథితలుపులు దెఱచిచూచుచు, నారాత్రి కలవలపడుచుండెను. అట్లు మదనసింగును కృష్ణసింగును బయలుదేఱి పదినిమిషములలో రాజవీథికిఁ జనిరి. గంజాయిమత్తు పూర్ణముగాఁ గృష్ణసింగును విడువనందున నడచుచునే యతఁడు కునుకుపాట్లు పడుచు యజమానుఁడు వచ్చి వీఁపు మీఁదఁ దట్టఁగా మేలుకొని వడివడిఁ బరుగెత్తుచు నతనివెంట వచ్చుచుండెను. వారు రాజవీథిమధ్యమునకు వచ్చునప్పటికి జామునరరాత్రి యయ్యెను. అది వెన్నెలగలదినముగానందున నంధకారము నగరమునంత నావరించెనుగాని గగనమండలమునందు వజ్రములవలెఁ దళతళ మెఱయుచున్న నక్షత్రకోట్లు కొంచెము వెలుతురు నిచ్చుచుండెను. పట్టణమెల్ల మాటుమడుగుటచే మనుష్యసంచార మంతగా లేకపోయినను చలువవస్త్రములఁ గట్టుకొని యత్తరుమొదలగు సుగంధద్రవ్యములును గమ్మపూఁదావులును దమ రాకను దెలియఁజేయఁ దాంబూలము నమలుచు వేశ్యాంగనాగృహముల నలంకరింపఁబోవు రసికశిఖామణులు మాత్రము కొంద ఱందందు వారి కగుపడుచువచ్చిరి. అక్కడక్కడ రెండుమూఁడు మిఠాయి దుకాణములును నొకటిరెండు తమలపాకుల దుకాణములును దక్క తక్కిన బజారెల్ల మూయఁబడియుండెను. మెల్లమెల్లగఁ నడచి రాజవీథిని దాఁటి ప్రక్కసందులలోనుండి కొంతదూరముపోయి, మదనసింగు తనకు యోగిచెప్పిన గుఱుతులనుబట్టి యావీథి

నున్న చిన్నమఠమునుజేరి, కృష్ణసింగును వీధిలోనుండ నియమించి తాను లోనికిఁబోయెను. అతఁడు మఠముఁ బ్రవేశించునప్పటికి చిదానందయోగి యెవరితోనో రహస్యములు మాటలాడుచుండుటఁ బట్టి మదనసింగు వెంటనే యోగిదగ్గఱ కరుగక యొక యరుగుమీఁదఁ గూర్చుండి వారి సంభాషణము వినుచుండెను.

చిదా—ఏమిరా! దామోదరా! ఢిల్లీవార్త లేమి!

దామో—స్వామీ! చక్రవర్తి దండయాత్రమాట నిజము. ప్రయాణసన్నాహము జరుగుచున్నది. మురళీధరదాసు మఠములో మన వాండ్రందఱు నిప్పటివఱ మాసముల నుండియు తెలిసికొనుచున్నారు.

చిదా—అట్లయిన నీవుపో. (అని వానినంపి) ఓరీ సదాశివా! ఇటురా.

సదా—మహాప్రభూ! ఆపల్లె మీరు చెప్పినచోట సుఖముగ నున్నది. నేనుపోయి మాటలాడి వచ్చినాను. ముసలివాఁ డందే యున్నాఁడు.

చిదా—గంజాయిదుకాణమునకు వెళ్ళినావా! అందలి విశేషములేమి!

సదా—ఆసంగతి చెప్పమఱచినాను. రాముఁడు గంజాయిమత్తుచే రహస్యము వెడలఁగ్రక్కినాఁడు. ఈదినమున జరుగఁదలఁచినదియు మనము విన్నదియు నిజమే.

చిదా—నీ వింకపొమ్ము. ఓరీ గంగా! రారా, నీవార్త లేమి!

గంగా—మహారాష్ట్రరాజులు మాలికాఫరుచే నోడింపఁబడిరి. ఆదేశమునుగూర్చి మనమింక యాశపడఁగూడదని మనబాబాజీలు చెప్పినారు. గోకులఘటమున గోసాయీ లిచ్చిన యుత్తరము లివిగో! (అని యుత్తరము లిచ్చెను.)

ఆయుత్తరములు గ్రహించి చిదానందయోగి వ్రాసినందుకు సంపి తనయెదుట గుండమున వెలుఁగుచున్న యగ్నిహోత్రపుకాంతి నా లేఖలఁ జదువుకొని యేదో యోజించుచుండెను. అప్పుడు మదనసింగు 'జయ్ క్షీరసాగరశయన' యని యఱచెను. చిదానందయోగి త్వరితగతి లేచి మదనసింగును వెంటఁబెట్టుకొని లోపలికివచ్చి తలుపుగడియవేసె ను. కృష్ణసింగు వీథిలో మఱ్ఱిచెట్టుక్రింద పైబట్టఁ బఱచుకొని నిద్రపోవ నారంభించెను. చిదానందయోగి వేషభాషాదులఁజూచి మదనసిం గా శ్చర్యమునొంది కొంతసేపటికి 'స్వామీ మన మేమి చేయవలయును. దాదాపుగ రెండుజాములరాత్రియైనది' యనెను. యోగి తద్వచనము లాలకించి కొంచెము యోజించి మదనసింగును దగ్గఱఁగ రమ్మని యిట్ల నియె, 'బాబా! నీ వాయుధముతో సిద్ధమై వచ్చినావా! ఏదీ కత్తియే క్కడ' అనమదనసింగు 'నేనెవరినైన వధింపవలెనా యేమి! ఎవరిని. ఈ వేషమున నున్న మీరెవ్వరో నా కెఱిఁగింపుఁడు. ఈవిషయమున నన్ను సంతుష్టునిఁగఁ జేసిరేని మీకు సేవకుడను బద్ధుఁడను' అని రాకొమరుఁడు ప లుక యోగి వానికుడిచేయి పట్టుకొని 'కుమారా! నావృత్తాంతమును బూర్ణముగ నీ కెఱిఁగింపరాదు. అయినను నీసందేహనివారణార్థము నే నొకసంగతిఁ జెప్పెదను. చిత్తూరురాజ్య సంరక్షణమునకై నేను నా శక్తిని ధారపోయుచున్నాను. దేశముయొక్క నానాభాగములకు మారు వేషములతో మనుష్యులనంపి యాయావృత్తాంతము తెలుఁగుచున్నా ను. నేనుగూడ శౌర్యవంతమైన వంశస్థుఁడనే కాని కారణాంతరమున నీ యాశ్రమంబును స్వీకరించితిని. నేను చెప్పినట్లు నీ పిరాత్రినడచుకొని న, నాప్రాణమునైనఁ గోల్పడి నీ కాపదరాకుండఁ జేసెదను' అని చెప్ప మదనసిం గాశ్చర్యపడి 'మీరు రసపుతులా ! అట్లయిన నేను తమ యాజ్ఞప్రకార మీరాత్రి నిస్సందేహముగ నొనర్చెదను' అనెను. ఈవ ఱకే రాత్రి ప్రొద్దుపోయినది. ఇఁక మనపనిమీఁద మనమరుగుదము.

రమ్ము' అనియోగి లేచెను. మదనసింగును లేచి యాతనిని వెంబడింప ని ర్వురును నడువ నారంభించిరి. అప్పుడు సరిగ రెండుజాములరాత్రి యగుటచే నమ్మహానగరవాస్తవ్యులందఱు నిర్భయముగ నిద్రపోవుచుండిరి. వీధులన్నియు నిర్మానుష్యములై యుండెను. ఉత్తమకులస్థులెవ్వరుఁ బ్రవేశింపఁగూడని పేటలును సందులును గొందులును వారు తిరుగుచుండిరి. అప్పుడు మదనసింగు 'అహాహా! ఈవీధులయం దర్ధరాత్రముల నరహత్యలు జరిగినను దిక్కులేదుగదా. ఒంటరిగ నీసందుల నరుగువాఁడు నిరపాయముగఁ జనఁడు' అని తనలో ననుకొనుచు గమ్యస్థానమెదురు చూచుచుఁ జిదానందయోగితోఁ గూడ నరుగుచుండెను.



## పదవ ప్రకరణము.



ఆ మూఁడుమూలలసందులలో నొకచోట శిథిలమునొంది చూచువారలకుఁ జాలిఁగలిగించు నొకపురాతనమందిర ముండెను. అది పూర్వము సంపన్నులగు నున్నతవంశజులు గాఁపురముండు గృహమేకాని తద్వంశజులు కుమార్తెల వివాహములకయి చేసినఋణములఁ దీర్పలేక సర్వస్వముఁ గోలుపోయి యిల్లువిడిచి దేశాంతరముల కరిగిరి. అప్పటినుండియు నది పాడయి యుండెను. మదనసింగును జిదానందయోగియు నాఁటిరాత్రి యామార్గమునఁ బోవుచు దానికిఁ గొంచెముదూరమున నాలుగుపాడుగోడలను జూచిరి. ఆగోడలమధ్య నొకచిన్న పెంకుటిల్లుండెను గాని వీధిలోనుండి నడచిపోవువారి కందుగృహ మున్నట్లు కనఁబడదు. ఆయింటికి ద్వార మేవైపున నున్నదో యెవ్వరు నెఱుఁగరుగాని గోడ కడుగున నున్న పెద్దతూము మనుష్యుఁడు దూరిపోవునంతటి విశాలముగ నుండుటఁబట్టి గృహమున కరుగువా రందులోనుండి దూరి లోనికరుగుదురు. దీనింబట్టి యాగృహము మహాచోరులకు శరణ్యంబై

యుండునని చెప్పనక్కఱలేకయే మన మూహింపవచ్చును. ఆగృహ స మీపమునకుఁ బోయినతోడనే చిదానందయోగి 'మనకుఁ గావలసినది యీయిల్లే. ఇక్కడ నిలువుము.' అని సింగునాపెను. చిదానందయోగి తూములోనుంచి లోని కరిగి, తన కాపద సంభవించునెడ మదనసింగు ను లోనికి రమ్మని యాతనిని తూముదగ్గఱ వీధిలో నిలిపెను. అతఁడు లోపలి కరుగునప్పటి కాయింట నిరువురు పురుషులు మాటలాడుచుం డిరి. అందొకఁడు దృఢశరీరముగల దక్షిణహిందూస్థానవాస్తవ్యుఁడు. రెండవవాఁ డతిసుకుమారుఁడైన బాలుఁడు. వారిసంభాషణల నాలకిం పఁ దలఁచి యోగి తనకడనున్న కంబళమును గప్పుకొని యాపంచను గూర్చుండి యుశ్వాసనిశ్వాసములను వదలక కదలక మెదలక యుండె ను. అప్పుడందున్నవారిట్లు ముచ్చటించిరి.

బాలు—ఏమయ్యా! రెండుజాము లయినది. వా రింకను రాలేదేమి?

బ్రహ్మ—మహారాజా! చిత్తము. వారు తప్పక వచ్చెదరు. మదనసింగు మనలనందఱ నీరాత్రి నిర్మూలించుటకుఁ బ్రతిజ్ఞ గైకొన్న వాఁడు. మీరాజవంశమునకు మదనసింగు మిగుల క్షేమముఁ జేయు నట్లగుపడునుగాని వాఁడు చక్రవర్తితో మిగుల స్నేహముఁగలిగి యు న్నాఁడు. మిమ్ముఁ జంపి మీశిరస్సును జక్రవర్తికిఁ గానుకగా నంపెద నని వాగ్దానముచేసినాఁడు. అందుచేతనే దుర్మార్గుఁడైన మ్లేచ్ఛనివల న నతఁ డట్టిగౌరవము నొందెను. వారు నీసమయమునకు వచ్చుచుం దురు. వారు పట్టణమునఁ జేయు కుట్రలనెల్లఁ మీకు నివేదించుటకేసుఁ డీ మిమ్ము నీమూఁడుమూలకుఁ దోడ్కొనివచ్చి నాఁడను. మీకు భయ ము రవ్వంతయు లేదు నాచేత కత్తియున్న దిదిగో—

బాలు—భయము నాకుఁగాదు. నాజాతిలో నెవ్వరికిని లేదు. నాచేత కత్తియుండఁగా నాకు భయమేల? మదనసింగు మాకింత

ద్రోహముదలఁచునని మేమెన్నఁడెఱుఁగము. వారినీదినముననె బట్టుకొని భీమసింగుమహారాజున కప్పగించవలెను.

బ్రాహ్మ—మహారాజా! దేవరవారికి నేనుపదేశించినదానికంటె మీ రెక్కువ విషయముల నీరాత్రి చూడఁగలరు. వారు కుట్రలఁ జేయునపుడు సాధారణముగ నీగృహమునకు వత్తురు. నేఁ డెందుచేతనో యిటకు రాలేదు. వారూరిబైట తోఁటలో నేఁడు కుట్రలు చేయుచుండి యుందురు.

బాలు—మనమక్కడకు త్వరితముగ నరుగుదము. రమ్మ తెల్లవారకముం దెట్లయిన వారు దురాత్ములఁ బట్టుకొందము.

బ్రాహ్మ—నానిమిత్త మొక సేవకుఁడు రావలెను. వాఁడు వచ్చిన తోడనే మనమాస్థలమున కరుగుదము. నే నావలకుఁ బోయి చూచి వచ్చెదను.

అని బాలు నాచీఁకంటిలో నిలిపి బ్రాహ్మణుఁ డీవలకు వచ్చుటకు యత్నించుచుండెను. ఆమాటల నాలకించి చిదానందయోగి తూముల నుండి సత్వరముగా బైటకుఁజని మదనసింగును వెంటఁబెట్టుకొని 'అబ్బాయీ! ఇటురా లోపలినుండి బ్రాహ్మణుఁడీవలకు వచ్చుచున్నాఁడు. వానికి మన మగపడకుండ నాగోడచాటున నుందము. వాఁడొక సేవకుని తో మాటలాడునఁట. ఆమాటలఁగూడ విందమ' ని యాతనిఁ దీసికొనిపోయెను—లోపలినుండి బ్రాహ్మణుఁడు బైటకు వచ్చునప్పటికి వానికిరువదిగజములదూరమున సేవకుఁడైన యానందదాసు వచ్చెను. అతఁడు తనదగ్గఱకు వచ్చినతోడనే బ్రాహ్మణుఁడు 'ఆనందా! విశేషము లేమి? బండిసిద్ధము చేసినావా?' యని యడిగెను. అంతట నానందుఁ డానందము నొంది 'చిత్తము సర్వము సిద్ధమైనది. మనశంకరుఁడును బండివాఁడునుగూడ నాయుధపాణులై సిద్ధముగ నున్నారు. మీరు కుఱ్ఱవానిఁ దీసికొనివచ్చుటయే యాలస్య మ'ని చెప్పెను. ఆమాటలు విని

బ్రాహ్మణుఁ డమితానందము నొంది యానందదాసును సంకేతస్థలమున కంపి మరల రహస్యగృహమును బ్రవేశించెను. పొంచుండియున్న చిదానందయోగియు మదనసింగును వారిసంభాషణల నాలించి తామును వారి ననుసరించిపోవుటకు నిశ్చయించిరి. ఆసమయమున యోగి రాజపుత్రుని విలోకించి "కుమారా! ఈ బ్రాహ్మణుఁడు మనకుఁ బరమశత్రువు. వాఁడు నీకొన్న కుట్టవాఁడు మనకుఁ బరమాప్తుఁడు. మనప్రాణముల విడిచియైన బాలునిరక్షించి యీబ్రాహ్మణుని నెట్లయిన మట్టుపెట్టవలెను. నేను 'జయకాళి' యనునప్పుడీబ్రాహ్మణుని నీఖడ్గముతో సంహరింపుము. దీని రహస్యము తెల్లవారకముందే నీవెఱుఁగఁగలవు" అని చెప్పి రసపుత్రునకుఁ బ్రోత్సాహ మొసఁగెను. బ్రాహ్మణుఁడు లోనికరిగి యాబాలుని వెంటఁబెట్టుకొనివచ్చి తూముదాఁటి యూరిబైటనున్న మామిడితోఁపునకుఁ బ్రయాణమయ్యెను. తముజాడ వారు లక్షింపకుండ యోగియు సింగును వారి ననుసరించుచుండిరి. ఇట్లు కొంతదూరము చనినపిదప గమ్యస్థానమగు మామిడితోఁపు కట్టెదుటఁ గన్పించెను. అంధకారదేవతకు నిలయమైన యాతోఁట ముందుగా బ్రాహ్మణుఁడును బాలుఁడును బ్రవేశించిరి. మనయోగియు శిష్యుఁడును వారివెనుకనే చనుచుండిరి. ఆతోఁటనడుమ నొకచోట బాలుని గూర్చుండ నియమించి బ్రాహ్మణుఁడు ముందుకువచ్చి రహస్యముగ తనసేవకులనుజూచి 'ఓరీశంకరా! ఓరీయానందా! తుపాకులు కత్తులు సిద్ధముగనున్నవా? తుపాకులలో మందుకూరి మీమీప్రయత్నముల నుండుఁడు' అని హెచ్చరించెను. అనవుఁడు బద్ధాంజలులై సేవకులు "మహాప్రభూ? సర్వము సిద్ధమైనది. ఢిల్లీనుండి పాండురంగనాథుఁడు సన్యాసివేషముతోఁ గొన్ని యుత్తరములను మీకుఁ దెచ్చి బౌద్ధమఠమునందు బసఁజేసి యున్నాఁడు' అని విన్నవించిరి. ఆపలుకులు యోగి విని సంతోషించెను. బ్రాహ్మణుఁ డాసేవకులవచనములువిని "మనకార్యసాఫల్య మీదినమున నైనది.

ఇంక నుత్తరములతోఁ బ్రయోజనములేదు. తేపు చిత్తూరిసంగతులను విని యతఁడే మనకడకు వచ్చును. మన మాతనిదగ్గఱ కరుగనక్కఱలేదు. బండికి గుఱ్ఱములఁ బన్నుఁడు' అని యాజ్ఞాపించెను. నిశాసంచార మెన్నఁడెఱుఁగని యాబాలుఁడు బ్రాహ్మణుని విపరీతచేష్టలను రహస్యాలోచనములనుజూచి సందేహింపనారంభించి యాయర్ధరాత్రిమున నానిర్జనప్రదేశమున నాగాఢాంధకారమునం దాబ్రాహ్మణుఁడు సహచరసమేతుఁడై యుండుటచేఁ దన కెట్టియపాయమునైనఁ జేయఁగలడని భయపడసాగెను. ఒక విదేశీయునిమాటలు నమ్మి యంతఃపురముఁబాసి తా నట్టియకాలమున మాఱుమూలకు వచ్చినందులకు నతఁడు చింతింపఁజొచ్చెను. కాని బాలుఁడైనను ధైర్యసంపన్నుఁడగుటచే మనస్థైర్యమును విడువక కాఁదలఁచిన కార్యమున కెదురుచూచుచుండెను. అంతట బ్రాహ్మణుఁడు బాలకుని సమీపించి 'స్వామీ వారు తోఁటలోనికి వచ్చినారు. మేము వారలఁ బట్టుకొనియెదము. దురాత్ములవలన నపాయము కలుగకుండ మీ రీబండిలోఁ గూర్చుండుఁడు. అని తచ్ఛకటమును జూప భయసందేహములు ద్విగుణములై మనస్సును గలఁప బాలకుఁ డాశకట మధిరోహించెను. బ్రాహ్మణుఁడు పిమ్మట నానందదాసుని శంకరుని దూరముగాఁబిలిచి 'బండి వడిగాఁ దోలుఁడు. ఆఱేసిక్రోసుల కొకచోట నంచెబండ్లు కలవుగనుక మన మతివేగముగఁ బోఁగలము. ఈతఁడు పెంకెతన మధికముగాఁ జేసినప్పుడు తుపాకులతోఁ బేల్చివేయవచ్చును గాన ముందుగా నట్టిపని జేయక సాధ్యమైనంతవఱకుఁ బ్రాణములతో నీతని ఢిల్లీకిఁ దీసికొనిపోవుఁడు' అని యాదురాత్ముల కుత్సాహ మొసఁగి తానును శకటములో నెక్కెను. ఆసమయమునఁ దన యేలిక యవస్థ యపాయముగ నుంటఁ జూచి గాంభీర్యమును విడిచి తోట్రుపాటుతోఁ జిదానందయోగి మదనసింగునుజూచి 'బాబా! కత్తి; కత్తి. నవమన్మథసమానుఁడగు నా

బాలుఁడు మనస్వామియు రసపుత్రకులతిలకమునగు శ్రీకుమార లక్ష్మణ సింగుమహారాజుగారు. దుర్మార్గుఁడగు నాబ్రాహ్మణుఁ డాతని నపాయసముద్రమున ముంపఁదలఁచినాఁడు. కనుక జాగ్రత్తగనుండుము' అని రహస్యముగఁ జెప్పెను. అర్థరాత్రమునఁ దన యేలిక నిజాంతఃపురములఁ బాసి పయోముఖవిషకుంభమును బోలునొకదురాత్ముని విశ్వసించివచ్చినందుల కాత్మగతమున నొచ్చుకొనుచు నతని కపాయ మగునేమో యని ముందుకు దుముకఁజూచుచు దైవమును దూఱుచు మదనసింగు పరిపరివిధముల విచారింప నారంభించెను. చిదానందయోగిమాత్రము బండిపై దృష్టినిలిపి తెప్పవాల్పక చూచుచుండెను. తనతోఁగూడ బ్రాహ్మణుఁడును శకట మారోహించినందున బాలుఁడు వానిఁజూచి నిశ్శంకముగ నిట్లనియె. 'నన్నితోఁటకుఁ దెచ్చుటలో నీయభిప్రాయ మేమి ? నీవేమైనను ద్రోహము చేయఁదలఁచినావా ?' అని యడుగఁగానే బాలుని కంఠముపైఁ జేయివైచి నొక్కిపట్టి 'నిన్ను నేను ఖైదీగ ఢిల్లీనగరమునకుఁ గొనిపోవుచున్నాను. అల్లాయుద్దీను నిన్నుఁ దెమ్మని మాకాజ్ఞనిచ్చినాఁడు. నేఁడు నీవు నాచేతఁ జిక్కినావు. నీవింకనేమిచేయఁగలవు? రాజపుత్రుఁడవగుదువేని ధైర్యముఁజూపి తప్పించుకొమ్ము. పాఱిపోవ యత్నించితివా నాచేతఁ జచ్చితివని నమ్ముము' అని క్రూరుఁడగు వసంతభట్టు రెండవచేయి తనవాఁడికత్తివంకఁ జరపెను. ఆయాపదఁ జూచి వెఱవక రాకొమరుఁడు తన మొలనున్న ఖడ్గము నూడఁబెఱికి హస్తమున ధరించునంతలో, మదనసింగు స్వామిప్రాణరక్షణమున కరుదెంచి 'నిలునిలు దురాత్మా ! యని తోఁట ప్రతిధ్వను లెసఁగ నఱచి బండిమీఁద కుఱికి మూయఁబడియున్న బండితలుపును ఫడాలునదన్ని విరుగఁగొట్టి లోనఁబ్రవేశించెను. వసంతభట్టు బ్రాహ్మణవేషధారియగు మదనసింగును గుర్తింపలేక భయకంపితుఁడై యుండ, మదనసింగు కోపోద్దీపితుఁడై యామహారాష్ట్రుని బండిలోనుండి

యీడ్చి నేలఁబడవేసెను. ఆనందదాసును శంకరుఁడును ఖడ్గపాణియై యున్న యోగినిఁగూడఁ జూచి బెదరి ధైర్యమునఁదనకుఁ దీసిపోవని బండివానితోఁగలిసి వెనుకకుఁ దిరిగిచూడక పరుగిడిరి. మదనసింగు మొదట బ్రాహ్మణుని బ్రాణము గాపాడఁదలంచెనుగాని దురాత్ముఁడైన వసంతభట్టు ఖడ్గముదనపై విసరినందునను, యోగి 'జయకాళీ' యని కేకవేసినందునను మదనసింగా దెబ్బ తప్పించుకొని తనఖడ్గముతోఁ బ్రాహ్మణాధముని నొక్కయేటున సంహరించెను. తరువాత నర్ధరాత్రము నీచులను విశ్వసించి రాఁగూడని స్థలమునకు వచ్చినందుకు లక్ష్మణసింగును యోగియు మదనసింగును మృదువుగా మందలించి యారాత్రి యాతని నింటికిఁ జనవలదని మఠమునకు వెంటఁబెట్టుకొనిపోయి యతనికి సకలోపచారములఁ జేసిరి. తనప్రాణము రక్షించిన యాబ్రాహ్మణుఁ డెవ్వఁడో లక్ష్మణసింగు తెలియఁగోరెనుగాని వారుభయులు తేపుదర్బారున మావిషయమై మీ రెఱుఁగఁగలరు గాన మమ్మేమియు నేఁడడుగవలదని ప్రత్యుత్తరమొసఁగి లక్ష్మణసింగు తనకృతజ్ఞతాసూచకముగ రత్నపుపిడిగల తనకత్తిని మదనసింగునకు బహుమానముగ నొసఁగి యారాత్రి యటఁబవ్వళించెను. చిదానందయోగి మదనసింగును వెంటఁబెట్టుకొని యవశిష్టమగు కార్యమును సమాప్తము నొందఁజేయుటకు మరలఁ బ్రయాణమై పోవుచు లక్ష్మణసింగుతో 'మీరు తెల్లవారినతరువాత మానిమిత్తము వేచియుండక మీగృహమున కరుగవచ్చును. మాసేవకు లీలోపల మీకుఁ గావలసిన యుపచారములు చేయుదురు.' అని సెలవుఁదీసికొని సాగిపోయెను.

## పదునొకొండవ ప్రకరణము.

అట్లు లక్ష్మణసింగును మఠమునందు విడిచి మదనసింగును జిదానందయోగియు నవశిష్టకార్యములను సమాప్తినొందించుటకుఁ దమప్రయాణమును మరల నారంభించిరి. ఈపర్యాయము చిత్తూరునగరము యొక్క పశ్చిమభాగమునకుఁ బోవలసియుండెను. వారు ప్రయాణమై పోవునప్పటికి రమారమి జామున్నర ప్రొద్దుండెను. అప్పటికి వీధులు నిర్మనుష్యముగ నుండుటచే వారిరువురును మునుపటికంటె వడిగనడచి పెక్కుసందులఁ గడచి కొంతసేపటికి విశాలమైన బౌద్ధమఠసమీపమునకు వచ్చిరి. రాజస్థానమునం దాకాలమున బౌద్ధమతవ్యాప్తి లేదుగాని తన్మతము భరతఖండమున కెల్లఁ బ్రధానమతమై యుండు నప్పుడు చిత్తూరునం దీమఠము నిర్మింపఁబడినది. మనము వ్రాయుకాలమున నందు బౌద్ధులు నివాసము చేయుట లేకున్నను దాని పురాతననామముననే యది పిలువఁబడుచు వచ్చెను. అందు సన్యాసులును యోగులును ప్రయాణవశమున నొకటి రెండుదినము లుండి పోవుచుందురు. మనకపట బ్రాహ్మణుఁడును యోగియు మఠద్వారమునకుఁ జని లోపలఁ బ్రవేశింపఁబోయిరిగాని యొక సేవకుఁడు వారిని గదిమి నిలిపెను. మదనసింగంతట నిలువక సేవకుని నొకచేతితోఁ ద్రోసి యోగితోఁగూడ గుమ్మము దాటఁగా నాసేవకుఁడు వారి కడ్డముపోయి వారితో నిట్లు మాటాడెను.

సేవ—మీ రెవరు? ఈమఠమునందు మీ కేమిపని యున్నది?

మద—ఇక్కడ మాస్నేహితుఁ డున్నాఁడు. ఆయన నిమిత్తమై వచ్చినాము.

సేవ—మిమ్మెవరు పంపినారు? ఎవరినిమిత్తము వచ్చినారు?

మద—నీ వీక్కడివాఁడవా? విదేశీయుఁడవా? ముందామాట చెప్పుం.

సేవ—మా దీగ్రామముకాదు. నేను జ్ఞానానందులవారి శిష్యుఁడను.

మద—జ్ఞానానందులవారి దర్శనముసకే మేమును వచ్చినారము.

సేవ—అట్లయిన నర్ధరాత్రమం దేల రావలెను? తేపుపగలు రండు.

చిదా—ఈరాత్రి రమ్మని స్వామి మాకుత్తరువు చేసినాఁడు. నీవీ యసంబద్ధప్రశ్నలతోఁ గాలముపుచ్చక మారాక వారి కెఱిఁగింపుము.

సేవ—అట్లయిన లోపల నున్నారేమో చూచివచ్చెదను. ఆయన యిట్టిసమయములయందు స్మశానములో జపముఁ జేసికొనుచుందురుగాని యింటిదగ్గఱ నుండరు. ఉన్నట్లయిన మీపేరు చెప్పెదను. మీరెవరు?

చిదా—మమ్ము వసంతభట్టు పంపినాఁడు. అతిరహస్యములున్నవి.

సేవకుఁ డీమాటల నాలకించి లోపలి కరిగి మఠమునకు వెనుక ప్రక్క గోడలో సొరంగమువలె నున్న నేలకొట్టులోఁ గూర్చుండియున్న జ్ఞానానందస్వాములవారిం జూచి యీమనుష్యులజాడలఁ దెలుప స్వామి కొంచె మాలోచించి యాక్రొత్తవారల విషయమై సమస్తముఁ దెలియఁగోరి తాను మఠమందున్న యొకగదిలోఁ బ్రవేశించి తలుపు మూసికొని వీరి నిరువురను తద్వారముదగ్గఱకు రమ్మని వర్తమానము నంపెను. వారట్లు వచ్చి గదిగుమ్మముదగ్గఱ నిలువ జ్ఞానానందులవారు మదనసింగుచిదానందులతో నిట్లు మాటాడిరి:—

జ్ఞానా—అయ్యా! మీ రెవరు? నాతో మీ కేమిపని యున్నది?

మద—అయ్యా ! తమరు మావిషయమై యనుమానపడవద్దు. మేమన్యులముగాము. తలుపుతీసి మాతో మాటాడుఁడు.

జ్ఞానా—అట్లయిన నేను మిమ్ము నమ్ముట కొకయానవాలు [చెప్పుఁడు.

చిదా—మీపేరు పాండురంగనాథుఁడు కాదా ?

జ్ఞానా—(ఆశ్చర్యముతో) అవునవును.

అని తక్షణమే తలుపుఁదీసి వెలువడెను. అతని పసుపుపచ్చని దీర్ఘకాయముఁ గన్గొనినతోడనే యోగియు సింగును వానిని గపటసన్న్యాసిగ నెఱిఁగిరి. అంతట వారందఱు నిట్లు సంభాషించిరి.

జ్ఞానా—అయ్యా! మీచరిత్రములను గొంతచెప్పి మావసంత భట్టు వృత్తాంతమును దెల్పుఁడు.

చిదా—అయ్యా! వసంతభట్టీనగరమునకు వచ్చినదాదిగ మే మిరువుర మాతని యనుచరులమై యుంటిమి. అతఁడు మాకు నెఱిఁగింపకుండ నీవఱ కేకార్యమును జేయలేదు. ఈరాత్రి లక్ష్మణసింగును జెఱఁబెట్టినాము. అందుకే తమదర్శనమునకు నన్నాతఁడు వడిగ నంపెను.

ఆపలుకులు చాలించి జ్ఞానానందస్వామి యాత్రముతో 'పట్టుకున్నారా? పట్టుకున్నారా? ఆహాహా! ఔరా! వసంతా! ప్రజ్ఞయనఁగా నీదే ప్రజ్ఞరా. చక్రవర్తివలన మనకగుగౌరవమును నేను వర్ణింపఁ జాలను.' అని యప్రయత్నజనితమగు నానందమును బట్టఁజాలక తత్సూచకములగు మాటలాడి 'అతఁడెక్కడనున్నాఁడు? నన్నేమి చేయుమన్నాఁడు." అని యడిగెను. మిమ్మిత్క్షణమే వెంటఁబెట్టుకొనిరమ్మని మాకు సెలవిచ్చినారు. జోడుగుఱ్ఱముల బండిపై బాలుని నెక్కించి బంధించినాము. మీరు వచ్చిన వెంటనే ప్రయాణమైపోవచ్చును. చక్రవర్తి వసంతున కిమ్మని తమచేతికిచ్చిన యుత్తరములఁగూడఁ దేవలయునని మీతో మనవిచేయు మనెను' అని చిదానందయోగి చెప్పెను. ఆమాటలు విని పాండురంగనాథుఁ డాశ్చర్యమొంది వారు వసంతుని

యాంతరంగికులని నమ్మెను. మదనసింగును చిదానందయోగియు జ్ఞానానందులవారిని ద్వరపెట్టి 'మననిమిత్తము వారుమామిడితోఁటలోఁ గనిపెట్టుకొని యుందురు. ఇంక ప్రొద్దెంతో లేదు. తమరాలస్యముచేసిన తెల్లవారునప్పటికి పదిక్రోసులదూరమయినసాగిపోలేము' అని హెచ్చరింప జ్ఞానానందులవారు తనపాతాళమందిరమున కరిగి చెంబులోఁబెట్టి భూమిలోఁ బూడ్చినయుత్తరముల గ్రహించి మన శూరశిఖామణు లిరువురుఁ దనవారని భ్రమపడి ప్రయాణమయ్యెను. అట్లు బౌద్ధమఠమును బాసి వారు ముగ్గురును గలిసి తూర్పుదిక్కున కభిముఖులై నడువ సాగిరి. జ్ఞానానందులవారు చిత్తూరునగరముయొక్క మాఱుమూలసందుల నెఱుఁగరుగాన చిదానందయోగియాతనిని మార్గముఁదప్పించి క్రొత్తసందులనుండి తీసికొనిపోవుచున్నను నాతఁడది గ్రహింపలేకపోయెను. కొంతదూరము వచ్చినతరువాత వారికీ క్రిందిసంభాషణము జరిగెను.

జ్ఞానా—నా రీపాటికి మునుపటిచోటనుండి వెడలిపోరుగదా?

చిదా—మనము వెళ్ళినదాఁక వారక్కడనుండి యడుగైనను గదలరు. త్వరగారండు.

జ్ఞాన—మన మందఱము మిగుల నదృష్టవంతులము. మనకుఁ జక్రవర్తివద్దనుండి మంచిబహుమానములు దొరకఁగలవు. మనమొక్క పనిచేయవలయును. అది మీ రతిరహస్యముగ నుంచవలయును. ఈ బాలుఁడు మనవాఁడేకదా?

చిదా—ఈకుఱ్ఱవాఁడు మనవాఁడే మీరు సందేహింపక స్వేచ్ఛగా మాటలాడవచ్చును.

జ్ఞానా—సరే సరే. దగ్గఱగారమ్ము నాయనా (అని త్రోవలో నిలిచి మెల్లగా) ఈచిత్తూరునగరమునకు సంరక్షకుఁడై రాజున కాంతరంగికుఁడగు మదనసింగనునొక రసపుత్రవీరుఁడు కలఁడఁట. అతఁడు మహాపరాక్రమవంతుఁడఁట. అతఁ డుండఁగ మన కీచిత్తూరురాజ్యములోఁ

బడదుగనుక మనమెట్లయిన నతని నీరాత్రి పట్టుకొని వధింపవలయును. ఈవేళనతఁడుచిక్కకున్నపక్షమున మనమీపురమున నాల్గుదినములైన నిలిచి యాతనినంతము నొందింపవలయును. ఈకార్యముఁ జేయకున్న మనకుమాటదక్కదు. నీయభిప్రాయమేమి?' అని బ్రాహ్మణవేషధారి యగుమదనసింగునడిగెను. మదనసింగామాటలు విని జ్ఞానానందులవారికిఁ డనపైనిగల మహాకోపమున కాశ్చర్యమొంది చేతికట్టతో నమర్చఁబడిన కత్తిపిడిపైఁజేయినయిచి యుత్తరువు నిమిత్తము చిదానందయోగి మొగముపైపుఁ జూచుచుండెను. చిదానందయోగి కొన్ని సంజ్ఞలచే మదనసింగు ప్రయత్నమును మాన్పి యింకను వానిదగ్గఱనుండి కొన్నిమాటలు వినఁగోరి స్వాములవారికిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

చిదా—"నాకును జిరకాలమునుండి మదనసింగును గడతేర్పవలెననియున్నది. అతఁడసహాయశూరుఁడు. వానిసంగతి మన యీకుఱ్ఱవాఁడు చక్కఁగా నెఱుఁగును" అని మదనసింగును జూపెను. వెంటనే మదనసింగిట్లు వారితోఁ జెప్పసాగెను.—

"అయ్యా! మదనసింగునకును నాకును నేనే యతఁడన్నంత యైక్యము గలదు; కాని యాతఁడు రాజులపక్షమువాఁడు నేను జక్రవర్తిపక్షమువాఁడను. అయినను బ్రభుభక్తిచేత మేమాతనిఁ గడతేర్చుట కీవఱకే కుట్ర నొకటి పన్నియున్నాము. అతనిందోడ్కొనివచ్చుటకు నొక మనుష్యునంపితిని. ఈపాటికివారు వచ్చియేయుందురు. కనుక మన మాసంకేతస్థలమునకు శీఘ్రముగఁ బోవుదము" అనెను. అంతటస్వాములవారానందపరవశులై "నేనే యీకార్యమును జేసెదను. ఈచేతులతో రాజపుత్రకుని ప్రాణములఁ దీసి చక్రవర్తివద్ద పారితోషికమును గైకొనవలెను." అని యుత్సాహవాక్యములు బలుకఁజొచ్చెను. తరువాత వారు ప్రథమమున వసంతభట్టు లక్ష్మణసింగుతో రహస్యాలోచనలు సలిపిన, యాగోడలమధ్యనున్న కుటీరమువద్దకు స్వాములవారి

పోయి యదియే మదనసింగువచ్చెను గృహమని చెప్పి నుండాతఁడును లోనుండి వారు లోని కరిగి పిమ్మట నతనింగూడఁ దీసికొనిపోయిరి. ఆ గృహమున కరిగి స్వాములవారు చీఁకటిలోఁ గూర్చుండి తనకతఁడు పాలయం బున్న యుత్తరముల వెదకికొనుచు "అయ్యా మననిమిత్తము వారు తోఁటలోఁ గాచుకొని యుందురేమో. మనమరుగవద్దా" యని యడిగిరి.

"మనము మదనసింగును జంపుట యావశ్యకముగాని తోఁటకరు గుట ముఖ్యముగాదు. మనము రామని వారివలనకే నిశ్చయించుకొని లక్ష్మణసింగుతోఁ బైనమైపోయియుందురు. లక్ష్మణసింగు వారిచేతఁబడ మదనసింగు మనచేతఁబడును. అందుచేత మన మీస్థలమును బాయవద్దు. మీ మిరుపురము వీధిలోని కరిగి వారు వచ్చుచున్నారేమో చూచి వచ్చె దము" అని చిదానందయోగి చెప్పి స్వాములవారి నొడంబఱచి మదన సింగునుగూడి వీధిపై పుచని వారిట్లు మాటాడిరి.

చిదా — అబ్బాయి! ఈతని నిచట నేమిచేయుదము? చంపివేయు టుచితమగునా?

మద — నిరాయుధుఁడై యసహాయుఁడైనపురుషునిఁ జంపుట మనశౌర్యమునకుఁదగిన కార్యముగాదు. కాఁబట్టి నే నీక్షణమున మా పినతండ్రివద్ద కరిగి యాతనిదోడ్కొనివచ్చి వీనింబట్టుకొని తేవుదయము న రాణాకు నప్పగింపఁ బ్రయత్నించెదను.

చిదా — ఈయుపాయము చక్కఁగానున్నది. నీవు మీపినతండ్రి కడ కరుగుము నీవు వచ్చినదాఁక నే నిచట నుండెదను.

అనిపలికి యోగి మదనసింగు నంపి స్వాములవారు దాఁటిపోకుం డఁ దానచ్చటఁ గావలియుండి ప్రతాపునిరాక కెదురుచూచుచుండె ను. మదనసింగును వడిగ నింటికిఁజని తనరాక నిరీక్షించుచున్న పినతం డ్రికడ కరిగి సపరివారముగ నా[illegible] వెంటఁబెట్టుకొని యారాత్రి జరిగిన వృత్తాంతముల రహస్యముగ [illegible]నికిఁ జెప్పుచు స్వల్ప[illegible]న

కుటీరమువద్దకు వచ్చెను. ఈనడుమఁ జిదానందయోగి లోపలి కరుగ 'వారువచ్చుచున్నారా?' యని స్వాములవా రడుగ యోగి 'వారినిమిత్తము మనబ్రాహ్మణకుఱ్ఱవాని నంపినాఁడను. ఇప్పటికి వారును వచ్చుచుందు రుగాని మీక్రొత్త మొగమును జూచినతోడనే పాఱిపోవుదురేమో యని భయమగుచున్నది.' అని పలికెను. ఎట్లయిన కార్యము విఘ్నము గాకుండ సఫలము చేయుట స్వాములవారి యభిప్రాయమగుటచే 'అయ్యా! నేను ముసుఁగువెట్టుకొనియిక్కడఁ గూర్చుండెదను వారు రాగానే నాకాలుగోకుఁడు. అప్పుడు నేను లేచి వానినివధించెదను' అని స్వాములవారు శరీరమునిండ ముసుఁగువేసికొని యొకమూలఁ గూర్చుండిరి. చిదానందయోగి వెంటనేవాని కక్షపాలయందలి కాగితములకట్టను సంగ్రహించి స్వామితోఁ గొన్నియంశముల ముచ్చటించుచుండఁ బ్రతాపసింగును మదనసింగునునాకస్మికముగ లోనికివచ్చిరి. వెంటనే స్వాములవారు లేచి "వీఁడేనామదనసింగు? కత్తి కత్తి" యని కలవలపడుచుండ మదనసింగుముందటికి వచ్చి 'ఓరీ పాపాత్ముఁడా! నీకుఁ గత్తి యెందుకురా? నీబ్రతుకునకుఁదోసు నీవు మదనసింగును జంపఁగలవా? అట్లయిన రారమ్ము. నేనే మదనసింగును. ఇదిగోకత్తి' అని కత్తి నందించుచుండఁ బ్రతాపసింగు నాజ్ఞచే నతని పరివారము స్వాములవారిపైఁబడి పెడరెక్కలుకట్టి బలవంతముగఁబట్టి బంధించిరి. తరువాత ప్రతాపసింగు స్వాములవారిని దనయింటికిఁ దీసికొనిపోయి తెల్లవారువఱకు వానినొక గదిలో నుంచెను. చిదానందయోగి తాను స్వాములవారి కక్షపాలనుండి సంగ్రహించిన కాగితములకట్ట మదనసింగునకిచ్చి దర్బారునం దాకాగితముల రాణాకు సమర్పింపవలయునని చెప్పి తాను మఠమునకుఁ బోయెను.

---

# పండ్రెండవ ప్రకరణము.

ఆమఱునాఁడుదయమున మహారాణావారి దర్బారు నియమింపఁబడెను. సభామంటపమునకు రాజబంధువులును, రసపుత్రశూరులును సామంతులును వేఱువేఱుగఁ దమతమ బిరుదచిహ్నములతోడను, సేవకసమూహములతోడను, సమస్తభూషణముల ధరించి వచ్చి తమగౌరవమునకుం దగుస్థానములయందుఁ గూర్చుండిరి. అప్పుడు మదగజేంద్రమునుండి మెల్లగఁదిగి కనకదండముల ధరించి కైవారముసేయు వేత్రహస్తులిరుగడలఁ గొలువ సేవకులు మార్గమును బ్రదర్శించుచుండ శ్రీలక్ష్మణసింగుమహారాణావారును భీమసింగుమహారాజులవారును గొలువుకూటమును జేరిరి. సభామందిరము, రెండువేలమంది మనుష్యులేకకాలమునఁ గూర్చుండునంతటి వైశాల్యముగలిగి సాలగ్రామశిలానిర్మితములై స్నిగ్ధములయిన గోడలతోడను, పైనున్న బల్లకూర్పు మీఁదఁ జేయఁబడిన విన్నాణపు లక్కపనులతోడను, నేలఁబరుపఁబడిన నానావర్ణముల రత్నకంబళములతోడను మహాలక్ష్మీవిలాసభాసురమై యొప్పులరుచుండెను. అట్టి కొలువుకూటమును జేరి తన్మధ్యంబున స్ఫటికశిలానిర్మిత మగు వేదికపై ధగధగ మెఱయుచున్న బంగరుకోళ్ళదంతపుసింహాసనముపై మహారాణాలక్ష్మణసింగు సుఖాసీనుఁడయ్యెను. ఆయనకు దక్షిణభాగమున రసపుత్రకులప్రదీపకుఁ డగు భీమసింగును భీమసింగున కావల సింగపుఁగొదమలవంటి యాతని పండ్రెండుగురు కుమారులును వారి కావల వారి మేనమామయు రాజపుత్రసేనాధిపతియు భీమసింగునకు ముద్దులమఱఁదియు నగు గోరాసింగును, వానిముందఱ బాలుఁడయ్యుఁ బరాక్రమవృద్ధుఁడని పేరుఁగాంచిన గోరాసింగు పుత్రుఁ డగు బేదల్ యును గూర్చుండిరి. మహారాణా కెడమప్రక్కను సామంతరాజులును వారి కావల మంత్రి దండనాయక ప్రముఖనియోగులును,

వారివెనుక విదేశాగతులగు రాయబారులును గూరుచుండిరి. కాని ప్రతాపసింగుమదనసింగు లేమికారణముననో రానందున సభ్యులందఱుం దత్కారణము నూహించుచుండిరి. లక్ష్మణసింగు, మదనసింగుప్రతాపసింగులు రాకుండుటకుఁ గారణమును దెలియఁగోరి సభ నుద్దేశించి యిట్లనియె. ‘ఓసభాసదులారా! అలాయుద్దీను మన దేశముపై దండెత్తుటనుగూర్చిన యదార్థస్థితి మీ రెఱుఁగుదురేమో తెలియఁగోరి మిమ్మిటు రప్పించుటకయి దర్బారుఁ బిలిచినాఁడను. కాని నిన్నటిరాత్రి తద్విషయమై పరిపూర్ణముగ మేము తెలిసికొంటిమి. ఆయంశముల నిచటనుపన్యసించుట ముఖ్యమైనను మదనసింగుప్రతాపసింగులు రానందున సందేహింపవలసి వచ్చెను. వారు రాకుండుటకుఁ గారణ మెవరయిన నెఱుఁగుదురే?’ అనవుఁడు స్వామిపలుకులకు దొర లెల్లఁ దెల్లఁబోయి తత్కారణము నెఱుఁగక యొండొరుల మొగములఁ జూచుకొనుచు రాత్రి జరిగిన యంశముల నాలకించుటకు నాతృతతోఁ గూర్చుండిరి. ఆసభలో ననేకులు వసంతభట్టు రానందునకుఁ గుసగుసలాడుచుండ నాసమయమున నొకసేవకుఁడు వచ్చి ప్రతాపసింగు మదనసింగు వచ్చుచున్నట్లు రాణాతోఁజెప్ప సభ్యులందఱు వారిరాక కెదురుచూచుచుండిరి. అప్పు డొక పచ్చని దృఢశరీరముగల మనుష్యుని వెంటఁబెట్టుకొని యాయుధపాణులై వారిరువురును వచ్చి రాణాకు నమస్కరించి యామనుష్యుని రాజునెదుటనిలువఁబెట్టిరి. ఆమనుష్యునకు రెండుచెక్కలును వెనుకకు విఱిచి కట్టఁబడియుండెను. తలయెత్తక నేలచూపులఁ జూచుచు సన్యాసివేషముతో నిలువఁబడియుండిన వానిని జూచి సభ్యులు మహాశ్చర్యమేదియో వినకపోమని యాతృతతో నిశ్శబ్దముగ నుండిరి. అంతటఁ బ్రతాపసింగు తనస్థానమునఁ గూర్చున్నంతనే మదనసింగు తన యేలిక కభిముఖుఁడై చేతులజోడించి యిట్లు చెప్పసాగెను. “ఓమహాప్రభూ! ఈనిలువఁబడినవాఁడు మహారాష్ట్రబ్రాహ్మణుఁడు. ఇతఁ డలా

యుద్దీను నకాంతరంగికుఁడై, మనవద్ద మాయోపాయముచేత జీవించుచున్న యీవసంతభట్టునకుఁ జక్రవర్తివద్దనుండి యుత్తరప్రత్యుత్తరములఁ దెచ్చుచుఁ దన్నెవరు బట్టుకొనకుండ సన్యాసివేషముతో నున్నాఁడు. ఈతనివృత్తి యిదియైనట్లును వసంతభట్టు దురాత్ముఁడైనట్లును వీనిదగ్గఱ నాకు దొరకిన యీయుత్తరములే సాక్ష్యము నిచ్చుచున్నవి. వీని నిజమైన పేరు పాండురంగనాథుఁడైనను జ్ఞానానందస్వామియనుపేర వర్తించుచున్నాఁడు" అని తనచేతనున్న యుత్తరముల లక్ష్మణసింగున కందిచ్చెను. వసంతభట్టు దురాత్ముఁడని వినుటకు ననేకు లాశ్చర్యపడిరి. పారసీకభాషలోనున్న యీయుత్తరములను లక్ష్మణసింగు గోరాసింగున కిచ్చి చదువుమన నతఁడా కాగితములనెల్లఁ బరీక్షించి యందు ముఖ్యమగు నొకదాని నీక్రిందిప్రకారము చదువనారంభించెను. "శ్రీఢిల్లీచక్రవర్తియగు నల్లాయుద్దీను వసంతభట్టునకు వ్రాయునదేమనిన—మిత్రుఁడా! నీతో నేను గపటకలహమును గల్పించుకొనుటయు నిజముగ నాగ్రహము వచ్చినవానివలె నేను సభయందు నటించుటయు నారాత్రి నిన్ను నేను రహస్యముగఁ జెఱనుండి విడిపించుటయుఁ జిత్తూరునగరమునకు నిన్ను నేను తద్రహస్యముల నెఱుఁగుట కంపుటయు నీవుఱ కెవ్వరు నెఱుఁగరు. నీవు లక్ష్మణసింగును జెఱఁబెట్టుటకు విశేషముగ శ్రమపడుచున్నావని విని సంతోషించుచున్నాను. ఎట్లయిన లక్ష్మణసింగునుబట్టి తప్పక తీసికొనిరావలయును. అప్పుడు రాజపుత్రులు తమప్రభువు ప్రాణములను రక్షించుకొనుటకు మన మెట్లుచెప్పిన నట్లు విందురు. దండయాత్రమాట నిశ్చయమే యైనను, నేను దండెత్తనని వారితో వృథగాఁ జెప్పుచు వా రేమఱియుండునట్లు చేయుదును. మహాత్ముఁడవు అల్లాయుద్దీను" అని యీయుత్తరమును గోరాసింగు చదివినతోడనే రాజపుత్రులనేకు లాశ్చర్యకోపసమగ్నులైరి. అంతట భీమసింగు పాండురంగనాథునిఁ జూచి "దీనికి నీ వేమి చెప్పెదవు? నిజము చెప్పుము" అని

యడుగఁ బాండురంగనాథుఁడు "నేను మీకుబదులుచెప్పను. మీయిష్ట మువచ్చినట్లు చేయుఁడు" అని యుత్తర మిచ్చెను. అంతట లక్ష్మణసింగు సభ్యుల నుద్దేశించి "వసంతభట్టు మనతావున గుటుకర్తయై ప్రవర్తించుటచే నతఁడు దుర్మార్గుఁడని యెవ్వరు నెఱుఁగరు. నాపైఁగొందఱు కుట్రలఁ జేయుచున్నారనియు వారలను నాకప్పగింతుననియుఁ జెప్పి నమ్మించి నన్ను నిన్నరాత్రి వాఁడొంటిగఁ దోఁటకుఁ దీసికొనిపోయి బండిలో నెక్కించి నన్ను ఖైదీగా ఢిల్లీకిఁ బట్టుకొనిపోవఁ బ్రయత్నించెను. నేను తప్పించుకొనఁ బ్రయత్నింప నాప్రాణములఁగూడ నపహరింపఁజూచెను. నాభాగ్యవశమున మన చిదానందయోగియు మఱొకఁడును వచ్చి యాగోముఖవ్యాఘ్రమునుజంపి నాప్రాణసంరక్షణ మాచరించిరి. యోగితోవచ్చి నాప్రాణములునిలిపిన మహాపురుషుఁడెవ్వఁడో?" యని పలుక మదనసింగు రాజపుత్రమధ్యమునుండి సింహమువలె లేచివచ్చి "దేవా బ్రాహ్మణవేషముతో మిమ్ము రక్షించినవాఁడను నేనే. మీరు నాకు బహుమానముగ నొసంగిన ఖడ్గరత్న మిదిగో" అని సభాసదు లాశ్చర్యపడునట్టు కంఠమెత్తిపలికెను. భీమసింగామాటలు విని తనపీఠము నుండి లేచి యానంద మాపఁజాలక కుమారప్రాణరక్షణ మాచరించినందులకు మదనసింగును గౌఁగిలించుకొని యనేకవిధముల స్తోత్రము చేసెను. తనప్రాణములఁ గాచినమహాత్ముఁడు మదనసింగని తెలిసి లక్ష్మణసింగు దనకంఠమున వ్రేలాడుచున్న ముత్యముల హారమునుదీసి మెడనువేసి యాతని నాలింగనము చేసికొనెను. భీమసింగు నాజ్ఞచేఁ బాండురంగవిభుఁ డప్పుడే కారాగృహమున కంపఁబడెను. అంతటవారు దర్బారును ముగింపఁ దలఁచుచుండగా నటకు వేగిరపాటుతోఁ జిదానందయోగి వచ్చి కొలువులోనున్న సమస్త రాజపుత్రవీరులను దాఁటి రాణాకు నెదురుగఁ జనెను. అతనిని జూచి రాణాయును భీమసింగును లేచి నమస్కరించి తమకృతజ్ఞతను దెలుపుమాట లేవో యనఁబోవు చుండఁగా

వారిని వారించి చిదానందయోగి "ఓమహారాజా! ఓభీమసింగుమహారాజా! దురాత్ములైన వసంతభట్టుపట్టుకుల నమ్మి మీరు యుద్ధసన్నాహములు మానుకొనియున్నారు. అల్లాయుద్దీను దండయాత్ర వెడలి మనకు నిరువదికోసుల దూరమునకు వచ్చియున్నాడు రెండుమూడుదినములలో మనపై నాకస్మికముగఁ బడుచున్నాడుగాన నిఁక మీనిద్రలనుండి మేలుకొనుఁడు" అని యెలుఁగెత్తి పలికెను. భీమసింగు సాధారణముగ నట్టి యవసరములందుఁ దన్నడఁగాయకుండు మనోధైర్యమును జిక్కబట్టి యిట్లనియెను. 'చిదానందులవారిమాట నిక్కము వారు సత్యమును దెలిసికొనినఁగాని మనకట్లు చెప్పరు. అయినను మీరు భయపడక యిప్పటినుండి తగు ప్రయత్నములఁ జేయుఁడు.' అనిన వెనుక యోగి 'రజపుత్రులారా! సూర్యచంద్రవంశజులగు మీరు మీప్రతాపములఁ జూపునవసరము వచ్చినది. మీదేశమునందును మీరాజునందును మీకుం బూనాభిమాన మున్నఁ బ్రాణముల కాశింపకఁ బోరాడుఁడు. కులదేశాభిమానము మాని దేవాలయముల నాశనముఁజేసి బ్రాహ్మణులను జంపి గోవులను వధించు మహమ్మదీయులకు మీరు చిత్తూరుకోట నప్పగించఁదలచినపక్షమున నూరకుండుఁడు.' అని ప్రోత్సాహవాక్యములు పలికెను. రజపుత్రులేకవాక్యముగ 'మారాజునిమిత్తము దేశమునిమిత్తమును మాప్రాణములను ధారవోసెదము. ఇదె యుద్ధసన్నద్ధుల మయ్యెదము.' అని యఱచిరి. లక్ష్మణసింగును భీమసింగును వారినభినందించి వీడ్కొలిపి యంతఃపురములకుం బోయిరి.



పదుమూఁడవ ప్రకరణము.



"హేమలతా! హేమలతా ఇటురమ్ము" అని లోపలినుండి యొకయెలుగిన మనుష్యకంఠము వినఁబడినతోడనె హేమలత వీథిగుమ్మ

ముచుండి లోనికిఁ బరుగెత్తి శివప్రసాదువద్దకుఁ బోయి "ఆర్యా! ఎందు కుఁ బిల్చినారు" అని యడిగెను. శివప్రసాదామెను జూచి అమ్మాయీ! చక్రవర్తి చిత్తూరుపై దండువెడలుటకు సైన్యముల నానాభాగములనుండి పిలిపించుచున్నాఁడు. అందుచేత మనయూరిమీఁదుగ దుర్మార్గులగు రాజసైనికులు పోవుచున్నారు. నీవు వారికంటఁబడకుము. ఆయన నాకు నిన్నప్పగించినందుకు మరలనిన్ను నేనాయన కప్పగించి మాట దక్కించుకొనవలెను. నీవు వీథిలోని కరుగకుము. అని హితోపదేశము చేసెను. హేమలత యామాటల గమనించి "వీథిలో నొకముష్టివాఁడు చిత్రముగఁ బాడుచున్నాఁడు, అది వినుటకయి వెళ్ళినాను. ఇదె వాఁడు మనయింటికే వచ్చుచున్నాఁడు" అని హేమలత ప్రత్యుత్తరమిచ్చెను. హేమలత పాలిగ్రామమున రహిమానుఖాను ధాటికోడి మూర్ఛిల్లియుండ, నామెకు జ్వరము తగిలినపుడు మందునొసంగి రక్షరేఖఁగట్టిన గోసాయి యామెను మెల్లమెల్లఁగా నావలకుఁ దీసికొనిపోయి యొక బండిపై నెక్కించి తిన్నగా కల్యాణనగరమునకుఁ గొనిపోయెను. అచ్చోటఁ దనకు ప్రాణమిత్రుఁడయిన శివప్రసాదునకు నామెనప్పగించి యత్యంతజాగ్రత్తగ నుంచుమనియుఁ, దాను వచ్చినపుడుగాని మదనసింగు వచ్చినపుడుగాని యామె నంపవలయు ననియుఁ జెప్పి యాతఁడు చనెను. శివప్రసాదు పండితసంప్రదాయముఁ జేరిన బ్రాహ్మణుఁడు. అగ్రహారికుఁడు. అందుచే ద్రవ్యవంతుఁడును మాట చెల్లుబడిఁ గలవాఁడునై ధర్మకార్యములఁ జేయుటయందు తనధనమును గొంతవ్యయపఱచుచు సత్కీర్తిధనుఁడై నందున హేమలత వారియింట నిరపాయముగనుండెనుగాని పితృసమానుఁడయినందున తాత కారాగృహవాసి యగుటకును దనకుఁ దల్లిదండ్రులుగాని సోదరులుగాని మరి యేయితరదిక్కుగాని లేనందుకును మనస్సున నెల్లప్పుడు నామె చింతనొందుచుఁ జిక్కి శల్యమై యుండెను, ఆమెనూరార్చుటకు శివప్రసాదు కుమారికయగు చంద్రావతి

యనేకప్రయత్నములఁ జేయుచువచ్చెను గాని యవియెల్ల వ్యర్థముల య్యెను. చంద్రావతిభర్త యప్పటికి రెండుసంవత్సరముల క్రిందట దేశాంతర మరిగి తిరిగి రానందున వ్యస్తురాలయిన యామె మిగుల దుఃఖభారముచేత నలిగియుండి తనతో సమానదుఃఖురాలగు హేమలత నూరార్చుచు నామెచేఁ దానాశ్వాసింపఁబడుచుఁ బొద్దులుపుచ్చుచుండెను. కాలము సకలదుఃఖభారముల నుపశమింపఁజేసెను. కాబట్టి క్రమక్రమముగ హేమలత చంద్రావతి మధురభాషణములచేఁ గొంతయూరటఁ గల్గియుండెను. ఇట్లు కొన్ని మాసములు గడచెను. ఆనాటియుదయమున శ్రావ్యతరమయిన హిందీపాటలఁ బాడుచు ముష్టివాఁడు ప్రసాదుగారియింటికి రాఁగా హేమలత గానకళాప్రవేశము గలదగుటచే నాపాటలవిని ముష్టివానికిఁ బెట్ట దోసెడు బియ్యము దెచ్చెను. హేమలతను బిచ్చగాఁ డెందుచేతనో యాపాదమస్తకమును ఱెప్పవాల్పక చూడఁజొచ్చెను. బిచ్చగాని వికృతిదృష్టికి జడిసి బియ్యము త్వరితముగఁ బెట్టి పాకలోనికిఁజని చంద్రావతి కామాటఁ జెప్పెను. విని చంద్రావతి వచ్చునప్పటికి బిచ్చగాఁడు మరలిపోయెను.

ఇదిజరిగిన కొన్నిదినముల కొకనాఁడు హేమలత దీపములుపెట్టినతరువాత మదనసింగునుగూర్చి తలంచుకొని తత్సంయోగము లభించుట దుర్లభమని విచారమునొందుచుండఁగా శివప్రసాదొక సేవకుని వెంటఁబెట్టుకొని లోపలికి వచ్చెను. అతఁడు హేమలతను జంద్రావతిని దనవద్ద నుంచుకొని వానివృత్తాంతమును జెప్పుమనఁగా "అయ్యా! తమయింట హేమలత యున్నదని తెలిసి శ్రీమదనసింగుగారామెను వెంటఁబెట్టుకొని రమ్మని నన్నుఁ బంపినారు వివాహప్రయత్నము సర్వము జరిగి సిద్ధముగ నున్నది. చిత్తూరురాజు భీమసింగుగారీమెను దోడితెమ్మని పల్లకియుఁ బదెండుగురుబోయలను నిరువురబంట్రోతులను నావెంట నంపినారు. చక్రవర్తికిని రాజపుత్రులకును మహాయుద్ధము సంప్రాప్త

మగునుగనుక సాధ్యమైనంత శీఘ్రముగ రప్పింపుమని వారు సెలవిచ్చి నారు. మీఁద మీచిత్తము" అని చెప్పి సేవకుఁడూరకుండెను. ఈమాటలు హేమలత హృదయారవిందమును వికసింపఁజేసెను. చంద్రావతి హేమలతావియోగము గలుగునని విచారభరమును దాల్చెను. నీయిష్టమేమని శివప్రసాదు హేమలత నడిగెనుగాని యామె యుత్తర మీయదయ్యెను. శివప్రసాదనంతరమునఁ దనభార్యకావృత్తాంతమును జెప్ప నామెయభిప్రాయము నీయఁజాలక తడఁబడఁ జొచ్చెను. రాత్రిజామగు నప్పటికి బోయలు పల్లకి నెత్తుకొనివచ్చి గుమ్మము ముందట నిల్చిరి. శివప్రసాదు వారికందఱకు నన్నముబెట్టించి పండుకొను సదుపాయము చేసెను. చంద్రావతి హేమలత మనస్సులోఁ జిత్తూరుపోవుట కిష్టపడున్నట్లు మాటలవల్ల సూచకముగా నెఱిఁగి తలిదండ్రుల కెఱిగింప వారును హేమలతవివాహము నాపుట మేలు కాదనియు మొదట నామె నప్పగించిన యోగికూడ మదనసింగువద్ద కంపుట కిష్టపడెననియు, నాలోచించి యామెను జిత్తూరునంపుటకు నిశ్చయించుకొనిరి. మఱునాఁడు మధ్యాహ్నము ప్రయాణము నిర్ణయింపఁబడెను. శివప్రసాదును, భార్యయు, నామెను దమపుత్రికవలెఁ జూచుకొనుచున్నందున చీరలు రవికెలు మొదలగువాని నిచ్చిరి. హేమలత వారిని వదలలేక కన్నీటితోఁ బల్లకినెక్కెను. శివప్రసాదామె యొంటిగా విదేశీయులతో నంపుట యుచితముకాదని మిగులకృతజ్ఞుఁడును, శూరుఁడు నగు లాహిరి యనునొక శూద్రుని బల్లకివెంట సహాయముగ నంపెను. మఱియును ఢిల్లీనగరముమీఁదుగఁ దీసికొనిపోవలదనియుఁ జిత్తూరునగరమునకు తిన్నగఁ గొనిపోవలసినదనియు, బ్రాహ్మణుఁడు చెప్పి సాగిపొమ్మని బోయల కాజ్ఞాపించెను. లాహిరియును నిరువురు సేవకులును వెంటరా నందఱదగ్గఱ వేఱువేఱ సెలవుంగైకొని హేమలత జాముప్రొద్దువేళ కుల్యాపురమును బాసి మదనసింగునుగలిసి సుఖించునపేక్షతోఁ బ్రయాణముఁ జేయు

చుండెను. లాహిరి స్వామిభక్తిగలవాఁడు. సాహసుండెయగుసుగాని, యెంతలేమిచెప్పిన నది సులభముగనమ్మి మోసపోయెను మహాధుఁడు. అందుచేతనే శివప్రసాదాతనితోఁ బలుమాఱు జాగ్రత్తగానుండుమని చెప్పెను. లాహిరియు సాధ్యమైనంతవఱ కప్రమత్తుఁడై పల్లకివెంట న డచుచుండెను. ఇట్లు కొంతదూరము ప్రయాణము చేసినతరువాత వారు ఫజీబాదుకడకు సాయంకాలమునకు వచ్చిరి. ప్రయాణమువలన డస్సియున్న బోయలు కొంచెము కల్లునీరు త్రాగుటకు గ్రామమున నొక చెట్టుక్రింద పల్లకిని దించిరి. కూడనున్న సేవకులిద్దఱు గంజాయిద మ్ముపీల్చుటఁజూచి లాహిరి మనస్సు పట్టఁజాలక తానును రెండుగుక్కలు పీల్చెను. తదనంతరము బోయలు వచ్చి మరలఁ బ్రయాణము నారంభించిరి. ఫజీబాదుదగ్గఱనే చిత్తూరున కరుగుటకు వేఱుబాటను గ్రహింపవలయును. అయినను బోయలును సేవకులును మార్గము నుదప్పింపక ఢిల్లీపై పుఁ బోవుచుండిరి. లాహిరి యదివఱకు మార్గము మార్పుఁడని వారినడుగఁదలఁచియు మత్తుచే సమయమున కూరకుండి. వారితోఁగలిసి చిత్రములైన పాటలఁబాడుచు నడచుచుండెను. మద్యపానమత్తులగుటచే బోయులు వడివడిగ నడువసాగిరి. రాత్రి జాముప్రొద్దు పోవునప్పటికి వారందఱు ఢిల్లీనగరముఁ బ్రవేశించిరి. నగర ముఖద్వారము దాఁటి వారు నాలుగడుగులు సాగిపోవునప్పటికి దీపస్తంభమునీడను గంబళమును గప్పుకొని కూరుచున్న యొక మనుష్యుఁడు బోయలంజూచి. "ఓరీ! యిటుయిటు" అని మార్గమును జూపెను. అది మొదలుగ బోయలు రాజవీధిని విడిచి సందుగొందులవెంట నడువ సాగుటఁ జూచి లాహిరి గంజాయిమత్తు పూర్ణముగ దిగినందున వడివడి పక్కనునిలిచి "చిత్తూరువచ్చినాములే అమ్మా" యని హేమలతను లేపెను. మదనసింగు దర్శనమును లభించునని యూటులూరుయు నరదుశ ఎదిరిచిన యీబాలిక యామాటవిని ప్రాణము లేచివచ్చినట్లు పులక

తీసి వీథులఁ జూచుచుండెను. తరువాత కొన్నివీథులఁ గడచి బోయి లోకసందులో నున్నతప్రాకారములు గల యొకగృహముదగ్గఱకుఁ బోయి కంబళిమును గప్పుకొన్న మనుష్యుఁడు నిలువుమనిచెప్పఁ దాము చటనిల్చి పల్లకిదింపిరి. ఇప్పటికిలాహిరికి దాదాపుగఁ దెలివివచ్చెను. పల్లకి దింపినతోడనే కంబళిముగప్పుకొన్న సేవకుఁడు వచ్చి పల్లకితలుపులఁ దెఱచి 'అమ్మా స్త్రీలుకనిపెట్టుకొనియున్నారు. లేచిరమ్మ' అని పలికెను. లోపలస్త్రీ లోకదాసినయిన నేల యంపి తన్ను గౌరవింపరైరని హేమలత యోజించుచు మెల్లగఁ బల్లకివిడిచి లాహిరినివెంటఁబెట్టుకొని తప్పటడుగు లిడుచు లోనికిఁ జనెను. ఆయింట హేమలత ప్రవేశించునప్పటికి నందు దీపమైనను లేదయ్యెను. ఈమాయ యేమని మనహేమలత యోజించుచుండ నొకసేవకుఁ డరుదెంచి 'లోపల స్త్రీలున్నారు. వారికి ఘోషాకలదు. మీలాహిరిని లోనికిఁ దీసికొని రాకుము' అని చెప్పెను. అంతట నామెచేయునదిలేక లాహిరిని జాగ్రత్తగ నుండుమని మెల్లగాఁ జని యొకగదిఁ బ్రవేశించెను. ఆగదిలో నొక చిన్నదీపము మాత్రము గూటిలోనుంచుటఁబట్టి నిలిచియున్నమనుష్యుల మొగమును జూడఁజొచ్చెను. ఆగదిఁబ్రవేశించి రెండడుగులుదూర మరిగె హేమలత కట్టెదుట నతిదీర్ఘకాయమును భయంకరమగు గడ్డమును దాల్చి ప్రత్యక్ష యమునివలెనున్న రహిమానుఖాను విగ్రహముఁ జూచెను. చూచి యాకస్మికభయముచే శరీరము గజగజ వడఁక నోట మాటరాక చేష్టలుదక్కి యెట్టకేలకు లాహిరీ! లాహిరీయని భయాతిశయముచే నేల మూర్ఛిల్లెను. నేలఁబడుచున్న యామెను దన చేతులతో నిలిపి "ప్రాణేశ్వరీ భయపడకుము. నేనుండఁగ నీ కేమిభయములే" దని రహిమానుఖా నామె నాపఁబోయెను. కాని దుఃఖావేశముచే శరీర మెఱుఁగని యామెను మోహావేశముచే శరీర మెఱుఁగని ఖాను పట్టుకొనలేకపోయెను. హేమలతపై ధ్యానము నిల్పియున్న లాహిరి 'లాహిరి' యను

తనచెవినిబడిన తోడనే బాలిక కపాయమేదో తటస్థమయినదని లేచి గడియవేయబడియున్న తలుపుఁదన్ని చేతులతో గుంజెనుగాని యెవ్వరును దీయువారు లేరైరి, వెంటనే నిలువెడలి వీధిలోనికివచ్చి యెలుఁగెత్తి "అయ్యో! అయ్యో! రక్షింపుఁడు. రక్షింపుఁడు" అని కేకలువేయనారంభించెను. అప్పుడు రాత్రి జాముప్పర ప్రొద్దుపోయినందున జనులందఱు నిద్రాసక్తులై యుండిరి. ఈకేకలచే వారు మేలుకొని మహాపాయమేదో వాటిల్లినదని యావీధిమనుష్యులెల్ల వడివడి నాయుధముల ధరించి లాహిరి యున్నవైపునకువచ్చిరి. లాహిరి వారిని జూచి "అయ్యా యీయింటనొకస్త్రీనిఁ జెఱబెట్టుచున్నారు. తలుపులు మూయఁబడియున్నవి. మీరా రామెప్రాణముల రక్షింపవలెను" అని చెప్పవారందఱుఁ గోపోద్దీపితులై గడ్డపారలతోఁ దలుపులు బద్దలుగఁగొట్టి లోనఁబ్రవేశించిరి. అప్పటికి రహిమానుఖానును, గంబళిఁ గప్పుకొని మార్గప్రదర్శకుఁడైన నందుఁడును బాఱిపోయిరి. బంగారు బొమ్మవలె హేమలత నేలఁబడి యప్పుడే తెలివిదెచ్చుకొని కనులమూసికొని భయముతో "అయ్యోదైవమా" అని యేడ్చుచుండెను. వా రామెనులేవదీసి యాదుర్మార్గు లందులేరని యామెకు ధైర్యము చెప్పిరి. ఆవచ్చినవారిలోఁ జక్రవర్తివద్ద నొక గొప్పయుద్యోగమున నున్న చంద్రసేనుఁడును బంగాళాక్షత్రియుఁ డొకడుండెను. ఆయన యేఁబదియేండ్లవయస్సు గలవాఁడగుటను సకలకష్టసుఖములు నాటినవాఁడగుటను, బాలికపై జాలిఁగలిగి తనయింటికి రమ్మనిలాహిరి సమేతముగ నామెను గొనిపోయెను. అందఱును రహిమానుఖానును నిందించుచు నిండ్లకుఁజనిరి. ఆయింటిదొడ్డిలోఁ జెట్లక్రింద దాగుకొనియున్న రహిమానుఖానును నందుఁడును మనుష్యుల సందడి తగ్గినతోడనె మరలగృహముఁబ్రవేశించిరి. అంతట రహిమానుఖాను విచారగ్రస్తుఁడై రెండుసారులు తనకు భంగపాటు గలుగుటకుఁ జింతిల్లి నందునితో "నందా పాపము నీవు బిచ్చగానివేషము వేసికొని

గ్రామములెల్లఁ దిరిగి హేమలతయున్న చోటెఱిఁగి వచ్చి నాకుపకారముఁ జేసినావు. మనము మదనసింగు పేరుపెట్టి యామెను రప్పించినాముగాని నామనోరథము సఫలము కాలేదు. నీశ్రమకైనను దైవము మెచ్చలేదుగదా" యని నిట్టూర్పువిడుచుచు నాయిలువిడిచి నందునితోఁగూడఁ బోయెను.

అట్లు చంద్రసేనుఁ డామెను గృహమునకుఁ గొనిపోయి భోజనముఁ బెట్టించి తరువాత నిట్లనియెను. "అమ్మా నీవును క్షత్రియకన్యవని చెప్పుచున్నావు. నీవు మాయింట నుండవచ్చును. కాని యింక నాలుగుదినములకు మాచక్రవర్తి చిత్తూరుపై దండయాత్ర కరుగుచున్నాఁడు. నేను నాకుటుంబముతో నరుగుచున్నాను. నీవు వచ్చినయెడల వెంటఁ దీసికొనిపోవుదును. రానియెడల నిన్నెవరి కప్పగించి పోవలెనో తోఁచకున్నది." అనిచెప్ప నామె యాతనితోఁ జిత్తూరుబోయెద ననెను. లాహిరి హేమలతతోఁగూడ చంద్రసేనునియింట మూఁడుదినము లుండి కుల్పానగరమునకుఁ బోయి యావార్త శివప్రసాదున కెఱింగించెను.

## పదునాలుగవ ప్రకరణము.

చక్రవర్తి మహాసేనాసన్నాహమును జేసికొని రాజస్థానముపై దండు విడియుటకు వెడలెను. ఆమహాసైన్యమందు హిందువులు, పిండారీలు, జాటులు, బౌద్ధులు, జయినులు, మొదలగు స్వదేశీయులును, అరబ్బులు, పారశీకులు, తురుష్కులు, నాఫుగనులు, అబ్సీనియనులు, తార్తారీలు, మొగలాయీలు మొదలగు ననేకమహమ్మదీయులును జేరియుండుటచేత నాశిబిరము కదలివచ్చుచున్న మహానగరమువలె నుండెను. క్రమశిక్షయుఁ దగుపరీక్షయు లేనందున సైనికు లెందఱో శిబి

రానుచరులెందఱో కొల్లకయి తమంతట వచ్చి చేరినవా రెందఱోయెవ్వరునెఱుఁగరు. ముందు రణదుందుభులు దిగంతములు ప్రతిధ్వను లెసఁగ మ్రోయఁ ధళధళ మెఱయుఖడ్గములను హస్తములఁదాల్చి యమ్ములపొదుల మూఁపులనిడి జయైకదీక్షతోఁ గాల్బలములు మొదటనడుచుచుండెను. అవ్వెనుక పారశీక తురంగముల నెక్కి చేతులతో బల్లెములఁగొని నెక్కుమ్మడి నాశ్వికులు వెడలుచుండిరి. వారివెనుక మదగజేంద్రములపై బంగరుకంబళములతోడను వెండికప్పులతోడను గ్రాలు నంబారీలో నెక్కి పచ్చపట్టుపరుపులపైఁ గూర్చుండి సేవకులు వింజామర లిడ సకలసేనాసముద్రనియామకుఁడై శ్రీఢిల్లీశ్వరుండగు నల్లాయుద్దీను చక్రవర్తి వచ్చుచుండెను. చక్రవర్తికిరు కెలంకులను దృఢీకృతమృత్యుదేవతలగు మహమ్మదీయసామంతు లంగరక్షకులై నడచుచుండిరి. వారివెనుక శిబిరానుచరులును వారివెనుక నేనుఁగుల నెక్కియు బల్లకులలోఁ గూర్చుండియు శ్రీచక్రవర్తియొక్కయు హిందూమ్లేచ్ఛ ప్రభువుల యొక్కయు సైనికులయొక్కయు నంతఃపుర స్త్రీజనంబులును నరుగుచుండిరి. ఇందే చంద్రసేనుని కుటుంబమును వచ్చుచుండుటఁ జేసి మన హేమలతయు నొకపల్లకియందుఁ గూర్చుండి ప్రయాణముఁజేయుచుండెను. చంద్రసేనునిభార్య హేమలతను దనసోదరివలె గాపాడుచుండెను. సైనికుల కోలాహలధ్వనులును హయహేషలును, గజబృంహితములును, బల్లకుల ఘోంకారనాదములును, బ్రహ్మాండమును బ్రద్దలుచేయసాగెను. ఈసైన్యము చిత్తూరునకుఁ బదునేను క్రోసుల దూరమునకు వచ్చినప్పుడు చక్రవర్తిసైన్యము నిశ్శబ్దముగా నడువవలయు ననియు, శత్రువులు తమరాకను గుర్తింపరాదనియు, రణదుందుభులు మ్రోయింపవలదనియు, నానతిచ్చెను.

నిరంతర మప్రమత్తుఁడై తిరుగు చిదానందయోగిచేఁ బంపఁబడిన వేగులవాండ్రు సైన్యమువచ్చుటెఱిఁగి యోగికి విన్నవింప నతఁడావార్త

రాణాకు దర్బారునందు దెలియఁజేయుట మనమీావఱకే చదివినార ము. ఆరాత్రి చక్రవర్తిసైన్యముయొక్క రాకను దానిస్థితిని తెలిసి కొమ్మని భీమసింగు, మదనసింగును గోరాసింగునుబంప వారు చూచి వచ్చి యావార్త రాణాకునుభీమసింగునకును విన్నవించిరి. అంతటరాజ పుత్రిలు చిత్తూరుసంరక్షణమునకు సమస్త ప్రియత్నములఁ జేయసాగి రి. రాజపుత్రసైన్యమునకు శూరాగ్రేసరులగు గోరాసింగును బ్రతా పసింగును సేనాధిపతులుగ నియమింపఁబడిరి. మదనసింగు శ్రీభీమసింగు గారికిని శ్రీరాణాకును నంగరక్షకుఁడుగ నియమింపఁబడెను. మూర్తీ మంతమగు ప్రతాపమువలె ప్రతాపసింగు సైన్యమునెల్లఁ జక్కఁజేయ నారంభించెను.

ఆమహమ్మదీయ సైన్యమట్లు ప్రయాణముచేసి మెల్లమెల్లఁగఁ జిత్తూరునగరమునకువచ్చి కోటయెదుటవిడిసెను. సైన్యమును గనుగొని భీమసింగు రసపుత్రులనెల్ల సిద్ధముచేసి కోటసంరక్షణమున కాజ్ఞనొసఁగె ను. అల్లాయుద్దీనుచక్రవర్తియుఁ గోటముట్టడికారంభించి తన కాప్తుఁడు ను రాజకీయ వ్యవహారములయం దాలోచన చెప్పువాఁడునగు రహిమా నుఖానునకు సేనాధిపత్యము నొసఁగెను. రహిమానుఖాను కత్తిఁబట్టనేర ని పిరికివాండ్రలోఁ జేర్పఁబడదగినవాఁడయ్యు, గౌరవార్థమీామహో ద్యోగము నంగీకరించెను. కోటగోడ యిరువదిరెండడుగుల యెత్తుగలిగి యైదడుగుల వెడల్పుఁ గలిగియుండెను. కోటచుట్టునగాధమైన కందకముం డెను. ఆకందకముమీఁదనుండి లాగివేయఁబడుటకు వీలుగానున్న యొక వంతెనయుండెను. ముట్టడి యారంభమైనతోడనే మహమ్మదీయులు ఫిరం గులుబారుచేసి కోటగోడను నిర్మూలింపఁ బ్రియత్నించిరిగాని యదిదుర్ల భమయ్యెను. పలుమారు పటాలముల వెనుక పటాలములువచ్చి యగడ్త మట్టితోఁబూడ్చి కోటగోడలపై గవిసెనుగాని రసపుత్రులబాణాసారము నఘాతములయ్యెను. తరువాత మ్లేచ్ఛులు లగ్గల కెగసి కోటఁబట్ట

సాహసించిరి కాని పైనుండి రాజపుత్రులు నిప్పులును మసలిన చమురు ను, శిలలను వారిపై వేయుటచే జచ్చిరి. మహమ్మదీయు లెన్నిభంగులఁ బ్రయత్నించినను, కోట స్వాధీనము గాకుండుటఁజూచి చక్రవర్తి స్వసైన్య నాశనమునకు విచారింపఁదొడఁగెను. ముట్టడి ఫలములేక యనేకమాసము లుండుటఁజేసి యుభయసైన్యములును విసిగి యెట్లయిన ముట్టడి నివారణమైన బాగుండునని తలఁచుచుండెను. అలాయుద్దీను సంధిఁజేసికొనుటకు సిద్ధముగ నుండెనుగాని రసపుత్రులు ముందుగ సంధికి రారైరి. ముందుగ సంధియగుటఁ దనకవమానకరమని చక్రవర్తి వెనుదీయుచుండెను. భీమసింగుమహారాజు భార్యయగు శ్రీపద్మినిని జక్రవర్తికి సమర్పించిన పక్షమున నాతఁడు చిత్తూరుముట్టడిమాని స్వదేశమున కరుగుటకు సమ్మతించునని చక్రవర్తి రహిమానుఖానుచే సందేశము నంపుటచే నభిమానధనులగు రాజపుత్రులు తమకోపాగ్ని ప్రజ్వరిల్ల శాత్రవారణ్యమును దహింప కృతప్రతిజ్ఞులైరి. రాయబారినివధించుట పాపమని భీమసింగు చెప్పి వారింపకున్న నాదినమున ఖాను శిరస్సు వేయివ్రక్కలై యుండును. రాజపుత్రు లెల్ల రోషమున జేవురించిన మొగములతో భయంకరాకారులై పగదీర్చుకొనవలెనన్న యుత్సాహముతో సింహనాదములఁజేసిరి. రహిమానుఖాను శత్రుమండలమధ్యమున గజగజ వడఁకుచుఁ బ్రాణములు నఱచేతఁ బట్టుకొనియుండెను. తరువాత వారు ఖానునంపి కవచశిరస్త్రాణములు ధరించి యుద్ధసన్నద్ధులైరి. ఈవార్తఁ నలాయుద్దీను విని మరల ముట్టడి నారంభించెను. ఉభయసైనికులు నొండొరులపై దారుణాగ్ని వర్షములఁ గురియించుచుండిరి. చిత్తూరుఁ బ్రవేశించిన కొన్ని దినములకు హేమలత చంద్రసేనునితోఁ దనకు మదనసింగుపైఁగల యనురాగమును మదనసింగునకుఁ దనపైఁగల యనురాగమును దెలిపి నాబరుజంగునకుఁ దనరాక నెఱిఁగింపుమని ప్రార్థించెను. అతఁడు హేమలత శిబిరమున నుండుట నాజరుజంగున కెఱిఁగింప వారిరువురు నెట్లయిన నామెను

మదనసింగువద్ద కంపుట కుపాయముల వెదకుచుండిరి. అట్టి యుద్ధ సమయమున నామె నవలి కంపుట తమకు హానికరమనియెంచి వా రప్పటి కూరకుండిరి.

ఆరాయబారము జరిగిన నాలుగుదినములకు ముట్టడి యతితీవ్రముగ నుండఁగ సాయంకాలమునందు బ్రతాపసింగు గృహమునొద్ద కొకబండివచ్చి నిలిచెను. ఆబండిలో నొకముసలిదియుఁ బదునాలేండ్ల ప్రాయముగల యొక కన్నియయుఁ గూర్చుండిరి. బండి వారిగుమ్మమువద్ద నిల్చినతోడనే ముసలిది బండిదిగి "మదనసింగుగా రున్నారా" యని వాకిటఁ గూరుచున్న కృష్ణసింగు నడిగెను. మదనసింగంతకుముందె రెండుగడియలక్రిందట నింటికి వచ్చియుండుటచేఁ గృష్ణసింగామాట విని తలయూఁచి లోపలికరిగి తనయజమానుని వెంటఁబెట్టుకొని వచ్చెను. బండిపైపునవచ్చుచున్న మదనసింగునుజూచి ముసలిది యెదురుగాఁబోయి "అయ్యా! మీదర్శనమునిమిత్తము మీప్రియురాలగు హేమలత వచ్చినది. అదిగో" అని మేలిముసుఁగుమఱుగుననుండి సిగ్గుచే బండిచాటుననున్న యాసుందరిని జూపెను. ఆమాటలు విన మదనసింగునకుఁ బంచప్రాణములును లేచిరా సంతోషమును నివారించుకొని లోపలికి రండని యిరువురను బిలిచెను. అంతట నాబాలికనుమాత్రము మదనసింగు వెంటఁబెట్టుకొని తనగదిలోనికిఁ దీసికొనిపోయి కూర్చుండ నియమించి, యెల్లు పాలిగ్రామమునుండి యీమె వచ్చెనో యావృత్తాంతము నెఱుఁగఁ జేయుమని యడుగ "అయ్యా నేను మిగుల శ్రమఁజెంది మీనిమిత్తము వచ్చినాను. మాతాతిగారు మృతినొందినారు. నేను దిక్కులేక యున్నాను. నాసంరక్షణభారము మీదేయని యిటు వచ్చితిని." అనిచెప్పి కంట నీరుపెట్టుకొనసాగెను. మదనసింగామెయెడ దయార్ద్రుఁడయి సుందరీ నీకు భయములేదు. మాపినతండ్రితోడను బినతల్లితోడను జెప్పి నిన్నెట్లయిన నేను తప్పక వివాహమాడెదను.

నీవు మాయింట నుండుము’ అని చెప్పునప్పటికి బ్రతాపసింగు వారు న్నగదిఁ బ్రవేశించెను. పినతండ్రి నిజూచి మదనసింగు సంభ్రమము తోఁ దెల్లఁబోయి చూడసాగెను. ప్రతాపసింగు క్రొత్తవిగ్రహము లఁ జూచి “నాయనా వీరెవరు? అని యడిగెను. మదనసింగు లజ్జా వనతముఖుఁడై యూరకుండ ముసలిది ‘అయ్యా! మీకుమారుని హృదయము నాకర్షించిన హేమలత యీమెయే’ యని యుత్తరమిచ్చెను. ప్రతాపసింగున కట్టివివాహ మనిష్టమైనను కుమారుని కాగ్రహము కలుగునని వారిని లోనికిఁదీసికొనిరా నాజ్ఞాపించెను. అంతలో ముసలిదియు నావలకరిగినందున నబ్బాలికమోహాతిశయముచే శరీరము నెఱుఁగక మదనసింగు సమీపమునకుఁ బోయి నేను నీదాననే నీవు నన్ను వివాహమాడునట్లు నాకు వాగ్దానము చేయుము. అని మదనసింగును గాఢాలింగనము చేసికొని వదలకుండెను. భయముతో మదనసింగాకౌఁగిలింతను వదలించుకొని ‘సుందరీ! నీవు రాచకన్నియవు. పెండ్లిగాకముందు నన్ను గౌఁగిలించుకొనుట తప్పుసుమీ! యని నివారించి యుత్తమక్షత్రియకన్యయగు హేమలత కన్యాజనస్వభావముగులజ్జను బరిత్యజించి యట్లుచేయుట కాశ్చర్యపడుచు గదివెలుపలికి వచ్చెను. అంతలో భర్తచే చంపఁబడిన సువర్ణభాయి తత్ప్రదేశమునకరిగి కుమారుని జూచి నవ్వుచుఁ దనకుఁ గోడలు కాఁదలఁచిన యాబాలికను సగౌరవముగ గృహమునకు వెంటఁ బెట్టుకొనిపోయెను. ముసలిదియుఁ దనకు బంధువు లున్నారని చెప్పి వెడలిపోయెను.



## పదునేనవ ప్రకరణము.

ఆ మరునాఁడు పద్మినినైనఁ, బద్మిని ప్రతిబింబమునైన నొక పర్యాయము రాజపుత్రులు తన్నుఁ జూడనిచ్చినయెడ ముట్టడి మాని

పోవుటకుఁ జక్రవర్తి సమ్మతించి వర్తమానము నంపెను. అందువిషయమై దర్బారుజరుగ, నందుఁజేరిన సామంతులలోఁ గొందఱదియు నవమానకరమని వాదించిరి. మఱికొంద ఱద్దములోఁ బద్మినీదేవినీడను జూపుట యవమానకరము కాదని యభిప్రాయపడిరి. స్వకులక్షయమునకును, దేశనాశనమునకును, భీమసింగు వెఱచి తనభార్యయొక్క నీడను జక్రవర్తికిఁ జూపుటకు నియ్యకొనెను. కాని చక్రవర్తి యొకఁడె రావలయునని పట్టుఁబెట్టెను. రాజపుత్రులు నిరాయుధుఁడుగను నిస్సహాయుఁడుగను నున్నవానిని వధింపరన్న దృఢవిశ్వాసముతోఁ జక్రవర్తి కామాంధకారముచేఁ గనులుగానక రహిమానుఖాను నొక్కనివెంటఁబెట్టుకొని కోటఁజొచ్చెను. చక్రవర్తికిఁ దగినగౌరవముల నొనర్చి భీమసింగు తనభార్యనీడ నొకయద్దములోఁ బ్రతిబింబిత మగునట్లు చేసి యాతిథికిఁ జూపెను. నీడలో జగన్మోహనాకారముఁ దాల్చియున్న యాత్రిలోకసుందరి యగుపద్మిని నిజముగ నెట్లుండునో యని యద్భుతపడి సంతుష్టాంతరంగుఁడై పెమ్మటఁ గోటఁ వెడలిపోవుటకుఁ జక్రవర్తి సిద్ధమైయుండెను. ఆసమయమునఁ జక్రవర్తియు భీమసింగును నిట్లు మాటాడిరి.

చక్ర—నేను మీరుచేసిన మర్యాదలకుఁ జాల సంతోషించి నాఁడను. ఈవఱకు నేను మిమ్ముఁజేసిన యవమానములకు నాకు విచారముగనున్నది. ఇఁకముందు మీరును మేమును స్నేహితులమై యుండవచ్చును.

భీమ—మీచిత్తమువచ్చినట్లు చేయవచ్చును. మానహానికంటెఁ బ్రాణహానిమేలు. మే మెవరికైనను వెఱచువారము కాము.

చక్ర—అవును నేను మీసంగతినెఱుఁగక దుర్మార్గుల యోజనమువలన మీదేశముపై దండెత్తినాఁడను. క్షమింపవలెను.

భీమ—క్షమియించుటయేల? పొరబాటునకు నెవ్వరేమి చేయఁగలరు?

ఇట్లు చక్రవర్తియు భీమసింగును, మాటాడుచుండ నొంటిగ దొరకిన మహమ్మదీయవిభుని వధింపవలెనని కోరిక యేరికి జనింపదయ్యె. అంతటఁ జక్రవర్తి తనశిబిరమునకు మరలఁ బ్రయాణమగుటచే భీమసింగు జక్రవర్తిని సాగనంపుటకుఁ దనకోటవిడిచి కొంతదూర మొంటరిగ సాగిపోయెను. అప్రస్తుతములగు కొన్నిమాటలఁ జెప్పుచుఁ జక్రవర్తి భీమసింగును దనసేనానివేశముదాఁక గొనిపోయెను. అప్పు డాకస్మికముగ నదివఱకుఁ జక్రవర్తిచే నియమితులై పొంచుండియుండిన కఱకుతురక సైనికులు భీమసింగు మహారాజుపై నొక్కపెట్టునఁ బడిరి. మనోధైర్యమున హిమాద్రియగు భీమసింగు ఘోరమైన యీమోసమునకు నాశ్చర్యపడి తనకత్తితో ననేకభటుల నాపెను. కానిసైన్యము లపారముగనుండుటఁబట్టియు రసపుత్రులు దూరముగా నుండుటఁబట్టియు భీమసింగు విజయమొందఁజాలక యలసియుండ రహిమానుఖానువచ్చి యాతనిపైఁ జేయి వైచి "నిన్ను ఖైదీగఁ బట్టుకొన్నాము. రారమ్ము" అని లాగెను. అప్పుడు మహమ్మదీయప్రభువులు వచ్చి రాజపుత్రసింహమును జెఱఁబెట్టిరి. పద్మినిని సమర్పించినంగాని బంధవిమోచనముఁ జేయుటలేదని చక్రవర్తి స్పష్టముగనుడివెను. భీమసింగు మ్లేచ్ఛులచేఁ జిక్కిన వార్త చిత్తూరుకోటలోఁ దెలిసినపుడు కోటలోనున్నవారి దుఃఖమింతింత యనిచెప్పనలవికాదు. దుర్నిరీక్ష్య ప్రతాపుఁడగు భీమసింగను సూర్యుఁడు శాత్రవసైన్యమను పశ్చిమాంబుధి నడఁగిపోవుటచే నపుడప్పద్మినీముఖారవిందంబు వికాసహీనత నొందెను. నగరమున నాబాలగోపాలముగ జనులు, భోజనంబులుమాని దుఃఖావేశముచే మాటలాడఁజాలరైరి. కత్తివాటువేసిన నొకరిమొగమునను నెత్తురుచుక్క లేకుండెను. కోటయు మేడలు నుద్యానవనములు మందిరములు వెలవెలఁబారుచుఁ జిన్నవోయెను. సైనికులెల్ల నుస్సురుస్సురనుచు దిగులునొంది యుండిరి. మదనసింగు తనతోటిసాహసికులు కొందఱితోఁ జక్రవర్తి సైన్యముపైఁ

జోవఁదలఁచెనుగాని యోపడుచూఁదనవు బ్రియత్నము ను గోరాసింగు మానెను. అనంతరము రాజపుత్రవీరులు నిజమందిరముల కరిగి యా రాత్రి కర్తవ్యము నూహింపుచుండిరి. ప్రతాపసింగును మదనసింగును విచారముతో నింటికిఁ జనిరి. మదనసింగు తనప్రియురాలి సేమముఁ గనుఁ గొనినతరువాత నొకకుర్చీమీఁదఁ గూర్చుండినపుడు మెల్లగసువర్ణభాయి వానికడకువచ్చి కూర్చుండి యిట్లని చెప్పనారంభించెను. 'నాయనా! నా దొక్క చిన్నమాట కలదు. నీకీబాలికపై నెట్లు ప్రేమ కుదిరెనో నేనె ఱుఁగను గాని యిది దౌర్భాగ్యురాలని తోఁచుచున్నది. మేలిముసుఁగుఁ దీసిచూడ నది నాకంతయందముగాఁ గనఁబడలేదు. అందమట్లుండ దీనిద గ్గఱ దొంగితనముకూడ నున్నది. ఈదినమున నావజ్రఁపుటుంగరము పో యినది. అది తీసినట్లు దాసీజనులు చెప్పినారు. అది నీప్రియురాలగుట చే వారేమియు ననఁజాల కూరకుండిరి. అని తల్లి వచించినమాటలను శూలములవలెనపుడుఁ దనచెవులఁబడ మదనసింగు దుఃఖమునకు మితము లేకపోయెను. కాని తల్లి యబద్ధమెన్నఁడుఁ దనతోఁ బలుకదని తానె ఱిఁగి యిది సేవకులు చేసినమాయ యని నమ్మి తల్లితో 'అమ్మా! హే మలతపయి నీకు నిష్కారణముగ దురభిప్రాయము కలిగినది. ఆమె సద్గుణపుంజము సుమీ నీకు నిలకిడమీఁద నిజము దెలియును. నీమాట లచేనన్ను బాధింపకుము' అని పలికెను. 'ఎట్లయిననీవు దీనిని వివాహమా డవలనుగాదుసుమీ' యని సువర్ణభాయి లోపలికరిగెను. మదనసింగు సందేహాస్పదహృదయముతోఁ దనప్రియురాలున్న గదిలోనికిఁబోయెను. అచట మంచముపైఁ బవ్వళించియున్న యాబాలిక మేలిముసుఁగు వెం టనే మొగముననేసికొని రోదన మొనర్చుచు మదనసింగు పాదముల పైఁబడి యిట్లు చెప్పసాగెను. "ప్రాణేశ్వరా! మీతల్లిగారును సేవకు లును నన్నవమానించుచున్నారు. నే నెందైనను బడి మృతినొందుటకు సిద్ధముగనున్నాను. మీదర్శనము జేసిపోవలెనని జీవించితిఁగాని యిది

వటుకే నేను వ్యతిరేకింపవలసినది. నామీఁద మీరింత నిర్దయులఁగాను ట ధర్మముగాదు. తరువాత మీరుఁ జేతిలోఁజేయివైచి నన్నప్పగించి పోఁడుగదా’ యని విలపించుచున్న ప్రియురాలి మాటలకు హృదయ ముకరఁగి మదనసింగు నిరుత్తరుఁడయ్యెను. ఆమె యంతటితో నిలువక మూఁడుత్తరములఁదీసి నావిషయమై వాలవి నాజరుజంగు ప్రముఖులకు వ్రాసిన యుత్తరములఁ జూపుఁడు. అందు నాసత్ప్రవర్తనమును గూర్చి యాతఁడు తుల్లుశ్లాఘించినాఁడో మీ రెఱుఁగుదురు’ అని యుత్తరములఁ జేతికిచ్చెను. మదనసింగు వానిం జదువుకొనిన తరువాత నారాత్రి తన ప్రియురాలివిషయము మగు విచారమును భీమసింగును గూర్చినచింతయుఁ దన్ను బాధింపఁ జిదానందయోగితోఁ దనకాలమును గడుపుటయుచితమని యెంచి యాతనినివాసమున కరిగెను. విచారమును సూచించుచున్న యాతనిమొగమును జూచి యోగి కారణమును చాలసారులు తరచితరచి యడిగి నందుకు మదనసింగు తనప్రియురాలివిషయమయిన చర్యనెఱిఁగించెను. హేమలత మదనసింగునియింట వసియించుచున్నదని యోగి విని యామెపయి నపనింద వచ్చినందులకుఁ జింతించి మదనసింగుతో ‘ఆమె వచ్చినదా? తల్లిదండ్రులులేని యాపిల్లపై నెట్టినిందవచ్చెను? ఆమెను నేనుజూచి మాటలాడవలెనని యున్నది. నీకేమయిన నభ్యంతరము కలదా?’ అని పలికెను. తన కట్టి యభ్యంతరము లేదని మదనసింగుత్తరముజెప్ప యోగి తక్షణమే వారియింటి కారాత్రి పైనమయ్యెను. మదనసింగు యోగితో గృహమును బ్రవేశించి బాలికయున్న గదిఁజేరి యామెనుజూపెను. ఆమెతోఁ గొన్ని రహస్యములు మాటలాడవలసియున్నవని యోగి చెప్ప మదనసింగు వెలపలి కరిగెను. తరువాత యోగి బాలిక కడకరిగి ‘అమ్మా! జ్వరము నింపాదిగానున్నదా? యని యడిగెను. దానికామె యుత్తరమునీయక యోగిపై నూరక చూచుచుండ నతఁడును నీ వెందుండి

యిక్కడకు వచ్చినావు? కుమారీ' యనియడుగ నామెమాటలాడదయ్యె. యోగి యామెహస్తమును బట్టుకొని 'నీవునాపుత్రికవు. సిగ్గుపడకుము' అని ప్రియములాడ నామెసిగ్గువదలి మాటలాడుటకు సమ్మతించెను. వారిట్లు మాటాడిరి.

చిదా—నీవు నేటిదాఁక నెందున్నావు? ఎవరిసంరక్షణమున నున్నావు?

బాలి—నేనా యలీఖురులో రాజులయింట నుంటిని.

చిదా—నిన్ను పాలినుండి యెవరు తీసికొనివచ్చినారు?

బాలి—ఆగడబిడనుండి నేనే వచ్చినాను. నన్నెవరు దేలేదు.

ఈపలుకులువిని చిదానందయోగి యనుమానపడి యామె మేలి ముసుఁగుఁ దీసి మొగమువైపుఁ బాఱఁజూచి మరల ముసుఁగిడి యావలకు వచ్చి మదనసింగుతో 'నీమొకు నీనముఁ గలిగిన కష్టములచే మతిచాంచల్యము సంప్రాప్తమైనది. నాకడకంపుము. నేనుమందులనిచ్చి రెండుదినములలో జాడ్యము కుదురునట్లు చేసెదను' అని లోనికరిగి బాలికతో 'అమ్మా! నీకు మదనసింగు తప్పక భర్తకాఁగలఁడు నీకు శరీరమున కొంచెము రుగ్మతకలదు. నామఠమున నిన్ను రెండుదినము లుంచుకొని మందిచ్చిపంపెదను రా!' యనిచెప్పి మదనసింగు సమ్మతిమీఁద నామెను గొనిపోయెను. మదనసింగును జింతాక్రాంతుఁడై యారాత్రి పండుకొని నిద్రరాక కలవలపడుచుండెను. యోగిమఠమునకు బాలికను గొనిపోయి యామెను నిద్రపుచ్చి తనప్రియశిష్యుఁడైన సదాశివునిఁ బిల్చి యాచిన్నదాని విషయమున నాతనితో నేమోచెప్పి యారాత్రి తానును సుఖముగ నిద్రించెను.

---

## పదునాఱవ ప్రకరణము.



ఆమఱునాఁడుదయమున నిద్రమేలుకొనకముందే సేవకులరుదెంచి మహారాణావారు రమ్మని వర్తమానమంపిరని చెప్ప మదనసింగు వస్త్రాలంకారములఁ దాల్చి తనయశ్వముపై నెక్కి మఠమునందున్న తన ప్రియురాలి యోగక్షేమము నరసికొనుటకు యోగికడకు వచ్చెను. యోగి మదనసింగును రహస్యముగ నొకగదిలోనికిఁ గొనిపోయి యాతనితో 'బాబా! యీపడుచు హేమలత కాదు పాలిగ్రామముననుండెడి రాధయను దాసిసుమీ. దీనివిషయమై దయఁదలఁపక నేను దగినట్లు శిక్షించెదను. నీదారిని నీవరిగి పనిఁ జూచుకొనుము' అని చెప్పెను. ఆపలుకులు విని మదనసింగత్యంతాశ్చర్యమునొంది తన్నట్లు మోసపుచ్చిన రాధ శిక్షార్హురాలని యొప్పుకొనెను. కానిస్త్రీయగుటచే క్షమించి ప్రాణహానిలేకుండఁ జేయుమని యోగిని బ్రార్థించి తాను కోట కరిగెను. అప్పటికిఁ బ్రతాపసింగు గోరాసింగు మొదలగు ప్రధానయోధులు వచ్చి దర్బారునఁ గూర్చుండిరి. మదనసింగును దన కుచితమగునాసనమునఁ గూర్చుండి భీమసింగును మ్లేచ్ఛులబారినుండి తప్పించుటకుఁ దగునుపాయమాలోచించుచుండెను.

అప్పుడు గోరాసింగు లక్ష్మణసింగును సభ్యులను జూచి యిట్లనెను. మనమీసమయమునఁ జక్రవర్తియొద్దకు మదనసింగును రాయబారిగ నంపుదము. అంతటిన్యాయముతోఁ బ్రవర్తించిన మాయెడ మీరంతయన్యాయముతోఁ బ్రవర్తించుట సత్పురుషోచితము కాదని చక్రవర్తికి నతఁడు దెలిపి యతనిలోపము నతని కెఱిఁగించినను నతఁడు మనమాట కియ్యకొనఁడేని తగుచర్య జరుపుదము. అని గోరాసింగు నుడువ నందఱదియుక్తమని మదనసింగును సందేశార్థ మరుగు మనిరి. మదనసింగు స్వామికార్యార్థ మెంతటి సాహసకార్యమునైన నాచరింప

నుద్యుక్తుఁ డగుటచే నీకార్యమునకు సమ్మతించెను. అతఁడు తురల నింటికిరాక సువర్ణభాయికడ సెలవుఁగైకొనక కొలువునున్న పినతండ్రికి నమస్కరించి యాతనిచే నాశీర్వచనములఁ బడసి రాణావద్ద సెలవుఁగైకొని చక్రవర్తిసమ్ముఖమునకుఁ గలిపయసేవకులతోఁ బోయెను.

ఇటఁ జిదానందయోగి యరుణోదయమున లేచి స్నానసంధ్యాదికములఁ దీర్చుకొని సదాశివునిచే రప్పింపఁబడిన మంగలివాని నొకచోటఁ గూర్చుండుమని గాడిద నొకచెట్టునకుఁ గట్టించి రాధను దనకడకుఁ బిలిపించి యాగ్రహముతో 'ఓసీ మూర్ఖురాలా! నీసంగతి నే నెఱుగుదును. నీవు పాలిగ్రామములోనుండు రాధవు. చిత్తూరు నీ వెట్లు వచ్చితివి? అని యడిగెను. అది భయసంభ్రములచే నోడలెఱుంగక కొంతసేపుండి తెలిసి యింక బొంకిన కార్యములేదని యిట్లనెను. 'స్వామీ! మదనసింగు పాలిగ్రామమునకు వచ్చినపు డాయనమీఁద నాకు నెట్టిమోహ ముదయింప నాఁపుకొనలేక హేమలత ఖానుపాలయినదని యెంచి నేనామెవేషము వేసికొనివచ్చి నాకర్మవశమునఁ బట్టుపడితిని. నాకుఁ బ్రాణదానముఁ జేయవలెను. నేను మీబిడ్డను' అని యోగిపాదములపైఁబడి హృదయము కరఁగునట్లు రోదన మారంభించెను. యోగి జాలిఁగొని ప్రాణదానముఁ జేయుటకు వాగ్దానముఁజేసి దానిని దొడ్డిలోనికిఁ దీసికొనిపోయి తానొక చేయియు సదాశివుఁ డొకచేయియుఁ బట్టుకొని యౌవనపరిపూర్ణురాలగు నామెను విక్రృతాంగిగ నొనర్పఁదలఁచి క్షౌరముఁజేయుమని మంగలివాని కాజ్ఞయొసఁగ వాఁడు తుమ్మెదరెక్కలవలె నల్లనివై నిడుదలగు రాధశిరోజముల భారముఁబాపి విధవవలెఁ జేసెను. విక్రృతాంగి యగునామెను యోగిత(క్ష)ణమె గాడిదపైఁ గూర్చుండ నియమించి చిత్తూరునగరమున వీధులవెంటఁ ద్రిప్పించెను. గ్రామనివాసులెల్ల మందలుమందలుగ నామెనుజూడవచ్చి కడుపులు పగులునట్లు నవ్వసాగిరి. ఇట్లు సంభవించిన పరాభవము భరింపలేక

రాధ యాపూఁట నగరమువిడిచి గ్రామాంతరముఁ బోయెను. అక్కడ మ్మదనసింగు చక్రవర్తి శిబిరమునకుఁ జని తనరాక నతని కెఱిఁగించెను. మదనసింగువంటి శూరశిఖామణిని శత్రుమండలమున లేకుండఁ జేయుటకుఁ జిరకాలము నుండి ప్రయత్నించుచున్న చక్రవర్తి యాతనిరాక విని రహిమానుఖానుకు వర్తమానము నంపెను. రహిమానుఖాను మదనసింగుపైఁగల యసూయచే నాతని రాయబారము విననక్కఱ లేదనియు వెంటనే యాతనిఁ జెఱబెట్టఁదగు ననియుఁ జక్రవర్తికి నాలోచనఁ జెప్పెను. చక్రవర్తి తత్ప్రకారముగ మదనసింగును గారాగృహమునఁ బెట్టించి రహిమానుఖానును నచటఁ గావలియుండ నాజ్ఞాపించెను. మదనసింగు ననుచరులలోనొకండు సత్వరముగఁ బఱతెంచి యతని యవస్థను బ్రతాపసింగునకు విన్నవించెను. భీమసింగు చెఱలోఁబడిన నాఁడెట్లు చిత్తూరున దుఃఖమునయించెనో యట్లే నేఁడును మదనసింగువిషయమై దుఃఖమునయించెను. ప్రతాపసింగు విచారమునకు నలవిలేదు. సువర్ణబాయి కీసంగతి తెలిపిన పుడు గాలితాఁకున నేలపైఁ బడుతీఁగవలె నామె మూర్ఛబోయి, తెలిపినతరువాత నన్నపానములు ముట్టక దుఃఖపారవశ్యము నొందియుండెను. ఆదివస మట్లు మహమ్మదీయ శిబిరమున మహానందముతోడను రాజపుత్రశిబిరమున దుఃఖముతోడను గడచిన వెనుక మఱునాఁడుదయమునఁ జక్రవర్తి మదనసింగును జెఱఁ బెట్టినగుడారమునకుఁ జని యొకపీఠముపై నాసీనుఁడై యతనిని దనయెదుటకుఁ దీసికొనిరమ్మని యాజ్ఞాపించెను. భటులట్లతనిఁ దోడితేర మదనసింగు తురుష్కుని కట్టెదుట నిర్భయముగ నిలిచియుండెను. ఆతని ధైర్యసంపదకుఁ దనలోఁ జక్రవర్తి యచ్చెరువడి వానితోఁ నిస్సందేహముగా నిట్లని చెప్పఁదొడంగెను. ‘ఓయీ కాఫరు! రాజపుత్రా నీవు మాచేఁ బడినావు. నీకు ప్రాణములఁ దక్కించుకొనవలెనని యున్న పక్షమున నాకార్యముఁ జక్కఁజేయుము. పద్మినిని [illegible] సము

కూర్చినట్లు మీం భీమసింగునకు సలహాచెప్పి కార్యసాఫల్యము గావిం పుము. అట్లయిన నీప్రాణసంరక్షణ మొనర్చుటయేకాక భీమసింగును విడుచుటయు నీకనేకబిరుదులను బహుమానములను నొసగుటయుం గూడ నగును. లేకున్న నీకు మరణదండన విధించెదను. నీసుందరకా యమును నీపరాక్రమమును జూడ నాకు జాలియగుచున్నది. నీవుమర ణమును గోరెదవా నీప్రాణములను రక్షించుకొనఁగోరెదవా ?' అని చక్రవర్తి పలుక మదనసింగు మహాకోపోద్దీపితుఁడయి నేత్రద్వయము చింతనిప్పులవలె జేవురింప మొగ మెఱ్ఱఁబారఁ బరవశుఁడై తాను మ్లే చ్ఛసార్వభౌముని స్వాధీనమునం దుండుటయుఁ దనకు మరణము సంప్రా ప్తమగుటయు మఱచి నిశ్చయముగ నిట్లు పలికెను. "ఛీ! నీదురాలా పముల నింకఁగట్టిపెట్టుము. నీవు పౌరుషవంతుఁడవనియు, మానాభిమా నములు గలవాఁడవనియు నేననుకొంటినిగాని యింత నీచుఁడవని నేనె న్నఁడెఱుఁగను. నీకు భీమసింగు మహారాజుభార్యయగు మహాపతి వ్రత పద్మిని కావలయుఁగా ? మే ముత్తమక్షత్రియవంశసంభూతులము గాని కఱకుతురకలము గాము. మాకు మానాభిమానములే తల్లిదం డ్రులు. ప్రాణములఁ దీసివేయుదునని నీవు బెదరించుమాత్రమున తు చ్ఛప్రాణములకు జడిసి నీచకర్మము నొనర్చువా రనుకొంటివి కాఁబో లును. ఈ తుచ్ఛకర్మములనొనర్చి జీవించుటకంటె మాకు శూరజన సులభమగు మరణమే మేలు. పరాక్రమవంతుఁడవేని యీదుర్భాషలు డిగి కత్తిఁగట్టి మాతో మగవాఁడవై పోరుము." అని యనేకభంగుల నిందించుచున్న మదనసింగుమాటల కాశ్చర్యపడి చక్రవర్తి మేరమీా ఱినకోపముతో 'నీదుర్మార్గుని జంపివేయుఁడు. వీనినాలుకను గోసి యెఱ్ఱగాఁగాలిన యినుపకడ్డీలను వీనికన్నులలోఁజొప్పించి పిమ్మటఁ ద లఁ దెగవేయుఁడు' అని రహీమానుఖానున కానతిచ్చి తక్షణమె యా గుడారమునుండి వెలుపలికిఁ జని భీమసింగును జెఱబెట్టిన గుడారమున

కరిగెను. కామపీడచేఁ జక్రవర్తికి యుక్తాయుక్త వివేకజ్ఞానము నశించి నందున నతఁడు భీమసింగుసమ్ముఖమున కరిగి తనహృదయపద్మమును బాయకుండిన పద్మిని సంయోగమును దనకుఁ గూర్పవలసినదని యాతసి వేఁడుకొనెను. కీచకునిమాటల కలిగిన భీమసేనునివలెఁ జక్రవర్తి మాటల కలిగి భీమసింగు రౌద్రరసమొల్క నిట్లనెను. ‘అపకీర్తితోఁ జిరకాలము జీవించుటకంటెఁ గీర్తితో మరణమునొందుట యుత్తమము. రాజపుత్రరక్తము నరములయందుఁ బ్రవహించునంతకాలమును, కంఠమునఁ బ్రాణము లుండునంతకాలమును భీమసింగు మరణమునకు వెఱచి నైచ్యమున కొడంబడునని స్వప్నమున నయిన నమ్మకుము. నాకు మరణము మాటవంటిది కాని భయకారణముకాదు. నాకు మరణము సంభవించిననుసరె రసపుత్రవంశములు నిర్మూలమైననుసరె నేనట్టికార్య మొనర్పను’ అని ప్రత్యుత్తర మియ్యఁగా ‘నామ్లేచ్ఛచక్రవర్తి భీమసింగు మదనసింగుల నిరువురఁ జంపివేయవలెనని సంకల్పించుకొనెను. అందుచేత మదనసింగును దక్షిణమే యంత మొందింపవలదనియు మఱునాఁడు భీమసింగుతోఁ గూడఁ దుదముట్టింపవచ్చుననియు రహిమానుఖానుతోఁ జెప్పెను. కాని మరల నారాత్రి కొందఱియాలోచనముచొప్పున భీమసింగును వధించుట మానుకొనియెను. ఇప్పటికైనను బద్మినిపైఁ దన కాస నశింపనందున భీమసింగుఁ జంపిన వ్యవహారము మొదలే మోసమగుననియు నతఁడు సేమముగనుండిన రసపుత్రులు పద్మినిఁ దనవద్ద కేనాటికైన నంపి యతనిప్రాణముల రక్షించుకొందురనియు నమ్మి భీమసింగునకు మరణదండన మాన్పెను. మదనసింగు చావు మఱునాఁడు నిశ్చితమయ్యెను. రహిమానుఖానా కార్యనిర్వాహమునకు నియమింపఁబడినందున నతనియానందము వర్ణనాదుస్సాధ్యమైయుండెను. ఆమధ్యాహ్నమె యినుపకత్తులను గొలిమిలోఁ బెట్టి యెఱ్ఱగఁ గాల్పించుచుండెను. ఆసాయంకాలమునందు రహిమాను

ఖానువద్దకు నందుఁడువచ్చి 'స్వామీ హేమలత చంద్రసేనుని గుడారము లోనేయున్నది. ఆరాత్రి చంద్రసేనుఁ డామెను గొనిపోయెనని విన్నాను. మీఁద మీచిత్తము' అని విన్నవింప నాడఁబోయినతీర్థ మెదురయినట్లు తనహృదయమును బీడించు కన్య తనశిబిరమున నుండుటకు సంతోషించి రాత్రి రెండుగడియ లైనతరువాతఁ దనయశ్వము నెక్కి ఖాను చంద్రసేనునిగుడారమున కరిగి యాతనిఁ బిలిచి తనకు నెట్లయిన హేమలతను సమర్పింపుమని యాతనిఁ బతిమాలుకొనెను. ఆతని వాక్యమునకును దుర్వర్తనమునకును జంద్రసేనుఁ డచ్చెరువడి యాతనితో 'మేము రాజులము మీరు తురకలు మాకన్యనెట్లు మీకియ్యఁగల మని యడిగినావు? చాలుచాలు నీచచర్యలు గట్టిపెట్టుము. లేకున్న చక్రవర్తితో నిది చెప్పెదను.' అని మందలించెను. రహిమానుఖా నింటికరిగి భగ్నప్రయత్నుఁడగుటకుఁ జింతిలుచుండెను. చంద్రసేనుఁడు వెంటనే చక్రవర్తిసన్నిధి కరుగుదెంచి వినయపూర్వకంబుగ జరిగిన వృత్తాంతమంతయు నెఱిఁగించెను. రహిమానుఖానుయొక్క దౌర్జన్యమునకుఁ జక్రవర్తి మండిపడి చంద్రసేనుని బంపి ఖానును బిలిపించి కఠినముగ నాతని మందలించెను. అంతటఁ దనమీఁద నేరముఁ దప్పించుకొనుటకు ఖా నుపాయమును వెదకి తుదకొక పన్నుగడ నూహించి యేలికతో నిట్లువిన్నవించెను. 'మహాప్రభూ! అతనివద్దనున్న బాలిక నిజముగ నప్సరసపద్మినివలె నుండును. పద్మినికామె బంధువని విని యామె నెట్లయినఁ దమకు సమర్పింపవలెనని చంద్రసేనుని నేనడిగితిఁగాని యాకన్య నానిమిత్తముకాదు' అని విన్నవించినఖాను మాటలచే మదనవికార ముదయింప ఖానుపై దయఁజూపి యంపి తక్షణమే చంద్రసేనుని రప్పించి హేమలతను దనశిబిరమునకుఁ దీసికొనిరావలయునని యానతిచ్చెను. ఆమాటలువిని చంద్రసేనుఁడు నిర్విణ్ణుఁడై యది రహిమానుఖాను మాయగాఁ దెలిసికొని చక్రవర్తి సమ్ముఖమ్మున మారు

మాటాడలేక సరేయని వెడలెను. మార్గమునఁబోవుచు దానింతకాలము దిక్కులేని రాచకన్నియ మర్యాదఁ గాపాడి తుదకు నిర్దయాత్ముఁడయిన మహమ్మదీయచక్రవర్తి కప్పగింపవలసి వచ్చెనని విచారము నొంద గుడారమునకువచ్చి యతఁడావార్త దనయింతికిని హేమలతకును దెలియఁజేసెను. హేమలత యవ్వచనము లాలకించి సకలదీనులకును న్యాయమొసఁగి స్త్రీలఁ జెఱఁబెట్టుదురాత్ముల శిక్షింపవలసిన చక్రవర్తియే స్త్రీలఁ జెఱుపఁదలంచినపుడు తనమర్యాద నిల్పుట దుర్ఘటమని నిశ్చయముగ నమ్మికొని దైవముపై భారమువైచి యెంతెంతవారి నాశ్రయించిన నన్నిదినములకును దనకష్టముల కంతము సంభవింపదయ్యెనని యారాత్రియెల్ల విచారించుచుండెను.

## పదునేడవ ప్రకరణము.

హా దైవమా నన్నింత దిక్కుమాలినదానిగ నేలఁ జేసితివి. పవిత్రమగువట్టియుఁ గౌరవము గలిగినట్టియు, రాజపుత్రవంశమునఁ బుట్టి తుదకు నిర్భాగ్యురాలనయి శివప్రసాదుపంచను గొన్నినాళ్ళును, జంద్రసేనునియింటఁ గొన్నినాళ్ళును వసియించి మహమ్మదీయుల పాలఁబడుచున్నాను. నాకేల మరణముఁగలుగఁ జేయవు? హా తాతా ఎందున్నావు? అయ్యో తల్లీ! నాబాల్యమునందె నీవు మృతినొందుట చేతగద నాకిట్టి యవస్థ సంభవించినది. కడుపులోనున్న దుఃఖము నెల్లఁ దెలుపుకొందమన్న నిరుపార్శ్వముల బంధువులైన లేరు. నేనేమి చేయుదును. మరణమే నాకు శరణమగుఁగాక! బలవంతముగఁ జక్రవర్తిచే నవమానింపఁ బడుటకంటె మర్యాదగ మృతినొందుట మేలుగద" అని తనలోఁ దాననుకొనుచున్న హేమలతవద్దకుఁ జంద్రసేనుఁడు వచ్చి యామె గౌరవమును గాపాడలేకుండి నందులకు విచారించుచు 'అమ్మా! యీదినమున

నిన్ను దప్పక తీసికొనిరావలసినదని చక్రవర్తి మరల నాకు వర్తమానము నంపినాఁడు. ఈమాట నీతోఁ జెప్పఁజాలక నేను సందేహించుచున్నాను. ఏమి చేయుటకును దోఁచదు. అయినను నాప్రాణముల నీనిమిత్తము పోగొట్టుకొందును. నామరణాంతమునఁగాని నీకుఁ బరాభవము సంభవింపదు. భయపడకుము.' అని పలుక హేమలత యామాటలువిని ''నానిమిత్తము మీరు మృతినొందవలదు. నాకవమానము ఘటిల్లిన పక్షమున నాచేతనున్న వజ్రమును నూకుకొని త్రాగుటకు సిద్ధముగనున్నాను. నావజ్రంపుటుంగరమె నాయవమానమును బాపనోపును. ఆచెఱలో నీవఱకు మృతినొందియున్న మాతాతను సత్వరమె నేను గలిసికొందును." అని యాత్మహత్యకు సిద్ధముగనున్న సుందరాంగికిఁ బ్రత్యుత్తర మీయఁజాలక ''మరల నొకపర్యాయము నీవిషయమై ప్రయత్నించెద" నని చంద్రసేనుఁడు కన్నీళ్ళతో వెడలిపోయెను. హేమలత ప్రతిక్షణమును దనకొఱకుఁ బల్లకి వచ్చునని యెంచుచు మృత్యుదేవత రాక కెదురుచూచుచుండెను.

ఆదిన ముదయమైనది మొదలు రహీమానుఖాను మదనసింగును దుదముట్టించు మహోత్సవము గలుగునని మహానందముతో నుండెను. హేమలత తన సంయోగమునకు సమ్మతింపనందున నామెపైఁ గసిఁ దీర్చుకొనఁదలంచి చక్రవర్తి కామె నెఱింగించెను. ఆకారణముచే నతఁడు రెండురెట్లు సంతోషముగ నుండెననుటకు సందేహము లేదు. జాముప్రొద్దెక్కిన తరువాత మదనసింగును బూర్వోక్తప్రకారముగ వధింపవలసినదని చక్రవర్తివద్దనుండి ఖానున కుత్తరువు వచ్చెను. వెంటనే ఖాను మిగుల నెఱ్ఱఁగఁగాలిన యినుపకఱ్ఱలను బట్టించుకొని యిరువురు సేవకులతో మదనసింగు వసించు గుడారమునకుఁ బోయి మదనసింగునుజూచి మరణమునకు సిద్ధముగ నుండుమని చెప్ప ఖానుతో నతఁడు దనకు మృత్యువు తృణప్రాయమనియుఁ దాను సిద్ధముగ నుండెననియు

ధైర్యగాంభీర్యములతోఁ బలికెను. అంతట ఖాను కోపమునఁ బండ్లు పటపటఁగొఱుకుచు నినుపకఱ్ఱలను మదనసింగుకన్నులపైఁ బెట్టి కాల్పుఁడని సేవకుల కానతిచ్చెను. సేవకులును నరహత్యలయందాఱితేఱిన వారగుటచే యజమానునియాజ్ఞ తక్షణమే శిరసావహించి కాలినయినుప కఱ్ఱలనెత్తిపట్టుకొని మదనసింగు సమీపమునకరిగిరి. వెంటనేనందుఁడు సింగును వెనుకకుఁ బడద్రోయఁ దక్షణమే యిరువురు సేవకులు మదనసింగు రెండుచేతుల నొకత్రాఁటవిరిచికట్టి పాదముల బొటనవ్రేళ్ళనుగూడ బంధించిరి. అప్పుడు మదనసింగుఁ మనస్సున నీశ్వరధ్యాన మొనర్చుచుండెను. "ఇప్పుడైనఁ జక్రవర్తి మాటవిందువేని నిన్నురక్షించెదను. అట్లు చేసెదవా?" యని రహిమానుఖా నడుగ నిర్భయముగ నతఁడు "నేనట్లుచేయను. నీయిష్టము వచ్చినట్లు చేయుము." అని యుత్తర మిచ్చెను. అపుడు వారినుపకఱ్ఱలను కనులదగ్గఱకుఁ దెచ్చునప్పటికి వెనుకనుండి యొకసేవకుఁ డఱచుచు వచ్చి "నిలువుఁడు, నిలువుఁడు చంపవ"ద్దని కేకవేసెను. ఆమాటలువిని రహిమానుఖాను తిరిగిచూచి యామనుష్యుఁ డెవ్వఁడని యరయుచుండ నతఁడు సాహేబుతో వధనాపవలసినదనియుఁ జక్రవర్తి ఖానును రమ్మనెననియుఁ జెప్పెను. ఆఘోరకృత్యము నాపి ఖాను మదనసింగు బంధములను విప్పించి చక్రవర్తిగుడారమున కరిగెను. చక్రవర్తియెదుట రసపుత్రుఁడొకఁడు కూర్చుండెను. ఖానును జూచినతోడనే చక్రవర్తి రసపుత్రునివంకఁ దిరిగి రాయబారమును విశదీకరింపుమని కోరెను. రాయబారములు నడుపుటయందు మిగుల నేర్పుగల దుర్గసింగు చక్రవర్తితో నిట్లనియెను. 'అయ్యా! మహారాణయును శ్రీపద్మినిదేవియు విన్నవింపుమన్న సంగతులను నేను మీతో మనవిచేయుచున్నాను. భీమసింగుగారిని మదనసింగునుమీరు చెఱనుండివిడిపింతురేని పద్మినీదేవి మీభార్యయైయుండుట కొప్పుకొన్నది. భర్తప్రాణరక్షణమునకుఁ దనకాయమునైన నర్పింపఁదలఁచి పద్మిని

మీసాంగత్యమునకు సమ్మతించినది.' అనిదుర్గసింగు విన్నవింపఁజక్రిన
తిఁ యమితానందపరవశుఁడై యుబిచి పీఠమునుండి లేచి రహిమాను
ఖానుని గాఁగిలించుకొని దుర్గసింగును మెచ్చుకొనెను. అంతట దుర్గసింగు
మరల "ఆపద్మినితోఁగూడ మానగిరమునందుఁగల గొప్పస్త్రీలందఱు
నిటకువచ్చి సాగనంపెదరు. వారి కేమవందలకంటె నెక్కువగనున్నారు.
అందఱుఁ బల్లకులలో నెక్కివత్తురు. వారు ఘోషాస్త్రీలు కాఁబట్టి వా
రికి ప్రత్యేకముగ నొక గుడారమునిచ్చి మహమ్మదీయుల దృష్టిఁబడకుండ
మీరు జాగ్రత్తపెట్టవలెను." అనవుఁడు జక్రవర్తి "సందేహమెందుకు?
మిగుల జాగ్రత్తపెట్టెదను. త్వరగారమ్మను త్వరగారమ్మను. పో. పో"
యని కేకలు వేయసాగెను. ఇట్లు చెప్పి దుర్గసింగు చక్రవర్తిని వీడుకొ
నిపోవునపుడు చక్రవర్తి రసపుత్రునకుఁ దనకంఠమునయున్న రత్నముల
హారమును బహుమానముగ నొసఁగెను. ఆరాజపుత్రుఁడరిగినది మొ
దలు చక్రవర్తికిఁ బద్మినిపై ధ్యానమెక్కు వగుటచే నతఁడు తీవ్రముగ
మదనాగ్ని పాలయ్యెను. ఒకమాఱు సంతోషముచే వెఱ్ఱివానివలె నటి
చుచు, నొకపర్యాయము సేవకులకు బహుమానము లిచ్చుచు, నొకమా
ఱుతోఁచక గుఱ్ఱముపై సవారుఁజేయుచు మదనావస్థనొందుచుండెను.
పద్మినీప్రముఖులగు రాజపుత్రసుందరు లబలలగుటచే నాయుధపాణుల
గు భటులను జూచి భయపడుదురని చక్రవర్తి నిరాయుధులై యుండు
నట్లు సైనికుల కానతిచ్చెను. వారును నాయుధములను వదలి భంగు
నిషాచేయ హాయిగనిద్రపోవుచుండిరి. మదనపీడితుఁడగు నతనికి నెంతసే
పటికిఁ బ్రొద్దుపోనందునఁ దనఖాజీని రహిమానుఖానును రప్పించి వారి
తోఁ గొంతసేపు దనకు రాఁబోవు నూతనభార్యనుగూర్చి పరిపరివిధ
ముల ముచ్చటించుచుండెను. అట్లు కొంతసేపు ముచ్చటించి తనపెండ్లి
నిశ్చయమని యెంచి తాను శయనించు మందిరమును జక్కఁగ నలంక
రింప నాజ్ఞాపించి యమూల్యవస్త్రాభరణములను ధరించెను. దుర్గసింగు

దెచ్చినరాయబారమును వినుచుండుటచేఁ జక్రవర్తి హేమలతమాట మఱచి మధ్యాహ్నము చంద్రసేనులకు వర్తమానము నంపఁడయ్యెను. సాయంకాలమునఁ జంద్రసేనుఁడే ప్రభుదర్శనమునకు వచ్చి పద్మినిరాకను జక్రవర్తిముఖమున విని యిదియె హేమలత నపాయమునుండి రక్షించుట కదా యని యెంచి చక్రవర్తితో నిట్లనియె. "మహాప్రభూ! హేమలతను దీసికొనివత్తునా? వద్దా? ఆమె మీయొద్ద నుండినయెడలఁ మీ కొక కష్టము సంభవించును హేమలతయుఁ బద్మినియు సనతులై యుండుటకు మహారాజపత్నియగు పద్మిని యొల్లదు. ఆమె యిందు కాగ్రహముఁ దెచ్చుకొని మరలిపోవునేమోయని నాకు భయమగుచున్నది." అని చంద్రసేనుఁడనఁ జక్రవర్తి హేమలత తన కావశ్యకము లేదని వాకృచ్చెను. వ్యాఘ్రముఖమునుండి బయలువెడలిన కురంగమట్లు చంద్రసేనుఁడు సంతోషించుచుఁ బ్రభువునొద్ద సెలవు గైకొనిపోయి యావార్త హేమలతకును దన భార్యకును దెలిపి వారితోఁగూడ నానంద మొందుచుండెను. సాయంకాలమగుట తోడనే చక్రవర్తి మధురాహారములు భుజించి యభ్యంగన మొనర్చి పద్మినిరాకను నిరీక్షించుచుండెను. వచ్చెడు స్త్రీజనంబున కెల్ల నొక పెద్దగుడారము వేయబడియుండుటచే వారు ఘోషాతో లోపలి కరుగుటకు వీలేర్పడెను. ఈమహాట్టహాసమునువిని పద్మినిసాహసమునకును రాజపుత్రులయవినీతికిని రాజస్థానముయొక్క దురవస్థకును మదనసింగు భీమసింగులద్భుతపడుచుండిరి. పతివ్రతయగుపద్మిని మ్లేచ్ఛరాజసంభోగమున కియ్యకొనుటకుఁ గారణ ముండకపోదని చంద్రసేనాదులును, నాజరుజంగును నాలోచించిరి. నాజరుజంగుపైఁ జక్రవర్తికి రహిమానుఖాను చెప్పెడు మాటలవలనఁ గోపము నానాఁటి కధికమగుటచేఁ గనబడినచోట మాటలాడుటయును నతఁడు మానెను. నాజరుజంగు మహావిచారముతోఁ దనరాజభక్తిని జూపుసమయ మెపుడు వచ్చునాయని దేవుఁ

ర్థించుచుండెను. ఆసాయంకాలమున సూర్యాస్తమయ మైనతరు వాతఁ జిత్తూరుకోటలోనుండి యొక్కవరుసగఁ దురుష్క శిబిరమునకు నే నువందల పల్లకులు రాసాగెను. పల్లకికి నల్వురు బోయలుండిరి. కోటమొదలు శత్రువుల స్కంధావారముదాఁక నేకపంక్తిగ నున్న పల్లకులను మోయుబోయల యోంకార నాదములవలన మహమ్మదీయుల కర్ణపుటములు పగులుచుండెను. శిబిరమున నొకచోట నాలుగుప్రక్కలను డెరలఁగట్టించి చక్రవర్తి స్త్రీలపల్లకులను నాస్థలమునకుఁ దీసికొని పొండని బోయల కాజ్ఞాపించెను. లోపల కరిగిన మనుష్యులు తురకల కగపడకుండఁ దమఘోషా నిలుపుకొనిరి. శత్రుసైన్యము పల్లకులవంకఁ జూచుచు నశ్రద్ధతో నిరాయుధులై యుండిరి. ఆపల్లకులలో బంగరపుఁ బనిచేసిన పల్లకియందుఁ బద్మిని కూర్చుండెనని చక్రవర్తితో బోయలు చెప్పిరి.



పదునేనిమిదవ ప్రకరణము.



పల్లకులెల్ల నియమితప్రదేశమున కరిగిన తరువాత వానితోఁ గూడ వచ్చిన దుర్గాసింగు చక్రవర్తియొద్దకుఁ జని యిట్లనియె. "అయ్యా! పద్మినీదేవి యింక మీపట్టపుదేవి యగును. కాఁబట్టి శాశ్వత వియోగము సంభవించుచుండుటచేఁ దనభర్తతో నొకమాఱు కడసారి మాటలాడఁగోరుచున్నది. అందుచే నొకగడియ సెలవుదయచేయింపవలెను" అని పలుకుటయుఁ జక్రవర్తి సరేయని సెలవొసఁగెను. పిమ్మట పద్మినిపల్లకి భీమసింగు గుడారమునకుఁ గొనిపోఁబడ వారిరువురు నొకగడియవఱకును మాట్లాడుచుండిరి. కామాతురుఁడైన యలాయుద్దీను నిమిషమైనను వియోగమున కోర్వలేక పద్మినితో సత్వరముగా సంభాషింపఁదలఁచియు, భీమసింగును విడువక ఢిల్లీనగరమునకుఁ బంపె

గాఁ గొనిపోవఁ దలఁచియు, రహిమానుఖానును బిలిచి యాదంపతుల
ను బట్టుకొమ్మని యానతిచ్చెను. రహిమానుఖాను నిజసైన్యముతో
నచటి కరుగునప్పటికె రాజపుత్రస్త్రీలుండు మందిరమునుండి యొకపల్లకి
వారి కెదురుగ వచ్చెను. పల్లకివెంట నాయుధపాణులగు రసపుత్రులనే
కులుండి యందున్నవారిని రక్షించుచుండిరి. ఎదురుగ వచ్చినవారి ప్ర
యాణమును నివారించుటకు మ్లేచ్ఛభటులు ప్రయత్నించిరి. కాని రస
పుత్రులు నిలువఁబడుట వారలకరుపురకును సంకులయుద్ధము జరుగసా
గెను. అంతలో భీమసింగు పారిపోవుచున్నాఁడని మహాధ్వని యొకటి
శిబిరమున వ్యాపింప రహిమానుఖాను మోస మేమో సంభవించినదని
తెలిసికొని ప్రాణభయమగు నని యెంచి వడివడిఁ జక్రవర్తివద్దకుఁ
బరుగెత్తి విచారముతో "స్వామీ! మోసము మోసము జరిగి
నది." అని యఱచెను. అల్లాయుద్దీ నులికిపడి లేచి యది యెట్టిదని
యడుగ ఖాను తొందరతో నిట్లు చెప్పెను. "మహాప్రభూ! పల్లకు
లలోఁ గూర్చుండి వచ్చినవారు స్త్రీలుకారు. ఒక్కొక్క పల్లకియం
దొకరసపుత్రసూరుఁడు కూర్చుండెను. పల్లకులమోయువారందఱు రస
పుత్రశిపాయిలెగాని బోయలు కారు. వారు బోయలవేషములఁ దా
ల్చి పల్లకులలో నాయుధములఁ దెచ్చుకొన్నారు మనసైనికు లశ్రద్ధగ
నున్నందున మన మీదినమున నోడిపోయితిమి. భీమసింగు పల్లకిలోఁగూ
ర్చుండి కోటకుఁ బాఱిపోవుచున్నాఁడు. నేనాతని నాపఁజాలనైతిని" అని
ఖాను విన్నవించుచుండఁ జక్రవర్తి నిశ్చేష్టితుఁడై కొంతసేపటి కొడ
లెఱిఁగి రాజపుత్రులు త్రవ్విన మహావిపత్సముద్రమునఁబడి తానును
దన సైనికులును మృతినొందవలసి వచ్చెనని చింతించి ధైర్యమును దె
చ్చుకొని "ఆమాలాఅల్లీ! హా మహమ్మద్! హా హస్సేన్! హుస్సే
న్! ఆరే నాజరుజంగు! అరే అరే అల్లా, అల్లా, అల్లా, అయ్యో!
పరుగెత్తి భీమసింగును దఱిమి పట్టుకొనిరండు. అయ్యో పద్మినీ పద్మినీ

పట్టుకొండు. సిపాయిలులేచి యుద్ధసన్నద్ధులు గండు. ఓయీ! యిబ్రహీం, ఓయీ! జహందరు, లెండి లెండి, అరే జోహరుల్లా త్వ రపడు. అని యఱవఁజొచ్చెను. ఈలోన మునుపటి స్థలమున దాఁగి యున్న రాజపుత్రశూరులు భటసమేతముగ నాలుగువేల తొమ్మిదివం దలమందియు నొక్కసారిగ హుమ్మనివచ్చి యశ్రద్ధగనున్న మ్లేచ్ఛసై న్యమును దాఁకిరి. అతిత్వరితముగ లేచి మహమ్మదీయ సైనికులు తమ తమయాయుధముల ధరించి రసపుత్రుల నెదుర్కొన నుభయసైన్యము లకును ఘోరయుద్ధము జరిగెను. ఈయాకస్మిక మహాయుద్ధములో మ హమ్మదీయులు స్వసైన్య పరసైన్యభేద మెఱుఁగఁజాలక తమవారిని సహి తి మాచీఁకటిలో పొడుచుకొనసాగిరి. ఈలోన సురక్షితముగ నగర ముఁజేరి భీమసింగు మూలబలము నెల్లఁ దీసికొని దక్షిణభాగమున మ హమ్మదీయ సైన్యమును దాఁకెను. బలవడిన యీ సైన్యమునకు మ్లేచ్ఛులకును జరిగిన మహాయుద్ధము వర్ణనాతీతాసాధ్యమై యుండెను. తమమానప్రాణములకు హాని తటస్థించునని శిబిరమునందున్న స్త్రీలా క్రందనధ్వనిఁ జేయ యుద్ధముమాని కొందఱుసైనికులు దారపుత్రాదు ల సంరక్షణార్థమై వెనుకకుఁ బరుగులిడుచుండిరి. కొబ్బరిపుచ్చెలవలె దె బ్బదెబ్బకు నేలరిపడుచున్న మనుష్యుల పుఱ్ఱెలును స్రవించురక్తముతో నేల గుభాలునఁ బడు మొండెములును దళతళ మెఱయు యోధుల మాయుధఁబులును దక్క మరియేమియు నచ్చట గనఁబడుటలేదు. రస పుత్రులును మహమ్మదీయులును హతులయిన తమబంధుమిత్ర కళేబర ములమీఁదనుండి నిర్దయాత్ములై నడచిపోవుచు యుద్ధము నొనర్చు చుండిరి. పడినవారితోడను పడెడువారితోడను, గాయములచే బాధపడి యేడ్చువారితోడను, దేహమును విడుచునెడ నీశ్వర స్మరణ ము జేయువారితోడను. వెన్నిచ్చి పరుగెత్తువారితోడను, యుద్ధభూమి నిండియుండెను. ఈమధ్య మహాశూరుఁడగు ప్రతాపసింగు భీమసింగును

విడిచి చక్రవర్తిని వెంబడింప నుద్యమించి నాలుగువందల సైనికులను దోడుకొని యలాయుద్దీను గుడారముపై నరిగెను. చక్రవర్తి మీందికి రాజపుత్రు లరుగుటం జూచి స్వామీ ప్రాణరక్షణ మవశ్యము కర్తవ్యమని మహమ్మదీయులెల్ల వడి వడిం బ్రతాపసింగు నాంపుటకు వ్యాఘ్రములవలె రోషావేశపరవశులై చని ప్రతాపసింగును దాంకిరి. ప్రతాపసింగు మధ్యాహ్న సూర్యునివలె దుర్నిరీక్ష్యప్రతాపుండై మహమ్మదీయ భటులకు భీతి గొలుపుచుండెను. మహమ్మదీయులు రసపుత్రులమీందికి వచ్చుటయుం జచ్చుటయు నేకకాలమున సంభవించెను. ఎందఱుతురకలను రసపుత్రులు చంపినను తురకలసేన యధికమగుటచే తురల యథాప్రకారముగ సైనికులు ముందుకుం జనుచుండిరి. తుదకుం జీమలపుట్టవలె మోటతురకలు చుట్టుముట్టుటచే స్వల్పసంఖ్యగల రాజపుత్రులు క్రమక్రమముగ క్షీణించిరి. ఏమిచిత్రమోగాని రాజపుత్ర సైనికులలో నొక్కండైనను రణరంగము విడిచి పరుగెత్తండ లేఁడు. కంఠమునం బ్రాణమున్నంతవఱకును రసపుత్రులు ఖడ్గమును విడువక యుద్ధము జేసిరిగాని శత్రువుని చేతికిం గత్తి నీయరైరి. ఇట్లు సైన్యము పలుచబడినందునం బ్రతాపసింగు ఖడ్గమును జాలును బూని యకాలమృత్యుదేవతవలె తురకలపైంబడి యనేకులను దెగనఱకి నాతని ధాటికి వెఱచి ముందఱివారు చెల్లాచెదరై పరుగులిడిరి. తరువాత నలువది యోధులతో రణరంగమున నిలిచియున్న ప్రతాపసింగుపై వెనుకనున్న తురకలు గవిసిరి. ప్రతాపసింగు దేహమంతయు గాయములతో నిండి చిమ్మన గొట్టములనుండివచ్చు వసంతమట్లు గాయములనుండి రక్తముస్రవించి చుట్టుప్రక్కలనున్న వారిపైం బడుచుండెను. రక్తక్షయముచే బలక్షయమగుటయు, సింగు నడుమనడుమ సొమ్మసిలుచు దెబ్బదెబ్బకు నొక్కొక తురకను గూల్చుచుండెను. ఆవేళం బ్రతాపసింగుచే నిహతులయినవారె దాదాపుగ నూరుమంది యుండిరి. బల

హీనుఁడై యున్న ప్రతాపసింగుమీఁదికి రహిమానుఖాను వడివడి వచ్చి తాఁక, సింగు గుఱ్ఱముమీఁదనున్న ఖానును దిగలాగి తనఖడ్గ మాతని పై నెత్తెను. అప్పుడు మ్లేచ్ఛసేనాధిపతియగు రహిమానుఖాను ప్రతాపసింగు పాదములపైఁ బడి "నేను నీబిడ్డవంటివాఁడను నన్ను జంపినను మీయింటి కుక్కను జంపఁ జూచినను నొకటే. బాబూ! నాకుఁ బ్రాణదానముఁ జేయుము. నాతల్లికి నే నొక్కఁడనే కుమారుఁడను నాకు బిడ్డలుపుట్టిన మీపేరు పెట్టెదను నన్ను వదలిపెట్టు మహాప్రభూ! నన్ను వదలిపెట్టినయెడల మాచక్రవర్తి యున్న రహస్య స్థలమును మీకుఁ జూపెదను. అతనిని మీరుచంపి మీకసిఁ దీర్చుకొనవచ్చును, గాని నావంటి దిక్కుమాలిన వానినిఁ జంపిన నేమిప్రయోజనము" అని వీరపురుషలక్షణముల విడిచి పరిపరిభంగుల వేఁడుకొన జాలిగుండెగల ప్రతాపసింగు వానిని విడిచిపుచ్చెను. రహిమాను గండమునుండి బయలువడి మఱియితరయోధులకు కనఁబడకుండఁ గొంతసేపు వచ్చిన యొకయేనుఁగు చాటున దాఁగుకొని యక్కడనుండి లేచి రాజపుత్రు లెక్కివచ్చిన పల్లకులలో నొక దానియందు, రహస్యముగఁ దలఁ దాఁచుకొనెను. అదివఱకు చెఱలోనుండిన మదనసింగు మహమ్మదీయుల కలవలము చూచి చక్రవర్తి తన్ను విడిపింపఁడని యెఱిఁగి యాతనిచే మోసపోకముందే మేలుకొని తనగుడారమునుండి వెడలివచ్చి రసపుత్రవీరులను గలిసికొనెను. భీమసింగు వానినిఁ గనుఁగొని కొంతసైన్య మాతనికిచ్చి ప్రతాపసింగునకు సహాయమొనర్పుమని యంప నాతఁడును సత్వరముగఁ జక్రవర్తి గుడారమువంక వచ్చి ప్రాణావశిష్టుఁడై యప్పటికిని దనప్రాణరక్షణ మొనర్చుకొనుచున్న పినతండ్రిని జూచెను. మదనసింగు పినతండ్రియవస్థను గనుఁగొని యతని శరీరమును బరీక్షించునప్పటికిఁ బ్రతాపుని దేహమున ముప్పదిరెండు పెద్దగాయములును నెనిమిది చిన్నగాయములు నుండెను. మదనసింగుపినతండ్రితో, "అయ్యో!

మీరుమనశిబిరమున కరుగుఁడు మీరింక యుద్ధ మొనర్ప లేరు. వ్రణవై ద్యులచే గాయములకుఁ గట్టు కట్టింపుఁడు" అని చెప్పపితాపుఁడు "నాయ నా! రణమునుండి యింటికి మరణభయమున నీవఱకు నే నరుగలేదు. నే నింకఁ బోఁజాలను. రక్తవర్షముచేఁ దడిసిన యీామంటిపరుప్పు ష్పఁ బందు కొనియెద. నీవుచక్రివర్తిమీాఁద కరిగి వానిని బట్టుము. లేకున్న వధిం పుము. నానిమిత్తమై విచారింపకుము" అని పలుక మదనసింగు విచార ముతోఁ బినతండ్రిప్రాణముల కాశ వదలుకొని చక్రివర్తిమీాఁది కరి గెను. చక్రివర్తి యంగరక్షక సైన్యములతో నొక చిన్న గుడారమునుం డి సైన్యము పలాయన మగుటకును, రాజపుత్రులుచేసిన యుక్తిని వి చారించుచుఁ బ్రాణసంరక్షణ మొనర్చుకొనుచుండెను. మదనసింగును జూచి యంగరక్షకులు నిశ్చేష్టితులుగా నతఁడు శత్రుమధ్యముననుఱికి యాకస్మికముగ సింగఁపుఁగొదమవలెఁ జక్రివర్తియెదుట నిలిచి యా యుధ మెత్తులోనఁ జక్రవర్తి సమీాపమున నున్న నాజరుజంగు వారి దుపురకును నడుమవచ్చినిలిచి ఖడ్గమును ద్రిప్పుచు నాతనిఁ దాకెను. నా జరుజంగు సమయమునకు రాకుండినఁ జక్రవర్తి యాదినమునఁ బరలో కవాసియై యుండును. చక్రవర్తి మదనసింకునుజూచి నిర్విణ్ణుఁడై చేష్ట లుదక్కి కదలి పాఱిపోఁజాలఁ డయ్యెను. అప్పుడు నాజరుజంగు మదన సింగుతో నిట్లనియె. "మిత్రుఁడా! నాఁటికి నేఁడు నీదర్శనమైనదని నే నూరుకొనను నాప్రాణము లుండి నంతవఱకును నీవు చక్రవర్తివై పరు గఁజాలవు. అక్కడనే నిలువుము. ఒక్కడుగు దాఁటివచ్చితివా నీప్రాణ ములు నీకుఁ దక్కవు. మాస్వామి ప్రాణరక్షణముకంటె నారక్షణ మెక్కు వకాదు" అని శౌర్యరస మొలుకు రాజభక్తిప్రపూరములగు మాటల తో మదనసింగును నిలుప నతఁ డాశ్చర్యపడి "చక్రివర్తి యదృష్టవం తుఁ డగుటచే నీవాతనికి నేఁ డడ్డమువచ్చినావు. నీతో యుద్ధముచేసి గె లిచి చక్రివర్తిని బరిమార్చెదను" అని పలికి యాతనితో యుద్ధ

మారంభించెను. అట్లిరువురును కొంతసేపుయుద్ధమును సలిపి యెవ్వరును గెలువనందున విసుగుచుండిరి. అంతలో యుద్ధ మాపివేయుమని భీమసింగు త్తరువుఁజేయ మదనసింగు మరలెను. ఆదినమున రాజపుత్రవీరులనేకులు మృతినొందినను తుదకు మహమ్మదీయులు చెల్లాచెదరై నానాముఖములకుఁ బాఱిపోయిరి. ఈసమయమునన చిదానందయోగి కాగడాలను వేయించుకొనివచ్చి నూరుగురుభటులతో రంగస్థలముఁ జొచ్చి తురకల గడ్డములను దివిటీలతోఁ గాల్చుచు వారివస్త్రములను శరీరములను దహన మొనర్చుచుఁ జిత్రచిత్రముగ వారినిఁ జంప నారంభించెను. మహమ్మదీయు లప్పటికి నిశ్శేషముగ నోడింపఁబడిరి. సరదారులు చచ్చిన గుఱ్ఱము లొకవైపరుగ నేనుఁగులు మఱియొకవంకకుఁ జనసాగెను. స్త్రీలార్తనాదములతో నటునిటుఁ బరువులిడ మ్లేచ్ఛసైన్యమున గలవలమును బాధయు నధికమయ్యెను. ఎచటఁ జూచినఁ బీనుఁగులు, నెచటఁ గనుఁగొన్న రక్తప్రవాహములు, నెందు నడిచిన నెముకలు, నేమివిన్న నార్తధ్వనులు, నయ్యెను. అట్లున్న రంగస్థలమున మృత్యుదేవత విచ్చలవిడిగ సంచరించుచున్నట్లు మహాభయంకరమై యుండెను. రాత్రి రెండుజాములకు సైనికులు శిబిరమును విడిచి పాఱిరి. రసపుత్రులు తెల్లవారువఱకు నుండిరి.

## పందొమ్మిదవ ప్రకరణము.

ఇట్లు సమస్తసైన్యమును శత్రువులచే వధింపఁబడుటయుఁ దనకపారకష్టము సంభవించుటయుఁ బద్మినీదేవి చేకూరకుండుటయుఁ జూచి చక్రవర్తి రణరంగమువిడిచి సత్వరముగ భద్రగజముపై నెక్కి తన.కాపత్కాలమున సహాయ మొనర్చిన నాజరుజంగును వేనోళ్ళ నుతియించుచు నాతనిఁగూడ నేనుఁగుపై నెక్కించుకొని దీనుఁడయి ఢిల్లీనగరమునకుఁ

బ్రయాణమయ్యెను. శిబిరము ననుసరించివచ్చిన స్త్రీజన మెల్ల నాక్రందనధ్వనులతోఁ బరుగెత్త నారంభించినపుడు వారివారి భర్తలు వారికి సహాయముగఁ బోయి వారికపాయము వాటిల్ల కుండగఁ జేసిరి. చంద్రసేనుఁడు యుద్ధము జరుగుచున్నంతవఱకును రంగస్థలమును బాసి చనక చక్రవర్తిసైన్యములు పఱచిన వెనుక జయాశవీడి శిబిరమునకుఁ జని భార్యను గనుఁగొని హేమలతతోఁగూడఁ బ్రయాణమై వెడలుమని యానతిచ్చెను. హేమలత వారిగుడారమున లేదని భార్య యెఱిఁగింపఁ గొంతసేపు చంద్రసేనుఁడు బాలికకొఱకు వెదకి యామెను గనలేక తుదకు విసిగి హేమలతను మహమ్మదీయులో, శత్రుప్రజలో యెవరో తీసికొనిపోయియుందురని నిశ్చయించి కొంచెము విచారించి తనరాజు వెంటఁ దా నరిగెను. మదనసింగు పినతండ్రి యవస్థయెట్లున్నదో యని త్వరితగతి నావంకకు వచ్చెనుగాని యానడుమనే భీమసింగు ప్రతాపసింగునిమిత్తము మనుష్యుల నంపి వెదకి యాతనిఁ దోడ్కొనిరమ్మని వారి కానతిచ్చినందున గాయమునిండ గాయములతో నున్న యమ్మహాశూరశిఖామణిని వారు భీమసింగుగారిదగ్గఱకుఁ దీసికొనివచ్చిరి. భీమసింగును వారిస్థితినిబట్టి యతఁడు జీవించుట దుర్ఘటమని యెంచినను బ్రాణము లున్నంతవఱకు మనుష్యప్రయత్నముల మానుటయనుచితమగుటచే వ్రణవైద్యుని కాతని నప్పగించి, తమమందిరమునకుఁ గొనిపోవ నియమించెను. పినతండ్రి భీమసింగువద్ద సురక్షితుఁడై యున్న వార్త మదనసింగు విని గాయములు తగిలి ప్రాణములతో యుద్ధభూమిని బడియున్న తనయాప్తులగు రసపుత్రుల కౌషధ మిప్పించి బ్రతికింపఁద[illegible]ందఱు రాజపుత్రులతో యుద్ధభూమిని సంచరించుచుండెను. రహిమాన్ఖాను ప్రాణభీతిచే ఖడ్గమును దాఁచి యంతఃపురస్త్రీవలె నొకపల్లకిలో యుద్ధముముగియువఱకుఁ గూర్చుండి తనసైన్యమును శత్రుసైన్యమును యుద్ధభూమిని విడిచినతరువాతఁ బల్లకీతలుపులు

తెలిచి బైటకువచ్చి మెల్లఁగా నడచుచుండెను. అతఁ డట్లు పోవుచుండ నతని యదృష్టహీనతచే మార్గమున మదనసిం గెదురుపడెను. అతనిఁ జూచినతోడనే ఖానుసాహెబుగారు మీఁదిప్రాణములు మీఁదనేపోవ జీవచ్ఛవమువలె నిలువఁబడి తనకు మరణమతనిచేఁ దప్పదని తూరుని చావుఁజచ్చుట కిష్టముగలుగ ఖడ్గమును జేతఁబట్టుకొని మదనసింగుపైఁబడ నరిగెను. మదనసింగితని యేటుఁ దప్పించుకొని మ్లేచ్ఛసేనానాయకుఁ డు క్కుదక్కి నేల వ్రాలునట్లొక దెబ్బకొట్టెను. బాటసారులను దోపించిన పాతకమును స్త్రీలను జెఱఁబెట్టిన దోషమును నిరపరాధులపైఁ జక్రవర్తిక్రాగ్రహముఁ గలిగించిన క్రౌర్యమును వాని కాసమయమున జ్ఞప్తికిరా నతఁడు మనఃక్లేశము నొంది తుదకు మహమ్మదువారిని సర్వేశ్వరుఁడైన యల్లాను దలఁచుకొని మక్కావైపు మొగముఁద్రిప్పి ప్రాణము విడిచెను. తనమిత్రులకు మందుమాకు లిప్పించి తగినవారి నుపచారమునకు నియమించి మదనసింగు ప్రొద్దుఁజూచి రెండుజాములైనదని తెలిసికొని గృహాభిముఖుఁడై యరుగుచుండ నతనివెనుక నొక మనుష్యవిగ్రహము వచ్చి వీపుపైఁ జేయివైచి యాకస్మికముగ నతనిని నాపెను. మదనసింగులికిపడి తిరిగిచూచి తనయెదుటఁ బదునాఱువత్సరముల ప్రాయముగల యొక బాలకునిఁ జూచి యాశ్చర్యపడి నీ వెవ్వఁడ వని యడిగెను. "నా పేరుకుమారసింగు; నేను రాజపుత్రుఁడను" అని యాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అంతట వారిట్లు మాటాడిరి.

మద—నీ వీరాత్రి యెందుండి యిటువచ్చుచున్నావు? నీచరిత్రమును గొంత చెప్పుము.

కుమా—అయ్యా! నే నీవఱకు చక్రవర్తికొలువున నుంటిని. పాలిగ్రామమున నున్న నారాయణసింగు మాతాత, హేమలత నాచెల్లెలు; మేము చాలకాలముక్రిందట వియోగము నొందినాము. మాతండ్రి నాచిన్నతనమునందె మృతినొందెను.

మద—అహహా! నీమాట లాశ్చర్యమును గల్గించుచున్నవి. హేమలతకు నన్నయుండుట నేనిప్పుడు విన్నాను. ఆహా! నీమొగ మచ్చముగ నామె మొగమువలెనే యున్నది. హేమలత యిప్పు డెందున్నది? ఆమెనుజూచి చాలకాలమైనది. మీతాతయేమయ్యెను.

కుమా—మా హేమలతా? ఆమెయునీశిబిరముతో వచ్చినది కాని యీయల్లరిలో నెటకో పోయియుండును. ఆమెదొరకుట దుర్లభమని నాకుం దోఁచుచున్నది.

మద—అయ్యో! నా కాసంగతి తెలియదయ్యెను. నేనేమి చేయుదును? నా కామె దొరకుటెట్లు? దైవము నాయెడ నిర్దయుండై యున్నాఁడు.

కుమా—నీ కామెయం దంత ప్రేమ యేల? నివామెను వివాహమాడెదవా యేమి? నీకామెపై ననురాగమున్నట్టు లామెకు నీపై నుండునా?

మద—నీవాలాగున ననుకొనఁబోకుము. ఆమెకు నాయం దనురాగ మున్నది. ఆమె యెందున్నదో నే నెఱుఁగఁగోరుచున్నాను. దయచేసి నీవు చెప్పుము. ఆమె నిజముగ నీశిబిరముతో వచ్చినదా? అట్లయిన నామెకొఱకు వెదకుదము. నాతో రమ్ము.

అని మదనసింగాత్రముతో నడుగఁ గుమారుసింగు మందహాసముతో "నీవు తొందరపడకుము. తెల్లవారినదాఁక నోపికపట్టుము" అని చెప్పి పాలిగ్రామమున రహిమానుఖాను హేమలతవిషయమున జరిగించిన దౌర్జన్యమును, నారాయణసింగును జెఱసాల కంపుటయు, హేమలత గోసాయిదయవలన కుల్వానగరమున శివప్రసాదునింట నుండుటయు, మాయోపాయమున నామెను రహిమానుఖాను ఢిల్లీకిఁ దీసికొనిపోయి బలాత్కరింపఁ జూచుటయుఁ జంద్రసేనుని దయవలన బాధావిముక్తనొంది యామె చక్రవర్తిశిబిరముతో వచ్చుటయు నాదిగాఁ

గల పూర్వవృత్తాంతము నెఱిఁగించెను. రహిమాను చేసినదౌర్జన్యమును విని సింగు మిగుల విచారమునొంది ; హేమలతపై జాలియు ననురాగము నెక్కువకాఁగా నామెను జూపుమని కుమారసింగును వేగిరపెట్టెను. కాని యతఁ డేమియుఁ జెప్పక "నన్ను నీ వేవిషయమునను బ్రశ్నలువేసి బాధఁబెట్టకుము. తేపునాసంగతిఁ జెప్పి మాచెల్లెలిసంగతిఁగూడ బయలుపఱచెదను" అని పలుక మదనసింగూరకుండెను. అతని మనసున నాందోళన మధికమయ్యెను. వారిరువురును గొంతసేపునడచి నగరమును సమీపించునప్పటికి వారికిఁజిదానందయోగి కనఁబడెను. యోగినిజూచి కుమారసింగు వినయముతో నమస్కరించి చేతులు జోడించి నిలువ యోగి వాని నాశీర్వదించి యానవాలుపట్టి తనబసకు రమ్మని బలవంతము జేసెను. కుమారసింగు మదనసింగునొద్ద సెలవుఁగైకొని యారాత్రి యోగితోనరిగెను. మదనసింగుమాత్రము కుమారసింగు మాటలయం దర్థమునెఱయుచు నాతని ముఖవిలాసమునం దొకయాకర్షణ ముండుటచే ధ్యానమగ్నుఁడై యుండి యింటి కరిగెను. కుమారసింగారాత్రి చిదానందయోగి మఠమున భుజియించి సుఖముగా నిద్రించెను. మదనసిం గింటి కరుగునప్పటికి గృష్ణసింగు రోదనము జేయుచుఁ బ్రతాపసింగు గాయములచే మరణావశిష్టుఁడై రాజమందిరమున నుండెననియు, సువర్ణాభాయియు నట కరిగెననియుఁ జెప్పి యాతని నటకుఁ బొమ్మనెను. ఆమాటలు విని మదనసింగు దుఃఖభారముచే నడువఁజాలక కన్నీళ్ళు విడుచుచు మెల్లమెల్లగా రాజాంతఃపురముఁబ్రవేశించెను. భీమసింగు, మహారాణాలక్ష్మణసింగు, గోరాసింగు మొదలగువారందఱు మదనసింగున కెదురుగ వచ్చి శత్రుజయమున కాతని బహూకరించి పినతండ్రియొద్దకుఁ దోడ్కొనిపోయిరి. జయసంతోషమును బితృమరణ దుఃఖమును నేక కాలమున సింగుహృదయమున జనియింప నాతఁడు లోపలికరిగి గాయములచే బాధపడుచు

ధైర్యమును విడువని పినతండ్రినిఁ జూచి దుఃఖమును బట్టఁజాలక యాతనిపైఁబడి యేడ్వ నారంభించెను. సువర్ణాభాయి కుమారుని గౌఁగిలించుకొని "నాయనగారు పోవుచున్నారు తండ్రీ" యని రోదన మారంభించెను. అంతట మదనసింగు ప్రతాపసింగు మొగముమీఁద మొగముపెట్టుకొని "కక్కా నేను తల్లిదండ్రుల నెఱుఁగను. నీవే నన్ను గారాముతోఁ దండ్రిలేని లోపము కనఁబడకుండఁ బెంచినావు. అయ్యో! నన్ను విడిచి పోయెదవా? నాకెవరుదిక్కు? నేనింక నెట్లు జీవింతును?" అని వాపోవఁ దొడగెను. శౌర్యరాశియగు ప్రతాపసింగు వానిని వారించి "నాయనా! నీవు రాజపుత్రుఁడ వగుదువా కావా! మరణ మెన్నఁడయినఁ దప్పదుగద. నేను వీరపురుషోచితమగు మరణము నొందుచున్నాను. దేశస్వాతంత్ర్యమునకుఁ బోరాడి మృతినొందుచున్న నన్ను గూర్చి సంతోషించుటకు మాఱు దుఃఖించెదవేల? నీవు రాజభక్తిఁగలిగి జాగ్రత్తగ నుండుము" అని యూరార్చి భీమసింగును మహారాణాలక్ష్మణసింగును బిలిచి మదనసింగునుజూపి "అయ్యా! నాకును మాయన్నయగు మాధవసింగునకును నితఁడే కుమారుఁడు. ఈతని మీకుమారునిగ నెంచుకొని లోపమును క్షమియించి రక్షించుకొనుఁడు." అని చేతిలోఁ జేయివైచి యప్పగించెను. ఇంతలోఁ బ్రతాపసింగున కాయాసముగాఁగా నందఱును "రామ రామ, రామ' యనుచు హరినామస్మరణ మొనర్చిరి. అప్పుడు భగవద్ధ్యానముతోఁ బ్రతాపసింగు లోకాంతరమున కరిగెను. తరువాతి సమిత్రగౌరవముతో నూరేగించి ప్రతాపునకు భీమసింగు దహనసంస్కారములు చేయించెను. మదనసింగు పినతండ్రి కుత్తరక్రియలు చేసి పితృఋణమును దీర్చుకొని పితృవియోగమునకు హేమలతావియోగము తోడ్పడఁ జింతిల్లుచుండ సువర్ణాభాయి యెఱిఁగి కుమారునిజూచి "నాయనా నీవింక వివాహమాడి యిల్లు నిలువఁబెట్టుకొమ్ము. నీమనోనాయకియగు హేమలత

యున్నదో నామెను జేకొనుము" అని పలుక నామాట ల్లమృత సేచన మట్లు మదనసింగున కపారసౌఖ్యమును గలిగించెను. కాని హేమలత యెందును గానరానందున నతఁడు దీర్ఘవిచారమగ్నుఁడయి యానాఁ టుదయమునఁ జిదానందయోగి మఠమున కరిగెను. కుమారసింగాతో లినాఁడే మఠమును బాసి చనినట్లు చిదానందయోగి యెఱిఁగింప మదన సింగు హేమలతజాడలు తెలియనందులకు విచారించుచు నింటికి వచ్చు చుండెను. అపుడు రాజవీధిలో నొక పల్లకి యాతనికంటఁబడెను. ఆపల్లకి వెంట వచ్చుచున్న యే బదివత్సరముల ప్రాయముగల యొకతు రక మదనసింగును గురుతుపట్టి "మదనసింగుగారూ! నిలువుండీ" యని పిలువ నతఁడును నిలిచి చూచి యామనుష్యుని నానవాలుపట్టి పే రు స్మరణకు రానందున జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచుండెను. అంతటనాతురక సింగుతో "అయ్యా! మీరు నన్ను గుర్తింపఁజాలరు. నాది పాలిగ్రామ ము; నాపే రబ్దుల్ ఖరీము మాలవి. పల్లకిలో నున్నయతఁడు ముసలి నారాయణసింగు. ఇతని మీరాదరింపుడు" అన సంతోషముతోఁ బ ల్లకి నింటికిఁ దోడ్కొనిపోయి నారాయణసింగును సగౌరవముగ నాదరిం చి హేమలతకై యాతఁడు వెదుకుట విని చిత్తూరునం దామె లేదని చెప్పి "మీరు పాలిగ్రామమునుండి యిటకెట్లువచ్చిరో మాకుఁ దెలి యఁజేయుఁడి" యని మదనసింగడిగెను. రహిమానుఖాను దౌర్జన్య మును దాను జెఱసాలయందుండుటయు, రహిమానుకు బదులుగ వచ్చి నవాఁడు తన్ను హింసించుటయు, వేటకుబోయినప్పు డొక వ్యాఘ్రము వానిపైఁబడి వధించుటయు గ్రామస్థులు తన్ను విడిపించి హేమలతను వెదకించి యెందును గానకుంకుటయుఁ, జెప్పి "ఆమె చిత్తూరునం దు న్నదేమో యని మాలవిని సహాయముగఁ దీసికొని నే నిటకు వచ్చి నాఁడను ఈతని దయవలననే, నే నాపదనుండి బయలఁ బడితిని. త న్యమతస్థుఁడైనను నీతఁడు నా కొనర్చిన యుపకారమునకు నే నీతని

ఋణము నెన్నిజన్మముల కయినను దీర్పఁజాలను. మా హేమలత యెంతు ను లేదని మీ రనుచున్నారుగద. అయ్యో! నే నేమి చేయుదును? ఆమె యిక్కడ నుండునని గంపంతయాసతో వచ్చినాఁడను. ఇంక నే మృతినొందుట మేలుకాని జీవించుట మేలుగాదు. ఈ మాలవి నన్నున మ్మికొని చక్రవర్తి రాజ్యమును బాసి చిత్తూరునఁ గాఁపురముండ నిశ్చ యించుకొని వచ్చినాఁడు. నే నొకవేళ మృతినొందినను నీ వీమాలవిసా హేబున కుపకారముఁజేసి యిక్కడ నుండునట్లు చేయుము" అని చెప్ప నారాయణసింగుపలుకుల విని మదనసింగబ్దుల్ ఖరీమున కభయ మిచ్చి హేమలతను వెదకించుచుండెను.



ఇరువదవ ప్రకరణము.

ఆమఱునాఁడు మధ్యాహ్నము దర్బారుజరుగునని భీమసింగు ప్రకటించెను. రాజపుత్రులెల్ల నియమితకాలమునకు సభామంటపమున కరిగి యుచితాసనములఁ గూర్చుండిరి. భీమసింగును మహారాణాయును వచ్చి కొలువుఁదీర్చి యుద్ధమునందు వీరస్వర్గమునకుఁ జన్న శూరశిఖామ ణులనుగూర్చి విచారము తెలిపి శరీరముల కాశింపక యుద్ధమొనర్చిన వి క్రమశాలుర కనేకబహుమానములను బిరుదులును నిచ్చి, వారిని మిగు ల గౌరవించిరి. అందు ముఖ్యముగ మదనసింగు సాహసధైర్యములకు రాణా మెచ్చుకొని శౌర్యనిధియగు ప్రతాపసింగు సేనానాయకత్వమున కు నాతనినియోగించిరి. రాజపుత్ర సేనానాయకత్వము నందుటకు మ దనసింగు మహానందము నొందినను, నాఁడు చిత్తూరు సభామంటపము నఁ బినతండ్రి లేకుండుటయు, సభయెల్లఁ జిన్నఁబోవుటయు, నాతని యుద్యోగము దాను స్వీకరించుటయు నాతనికి గొంతదుఃఖము గల్గిం చెను. అతఁడుత్సవము దాదాపుగా ముగిసియున్నప్పటికి నలుబదియేండ్ల

వయస్సుగల యొకచామనచాయమనుష్యుఁ డుత్తమరసపుత్రులు ధరించు కొను వస్త్రాలంకారములతో సభ కరుగుదెంచి రాణాయెదుట నిలిచెను. అతఁ డారీతిగ మున్నెన్నఁ డాకొలువునకు రానందున నాతని నెవ్వరు నానవాలుపట్టి తగుగౌరవము నొసఁగక విస్మయ మొందుచుండ భీమసిం గాతని నుచితాసనమునఁ గూర్చుండఁ బనిచెను. మదనసింగు మొదల గువారీతని మొగము మున్ను చూచినట్లున్నదని తమలోఁదాము గుస గుసలాడ నారంభించిరి. అప్పు డానూతనపురుషుఁడు లేచి సభాసదులను దనవృత్తాంతమును విన నవధరింపుఁడని వేఁడుకొని యిట్లు పలికెను. “ఓరాజపుత్రులారా! నాచరిత్ర మతిదీనమైనది. నే నొక పరువుగల రాజపుత్రవంశమునం దుదయించితిని. నాబాల్యముననే నాతల్లి మృతి నొందుటచే నేను బ్రయాగలో నామేనమామలవద్దఁ బెరిగితిని. మా కాఁపురము రాజస్థానముననున్న జయపురమైనను నేను ఢిల్లీచక్రవర్తుల పాలనముక్రింద నున్న దేశములోనుండుటచే జలాలుద్దీనుచక్రవర్తివద్దసే నాధిపత్యమును గ్రహించి, యిరువదియేండ్లుదాఁటకముందే నేనాచక్రవ ర్తి యనుగ్రహమునకుఁ బాత్రుఁడనై గొప్పవాఁడనైతిని. జయపురము నందు నాతండ్రి నాతల్లి పోయినతరువాత మరల వివాహమాడి ద్వితీ యభార్యయు బిడ్డలును మృతినొందుటచే వైరాగ్యముఁ గలవాఁడై ప్ర యాగకువచ్చి మామేనమామల ప్రోత్సాహముచేఁ జక్రవర్తివద్ద సై న్యాధిపత్యమునుసంపాదించెను. అలాయుద్దీను దక్షిణదేశమునుండి వచ్చి జలాలుద్దీనును జంపించి తానె చక్రవర్తి కాఁదలంచి యాకార్యమునకు దోడ్పడుమని నన్నును నాతండ్రిని నడుగ మేము నిరాకరించితిమి. అందు చే మాపై నాగ్రహముగల్గి మాతండ్రికన్నులను దనచేతికత్తితోఁ బొ డిచివైచి నన్ను వధించుటకు యత్నింపగా నే నామహాపదఁ దప్పించుకొని పాఱిపోతిని. నాభార్యయు నంతకుముందే రెండుసంవత్సరములక్రిందఁ బరలోకగతురాలయినందున నప్పటికి నేడెనిమిదేండ్లవయసుగల నాచిన్న

కుమారికను శిబిరమున విడిచి నే దేశాంతరములకు మాఱువేషముతో నరుగఁబూనితిని. తురకలవలన నా కింతద్రోహము జరుగుటచే నెట్లయిన నల్లాయుద్దీనుపై హిందూరాజులఁ బ్రేరేపించి దండెత్తించి కసిదీర్చుకొనఁదలఁచి నేను దక్షిణ హిందూదేశమునకుఁ బోయి మహారాష్ట్రరాజగు రామదేవుని మీతోఁ గలియునట్లొడఁబఱచి వారివద్దనుండి మీకుత్తరములనుగూడఁ దెచ్చితినికాని మధురానగరమున నే నొక పాడుదేవాలయమున యోగివేషముతో నుండ రహిమానుఖాను సేవకులు నన్ను యమునానదిలోఁ బడఁద్రోసి యాకాగితముల నపహరించిరి. ఈతవచ్చినవాఁడ నగుటచే దైవానుగ్రహమున నే నాజలగండమునుండి బైటఁబడి, గోసాయివేషముతోఁ బాలిగ్రామమున కరిగి యచ్చట నాతండ్రియగు నారాయణసింగును నాముద్దుకూఁతురగు హేమలతయు బ్రతికియుండుటకు సంతసించి, రహిమానుఖాను హేమలతను చెఱఁబెట్ట నుంకించుచుండ నామెను రక్షించి కుల్వానగరమునకుఁ దోడ్కొనిపోయి నాస్నేహితుఁడగు శివప్రసాదునింట నుంచితిని. తరువాత రాజస్థానముపైఁ జక్రవర్తి దండెత్తు ననుమాట విని ఢిల్లీనగరమున జరుగుచర్యలను గ్రహించి రాజపుత్రులకెఱిఁగింపఁగోరి, కులందరు ఫకీరుగా రహిమానుఖానువద్దనుండి రహస్యములు బైటఁదీసితిని. అంతటనుండియు నేనీనగరమునఁ జిదానందయోగివేషముతో నుండి రాజపుత్రులసేమమునకు నాతపస్సునెల్ల ధారపోసితిని. ఆరాత్రి మహారాణా లక్ష్మణసింగుగారిని మదనసింగు సాహాయ్యమువలన రక్షించి, వసంతభట్టును జ్ఞానానందస్వాములవారివేషమువేసికొని యుత్తరములఁ దెచ్చిన పాండురంగనాథునిఁ బట్టుకొని వసంతభట్టును జంపించి పాండురంగనాథుని మీ కప్పగించితిని. నే ననేకసేవకుల నుంచుకొని, వారిని నానాభాగముల కంపి వసంతభట్టాదుల రహస్యముల నెఱిఁగి నేఁడు తురకులనోడించి సఫలమనోరథుఁడనైతిని. నాపేరు జనార్దనసింగు. హేమ

లత నాకూఁతురు; అంధుఁడగు నారాయణసింగు నాతండ్రి. హేమలత నావద్దకు వచ్చినదికాని నాతండ్రి జాడలు దెలియలేదు. ఎఱిఁగినవా రున్నయెడల నా కాతనిజాడ నెఱిఁగించి నన్ను ధన్యునిజేయుఁడు. నాకూ మాతెను మదనసింగునకిచ్చి వివాహము చేసెదను." ఇట్లు జనార్దనసింగు తనపూర్వవృత్తాంతమును సభ్యులకుఁ దెలియఁజేయ వా రాశ్చర్యపడి యందఱు నాతనివంక దృష్టినిలిపి చూచుచుండ హేమలత చిత్తూరునగరమున నున్న దనియు నామెను దన కిచ్చి వివాహము చేయుట నిశ్చయ మనియు జనార్దనసింగు పలుకుటచే, మొదట మదనసింగు మిగుల నుప్పొంగుచు, నారాయణసింగు తనగృహమున నున్నట్లాతనితోఁ జెప్పి తనతో రమ్మని పిలిచెను. పాలిగ్రామమునుండి రాజస్థానమున కాయంధుఁడు వచ్చుట కాశ్చర్యము నొంది జనార్దనసింగు చిరకాలముక్రిందటఁ జూచిన తనతండ్రిని దర్శింపఁగోరి రాణావద్దను సభ్యులవద్దను సెలవు గైకొని తనమతమునకుఁ జని యొకపల్లకిలో హేమలతను గూర్చుండఁబెట్టి వెంటఁ బెట్టుకొని మదనసింగుతో నరిగెను. ... కాలమునుండి పరస్పరవియోగముగల యాప్తబంధువుల విచిత్రసమ్మేళనమును నేత్రోత్సవముగఁ జూడఁగోరి, భీమసింగును సభ్యులును మహారాణాతో బయలుదేఱి మదనసింగు గృహమునకుఁ జనిరి. మదనసింగు తనయదృష్టవశమునఁ దనగృహమునలంకరించిన మహారాణా ప్రభృతులను యథాశక్తిని గౌరవించి యర్హాసనముల నిడ వారందఱుఁ గూర్చుండిరి. మనుమరాలు గనఁబడనందులకు దుఃఖించుచున్న నారాయణసింగు వద్దకుఁజని, మదనసింగు "తాతా! మీ హేమలత వచ్చినదిసుమీ" యనిపలికెను. తోడనే నారాయణసింగధరిపడి "నాయనా! ఏదీ మా హేమలత? ఏదీ! నాయనా! నిజమేనా, చెప్పు చెప్పు" మని వేగిరపడుచుండ నంతలో హేమలత మేఘముల చాటు మెఱుపువలె వచ్చి 'దాదా! దాదా!' అని పిలుచుచు నానందాతిశయమున నసన్నఁపురుషు లుండ

రనుమాట మఱచి, యానందబాష్పములతో ముసలివాని యొడిలోఁ గూర్చుండి యాతనికంఠమును గట్టిగఁ గౌఁగిలించుకొని విలపింపసాగెను. నారాయణసింగు మనుమరాలిపైఁ జేయినైచి కనులనుండి బాష్పము లామెశిరముపైఁబడ "అమ్మా నాటికి నిన్ను నేఁడు చూచితిని. నిన్నుజూచి యానందించుటకు నేత్రములు లేవుగదా తల్లీ" యని పరిపరిభంగులఁ దనసంతాపసంతోషములను మాటలచేతను చేష్టలుచేతను దెలుపుచుండెను. అప్పుడు మదనసింగు వృద్ధునితో "తాతా! నీకుమారుఁడు వచ్చినాఁడు చూచెదవా?" యనిపలుక నారాయణసింగు తనపుత్రుఁడానాఁడే యల్లాయుద్దీను చక్రవర్తిచేఁ జంపబడినట్లు దృఢమగు నమ్మకము గలవాఁడగుటచే నామాట నమ్మక "నాయనా! మీరు నన్నేల పరిహసించెదరు? నాకొడు కెక్కడ? నా కగపడుటయెక్కడ, జలాలుద్దీను చచ్చుటకుముందు రాత్రి నాకును నాకుమారునకును ఋణముతీఱినది. అటువంటి పుత్రరత్నము నావంటి పాపకర్మునకేల దక్కును? నాయనా జనార్దనసింగూ! ఇఁక నాకగపడవుగదా" అని విలపించుచున్న నారాయణసింగు మాటలకడ్డమువచ్చి జనార్దనసింగు "దాదా! నామాటల నానవాలు పట్టఁజాలవా? నేను జనార్దనసింగును. ఆరాత్రి నే నల్లాయుద్దీనుచేతఁ బడకుండ దైవానుగ్రహమునఁ బ్రతికి శిబిరమును విడిచి యింతకాలము మారువేషములతో బహుదేశములఁ దిరిగి సమస్తయాత్రలు సేవించి తుదకుఁ బాలిగ్రామమునకు వచ్చి మీరు బ్రతికియుండుట నెఱిఁగి మనశ్శాంతిఁ గలిగియుండి నేఁడు గలిసికొన్నాను." అని జనార్దనసింగు తనపూర్వాశ్రమవృత్తాంతమును నెఱిఁగింప నారాయణసింగు వానికంఠస్వరమునుబట్టి తనకుమారుఁడని తెలిసికొని యక్కునఁ జేర్చి, యనిర్వాచ్యానందము నొంది "నాయనా! చక్రవర్తి నాకన్నులను బొడిచివేయకముందు నిన్నుఁ గన్నులారఁ జూచినవాఁడను నేఁడు నిన్నుఁ జూచి సంతోషింప నాకుఁ గనులు లేవు. అయినను నీవును హేమలతయు

నాకు రెండుకన్నులై యున్నారు. మీరు దొరకుటె నాకు గనులు లభించుట" అనిపలికి సంతోషమున వెఱ్ఱివానిరీతి నుండెను. జనార్దనసింగు హేమలతను శివప్రసాదు గృహమునకుఁ గొనిపోవునాఁడు గాని, యీరెండుదినములలోఁ దనగుర్తు నున్నపుడుగాని, తానామెకుఁ దండ్రి యగుటఁ జెప్పనందునఁ దనకు జ్వరము తగిలినప్పుడు రక్తరేఖగట్టిన గాయమే తనతండ్రియని హేమలత ప్రథమపర్యాయమున విని విస్మయమొందెను. తానామెను విడిచిపోవునాఁటికి నొంబదిసంవత్సరముల బాలికగనుండి నేఁడు సంప్రాప్తయౌవనయయి యుండుటచే జనార్దనసింగు చాలకాలమునకుఁ జూచిన కూఁతురు ముద్దుపెట్టుకొని యొడిలోఁ గూర్చుండఁబెట్టుకొనెను. తరువాత సువర్ణభాయి హేమలతను జూడఁగోరినందున జనార్దనసింగు నామెను లోనికంపెను. సువర్ణయు హేమలత సౌందర్యాదులను, మొగమున గనుపట్టుకళను, సత్కులజాతచిహ్నములను, వినయసంపత్తిని జూచి యామె యెట్టియైనఁ దనకుమారున కిల్లాలగుటకుఁ జాలునని కోరుచుండెను. అప్పుడు మదనసింగు జనార్దనసింగునుగూర్చి "అయ్యా హేమలతకు సహాయార్థముగఁ జైనకుమారసింగెచటనున్నాఁడు? అతఁడు నావెంటనే మీగృహమునకు వచ్చెఁగద" అని యడుగ "నాయనా! అనుపూరిసింగే యీహేమలత యయ్యెను. యుద్ధమునందు జరిగినకలకలములో హేమలత దుష్టులపాలఁబడకుండ పురుషవేషమును వేసికొని యీపేరుఁ బెట్టుకొన్నది.' అని జనార్దనసింగు త్తరము చెప్పెను. హేమలతయొక్క సమయోచితబుద్ధికిని యుక్తికిని మదనసింగాశ్చర్యపడుచుండ నపుడు భీమసింగు లక్ష్మణసింగులయెదుట, జనార్దనసింగు హేమలతను మదనసింగున కిచ్చి వివాహము చేదునని చెప్పి, తనతండ్రికిని నావివాహమిష్టమగుటచేఁ దద్విషయప్రయత్నముల నొనర్పుఁడని భీమసింగుతోడను దక్కినరసపుత్రులతోడను జెప్పెను. ప్రతాపసింగు మృతినొందుటచేఁ బెద్దలెవ్వరును లేరని మదన

మరుగుపక్షమున భీమసింగు సర్వప్రయత్నములను జేయించి సద్దిగ్గనే యుంచెను. నారాయణసింగును జనార్దనసింగును హేమలత వివాహ మగువరకును దనమందిరమునకు రండని భీమసింగు పిలుచుకొని పోయెను. సంపూర్ణశరత్కాల చంద్రమండలమును నపహసించు హేమలతముఖము నవలోకించి ముద్దుపెట్టుకొని మెఱుపుతీఁగఁబోలు నామె దేహమును బిగ్గఁ గౌఁగిలించుకొను నిమిష మెన్నఁడు వచ్చునాయని మదనసింగు నిమిష మొక గడియవలె గడపుచుండెను. సొంపొందిన మన్మథునివలె నల్లపట్టుకుచ్చులఁబోలు మీసములతోడను నీలోత్పలములవంటి నేత్రములతోడను సంపూర్ణచంద్రబింబమువంటి ముఖముతోడను దనహృదయమును బాయకున్న మదనసింగును దలఁచుకొని హేమలతయును వానిఁగలిసికొను సుదినమెదురుచూచుచుండెను. అంతట నొక సుదినమున సుముహూర్త మేర్పఱచి జనార్దనసింగు హేమలతామదనసింగులకు సకలరాజపుత్రముఖ్యులసన్నిధిని మహావిభవముతో భేరీమృదంగాది మంగళధ్వనులతో వివాహముగావించెను. పద్మినీదేవి హేమలతయొక్క వినయాదిసుగుణములకు మెచ్చియో, పుత్రసమానుఁడైన మదనసింగుపైఁ గల ప్రేమనెంచియో, యామెకు సమస్తాభరణములను బెట్టి తనయింటఁ బెండ్లికుమార్తెనుజేసెను. చూచినవారందఱు నదియనుకూల దాంపత్యమని పొగడ హేమలత మదనసింగును వివాహమాడెను. వివాహమహోత్సవ మైదునాళ్లును మహావైభవముతో నడచెను. అతఁడేకపత్నీవ్రతస్థుఁడై విద్యావంతురాలయిన యామెసాంగత్యముచే నపార సౌఖ్యము నొందుచు నారాయణసింగుతోడను మామగారితోడను సుఖముగాఁ గాలక్షేపము చేయుచుండెను. వివాహమైన నాలుదినముల కబ్దుల్ ఖరీము మాలవిని మదనసింగు భీమసింగునకుఁ జూపి యాతఁడు మ్లేచ్ఛరాజ్యమును బాసి చిత్తూరు రాజ్యమున నుండుటకనుజ్ఞ వేఁడుచుండుటఁ దెలియఁజేయ భీమసింగందులకు సంతోషించి యాతనికినెలకుఁ

బదునైదువరాలవేతనము గల యుద్యోగమునిచ్చి యాతనికుటుంబమును గూడ రక్షించెను. ఆనాఁటనుండియు మాలవి చిత్తూరువాస్తవ్యుఁడై మహారాణాకొలువులో నుండెను.

తరువాత హేమలత సుఖముగనున్న వార్తను శివప్రసాదునకుఁ జంద్రసేనునకును దెలియఁజేయుటకు మదనసింగు వానికడకు మనుష్యుల నంపెను. తనకుఁ గడుసహాయమొనర్చిన చంద్రావతి కుత్తరమువ్రాసి యామనుష్యులచేతికిచ్చెను. హేమలతామదనసింగుల యనురాగఫలమై, వివాహమైన రెండుసంవత్సరములనాఁటికి వారికొక కుమారుఁడుదయించెను. అతనికి మదనసింగు మాధవసింగని తనతండ్రిపేరు పెట్టెను. తరువాత వారికనేకులు కుమారులు కుమార్తెలు జనించిరి. మదనసింగు రాజభక్తియుక్తుఁడై తనతండ్రికంటెను బినతండ్రికంటెను బరాక్రమమునఁ బేరుగాంచి శత్రువులకుఁ బ్రక్కలో బల్లెమై రాణాకు గుండెకాయయై పుత్రపౌత్రాభివృద్ధిగలిగి వర్ధిల్లుచుండెను.

సంపూర్ణము

# అహల్యాబాయి.



## మొదటి ప్రకరణము.



మహారాష్ట్రదేశమునకుఁ గస్తూరితిలకమువలె నలరు శ్రీ పునహానగరము భయంకరశాసనుండగు శ్రీ పేష్వామాధవరాయుని పాలనమునం దుండుటచేఁ జోరకిరాతభీతి లేక తన్నగరవాసులందఱు హాయిగా గుండియలపైఁ జేతులునైచుకొని నిద్రించుచుండిరి.

ఆహాహా! రాత్రి సకలజంతుసంతతికి నపారనిద్రాసుఖము నొసంగు మహోపకారియయ్యు, మదనప్రేరితులకును, విచారవినమ్రులకును, పాపకర్ములకును, గంటికిఁ గూర్కు రానీయక నాలుగుజాములకాలము నపకారియై యుండునుగదా! అయినను స్వైరహాస్యములను దన కడుపున నిడుకొని కన్నతల్లివలెఁ గాపాడునట్టిది రాత్రియే గనుక దురాచారులకుంగాక మానవులకుఁగూడ నది యుపకారియగు. ఆనాఁటిరాత్రి నగరమంతయుఁ గాలపురుషుఁడు వేసిన సమ్మోహనాస్త్రముచేత బద్ధమై పరవశత్వంబు నొందెనేమో యను నట్లు ప్రాణంబులఁ బరమేశ్వరునకును నర్థంబుల రాజసేవకులకును సంరక్షణార్థ మొప్పగించి నిద్రించుచుండెను. వేయిగన్నులతో సర్వేశ్వరుండు రక్షింపఁ దమపని యేమున్నదనియో, నియమితకార్యంబుల మఱచియో, యవిలంఘనీయ మగు నిద్రాదేవి కెదురాడ నేరకయో, రాజభటులుఁగూడ నెక్కడివా రక్కడ నిద్రించుచుండిరి. తమపనియం దత్యంతశ్రద్ధాళువులు కొందఱువీరులు గస్తీదిరుగుచు నడుమనడుమ నిద్రవచ్చునపుడు స్తంభమునకో గోడకో చేరఁబడి కునికిపాట్లుపడుచు నట్టిట్టుఁ బనిచేయుచుం

డిరి. నగరమునందలి దీపములన్నియు నొకటితరువాతనొకటి క్రమము
న నారిపోయెను. ఆరాత్రి యొకబాలిక దీపములు పెట్టినదిమొదలు
పలుమాఱు తమపెరటితలుపుఁ దెఱచుచు మూయుచు మాటిమాటికిఁ
దనముద్దుమొగమ్ము బాటసారుల కగపడునట్లు తొంగితొంగి చూచు
చుండెను. జాముత్రియైనతరువాత నొకమాఱట్లు చూచి వీథిలోనికి
రావలెనని గుమ్మములోనడుగిడ నిద్దఱుబాటసారు లాదారి నేగుచుండిరి.
అందుచే నామె చెంగున లోనికిం జని తలుపుమూసెను. మఱి రెండుసా
రులట్లు గృహము వెడలిపోవఁ బ్రయత్నించుచుండ నొకమాఱు తల్లి
మేల్కాని యామెస్థితినిగూర్చి పరీక్షించి యామెను బంధుకొనఁజేసెను.
రెండవమాఱు తన చిన్నతమ్ముఁడు నిద్రలో దుస్స్వప్నముం గని యే
డ్చుటచే నాతని నూరడింపవలసి వచ్చెను. రెండుజాములరాత్రి యైన
వెనుక ద్వారము వెడలి యాసుందరి వచ్చునప్పటికిఁ దన కెదురుగ నరఁ
గుపై నిద్రించు రాజభటుఁడు "పోకుపోకు జాగ్రత" యని పలువరిం
చెను. రహస్యకృత్యములఁ జేయువారు ప్రపంచమునందలి యన్నియం
శములు దమవిషయమే యనుకొందురుగాన నామె యామాటలకు వె
ఱచి యిలు వెడల సాహసింపదయ్యెను. తుదకీ కన్య రేయియంతయు
నిదురలేకయే నిష్కారణముగ శ్రమపడి యింకఁ దనకుఁ దగుసమయ
ము లభింపదనుకొనుచుండ జాముకోడి 'కుక్కురో' యనికూసి యామెకు
మఱింత విచారమును గలిగించెను. అయినను నామె తన ప్రయత్నము
ను మానక కడపటిసారి తలుపు దెఱచిచూడ వీథి నిర్మానుష్యమై యుం
డెను. ఇంట నందఱుఁ దెల్లవాఱు జామున వీచు మందమారుతములు
తమ్ము సోకుటచే గాఢనిద్రం దేలుచుండిరి. అది తగిన యదనని మది
నెఱిఁగి యాసుందరి మార్గ మెఱుఁగుటకుఁ దన రెండుకన్నులందక్క తక్క
న శరీరాంగముల నెల్లఁ గప్పు మేలిముసుంగు ధరించుకొని గృహావరణ
ము దాఁటి యావలఁబడి తనకోరిక క్రేళ్ళుదాఁటుచుండినట్లు తనగమనం

బును నతివేగమై యుండునట్లు నడిచి తాను నిర్ణయించుకొనిన స్థానమునకుం జనుచుండెను. అపుడు చీఁకటి పూర్ణముగ నున్న యా నాకాశమును పాలవెల్లిని విలాసార్థము గట్టిన పాదరసపుబుడ్డివలె, నొప్పిన వేఁగుఁజుక్క మినుకుమినుకు మని వెలుతురు నిచ్చుటచేతను భాశభళ్యమగు మేలిముసుఁగు తనమొంట నుండుటచేతను నామె కితరులు, నితరుల కామెయు నగపడుచుండిరి. ఇట్లు కొంతదూర మాయింతి నడచినడచి యెవ్వరో మనుష్యు లాత్రోవను వచ్చుచుండుటచేఁ గొంతతడవొక యరుఁగుపైఁ గూరుచుండి మరలఁ దన ప్రయాణముసాగింపఁ గొంతనడచి నాలుగుసందుల మొగదగ్గఱ తన గమ్యస్థానమునకు దారియెఱుఁగక నిలుచుండెను. అపుడు తనముం దిరువదియైదు సంవత్సరముల యీడుగల మనుష్యుఁడునడచి పోవుటఁ జూచి యొంటరిగ దీర్ఘాలోచన మొనర్చుచు శిరమున వెల్లపాగయు, వెల్లదేహమునఁ దెల్లయంగరకాయు ధరించి మెల్లగాఁబోవు నొక లేఁబ్రాయపువానిఁ గనుఁగొని చకచక వానివైపునకు నడచి చల్లగ నాసీఁపునఁ జేయివేసెను. అదివఱకు నిర్మానుష్యమగు వీధిఁ బోవు నీపురుషుఁ డీచల్లని హస్తస్పర్శముచే నులికిపడి తిరిగిచూచి యెదుట మబ్బుమఱుంగున మసలు మెఱుంగుతెఱఁగున ముసుంగుమఱుఁగున మెలంగు నంగనంజూచి యాశ్చర్యపడి యామెతో మెల్లగ, "నీ వెవ్వరిదానవు! నాతో నేమిపనియున్నది?" అని యడిగెను. ఆమెయు మృదూక్తులతో, "నాపే రెందుకు? భవానీదేవి యాలయమునకు దారి నీ వెఱిఁగిన నోఁ జెప్పుము, నేనటకుఁ బోవలయు" నని ప్రత్యుత్తర మొసంగ నాతఁడు, "నీ యెదుట నాచెట్లచాటున నొక మేడయున్నది. ఆమేడ కావలిదే భవానీదేవాలయము" అని చెప్పి, యట్టిసమయంబునఁ జీఁకటియని శంకింపక, దురాచారులకు వెఱవక, కావలివాండ్రికి జంకక యతిసాహసముతో నొంటరిగఁ బయనము చేయుచున్న యామె తెగువకు మెచ్చుకొనుచు నామెపైఁ గన్నులు నిగిడ్చి నిలువఁ

బడెను. ఆమాటలు వినఁబడినతోడనే యన్నెలంత యాదేవళమువంక కరుగుచుండెను. ఆసుందరి యాలయమునం దెవ్వరినిమిత్త మేపనికయి చనుచున్నదో తెలియఁగోరి మన తెరువరి యామె వెనువెంటఁ దగిలి యామెచేఁ గనుగొనఁబడకుండ నడుచుచుండెను. ఆమె యాలయమును జేరి మూసియున్న కవాటములు గుభాలునఁద్రోసి లోనికిఁ జని దేవియున్న గుడితలుపులయొద్దకుం బోయి నిలిచెను. గర్భగుడితలుపులు మూయఁబడినందున నామె ముహూర్తమాత్రము యోజించి గుడియెదుట నేలసాష్టాంగనమస్కార మొనర్చి తనమొగ మాగుడిగడపపై మోపి కొంచెముసేపు వెక్కివెక్కి యేడువసాగెను. ఈనడుమ వెంటవచ్చిన యబ్బాలుఁడు బాలికస్థితికిఁ దొంటికంటె నక్కజపడుచు ఱెప్పవాల్చక యామెను జూచుచు నొకమూల నామెచే లక్షితుండుగానట్లు గూరుచుండెను. ఊరడించువారు లేనందున దుఃఖము వెంటనే యుపశమిల్లెను. బాలిక తేలికయగు హృదయముతో నచ్చటినుండి యిట్లనెను. "అమ్మా భవానీ! జగన్మాతా! తండ్రిలేనిబిడ్డను నన్నిటుచేయుట నీకు ధర్మమా? ఇపుడు నామనస్సున కిష్టములేని యీకార్యముఁ జేయుటకంటె నన్నుఁ జంపివేయరాదా? ఈకార్యమునుండి తొలంగుమని మాయమ్మకునేల తోఁచునట్లుచేయవు? తల్లీ!నామనోరథము నెరవేఱదేని నాకు విషమే గతి. ఆమాట నీకే దక్కఁగలదు. నాసాహసము నీ వెఱుఁగనిది కాదుగదా!" యని పరిపరివిధముల నమ్మహాదేవిని బ్రార్థించి తెల్లవాఱుచుండుటచేఁ దన్నెవ్వరైనఁ గన్గొందురేమో యని మరల గృహమునకుఁ దనవారు మేల్కనకమున్నరుగఁదలఁచి లేచెను. లేచుచుండఁగా, "నీమనోరథము నెరవేఱును భయపడకుము" అని యొక యమానుషవచన మామె చెవులకు వినవచ్చినట్లయ్యెను. అందుచే సఫలీకృతమనోరథ నయ్యెదనని యామె సంపూర్ణోత్సాహము గలిగి గుడివెడలి పదిబారలు వచ్చునప్పటికి నావల నాలయమున నక్కిన యక్కుమారుఁడు సుందరిం గలిసికొని

వచ్చుట కారంభించెను. తనరహస్యముల నాతఁ డాలకించెనేమో యని యామె దిగులుగొని యాతని నసూయతోఁ జూచుచుండ నానయను కాఁడు పరవశుఁడై యామెహస్తముఁ బట్టుకొని, “సౌందర్యమంతయు సంపూర్ణముగ నీసొమ్మయినది. ఇఁక నేమివరములకై దేవినిఁ బ్రార్థించుచున్నావు, నావంటివానిపై దయయుంచు” మని యామెచేయి ముద్దుఁబెట్టుకొన యత్నించుచుండ నామె సహజముగ బలముఁ గలది గుటచే స్త్రీసామాన్యమగు నధైర్యము నువిడిచి చేయివిదలించుకొని కనులెఱ్ఱఁజేసి కోపముతో నాతనిఁ గసరఁబోయెను. కాని యాతఁ డామెను మరలఁ బట్టుకొని, “నాతోరా, నీవెక్కడికి కరుగఁగలవు. రా!” అని లాగఁదొడఁగెను. పడుచుఁ గన్నియ యగు తాను నిశాసమయమున నొంటరిగా వచ్చినందుకు విచారించి, విచారించినఁ గార్యము లేదని యరక్షిత రక్షిణియగు నాథవాసీమాతం దలంచి హా! జగన్మాతా! యని గద్గదస్వరముతో నఱచెను. ఆయఱపు గుడియరుగుపై నిద్రించుచు నప్పుడే మేలుకొన గాంచిన యొకసన్యాసి విని “దురాత్మా! యెవఁడవురా నీవు” అని దగ్గఱకు వచ్చెను. వెంటనే యద్దురాత్ముఁడు పిక్కబలముఁ జూపి యదృశ్యుఁడయ్యెను. సన్యాసి యామెనూరార్చి యిట్లొంటరిగా రాఁగూడదని చెప్పి యింటిదనుక సాయముఁ జనియెను. ఆమె గుట్టుచేరి తనవారెఱుఁగకుండ మెల్లన మంచముపైఁ బవ్వళించెను.



## రెండవ ప్రకరణము.

హిమాలయ్కారురాజ్యమునకు రాజధానియగు నందూరునగరము నకు నేఁడుక్రోసులదూరమున, మాహురా యనుపట్టణము కలదు. నిత్యకళ్యాణపద మగు పచ్చనియడవినడుమ నాపుర ముండుటచే నుద్యానవనమందలి మేడలాగు ముద్దులు మూటగట్టుచు నుండుటయేగాక వృ

థిగ్రిస్తులకు నిరామయత నొసంగు నారోగ్యస్థానమై యలరుచుండును. దానికి మూఁడుక్రోసులదూరమున వింధ్యపర్వతసంబంధము లగుకొండలచే నావరింపఁబడి యొకగూఁడెము కోటనడుమనున్న పల్లెవలె సురక్షితమై యుండెను. ఆపల్లె కులవృత్తివలన జీవించు గొల్లలకు నివాసస్థానమై వారికిఁ గామితసౌఖ్యప్రదాయిని యయి యుండెను. ఆగొల్లలచే భగవదవతారమని పూజింపఁబడుచు మాహూనగరవాసులచే నాగతానాగతవేదియగు మహర్షి యని యెన్నఁబడు నొకవృద్ధుఁ డుండెను. ముడుతలుపడిన మొగమును, నాకులన్నియుఁబండి రాలినవెనుక మోడగు చెట్టువలె నున్నవయి వెండ్రుకలులేకయున్న శిరస్సును నాతఁడు కాలము దీఱినవాఁడని వేనోళ్ళఁజాటుచున్నను నాతని యద్భుతదార్ఢ్యమును దంతపటిమయుఁ జెవుడురామియుఁ గమనవేగమును నతఁ డంత యీడుగలవాఁడా యని సందియము గొలుపును. కొంచెము రేచీఁకటి తప్ప నేత్రరోగముగూడ, పగఁటివేళల, నిద్రియులేదు. కనులయెదుట బంధుగణమెల్ల నశించుటయుఁ దనకుఁ జిరాయువు కలుగుటయుఁ జూచి యావృద్ధుఁడు తన ముప్పెట్లుగడచునని చింతించుటప్పుడప్పుడుకలదుగాని మూఢభక్తిగల గొల్లలు మహానుభావుఁడని వాని కెల్లోపచారములు చేయుచుందురు. దిక్కులేనివారికి దేవుఁ డేదిక్కైనఁ జూపునుగదా! గొల్ల లందఱు మహర్షులు వసియింపఁదగు పర్ణశాలవలె నొక కుటీరమును నిర్మించి యం దాతని నుంచిరి! శతవత్సరపూర్ణుఁడయినను మనోబలము చెడనివాఁడగుటచే రాజకార్యములయందుఁగూడ నతనియాలోచనమమోఘము. పూర్వకాలపుసంగతుల నెఱుఁగఁగోరినవారును, క్రొత్తపనులఁ దలపెట్టి యవి నెరవేఱునో లేదో యనుసందేహము గలవారును నీవృద్ధు నడిగి వానియిచ్ఛాప్రకారము వర్తింతురు. ఒకనాఁడు సాయంకాలమున గడియరాత్రియైనతరువాత నొకపడుచువాఁడు సత్యఋషియని ప్రసిద్ధికెక్కిన వృద్ధునియొద్దకుఁ బాదచారియై వచ్చుచుండెను. వంపులు

తిరిగి తుమ్మెదరెక్కలతో నెక్కసక్కముసేయు మీసములసొరును వెడఁదనుమరు పోయగమును, చెవులస్పృశించు కొనలుగల కనులతీరును చక్కనివారిలోఁ జక్కనివాఁడని యతనికి బిరుదునామము గలుగుటకుఁ గారణములయ్యెను. యౌవన మంగసౌష్టవమును బరిపూర్ణముసేయ విద్య గుణసౌష్టవమును బూర్ణముజేసెను. చిన్ననాఁటనుండియు సాముకసరతులు చేయుటచే దండలు తిరిగినభుజములును, విశాలవక్షమును, మూర్తిని నేత్రపాత్రములుగఁ జేసినట్టులె విద్యవలనఁగలిగిన శాంతము, సువర్తనయుఁ గీర్తిని సుజనస్తోత్రపాత్రముగఁ జేసెను. బలమునకుఁ గార్యములయందలి చలము వానికినన్నెఁ దెచ్చెను. చుట్టుజరీగల యెఱ్ఱతలపాగయు, పచ్చపట్టంగరకాయు, తెల్లని మడుపుదోవతియు, వల్లెవాటుగనిడ్డ యుత్తరీయమును వానియలంకారమును సమాప్తముచేసెను. ఆవన్నెకాఁడు సత్యఋషికుటీరమును ప్రవేశించి తలుపుఁదోసి ప్రత్యుత్తరము రానందున నచట నిలువఁబడియుండెను. వృద్ధుఁడు లోన నెవరితోడనో గుసగుసలాడుచున్నట్లు శబ్దము వినవచ్చెను. ఆమాటలు వినఁబడకమున్నే శ్యామసుందరదత్తు మరల తలుపుఁ దోయుటచే ఋషి తననిమిత్తమెవరో వచ్చినారని లోపలనున్న మనుష్యుని వెడలిపొమ్మని యానతిచ్చి తలుపుఁదీసెను. అంతట వృద్ధుఁడు శ్యామసుందరుని రమ్మని పిలువ నాతఁడు కుటీరము వెడలి ముసుఁగువేసికొని చనుచున్న యతిదీర్ఘకాయుని, మహాసత్త్వుని దేరిపారిచూచుచు వెంటనే లోనికింజనఁడయ్యెను. ఆపురుషుఁ డెవ్వండయియుండునని యోజించి శ్యామసుందరుఁడు లోనికిఁజని లెక్కకుమించినచిరుగులతో నేలవేయఁబడియున్న ప్రాఁతకంబళముపై వృద్ధుఁ డొసంగిన యాతిథ్యమునకు సంతసించి కూర్చుండెనతరువాత వారొకరితో నొకరిట్లుమాట్లాడిరి.

ఋషి—నాయనా నీ వెవ్వరిచే నంపఁబడి నానిమిత్తము వచ్చినావు? నీ పేరు శ్యామసుందరదత్తు కాదా?

శ్యామ—ఔను. రాధాకాంతరావుగారు మీదర్శనముచేసి యా యన మొన్న మనవిచేసిన యంశమును గూర్చి మీ రాలోచించిరేమో యని తెలిసికొనిరమ్మనిరి.

ఋషి—(తలయూచి) ఆ, నే నావిషయమై యోచించినాను. తుద నెగ్గుట కష్టసాధ్యము.

శ్యామ—కష్టమునకునేమి? వారిధనముఁ దినుచు మేము వారి పక్షమునఁ గష్టపడుదుము. శ్రమకేమియు సంశయింపము.

ఋషి—మీ రెంతికృతజ్ఞతతోఁ బనిచేసినను నామె స్త్రీకదా, పురుషులపైఁ గక్ష వహించి తుదనెగ్గుట యసాధ్యము. నే నిట్టి వెన్ని చూచినాను? ఆమె జస్వంతరావు చెప్పినట్లు వినుట మంచిది.

అని, యాతఁడు తనయభిప్రాయ మొక్కిఁగింప దత్తునకు ముఖవి కాసము రవ్వంతమంద మగుటఁ గనిపెట్టి ఋషి యాతనికి ధైర్యము క లుగునట్లు మరల "అయినను దైవము మన పక్షమున నున్నాఁడు. హో ల్కారువంశమును మొదటినుండియు నెఱిఁగిన నేను మనరాణి గెలుచున ట్లు నాయాశీర్వచన మొసఁగెద" నని హెచ్చరించెను.

శ్యామ—అయ్యా! మీరు రాణిగారిపూర్వుల నెఱుఁగుదురా? మీవయ సెంత?

ఋషి—నావయ సెంతయున్నదో నే నెఱుఁగను. సంగతులను బట్టి తెలిసికొనుము.

శ్యామ—మీరు శివాజీమహారాజు నెఱుఁగుదురా?

ఋషి—సరిసరి నాకర్మముకాల, నేను శివాజి నెఱుఁగకపోవుటె నా? అతఁడు మృతినొందునప్పటికి నేను పందొమ్మిదేండ్లవాఁడను.

శ్యామ—శంభాజీ, సాహుమహారాజులను జక్కఁగా నెఱుఁగుదురని నేఁ దలంచుచున్నాను.

ఋషి—బాగున్నది. సాహు మొన్నటివాఁడు కాఁడేటయా? నాకనులముందరఁబుట్టి, నాకనులముందట మృతినొందినవాఁడు.

శ్యామ—ఔరంగజేబును మీరు స్వయముగా నెన్నఁడైనఁ జూచినారా?

ఋషి—అలంఘురునుజూచినారాయని యడుగుచున్నావా? అలంఘురు సేనలతో యుద్ధము చేసినవా రెవరు? నేనుకానా?

శ్యామ—పీష్వా బాలాజీ విశ్వనాధులఁగూర్చి మిమ్మడుగ నక్కఱయే లేదు వారందఱు మీకు లెక్క లేదు.

ఋషి—నిన్నటివాండ్రి సంగతి నన్నడిగెదవేమి? పూర్వాంశముల నేమయిన నడుగవలసినయెడల నడుగుము.

శ్యామ—మలహారురావు హోల్కారుగాం బాల్యము మీరు చక్కఁగ నెఱుఁగుదురు కాఁబోలు.

ఋషి—మలహారురావుగాదు. ఆయనతండ్రియు నేనును మిగుల స్నేహితులము.

శ్యామ—అట్లయిన నూఱుసంవత్సరముల యీమధ్య మీ రెఱుఁగని యంశములు లేవు. మీరు జాంబవంతునికన్న నేమాత్రిమో కొంచెము పెద్దగా గనుపించుచున్నారు.

ఋషి—ఎన్నియెఱిఁగిననేమి? ఎంతవయస్సున్న నేమి. ఈమెకు సహాయమొనర్పఁగలిగితినేని నాజన్మము ధన్యతఁగాంచును. కృతజ్ఞులామె చుట్టును లేరుగనుక యీమె నిరపాయమయినస్థితిలో లేదు.

శ్యామ—(తొందరతో) ఎవరు కృతజ్ఞులుగారు?

ఋషి—ఎవరునుగారు. రాహోజీ, దౌలతరావు, గోమోజీ దక్క తక్కినవా రెవ్వరును గృతజ్ఞులుగారు. రాధాకాంతరావుగూడ మంచివాఁడని చెప్పవచ్చును.

రాధాకాంతరావువిషయములో ఋషి పలికిన సందిగ్ధవచనములు శ్యామసుందరుని మనసునకుఁ గొంత వ్యాకులపాటుఁ గలిగింప నదివఱకు తాను కన్నులారఁ జూచుచుండినదానికి నేఁడు చెవులారవిన్న దానికిఁగల వ్యత్యాసమునకుఁ గారణమూహించుచుండెను. మార్పునొంది నవాఙ్ముఖుఁడై ఋషి నవలోకించి ఋషి యేమో మరలఁ బలుకఁబ్రయత్నించుచు తనపెదవులఁ గదపుచుండ నంతలో కుటీరపువాకట "అయ్యో! అయ్యో! నిష్కారణ మిద్దఱుము చచ్చిపోవుచున్నారు. రక్షింపుఁడు రక్షింపుఁడు. కటకటా! ఆఁడుదిగూడ దారుణమగు వధపా లగుచున్నది, రండి రండి" అని యొకఁడో యంగలార్చుచుఁ బనుగత్తసాగను. కరుణార్ద్రహృదయుఁ డగు శ్యామసుందరుఁడు యోగితో సంభాషణము మాని యోగియింట గోడపైనున్న చిలుకకొయ్యకుఁ దగల్పఁబడినవిల్లును నమ్ములంగొని మొలలోనున్న చిన్నకైజారు నూడఁబెఱికి యాస్థలమువంకఁ జనెను. ఋషి యార్తనాదము సేయు నాపురుషుఁ బిలిచి యాపదనొందినవా రెవ్వరనియడిగెనుగాని వాఁడు పేరుఁజెప్పకయే దత్తును వెంబడించిపోయెను. అపుడు ఋషి తనలో "ఈదినమునసో కేపో యాతఁడు వచ్చునని తెలిసినది. ఈయదృష్టహీనుఁడు వాఁడై యుండఁడుగద" యని వితర్కించుకొని యెద్దియుందోఁపమి యిటునటుఁ దిరుగులాడుచు నెందుచేతనో యాస్థానమునకు మాత్రము మఱుగక తామరాకులోని నీరుతీరున తటతటఁ బరితపించుచుండెను.

మూఁడవ ప్రకరణము.

రాహోజీహుల్కారున కప్పటికి నేఁబదిసంవత్సరములకంటె నొకటి రెం డెక్కువయుండెనేకాని తక్కువ లేవు. చిన్నతనమందు మలహారురావు హోల్కారునకుఁ దమలపాకుమట్టలు, దుస్తులు నందించు

నీచసేవకకోటిలోనివాఁడై యాప్రభువు ననుగ్రహమునకుఁ బాత్రుఁడై సైన్యమున నొకసర్దా రయ్యెను. తెలివితేటలుగల మహారాష్ట్రుఁ డగుటచే నతిత్వరితముగ రాజ్యమునందున్న ముఖ్యోద్యోగస్థులలో నొకఁడై మలహారురావు చనిపోవునప్పటికిఁ బ్రధానవర్గములో నొక్కఁ డయ్యెను. ఈతఁడు సత్కులీనుఁడును, సదాచారుఁడును, గాకుండినను మిగుల ప్రజ్ఞగలవాఁడు. అందు యుక్తులకుఁ బెట్టినది పేరు. మోసమున నితనిఁ జెప్పి మఱియొకరిని జెప్పవలయును. అతఁడు సౌందర్యములేని నల్లని మోటమనుష్యుఁడని చెప్పటకంటె వానియాకారము వర్ణింప నక్కఱలేదు. ప్రథమకళత్రము వియోగ మొందుటచే మరల వివాహ మాడఁ బ్రయత్నించి తనప్రియమిత్రుఁడగు హరిహరపాండ్యాజీ సహాయమున సౌందర్యరాసియగు నొక కన్యం జేకొని మఱికొన్ని రాజకార్యవిషయములగు నుత్తరములు సంగ్రహించుకొని యిందూరునగరమునకు వచ్చుచుండెను. ఆరాత్రి యెట్లయిన మహాపురముఁ జేరవలయునని నిశ్చయించి ప్రొద్దుపోయినవెనుకఁ గూడఁ బయన మొనర్చుచుఁ దాము వచ్చునప్పటికి వంటకములఁ జేయించి సిద్ధముగ నుంచుమని ముందే రావు నంపెను. పల్లకీయందుఁ బదునెనిమిదివత్సరములవయస్సుగల సుందరియొర్తు గూర్చుండి తలుపు లించుక తెఱచి చుట్టునున్న కొండలను, మహావృక్షములను, నిష్కలుషమైన యాకాశమును జూచుచుండెను. ఓంకారనాదములతో బోయలు పల్లకీమోయుచుఁ దనవెంట రాఁగా రాణోజీపల్కారు గడియగడియకు సకిలించుచు నలసి మోయలేక యెన్నమోయుచున్న గుఱ్ఱమునెక్కి యిరుప్రక్కల నిరువు రాయుధపాణులగుభటులుగొల్వ బడలికతోఁ బయన మొనర్చుచుండెను. మార్గశ్రమచేఁ జెన్నుచెదరి విసిగియున్న యాసుందరి పల్లకికి సరిగా మధ్యమధ్య నొకమాఱు తనగుఱ్ఱమును దడిపించుచు "కమలా నీవు మిగుల శ్రమపడినట్లున్నావు. వచ్చినంతదూరము రానక్కఱలేదు. కావలసి

యెడల నాదగ్గఱనున్న రొట్టెలు నాల్గుతినుము” అని యూరార్పుమాటలు పలుకుచు వడిగ నడుగులు వేయుమని బోయలను హెచ్చరించుచు రాణోజీ రెండుగడియలరాత్రికి ఋషి వసియించు ప్రదేశమునకు సమీపముగ వచ్చెను. అది కృష్ణపక్షమున కారంభ మగుటచే నాపాడ్యమి నాఁడు చంద్రోదయము రెండుగడియల కగుచుండెను. తూర్పునఁ దెల్లదువ్వలువఁ బఱచినట్లు రేఖలు గానఁబడెను.

అట్లు పయనముచేయు నామనుష్యులయెదుట చెవులు బ్రద్దలగునట్లు మోరయెత్తి ఘుశ్శిల్లు ఘుశ్శిల్లుమని ఱంకెవేయుచు నొకవృషభము కాలిడెక్కతో నేలద్రవ్వి దుమ్మురేఁపుచు భయంకరాకారముతో దారికడ్డముగనిలిచియుండెను. మార్గమునుండి యాయెద్దు మొద్దువలెఁ దొలఁగనందునఁ దాముపోవుటకు నెద్దును బెదరింపుమని రాణోజీ తనసేవకులలో నొకనినాజ్ఞాపించెను. మందబుద్ధియు మోటచొరవయుఁగల నాసేవకుఁడు ద్విపాదపశువుగనుక నాపశువును బెదరఁగొట్టుట కుపాయమేదియులేక తనపైనున్న యెఱ్ఱగుడ్డవిప్పి హుఱాత్తుహుఱాత్తని యాగుడ్డ దానిపై వేయఁబోయెను. ఆపశు వదివఱకొక కారుదున్నపోతుతోఁ బోరాడి దానిచే గాయములు తగుల నొచ్చి కడుఁగోపముతో నుండెను. అంతలో గుఱ్ఱమొకసారి సకిలించెను. బోయలోంకార మెక్కువచేసిరి. ఎఱ్ఱగుడ్డఁ జూపుటచే బెదరి, బోయల యోంకారముచేఁ గలవలపడి గుఱ్ఱపుసకిలింపుల సహింపనోపక నాలపోతు మార్గస్థుల గుండెలు వ్రక్కలగునట్లు ఱంకెవేసి రభసంబున వారిపైఁబడెను. దీనికంతకుఁగారణుఁడైన మూర్ఖసేవకుఁడు దానిబారినుండి తప్పించుకొని యావలఁబడెను. ఆమనుష్యుని వెనుకనే వచ్చుచున్న రాణోజీపై నాజంతువుదుమికి మునుముందు నడువలేక సగముచచ్చినయశ్వముపైఁబడి దానిని నేలఁగూలఁద్రోయ వాహనముతోఁ గూడనాతఁడును నేలఁ గూలెను. కూలినతోడనె యాతఁడు లేవఁబ్రయత్నించుచుండునంతలో గుఱ్ఱముమీఁద నుండి యాతనిమీఁదికి దుమి

యప్పాపపుఁబశువు దేహమెఱుఁగక సూదిమొనవలె వాడిగనున్న కొమ్ముతో నాతనిగుండెలమీఁదను డొక్కలోను, నెమరకణతిమీఁదను గుచ్చిమ్మతనయిచ్చవచ్చినట్లు గాయములుచేసి వెడలుకొన్నెత్తురుతోఁ దనకొమ్ముల నలంకరించుకొనెను. సేవకు లిరువురును భయకంపితులై యాయుధములు తమంతటఁదామె వారిచేతులనుండి నేలఁబడ వెనుకదిరిగిచూడక పరువెత్తిరి. బోయలు మోయుపల్లకి నచ్చటవిడిచి చెల్లాచెదరై నలుదెసలకుఁ బలాయితులైరి. ఒకనిమిషమున నచ్చటఁ గ్రిందఁబడిన నాయకుఁడును, పల్లకిలోనున్న సుందరియుఁదక్క నెవ్వరు లేరైరి. పారిపోయిన సేవకులలో నొకఁడు తనస్వామిపై జాలిగలిగి ఋషికుటీరము దగ్గఱకు వచ్చి యాఘోరవార్త నచటివారికిఁ దెలుపుటయు శ్యామసుందరుఁడత్తు సహాయార్థము బయలుదేఱుటయు మీరందఱు నెఱుఁగుదురుగదా.

శ్యామసుందరుఁడు కడువేగమున నడచి వచ్చెను. ఈలోన నా స్త్రీ, పడియున్న రాజోజీని, తన యసహాయస్థితినిఁజూచి కదలి మెదలిపోవుటకు నంగములాడక కొయ్యఁయయ్యెను. బోయలు పల్లకిదింపుటయు రాజోజీపై నెద్దుపడుటయు నామె యెఱుఁగునుగాని తరువాత నేమిజరిగెనో యెఱుఁగదు. పండుకొన్న దేహము పండుకొన్నట్లె యుండెను. చూచెడుకన్నులు చూచినట్లుండెను. ఇట్లామె మహాభీతితోనుండ నాయెద్దు కోపాగ్ని చల్లారకపోవుటచేఁ గాఁబోలు చెంగున నాపల్లకిమీఁదఁబడి కొమ్ములతో గుభిల్లు గుభిల్లుమని యాపల్లకిం బొడుచుచు తనమహాబలముచేఁ దానినడ్డముగాఁబడఁద్రోసి దానిపై నెక్కి తన్ని పగులఁగొట్టుచుండెను. ఆనారీమణి స్మారక మెఱుఁగక మొదటమూత్ర మొకకేక వేసి మూర్ఛిల్లి యందుఁ బడియుండెను. దత్తుతత్తరపాటుపడ ననతిదూరమున నామె కేక విని యతిశ్వేతవాహన నచ్చి మహోద్రైత్యము ను జిక్కఁబట్టి వి ల్లుపయోగింప నెంచి యుం దసమాసపజ్ఞగల మహాగాయ్ర...

వరుసగా రెండు బాణముల దాని మొగమున నాటనేసెను. వెంటనే యది రోసముచే పైఁబడనుంకింప నతఁడు మఱి రెండుబాణములను రెండుకన్నులమీఁద గీలింప నది 'యంబా' యని నేలఁబడెను. వెంటనే యాసేవకుఁడు వచ్చి తనకత్తితో దానినఱికె తనయసహాయశూరతఁ జూపెను. అపుడు దత్తు పల్లకి యథాప్రకారముగఁ బెట్టించి తలుపులఁదెఱచి యందు మాటలాడనేరని పోతపసిఁడిబొమ్మయై, నిలుకడఁగన్న మెఱుపుఁదీగయై మన్మథరాజ్యలక్ష్మియై, పడుచువాండ్ర బాధించు హృదయశల్యమై నిశ్చేష్టురాలగు నయ్యతివం జూచి యామెను లెమ్మని పిలువ నామె పలుకదయ్యె. ఆమెను లేవఁదీయుటకుఁ దనకు సహాయము చేయుమని సేవకు నడుగ 'నిద్రపోయెడుదానిని లేపెదరేమి? ఆమెను బండుకొననిమ్ము నీ విటురా' యని వాఁడు మందలించెను. కొంచెము చల్లని నీరు తెమ్మని సేవకు నంపి తానె యమ్మగువను సందిటఁబట్టి కూరుచుండఁబెట్టి పడకుండ నామెను దానుఁగూడఁ బట్టుకొని యుండెను. ఆమె జీవచ్ఛవమై మాటయుకదలికయు లేక యెటులుంచిన నటులుండెను. మేనెల్లఁజిఱుచెమ్మటలు గ్రమ్మి కణములుగాఁబరిణమించి మొగమున ముత్యాలుపెట్టినట్లు వింతవిన్నాణము నొసంగెను. విలాసార్థ మామెకొప్పున గ్రుచ్చిన మల్లెపుష్పములు నలుదెసలుజాఱె యామెవలె పసివాడియుండెను. వట్రువలయి పెద్దవగు పిఱుఁదుల స్పృశియించి నిడుదవెండ్రుకలు మొగమ్మునంతయు గ్రమ్మునట్లు చీకాకుపడుటచే నామెవదనము భూచ్ఛాయతోఁగూడుగ్రహణకాలచంద్రునివలె నుండెను. చెమటలచేఁ గరఁగి మొగమంతయు వ్యాపించిన కుంకుమబొట్టుముఖారవిందమున కొక్కయారుణ్యమును దెచ్చి సంధ్యారాగములోనున్న చంద్రమండలము లాగు మొగమునకు వన్నెపెట్టెను. బెదరిన లేడికన్నులవలె చలించు నేత్రములును, భయమున వడఁకు గాత్రమును, నందకత్తియల గరువ మడం

[illegible] మోవియు [illegible]యందమున

వింత యందముచేయు నొడలెఱుఁగని స్థితియందుండియు నామె మోహినీదేవివలె నుండెను. సుందరాంగ లెట్టియవస్థలోనున్నను స్తోత్రపాత్రలె కద! శ్యామసుందరుడత్తు కమలాబాయి మొగమువంక కోరికలూర కన్నుల కఱవుదీఱ నూహా లెంతదూరమో పార పలుమారు తెప్పవాల్పక చూచి యామెకు సముచితోపచారములఁ జేసెను. ఇంతలో సేవకుఁడు నీరు దెచ్చుటయుఁ జల్లని యాజల మామె మొగమునఁ గొట్ట నామె కొంత సేదదేఱి కొంచెము నీరుద్రావి మఱల సొమ్మసిల్లి తిరిగి కొంత యుదకముఁ గ్రోలి కనువిచ్చెను. కనువిచ్చి యాసుందరి భువనసుందర విగ్రహుఁడగు శ్యామసుందరుఁ గనుఁగొని సిగ్గునఁ దలవంచి పరపురుషుని యెదుటఁ గూరుచుండుట కిష్టములేక మెల్లగా లేచి యావలకుఁ జరిగి క్రిందపడిన యుత్తరీయము మేనిముసుఁగుగా వేసికొని యాతఁ డెవఁడా యని యాలోచించుచు ప్రభు వెట్లుండెనని సేవకు నడిగెను. ఈనడుమ శ్యామసుందరుఁడు రాఘోజీయొద్దకుఁబోయి శరీరమునిండ గాయములఁ జూచి యాతఁడు జీవించుట యసాధ్యమని యెంచియుఁ దగుచికిత్స చేయఁదలఁచి మెల్లఁగ దానును సేవకుఁడును వాని నెత్తి పల్లకిలోఁబరుండఁబెట్టిరి. అప్పుడు రాఘోజీ 'నాభార్య నాభార్య' యని మెల్లగా నన "నీభార్యను రక్షితముగ నున్నది. భయములే"దని దత్తు ప్రత్యుత్తరమొసంగి రెండుగుడ్డలు మసిచేసి యా గాయములకుఁ గట్లుకట్టెను. ఆరెండుమాటలు గాక యెన్నిసారులు పిలిచినను రాఘోజీ పలుకక తనలోఁ దాను పలుమాఱు పలవరింపఁదొడంగె. సేవకునివలనఁ దనప్రభు వింకను సురక్షితుఁడని యెఱిఁగి కమలాబాయి "ఇంకను జీవించియున్నాఁడా, దైవమునకు నాపై నింత కోపముండ నాకు సుగతి యెట్లగును. ఎప్డు నాకు బూర్ణముగ నుపకారము చేయలేదు. నన్నుఁ జంపనను మేలుగా నుండును." అని తనలో విచారించెను. ఇంతలో బోయలు తిరిగివచ్చుటచే రాఘోజీని పల్లకిలో మోయించి గూడెమునుండి

బాడి తెప్పించి కమును నందుఁగూర్పుండఁబెట్టి వారినందఱిని మహానగరమునకు శ్యామసుందరదత్తు తీసికొనిపోయెను.

నాల్గవ ప్రకరణము.

మహానగరమునందు మురళీధరదాసను నొక మనుష్యుఁడు సుందరియు గుణవతియునగు నానందబాయియను భార్యతోఁ గాఁపురము సేయుచుండెను. అతఁడు పిల్లలుగలవాఁడును బీదవాఁడు నైనను గొంచెము వ్రాఁతచేర్చినవాఁ డగుటచే వ్యాపారస్థుల్లను నూరువాడీ సత్రాలకుని యొద్ద లెక్కలువ్రాయుచు స్వల్పజీతమును గ్రహించుచు మిగుల గౌరవముకలిగి కాలక్షేపముసేయుచుండెను. ఆనందబాయి యిప్పటికి ముప్పది వత్సరములు వయస్సుగలదై మగనికంటె మూఁడు సంవత్సరములు చిన్నదై యుండెను. మురళీధరదాసు పొడుగుగ నుండునుగాని బక్కపలుచని పసిఁడివన్నెగల శరీరముతో నందగాఁడని పేరొందినవాఁడే. రమారమి జాముర్రాత్రి యగునప్పటికి శరీరమెఱుఁగక పడియున్న రాణోజీని, దిక్కులేక భయవివశురాలైన కమలాబాయిని, వెంటఁబెట్టుకొని శ్యామసుందరదత్తు మహానగరముఁ బ్రవేశించి మురళీధరదాసు గృహమునకు రమ్మని బోయల కానతిచ్చి తాను ముందుగా నాగృహమువైపు జనెను. భోజనముచేసి భాగవతము చదువుకొనుచున్న మురళీధరునియెదుట శ్యామసుందరుఁడు నిలువ నతఁ డమితానందమునొంది భార్యను బిలిచి “మన దత్తువచ్చినాఁడు. మనదత్తు” అని యఱచెను. ఆనందబాయి చాలకాలము క్రిందటఁ జూచుటచే దత్తును జేరరమ్మని “ఏమి నాయనా యింతకాలము జాగుచేసినావు” అని తలపైఁ జేయివేసి నిమిరెను. “అక్కయ్యా! నారాకకేమిగాని శ్రీరాణీ యహల్యాబాయిగారి కొలువులో గొప్ప యుద్యోగియగు రాణోజీ, చచ్చుటకు సిద్ధముగ

నున్నాఁడు. అతనితో భార్యకూడ వచ్చినది. వారివిషయమై మన మతి జాగ్రత పుచ్చుకొనవలెను" అని జరిగినవృత్తాంతమంతయుఁ దన భావకును సోదరికిని దెలియపరచెను. అంతలో మనకమల యెక్కిన బండియుఁ బల్లకియు వచ్చినందున నిస్స్పృహలండగు రాణోజీని మెల్లమెల్లగఁ జేతులమీఁద వేసికొని లోపలికిఁ దెచ్చి యొక గదిలో నొకపరుపు మీఁదఁ బండుకొనఁబెట్ట పాపము రాణోజీ మూలుగుటయె గాని బాధ యిదియని చెప్పనేరక పిలిచినఁ బలుకక ప్రక్కపైఁ గొట్టుకొనసాగెను. వారారాత్రి యొక్క వైద్యుని రప్పించి యాతనిఁ జూపగా నతఁడు పెదవి విఱచి, "రోగి బ్రతుకుట దుర్లభ" మని చెప్పెను. ఆనంద బాయి కమలాబాయిని మిగుల గౌరవముగ లోనికిఁ దెచ్చి కొంచె మెంగిలిపరచి దుఃఖభారమున నాత్మహత్యఁ జేసికొనునేమోయని తను మెలఁకువతోఁ గాపాడుచు నామె నొక నిమిషమును వదలక సణుమనణుమ నామె యందమున కాశ్చర్యమునందుచు, "కాకి ముక్కునకు దొండపండుఁ గట్టినట్లు ముదివాని కీచిన్నదానిని తల్లిదండ్రు లెట్లిచ్చిరో కదా? ఆముసలివానితోనైన నింత పసపు కుంకుమ బెట్టుకొని పదికాలములపాటు కాఁపురము జేయనీయక దైవమామెకు ఘోరవైపరీత్యముఁ దెచ్చిపెట్టుగాఁబోలును. ఈరూప మడవిఁగాచిన వెన్నెలయగునా" యని విచారపడుచు నామెపైఁ జేయివైచి పండుకొనెను. రాణోజీస్థితిఁజూచి మురళీధరదాసతనితమ్ముఁడగు దాదుగావునకు నొక మనుష్యునిచే వర్తమానమంపెను. ముందు రాణోజీకి వంటచేయుటకుఁ బంపఁబడిన దుండిరావు గంజాయిదుకాణమున దిట్టముగ గంజాయిద్రాగి మెలఁకువలేక పండుకొనియుండ మార్గమున నెద్దును బెదరించిన లక్ష్మణుఁడు దుకాణమునకు గంజాయికిఁబోయి దుండిని లేపి జరిగిన వృత్తాంతమును జెప్పి పంపెను. దుండిరా వచ్చటికి వచ్చి, తనయజమానునకు సహాయమెద్దియు నెవర్పఁజాలక యాతని నాధారముగఁ జేసికొని తాను బన్నిన

పన్నుగడలన్నియు వ్యర్థములయ్యెనని చింతించుచు నిద్రపోవలేక రెండు కునుకులు కునికెను. ఈనడుమ నానందబాయి కొంచెము కన్నుమూసి నందున పలువిధములగు తలఁపులు మనసునమల్లడిగొనుటచే తెప్పపాటు లేక నిట్టూర్పువిడుచుచు కమల లేచికూర్చుండి కన్నులనిండ ముక్తాఫల ములవలెఁ గ్రిందుకొనియున్న బాష్పములు మాటిమాటికిఁ దుడుచుకొ నుచు మిగుల దుఃఖించుచు, 'అమ్మా నీవెంతకఠినురాలవు నీవునాకుఁ జేసి న యీద్రోహమునకు నేనీజన్మమున మఱలమీదగ్గఱకు రాను. అంత మీదుమిక్కిలివచ్చిన నిచ్చటనే శరీరసమాప్తముఁ జేసెదను. దైవమా! నాకేలమరణము కలుగఁ జేయవు? ఆయొద్దు నన్నేలఁ గ్రమ్మకపోవలె? ఈయునపని యెట్లయినను చేసు దురదృష్టవంతురాలనే" యని వగచుచుం డెను. అంతలో నానందబాయి మేలుకొని ప్రక్కలోనామె లేకుండుట కుఁ గలవలపడి లేచి దూరమునఁగూర్చుండిన యాకన్నియంజూచి తన యజాగ్రత్తవలన నపాయ మప్పటికి రానందుకు సంతోషించెనుగాని యి ప్పుడప్పుడె తొందరతోఁ దనకన్నీళ్ళగపడకుండఁ గమల తుడుచుకొనినను నామె దుఃఖించుచున్నట్లు లావంద తెలిసికొని మితిమీరిన జాలిచే నామె దగ్గఱకుఁ జని స్త్రీయగుటచే స్వాభావిక లక్షణము పోకుండఁ దానుకూ డఁ గంటఁదడిఁ బెట్టుకొని, "అమ్మా! యేల వాపోవుదు? నీముఖ సౌం దర్యమును నీవిలాసమును జూడఁగా మఱియొక యుపద్రవము జరుగఁ గూడదని నాకుఁ దోఁచుచున్నది. అయినను విలపించినఁ గార్యమేమి? నీభర్త ప్రాణములవిషయమైగాక మఱియేవిషయమైనను నాతమ్ముఁడు నీ కుఁ గావలసిన సాయము చేయును. అతఁడుమంచివాఁడు" అని యూర డించెను. కమల యప్పుడు తన వెనుకటి యవస్థయెల్ల మనసునఁ దట్టు టచే నొకమారామె యొడిలోఁ దలపెట్టుకొని గట్టిగ రోదనమొనర్చి, "అమ్మా! నీవు మాతల్లి వంటిదానవు. నీతమ్ముఁడు మిగుల మంచివాఁ డు. అన్నివిధముల నంతటివానిఁజూచి యెఱుఁగను. ప్రాణములు నిలిపిన

మహాత్ముఁడతఁడు కాదా? ఎన్నటికైన నాకతఁడే దిక్కని నేను నమ్మి కొనియుంటిని" అని పలికెను. ఇంతలో శ్యామసుందరదత్తుతలుపుఁ దెఱచి గదిలోని కరుదెంచుటచే వారిసంభాషణము ముగిసెను. కమలయా తనిఁజూచి చటుక్కున లేచి గోడకుఁజేరి నిలిచి సిగ్గునఁ దలవంచి పదాంగుళముతో నేలవ్రాయుచుండెను. ఆమెవైపు చూడ్కినిగుడించి దత్తు తన సోదరితో, "అక్కయ్యా! రాణోజీగారికి రవ్వంత నిలబాటు చేసినదని తోఁచుచున్నది. కుదురవచ్చునని నాకాశకలదు." అని తనరాకచే వారి సంభాషణ యాఁగినదనియుఁ గమల సిగ్గున నిలువవలసి వచ్చినదనియుఁ దానా గదివిడిచి వీథిలోనికిం జని యేమియుఁదోఁచక యిటునటు పచారుచేయుచుండెను.

అప్పుడు రెండుజాములు రాత్రికంటె నధికముగఁ బ్రొద్దుపోవుటచే వీథులలో నెవరును లేరైరి. పిండియారబోసినటుల వెన్నెల ధవళధవళమై వ్యాపించియుండ నున్నతసౌధములయొక్కయుఁ దమయింటి కావలనున్న దేవాలయముయొక్కయు నీడలు వీథిలోనికి వ్యాపించి యసమానమైన సౌందర్యము నొలికించుచుండెను. ఆ వెన్నెలకెరటములలో మునిఁగి యానందము నొందుచు శ్యామసుందరుఁడా సాయంకాలము తన హృదయము నపహరించిన దొంగను బలుమాఱు దలఁచుకొని మనస్తాపము నొందసాగెను. 'అహహా! ఏమి యాకమలసోయగము! ఆమెసార్థకనామము నిజముగ లక్ష్మియె. వేయిజన్మములకైన నేనీమెను మఱువఁజాలను. ఈమె నాయది. ఎంతవెఱ్ఱివాఁడను పరధనమైనయామెనునాసొత్తనుటకంటె వెఱ్ఱియేమున్నది? ఈరాణోజీ చావక బ్రతుకునా? ఛీఛీ! మోహపాశమునఁ దగిలి పాపమునకు పుట్టుడు దుఃఖములోనున్న యామె భర్త మరణమును గోరుచున్న నాహృదయము వజ్రమాయేమి! అతండు జీవింపక పోయినమాత్రమున నాకామె లభించుటయెట్లు? ఆమె పతివ్రత గదా! అయినను సర్వేశ్వరుఁ డఘటనఘటనసమర్థుఁడుగదా" అని మెల్ల

మెల్లగ లోనికిం జనెను. అక్కడికిం బదునాల్గుమైళ్ళ దూరముననున్న యిందూరు నగరమునకు మనుష్యుఁడుపోయి దౌలతరావును వెంటఁ బెట్టుకొని తెల్లవారునప్పటికి వచ్చెను. దౌలతరావు శవమువలె పడియున్న సోదరునిఁజూచి విలపించి యాతనిఁ బోరుగూర నుండనీయఁజనదని కమలను సహోదరుని బ్రయాణముఁజేసి పల్లకిలో వారినుంచి, దుండిరావును సేవకులు వెంటరాఁ బయలుదేరెను. కమల హృదయ మానందబాయి యొద్దనుండి బయలుదేర నెప్పటియట్లు చింతిల్లుచుండెను. శ్యామసుందరుఁడామెను సాగనంపుటకుఁ గడుదూరము నరిగి, కమలావియోగమున విషణ్ణముఖుఁడై దౌలతరావును వీడ్కొని యింటికిఁ జనెను. కొంతదూర మిట్లు పయనము సాగినతరువాత రాణోజీ మిగులనాయాసమొందఁ బల్లకిఁ జెట్టుక్రింద దింపిరి. దౌలతరావు గుండెలు బాదుకొని యేడ్వ నారంభించెను. కమల నిశ్చేష్టయయ్యెను. పల్లకిలోనున్న రాణోజీ పల్లకిలోనే మృతినొందెను.

## అయిదవ ప్రకరణము.

రాణోజీ పల్కారునకు దౌలతరావు తమ్ముఁడు. వయసున నితఁడు రాణోజీకిఁదమ్ముఁడైనను గుణములయం దతనికి దౌలతరావన్నయనియు, రూపమున నచ్చముగ నన్నగారినోట నుండి యూడిపడినటులుండెననియుఁ జెప్పఁదగును. అభిమానముచే నాతనిభార్యయుఁ బక్షపాతముచేత నతని స్నేహితులును, నీలమేఘశ్యాముఁడని వర్ణింతురుగాని యతఁడు నిజముగ మాలకాకివలె కడునల్లనై యందమనుమాటయైన లేని వికారాకారుఁడు. దుబ్బులవలెఁ బెరిగిన మీసముల నలుపునకు వాని మొగము యొక్క నలుపునకును, రవంతయు భేదముండదు. అతని చక్కఁదన మంతటితో సమాప్తము నొందక యెత్తుగఁబెరిగిన బొజ్జకడుపుతోడను,

శరీరముయొక్క విపరీతపులావృతోడను, గొంచెము దీర్ఘమగుముక్కుతోడను, జూచువారికి నవ్వుఁ బుట్టించుచుండును. అన్నకుఁ గుయుక్తులలో సహాయమై యిరువురును గొప్ప యుద్యోగములు సంపాదించి, హెూల్కారు సంస్థానమున మంచివారని పేరుసంపాదింపక పోయినను దేశమున దుర్మార్గులనకయినను పేరువహించిరి. అట్లుండియు నంతవఱకుఁ దమయేలికవిషయ మేద్రోహమును దలఁచియుండలేదు.

ఇట్లు రావుజీ తనపాలిటి మృత్యుదేవతయైవచ్చిన యెద్దుచే గాయములు దిగిలిపడుచుఁ బల్లకియందు మృతినొంది దొలతురావు శవము నందెయుంచి జాముప్రొద్దెక్కువఱకు కమలాబాయితో నిందూరునగరముఁ బ్రవేశించెను. శవమును దనగృహమునకుఁ గొనిపోక శ్మశానమున కాదారినిదీసికొనిపోయి కమల నింటి కంపి తనభార్య కప్పగింపుమని దుండిరావునంపి బంధుజనులను రుద్రభూమికి రమ్మని వర్తమానమంపి వారు వచ్చినతరువాత తనసోదరునకు యథావిధిగ నగ్నిసంస్కారముఁ జేసెను. అక్కడకువచ్చిన కులస్థులందఱును, “మనుష్యులు కాలముతిప్పినతరువాత వివాహ మాడఁగూడదనియు దైవవశమునకు నెవ్వరేమిచేయఁగలరనియు నంత సుందరికి వివాహమైననెల కీవైధవ్యమువచ్చుట యన్యాయమనియు నామెకీ దురవస్థకే యీశ్వరుఁడీ పెండ్లి సంకల్పించె” ననియు బహువిధముల జాలినొందిరి. దొలతరావు భార్యయగు దుర్గాబాయి పెద్దపెట్టున నేడ్చుచు వీధిగుమ్మముదగ్గఱ కెదురుగవచ్చి తోడికోడలిని, కౌఁగిలించుకొని రోదనముచేసి, “అమ్మా తోడికోడండ్రమని పట్టుమని మనమిద్దఱమును నొకనెలయైనను గాఁపురము చేయమైతిమి. నీవెంత దురదృష్టవంతురాలవో యేభోగ మనుభవింపకముందె, పసపుకుంకుమ్మునైన మనసుదీరఁ బెట్టుకొనకముందె, యొకముచ్చటచ్చట దీరకముందె, పెండ్లియైన నెలకే యీలాగైతివిగదా! అమ్మా! మొదటి పర్యాయమే నిన్నీవార్తలోఁ జూడవలసివచ్చెఁగదా. తల్లీ నీవింకను

వచ్చినతరువాత నిర్దుష్టముగా పురముఁ జేయవలె ననుకొన్నానుగాని యింతవఱకు వచ్చునని యెఱుఁగనుతల్లీ" అని పరిపరిభంగుల సంగలార్చి కమలయుఁ గొంచెము దుఃఖింప నామె నూరార్చి తానూరకుండెను. కమల యెంతచేతనో ధైర్యముఁ జిక్కఁబట్టి యంతవిస్తారముగాఁ బొగలుట మాని గుండె రాయిచేసికొనెను. అగ్నిసంస్కారాదులఁ జేసి దౌలతరావు కర్మ నారంభించి రెండు దినములు గడచిన వెనుక దుండిరావును బిల్చి, కమలనుగూర్చి కొన్ని సంగతులనుగఁదలఁచి యిట్లనియె.

దౌల—ఓరీ! దుండీ! మాయింటి కెంత దుర్దశవచ్చినది. నాకు నాకుడిహస్తము పడిపోయినదగదా, యింక నాబ్రతుకేల?

దుండి—అప్పుడు దైవవశమున కేమిచేయఁగలము? మీకేమి మూఁడేండ్లదామె మీ వదినగారిమాటఁ దలఁచిన నాగుండెలు తాళుట లేదు.

దౌల—ఆహాహా! ఏమి యీయామెయందము! దైవము మిక్కిలి యయోగ్యపుబని చేసినాఁడు. ఇంతటి యందకత్తెను నేనెందును జూచి యెఱుఁగను. ఇటువంటి కన్య యెంత యదృష్టవంతునకు భార్యయగును.

దుండి—(కొంచెమాలోచించి సందేహముతో) ఆమె యెక్కడి కరుగఁగలదు. పాపము! ఇఁకనీవెదిక్కు నిన్నుఁగనిపెట్టుకొని యుండునుగనుక నీవామె సుఖముఁ జూడుము.

దౌల—మఱే. ఆమె నాదగ్గఱనుండునా? పుట్టినింటి కరుగునేమో. అయితే నీమెను మాయన్నగారు వివాహమాడినారా?

దుండి—వివాహమైనప్పుడు నేనక్కడలేనుగాని పెండ్లియైనదని మీయన్నగారు నాతోఁ జెప్పినారు. త్రోవలోఁ దన్నడిగినవారందఱితోడ నీమె తనభార్యయనియే చెప్పెను. పెండ్లియగుటకు సందేహములేదు.

దౌ॥—అయినదా? నేను కాలేదనుకొన్నాను. సరే. ఇఁక విచారమేలేదు.

దుండి—విచారమెందుకు? నాదగ్గఱదాఁచక నీమనసునన్నది చెప్పు. నీకేమైన నాశకలదా? మనకు లాభించునెడలఁ బెండ్లికాలేదని చెప్పదము.

దౌ॥—మిత్రుఁడా! నీవు నాకేమయిన సహాయముఁజేసెదేని యీ కమలను మాయన్న పెండ్లియాడలేదని నేను వివాహ మాడవలయునని యున్నది. నీవు నన్ను మఱియొకలా గెంచవద్దు.

దుండి—నీకుఁ బ్రియముఁజేయుటకంటె నాకు గర్తవ్యమేమున్నది? ఆమెను నయమున భయమున లొంగఁదీసి నీకు వివాహముఁజేయింతు. ఈపదిదినములకర్మముగిసినదాక నోరెత్తబోకు.

అని వారు మాటలాడుకొనుచుండ దుర్గాబాయి లోపలినుండి వచ్చి కమలబాయిదురవస్థకుఁ గొంచెము విచారించి, యామెకెల్లికిలిఁ దమ్మునకును వర్తమానము నంపుమని భర్తతోఁ జెప్పెను. సాధారణముగ నేమి కారణముచేతనోగాని దుండిరావునకు దుర్గయనినదో నొకవిధమైన భయముగలదు. అందుచే నామెవచ్చినతోడనే లేచి యవతలకు మెల్లగా జారెను. తరువాత దౌలతరావు కమల పుట్టినింటికి వర్తమానము నంపుటకు సమ్మతించి తనమనోరథమును భార్యకు నెఱిఁగింపఁగోరి యామె యెడ్ల భయముగలవాఁడగుటచే నవంత సంశయించి యూరకుండెను. దుర్గాబాయి సద్వంశమునఁ బుట్టి సద్గుణములుకల యొకసుందరి. సదాచారుఁడుకాని భర్త సద్గుణపుంజమగు భార్యకు జడియుట స్వభావమేయగుటచేత దౌలతరావున కామె పిఱికిమందయిన ను నీమూర్ఖుఁడు చీవాట్లకు వెఱవక యప్పుడప్పుడు తనమనోరథముల ను నామెకుం దెలిపి యామెచే మందలింపఁబడు నాడుకగూడ గలదు. దౌలతరావు దుర్గను జూచి సంశయమెల్ల విడిచి యిట్లనియె.

దాం—పిల్లలులేనివారికి బ్రతుకు వ్యర్థముగదా! మాయన్నకు బిడ్డలు లేకపోవుటచేత నేనే కర్మచేయవలసివచ్చినది. నాకును బిల్లలులేరు. ఈపల్లారువంశ మింతటితో నాశనమే కాఁబోవును.

దుర్గ—(ఈమాటలువిని సిగ్గునఁ దలవంచుకొని) "మీరెవరినైనఁ బెంచుకొనుఁ" డని ప్రత్యుత్తరమిచ్చెను.

దాం—పెంచుకొనినవారికి ముప్పు గడచుట యరుదు. అంతకన్న తెగించి మఱియొకదానిని బెండ్లియాడుట యుక్తమును. నీకిష్టము యున్నచో నట్లు చేసెద.

దుర్గ—నాకిష్టము యున్నదికాని మీకీవయసునఁ బిల్లనిచ్చువా రెవరు?

దాం—ఇచ్చెడువారెవరు? పిల్ల సిద్ధముగనె యున్నది. నీవను యొుండిన—నది—

ఈమాట లతని నోటినుండి రాఁగానే దుర్గ వెలవెలఁబోయి చూడసాగి, "ఎవరు పిల్లయెవరు?" అని యడిగెను. అప్పుడు దాంతరావు లేచి భార్య చేతులురెండును బట్టుకొని, "నేనొకమాటఁ జెప్పెదను కోపపడక వినుము. కమలను నాకిచ్చి వివాహముఁ జేయుము." అని యింక నేమో చెప్పఁబోవుచుండ దెబ్బఁదిన్న పామువలె బుస్సున లేచి దుర్గ కోపావేశముచేఁ బెదవులు తడఁబడ నిట్లనెను. "ఛీఛీ నీవంటి కఠినచిత్తుఁ బాపకర్ముని నేనెందుం గనలేదు. అన్నగారి చితి తిన్నగఁ జల్లారనైన లేదు. అప్పుడే పుట్టెడు దుఃఖముతోనున్న యాయనభార్య నోదార్చుటకు మారామెను బెండ్లియాడెదనని చెప్పుటకు నోరెట్లువచ్చెను. విధవయని సందేహము లేదు. అన్నపెండ్లాము తల్లివంటిదిగదా యని గౌరవములేదు. నీముఖముఁ జూచినవారికి పంచమహాపాతకములు జుట్టుకొనును." అని యామె నిందసేయుచుండ దాంతరావు మెల్లగ నామెతో "ఆమె నిజముగ విధవయైనచో నాది తప్పే మాయన్న యామెను బెండ్లియాడలేదఁట" యనెను.

దుర్గ—"ఈమాయమాట లెవరునీతోఁ జెప్పినారు? దుండిరావా డేమి? వానియమ్మకడుపు మాడ వానికి మరణమురాదు. ఆకాళికాదేవికి వానిమీఁద దయ. ఆదిక్కుమాలినవాఁడే నాకొంపఁ దీయుచున్నది. ఊరిలో సాటివారు విన్న నేమందురు? ఆమెకు పెండ్లిగాకున్న వైధవ్యమనుభవించుట యామెకు ముచ్చటా?"

అని పలుక దౌలతరావు భార్యను కోపింపవలదని బ్రతిమాలి, "నీకు సవతివచ్చునను రోషముచే నిట్లనుచున్నావు. కోపపడక నాముద్దు చెల్లించు" మని వేఁడెను. దుర్గ యప్పలుకుల కలుక రెట్టింప, "నాతో మీరుమాటలాడవద్దు నాపనిమీఁద నేనుబోయెదను" అని చేయి వదలించుకొని లోనికిం బోయెను. తనకు సవతివచ్చునను నీర్ష్యచేతనో, విధవను పరిణయమాడుటచేఁ గలుగు నప్రతిష్ఠను భరింపలేకయో, దుర్గ మిగులకోపమును విచారమునొంది తనభర్తకుం దనకుఁ జరిగిన ప్రసంగమంతయుఁ బూసగ్రుచ్చినట్లు కమలకుం దెలిపి జాగ్రతగ నుండుమని చెప్పి యామెకు నేసహాయము గావలసినఁ దానుచేసెదనని వాగ్దానముఁ జేసి యంతతోఁ దృప్తిగలుగమిఁ దమయింటిపొరుగుననున్న రాధాకాంతరావు భార్యయగు రోహిణీబాయియొద్దకుఁ బోయి యీవార్త యామెకుఁ జెప్పి, రాధాకాంతునితోఁ జెప్పి సాయముజేయుమని కట్టుదిట్టముజేసివచ్చెను. దుర్గాబాయి దౌలతరావుయొక్క దురుద్దేశముల నెఱిఁగించిన వెనుక కమల మిగుల భయపడుచుఁ దోఁడేలు నోటనుండి విడిపింపఁబడి పులినోటఁ బడితినిగదాయని దుఃఖింప నారంభించెను. మఱునాఁడు రాధాకాంతరాయలు భార్యచే విని దీనురాలగు స్త్రీకి మానహాని రాకుండఁ గాపాడవలెనని నిశ్చయించి, "కమలతో మాటలాడి ర"మ్మని రోహిణి నంపెను. రోహిణియు దుర్గయు నెన్నివిధములనో తరచితరచి యామెవివాహమునుగూర్చియు స్థితినిగూర్చియుఁ దెలియఁగోరి యనేక ప్రశ్నలనడిగిరిగాని యామె తిన్నగాఁ బ్రత్యుత్తరమీయక, "నాకర్మము

నేననుభవింపక తప్పదు. జలమరణమో, యగ్నిమరణమో నామొగ మునవ్రాసియున్నది. నాకు మానహాని కలుగకుండ మీరుమాత్రము చూచుచుండుఁడు" అని యుత్తరముచెప్పెను. ఆమాటలఁబట్టి యామెకు మృతుఁడైన భర్తయెడ గాఢానురాగము గలదనియు నందుచే నామె ప్రాణత్యాగముఁ జేసికొనుననియు నిశ్చయించి రోహిణి మిగుల జాగరూకతతో నుండుమని దుర్గకు బోధచేసి మానహాని సంభవించునెడలఁ దనయింటి కామె నంపుమని నొక్కి పలుమారు చెప్పి యింటికరిగెను. ఆవేళ మధ్యాహ్నము రాధాకాంతరావు దౌలతరావునకు నట్టిదుష్కార్యముఁ జేయవలదని హితోపదేశము చేసెను. ఆహితము మతనికి విషప్రాయోగముగుటచే దౌలతరావు మండిపడి వృద్ధుఁడగు రాధాకాంతుని ననరాని మాటలనెను. రాధాకాంతుఁడు వానిమాటలకుఁ దలవంకించి యీవిషయమున నెంతపనినైనఁ జేయ నిశ్చయించెను. దౌలతరావామెను దప్పక వివాహమాడుటకు నిశ్చయించెను. కమల మానహాని సంభవించునని మృతినొంద నిశ్చయించుకొనెను.

ఆఱవ ప్రకరణము.

---

మహారాష్ట్రప్రభువులలో హోల్కారు కుటుంబము మిగుల గౌరవమునకుఁ బాత్రమైనది. ఈహోల్కారు వంశమును స్థాపనముఁ జేసిన శూరుఁడు మలహారురావు హోల్కారు. ఇతఁడు క్రీ॥ శ॥ 1683 వ సంవత్సరమున జనియించి, మొదటపీష్వాయొద్ద సిపాయిగ బాహుబలాతిశయముచేత వాసికెక్కిన యోధవరుఁడై తన ప్రభువులకు ననుగ్రహపాత్రుఁడయ్యెను. అందుచేఁ బీష్వాయగు బాలాజీరావు వితనికి మాళవదేశమున జాగీరులిచ్చి తనకు లోఁబడియుండునట్లొక చిన్నరాజుగ నొనర్చెను. తరువాత మలహారురావు మఱికొంతరాజ్యము సంపాదించి మాళవ

దేశమునందున్న యిందూరునగరమును రాజధానిగఁ జేసికొని పేరునకు మాత్రము పీష్వాకు లోఁబడినట్లుండి మాటలచేతను నప్పుడప్పుడంపు స్వల్ప బహుమానముల చేతను, దమ లొంగుబాటును దెలియఁజేయుచు, నిజముగ సర్వతంత్రస్వతంత్రుఁడై యథేచ్ఛగ రాజ్యముఁ జేయుచుండెను. కులమున నీచుఁడగు గొల్లవాఁడయ్యు బాహుబుద్ధిబలమున గొప్పవాఁడై మలుహారురావు కొలఁదికాలమున నొకసామంత రాజగుటయె గాక యెల్లవిధముల నైశ్వర్యశాలియయ్యెను. కాని యాతని యుత్సాహవృక్షమునకు మూలము పదలించినట్లు భగవంతుఁడాయన కుమారరత్నమగు ఖాండేరావును స్వర్గలోకమున కెత్తుకొనిపోయెను. ఖాండేరావు మృతినొందునప్పటికి, శతవృద్ధుఁడై కాటికిఁ గాళ్లుచాపుకొనియున్న తండ్రియు మాలిరావను నొక మగ శిశువును, గుణవతియు విద్యావతియునగు నహల్యాబాయి యనుభార్యయు, గుణ ముక్తాభరణయగు ముక్తాబాయి యను కూఁతురునుండిరి. మలుహారురావు మనుమని మనుమరాలినిఁ జూచుకొని పుత్రునిమరచి నిండుజవ్వనమున భర్తృహీనయయ్యుఁ బాతివ్రత్యమె ప్రాణముచేసికొని యొంటిపూఁట భుజించుచు, నేలఁ బండుకొనుచుఁ బుణ్యకార్యములఁ జేయుటచేఁ గాలముఁ బుచ్చుచు వివేకురాలగు కోడలిం జూచుకొని దుఃఖము దిగమ్రింగి యెట్టటో రాజ్యభారముఁ గొంతకాలము మోసెను. తదనంతరమునఁ గొన్ని దినములకు మలహారురావు కాలధర్మము నొంద మనుమఁడగు మాలిరావునకు మంత్రులందఱుఁ బట్టముఁ గట్టిరి. కాని యచిరకాలంబుననె వానికిఁ గాలమాసన్నమగుటచే నతఁడును దండ్రితాతల దర్శింపఁబోయి హోల్కారువంశము నంతటితో నస్తమించునట్లు మగపురుగు లేకుండఁజేసెను. భర్తయు, మామయుఁ గుమారుఁడు నించుమించుగ నొకమారు కాలధర్మమునొందుటయు హోల్కారువంశము నశించుటయు నిందూరురాజ్యలక్ష్మి తనవలె ననాథయగుటయు, జనులు రాజహీనులై

యుంటయుఁ జూచి యహల్యా యబలయయ్యు దుఃఖసముద్రమున మునిఁగియు విధిలేక ప్రజారక్షణార్థమై రాజ్యముఁబూనెను. ఇది యామె మంత్రులలో ననేకుల కిష్టములేదు. ఇష్టములేకున్నను, దేశ మరాజకమై పరరాజులపాలగుటఁ గన్నులారఁ జూడలేక యహల్యాబాయి యంతటి సాహసముఁ బూననలసివచ్చెను.

రాణోజీ పల్కారు మృతినొందిన నాల్గననాఁడు మహూపురము నుండి శ్యామసుందరదత్తు రాధాకాంతరావు గృహమునకువచ్చి ఋషి కిం దనకుజరిగిన ముచ్చటలను రాణోజీ మరణవిధమును దన సహాయ మును దెల్పెను. శ్యామసుందరదత్తుయొక్క తండ్రియగు పరమేశ్వరదత్తు రాధాకాంతరాయునకుఁ బ్రాణమిత్రుఁడై నందునఁ దనమిత్రుని కుమా రుని బాగుచేయవలెనని రాధాకాంతుఁడు శ్యామసుందరునకు నప్పటికి స్వల్పకాలముక్రిందట నెలకు ముప్పదిరూకల జీతముగల యుద్యోగము ను జెప్పించి, యతనికి నెవ్వరు బంధువు లచ్చట లేమి, తనయింటనె భో జనమిడుచు వానినభివృద్ధికిఁ దెచ్చుచుండెను. రాధాకాంతరావు, చనిపో యిన మలహారు రావునకు గుండెకాయయనియు, బహిఃప్రాణమనియుఁ బ్రజలు చెప్పుకొనుటయేగాక వారతనియందమితగౌరవముంచి యతని యాజ్ఞానువర్తులై యుండిరి. రాధాకాంతుఁడు డెబ్బదిసంవత్సరముల కన్న నెక్కువ వయసుకలవాఁడు. అయినను దేహపటుత్వము చెడక దార్ఢ్యముకలిగియుండెను. జీవించియున్నపుడు మలహారురావునకును, నతఁడును మాలిరావును మృతినొందిన వెనుక నహల్యాబాయికిని, రా ధాకాంతుఁడు తనప్రాణములుగూడ ధారపోయునంతటి భక్తికలిగి ని ష్కపటియై వర్తించెను. శ్యామసుందరదత్తు రాధాకాంతునియెడలను నంత కృతజ్ఞతఁ జూపుచు రాణియందు నట్టి భావముంచి పనిఁజేయ సాగెను.

వచ్చిననాటిరాత్రి రాధాకాంతరావు శ్యామసుందరుని వెంటఁ బెట్టుకొని శ్రీయహల్యాబాయి రాణీగారిని దర్శించుటకుఁబోయి వాకిటనిల్చి తమరాక నెఱుంగఁజేయుమని లోనికిఁ బ్రతీహారినంపెను. లోపలకరమ్మని రాణీగారి సెలవైనదని సేవకుఁడు వచ్చి తెలుప నంతఃపురమున నొకగదిలోనికి వారిం గొనిపోయెను. ఆగదిలో ముత్యాల జాలరువలె నఱుమ వేయఁబడిన తెల్ల తెరచాటున నల్లనిబక్కపలుచని యంగనయు నామెకుఁ గొంత వెనుకగఁ బదునాఱు వత్సరముల యీడుగల జవ్వనియొక్కతెయుఁ గుర్చీలపైఁ గూర్చుండిరి. రాధాకాంతరావును శ్యామసుందరుఁడును తెరసమీపమునకుఁ జని యానల్లని స్త్రీకి నమస్కారము గావించి తమకై వేయఁబడిన పీఠములపై సుఖోపవిష్టులైరి. దత్తుఁడిదివఱ కెన్నఁడు నహల్యాబాయిని జూచియెఱుఁగఁడు. కాఁబట్టి, సౌందర్యవతిగాక నల్లని శరీరకాంతి గలిగి సామాన్యస్త్రీవలె సాధారణ వస్త్రములు గట్టుకొని యాభరణములనైనఁ దాల్పక కృశించియున్న యాయంగనను దన యేలికయగు రాణిగఁ గొంతసేపటివఱకుఁ దలంపక రాణి యెంతో వైభవముతో నుండుననియు నిఁకనుండు వచ్చుననియు నెదురుచూడసాగెను. అట్లు వీరిరువురు లోని కరిగి కూర్చుండినవెనుకఁ గ్రొత్తవాఁడగుదత్తునిఁజూచి పడుచుకన్నెయగు ముక్తాబాయి దగ్గఱనున్న గదిలోనికిఁ జనెను. అప్పు డహల్యాబాయి తెరఁదీయించి దత్తును రాధాకాంతుని తేఱిపారఁజూచి, "నీవుమాతో మాటలాడిన దీబాలునివిషయమేనా" యని యడిగెను.

రాధా—చిత్తము. ఈకుఱ్ఱవాఁడే. ఏలినవారు నాయం దెట్టిభావముంచినారో యీబాలునియందుఁగూడ నట్టిభావ ముంచఁదగును.

అని రాధాకాంతరాయలు మెల్లగ నుడువుచుండ రాణికనుల కొలుకులనుండి వేడికన్నీళ్ళ బిందువులు జార నారంభించెను. అంత యూకస్మిక దుఃఖమునకుఁ గారణమేమని వీరాలోచించుచు గొంతసేపటికి గద్గద

స్వరముతో రాధాకాంతరా విట్లనియె. "అమ్మా యేమిది. ఇట్లు మీరుండుటకుఁ గారణమున్నను ధైర్యమూనక విధిలేదు"

అహల్యాబాయియు నామాటలువిని యూరటములేక, "యీ బాలుని ముఖముచ్ఛ్వముగ నాతనివలె నున్నది. హా! మాలిరావూ! నాయనా! నీమరణముచేత నేగదా నేనీ విశ్వాసహీనులగు మంత్రి పశువుల నాశ్రయించుట? హా! తండ్రీ! నన్నేకాకిఁ జేసిపోతివా!" యనియంమె విచారించుచుండ లోపల గదిలోనుండి ముక్తామణులవలె బాష్పములు చెక్కులమీఁదినుండి జార ముక్తాబాయి బేలయై రోదనముఁ జేయసాగెను. రాధాకాంతుఁడు వారి విలాపముచే హృదయము గరుగ రవంతవంతఁ దానుగూడ నొంది యనుచితమగు నాకార్యము మానుల పురుషలక్షణమని కన్నీరుఁ దుడుచుకొని, "అమ్మా యేలిరవారు విలపింప ధైర్యముఁ జెప్పవారెవరు? మాలిరావు మీగర్భమునఁ జిచ్చుపెట్టిపోయెను. ఇది యాజన్మాంతము ను బోవునదియు మరపు నచ్చునదియుఁగాదు. ధైర్యము దెచ్చుకొన్నను మీకే. దుఃఖించినను మీకే. ప్రజలు మీ బిడ్డలు. ఆకుమారుఁడు పోయిన మేమున్నవారము." అని యూరార్చి రాణి కొంత సేదదేరెను. తరువాత వారిట్లు మాటాడిరి.

అహల్య—నేను నీవు చెప్పినట్లు ప్రజలనె బిడ్డలుగ నమ్మికొంటిని గాని వారు నాయందు విశ్వాసములేక రాజ్యమునకు శత్రువులుగాఁ గొందఱున్నారు.

రాధా—అమ్మా! అంతటి పాపకర్ములు, నదృష్టహీనులెవ్వరు?

అహ—నేను నీయందును గంగాధర జస్వంతరావునందును నా యాసలన్నియు నిల్పియుంటిని కాని నాయాస—

రాధా—(తొందరతో) అమ్మా! నావిషయమై మీకు సందేహమేల? ఇదిగో మీపాదములుసాక్షి. నేను నాప్రాణమునకైనను లెక్కసేయను. నావిశ్వాసము మీకు విశదము.

అహ——నేను నీవిషయము చెప్పలేదు. గంగాధర జస్వంతరావునుగూర్చి- నిన్న నతఁడు నాదగ్గఱకువచ్చి కుమారుని పెంచుకొమ్మని నాకనేకవిధముల నుపదేశమొసఁగి నేను రాజ్యము పరిపాలించుట ప్రజల కిష్టములేదని కఠినముగాఁ బలికెను. పురోహితుఁడును మంత్రియుఁ గదా నాకుపకారము సేయుదని దలఁచితినిగాని యిట్లగునని యెన్నఁడెంచలేదు. ఈమాటలు చెవిఁబడ ముక్తాబాయికి మనస్సు మనస్సులో లేక, "జస్వంతరావునకు మా యమ్మగారికిని వివాదము లేకయుండవలెనని నాకోరికె. దైవమా! నీవు వీరికి సఖ్యముఁ గలుగఁజేయుము." అని తన మనస్సున బ్రార్థనజేసెను. రాధాకాంతరావు గంగాధరుని విషయమై మొదటనుండియు సందేహము నొందుచుండుటచే నతని యనుమానము రాణి తెలిపిన సంగతులచే దృఢపరుపఁబడెను. దత్తు రాణిమాటలకు నర్థము స్పష్టముగా నెఱుఁగక, సత్ప్రవర్తనమునకు నిధివలెఁ గనఁబడుచుండు జస్వంతరావు దుర్మార్గమునకు నొడఁబడునాయని వితర్కింపసాగెను. తరువాత నీక్రింది సంభాషణ జరిగెను.

అహల్యా——ఇంకను విశేషములేమి? రాఘోజీ, పాపము పోయినాఁడఁట. దౌలతరావునకుఁ జాలకష్టము సంభవించినది.

రాధా——అతనికేగాదు. చచ్చెడివాఁడు చచ్చుచు నతఁడొక పిల్లఁగొంతుకఁగోసినాఁడు. వివాహమాడి యిప్పటికి నెలకాలేదు. పాపమా భార్యకూడ నిక్కడికివచ్చినది. ఆమె యతి సౌందర్యవంతురాలు

దత్తు——అతిదుర్మార్గుఁడగు దౌలతరావు పాప మామెను బాధించుచున్నాఁడఁట.

అహ——ఏమీ! నా పాలనారంభమందుఁ బతివ్రతలకు బాధకలుగునా? అట్లయిన నామీఁద నతని కాగ్రహమువచ్చినను వచ్చుఁగాక. దౌలతరావును నేను మందలించి యామెకష్టమును మాన్పెదను. ఆ **కష్టమెట్టిదో నాకుఁ దెలియఁజేయుఁడు.**

రాధా—వదినెగారిని తాను పెండ్లియాడునఁట. ఇది మంచిది గాదని మాయింటివారు తెలుప నామెను వివాహముకాలేదని చెప్పును. ఆమె వివాహమైనదని వైధవ్యమనుభవింప సిద్ధముగ నున్నది. అయిన ను దమరింను జోక్యము గలుగఁజేసికొనవద్దు. అతఁడు దుష్టుఁడు. అతఁడు శత్రుగణములోఁ జేరిన మనకు నష్టముకలదు.

అహ—అతఁడు శత్రుపక్షమునఁ జేరినను సరే, నారాజ్యము పోయినను సరే? ఇంతపాపకర్మునిని నేను జూచుచు సైరింపఁ జాలను సాధుబాధ నివారింపకున్న నారాజ్యమెందుకు?

దత్తు—(తనలో) ఆహాహా యేమి యీమె ధర్మగుణము! ధర్మదేవత యీమెగానవతరించియుండును. దేవుఁ డీమెను రక్షించుగాక.

రాధా—అమ్మా! అట్లయిన జస్వంతరావు మొదలగువారిలో నెవ్వరుచేరినారు? ఏమి ప్రతిక్రియ మనము చేయవలయును?

అహ— జస్వంతరావులో చాలరావు చేరును. ఇంక నెవరుచేరుదురో తెలియదు. మీరు నాయందు గాఢానురాగు లగుదురేని నేను గెలువఁగలను. నేను శౌర్యము ప్రధానముగాఁ గల మహారాష్ట్రస్త్రీనని నమ్ముఁడు.

రాధా—అమ్మా! మీపాదములు సాక్షులుగా శ్రీవిశ్వేశ్వరుఁడుసాక్షిగ, నేను నా జన్మాంతరముదాక మీయెడ విశ్వాసము గల్గియుండెద. అబ్బాయీ! దత్తూ నీవుగూడ బ్రతిజ్ఞఁ జేయుము.

దత్తు—అఖిలదేవతలు సాక్షులుగ నేను మీయాజ్ఞ నెఱవేర్తునని, యట్లు ప్రమాణము చేయుచున్నాను.

ఇట్లు వారుపలుకి నహల్య సంతోషించి వారినారాత్రికి పోవఁబల్పినదియ్యెను.

*

## ఏడవ ప్రకరణము.



గంగాధర జస్వంతరావు నలుబది యేండ్లలోపు వయస్సుగల వాఁడు. బుద్ధిబలముచేతను, బాహుబలముచేతను నతఁడు తలఁచిన కార్యములెల్ల నిర్వహింపఁగల సమర్థుఁడు. మలహారురావు హోల్కారు కాలమునుండియు నతఁడు పురోహితుఁడును మంత్రియునై వైదికలౌకిక కార్యముల నమోఘముగ నిర్వర్తించుచు రాజమందిరమునకు* మూల స్థంభమైయుండి, యాతఁడు మృతినొందినతరువాత నధికారమునంతను దనచేత నుంచుకొనవలెనని దురాశ జనియించినందున రాజ్యము నహల్యాబాయి వహించినఁ దనయాటలుసాగవని యామెను కుమారు స్వీకారము జేసికొమ్మని బలవంత పెట్టసాగెను. కుమారుని బెంచుకొన్నయెడల నతఁడు యుక్తవయస్కుఁడగువఱకు రాజ్యము మంత్రులచేతులలో నుండుననియు, నందుచే దురాశాపీడితులగువారిమూలమున దేశమునకుఁ గీడురాఁగలదనియు, విశేషించి తనకు ముద్దులుమూటగట్టు కొమార్తెయుండఁగా నామెను రాజ్యమొసఁగక పరుని నెవనినో తెచ్చి వానికి రాజ్యమును గట్టఁబెట్టుట యనుచితమనియునెంచి యామె పెంచుకొనదయ్యెను. అందుచే గంగాధరుఁ డాగ్రహించి తనలో నింక గొందఱిని జేర్చుకొని రాణిపైఁ గక్షవహించెను.

వెనుకటి ప్రకరణమునఁ జెప్పఁబడిన సంగతులుజరిగినమఱునాఁడు రాత్రి గంగాధరజస్వంతరావు భోజనముచేసి తన మిత్రుల నిమిత్తమె దురుచూచుచుండెను. అంతలో హరిహరపాండ్యాజీయను బ్రాహ్మణుఁడు తన యెఱ్ఱని స్థూలదేహము దీపపువెలుతురులోఁ బ్రకాశింపఁజేయవచ్చి, " అయ్యా! గోమోజీరావు దౌలతురావు మొదలగువారు సిద్ధముగ నున్నారు. వారి నిక్కడికిరమ్మని నేను జెప్పినాఁడను. వారు త్వరలో రాఁగలరు. మీ భోజనమైనదా?" అని యడిగెను.

"ఆహా నేను సిద్ధముగనుంటిని. కాని రఘునాథరా వేమనుచున్నాఁడు? నేను చెప్పినట్లు నీవు చెప్పితివా? అని పాండ్యాజీతోఁ బ్రత్యుత్తరమిచ్చి కొన్ని ప్రశ్నలు వేసెను.

హరి—ఈకార్యము రఘునాథరావున కిష్టమే. నీవెపుడు రమ్మనిన నపుడే దండెత్తివచ్చి యహల్యాబాయిని సింహాసనమునుండి లాగును.

జస్వం—నిజముగా నాకతఁడట్లు వాగ్దానముఁ జేసినాఁడా?

హరి—అతనికి నేను గుండెకాయను. నాతో నిజముపలుకును గాని యబద్ధము పలుకఁడు. నీవు కొంతరాజ్యము వానికిచ్చుటకు సమ్మతింతువేని నిన్నే హోల్కారుగఁ జేయునట్లుగూడ నేను జక్కఁజేసినాను.

జస్వం—ఆహాహా! నాకు నీకంటెఁ బరమమిత్రుఁడు లేఁడు. నన్ను హోల్కారుగఁ జేసినపక్షమున నేనతనికి సగమురాజ్యము నిచ్చుట కాశ్చర్యమా కష్టమా? కాని నేను హోల్కారును గావలెనని పట్టింపు లేదు. ఈయాఁడుదాని పాలనలో నుండకపోయినఁ జాలును. అహల్యనుజూచిన నాయొడలు మండునుగాని ముక్తాబాయిని గనుగొన్న నాహృదయము జాలినొందును.

అని జస్వంతరావును హరిహరిపాండ్యాజీయును ముచ్చటించు సమయమున సేవకసమేతుఁడై గోమాజీరావు గుమ్మము దాటివచ్చెను. అంతట జస్వంతరావు మాటలాడవలదని పరమవైదికుఁడగు హరిహరునకుఁ గనుసన్నఁ జేసి ముందుగా, "ఓహో గోత్రాలుగారు కాఁబోలును. మమ్ముఁ జెఱసాలలోనుంచుటకు వచ్చినారా యేమి! ఆయన యెవ్వరు!" అని పరిహాసముగఁ బలికెను. గోమాజీరావు నవ్వుచు "మీరు రాణిపైఁ గుట్రలు గావించుచుండ వారిసొమ్ము దినువారము మేమూరకుందుమా! అయితే దౌలతరావు రాలేదా! ఈతఁడు నాస్నేహితుఁడు. ఈతని కాఁపురము పాసియాగ్రామము. మనకార్యమున కనుకూలుఁడు.

ఇతనిపేరు సకారాం" అని చెప్పునంతలో ద్వాపర సమేతుఁడగు కలివలె దాలతరావు దుండిరావుతోఁగూడ గృహము నలంకరించెను. జస్వంతరావు వారినిగూడ సన్మానించి యంతటిని మేడమీఁదికిఁ గొనిపోయెను. అందఱు నొకరి నొకరెఱిఁగిన వారేగాని సకారాము నెవ్వరు నెఱుఁగరు. అతఁడువచ్చి గోమాజీకి కుడిప్రక్కను గూర్చుండెను. అతని యెదుట తమ రహస్యములను మాటలాడుకొన నందఱు సందేహించిరి. కాని గోమాజీరావుని ప్రోత్సాహముచే నివారితసంశయులై మూటగట్టుకొనివచ్చిన రహస్యములను విప్పిరి. అప్పుడు వారందఱు నీక్రిందివిధమున మాటలాడిరి.

జస్వం—స్నేహితులారా, మన మిచ్చటఁజేరిన దేనినిమిత్తమో మీరెఱుఁగుదురు. మనస్వామియైన మల్హారురావుగారు చనిపోవుటయు వారికిఁ గుమారులును మనుమలును లేకపోవుటయు మన కింతటి విచారమును భ్రమను గలిగించినవి. అది యటుండ, వంశనాశనమయ్యెనని విచారము గలిగి మన రాణిగారికిఁ బుత్రస్వీకారము జేయవలెనని నేను బ్రయత్నముఁ జేయుచుండ మన రాణి—రాణియనుటకునోరాడలేదు—యహల్యాబాయి మనపై నధికారముఁ జేయవలెనని పెంచుకొనునని స్పష్టముగఁ జెప్పినది. అదిగాక నన్నడ్డమైన మాటలాడినది.

గోమా—ఆహాహా! యెంత దుష్కార్యము, ఆఁడుది రాజ్యముచేయుట కూడవచ్చినది.

దాల—ఆమెకు మామగారిచావు కుఱ్ఱగుంటచావు పండుగయైనది. ఎంతకఠినరాలుగాకున్న కుమారుఁడు కడతేఱి మూఁడుమాసములు కాలేదు. ఇంతలోనే రాజ్యమేలఁదలంచునా!

జస్వం—కొడుకు చచ్చెనని విచారముగాని, ప్రజలు తన్నేమందురో యనులజ్జగాని యామెను బాధించుటలేదు. రాజ్యకాంక్ష దుఃఖమును లజ్జనుగూడ మఱపించునుగదా!

మండి—కర్తవ్యాంశమును వేగమె వితర్కించుట మంచిది.

జస్వం—ఇపుడు నేఁజెప్పఁదలఁచిన దేమన్న మనమందఱము పరువుగల మహారాష్ట్రులము. శివాజికాలమునుండియు మనవారు ప్రాణములకంటె మానమెక్కువగనెంచినమాట నేను వర్ణింప నక్కఱలేదు. ఇంతంత బలవంతులమై యింతంత బుద్ధిమంతులమై కటకటా! తుదకు పనికిమాలిన యాఁడుదానిచేతఁ బరిపాలింపఁ బడవలసినంతటిదురదృష్టవంతులమైతిమి. ఈయాఁడుదాని ప్రభుత్వమున మనకున్న గౌరవము నిలుచునా! మీరీమెచే నేలఁబడుట కిచ్ఛగలవారా! మీకు మీసములేదా! శూరులుకారా! మహారాష్ట్రులకుఁ బుట్టలేదా! మీరు మహారాష్ట్రులగుదురేని యామెను రాజ్యవిహీనురాలుగఁ జేసి ప్రతి విషయమును నామె యత్నమునకు విఘ్నము గావింపుఁడు. ఇది మీకు సమ్మతమేనా!

దాల—సమ్మతమాయని యడుగుచున్నావా! ఆఁడుదాని పాలనలో నెంతమూఁడు నెలలున్నందుకే సిగ్గుపడి తలపొట్టలోఁబెట్టుకొనుచున్నాను. నీవెట్లుచెప్పిన నట్లు చేసెదను. ఈమెప్రయత్నము భంగముచేయుటకు దేశముననున్న భిల్లులను సహాయము జేసికొని మనము దేశము కొల్లఁగొందము. అప్పు డామె లొంగును.

జస్వం—ఆమెమీఁదఁ గోపముచే నిష్కారణముగ నిరపరాధులగు ప్రజలను క్షోభపెట్టుట మంచిదికాదు. మనమెంత కొట్టుకొన్నను, దేశమున కరిష్టము రాఁగూడదు. ప్రజలసుఖము చెడరాదు.

గోమా—నే నిదివఱకే దీనినిగూర్చి కొంచె మాలోచించినాను. ఉదయపురమహారాణావారికి వర్తమానమంపి మన దేశముపై దండెత్తుమని ప్రోత్సాహపెట్టి యతనికిఁ దగుసహాయముఁ జేయుట యుక్తము. భేతాళసింగుతో నే నిదివఱ కామాట తలపెట్టినాను.

జస్వం—రాజపుత్రులు లసాధ్యులు. తీసికొని వచ్చుటయే గాని మరల వదల్చుకొనుట మన తాతతరముగాదు. అందుచే వారిని బిలువవలదు. ఒకరిని బిలుచుటయే యుక్తమైన శ్రీ రఘునాధరావును రమ్మందము.

దాల—కొంచెమది బాగున్నది. (అని దుండీరావు చెవిలో) ఈజస్వంతరావుమెల్లగ రఘునాధరావును రప్పించి తన మనోరథసిద్ధికై ప్రయత్నించుచున్నాఁడు మనము భిల్లుల వదలఁ గూడదు.

దుండీ—అయ్యా, యింకొక సంగతి. మన రహస్యముల నెఱుఁగుటకు రాధాకాంతుఁడును, వానితో నున్న శ్యామసుందరగుప్తుఁడు, ధర్మతపస్సుధారపోయుచున్నారఁట. వారు మనలను బట్టుకొనఁదురఁట, జాగ్రత్త.

దాల—చెప్పుట మఱచితిని. ఆకుష్ఠవాఁడు, శ్యామసుందరుఁడు, పెఁగ నీలుగుచున్నవాఁడఁట. ఓయీ, గోమాజీ, యేదో వంకఁబెట్టి వానిని గడతేర్చెడు నుపాయముఁ జూడుము. నీవు కొత్వాలుప్రగిడా చేయఁగలవు.

గోమా—వాఁడక్కడ నన్నుఁగూర్చి పేలుచున్నాఁడఁట. వాని విషయమై యేపనిచేయుమన్నను జేయుదును. ఇఁక మన మఱుఁగుదము లెండు.

జస్వం—మీరు నాపలుకుల కియ్యకొనిరిగనుక నేనామెతోఁ బ్రత్యేకకక్ష వహించెద. ఆమెదగ్గఱ నాకుద్యోగము వద్దనియు, గోపకును బెంచుకొనకయున్న నామెకు మాకు సంబంధము లేదనియు నామెకు నే నుత్తరము వ్రాసెద.

గోమా—నా మాట నీవుఁగసు వ్రాయకుము. నే నీకొత్వాలు పనిలోనుండియే నీకు సమస్తసహాయములు జేసెదను. ముందుగా నుద్యోగము మానుటెందుకు?

జస్వం—ఇంతటి ధైర్యమేనా నీది? ఓయీ దౌలతరావ్రా, నీవు మీయన్నభార్యను వివాహమాడెదవని విన్నాను. ఆపనిమాత్రము వద్దు. అట్లయిన మనపైఁ బ్రజలకు నమ్మకముండదు.

దౌల—దానికేమిలే యెట్లో సాధించవచ్చును. అప్పుడేమైనదా, మనమందఱ మింటికిఁ బోదముగాక.

అని యందఱును లేచి యుచితప్రకారమున సెలవు గైకొని పోయిరి. సఖారాము దేవళములో విగ్రహమువలెఁ గూర్చుండెనే కాని యొక మాటయు మాటాడలేదని జస్వంతరావు సందియమందియుఁ గారణ మడుగఁడయ్యెను. అందఱును గృహము వెడలిరి. గోమాజీరావు సఖారామును వెంటబెట్టుకొని కొంతదవ్వేగి యచ్చట నతని చెవిలో మెల్లగా "ఓయీ స్వలాభపరాయణులగు మహాత్ములవగు వీరిని నమ్మికొని నాయుద్యోగము మానుకొందునా? యెటుపోయి యెటువచ్చునో దౌలతరావుజస్వంతరావులు తమ తమ మనోరథముల నెఱవేర్పఁదలఁచి యీ యెత్తులెత్తిరి. అని నేనెఱుఁగనా? ఏమైనను రాజానారిని వచ్చి నింబపురమును గైకొమ్మని చెప్పుము. ఇంక నీవరుగుము. అని నొక్కి పలికి వానినంపి తాను స్వగృహమున కరిగెను.

---

## ఎనిమిదవ ప్రకరణము.



"నేను మీముఖ్యమంత్రులలోనివాఁడనని మీ రెంచుకొనుట లేదు. అట్లు మీ రెంచుకొనినపక్షమున నా యాలోచనమునకు మీరు చెవియొగ్గియుందురు. పుత్రస్వీకారము చేసికొని నిర్మూలమయిన హోల్కారువంశమును నిలుపుమని హితోపదేశము గావించితిని. కాని నేనెగ్గుచేయలేదు. అయినను నామాటలు విషభోజనమువలె మీకు రుచింపవయ్యె. మతిలేని వృద్ధజంబుకముయొక్క మాటలను జితుకులమంట

వలె వేగిరపాటుగల పడుచువాని కారుకూఁతలను, నమ్ముకొని వారు మిమ్ముద్ధరింపఁగలరని చిరకాలమునుండి రాజ్యమునకు మీకు నమితోపకారమొనర్చిన మావంటివారిని నిరాకరించితిరి. వారు మిమ్ము ద్రోహముచేసినపుడే మీరు పశ్చాత్తాపమునొంది మరల మమ్మాదరింపఁగలరు. ఇంక నేను మీవాఁడనని నాయందాశయుంచుకొనవద్దు. నేను మీకును మీరాష్ట్రమునకును నిష్టుఁడనని మీరెంచినారు కారగనుక నేనట్లే యుందును. కుమారుని బెంచుకొననేని మీయొద్ద నేనుద్యోగము చేయను. ఇవి త్రికరణశుద్ధిగ నేను వ్రాసినమాటలు. ఇందుకు తిరుగు లేదు."
అని యున్న లేఖను జదువుకొనుచు మహారాణి యహల్యాబాయి తన గదిలో నొక పీఠముపైఁ గూర్చుండి నడుమనడుమ ముక్తాబాయి బాబునుగూర్చి యడుగు ప్రశ్నలకుఁ బరాకుగాఁ బ్రత్యుత్తరమిచ్చుచుఁ గర్తవ్యము నూహింపుచు రాధాకాంతుని నిమిత్తమెదురు చూచుచుండెను. అంతలో రాధాకాంతుఁ డరుదెంచి యథోచితముగఁ దనరాణికి నమస్కరించి యుచితాసనమునఁ గూర్చుండెను. ముక్తాబాయి చిన్నతనము ననుండి రాధాకాంతునియందుఁ బితృభావముంచి గౌరవించుటచే నతని యొద్ద ఘోషాపద్ధతి యక్కఱలేక యధేచ్ఛముగ మాటలాడును. మహారాణి యంత రాధాకాంతుని మొగమునైపు జూచి 'యీచమత్కారమును నీవెఱుఁగవు కాఁబోలును. ఈ చీటి చదువుకొమ్ము" అని యాయుత్తరము నతనిపై వైచెను. అతఁ డాయుత్తరము నామూలాగ్రముగఁ జదువుకొని విస్మయముతో నొకమాటు గుండెకొట్టుకొని 'అమ్మా జస్వంతరావెంతవాఁడయ్యెను. ఇంతవాఁడగునని నేనెన్నఁడు నెఱుఁగను. అమ్మా వ్యవహారము శ్రుతిమించి రాగమునఁ బడినది. మనము జాగ్రత్తగ నుండవలె" నని చెప్పెను. అనవుఁడు నాదేవి 'ఇటువంటి తుచ్ఛులు వేయి పన్నుగడలు పన్నినను నేను బెదరను. వారికి వినాశకాలమాసన్నమగుటచే నిట్టిబుద్ధులు పుట్టినవి. వారు నాకు లోఁబడకున్నను

వారిప్రాణములు నాఖడ్గమునకు లోఁబడకమానవు. కాని మనకు నెవ్వరు కృతజ్ఞులుగ నుండరో వారినందఱఁ జేర్కొనుము" అని ప్రత్యుత్తరమిచ్చెను. రాధాకాంతరావు పలుకుల నాలకించి రాణి మనోధైర్యమున కుబ్బి "శివనానా మన కాప్తుఁడు. అతని నింబపురముం దుంచుటలో మీరు మంచిపని చేసినారు. గోమాజీరావు కొత్తవాఁడుకూడ మంచివాఁడనియె తోఁచుచున్నది. తుకాజీహోల్కారు కుక్కవంటి విశ్వాసము గలవాఁడు. కాని సమర్థుఁడగుటచే నతనికి గొప్పయుద్యోగమీయఁదగదు" అని యుగ్గడించుచుండ నతనిమాట కడ్డమువచ్చి రాణి "వంశముచేత నీచుఁడైనను గుణములచేతను రాజభక్తిచేతను మన తుకాజీయుత్తముఁడు. అందుచే నతనికి సైన్యాధిపత్య మొసఁగితిని. గోమాజీరావు సంగతి నిశ్చయముగఁ జెప్పఁజాలను. నీవాతని [illegible] పాకబుచేయుచుండుము. కాని వీనికంటె నాకు నొకయెక్కువవిచారము పట్టినది. ముక్తాబాయి కలతఁబడియున్నది. ఆమె తమ్ముని నిమిత్తము బెంగపెట్టుకొనినది. మనోవ్యాధికి మందు లేదుగద! దీనికేమియుపాయము చేయవలెనో యెఱుఁగ" నని పలికెను. ఆ పలుకులు విని రాధాకాంతరావు, రాణితో నిట్లనియెను. "ఆమె నిజముగ బెంగపెట్టుకొన్నది. మనము తమ్మునిమీఁద కనిపెట్టియుండి నిరంతరము నామె కుత్సాహజనకములగు పలుకులు చెప్పుచుండవలయును. అట్లు చేయుటకు మీకు తీరికలేదు. నాదగ్గఱ నొకదాసియున్నది. ఆమె బహు చమత్కారకథలనేర్చును. ఎట్టివారికైన నామె మొగముచూడ సకలదుఃఖములు పోవును. ఆమెను నేనక్కడ కంపెదను. ముక్తాబాయి నామెకు జతఁజేయుఁడు. అంతట నామె దేహమునఁగల రుగ్మత నశించును. ఇఁక నే సెలవుపుచ్చుకొని పోయివచ్చెదను. కానియడుగ మఱచినాఁడ దౌలతిరావు విషయమై యేమిచేసినారు. స్త్రీరాజ్యమేలుచుండ స్త్రీకి మానగౌరవము దక్కకున్నదో నింకఁ జెప్పనదియేమి? అన్నియు ముగిసినవెనుక మీరుకనుగొన్న నేమిలాభము?

ఆమె ప్రాణత్యాగము చేసికొనక మునుపే యామె పాతివ్రత్యము చెడకమునుపే, మీరు సాయము చేయవలెను." అను రాధాకాంతుని కఠినోక్తులచే రాణికి రోసము జాలియుఁ గల్గించిన నామె 'ఓయీ నేను జీవించియుండిన కమలాబాయికి మానభంగమగునా! దౌలతరావును పిలిపించి యిప్పుడే మందలించెద. ఇదివఱకే రమ్మని వానికి వర్తమానము బంపితిని. ఎంతకష్టమునకైన నోర్చి యామెను రక్షింతును నీవింక బొమ్ము. దౌలతరావు వచ్చువేళయైనది" అని పలికెను. రాధాకాంతుఁ డందుకు సంతసించి సెలవుపుచ్చుకొని స్వగృహమునకు నరిగి కమలాబాయి స్థితిఁ గనుగొనుమనియు నామెతోఁ గొన్ని రహస్యములు జెప్పుమనియుఁ దనభార్యఁ బంపె యామెవిషయమై జాగ్రత్తగనుండెను.

రాధాకాంతరావు వెడలిన యొక గడియలోపున దౌలతరావు తన యేలిక దర్శనమునకువచ్చి గుమ్మముకడ నుండి తనరాకఁ దెలియఁబఱచెను. లోపలికి రమ్మని సెలవయినతోడనే మొగమున లేని గాంభీర్యమును దెచ్చిపెట్టుకొని మొగములో నొకవేళ నపాయమేదైనను జరుగునేమో యని ప్రాణసంరక్షణార్థమై తెచ్చిపెట్టుకొన్న కత్తి బయటికి గనఁబడకుండ జేసి లోనికరిగి రాణిదర్శనముచేసి సాష్టాంగనమస్కారము మొనర్చి నిలువబడెను. రాణి నాలుగు నిమిషములు వానివంకఁజూచి కూర్చుండుమనెను. తరువాత వారియుభయులకు నీక్రింది సంభాషణ జరిగెను.

అహ—పాపము మీయన్నగారు పోయినందుకు మాకు చాల విచారముగనున్నది, ఈవేళకు నాఱుమొకటికాదా నీకు చెడ్డకష్టము వచ్చినది.

దౌల—(తలవంచి) ఏమిచేయఁగలము. కాలవశము.

అహ—అతనిభార్య యెక్కడనున్నది, క్రొత్తగాఁ బెండ్లియైనదఁట కాదా?

దౌల—ఇక్కడనే యున్నది. పెండ్లికాలేదని చెప్పుచున్నారు.

అహ—ఛీ ఏమిమాటలు, నాదగ్గఱకూడ నట్లియనెదవేల? నీవామెను బలవంతముగ వివాహమాడయత్నించుచున్నావఁట, నారాజ్యములోనీవు దుర్మార్గము చేయకుము. ఇటువంటివానిని క్షమియింపను. అన్నభార్యను బెండ్లియాడుటకు నీకు సిగ్గులేదా?

దాల—అమ్మా! నే నామెవిషయమై యట్టి దుష్కార్యము దలపెట్టలేదు. కిట్టనివారు చెప్పిన యబద్ధముల నమ్మి మీరు నన్ను శిక్షింపఁ దలంచుచున్నారు. నే నట్టిపనిఁచేయుదునా? అన్నభార్య తల్లి కాదా? పెండ్లికాలేదని నేను స్వీకరింపఁ దలఁచితిని. పెండ్లియైనమాట నిజమైన నాకామెవద్దు.

అహ—సరే. జస్వంతరావు మాపై నలుకనహించినాఁడఁట. నీవును నందుఁజేరినవాఁడవేనా? ఇంక నీవంటి శూరులెందఱు—

దాల—రామరామ! నే నేపాపమెఱుఁగను మీపాదములతోడు శ్రీవిశ్వేశ్వర స్వామివారితోడు. సెలవైన జస్వంతరావును బట్టియిచ్చెదను.

అహ—తన ప్రాణముల కాసపడవద్దని జస్వంతరావుతోఁ జెప్పుము. మీరందఱు చచ్చినట్లు భావింపుకొనుఁడు. ఇఁక నీవుపో.

అని యహల్యాబాయి దాలతరావునంపెను. దాలతరావు నోటికివచ్చినన్ని యనృతములాడి రాణి యాగ్రహమునకుఁ బాత్రుఁడు కాకుండ పులినోట బడి తప్పించుకొనిన మేఁకవలె సంతసించుచుఁ బోయెను. అట్లు దాలతరావింటికి వచ్చునప్పటికి భార్య దుర్గబాయి గృహమునందు లేనందున నిదె సందని కామబాధావివశుఁడై కమలాబాయియొక్క కమలములవంటి పాదములపైఁబడి తన్ను వివాహముచేసికొమ్మని యామెను బహువిధములఁబ్రార్థించెను. కమల భయసంభ్రమములతో వడఁకుచు నాతని దనపాదములతోఁదన్ని యాడరానిమాటలాడి యనేకవిధముల నిందించి రోదనముచేసెను. మన్మథబాణముచే దేహము

చిల్లిపడ ములుకులవంటి యామెపలుకు లంతపనిఁ జేయవయ్యెను. సిగ్గత ని నీవఱకే విడుచుటచే సిగ్గు వాని కగుపడదయ్యెను. అందుచే నాతఁ డు వడకుచున్న యావన్నెలాడిని గట్టిగఁ బట్టుకొని సందిటఁ జేర్చి యా లింగనసౌఖ్యముకొఱకు యత్నించుచుండ నామె బెదరిన మార్జాలమువలె నోడలెల్ల రక్కి_యఱువసాగెను. ఆమె బరుకులు వాని యంగములనుం డి రక్తము స్రవింపఁజేసి కుంకుము నలందుకొన్న పెండ్లికుమారుని విలా సము నతని కొసఁగెను. అంతలో దుర్గవచ్చి తలుపుఁగొట్టినందున కమల యామెకు తలుపుఁదీసెను. దౌలతరావుచేసిన చర్యలను దుర్గ కమల ముఖమున విని యిట్టిమగనికి దాను భార్యగానుండుటకు సిగ్గుపడి కమల నూరార్చి మగనిని శూలములవంటి మాటలతో నొప్పించెను. కాని న ల్లరాయివలె నతఁడు నిరుత్తరుఁడై కమలను వశముచేసికొను నుపాయ మును వెదకుచుండెను ఇట్లతఁ డాలోచనలు సలుపుచుండఁగానే సూ ర్యుఁ డపరశైలశిఖరము నలంకరించెను. రాత్రి యందఱు భోజనముచే సి పండుకొన్నతరువాత నిద్రాసక్తులైరి. రెండుజాములరాత్రి యైనత రువాత దౌలతరావు తాను నిద్రించుచున్న గదివిడిచి తళతళ మెఱయు చున్న ఖడ్గమును గేలఁబూని కమల శయనించు గదిఁ బ్రవేశించి, "దురా త్మురాలా, కమలా నీవు నాకు నక్కఱకురానిదానవు. నీవుండిన నేమి చచ్చిననేమి ? నిన్నిపుడు చంపివేయుదును." అని ఖడ్గ మామెమెడమీఁ దనుంచి యొకయేటున వేయఁ గత్తినెత్తెను. అంతలో నామెముఖవికాస చంద్రికలు కోపావేశాంధకారమును బాపినందున, "ఈమె నిపుడు చంప ను ముందుముందీమె యొప్పక నావశముకాఁగలదు కాకపోయిన-చో నపుడే తుదముట్టించెద" నని తన దుష్ప్రయత్నము మాని మరల లోనికిం జని నిద్రించెను. నాలుగుగడియలరాత్రియుండఁ గమల మొగమున మేలిము సుఁగు దిగజారవేసికొని యెవరితోడను జెప్పక గృహమునుండి వెడలిపో యెను. ఎక్కడికరిగినదో యెవ్వరు నెఱుఁగరు. ఉదయమున దుర్గయు

చచ్చునేని కోడలు మరల నొకని దత్తముఁ జేసికోవలయునని మరణశాసనము వ్రాసినాఁడు. వారి బందుగులకుట్టవాఁడె యున్నాఁడు. మన వా రాబాలుని హోల్కారుగఁ జేసి కొద్దిదినములలోఁ బట్టాభిషేకముఁ జేతుము. క్రొత్తహోల్కారునకు మీరు సహాయముఁ జేయుఁడు.

ఋషి—ఆహోల్కారును నే నెఱుఁగుదును. ఆహాహా! మిక్కిలి బాగున్నది. గంగా, నీకు సందేహమెందుకు? అహల్యాబాయి సింహాసనముమీఁద నుండదు. రాధాకాంతరావుతోఁ జెప్పినాను. శ్యామసుందరదత్తు నాతో మాటలాడినప్పుడు నేను వారిపక్షము పల్కితినిగాని నేను వారి సంహారము జూచుచున్నాఁడను. మల్హారరావు నాకపకారముఁ జేసినాఁడు. ఆకసి నేనిపుడు తీర్చుకొందును. దేశమును మంగలములోఁ బెట్టి వేఁచివేయవలెను. నీ రెండువేలభిల్లసైన్యముతోఁ దోఁపును వెంటనే యారంభింపుము. నీకు నాదీవన నిచ్చెదను. ప్రజలకు నావయస్సునుబట్టి నాపై మిగుల భక్తిగలదు. వారు నా మాయాసముద్రమునఁబడి మునిఁగినవారలు. నీవు జంకకు.

గంగాభిల్లి పలుకుల నాలకించి యడవిజంతువువలె ఖణిల్లని యొక వింతకేక వేసి యిదిసరి, యిదిసరి, నాతమాష చూడుము. ఈపని నెఱవేరునేని నూరు దున్నపోతులను శ్రీకాళికి బలియిచ్చెదను. దొరకిన యెడల మనుష్యుని బలియిచ్చెదను. దుండీ నేనిందులకు సమ్మతించితి నని మీదౌలతురావుతోఁ జెప్పుము" అనెను.

దుండీ—మల్హారురావు మనయీఋషికి నపకారముఁ జేసెను. అహల్య కముక్తాబాయిని వివాహమాడవద్దని దౌలతరావును నిందించి యనరాని మాటలని పరిభవించినది. అదిగాక కమల నూతిలోఁబడి మృతినొందినది. కాఁబట్టి దౌలతరావు రాణిపైఁగల కసిఁ దీర్చుకొనుటకు మిమ్ము గలియఁగోరినాఁడు. ఇది ఋషికిని మీకును నిష్టమ

ప్రభువుతోఁ జెప్పి క్రొత్తహోల్కారు పట్టాభిషేకప్రయత్నములు చేయు చుండెదను. నీవును ద్రోహము నారంభింపుము.

అని చెప్పి ఋషికి నమస్కరించి గండాభిల్లుకొద్ది సెలవుఁ గైకొనఁబోవుచుండ నొక మనుష్యుఁడు పదునేనువత్సరముల బాలుని నొకని వెంటఁబెట్టుకొనివచ్చెను. ఈవచ్చినమనుష్యుఁడు సర్వలక్షణముల గండాభిల్లుకంటె నెక్కువ విలక్షణముగను, నెక్కువ భయంకరముగాను నుండెను. కాని యతనికంటె నొక యగయుడుగుపొట్టి. గండాభిల్లునికంటె పొట్టియగాక యతఁడు వానికంటెఁగ్రూరుఁడు. వెంటనున్న బాలుఁడు గడగడవడఁకుచు వెఱ్ఱివెఱ్ఱిచూపులు చూడసాగెను. అతఁడు సౌందర్యశాలి. తాంతియాభిల్లు బాలునితోఁ ఋషి కుటీరము చేరి గండాభిల్లు జూచి, "ఓరీ నీనిమిత్తె మీసుందరుఁడగు పిల్లవానిఁ దెచ్చినాను. పుణహానుండి యీ కుఱ్ఱవాఁ డిందూరునగరమునకుఁ బయనమై పోవుచున్నాఁడు. ఈతని నీయిష్టమువచ్చినట్లు చేసికొమ్మ" అని యబ్బాలుని చేయిపట్టి లాగి చూపెను. ఋషి వానిమొగమును దీపపు వెలుఁగునఁ బరీక్షించిచూచి, "యీతఁడు కాళికి బలినిమిత్తము పయోగించును. తీసికొనివెళ్ళి బలియిమ్మ" అని యుత్సాహముగ్గలునట్లు పల్కెను. పలుకులయు నబ్బాలుని గుండె జల్లుమని యొడలెల్లఁ జెమటలు పట్టెను. పట్టిన క్షణనే, "అమ్మో" యని కేకవేసి గుభాలున మూర్ఛిల్లి నేలవాలినమొగమునలేఁబడి స్మృతిదప్పియుండెను. తాంతియా వానిఁజూచి మహాకోపముతో "దొంగవేషము వేసెదవా? బద్మాష్" అనికొరడాతో చెళ్ళుచెళ్ళన వీఁపుపై రెండు చరపులఁజరచెను. కాని భయావేశమె కవచముగాఁ గలయాబాలుఁడు దెబ్బలవలన మేలుకొనఁడయ్యెను. "ఇప్పుడే యీతని బలిపెట్టుదమురా" యని తాంతియాభిల్లు గండాభిల్లుని వెంటబెట్టుకొని యీబాలుని శవమువలె మోసికొనిపోయిరి. ఈబాలుని ప్రాణముల నెట్టును రక్షింపవలయునని దుండిరావునకు సముద్దేశముఁ గలిగినది. కాని

చచ్చునేని కోడలు మరల నొకని దత్తముఁ జేసికోవలయునని మరణశాసనము వ్రాసినాఁడు. వారి బంధుగులకుట్టవాఁడె యున్నాఁడు. మన వా రాబాలుని హోల్కారుఁ జేసి కొద్దిదినములలోఁ బట్టాభిషేకముఁ జేతురు. క్రొత్తహోల్కారునకు మీరు సహాయముఁ జేయుఁడు.

ఋషి—ఆహోల్కారును నే నెఱుఁగుదును. ఆహాహా! మిక్కిలి బాగున్నది. గంగా, నీకు సందేహ మెందుకు? అహల్యాబాయి సింహాసనముమీఁద నుండదు. రాఘవకాంతరావుతోఁ జెప్పినాను. శ్యామసుందరదాసు నాతో మాటలాడినప్పుడు నేను వారిపక్షము పల్కితినిగాని నేను వారి సంహారము జూచుచున్నాఁడను. మల్హారురావు నాకపకారముఁ జేసినాఁడు. అతని నేనిపుడు తీర్చుకొందును. దేశమును మంగలములోఁ బెట్టి వేఁచివేయవలెను. నీ రెండువేలభిల్లసైన్యముతోఁ దోపుడు వెంటనే యారంభింపుము. నీకు నాదీవన నిచ్చెదను. ప్రజలకు నా వయస్సునుబట్టి నాపై మిగుల భక్తిగలదు. వారు నా మాయాసముద్రము నఁబడి మునిఁగినవారలు. నీవు జంకకు.

గంగాభిల్లపిలుకుల నాలకించి యడవిజంతువువలె ఖణిల్లని యొక వింతకేక వేసి యిదిసర్, యిదిసర్, నాతమాషా చూడుము. ఈపని నెఱవేరునేని నూరు దున్నపోతులను శ్రీ కాళికి బలియిచ్చెదను. దొరకిన యెడల మనుష్యుని బలియిచ్చెదను. దుండీ నేనిందులకు సమ్మతించితినని మీదౌలతురావుతోఁ జెప్పుము" అనెను.

దుండీ—మలహారురావు మనయీఋషికి నపకారముఁజేసెను. అహల్య కమలాబాయిని వివాహమాడవద్దని దౌలతరావును నిందించి యనరాని మాటలని పరిభవించినది. అదిగాక కమల నూతిలోఁబడి మృతినొందినది. కాఁబట్టి దౌలతరావు రాణిపైఁగల కసిఁ దీర్చుకొనుటకుఁ మిమ్ము గలియఁగోరినాఁడు. ఇది ఋషికిని మీకును నిష్టమని

ప్రభువుతోఁ జెప్పి క్రొత్తమహాల్కారు పట్టాభిషేకప్రయత్నములు చేయుచుండెదను. నీవును ద్రోహము నారంభింపుము.

అని చెప్పి ఋషికి నమస్కరించి గండాభిల్లుకొద్ద సెలవుఁ గైకొనఁబోవుచుండ నొక మనుష్యుఁడు పదునేడువత్సరముల బాలుని నొకని వెంటఁబెట్టుకొనివచ్చెను. ఈవచ్చినమనుష్యుఁడు సర్వలక్షణముల గండాభిల్లుకంటె నెక్కువ విలక్షణముగను, నెక్కువ భయంకరముగాను నుండెను. కాని యతనికంటె నొక యరయడుగుపొట్టి. గండాభిల్లునికంటె పొట్టియగాక యతఁడు వానికంటెఁగ్రూరుఁడు. వెంటనున్న బాలుఁడు గడగడవడఁకుచు నెత్తినెత్తిచూపులు చూడసాగెను. అతఁడు సౌందర్యశాలి. తాంతియాభిల్లు బాలునితోఁ ఋషి కుటీరము చేరి గండాభిల్లుని జూచి, "ఓరీ నీనిమిత్త మీసుందరుఁడగు పిల్లవానిఁ దెచ్చినాను. పుసహానుండి యీ కుఱ్ఱవాఁ శిందూరునగరమునకుఁ బయనమై పోవుచున్నాఁడు. ఈతని నీయిష్టమువచ్చినట్లు చేసికొమ్ము" అని యబ్బాలుని చేయిపట్టి లాగి చూపెను. ఋషి వానిమొగమును దీపపువెలుఁగునఁ బరీక్షించిచూచి, "యీతఁడు కాళికి బలినిమిత్త ముపయోగించును. తీసికొనివెళ్ళి బలియిమ్ము" అని యుత్సాహముగఁ బలికెను. పలుకుటయు నబ్బాలుని గుండె జల్లుమని యొడలెల్లఁ జెమటలు పట్టెను. పట్టినతోడనే, "అయ్యో" యని కేకవేసి గుభాలున మూర్ఛిల్లి నేలవాలినమోమునలెఁబడి స్మృతిదప్పియుండెను. తాంతియా వానినిఁ జూచి మహాకోపముతో "దొంగవేషము వేసెదవా? బద్మాష్" అనికొరడాతో చెళ్ళుచెళ్ళున వీఁపుపై రెండు చరపులఁ జరచెను. కాని భయావేశమె కవచముగాఁ గలయాబాలుఁడు దెబ్బలవలన మేలుకొనఁడయ్యెను. "ఇప్పుడే యీతని బలిపెట్టుదమురా" యని తాంతియాభిల్లు గండాభిల్లుని వెంటబెట్టుకొని యాబాలుని శవమువలె మోసికొనిపోయిరి. ఈబాలుని ప్రాణముల నెట్లయిన రక్షింపవలయునని దుండిరావునకు సముద్దేశముఁ గలిగినది. కాని

యీమాట వారితోఁ జెప్పినచో వారు తన్నే చంపుదురని భయపడి యూరకుండి మెల్లగా తన స్థానమునకుఁ జనెను.

ఇది యైన కొన్ని దినములకే దేశమునం దక్కడక్కడ బందిపోటులు కన్నపుదొంగతనములు దారులు కొట్టుటయు నారంభమై దేశమంతయు నల్లకల్లోలముగ నాగెను. స్త్రీలను జెఱపట్టుట దొంగతనము మాన్పి మానప్రాణములకును మర్యాదలకును భంగము లేకుండఁ జేయ జనులందఱు రాణితోఁ మొఱ్ఱలు పెట్టుకొని యీ రాజ్యమునుండి పారిపోవుదుమని చెప్పిరి. నిరంతరము గ్రామములు పరశురామప్రీతి యగుటచేతను, జనులు పులులవలె నేచుచుండ బడుటచేతను నహల్యాబాయి ప్రజల దైన్యమును స్వసైన్యద్రోహమును గని యీ హీనస్థితియు నరాజకమును జూచి విసిగి చేయునది లేక దుఃఖితయయి రాజ్యభారమును విడిచి మంత్రులకు నొప్పజెప్పుట యుచితమని యోచించుటకుఁ గూడ సిద్ధమయ్యెను. అంతనుండి, రాధాకాంతుని జ్ఞానసుందరునిఁ బిలిపించి యీమె వారితో నిట్లనియెను. "అయ్యా! ఇఁక నా రాజ్యమేమునకు? నేను దీని నివదలి కాశీనగరమునకేఁగి విశ్వేశ్వరసన్నిధానమున వానప్రస్థాశ్రమముల నాశ్రయించుట మంచిదని తోఁచుచున్నది. పరమపతివ్రతయగు కమలాబాయి నిష్కారణముగ నూతిలోనఁ చచ్చినది. ఆ నేరమును బెట్టుకొని యీపాపాత్ముల శిక్షించువారు లేరు. మీరాదు మిక్కిలి ఉన్నాతరావు పేరిణాచే రఘునాథరావు మనస్సె దంపునెపలుంటట! అది నిజమని పేష్వా సభలోనున్న దాదాజీకొండ్కా తనతోఁ జెప్పెనని మరకృష్ణపంతు నిన్ననే పునహానుండి వచ్చి చెప్పినాఁడు. భిల్లులోకమూల ప్రజలను మాప్పుచున్నారు. ప్రజలు నాజనముగ కుసూకుమన్న తరువాత నా రాజ్యమెందుకు? వన్నెలుగై కొని సుఖియించుటకా! నే నేమిచేయుదును" అని నిర్విణ్ణరాలై పలుకు మహారాణిని జూచి రాధాకాంతుఁడు, "అమ్మా! యీ దురాత్ములు లోఁబడకపోరు. పాపమెన్నఁడును నెగ్గదు.

నేను, శ్యామసుందరదత్తు, తుకాజీ, శివనానా జీవముతోనుండ నిందూ
రు రాజ్యలక్ష్మి యాదురాత్ములచేఁ జిక్కదు. మీరు మాకు ధైర్యము
చెప్పవలసినది. మీరుధైర్యపడకుందురేని మే మెంతెంతకార్యములనైన
సాధింపనేర్తుము. విచారింపకుము. అమ్మా యీ ముక్తాబాయికి శరీర
మున సుఖముగనున్నదా? దాసి యెట్లున్నది' అని పలుక నహల్యాబాయి,
"నేను మిమ్ము నమ్మియున్నాను. నీవును, శ్యామసుందరదత్తునుబోయి
దొంగలఁ బట్టుకొనుఁడు. మఱియెకవిచారము నాకులేదు. నీవు పంపిన
దాసిమూలమున నాకూఁతురు బ్రతికినది. అది కడుచమత్కారి. పదుగు
వారిని నవ్వించును. సీతాబాయి మొగముఁజూడ నన్నివిచారములు
నశించును" అని చెప్పెను. శ్యామసుందరుఁడంత, "అమ్మా యిదే
నేనును రాధాకాంతరావు గారును సరిగి దొంగిలలో ముఖ్యులఁ బ్రా
ణములతోఁ దెచ్చి మీ కప్పగించెదము. సెలవొసంగుఁడు పోయెదము.
తుకాజీని సైన్యముతో సిద్ధముగ నుండుమని యాజ్ఞాపింపుఁడు" అని రాధా
కాంతరావును దత్తును రాణిని వీడ్కొనిపోయిరి.

పదియవ ప్రకరణము.

సూర్యరశ్మి యెట్టిదో యెన్నఁడు నెఱుఁగనట్టి చీమదూరని చిట్ట
డవియని చెప్పఁదగిన వింధ్యపర్వతప్రాంత వనభూమియందు దొక చోట,
కొండగుట్టలచే నావరింపఁబడు నొక కోనలో నొకనాఁ డుదయమున
నాకాశమును బీటలువారఁజేయుమహాకోలాహల ముదయించెను. అడ
వి మృగములవలె ఘీంకారాది భయంకర ధ్వనులతోడను భిల్లులందఱు
మతావేశమునొంది భక్తిపారవశ్యముచేత నెదుట వృక్షమునఁ గట్టబడిన
బాలకునిపై దృష్టులు నిగుడ్చిరి. ఆబాలకుని శరీరమందంతట జేగురు
గంధము పూయబడెను. మొగమున నెత్తురు కుంకుమబొట్టు పెట్టియప్పు

దప్పడె యొంటఁబడిన తలనుండి నీటికణములు జార వికచారవిందములఁ బోలు నెండుకన్నులనుండి బాష్పజలము లొలుక నా బాలుండు భిల్లులవలన శ్రీ కాళిక బలియీయఁబడుటకు సిద్ధముగ నుండెను అతని హృదయస్థ దుఃఖమును నేడికన్నులు తెలుపుచుండెనే కాని నోటిమాటలు తెలుపుటలేదు. వెనుక తాంతియాభిల్లు తోడితోఁబుట్టుగొన్న సుందరాకారుఁడగు బాలుఁడాదివమున గండాభిల్లుచేఁ దమదేవతకు బలియీయఁబడుచుండుటయే యీ కోలాహలమునకుఁ గారణము. అమితానంద రసమున నోలలాడుచు భిల్లులు భిల్లాంగనలు నంత బల్లిదలై చెట్టుకు కట్టిపెట్టుకొని యమితదుఃఖాసమున నీవత్స యమలోకప్రయాణమునకు మూటగట్టికొనెను అప్పుడు వారలోఁకులపెద్ద తళతళ మెఱయు ఖడ్గముఁబూని యొంటిమెడ నఱకుటకు సులువుగ నుండునోయని కత్తి మెడపైనిడి భిల్లులు సింహనాదముసేయ భిల్లాంగనలు చప్పటులు చరుచ నొక్కవేటున వేసెను. ఆవేటుతో బాలుని శిరము తెగి నేలఁ బడవలసినదే కాని మూర్ఖువాఁడు మెడ కుడవైపుకుఁ దిప్పినందున నాయువు వానికుఁ దగులదయ్యె. అంత నాకుమారుఁడు స్మృతిఁ దెచ్చుకొని చేతులుజోడించి గండాభిల్లునిఁ జూచి నమస్కరించి, "అయ్యా నన్నేల మీదేవతకు బలియిచ్చెదరు. మాతల్లికి నే నొక్కఁడనె కుమారుఁడను. ఈనడుమ మా చిన్నతమ్ముఁడు మసూచకమువచ్చి చచ్చినాఁడు. నేను మాయక్కను జూచిపోవలయునని పునహానకి వచ్చుచున్నాను. నేను తండ్రిలేనిబిడ్డను. మిగుల బీదతనము ననుభవించుచు దిక్కులేని నాకుటుంబమును బోషించుటకై నెక్కడనైన పదిరూపాయల యుద్యోగము సంపాదింప వలెనని పుట్టెడాశతో మాబంధువుల నాశ్రయింప నిందూరు నగరమునకుఁ బోవుచున్నాను. నేనేమో యుద్యోగము సంపాదించి తమ్ముఁబోషించునంతటి ప్రయోజకుఁడ నగుదునని గంపంత కోర్కెతో నాతల్లి నాకయి యెదురు చూచుచుండును. నన్ను

విడచి యీపుణ్యముఁ గట్టుకొమ్ము" అని ప్రార్థించెను. ఆప్రార్థనలు విన్నఁ గొందఱు భిల్లులకును భిల్లాంగనలకును హృదయములఁ గరుణారసముదయించెను. కాని తాంత్రికుఁడు భిల్లునకాగ్రహమునఁ గాంచి గురువునుజూచి, "ఈపాపాత్ముని వదలవద్దు వదలినచో దేవికాగ్రహమువచ్చును. ఇదివఱకు మనమిన్నిపల్లెలుదోచిన మనము పట్టుపడకుండుట కీమె కారుణ్యమె కదా కారణము. కావున వేగమె తల తెగవేయుఁడు" అని పలికెను. పలికినతోడనే మనుష్యాకారము నెత్తిన వ్యాఘ్రమునంటి యాగురువును మనుష్యప్రాణములఁ దీయుటలోఁ జిరకాలానుభవముగల తన కుడిచేయి నెత్తి శిరము దేహమునుండి తెగవేయుటకుఁ గత్తి మెడపైఁ జేర్చి వాటముజూచి మఱల ఖడ్గము నెత్తెను, అందఱు, 'జయభగవతీ' యని యఱచిరి. ఆబాలుఁడు కనులు మూసికొని రామరామయంచు మెడపైఁగత్తిపడిన దనుకొనెను. అంతలో మూగిన మనుష్య సంఘము నందు, 'వచ్చె వచ్చె, మరాటిదండు మరాటిదండు' అని మహాధ్వనులు వెడలెను. వెంటనే ప్రాణములకై పరతెంచువారును, బాణములకై వరుగులెత్తువారును, విండ్లు గేలఁబూనువారును, చెండ్లవలె రాళ్ళుపట్టువారునునై భిల్లభిల్లాంగనాబృందము చిందరవందరయయ్యెను. ఈనడుమ మరాటిదండు వారిపైఁ బడ తత్సైన్యముఖమున నుత్తమ తురంగముపై నెక్కి భిల్లుల కనులకు రుద్రునివలెనున్న రాధాకాంతరావును, కుమారస్వామివలె వెనుకనున్న శ్యామసుందరదత్తును గానఁబడిరి. గురువు ఖడ్గమును జంకక్రిందఁ బెట్టుకొనిపారిపోవుటయుఁ గొందఱు భిల్లులు గురువుగారి మార్గము నవలంబించుటయు, మిగిలిన యాటవికులు మరాటులపైఁబడి యెదిర్చి కొంతసేపు దూరమునుండి శిలావర్షము గురిసియుఁ గొంతవడి యమ్ములవానలు వర్షించియు, కొంతసేపు ఖడ్గాఖడ్గినిబోరియు, హాహారాహారిగా యుద్ధముచేసిరి. తుపాకులు, విచ్చుకత్తులు, మొదలగు నాకరికపు పనిముట్లుఁ గలచే మరాటులు శత్రుసంహారమున

నెక్కువ సులువు గలవారై మోటకయ్యము సేయు భిల్లులఁదోలిరి. వీరశి ఖామణియగు రాధాకాంతునకు వీపుపై నొక కత్తిపెట్టుగాయము తగు లుటయు, నీదుఃఖ ముపశమింప శ్యామసుందరదత్తుచే భిల్లనాయకుఁడగు గండాభిల్లు పట్టుబడుటయు నను రెండుకార్యము లీ యుద్ధఫలితములు. వృద్ధుఁడగు రాధాకాంతునకుఁ దగిలిన గాయ మపాయకరమైన దగుటచే నటఁ దగిన వైద్యము జరుగదని దత్తాతనికొక బండి చేయించి తగు పరివారమునిచ్చి ముందుగా నిందూరునగరమున కంపి తాను వెనుకనుండి దొంగను దీసికొని వత్తునని చెప్పి యాతని నంపెను. యుద్ధము జరుగు చుండఁ గొందఱు భిల్లులు బలి యీయఁబడుటకు వృక్షమునకుఁ గట్టఁబడ్డ బాలుని కట్లు తొట్రుపాటుతో విప్పి బరబర లాగుకొని పోయిరి. శ్యా మసుందరదత్తు గండాభిల్లుని వెంటఁబెట్టుకొని నలుగురు సేవకులతో మెల్లమెల్లగఁ బయనము సేయుచుఁ గడుమన్నెములును, బర్వత ప్రాం తములును దాఁటి రెండుదినములకు మన ఋషియున్న కుటీరసమీపము నకువచ్చి సాయంకాలమైనందున నచ్చట విశ్రమింపఁ దలఁచెను. దత్తుతో నున్న నలువురు సేవకులలో నొకఁడు గండాభిల్లునకు పరిచితుఁ డుండుటచే వాఁడతనితో నపుడపుడు సగము వినఁబడి వినఁబడకుండునటు మాట లాడుచు జాలి గల్గునటు కన్నీరువిడుచుచుఁ దన్ను చెఱనుండి విడిపింపు మని బహువిధములఁ బ్రార్థించెను. కాని క్షత్రియబోనువలె దత్తుఁడక్కడ భటులు నుండుటచేఁ బ్రత్యుత్తరమిచ్చుటకుఁగాని చెఱనుండి వానిని విడిపించుటకుఁగాని యాబంట్రోతునకు వీలులేదయ్యె. గండాభిల్లు తన మరణమింక నిశ్చయమనియు నేచెట్టునకో గట్టి తన్నహల్యాబాయి యురి దీయుననియుఁ గడువిచారగ్రస్తుఁడై చచ్చినపులివలె నుండి యేపనిచేయు టకు వీలులేకుండఁ జేతులువిరిచి కట్టఁబడినందున నప్రయోజకుఁడై యుండెను. ఇందూరునగర మొకక్రోసుదగ్గఱకు వచ్చినకొలఁది తనమర ణ మొకదినము సమీపమగుచున్నదని గండాభిల్లు రోదనముసేయుచుఁ

దాను చేసిన పాపములను, నరహత్యలను, రాజద్రోహములను దలంచి బెంగపెట్టుకొని నిద్రాహారములు గైకొనఁడయ్యె. గండాభిల్లు చేఁజిక్కినవార్త విన్నవారందఱు సంతసించి పండుగలు చేసికొనుచుండిరి. ఈలోఁగను శ్యామసుందరదత్తు ఋషికుటీరమునందుంచి కాలుసేతులు గట్టి నలువురు సేవకులను జుట్టు కాపుపెట్టి, జామున కొక్కరిని మేల్కొనుమని యానతిచ్చి తాను వెలుపల నొకమంచముపైఁ బండుకొనెను. అంతట ఋషి యాతనితో, "నాయనా యీపాపాత్ముఁడు దొరికినందుకు దేశమంతయు సంతసించుచున్నారు. వీనిని వేగముగఁ గడదేర్పుము. ఈ కార్యము చేసినందుకు నీకీర్తి శాశ్వతమైయుండును. ఈదురాత్ముఁడు ప్రజలనుబెట్టిన క్షోభ యింతింతకాదు. వారి యుసురు నేఁడు తగిలినది కాఁబోలును." అని ముచ్చటించెను. "ఇది మీ యాశీర్వచనము. మీరు హోల్కారువంశమునకు మేలుసేయఁదలఁప మేలెందుకు చేకూరదు. ఇది మీ చలవకాదా" యని దత్తుత్తరము చెప్పెను. ఆసమయమున నొక తురక వెదకుకొనుచువచ్చి "అయ్యా, యిచ్చట శ్యామసుందర దత్తుగారున్నారా" యని యడిగెను. దత్తు తత్తరపాటుతో లేచి, "అబ్దుల్‌నబీ యేమి యిపుడు వచ్చినావు? తొందరకేమైన నున్నదా?" అని యడుగ, "మహారాజా తొందరలులేవు. రాణీగారు మీకు హుకుము జారీచేయించినారు. అది తెచ్చినాను." అని చెప్పి యుత్తరమును జేతికీయ నాజాబును దత్తు చదువుకొని, 'పాప మింతత్వరగా నది యగునని నేను తలఁపలేదు." అని యుత్తరమును మడచుచుండెను. ఋషి యది యేమని యడుగుచుండఁగనె దత్తు లోపలికిపోయి ఋషిని రమ్మని పిలిచి గండాభిల్లును మేలుకొలిపి యిట్లనియెను. "ఓయీ మహారాణిగారిట్లుత్తరము వ్రాసినారు, చదువుచున్నాను విను, "గండాభిల్లు నిటకుఁ దీసికొనిరానక్కఱలేదు భిల్లులు, బిడారులు, గాండ్లు మొదలగు వనవాసు లింకముందిట్టి రాజద్రోహము సలుపకుండ బుద్ధిగలుగునట్లు వారి

నందుఁ జేర్చి వారికి భయముగలుగునట్లు చెట్టునకుఁగట్టి గండాభిల్లును తేవుదయమున నురిదీయవలెను." అనివ్రాసినారు. కాఁబట్టి నీమరణము తేపుదయమున నని కఠినముగాఁ జెప్పి తనకుఁగొంచెము కన్నీరు వచ్చుట చే నటనుండలేక వెలుపలికిఁ జని పండువెన్నెలలోఁబచార్లించెను. గం డాభిల్లు దత్తునచనములు విని పిడుగుపడినవాని చందంబున కట్టుబొమ్మ యై యపుడే చచ్చినట్లుండెను. తరువాత ఋషి వానినిగొంత యోదా ర్చెను. ఆపండువెన్నెలలో నాటిరాత్రి దత్తునకు గండాభిల్లుయొక్క మ రణవృత్తాంతమును దెలుపవలసి వచ్చినందుకు విచారమేగాక మఱియొక విచారముకూడ జ్ఞప్తికివచ్చెను. ఆనాటి పూర్ణచంద్ర సందర్శనముచే ద త్తునియొక్క మోహావమోధియుబ్బి మలయమారుత ప్రేరితములగు మ హామోహతరంగము లున్నతములగుటచే హృదయమీరెను. కమలయొ క్క ప్రథమసందర్శనమును వృషభసంహారమును మొదలగు నాటిపనులెల్లఁ గన్నులకుఁ గట్టినట్లెదుటఁ గనఁబడి దన్నైన కించుకసేపు గండాభిల్లుపై మఱపుగొల్పి రాజభక్తినిగూడ మఱపించెను. అందుచే చిత్తనైర్మల్యం బు చెడినందున నాతఁడు లేచి జాగ్రతగ నుండుమని సేవకులతోఁ జెప్పి వానిని ఋషి కప్పగించి తనకుఁ గమలాదర్శనమైన స్థానమునకుఁ జనెను. అరిగి హా సుందరీ! హా కమలా! నీవెంత యల్పాయుష్మంతురాలవైతి వే? వృషభము బారినుండి తప్పించుకొంటివి గనుక చిరకాల జీవిని వ గుదువనుకొంటినిగాని యింతలో నిట్టి బలవన్మరణము గలుగునని తలఁ పనైతిని. నీవు స్వర్గమునకుఁబోవుచు నాహృదయము నపహరించుకొని పోయినావు నన్నుఁగూడ నీసాన్నిధ్యమున కేలగొనిపోరాదు? నిన్నుఁజూ చిన కన్నులతో నింకొకకన్యను జూడఁజాలను. నిన్నుదలఁచిన మనసు తో నింకొకకన్యం దలఁపఁజాలను" అని విలపించి యూరటలేక, "ఇచ్చట నెకదా నీ నిమిత్తము నే నెద్దును వాడికోలలచేఁ గూలనేసితిని. ఇచ్చో టనెగద నిన్ను సందిటం గదియఁబట్టి నామనసార నీమొగము జెప్ప

వాల్చక చూచుచు నిన్నుఁ గూర్చుండఁబెట్టినది. ఇందేగదా నీవు నన్ను వాలుచూపులఁజూచి నా కాసఁగొల్పినది" యని యానాటిచర్యలెల్లఁ దలఁచి యాయాస్థానములకరిగి కూర్చుండుచు, లేచుచు, బవ్వళించుచు మన్మథబాణప్రహారముల కోర్వక విహరించుచుండెను.

## పదకొండవ ప్రకరణము.



ఇట్లు శ్యామసుందరుఁడట్లు విచారించి విచారించి ప్రొద్దుచూచునప్పటికి రమారమి జాముురాత్రియుండెను. అందుచేఁ జాల నాలస్యమైనదని యెంతసేపు విచారించినను గతజలసేతుబంధనమే కాన మృతినొందిన కమల మరలరాదనియెంచి ఋషి కుటీరాభిముఖుఁడై చనెను. చనుచు మార్గమధ్యమున, "తెల్లవారుచున్నది. గండాభేరుండను నే నురిదీయింపవలెను గాఁబోలు. ఈనాఁడు కెన్నండు నిట్టిదారుణకార్యము నేనొనర్చియుండలేదు. ఈపని నాపాలఁబడినందుకు నాకు మిగుల కష్టముగనున్నది నేనేట్లుచేయుదును. అయినను రాజభక్తియుఁ బ్రజాక్షేమముఁ జూచి యిద్దురాత్ముని జంపవలె. రాజాజ్ఞ సెలవు తప్పదుగద" యని తనలోఁదాను వితర్కించుకొనుచు నే వృక్షమునకు త్రాడువేయించి యురిదీయింపఁ దగునని యోచించుచు నిరుప్రక్కలనున్న మహావృక్షములఁ బరీక్షించుచు నడువసాగెను. ఇట్లు నడచి నడచి యొక కొంతసేపటికి ఋషి కుటీరసమీపమునకు నరుగుదెంచి యాగుమ్మముముందరఁ గన్నుచెదరునట్లు కుంకుమ నీటివలెనున్న రక్తమునుజూచి యాశ్చర్యమునొంది నిర్ఘాంతపడి నిలుచుండెను. నిలిచి నలుదెసలుఁ బరికింపఁ దన సేవకులలో నొకనిశిర మొకవైపునను మొండెమొకవైపునను బడియుండుట తన కన్నుల కగుపడఁగా దత్తుచిత్తము తత్తరమంద లోనికింజనియెను. చనినతోడనే వాని యాశ్చర్యమేమని చెప్పుదును. కుటీరములోఁ దన ము

ప్పురు సేవకులుగాని గండభిల్లులుగాని కనఁబడరైరి. కాలు సేతులు వెనుకకు విఱుగఁ గట్టఁబడుటచేఁ గదల మెదలనేరక నోట గుడ్డలు గ్రుక్కఁబడుటచే మాటలాడనేరక యొకమూలఁ బడియున్న ఋషినిమాత్ర మతఁడు చూచి మెల్లగా వానిని లేవనెత్తి యొకచోటఁ గూర్చుండఁబెట్టి కట్లువిప్పి నోటనున్న గుడ్డలనూడఁదీసి యీవైచిత్ర్యమునకుఁ గారణమడిగెను. ఋషి కొంత సేపటికి నీరసముతో నిట్లు చెప్పెను. "నాయనా, నీ వేల యడిగితివి? నీకొంప నాకొంపఁగూడ గీసితివి. నీ వెట్టి పాపపుగడియల బయలుదేఱితివో నీవు కుటీరము వెడలినతోడనే నలువురు భిల్లులు మాపైఁబడిరి. తరువాత నేమిచెప్పుదును తండ్రీ, విశ్వాసముగల శూరశిఖామణియగు నీ సేవకుఁడు, కావలికాఁడును వారి నెదుర్కొన వారొక్క ముహూర్తమున వానిని డమకట్టి నేలఁజేసిరి. తరువాత, నే నెదిరింపఁబోవ నన్నిట్లుచేసి చెఱలోనున్న గండభిల్లును వదలించుకొని పాఱిపోయిరి. వారరిగిన కొంతసేపటికి నీముప్పురు సేవకులు మెలఁకువఁ దెచ్చుకొని నాస్థితినిఁ జూడకయె దొంగ లేఁడని భయపడి యెక్కడికో పరుగెత్తిరి. ఇంతకుమించ నే నేమియు నెఱుఁగను. నాకుటీరమున నిట్టి పని జరిగినందున నన్నుఁగూర్చి ప్రజలేమని చెప్పుకొందురో యని నాకుఁ దలకొట్టికొన్నట్లున్నది. పాపము పుణ్యము పరమాత్ముం డెఱుఁగును." అని ఋషి తనవాక్యము సమాప్తముఁ జేయునప్పటికి, దత్తును విచారాశ్చర్య సముద్రమగ్నుఁడై తనజీవనము సమాప్తమయ్యెనని యెంచుకొనెను. ఈసేవకులె వానిని విడిచిరో భిల్లులే వదలించుకొని పోయిరో యని సంశయమొందుచుఁ దన భవిష్యదభివృద్ధియను వృక్షమునకుఁ బిడుగుపాటువలెఁ దటస్థించిన యీకార్యమునకు వగచుచు నిశ్చేష్టుఁడై గోడకుఁ జేరఁబడి కూర్చుండి యిట్లు వితర్కించెను. 'హా దైవమా! ఎంతపని జరిగించితివి! నాకా విరహతాపము నాపాపముచేఁ గలిగినది కాఁబోలును! ఏల ఖయిదీని విడిచి యేమఱితిని. ఏమొగము బెట్టుకొని

యుంచక నిందూరు పోవుదును. ఏమొగముబెట్టుకొని యహల్యాబాయి రాణిమొగము జూతును. నేనేమో స్వస్థానమునకు స్వామిభక్తిఁగల సమర్థుఁడననియుఁ, గృతజ్ఞుఁడననియు, నన్నీ కార్యమునందు రాణియు రాధాకాంతరావును నియోగింప నేను గామాతురుఁడనై చేతులార దొంగను వదలుకొంటిని. వాఁడు పారిపోయెనని నే నెంత చెప్పినను నామాటలీ కుట్రదినములలో నమ్మువారెవ్వరు? జస్వంతరావుతోఁ గలసి దొంగను నేను విడిచితినని జనులు నన్నాజన్మాంతము కళంకునిగ నెన్నుదురు. నేనిచ్చట మృతినొందక యిందూరుపురి కేల పోవలయును? ఆయినను రాణితో నాతప్పు విన్నవించి ప్రథమకోపమును క్షమింపుమని యామె పాదములపైఁబడెదను. నాకంటె నాసేవకుఁడే కృతార్థుఁడుగదా! రాణిసొమ్ము దినుచుండుటచేఁ దనప్రాణమును రాణికిచ్చి రాజఋణమును దీర్చుకొనెను. ఇంతచదువు చదువుకొని యెక్కువ యధికారినై నైదురూకలు జీతముగల బంటునౌకరుపాటి రాజభక్తిని జూపఁజాలనైతిని. ఛీ! నాబ్రతుకేల! అని పరిపరివిధములఁ జింతించుచుసంతలో సేవకులు ముగ్గురు దీనముఖులై వచ్చి శ్యామసుందరదత్తునియెదుట నిలిచిరి. దత్తు వారిని గనుఁగొని దిగ్గున లేచి, "దొంగయేమైనాఁడురా" యని యడిగెను. అడుగుటయు వారుకన్నీరు తమ నిర్దోషత్వమును దెలియజేయు దత్తుపాదములపైఁబడి, "స్వామీ మేము ముగ్గురము నిద్రించుచుంటిమి మానిద్రలో నీగొడవయెల్లఁ జరిగినది. మేము లేచునప్పటి కేబుసి బద్ధుఁడై యుండెను. మాప్రియమిత్రుఁడగు మీసేవకుఁడు నిష్కారణముగ మృతినొందెను. మేము మెలఁకువ వచ్చినతరువాత దొంగలు దొరుకుదురేమోయని తెలుసుకొనిపోతిమి కాని మాశ్రమ వ్యర్థమైనది. "అని రోదనముజేయుచుఁ దన పాదములు విడువక యున్నవారికి హెచ్చరికపుట్టఁ బలికి యభయహస్తమునిచ్చి ఋషియొద్ద సెలవుగైకొని పయనము సాగించెను. ప్రాణములకు మానములకుఁగూడ హాని

కరమగుపని తానే చేఁజేతఁ జేసికొంటిననియు రాధాకాంతారావునకుఁ గూడ తనమూలమున నపకీర్తి సంఘటిల్లుననియు, రాణి యిట్టివిషయములను దన్ను క్షమింపదనియు, నెఱింగి యారంభమున విచారభారము మెండగుటచే నాహారనిద్రల మాని హెచ్చరికలేమిచే నడక చకచక సాగక మెల్లగ నిందూరిపురి కరుగుచుండెను. త్రోవలో సేవకులలో నొకఁడు దత్తును గనుగొని, "అయ్యా మనప్రాణముల రక్షించుకొనుట కుపాయమొకటి కలదు. దొంగ పారిపోయెనని చెప్పుటకు మాఱు దొంగనురిదీసితిమని మనము చెప్పినచో మనప్రాణములు దక్కును.

అన శ్యామసుందరుఁడు తన సుందరముఖమున మందహాస మలంకరింప "ఓయి పిచ్చివాఁడ! అబద్ధమాడినచో దాగునా? భగవంతునియెదుట మనముదాఁచగలమా? అనృతము పైకెన్నఁడైన పొక్కకపోదు. ఆయాలోచనఁ గట్టిపెట్టి మనమందఱమునిజమొప్పుకొందము. పైనదేవుఁడున్నాఁడు" అని మందలించి యెడతెగని పయనముతో దత్తు మహానగరమునఁ దనసోదరినైనఁ జూడక యా నాటిమధ్యాహ్నము రెండున్నరయామములకు నిందూరునగరముఁజేరి రాధాకాంతుని యింటికిఁ జనక తనప్రమాదము నెవ్వరితోను జెప్పకొనక మృత్యుదేవత కెదురు సన్నాహము సేయువాని తెఱంగున నతిధైర్యముతోఁ గోటకుంజని రాణికి దనరాక నెఱుకచేసెను. రాణియుత్తరవు ప్రకారము లోనికింజని శ్యామసుందరుఁడు నిలిచినతోడనే యామె యాత్రముతో, "గండాభిల్లు నురిదీసినావు కాదా? చచ్చునప్పుడు వాఁడేమన్నాఁడు? భిల్లులకు బుద్ధిజెప్పితివా" యని యడిగెను. ఆమాటలనుఁబ్రత్యుత్తర మంతటియాత్రముతో నీయక కొయ్యవలె నిలునంబడియున్న దత్తుంజూచి యామె, "ఏమిది పలుకవు? వాఁడేమయినాఁడు చెప్పవేమి?" యని తొలుతకంటె నెక్కువ యాత్రముతోడను, నెక్కువ వేగముతోడను దత్తును బలుకరించెను. అంతట వారిట్లుమాటలాడిరి.

దత్తు—(చేతులుజోడించి) అమ్మా నేమని చెప్పుదును! గం డాభిల్లా పారిపోయినాఁడు.

అహల్య—(చెవుల నీ పలుకులు పడునప్పు డామె చమురుచు క్కతగిలిన తప్తలోహమువలె దుర్నిరీక్ష్యయై) నీవింక ప్రాణములతో నుండఁగనే?

దత్తు—నేనీవార్త నేలినవారికి విన్నవించుటకు జీవచ్ఛవమునై యున్నాను.

అహ—ఓరిమూర్ఖుఁడా, రాజద్రోహి! జస్వంతరావు ప్రముఖులలోఁగూడి రాధాకాంతరావు కష్టపడి పట్టుకొన్న దొంగను లంచములు గ్రహించి వదిలిపెట్టి దొంగ పారిపోయెనని చెప్పుట కింకను బ్రతికియున్నావా? ఇంతదూరమురానేల. అచ్చట నెందుకు నీవు పొడుచుకొని చావనైతివి? నీప్రాణములు నీకు దక్కనిత్తునను కొంటివా యేమి పశువా?

దత్తు—అమ్మా! అది నా రాజద్రోహమువలన నైనదిగాదు. పొరపాటు.

అహ—ఛీ! సిగ్గులేక వంకలుచెప్పుకొనెదవేల? పొరబాటా? చేఁజిక్కిన యపరాధిని జేతులార విడచితివి పొరబాటెట్లగును? ఛీ నా మొదుటలే. నీమొగమును జూచి నేను భరింపఁజాలను; నీయాయువు నేటితో మట్టమయినది. నా మంచితనము నాయూదరణము నీకు విషమైనది. ఓరీ, ఎవరురా. వీనిచేతుల విఱిచికట్టి వీనినిఁ బట్టుకొమ్ము. రాధాకాంతునిఁ బిలుచుకొనిరమ్ము.

ఇట్లు మొత్తని లేడిపిల్లపై నంకించు నాఁడుసింగమువలె రూక్ష వచనముల శ్యామసుందరదత్తుని నొప్పించి వాని నొక భటుని యధీనముఁ జేసి రాధాకాంతాదులయాగమనమును నిరీక్షించుచుండెను. దమ్ముతోఁ గూడవచ్చిన ముఖ్యులైన సేవకులలో నొకఁడు రాధాకాంతుని గృహమునకుంజని, జరిగిన వృత్తాంతమంతయు వాని కెఱింగించెను. దగ్గును దన కుమారునికంటె నెక్కువ ప్రేమతోఁ బెంచుకొనుచున్న రాధాకాంతుఁ డాయాకస్మిక దుర్వార్తచే సమూలవిశ్రగిపట్లు దుర్బలుఁడై తాను నాటిన మొక్క నిర్మూలమగు సమయము వచ్చినదని విచారింపఁ దొడఁగెను. ఇంతలో రాజసేవకులు వానిని బిలువవచ్చుటచే నాతఁడు పయనమై నిసగాయపు బాష్పపూర్ణములఁ గుమురసంమున మెల్లమెల్లగఁ జేతిత్తన్ను మాయమున నడచుచు సంతిపురముఁ బ్రవేశించి సరికాసుధసంహాసిన్నిస్మితయగు సత్యభామవలె నెప్పుఁ గొలువు దూఁపుగల యహల్యను గని యుచిత నమస్కారముల నొసఁగి యెదుట నిలిచెను. అంతట నచట నీక్రిందిసంవాదము జరిగెను.

అహ—ఏమయ్యా నీవు మాకు మేకలమందలోఁ బెద్దపులినిఁ దెచ్చి పెట్టినావు సుగుణాసులెల్ల నిశేషము మఱియు కాదూ. రాజభక్తిఁ బెట్టినది పెనుగదా యితఁడు? ఆగుణము లేమైనవి? దొంగను జల్లగాఁ బంపినాఁడు.

రాధా—అమ్మా! జరిగినసంగతి యేమో మీరు విచారింపవలెను. ఆరంభమునుండి యతని యుద్దేశమిదియని చెప్పఁదరముకాదు—

అహ—నీ కింకా కనపడదా? సుతనియందు దుష్టుచేతనే యింత మునిఁగినది. తేనెపూసిన కత్తియగు నీమూర్ఖునిచే నిష్కారణముగ మేము వంచింపఁబడితిమి. జస్వంతరావు మొదలగువారు నన్నుఁజూచి యిపుడు నగరా? మిమ్మునమ్మకొని నే నుభయత్ర వ్యర్థురాలనైతిని. ఇటువంటి పాపాత్ముని విడవరాదు. ఓయీ శ్యామసుందర! రాజద్రోహమునకు నీకు మరణదండన విధించినాను. అంతటఁగాని నాకోపాగ్ని చల్లారదు.

రాధా—(విచారముతో) అమ్మా! బాలునియందు దయఁజూపుటకు నాప్రార్థన.

అహ—ఏమిదయ? దేశమును దోఁచుకొనుదురాత్ముని విడిచిన దురాత్ముని, రాజద్రోహము సల్పినయపకారిని, శత్రువులలోఁదూరిన మన్నీతిపరుని నేనెట్లు శిక్ష చేయకుందును. నీముసలిమాటల నిఁక గట్టిపెట్టుము. ఇతని నొక్కనిఁ జంపుట నాయభిప్రాయము కాదు. ఈకుట్రలో నింక నెందఱు చేరిరో విచారణఁజేసి వారి కందఱకు సంఘమరణము గల్పించుట కర్తవ్యము. కాఁబట్టి విచారణ సలుపుమని గోమాజీరావువద్దకు వీని నంపెదను. శ్యామసుందరా! నీసాక్ష్యమును నీవుఁ జెప్పుకొనుము. ఓరీభటులారా! వీనిని జెఱసాలలోఁ నుంచుఁడు.

రాధా—అమ్మా! నేను జామీనుండెద నాకు వీనినప్పగింపుఁడు.

అహ—జామీను గీమీను బనికిరాదు. విచారణ కావలయును. మీరందఱు నింక నరుగుఁడు.

అని యామె లేచునప్పటికందఱును జనిరి. శ్యామసుందరుఁడు మరణదండన విని నప్పుడును మనోధైర్యము విడువక నిశ్చలుఁడై యుండి రాధాకాంతుని వీడ్కొని భటులుగొనిపోవఁ జెఱసాలకుఁ జనెను. రాధాకాంతుఁడు కన్నీళ్లతో నాతని విడిచి యింటికిఁ జనెను.



పండ్రెండవ ప్రకరణము.



గుండాభిల్లు శత్రువులచేతఁ జిక్కినాఁడని విన్నది మొదలు విచారణసమయమున దమకుట్రను భిల్లులు బయలు వెట్టుదురేమోయనియుఁ దమకాప్తుఁడగు గుండాభిల్లు నిష్కారణముగ నురిదీయఁబడుననియు బెంగఁగొని కాలుగాలిన పిల్లులవలె వాలతరావును దుండిరావును జస్వంతరావు గృహముచుట్టును గోమాజీరావు గృహముచుట్టును దిరుగసాగిరి.

అందుఁబిరికివాని లోఁ పగెరెప్రసుండగు దుండిరావు తనప్రాణములు బిక్కు బిక్కు మనుచుండుటచే నగరమునందుండక దగ్గఱనున్న యొక గ్రామమునకుఁ బాఱిపోయి బంధుగులయింట దాఁగెను. శ్యామసుందరుని స్వాధీనమునందుండిన భిల్లుతప్పించుకొనిపోయిన వార్త చెవులకుఁ జల్లగ వినఁబడుట మొదలు తనప్రాణమిత్రుఁడు తప్పించుకొనినందులకును దమ రహస్యములు బయలుపడు నవస్థలు తప్పినందులకును రాణితలంపులు భగ్నములైనందులకును దాలతరావు మితములేని యానందము నొంది శ్యామసుందరదత్తునకు రాణి మరణదండన విధించెననియు గోమాజీరావుచేత నతఁడు విచారణఁజేయఁబడెననియుఁ దెలిసినపుడు కోర్కెలెల్ల సిద్ధించినవనుకొని దుండిరావును బిలిపించెను. ఆపగలంతయు వగల బొగలుచు దత్తు చెఱసాలలోనుండి తనయొక్క లమరణమునకును శాశ్వతాపకీర్తికిని దనసోదరికిఁ దనపైఁగల యనురాగమునకును సర్వేశ్వరు మాయలకును సక్కజపడఁజొచ్చెను. దీపములు పెట్టినవెనుక రనంత కలఁతనిద్దురపట్టి యందుఁ దన్నురిస్థంభముపై నెక్కించినట్లును దాను మృతినొందినట్లును దనసోదరివచ్చి తనశవముపైఁబడి యేడ్చినట్లును దుస్వప్నముం గని మేల్కాని నలుదెసలుచూచి మరునాఁడుదయమున జరుగఁబోవునది ముందుగా దృగ్గోచరమయినదని తెలిసికొని మనసులో హా దైవమా! నిన్న నీపాటికి గండాభిల్లునకు వాని మరణవార్తను నేను జెప్పుచుంటిని. నేఁడు నా మరణవార్తను దలఁచుకొనుచుంటి. ఏమి నీ వైచిత్ర్యము! ఈవృథావిచారముతోఁ గాలయాపనమేల? త్వరగా నాకు స్వర్గలోకసుఖమును గమలాదర్శనమును జేయింపుము. అని వేఁడుకొనుచు నొకమారు కన్నీరు పెట్టుకొనుచుఁ బరితాపమొందసాగెను. “శ్యామసుందరునివంటి బుద్ధిశాలియు బలశాలియుఁ దమ పక్షమునకు వచ్చు నేని తమకక్కెగ్గునని యాతని నెట్లయినఁ దమవైపు ద్రిప్పుకొనుటకు జస్వంతరావు ప్రముఖులు ప్రయత్నములు చేయఁదలఁచి” కారాగృహాధికారి తమ

కుటిలోని పాడై యగుట జాముూరాత్రియైన తరువాత జస్వంతరావు రహస్యముగఁ జెఱసాలయొద్దకరిగి జీవచ్ఛవమువలెఁ బంధుకొనియున్న దత్తునుఁ జూచి జాలినొంది మెల్లగవానిని లేపెను. దత్తు లేచి తనయెదుట జస్వంతరావునుజూచి యదికలయేమోయని కలవలపడి నిజమని తరు వాత నెఱిఁగియతఁడక్కడకు వచ్చుట కాశ్చర్యపడెను. అంతట జస్వంత రావు వానిని బలుకరింప వారిట్లుమాట్లాడిరి.

జస్వంత—శ్యామసుందరా! రాజులను రాణులను నమ్మినవారి బ్రతుకులు తుదకెంతవఱకు వచ్చునో నీవు స్వానుభవముచే నిప్పుడెఱిఁ గితివా? చలచిత్తులగు ప్రభుపిశాచముల సేవించుటకంటె ముష్టియెత్తు కొని బ్రతుకుటమేలు. నిన్నుఁగూర్చి నాకు విచారముగు చున్నది.

దత్తు—నాకర్మమునకు రాణియేమిచేయఁగలదు? నేనుజేసిన య పరాధమునకు నేను దగినశిక్ష ననుభవించుచున్నాను. ఆమెలోపము లేదు.

జస్వంత—నీపిచ్చి నీకింక వదలలేదు. నేను నిన్ను బ్రతికించు ను పాయమొకటిచెప్పెదను. నామాటవిని ప్రాణమును దక్కించుకొనుము. నిన్ను రేపుప్రొత్తాలగు గోమాజీరావు విచారణచేయునుగదా? గోమా జీనాకు మిత్రుఁడు. నీవు రాణిపక్షము విడిచి మాపక్షము నవలంబించి ప్రమాణముచేసి తరువాత మాకక్షలోనుండి రాణితోఁ బోరెదవని గోమాజిరావుతోఁ జెప్పి నిన్ను రక్షింపఁజేసెదను. అట్లు చేసెదవా?

ఈప్రశ్నమునకు దత్తుత్తరము సత్వరముగఁ జెప్పలేకపోయెను. మహాపాతకహేతువును దుర్గశాప్రాప్తి కారణము నైన రాజద్రోహ మున కొడిగట్టి యాత్మరక్షణ మొనర్చుటుచితమో, తుచ్ఛ ప్రాణముల పై నాసఁగోసి న్యాయముగు దండనమొంది దేహముఁ జాలించుట యుచి తమో వేగమెనిర్ణయింప నేరక తటపటాయించుచుఁ గొంతసేపటి కిట్లు చెప్పెను. అయ్యా నా ప్రాణము రాజభక్తి విషయమున ధార

పోయుదునని ప్రతిజ్ఞ గైకొన్నవాఁడను. రాజద్రోహము జేయుటకు నా ప్రాణ మొప్పుకున్నది. మరణ మొసఁగైనను దప్పదుగదా. కుటిలవారి లోఁజేరి రాణినిక్షోభ పెట్టి ప్రజలను గీప కొలఁదికాలము సుఖపడుటకంటె గౌరవముతో నీ తుచ్ఛప్రాణము విడుచుట మంచిది. నన్ను బ్రతికించుటయు జంపుటయు ననుకీర్త్యపకీర్తులు రాణికే దక్కవలె.' అని జస్వంతరావు వ్రాసిన మ్రింగివేయునంతటి యలుకతోఁ గన్నులెఱ్ఱఁజేసి దారుణపువావు చావవలసినయోగము నీ కుండఁగ నా మాటలువిని బాగుపడుటకు నీకు మంచిబుద్ధి యెట్లుపుట్టును? నీకర్మమంతే చావుము" అని చివాలునలేచి చెఱసాలవిడిచి పోయెను. నాఁడట శ్యామసుందరుఁడు కాలి ముందరికివచ్చిన యదృష్ట దేవతను ద్రోచివైచితినని కొంచెము పశ్చాత్తాపమునొంది మఱల తాను సలిపినదియె యుత్తమ కార్యమని యూరటనొంది యెపుడు తెల్లవారును? ఎప్పుడీయైహికదుఃఖము పోయునని సిద్ధముగ నుండెను. ఆరాత్రి గాంతరావు గోమోజీరావును జూడఁబోయి కొన్ని రాజకీయ వ్యవహారముల ముచ్చటించి నడుమ దత్తువిషయమై ప్రసంగముగాఁగా వారిట్లుమాట్లాడిరి.

దౌల—జస్వంతరావుమాట మనము నమ్మజాలము. భిల్లులు దేశముపైఁబడిదోఁచుకోవలనుగాదఁట! రాజపుత్రులు గండెత్తిరావలనుగాదఁట! నీతియనుండవలెనఁట! కక్ష సాధించవలెనఁట! అదియుండిన నిదిరాదు. అంత నీతిమంతుఁడయ్యెనేని కక్షలోఁ దిగనేకూడదు. దిగిన వెనుక నన్నిపనులు చేయవలెను.

గోమో—అతనిని మొదటినుండియు నేను నమ్మలేదు. అయితే దత్తుగతి యీలాగునవచ్చినదేమి? అతనిని విచారణ చేయుమని రాణి నాతోఁ జెప్పినది.

దౌల—నేను పన్నిన పన్నుగడసఫలమైనది కాని నీదగ్గఱ విచారకు వచ్చినప్పుడు మనమిదివఱ కనుకొనినట్లు నీవుదత్తునుఁ గడతేర్ప

వలయునుజుమీా ? అతఁడును రాధాకాంతుఁడును జచ్చినఁగాని మనము నెరవేరము. వారె కమలను నేను బాధపెట్టుచున్నాననియు నామెను నేను వివాహ మాడుదుననియు నాపై నేరములు రాణితోఁజెప్పి లోకములో నారెండు సంగతులనుజాటి నాకప్రతిష్ఠ ఘటించినవారు. రాణిమీాఁదకంటె వారిమీాఁద నా కెక్కువకసికలదు. అందు శ్యామసుందరునిపై నాకుఁగల కోపమునకు మితములేదు. వాని నురిదీయించునట్లు సెలవీయవలెను.

గోమో—నేనిందు లేశమైన నన్యాయముఁ జేయను నేనుపిల్లలుగలవాడను, ముక్కునకు సూటిగఁబోయి న్యాయమే చేసెదను.

దాల—మనలోమనకె యిన్ని భేదములుండఁగ మనమెట్లు నెగ్గగలము?

గోమో—అన్యాయముగఁ జంపినదో నామీాఁదఁ బ్రజలకుఁ గోపముండదా?

దాల—సరే నీయిష్టము వచ్చినట్లు చేయుము నేనరుగుచున్నాను.

అని దాలతరావు విసుకుతోఁ దన గృహము విడిచిపోయిన తరువాత గోమోజీరావు మొదట లోపల దాగియున్న యొక పురుషుని "భేతాళా యిఁకరావచ్చునురా" యని పిలిచి తన ప్రక్కను గూర్చుండఁబెట్టుకొనెను. భేతాళసింగు హిందూస్థాన నివాసియగు రాజపుత్రుఁడు. ఇనుపకడ్డీలవంటి భుజములును గుండ్రనితలయుఁ బచ్చని మొగమునకు నీలికాంతుల నొసంగు కోరమీాసములును వాని యాకారము భయంకరముగఁ జేసెను. అతఁడు గూర్చుండిన వెనుక వారిట్లు మాటలాడిరి.

గోమోజీ—సైన్యము లీపాటికి నింబపురము వచ్చియుండునా ?

భేతా—ఇంకను వచ్చియుండవు. ఈనుమ మారాణావారికి దేహమునవిండుక భారము గనున్నది. అందుచే నాలశ్యమైనది.

గోమా—శివనానా తప్పకపారిపోవును. అతనిదగ్గఱ విశ్వాసమెగాని బలములేదు. మీరు తుకాజీ హోల్కారునకు మాత్రమే జడియవలెను.

భేతా—అతఁడు నింబపురము మీఁదికి రాకుండ మీరుజాగ్రత్త పెట్టవలయును నిన్ననొ నేఁడో రాణావారు నింబపురము వచ్చియుందురని తలంచుచున్నాను.

గోమా—నాకువేళయైనయున్నది. నీ వింకపొమ్ము. మఱచిపోక నా సొమ్ము నాకప్పగించుసుమా!

అన భేతాసింగు వీధియరుగుపై నిద్రించు భైరవసింగును వెంటఁబెట్టుకొని తన దారింబోయెను. అనంతరము గోమాజీరావు (తనలో) "నా కోరిక యిప్పుడైన నెఱవేరి యీ రాజపుత్రులు నింబపురముఁ బట్టుకొని యహల్యాబాయిని పారఁదోలి తామే దేశమంతయు నాక్రమించుకొని నాకు మంత్రిపదము నొసఁగుదురా? నేనంతటియదృష్టవంతుఁడ నగుదునా" అని యోచించుచుండఁ దలుపు దోసికొని వామనభట్టువచ్చి యెదుట నిలిచెను. ఆలోచనలమాని కొత్వాలు వానివైపుఁజూడ వాఁడిట్లనియె "అయ్యా అతఁడేమియు లంచమిచ్చుస్థితిలో లేఁడు వానికి బంధువులు లేరఁట.

గోమా—ఇచ్చువారు లేకేమి? మహేశ్వరములో నతని బావ యున్నాఁడఁట. అతఁడు వీనిని వదలించుటకు నెంతధనమైన నాకు లంచమిచ్చును. దత్తు ప్రాణరక్షణకు రమాకాంతరావే లంచమిచ్చును. కాని నే నాతనిదగ్గఱనుండి లంచము గ్రహింపను. అతఁడు నమ్మఁదగినవాఁడు కాఁడు.

వామన—నేను సాధ్యమైనంత ప్రయత్నముచేసి మీకు రెండువందలైన లంచము తెప్పించెదను. మీరు లంచములేని పని చేయనని ప్రతిజ్ఞఁగైకొన్నారుగదా?

గోమో—ఏమాత్రమైనను పనిగే కార్యము చెడకుండఁ దీసికొని రా. ఇంకపో నేను నిద్రపోవలయును.

అని వామనభట్టునంపి తెల్లవారుదాఁక నిదుర లేక యిటునటు పొరలుచు నెట్లో యారాత్రి నాలుగుజాములు గడపి యుగియను నంబెంద లకడ మేల్కని రాణిదర్శనార్థమరిగెను. గోమోజీని పరమవిశ్వాసముగల యుద్యోగస్థులలో నొకనిగ రాణి పరిగణించుటచే నాతనికిఁ దగునాసనమొసంగి కూర్చుండఁ బనిచి గౌరవించి పనియేమని యడిగెను. అంతట గోమోజీలేచి "అమ్మా! రాజ్యమల్లకల్లోలముగ నుంటచే నాకు నిద్రపట్టుటలేదు. జస్వంతరావు ప్రేరణచే రఘునాథరావు సైన్యమును వెంటఁ బెట్టుకొని మనపై వచ్చుచున్నాఁడఁట.

అహ—ఏమీ వచ్చుచున్నాఁడా! నీ కెవరుచెప్పిరి? నిజమని తోఁచదు.

గోమో—అయ్యయ్యో మీరు మాయమర్మ మెఱుఁగరు. శ్రీపేష్వామాధవరావుగారు పిన్నతండ్రిని దగుబలమిచ్చి పంపినారు. మీరుతక్షణమె తుకాజీహోల్కారును వారిపై కంపఁదగును.

అహ—తుకాజీనిగాదు. రాధాకాంతరావు నంపుదును. ఈ వేళ నీవుదత్తుపై వచ్చిన యభియోగమును విచారించి న్యాయమైన తీర్పుఁజేయుము.

గోమో—రాధాకాంతుఁడు ముసలివాఁడు. అతఁడేమియుఁ జేయఁజాలఁడు. తుకాజీని బంపుట యుచితము. మీఁద మీచిత్తము.

అహ—ఎవరైననేమి? విశ్వాసముతోఁ బనిచేయవలెనుగాని నీవింకఁ బొమ్ము.

అన గోమోజీ తనయేలికవద్ద నుచితప్రకారముగ సెలవుగైకొని నిష్క్రమించెను. రాణి రాధాకాంతుని బిలిపించి, తగుసైన్యముతోఁ దక్షణమె పూనానగరమునుండి వచ్చుచున్న రఘునాథరావున కెదు

రుగఁజని వానినోడించిరమ్మని యానతిచ్చెను. దత్తునకు మరణదండన తప్పించుటకుఁ బ్రయత్ని[illegible]దలఁచుచున్న రాధాకాంతరావు పొరుగూరు పోవలసి వచ్చినందులకును దత్తునకు సహాయము చేయలేకపోయినందులకును జింతించి వెళ్ళుట కిష్టములేక తప్పక పురి వెడలెను.

## పదుమూఁడవ ప్రకరణము.

రాణి దర్శనముచేసి సంగతుల ముచ్చటించి గోమాజీరావు తిన్నగాఁ దనకచ్చేరికి వచ్చెను. కళాహీనమగు మొగముతోడను, దయాహీనమగు హృదయముతోడను, దన మొగమువలె వెలవెలఁబోవు తెల్లనివస్త్రములతోడను, టక్కుటక్కు మను ముచ్చెలచప్పుడులు నందిమాగధులై తనరాకఁ దెలియఁజేయఁ జేత నొక కణుపులుగల పాలకఱ్ఱ విలాసార్థముగఁ బట్టుకొని కచ్చేరికి దయచేసిన కొత్వాలును జూచి బంట్రౌతులు దండములు పెట్టిరి. అతఁడు కచ్చేరిలో నడుమ వేయఁబడిన తనపీఠము నలంకరించినతోడనే నేరములు చేసినవారు క్రమక్రమమున వానిమొదుటికిఁ దీసికొని పోఁబడిరి. తనకు సహాయము నొనర్పఁదగిన రాధాకాంతుఁడు తక్షణమె యూరికిఁ జనుటయు, శత్రుగణముతోఁ జేరి తనపైఁ గక్షవహించిన గోమాజీ తన్ను విచారణసేయుటయు, స్వయముగ రాణికి దనపైఁగోప ముదయించుటయు నరసి దత్తు తనకు మరణము తప్పదని ప్రాణరక్షణార్థము ప్రయత్నములఁగూడ మానెను. శ్యామసుందరుని, వాని గుణములును, నెఱిఁగిన వారగుటచే నతని విచారణఁ జూడవలయునని నగరవాసులలోఁ బెక్కండ్రు కచ్చేరికి వచ్చి యెడతెరపినీయక గణగణ ధ్వనిఁజేయుచు నెక్కడఁ జూచిన తామే యై యుండిరి. రాధాకాంతుని భార్యయగు రోహిణీబాయి రాణిదర్శనము చేసి మెల్లగాఁ బ్రసంగవశమున దత్తుమాట నెత్తి యతని ప్రాణరక్షణఁ

జేయుట యుచితమని రాణితో మనవి యొనర్చినదయ్యు నామె కసరికొట్టి యిట్టి యనావశ్యకవిషయములో జోక్యము కలుగఁ జేసికొనవలదని గట్టిగ మందలించినందున రోహిణియేగాక యితరులుగూడ నట్టి పరాభవము తమకుజరుగునని భయపడి రాణితో దత్తువిషయమై ప్రసంగించుట మానుకొనిరి. తనమాట వినలేదని జస్వంతరావు దత్తుపై నలుకఁబూని వానిపై సాక్ష్యముఁ గుదుర్చుచుండ దౌలతరావు సహజముగ నాతని నాశనమును గోరుచుండ లంచము దనకునీయలేదని గోమాంజీరా నలుకవహించి తన తొంటికోపము నిప్పుడు దీర్చుకొనఁ జూచుచుండెను. దత్తు తనకు లంచము నొసంగిన దో గోమాంజీరావు ప్రతికక్షిలోని వాఁడని కోపమువదలి వానిని విడిచియె యుండును. గోమాంజీకిధనము నధికారము, ప్రధానముగాని తనకక్ష, నీతి, ధర్మము మొదలగు పట్టింపులు లేవు. అప్పటికింకను శ్యామసుందరుని బావమఱఁదియగు మురళీధరదాసును వీనిసోదరియగు నానందయురాలైరి. ఇట్టి స్థితిలో స్వపక్ష పరపక్ష సహాయశూన్యుఁడును, విచారవిహీనుఁడును, నిరంతర నిర్మల చిత్తుఁడునగు శ్యామసుందరదత్తు కొత్వాలుగాని యెదుట నిలువఁబెట్టబడఁ జూడవచ్చిన జనులెల్ల వాని సౌకుమార్యమును దలఁచియు, గుణములఁదలఁచియు దుఃఖితులై తేఱి యాతనిఁజూడజాలరైరి. దత్తుతోనుండిన ముప్వురు సేవకులు సాక్ష్యము నిమిత్తము కొత్వాలువలన రప్పింపఁబడి యెదుట నిలిచిరి. ఋషి కుటీరములోనుండి దొంగ పలాయన మొందుటచే యాతనిసాక్ష్య మావశ్యకమని వానికై క్రిందటిరాత్రియె కొత్వాలు పల్లకి నంపినందున నాతఁడును బయలుదేఱెను. కాని యప్పటికిఁ గచ్చేరికి రాలేదు. అట్టహాసము విస్తారముగ జరిగెను. కాని విచారణ ముహూర్తకాలములో మూఁడు ముక్కలతో ముగిసెను. అపుడు విచారణ మారంభముకాఁగా, కొత్వాలు దత్తును గనుఁగొని "నేరమును జేసితివా" యని యడిగెను. "నేను బుద్ధిపూర్వకముగ నేరమును

జేయలేదు" అని ప్రత్యుత్తరమును జెప్పి యదురుబెదురులేక యొఱఁదీసి
న కత్తివలె నిలువఁబడెను. తరువాత సాక్షివిచారణ మారంభించి కొ
త్వాలు మున్నగు సిపాయిలలో నొకని నీవిషయమునుఁ గూర్చియడుగ వాఁడి
ట్లనియె. "నేనెఱింగినవఱకు నిజము మనవిచేసెదను. ఋషికుటీరములో
మేమందఱముండఁగ, దత్తుగారు గండాభిల్లుని దనవెంటఁదీసికొని యెక్క-
డికో పోయిరి. అర్ధరాత్రి ఖయిదీని దానొంటరిగ వెంటఁబెట్టుకొని పోవ
లసినయు నది ప్రమాద కారణమనియు, మేమువలదని వాదించినను
మామాటలువినక యతఁడట్లు దొంగతో నెటకోయరిగెను. మేమును
వెనువెంట రహస్యముగ నరిగి వారి సంభాషణఁ గొంతవింటిమి. మాకు
వారిమాటలు స్పష్టముగా వినఁబడలేదు. "కాని నాలుగువందల రూ
పాయలు కావలెను. లేనియెడల నేనిన్ను విడువను" అనుమాటలు
మాచెవులఁబడినవి. తరువాతఁ గొంతసేపటికి దొంగ పారిపోయినాఁడని
యూతఁడే మాతోఁ జెప్పెను. ఇంతకుమించ మే మేమియు నెఱుఁగము
శ్యామసుందరుఁ డానుడువుల నాలకించి వింతకథలు సృష్టించిన బంట్రో
తుయొక్క- ద్రోహసాహసముల కచ్చెరువడి "ఇది కేవల మబద్ధము.
దౌలతరావు మొదలగువారి కుట్ర" అను దత్తుపలుకుల నాగ్రహించి
"ఛీ నోరుమూయుము. నిన్నెవరడిగినారు! ఇతరులజోక్యము నీ కెం
దు" కని గోమాంజీరావు వానిని మందలించి రెండవసాక్షిని విచారణసే
య, వాఁడును మొదటివాఁ డప్పగించిన పాఠము నే యప్పగించి దత్తునకు
మఱియు నక్క-జమునుఁ గల్గించెను. మూఁడవవాఁడు కొంచెము మేన
కుఁడుగావున సాక్ష్యమిచ్చునపుడు తడఁబడి యొకమాటఁ కొకమాట జె
ప్పి తనసాక్ష్య మిరువురకుఁగూడ నిరర్థకము సేయుటయేగాక నడుమ
నొకసారి "యిట్లు నిన్ననను చెప్పుమన్నా" రనిదత్తు బుకాయించియ
డుగ "దౌలతురావు చెప్పుమన్నారండి" అని లేదండి నేనే చెప్పినానం
డి యనినడఁక నారంభించెను. కచ్చేరీలో వేడుక చూఁడవచ్చి కూర్చున్న

చాలతరావు మొగము చిన్నబోయెను. చూడవచ్చిన వారందఱు మిక్కిలి యన్యాయ మన్యాయమని యఱచి చప్పట్లు గొట్టిరి. గోమోజీరావు మిగులఁ గోపముతో ఛీ మూర్ఖుఁడా నీ దొంగసాక్ష్యము నేను నమ్మను. నీతోడి వారిద్దఱు నిజముఁ బలుక నీవు దత్తువద్ద లంచము పుచ్చుకొని యబద్ధ మాడెదవా. చూడు నిన్నేమిచేసెదనో చూడుమని యావెంగిలి బంట్రోతునకుఁ గాలుసంత పిఱికిముందుఁ బెట్టెను. దానితో వాఁడు తిరుగ తెలివిఁ దెచ్చుకొని చెప్పవలసినట్లు చెప్పెను. ఇంతలోఁ బల్లకిలోఁ గూరుచుండి ఋషి యరుగుదెంచుటయు సభ్యులును కొత్వాలునుగూడ నాతని సన్మానముచేయుటకు లేచి నిలిచి నమస్కారముఁజేసిరి. ఋషి నారాయణ, నారాయణ యనుచు సందఱఁగూర్చుండ నియమించి యున్నతాసనముఁ గొత్వాలునకు సరాసరిగఁ దానును సుఖాసీనుఁడయ్యెను. అనంతరము వినయవిధేయతాపూర్వకముగ ఋషిని గన్గొని కొత్వాలు మీ రీవిషయమునఁ దెలిసినంతఁ జెప్పవలయు" నని ప్రార్థనయన ఋషి యిట్లనియెను. నన్ను మీరు ప్రశ్నవేయవలదు. భగవంతుని మోముఁ జూచి నిష్పక్షపాతముగ నేను జెప్పెదను. శ్యామసుందరదత్తు నాకుటీరమునకప్పుడప్పుడు వచ్చుట గలదు. నాతో రహస్యమున గొన్నిఁగొన్ని యోచనలు సేయఁ బ్రయత్నించెను. దొంగ పాఱిపోవుటలో దత్తు పొరఁబాటుపడెనో బుద్ధిపూర్వకముగఁ జేసెనో చెప్పఁజాలను. రాజభక్తి యతనికి విస్తారముగ నున్నదని నమ్మఁజాలను. పొరబాటుచేతనో బుద్ధిపూర్వకముగనో రాజద్రోహము జరిగినదిగనుక శిక్షకుఁ దగినవాఁడేయని నాకుఁ దోఁచుచున్నది. ఇతఁడ సత్పురుషుఁడని నాయభిప్రాయము. అని ఋషి పలుక 'ఛీ! ఈ ఋషీగూడ నబద్ధమాడుచున్నాఁడు. ఏమిది యని దత్తు బిగ్గఱగ నఱచెను. "అయ్యయ్యో! దైవస్వరూపుఁడగు ఋషి యబద్ధమాడుచున్నాఁడని యనుటకు నీ నాల్క యెట్లాడెను? మూర్ఖుఁడా నోరు మూసికొ

ను" మని గోమాజీరావు దత్తును గద్దించి యీయభియోగము నిట్లు సమాప్తము జేసెను. 'ఓయీ శ్యామసుందరదత్తూ! నీ యందమును నీవయసును జూడ నాకు మనసు కరఁగుచున్నది. కాని నీ చేష్టలు, నీస్థితికిని వయస్సునకును దగినవి కావు. చిన్నతనమునందే యింతటికుట్రలు చేసినవాఁడవు నీవు పెద్దవాఁడవగుదువేని లోకములు ముంచివేసెదవు. అంతటి ధర్మస్వరూపురాలిని మోసముచేయుటకు నీమనసెట్లు లొప్పినది? ఋషిమాటలఁబట్టి చూచిన సేవకుల సాక్ష్యముఁబట్టి చూచిన నీ వపరాధివని నాకుఁ దోఁచుచున్నది. నీకిప్పుడు శిక్ష విధింపవలయును.' అనునప్పటికి దత్తు వానిమాటల కడ్డమువచ్చి "అయ్యా! మీరునాకు విధించెడు శిక్ష మరణముకంటె నెక్కువగ నుండదు. నే నందుకు సిద్ధముగనుంటిని గనుక నే నిర్భీతిగ నిజ మందఱముందుఁ జెప్పుచున్నాను. దొంగయు మనుష్యునివంటివాఁడే. నీవును, జస్వంతరావుతోడను దౌలతరావుతోడను జేరి పెక్కుకుట్రలుసేయుచు నేమియు నెఱుఁగనివానివలె వేదాంతములు పలుకుచున్నావు. నీ కుట్రలు నే నెఱుఁగుదును. నన్నుఁ గోసినను రాజద్రోహము నాదగ్గఱలేదు. నేను ఘనమైనచావు చచ్చుచున్నాను. నీవు నీచమైన బ్రతుకు బ్రతుకుచున్నావు. ఎప్పటికయినను నీసంగతి వెలుతురులోనికి రాకమానదు. డంబము చిరకాలముసాగ" దని దత్తు జనులు విస్మయమును జాలియు నొందునట్లును గోమాజీరావు నిశ్చేష్టుఁడగునట్లును నిష్ఠురముగఁ బలుకుటయు సభయెల్ల నిశ్శబ్దమయ్యెను. ఋషి వచనంబుల నమ్మి కొందఱు శ్యామసుందరుఁడు దోషియని వాదింప వానిమాటలు విని కొందఱు దత్తు నిర్దోషియనియు మరణమున కనర్హుఁడనియు నెంచి కొత్వాలు తీర్పు నియ్యకముందే దత్తాతని క్రూరవచనములచే నొప్పించుటచే నతఁడేమి విపరీతపు తీర్పు నిచ్చునో యని యోచింపఁ దొడఁగిరి. అంతలో నొక సేవకుఁడు త్వరితముగవచ్చి కచ్చేరిలోనున్న జనుల నొత్తిగించుకొని

కొత్వాలు సమీపమునకుఁ బోయి నిలిచి వానిచేతి కొకలేఖ నిచ్చెను. ఆజాబును మెల్లగాఁ జదువుకొని గోమాజీరావు చిఱునవ్వుతో సభ్యులను జూచి "చూచితిరా వింత! శ్యామసుందరదత్తునిపైఁగల ప్రేమచే రాధాకాంతరావు నాకువ్రాసిన లేఖ యెట్లున్నదో చూడుఁ" డని "నీవును నేనును స్నేహితులమగుట నేఁడుసార్థకము కావలయును. కావలసినవాఁడవు. గొప్పయుద్యోగమున నున్నందులకు నాకీమేలుఁజేయుము. శ్యామసుందరుని నేను వృద్ధిలోనికిఁ దెచ్చుచున్నాను. వాఁడునాకుఁ బుత్రప్రాయుడు. వానిమీఁద వచ్చిన యీ నేరమును నీవు తప్పించి శిక్షలేకుండ వాఁడు తప్పించుకొనునట్లు చేసి ప్రాణములు కాపాడుము. నీమేలు మఱవను. నన్ను రాణీగారు దూరదేశము పంపినారు గనుక ప్రయాణములో నుండుటచే నేను నీతో స్వయముగ మాటలాడఁ జాలనైతిని. నీకుఁ గావలసినచోఁ గొంతలంచముఁగూడ నేనుజాగ్రత్త పెట్టఁగలను. ఎట్లైనఁ గుఱ్ఱవానినివిడువుము. రాధాకాంతరావు" అను నొకచీటీఁ జదివి వినిపింప సభ్యులు రాధాకాంతుని తెలివితక్కువను న్యాయవిరుద్ధబుద్ధిని వేనోళ్ళ నిందించిరి. అట్టి నీతిబాహ్యమగు ననాలోచనపూర్వకకార్యము రాధాకాంతునివంటి లోకజ్ఞుఁడు చేయుట యనుచితమనియు నందును శత్రువునిపేర నట్టి రహస్యములగు జాబులువ్రాయుట బుద్ధిహీనతయనియు, రాధాకాంతుని కీర్తికిభంగము గలిగినదనియు, దత్తు విచారింపఁ దొడఁగెను. లేఖను జదివి గోమాజీరావు బిట్టలుకతోఁ బండ్లు గీటుచు గ్రుడ్లెఱ్ఱఁజేసి నాకు లంచము నిచ్చుటకు రాధాకాంతరావు ప్రయత్నముచేయుట చూచినారా! బుఱ్ఱపోయినను నేను లంచము దీసికొందునా? నన్నింత యవమానము నతఁడు చేసినందుకు నేను రాణితోఁ జెప్పి దీనికిఁదగినంత చర్య జరుపక మానను. అనుచితమయిన యీ లేఖను వ్రాసి రాధాకాంతుఁడు దన నీచబుద్ధిని గనఁబరచుకొన్నాఁడు కాని నేను రాణివిషయమై యన్యాయముచేయుదునా?

ముక్కకు సూటిగఁ బోయెదను. నాసంగతి యెవ్వరెఱుంగరు. అని పలి కి తత్క్షణమే తీర్పుఁజెప్ప నుద్యుక్తుఁ డయ్యెను. చూడవచ్చినవారందఱు చెవులు దోరఁబెట్టుకొని తీర్పువిన సిద్ధముగ నుండ శ్యామసుందరుఁడు ని శ్చలహృదయముతోఁ దన గతిని జెవులార వినుటకు వేగిరపడుచుండె ను. అప్పుడు కొత్వాలిట్లు దీర్పువినిపించెను. "ఓయీ! శ్యామసుంద రా! నీవు చేసిన రాజద్రోహమునకు నీకు నేను మరణదండన విధించి నాఁడను. రేపుసాయంకాలము నీ కురిశిక్ష యగు" నని బంట్రౌతులను జూచి వీనిని జెఱసాలకుఁ గొనిపొండని యానతిచ్చి వెంటనే సభాస్థాన మునువిడిచి యాతఁడు రాణిచేఁ దనతీర్పు నామోదింపఁబడఁ జేసికొనుట కంతిపురికిఁ జనెను. తీర్పువిని జనులు రామరామ! హరిహరీ! ఎం తకష్ట మెంతకష్టము! అయ్యో! అనుచు విలపించి యొక్కరొక్కరుగ గోమాజీని నిందించుచు నిండ్లకుఁజనిరి. అనవసరమగు మనోవ్యథను దొ లఁగించి కమలను సందర్శించు సుఖమును త్వరితముగఁ జేకురఁజేసినందుల కుఁ గొత్వాలునకు మ్రొక్కుచు శ్యామసుందరుఁడు మొక్కవోని మనో ధైర్యముతోడను గలవలపాటులేని చూపులతోడను రాజభటులచేఁ జె ఱసాలకుఁ గొనిపోఁ బడుచుండెను. అంతలో మహూపురినుండి దత్తుయొ క్క సోదరియగు నానందబాయియు నామెమగఁడు మురళీధరదాసును వచ్చి వాని దురవస్థ విని విలపించుచుండ, నందు నానంద, కడసారి త నముద్దులతమ్మునిఁ జూడఁగోరుటచే మురళీధరుఁడు త్రోవలో దత్తున కెదురుపడి యాతనిఁజూచి మనస్సుచెడి వగచి సోదరి కొకసారి వానిఁజూ పుమని బంట్రౌతును వేఁడుకొనెను. తన సోదరినట్టి సమయమునజూచు ట కిష్టములేక దత్తువలదని రాజభటులతో వాదించినను దయాళు రగు వారు వాని మాటఁద్రోచి తిన్నగా వాని నానందకడకుఁ గొనిపోయిరి. లావణ్యవర్షము గురియు తమ్ముని మొగము విన్నఁబోవుటయు దీర్ఘబా హువులు వెనుకకు విఱుగఁగట్టబడుటయుఁ జక్కని తలవెండ్రుకలు చీకాకు

పడుటయు విచ్చుకత్తులతో రాజభటులు వాని వెంబడించుటయుఁ గనుంగొని యానంద డెందంబునగుల దుఃఖమ్మునపట్టలేక యోతమ్ముఁడా యని కేకవేసి మూర్ఛిల్లెను. తనతో సమానదుఃఖితుఁడైన మురళీధరుని చేఁ జేయబడిన శైత్యోపచారములచే నామె తెలివినొంది హా తమ్ముఁడా? యెంత కష్టమురా? నాయనా? నేనెట్లు బ్రతుకుదునురా? తండ్రి? నీ కేఁ బెండ్లివారు వచ్చినారు వారితో నేమని చెప్పనురా నాయనా? నావరాలచెట్టూ! నిన్నుఁజూచుకొని నాముద్దులు ముచ్చటలు చెల్లునని మురియుచున్నానునాతండ్రి! యీపాపిష్టి యుద్యోగము నీచావునకు వచ్చినదిటరా! యింతమందియుండ దేవునికంటికి నీవే కనఁబడితివటరా! అని పరిపరివిధముల గుండెలుబాదుకొని తలగోడకువేసి కొట్టుకొని యెక్కడనైన ముష్టియెత్తుకొని బ్రతుకకుండ నీకీకర్మ మెందుకువచ్చెనోయి మీబావను వేళాకోళముఁజేసెదు వారెవ్వరు బాబు! నాతో మాటలాడవేమిరా! నామీఁద కోపమాయని గడ్డముపట్టుకొని బ్రతిమాలుచు ముద్దుఁబెట్టుకొనుచు నేడ్వసాగెను. "అక్కయ్యా! నాఋణము తీరిపోయినది. దుఃఖించిన కార్యములేదు. నేను నీవాఁడనుగాను. బావా! ఆమెనూరడింపు. నాకు సెలవిమ్ము. పోయెద" నని పలికె దుఃఖమాగక తానుగూడ సోదరియొడిలోఁ బండుకొని దత్తు పెద్దపెట్టున నొకమాఱు రోదనము సల్పెను. ఆదుఃఖముఁ జూడలేక బంధుమిత్రులుగూడ నేడ్చిరి. తుదకు రాజభటులు దత్తును దీసికొనిపోవుటకుఁ బ్రయత్నముచేయ, నానంద దుఃఖావేశముచే నొడలెఱుంగక 'ఓరీ దుర్మార్గులారా! నాతమ్మునిఁ దీసికొనిపోవుటకు మీరెవ్వరురా? మిమ్మును జంపివేసెదను. నాయెదుటినుండి పొండి" యని విఱిచికట్టఁబడిన దత్తుయొక్క చేతులను విప్పసాగెను. మురళీధరదాసును రాజభటులును వారించి యామెనొక మూలగదిలోనికి సాయముబట్టి యీడ్చుకొని తీసికొనిపోయి యందుఁబడవేసిరి. తరువాత నానంద మూర్ఛిల్లినందున నదియె దాఁటిపోవుటకుఁ

డగు సమయమని దత్తు బావా నామీఁద దయయుంచి నేనిదివఱకుఁ జేసిన తప్పులు క్షమియింపుము. నాయాస్తి నా మేనల్లునికి వ్రాసి నన్ను జ్ఞాపకముంచుకొనుము. మాయక్కను దయతోఁ జూచుచుండుము. అని బంధుమిత్రులతో గుమ్మము దాఁటివెడలెను. మురళీధరుఁడు వెనువెంట జని, నాయనా నిన్ను క్షమియించుటకు నీస్వల్ప జీవితకాలమున నీదగ్గఱఁ గలిగిన తప్పులేవి? నాకుడిభుజము పడిపోవుచున్నది. మేరుపర్వతమువలె నీవున్నావుగదా యని నిన్ను నేను నమ్మికొన్నాను. నీవు నన్నేకాకిని జేసి నీత్రోవను బోవుచున్నావుగదా? నాయనా నీయందము నేలపాలు గావలసినదినము వచ్చినది. అని విలపించెను. అంతలో భటులు వేగిరపడి గోమాజీరావునకు దత్తక్కషెక వచ్చుటఁ దెలిసినఁ దమకు మాటవచ్చునని యీవర్తను చెఱసాలకుఁగొనిపోయిరి. ఆదినముననే భోజనములు లేక యానందా మురళీధరులు మహాపురి కరిగిరి. రాణి దత్తునకు గోమాజీవిధించిన శిక్ష నంగీకరించెను.



## పదునాల్గవ ప్రకరణము.



ఓసీ! సీతా నీవు చెప్పెడు కథలు మిగులఁ జమత్కృతితో నిండియుండును. ఇంత చిన్నతనములో నింతింత చిత్రములనెన్నఁడు నేర్చుకొంటివి? ఒకపర్యాయము కడుపు చెక్కలగునట్లు నవ్వింపఁగలవు. మరియొకపర్యాయము భోరున నేడిపింపఁగలవు. హాస్యశృంగారకరుణారసములు నీసొమ్ములేయని తోఁచుచున్నది. నీవు వివాహముఁ జేసికొని నీయత్తవారింటి కరుగుదువేని నే నెట్లుండఁగలను? అని ముక్తాబాయి తనకెదురుగఁ గూర్చుండియున్న సీతాబాయినిఁ గూర్చి పలికెను. రాధాకాంతరావు ప్రవేశించినది మొదలు దాసియగు సీతాబాయి రాణియెడలఁ **దత్కుమారికయెడల నత్యంతవిధేయతతో నడుచుకొనుచు సమయో**

చితముగ వారిచిత్తరంజనకరము లగు వినోదకథలనుఁ జెప్పి వారిచే శ్లాఘింపఁబడుచు వచ్చెను. మొదట నామె ముక్తాభాయి నిమిత్త మేర్పఱుచఁబడినను దనవాక్చమత్కారముచేతను, వాక్చమత్కారమును మించు ముఖసౌందర్యముచేత ముఖసౌందర్యమున తిశయించు వినయాదిసద్గుణసంపదచేతను రాణి హృదయమునుఁగూడ నాకర్షించినందున రాణిగూడ నామె చెప్పుకథలను వినుచుఁ దన విచారములఁ బాపుకొనుచుండెను. సీత దాసియనియు ముక్త యజమానురాలనియుఁ బేరేకాని వారిరువురు నన్యోన్యానురాగముగలవారై నెచ్చెలులై యొకరినివిడిచి యొకరు నిమిషమయిన తాళఁజాలక ప్రాణములు పుచ్చుచుండిరి. సీతకుఁ బెట్టకుండ ముక్త యే పదార్థమును భక్షింపదు. రాత్రులు దనతల్లి చూడకుండ ముక్త సీతను దనమంచముపైఁ బండుకొనఁ బెట్టుకొనుటయు యహావనాతిశయమువల్ల నుదయించు కోర్కెల నామెకుఁ దెల్పుటయుఁగూడ కల్గుదు. దాసి సంతతియతోడను సమాన గౌరవముతోడను నాదరించిన స్వపరగౌరవ తారతమ్యమెఱింగిన తల్లి యేమనునో యను భయమున ముక్తతల్లియెదుట నితరులయెదుట సీతను దాసిగాఁజూచి యాంతర్యమునఁ జెలిగాఁ జూడసాగెను. అహల్యాబాయియు సీతను సామాన్యముగ దాసియెడఁజూపుగౌరవముకంటె నెక్కువ గౌరవమును జూపుచుఁ బ్రేమము నాల్కొల్పుచు నామెకుఁ గొలఁతనాసీక బహువిధముల నరయుచుఁ జిన్నచిన్న యంశములలో నామెయాలోచనముఁగూడఁ గైకొనుచు నామె బుద్ధి మెచ్చుకొనుచుండెను. ముక్తాబాయి పైనుదహరింపఁబడిన పలుకులఁ బలుకుటయు సీత నవ్వుచు దీనికంతకు మీ దయయే కారణము. నేను మిమ్ము విడుతునని భయపడకుఁడు. బ్రహ్మచర్యముతోనే కాలముఁ గడతేర్పవలెనని యూహించుచుంటినిగాని వివాహప్రయత్న మింకట తలఁపునేదు. మీరు వివాహానంతరము నన్ను విడుతురేమోయని భయపడుచున్నాను సుఁడీ యని పలికెను. అప్పలుకులువిన

ముక్తకు శరీరమంతట గగుర్పాటుదయించెను. తలవంచికొని సీతను జూచి " నీకు బొత్తుగా భయములేదు. అప్పచెప్ప డిట్టిమాటలు నా కుపదేశముచేసి నాకుఁగలవలపాటుఁ గలుగఁ జేయుచుందువు. నీవావిష యమై యెత్తఁబోకు. అని మందలించి జస్వంతరావును నేను గలిసికొను భాగ్యమే నాకుఁగల్గునేని మాయమ్మకు వానికి నిట్టికలఁతలు కలుగవు. దైవమా మాకు సంయోగము గలుగఁజేయవుకదా? అని చింతింపుచు సీతతో నీక్రింది సంభాషణము జరిపెను.

సీత—అమ్మా గంగాధరజస్వంతరావుగారు మీకుఁదప్పక లభిం పఁగలరు! చింతవలదు.

ముక్త—కోరికలతో నాకుఁ బనిలేదు. అది వ్యర్థమనోరథమ ని నేనెఱుఁగుదును. విరోధముచే మాయమ్మ నన్ను మఱియొకరిని వరి యింపుమని నాకాజ్ఞాపించును. ఇష్టముగలవానిని విడిచి వేఱొకరిని జే సికొనుటకంటె మరణముమేలు.

సీత—నిజమే. అందుచేతనే కమలాబాయి, పాపము దౌలతరా వును వరించుటకంటె మరణ ము చితమని యట్లుచేసినది. మీయమ్మగా రిపాలనములో నిదియొక్కటియే ఘోరమైన కార్యము జరిగినది.

ముక్త—అవును. ఆమె కడుసుందరగత్తెయఁట! నిష్కారణముగఁ జచ్చినది. సరే చచ్చినవారి జోలి మనకెందుకు? నాకాసంగతులు చె ప్పకుము రాత్రి పీడకలలువచ్చును. నీవేదైన నొక వినోదకథఁ జెప్పు ము. నీవు కథలను జెప్పి నాకారోగ్యముఁగలుగఁజేసినందుకు ముందు ముందు నీకు నేనొకయుపకారముఁ జేసెదను. ఇదినావాగ్దానముఁగ నీవు గ్రహింపుము. నీయందు నాకట్టిదయగలదు.

సీత—(సంతోషముతో) అమ్మా యిది నాకొక్కవరము. స మయమైనప్పుడు తప్పక యియ్యవలయును సుఁడీ. ఈవేళ మీకు వింత

మైనకథఁ చెప్పెదరు. అమ్మగారుగూడ వచ్చి యాలకింపవలసినట్టి కథ. వారు వత్తురేమో మీరు గనుగొందురా?

ముక్త—అమ్మగారు కథల నాలకించుటకు మనస్థిమితముఁ గల వారుగ లేరు. రఘునాధరావు దేశముపై వచ్చుచున్నాఁడని తెలిసి వానిమీఁదికి రాధాకాంతునిబంపినది. ఇంకను రాధాకాంతుని వద్దనుండి యుత్తరమురాలేదు. అతఁడుగూడ శత్రులఁ గలిసినాఁడని యీవేళ గుమారు బయలుదేరినది. రాజపుత్రులు నింబపురముమీఁదికివచ్చుచున్నారనియు సైన్యముల నంపుమనియు శివనానా జాబులు వ్రాసినాఁడు. లేఖను జూడఁగనే మాయమ్మగారికి గుండెలో తాయిపడినది అదిగాక క్రొత్తహోల్కారొకఁడు మాళ్జాతి బయలుదేరినాఁడఁట. వానికి నేఁడో రేపో పట్టాభిషేకమగునఁట. ఇవియన్నియు నీవేళ యుదయమునఁ దెలిసినవి. ఆమె కేమియుఁ దోఁచుటలేదు. ఇంతియేగాక గండాభిల్లను దొంగను విడిచినందుకు నొకని కిదివరకున మరిశిక్ష విధించినది. ఆమె యాపనిఁ జేయించుచున్నది. అందుచేఁ గథ వినదు.

సీత—అమ్మా యాయదృష్టహీనుఁ డెవఁడు? వాఁడు శిక్షింపఁ బడవలసినదే.

ముక్త—నీ వెఱుఁగవా? రాధాకాంతు నింటనుండెడు పనుచు వాఁడు శ్యామసుందరదత్తు.

ఆమె వచనములు చెప్పఁబడినతోడనే సీత భీతకురంగమువలె బెదరుజూపులు గలిగి నాలుక కొంకుపోయినదానివలె తడబాటు మాటలతో "హారి హరి! ఆపిల్లవాఁడో" అని కూర్చుండలేక స్తంభమునకుఁ జేరబడెను. ఆమె యవస్థఁ గని ముక్త భయపడి, "ఏమిది? నీవు దత్తు నెఱుగుదువు? నీకంతవిచారమేల" అనెను.

సీత—అమ్మా, పాపమాదత్తును, నేనును, చిన్నతనమునందు మిగుల స్నేహితులము దైవవశమున నిట విడిపోయినతరువాత నేను

మీయింట దాసినైతిని. అతఁ డుద్యోగియయ్యెను, చిన్నప్పటిస్నేహముచే మిగుల జాలిగలదు.

ముక్త—మనమేమి చేయఁగలము? రాజద్రోహముచేసిన దురాత్ముఁడు శిక్షాపాత్రుఁడని నీవిప్పుడే కదా పలికినావు. నీమాట నీవు నిలుపుకొనుము.

సీత—దాసినగు నేను నామాట నిలుపుకొనఁజాలను. రాజపుత్రికలగుమీరు మీమాట నిలుపుకొనుఁడు. నాకుఁ గావలసిన సహాయముఁ జేసెదనని మీ రిప్పుడే వాగ్దానముఁ జేసినారుకదా? ఇప్పుడా మాట నిలుపుకొని మీయమ్మగారితోఁ జెప్పి నానిమిత్తము మీనన్ను ప్రాణములు రక్షింపుదురా? ఆమేలు నాకుఁ జేయుఁడు.

ముక్త—ఇది యసాధ్యము. రాజకార్యములలో మాయమ్మ నామాట వినదు. నే నీపనిఁజేయఁజాలను,

అని ముక్త సందేహవిముక్తయై పలుక సీత కనుదమ్ముల మంచు బిందువుల చందమున బాష్పకణములు దిగజార దుఃఖావేశముచే ధైర్యముజార భోరున రోదనము సేయఁదొడంగెను. అందుచే ముక్త జాలిఁగొని యెట్టులయినఁ దనయావచ్ఛక్తి వినియోగపరచి తల్లి మనస్సు ద్రిప్పుదునని బయలుదేరి విచారగ్రస్తయై యున్న కాంతామతల్లియగు తల్లిం గనుంగొని యొకచోట మెల్లఁగఁగూర్చుండి కొంతసేపటికి నామెతో, 'అమ్మా రాజపుత్రులు నింబపురము నాక్రమించినారా' యని పలికెను.

అహ—ఆక్రమింపలేదు, రేపో యెల్లుండియో యాపని జరుగును.

ముక్త—అమ్మా యీదినము నాకొక మనవియున్నది. నీవు శ్యామసుందరదత్తును—

అహ—తెలిసినది. చాలుచాలు. నీమనవిని గట్టిపెట్టుము. ఆ విషయమై చెప్పకుము.

ముక్త—అమ్మా! అట్లనవద్దు. వానిని బ్రతికింపుమని సీతనన్ను వేఁడుకొన్నది. నామున్ను చెల్లించుము.

అహ—నీకు భయభక్తులు లేవు. రాజకార్యవిషయములలో నీ క జోక్యమెందుకు? ముక్కుపచ్చలారని పసిదానవు. నీవునాకు రాజకార్యములలో నాలోచనఁ జెప్పవచ్చితివా? ద్రోహులనునే నురిదీయింపక నీసిఫారసు విని రక్షించినచో రాజ్యమునకు వైపరీత్యము తప్పకవచ్చును. నీవెన్నఁడు నీకమీఁద నిటువంటి స్వతంత్రములు గైకొని నాకు నేవిషయమున నుపదేశము జేయకుము.

ముక్త—అమ్మా నేనుపదేశము జేయలేదు. నేను ప్రార్థించుచున్నాను.

అహ—ఆదాసి వేఁడుకొనుటయు నీవు వేఁడుకొనుటయునా? ఏమీ కొంచెముదయతో నాదరించుచున్నామని దానికిమొదలు దెలియుటలేదా? దాసియగు తనయాంతరమును రాణినగు నాయంతరము నెఱుంగక సీత సిఫారసులుచేయ సాహసించినదా? జాగ్రత్తయని చెప్పు. ఆలస్యమైనకొలఁది నెందఱో సిఫారసులు చేయుచుందురు. కనుక నీవురాఁటనే వానినురిదీయించెదను. నీత్రోవను నీవుపోయి చదువుకొనుము. నేనట్లన్నానవిచార మొందకుము.

అన ముక్తాబాయి యుడుకుబోతుతనమును దుఃఖమును డెందమునసందడింపఁ జిన్నఁబోయి తల్లినద్దనుండిపోయి గంపంత యాసతోఁ దనకై యెదురుచూచు సీతతో నిరాశగొలుపు నీపలుకులఁ దెలుప నామె విన్నబోయి విచారభారముచే నన్నము నీళ్ళు ముట్టక కోజుచుండెను.

## పదునేనవ ప్రకరణము.

ఉదయగిరి శిఖరంబున రతనంపు బంతిచాయలఁ బ్రభాకరబింబం బు నేత్రానందకరమై పొడజూపి యజ్ఞానముఁబాపు సద్గురూపదేశ వాక్యములవలె నంధకారమును బాపు తనకిరణ సహస్రములచే జగమున కమితోపకారము నొనర్చెను. వ్యాఘ్రసింహాది క్రూరమృగములు చీకటి గుహాలలో డాగి తమవేఁట కనుకూలముగఁ బగ లేటికరుదెంచెనని విచారింపఁజొచ్చెను. ఆసమయమున మహాపుర సమీపారణ్యమున నొక యున్నత పర్వతశిఖరముపై వేనవేలుజనులుచేరి మహాకోలాహలధ్వను లఁజేయుచుండిరి. ఏనుఁగుదంతములు నడవిపందికొమ్ములు నెమలి పింఛములు పలువిధములగు పూసలపేరులు మొదలగు ననాగరికతసూచించు నలంకారములఁగైకొని భిల్లులు నాగరికతసూచించు వేషములతోఁ గొందఱుపురవాసులును మధ్యస్థితిలోనుండిన కొందఱు కాఁపులును వచ్చి తత్పర్వతమున నాతురతతో నొక మహాకార్యమున కెదురుచూచుచు డిరి. పర్వతముపైఁ జల్లదనమును నెదఁజల్లు విశాలమగు పందిళ్లు వేయఁబడియుండెను. పందిళ్లకు నలుదెసలను మంగళకరముగఁగట్టఁబడిన పచ్చని మామిడాకులతోరణములును నడుమ తోరణములతో దండలుగాఁగట్టఁబడిన వనపుష్పములును స్తంభములకు జతగనాటఁబడిన కదళికాతరువులును తత్ప్రదేశమునకు శృంగారలక్ష్మిని రాజ్యలక్ష్మిని నాహ్వానము సేయుచుండెను. ఈకోలాహలముతో జనులు మహోత్సాహాభరిత మనస్కులై యుండఁ గొందఱు పెత్తనమునవహించి సందడి సేయవలదని జనుల నాజ్ఞాపించుచు హస్తములయందుఁ దమకు నెవ్వరుసీయని యధికారమును దెల్పు కఱ్ఱలఁదాల్చి యటునిటుఁ దిరుగసాగిరి. అంతలో 'నిశ్శబ్దముగ నుండుడు వచ్చుచున్నారు. వచ్చుచున్నారు జాగ్రత్త" యను పలుకులు వినఁబడె. బ్రజలందఱు వచ్చుచున్న యామపురుషునిపైఁ గన్నులనిగుడ్చి

చూడసాగిరి. అప్పుడు ముందును వెనుకను నిరుగెలంకులను హస్తముల దండములఁ బూని వేత్రహస్తులు స్తుతిపాఠములుసేయ ధనము చెరఁబెట్టుటచే బల్లెలనుండివచ్చిన లోభిబ్రాహ్మణులు స్వస్తిచెప్ప దుర్గంధభూయిష్ఠమగు నొక యడవియేనుఁగుపయి నమర్పఁబడిన ప్రాతయంబారీలో బాలీసునకు జేరబడి యొకసుందరపురుషుఁ డిరువదియాఱు సంవత్సరముల వయస్సుగలవాఁడు కూర్చుండి యొడనెడఁ దనరాకకై ప్రజలు గావించిన యలంకారములను మెచ్చుకొనుచు వచ్చెను. అంబారీలో నాతని కెదురుగ నొకనల్లనిస్థూలకాయుఁడు కొన్ని రాజకీయ వ్యవహారముల నాతనితో ముచ్చటింప నీబాలుఁడు తలయూచుచుఁ గేల నప్పుడే తుప్పుపోవఁదోమిన ఖడ్గము తళతళమెఱయఁ, దనభవిష్యద్వృత్తాంతమును గూర్చి యువ్విళులూరుచునుండ నింతలో మావటివాఁడు గజమును బంగళ్ళమధ్యమున నిలిపెను. వెంటనే దౌలతిరావు మెల్లగా నంబారిదిగి యీబాలునింగూడ వినయముతోడను భయముతోడను నొకరత్నకంబళముపై దింపెను. దింపునప్పటికి భిల్లులు ఘీంకారనాదములఁజేసిరి. పల్లెలనుండివచ్చిన కాఁపులు భయమ్మునచే నొత్తిగిలిరి. కొందఱు మనకొత్త పాళెగాఁడుగారు వీరేయని యీబాలునిజూపఁ దొడఁగిరి. గండాభిల్లు తాంతియాభిల్లు వెనువెంటనడువఁ, జోపుదారులు మనుష్యులనొత్తిగించి మార్గముఁజూప, దౌలతరా వొకహస్తమును హరిహరపాండ్యాజీ యొకహస్తమునుబట్టి తన్నునడిపింప నీబాలుఁడువచ్చి సభాంతరమునవేయఁబడిన యొక వేదికపైనున్న చిన్నకుర్చీపైఁ గూరుచుండెను. దాని ప్రక్కనే సింహాసనమని యొకపెద్ద పీఠమువేయఁబడియుండెను. అందతఁడు సుఖాసీనుఁడయిన తరువాత సభ్యులందఱు తమ తమ యథాసనములపైఁ గూరుచుండ నంతట దౌలతరావులేచి సభలోనున్న ధ్వనినివారించి యిట్లుచెప్పెను. "ఓహోప్రజలారా! మిమ్ముల నిక్కడికి నేనురావించిన కార్యము మీ రెఱుంగుదురు. ఈదినము సుదిన

ములలో సుదినము. ఈయన మనయేలికయగు హోల్కారుగారు. తన మనుమడుగతించిన పక్షమున నీయననే పెంచుకొమ్మని మలహారురావు హోల్కారుగారు మరణశాసనము వ్రాసిరి. ఈయన యున్నతమైన హోల్కారు కుటుంబమున నుదయించినవారు. ఆఁడుదాని యధమ పరిపాలనములోనుండుట కష్టము, పరువుగల మగవారి కుండఁగూడదు. మీరీమహారాజుగారి పాదములు నమ్ముకొనియుండుఁడు. ఈయన ధర్మప్రభువులు. వెనుకటి హోల్కారుగారికి సన్నిహితజ్ఞాతులు. ఈయనను పెంచుకొమ్మని జస్వంతరావెన్ని చెప్పినను రాణివినదయ్యెను. మీకందఱకు నిష్టమయినచో నీయనకుఁబట్టముఁగట్టెదను. ఇది మీకుసమ్మతమేనా?" అని దాదాగరావుపన్యసింప, భిల్లులు కాఁపులు మొదలగువారందఱు నైకకంఠ్యముగ మాకు సమ్మతమే మాకుసమ్మతమే యని యఱచి చప్పట్లఁ గొట్టనారంభించిరి. నింగిముట్టునట్టి చప్పటలతోఁ బర్వత ప్రాంతమునన్న మృగసమూహములు బెదరిపారుచుండ దాదాగరావు శ్రీమద్రాజాధిరాజ శ్రీమంతపంతు శ్రీయిందూరుపదపాదుషా శ్రీమహాదేవ రఘునాథ గోవిందరాయజీ హోల్కారుగారు దయచేసి సింహాసనమెక్కుఁడని యాతని సింహాసన మెక్కించి యొక జరీకుళాయిని దెచ్చి ప్రస్తుతమిదియే నవరత్నకిరీటమని వాని శిరమునఁ బెట్టెను. తరువాత హరిహర పాండ్యాజీలేచి "ఓజనులారా! ఇఁకమీఁద మనయేలిక శాయాజీహోల్కారుగారు. అహల్యాబాయికి మీరుదమ్మిడియైనఁ గప్పముఁగట్టనద్దు. కట్టినచో మాల మునరాజుగారికి కీయవలసియుండును గనుక మీరు రెండునష్టములఁగల్గి చెడిపోదురు. ఇండూరు రాజ్యమునన్న గ్రామములకన్నింటికి నీ విధముగానే మేముత్తరములు తాఖీదులు వ్రాయుచున్నాము. అహల్యాబాయి రాణిచే నియమించిన వారికి మానప్రాణములు దక్కవు. ఇదివఱకున్న యుద్యోగస్థులఁదీసివేసి క్రొత్తవారి నేర్పరుతుము. మీరందఱు మహారాజుగారికి లోఁబడినట్లు

మీభక్తిఁ దెలుపుము" అని సింహనాదముతో నఱచెను. అంతట గండాభిల్లు తాంతియాభిల్లు మఱికొందఱు కాఁపులు కరణాలు చేరి రాజసింహాసనమునకు సాష్టాంగనమస్కారమొనర్చి తమకత్తులపిడులు రాజున కందిచ్చి యందుమూలముగఁ దమరాతనికి లోఁబడుటఁ దెలిపి 'స్వామీ మేము మాపన్నులను మీకిచ్చెదము. అహల్యను రాణిగానెంచము. మేము మీ కొఱకు హోల్కారు రాజ్యముకొఱకుఁ బ్రాణములుధారఁ బోయుదుము. దేశములందోఁచుకొని యామెతోఁ గత్తిఁగట్టి యుద్ధముఁ జేసెదము' అని ప్రమాణములఁ జేసిరి. అంతట శాయాజీ హోల్కారుమహారాజుగారు సింహాసనము విడిచి లేచి యిట్లనిరి. 'కాఁపులారా! మీకందఱకు సమస్తసుఖములుఁ గలుగునట్లు మేము పరిపాలించెదము. అహల్యాబాయి కాలమున మీకుఁగల కష్టములన్నియు నశించెను. ఖర్చులకు సొమ్ము గావలయును గనుక మీరు పన్నులు త్వరగా దౌలతరావునకు హరిహరునకుఁ జెల్లింపుఁ' డని దౌలతరావును జూచి 'నిన్ను మాసైన్యమునకు సేనాధిపతిగా నేర్పఱచినాము. హరిహరను జస్వంతరావును మంత్రులుగా నియోగించితిమి గండాభిల్లు మన్నెసుల్తాను బిరుదముతో సీయడవుల నేలవలసినది. మఱియు నహల్యకు జాబు వ్రాయుము. ఇందూరునగరము, కోట, సైన్యము, రాజ్యము, ఖజానా, మాదత్తజనకులగు మలహారురావువారి యాభరణములు, మా కామె వారముదినములలోపున నొప్పగింపవలసినదనియు నట్లు సమర్పింపదేని యుద్ధము సిద్ధమనియు గలహ మొనర్చినదేని ప్రాణములతో విడుచుట లేదనియు జీవితాశ గలిగినపక్షమున మాసొత్తు మాకిచ్చి మారాజ్యము నుండి యెచ్చటికైనఁ బారిపోవలసినదనియు, నామెకు వ్రాయవలసినది. రీవాసర్కారువారికిని గ్వాలియరు ప్రభువులగు సింధియామహారాజుగారికిని మాకు సహాయమునంపుమని యుత్తరములు వ్రాయుము, ఇది మాపని" యని ముచ్చటించెను. అంతలో గండాభిల్లు పదునేండ్ల వయస్సుగల

యొక సుందరుఁడగు బాలుని దెచ్చి మహారాజునకు మ్రొక్కించి "దేవా! మా తాంత్రికులు వీనిని మార్గమధ్యమునుండి తీసికొనివచ్చినారు. మా దేవతకు వీనిని బలిపెట్టఁ దలఁచితిమి. కాని రెండు మూఁడాటంకములు వచ్చుటచే వాని యదృష్టమున బలి మానితిమి. వీఁడు చదువువ్రాఁత నేర్చినవాఁడఁట. వీనిని దమయెద్ద నుంచుకొని మావిధేయులుగ పనులఁ జేయింపుమనుఁడు" అని మాతనిని సమర్పింప మహారాజు బాలుని సౌందర్యమునకు మెచ్చుకొని వానిఁ దాయుంచుకొనుట కంగీకరింప, నిదివఱకు రెండునాఁడులు మృత్యుదేవత నోటనుండి బయటఁ బడినందులకు సంతసించు నా బాలుఁడు హోల్కారుసన్నిధి కరిగెను. తరువాత మహారాజు తన నిమిత్తము నేయఁబడిన గుడారములలోనికి [illegible] తోఁగూడి వందిమాగధస్తోత్రములతోఁ జనియెను. కొంపులు నిసునిమ గ్రామములకరిగి భిల్లులాయుధముల ధరించి మూపందిళ్ళలోఁ బండుకొని యక్కడికే తమ భోజనముల దెప్పించుకొని భుజియించిరి. శ్రీమద్ధోల్కారుగారు పట్టణముల యందున్న వారికే గ్రామములలో వెలియుట తోఁచెనే సైన్యమునకు స్పృహ నొందనాగెను. పెండ్లిండ్లులేని ఘోటకబ్రహ్మచారులు బిచ్చలులేని గోష్ఠబోతులు కొంపలుగాల్చుటలో నాటుతేఱిన పాపిష్ఠులు, దారులఁగొట్టు పచ్చిదొంగలు, బందిపోటుఁజేయు దోఁపుడుగాండ్రు సిసలైన సాహస్యములుగావించు హంతకులు, రాజుల భయములేని గడేకారులు, మొండిబంటులు, రాజుపై నాగ్రహముగల దురాత్ములు వెయ్యేల దుర్నీతిపరులందఱు శాయాజీ మహారాజు సైన్యమాసనేని యెప్పుడు దేశముఁ గొల్లఁగొందుమో యెపుడు స్త్రీలఁ జెఱబట్టుదుమోయని కోరుచుండిరి. అహల్యపాలనమున నిష్టములేని వారికిఁ గూడ నీసైన్యమును జూడ నానావిధమైన భయముదయింప సకలదోషములు మూర్తీభవించి కొలువ నధకారము సేయు కలిపురుషునివలె

శాయాజీని వారించఁదొడఁగిరి. ఇదియైన మరునాఁడుదయమున హరిహరుఁడును దౌలతరావు నొకటిగఁ గూర్చుండి యిట్లుముచ్చటించిరి.

దౌల — ఓయీ హరిహరా! జస్వంతరా వీపట్టాభిషేకమున కే మన్నాఁడు? నీవతనివదలి యిక్కడికి వచ్చినావేమి?

హరి — జస్వంతరావునకు మన యీకార్యమిష్టము. అందుచేత నతఁడీవిషయమై మనతో మాటలాడఁడట. కాఁబట్టి యీవేళరాత్రి మన మిందూరునగరమునకుఁ బోవలయును. ఇష్టమున్నను జస్వంతరావు నాశ్రయించి నేనుండినచో నాకు నొకగవ్వయైన దొరకదు. అతఁడు దేశము దోఁచుకొనుటకు నొప్పుకొనఁడు. నీదయవల్ల నేను నాల్గుకాసులసొమ్ము నార్జింపవలెననియున్నది.

దౌల — నిజమే. అతఁడెందులోను జేరఁడు. చివరకు రాణిసిందటిమి మనమే బాగుపడుదుము. చూడు నాకు ధనమార్జింపవలెనని లేదు. కమలాబాయి విషయములో నాకు, రాణికిఁ గష్టపెట్టుచున్న నన్నామె యాడినమాటలకుఁ గసిదీర్చుకొనుటయే నాముఖ్యోద్దేశము. పిల్లలుగలవాఁడవు కావలసినధనము నీవుదోఁచుకొని స్వీకరింపుము. మీవంటి బ్రాహ్మణులకిచ్చినపుణ్యము.

హరి — నీవు నాకు జేసినయుపకారమునకుఁ జాల సంతసించితిని. సర్దారులలో నిన్ను మించినవాఁ డెవ్వఁడు లేఁడు. నన్నే కాని యారాచచ్చు ముండకొడుకును హోల్కారుగఁ జేసినావేమి! ఆతఁడు వీఁడు మననెత్తిని బెట్టరాయునేమో.

దౌల — ప్రస్తుతము వీనిని హోల్కారుగఁ జేసితినికాని రాజ్యము స్వాధీనమయినతరువాత నీయుపాత్రుని నమ్ముపీఁడగును సాగనంపి నేనే రాజ్యముఁ గైకొందును. అంతవఱకు నాముకా, వానినేర్పరచితిని. ఇది రహస్యము జాగ్రత.

అనివారు సంభాషించునంతలో నొక క్రొత్తపురుషుఁడటకు వచ్చుటచే వారు తమమాటలు సమాప్తముకావించి మహారాజుగారున్న గుడారముకై పరిగిరి.

## పదునాఱవ ప్రకరణము.

“అమ్మయ్యా! నాప్రాణము లిప్పటికిఁ జల్లబడినవే సీత. నేనదృష్టవంతురాలను సుమీ” యని ముక్తాబాయి పలుకుటయు, సీతయాంత్రముతో, ‘అమ్మా యేమి జరిగినది యెందుచేత మీరింతదృష్టవంతులు, చెప్పవచ్చునేని నాకాసంగతిఁజెప్పుడు,’ అని ముక్తను వేగిరపెట్టుటచే నామె యిట్లనిజెప్పఁ దొడఁగెను. ఒసీ సీత నీవింకను నెఱుఁగనే యెఱుఁగవా నిన్నరాత్రి మాయమ్మ సర్వజనశ్లాఘ్యమయినయొక కార్యమొనర్చెను. శ్రీగంగాధరజస్వంతరావుగారు, దౌలతరావు, హరిహరపాండ్యాజీ మొదలగువారు దాదాపుగ నూర్వురుగూడి యొకమందిరమున మాయమ్మపైఁ గుట్రలుపన్నుచుండిరి. ఆసాయంకాలముననే మాయమ్మగారికి వ్రాలులేని యొకయుత్తరమువచ్చెను. ఆజాబులో వీరందఱుఁ గుట్రపన్నుదురనియు జస్వంతరావుగారి వసంతగృహములోఁ గలిసికొందురనియు వారిం బట్టుకొనుటకదియె యదననియు నున్నది. ఆజాబుచదువుకొని వీరావేశమునొంది యమ్ములు విండ్లు ఖడ్గములు మొదలగు నాయుధములతో మనగజేంద్రమునెక్కి నయనకల్హారముల యారుణ్యమును జూచి పౌరులు భయకంపితులై పార వీరపురుషోచిత వాక్యములు దురాత్మల గుండెయలుజల్లుమనఁజేయ బయలుదేరెను. బయలుదేరి యాకస్మికముగఁ దనపైఁ గుట్రలఁబన్నుచున్న నరాధములతోఁటఁ జేరి కవాటములు బలిమిం భేదించి యా వసంతగృహమున వసంతజయంతకాంతుఁడగు జస్వంతుని, వానిచెలిమికాండ్రను గొందఱను జూచి వారిలోఁ

బెక్కండ్రిఁ బట్టుకొని బంధించెను. కాని దౌలతరావు మొదలగు వారు గోడలుదాఁటి పలాయితులైరి. అంతట వారందఱు దమకుఁబ్రాణదాన మొసంగుమని రాణిని బ్రార్థింపఁ గాంతామతల్లియగు నాతల్లి కరుణార్ద్రైకప్రధానుకాలయి యందఱ క్షమించి యభయహస్తంబిచ్చెను. దౌలతరావుమొదలగువారు మందమతులై పాఱిపోయిరికాని లేకున్న మాయమ్మ వారిఁగూడ క్షమియించియుండును. వారు మృత్యుదేవతకు బంధువులగుటచే పాఱిపోయిరి. నాకోరికదీర మాయమ్మయు జస్వంతరావుగారును సఖ్యత వహించినారు. అదియే నాకు శుభసూచకము" అద్భుతరస ముదయింపఁజాలు నాపలుకులనాలకించి సీత తన చెలి మనోరథము సగము నెరవేరెనదను నానందమును, దనమనోరథము పూర్ణముగ భిన్నమైనదను విచారమును డెందమున మల్లడిఁగొన నిట్లనియె. "అమ్మా! మన మిరువుర మొకశరీరముగ నుండునంతటి నెయ్యముగలవారము. కాఁబట్టి శరీరము సగభాగము సంతోషమను చివురులతోనుండ రెండవయర్ధము విచారమను పక్షవాతముచే స్పర్శజ్ఞానములేక యున్నది. ఇదినీకు సమ్మతమేనా? నిరపరాధియగు శ్యామసుందరుని నానిమిత్తము బ్రతికింపుము" అని నల్లగలువ రేకులనుండి వెడలు మకరందబిందువుల వలె కాటుకకన్నులనుండి జారిన నల్లనిబాష్పములు ముక్తహృదయముఁ గరఁగింప, సీత విలపించిన ముక్త తనచేతనైనంత ప్రయత్నముఁ జేయఁదలంచి "ఓసీ యీదినమున మాయమ్మగారు నింబపురమున కరిగెదరు. రాజపుత్రులువచ్చి నింబపురమును బట్టుకొని దుర్గాధ్యక్షుఁడగు శివనానాను బారఁదోలిరి. అతఁడీదినమున మాయమ్మవద్దకు వచ్చినాఁడు. అందుచే రేపు మనమందఱము సైన్యసమేతముగ నింబపురములోని కరుగవలయును. అచ్చటికరుగుటసుమండె దత్తును గూర్చిచెప్పెద నీవు విచారింపక ప్రయాణమునకు సిద్ధమైయుండుము" అని పలికి తనతల్లియొద్దకుఁ జనియెను. అదివఱకహల్యా శివనానా, తుకాజీ

హోల్కారు, క్రొత్తగాలోఁబడిన జస్వంతరావు, మొదలగువారు పరివేష్టింప రాజకార్యాలోచనము సేయుచుండుటచే ముక్త తత్సమయమున నరుగుట యనుచితమని ప్రక్కగదిలోఁ గూర్చుండి వారి విస్రంభసంభాషణముల నాలకింపుచుండెను. అంతట నహల్యాబాయి యించుక విచారగ్రస్తయై శివనానాను జూచి యిట్లనియె. "ఓయీ రాజపుత్రులు నింబపురముపై నెంతటిసైన్యముతో వచ్చినారు ? మనసైన్యంబు నందెంతమనము దీసికొనిపోవలయును ?" అన శివనానా 'పదివేలుండునని నేఁ దలంచినాను. రాజపుత్రులు శౌర్యవంతులు. వారినిం గెలుచుటయసాధ్యము. కాఁబట్టి మనసైన్యముగూడ నంతయుండవలెను. తుకాజీహోల్కారును నన్నును ముందుగనంపుఁడు మీరు తక్కినసైన్యముతో రావచ్చును." అని రాణికుత్తరమొసంగెను. రాణి యాపలుకులు మెచ్చుకొని యున్నవారిలో నీవును దుకాజియుఁగాక విశ్వసనీయు లెవ్వరున్నారు? రాధాకాంతరావును నేనిదివఱదాక నమ్మియుంటిని. శ్యామసుందరదత్తు నురిదీయించుచున్నానను కోపముతో నతఁడు రఘునాథరావులోఁ జేరినాఁడఁట. అతఁడు నాశత్రువులలోఁ జేరునని నేనెన్నఁడుఁ దలఁపనైతి' నని విచారింపఁదొడఁగ నప్పుడు తుకాజీ మెల్లగా నమ్మా రాధాకాంతుఁడట్టివాఁడని నేను నమ్మను. అతని నియమములకు శత్రువులలోఁ జేరుట విరుద్ధకార్యము. ఇది యబద్ధమేమోయని తలంచెదను. అని మనవియొనర్చెను. ఆమనవి ననుగ్రహముతో చెవియొగ్గి విని రాణి తనచందువాపెట్టెలోనుండి యొకజాబుఁదీసి "నామాటలు మిమ్ము నమ్మింపలేకుండెను నీచిన్ని చీటియైనను మిమ్ము నమ్మింపకపోదు చదువుకొనుఁడీ" యని యాచీటి తుకాజీపైఁబడవేయ నాతఁడు దానినిట్లు చదువసాగెను. "శ్రీరఘునాథరావు రాధాకాంతరాయున కాశీర్వచనపురస్సరముగ వ్రాయునదేమనిన, నీవు నాకు మిత్రుఁడవని నేను మిగుల నమ్మియున్నాను. నన్ను మొదట మీదేశముపై దమ్మని జస్వంతరావు

పిలిచినాఁడు. అతఁడు చలచిత్తుఁడని వినుటచే నాతనిమాటలునమ్మి నేను రానైతిని. నీవు నాతోఁ జేరి యహల్యాబాయితో యుద్ధముఁ జేయుటకు సమ్మతించితివి గనుక నేను తేపువచ్చి నిన్నుఁ గలియుచున్నాను. నీవు పుత్రభావముతోఁ బెంచుకొనుచున్న శ్యామసుందరుని మీరాణి యన్యాయముగఁ జంపింపఁ దలఁచుటచే నీకాగ్రహము కలుగుట దోషముకాదు. నీవుచేసినది రాజద్రోహముగాదు కాని యిందూరు రాజ్యముయొక్క గుట్టుమట్టులన్నియుఁ దెల్పుదునని నీవు వాగ్దానముఁజేసితివి కనుక యీవాగ్దానము నిలుపుకొంటివేని మాపేష్వావద్దనీకుఁ దగినయుద్యోగ మిప్పించెదను. రఘునాధరావు." ఆయుత్తరము చదువుకొన్న తుకాజియు, విన్న శివనానాజస్వంతరావులును, నాశ్చర్యముచేఁ గొయ్యలయి మాటలాడనేరకుండిరి. రాణి వారి యాశ్చర్యముజూచి "యాశ్చర్యమెందుకు? ఇట్టివారు మన రాష్ట్రములో ననేకులున్నారు. గంగాధర జస్వంతరావూ! నీవు పాతిన కలహాంకురము మహావృక్షమై పెరిగియున్నదిగదా నీవులొంగినను నీచేఁ బ్రేరితులగువారు లోఁబడలేదు. దీనికంతకు నీవేకారకుఁడవుగదాయన తలవంచుకొని జస్వంతరావు తన మేలికతో "అమ్మా యీద్రోహమునకు మార్గప్రదర్శకుఁడను నేనే. నాపొరబాటు క్షమించి నన్నిప్పటియట్లు మన్నింతురని ప్రార్థించుచున్నాను. నేను చేసినపాపమునకు నాపశ్చాత్తాపమే నన్ను దహించుచున్నది. మీరు వేఱ శిక్షింపనక్కఱలేదు. ఇంక మీయాజ్ఞ నతిక్రమింపనని ప్రమాణము చేయుచున్నాను" అని పరిపరివిధముల నామెను వేఁడుకొనెను. రాణియు వానిమాటలకు సంతసించి కారుణ్యమొలికించు కటాక్షములు బరపి వానితోనిట్లనియె, 'ఓయీ మనరాష్ట్రమున భిల్లులబాధ యెక్కువగానున్నది. అదిగాక రెండుదినముల క్రిందట శాయాజీహోల్కారను పేరుతో నొకక్రొత్త రాజు బయలుదేరి పట్టాభిషేకము చేసికొన్నాఁడఁట. వాఁడెవ్వఁడో యాయనామధేయుఁడు మాకుసన్నిహితజ్ఞాతినని చెప్పు

కొని ప్రజలను మోసముజేయుచున్నాఁడు. శాయాజీయను నొకజ్ఞాతి మాకుండెను. కాని యతఁడు మృతినొందెనని యెవ్వరో చెప్పినారు. ఆ మాట యబద్ధమో యీమాటయబద్ధమో తెలియదు. భిల్లులు వానిలోఁ జేరినారు. దేశమునకు నిదివఱకే సేమములేదు. ఇంకముందు బొత్తుగ సేమముండదు. అందుచేత నేశూరుఁడైన భిల్లులనందఱ శిక్షించి వారినాయకులగు గండాభిల్లు మొదలగువారలఁ బట్టుకొని నాకొప్పగించి దేశమున దోపిడిమాన్పఁ గలిగెనేని వానికి నా కొమార్తెయగు ముక్తాబాయినిచ్చెదను. ఆ కార్యమును జేయఁగలవాఁడు పళ్ళెరములోని యీ తాంబూలమును గ్రహింపవచ్చు" నని బంగారుపళ్ళెరమునఁ గర్పూరతాంబూలమిడెను. అందఱు నొకరిమొగము నొకరు చూచుచు సందేహింపుచుండ జస్వంతరావు సంతోష భరితాంతరంగుఁడై లేచి యేలికతో నిట్లనియెను. 'అమ్మా నేనీకార్యమును బూనెదను. భిల్లుల లోఁబఱచుకొనక జస్వంతరా వేలినవారి మొగముఁ జూడఁడు. రాకాచంద్రవదనయగు ముక్తాబాయిని విజయలక్ష్మితోపాటు పాణిగ్రహణము చేయుటయో, యోడిపోయి మృతినొంది వీరస్వర్గమున రంభాపాణిగ్రహణము చేయుటయో, నాకు నీశ్వరుఁడు విధించినాఁడు. ఈ తాంబూలము నేనందుకొనుచున్నాఁడను.' అని తుకాజీ శివనానాలు విస్మయమునొందఁ దాంబూలము నందుకొని గంగాధరుఁడు పలికి నిలువ యహల్య యాతనింగని, గంగాధరా! నీ వంతటికార్యమునకుం దగుదువు. చిరకాలము క్రిందట నంకురించిన యనురాగ ఫల మచిరకాలమున నిచ్చుఁగాక. నేను నింబపురముపైఁ జనియెద. నేను మరల వచ్చునఱకు గండాభిల్లు గండడంచి నీవు భిల్లులగండఁడవై యుండవలెను. నీవిఁక పొమ్ము. తుకాజీ! నీవు మనసైన్యములలో నొకవంతు నుంచి తక్కిన వాహినులఁగొని శివనానాసమేతుఁడవై రాజపుత్రులమీఁదికిం జని రాణాకు బుద్ధిఁ జెప్పుము. తక్కిన

సైన్యముతో రెండుదినములలో నేను వత్తునని యానతిచ్చెను. వెంటనే రాణికి జోహారొనర్చి సెలవుగైకొని వారరిగిరి. అపుడు ముక్తాబాయి మాలిన్య మెడలిన ముక్తాఫలమువలె ముక్తవిచారయై ముక్తినొందిన దానివలె ముక్తభయయై యౌవన ప్రాదుర్భావముచే పరిపూర్ణమునొందిన తనయంగముల సౌష్ఠవము వసంతకాలమున గెంజిగురాకులనొప్పు మల్లికాలతచందములు విడంబింప నెన్నడుము జవజవలాడ మందగమనముతోఁ జిరునగవుతో నలంకరింపఁబడిన నెమ్మొగముతో వికచారవిందయుగము బోలు కన్నుగవతోఁ దల్లికడకువచ్చెను. తల్లిచేసిన శపథమును బురుషతల్లజుఁడగు గంగాధరుఁడు చేసిన శపథమును ముక్తను సంతోషసముద్రమున నోలలాడించు రెండు తెప్పలయ్యెను. వచ్చిన కూఁతుంజూచి తల్లి “ తల్లీ! నీనగుమొగము క్రొత్తవిలాసము నొందియున్నది. జరిగినసంగతుల వింటివా యేమి ” యని తనకూఁతు హృదయమూవఱకే జస్వంతునివంక మరలినదని యెఱుఁగుటచే నవ్వుచుఁ బలికెను. ముక్త లజ్జచే శిరమించుక వంచి నేలఁజూచుచు “తల్లీ! నామనవి నాలకించి మనసీత హృదయము చల్లఁబడునట్లు దురదృష్టవంతుఁడగు శ్యామసుందరుని విడువుము. ఇది చేయవేని సీత దుఃఖించును. సీతదుఃఖించిన నేను దుఃఖింపక మానను. నేను దుఃఖించిన నీకు దుఃఖము రాకమానదు. కాఁబట్టి నన్ను దయఁజూడు తల్లీ ” యని బ్రతిమాలెను. ఆదీనాలాపములు విని తనకూఁతునకు సీతపైఁగల ప్రేమాతిశయమును జేయఁదలఁచిన కార్యమునఁ గల పూనికయు నెఱిఁగినదగుటచే రాణి కూఁతుంగనుఁగొని “నీవింత మోఖాపుపట్టు పట్టినావు. నీనిమిత్తముననే నతనిప్రాణముల నిచ్చితిని. కాని యాతని నారాజ్యమున నుండనీయను. అతఁడు నాదేశమువిడిచి పోవునట్లుత్తరవుఁ జేసెదను. నీవును సీతయు నింక నింబపుర ప్రయాణమునకు సిద్ధముగనుండుఁడు” అని పలికి కూఁతునోడఁబఱచి పంపెను. ఆమధ్యాహ్నమే శ్యామసుందరుఁడు

చెఱలోనుండి విడిపింపఁబడి రాష్ట్రమునుండి తఱుమఁబడెను. తుకాజీయు శివనానాయు నరిగిన రెండుదినములకు రాణి విజయభేరీకాహళధ్వానములు శత్రువులహృదయముల వ్రక్కలుసేయ మహిషాసుర నిర్మూలనకేళికరుగు దుర్గామహాశక్తివలెఁ జతురంగబలముతో నింబపురముపైఁ జనియెను.

## పదునేడవ ప్రకరణము.

తుకాజీహోల్కారును శివనానాయును సైన్యమును దీసికొని నింబపురమునకుఁజని రాజపుత్రులచే నాక్రమింపఁబడిన నింబపురపుకోటను ముట్టడింపసాగిరి. రాజపుత్రసేనకు నుదయపురరాణా నాయకుఁడై కోటలోనుండి మహారాష్ట్రసేనల నెడతెరపి లేకుండునట్లు తుపాకులబారులచే నొప్పించుచుండెను. రాణాకు రెండుకన్నులవలె గపటోపాయవేదులగు భేతాళసింగు, భైరవసింగు లిరువురు రాజపుత్రులు సమస్తసహాయములఁ జేయుచు నిందూరుపురవార్తను నహల్యా ప్రయాణవార్తలను విన్నవించుచుండిరి. రాజపుత్రులు నింబపురము నాక్రమించుటకు ముఖ్యకారకుఁడు గోమాజీరావే గనుక నతఁ డెప్పటి వర్తమానమప్పుడు గూఢ సంచారులగు చారులముఖమున భేతాళసింగునకు నెఱుఁగఁజేయుచుండ నతఁడు రాణాకు నెఱుఁగఁజేయుచుండెను. గోమాజీరావు హోల్కారురాజ్యముయొక్క గుట్టుమట్టెఱింగించిన పక్షమున వేయివరహాల తని కిచ్చెమనట్లు భేతాళసింగు వాగ్దానము చేసినందున నింబపురముపై రసపుత్రులను రమ్మనియు నచట దుర్గాధిపతియగు శివనానా పరాక్రమహీనుఁడనియుఁ జెప్పి గోమాజీ రాజపుత్రులను రావించెను. రసపుత్రుల మనోరథము తీరినను గోమాజీయొక్క మనోరథము తీరదయ్యెను. భేతాళసింగు వాగ్దత్తముచేసిన ద్రవ్య మతనికిఁ బంపుటఁగాని

యతఁడు వ్రాసినజాబులకుఁ బ్రత్యుత్తరమొసఁగుటఁగాని సరిపడదయ్యెను. అందుచే గోమోజీ తన కిష్టుఁడైన వామనభట్టుచేతికిఁ గొన్ని యుత్తరములు వ్రాసియిచ్చి యవి భేఠాసింగునకిమ్మని చెప్పి వానిని నింబపురమునకంపెను. అతఁడటుండ జస్వంతరావు రాణీపక్షమునకు దిరిగిపోవుటయు గోమోజీరావు స్వలాభపరాయణుఁడై ప్రత్యేకపక్షము దిగకుండుటయుఁజూచి దౌలతరావు భిల్లులను శాయాజీహోల్కారును నమ్మియుండుట కేవలము మంచిది కాదని రసపుత్రులతోఁ గలిసి కొంతపనిఁ జేయుట యుచితమని నింబపురమునకుఁ దానుఁగూడ మహారాష్ట్రసైన్యముకంటె ముందుగఁ జని రాణానుదర్శించి యాతనిచే గౌరవింపఁబడి యచ్చటనుండెను. తుకాజీ బయలు వెడలిన రెండుదినములకు శ్రీరాణి యహల్యాబాయి కొంతసేనతో నింబపురముపైఁ జనుచు మార్గమున నచ్చటచ్చట నిలుచుచు నాయాగ్రామముల ప్రజలం బిలిపించి భయపడవలదనియు భిల్లులను జస్వంతరావు సంహరించి దేశమున కుపకారము సేయునని యు దురాత్ములు చెప్పు తేనెతేటలవంటి మాటలకునోడి చెడిపోవలదనియు నుపదేశించుచుఁ బయనము సేయుచుండెను. చెలియొక పల్లకిలోఁ గూరుచుండి ముక్తాబాయియు సీతయు రాణివెంట వచ్చునెడ గ్రామముల ననాగరికులఁ గనుంగొనునపుడు వారొందు నాశ్చర్యమును వనములఁ బ్రయాణము సేయునపుడు నెమలి లేడి మొదలగు ముద్దుల మూటఁగట్టు జంతువులం జూచి పొందినయానందమును గుట్టలను మహోన్నత పర్వతములను గొండకనుమలను సెలయేర్లను వీక్షించి యనుభవించిన సౌఖ్యమును, వర్ణింప నలవిగాదయ్యెను. అదివఱకెన్నఁడు నంతఃపురము వీడినవారు గాకుండుటం బట్టియు నిట్టివినోదములకుఁ గ్రొత్తవారగుటఁ బట్టియు, యౌవనప్రాదుర్భావముచే ముందువెనుక నెఱుఁగని వారగుటఁ బట్టియు బయనమే సుఖతరమని యెంచి నిర్భయముగఁ దలుపులం దెఱచి చూచుట కారంభించిరి

సైన్యము విస్తారభాగము తుకాజీతో నంపఁబడుటచే నహల్య కొలఁదిమూఁకలతో బయలుదేరి మదగజాధిరోహణము చేసి తాను సేనాగ్రభాగమునందుండి శత్రువు లొకవేళ పయిఁబడిన స్త్రీలకపాయము గలుగకుండునట్లు ముక్కును సీతను వెనుక రాఁబనిచెను. ఇందూరువదలిన మూఁడవనాఁడు సాయంకాల మీచిన్నసేన యొకయడవిలో ముప్పది మనుష్యులొకమారు వరుసగా నడచి పోవుటకుఁదగిన వెడల్పులేని యొక యిఱుకుత్రోవఁబట్టి పోవుచుండెను. రాణియధిరోహించిన యేనుఁగు సుఖముగా నడచుట కామార్గము చాలనందున నాజంతువును మిక్కిలి కష్టముతోఁ బయనముసేయఁ దొడఁగెను. వెనుకవారు ముందుకుఁగాని ముందువారు వెనుకకుఁగాని వచ్చుటకు వీలులేదు. అందుచేత, మనుష్యులందఱుఁ జీమలబారువలె నొకరివెనుక నొకరు నడచి యక్కడికి సమీపగ్రామమునకు సాధ్యమయినంత వేగముతోఁ బోవఁజూచిరి. గాటముగ చీఁకటి నభమంతయు వ్యాపించి యప్పుడప్పుడే పట్టిన నల్లమబ్బుల సాయమునొంది యామార్గస్థులకు దారి తెన్నుఁగాననీయకుండెను, ఉఱుములు మెఱుపులు నట్టహాసము చేసెనందున జవ్వనులిద్దఱు ప్రయాణము గొంచెము కష్టమని యోచించిరి. అంతలో నొంటొరుల ధ్వనులువినరాకుండ జంఝామారుతము వీవఁదొడఁగెను. ఆసమయమున నేమూలనుండియో కొండయేటిప్రవాహమువలె మహారావములతో నలుదెసలనున్నకొండలు చఱచఱదిగి యుగ్రధనుఃపాణులును విలక్షణాకృతులు నగుభిల్లులమూఁకలువచ్చి యొక్కపెట్టున సేనయొక్క వెనుకచక్కిం దాకెను. తానుటయు బాలికలిరువురు నాక్రందనధ్వనిఁ జేసి అమ్మా! దొంగలు దొంగలని యఱచిరికాని వారిరోదన మరణ్యరోదనమై యామహావాయువుచే దిగమ్రింగఁబడి యహల్య చెవుల కెక్కదయ్యెను. భిల్లులయఱపులు మోటసకిలింపులు కొంచెము రాణిచెవికిఁ బొడఁగట్టెనుగాని యామె తనసేవలవారు దాఁకిరని తెలియలేకపోయెను. అంతట సామగ్రిమోయుకూలివాఁడ్రు

నిర్విణ్ణహృదయులై భుజములపైఁ బరువులదించి శత్రులకుఁ జేతులు జోడించి దండములఁబెట్టి తమ ప్రాణములఁ గాపాడుకొనిరి. ఎదిరించువారెవ్వరును లేనందున గండాభిల్లు తక్కినభిల్లులసైన్యమున బియ్యము మొదలగు పదార్థములఁ దమసేవకుల చేతికిచ్చి బాలికలున్న రెండుపల్లకులదగ్గఱకువచ్చి తలుపులఁ దెఱచెను. అతినిభయంకరాకారముఁ జూచి ముక్తబాష్పయుక్తయయ్యెను, సీతభీతయయ్యెను. అనంతరము భిల్లులతోఁ గొల్లసలుపవచ్చినహరిహరపాండ్యాజి యామిటారులపైఁ జేతులు వైచి యందు ముఖ్యముగ ముక్తయొంటనున్న యమూల్యరత్నములను జాళువాబంగారునగలను దనివి దీఱఁ దోచుకొనుచుండ నాలతకూన లిరువురు మూర్ఛిల్లి యెన్నఁడో చచ్చినట్లుండిరి. ఇట్లు దోఁపిడిచే కోరికసఫలమైనందున హరిహరుఁడు సంతోషపారవశ్యముచేఁ బలుకఁజాలక మాటిమాటి కానగలమూటఁ జూచి మురియుచుండ "నీమెకా దామె ఆమె కాదీమె" యని భిల్లులలో నొకవిధముగ వాగ్వాద ముదయించెను. ఒకపట్ల నోరెత్తిమాటలాడఁజాలని హరిహరుఁడు వ్రేలితో నొకపల్లకిని జూపినందున వారు వాదముమాని యిదియె ముక్తాబాయియని యాపల్లకి నాభిల్లులు భుజముపై నిడుకొని యనాయాసముగఁ గొండలు సెలయేళ్ళు దాటి పఱువెత్తి యదృశ్యులయిరి. ఇంతలో సీవాతఁ కర్ణాకర్ణిని రాణీయాలకించి పుత్రికావియోగదుఃఖముచే వెడలుబాష్పములం దుడుచుకొనుచుఁ గతిపయసైనికులతో రంగస్థలమునకు నొక్కనిమిషమున వచ్చి వ్రాలెనుకాని దొంగలు స్థలమువిడిచి పోవుటయేగాక దృష్టిపథముందప్పిరి. అంతటనామె హా ముక్తా నన్నువిడిచి యడవులపాలైతివే యని విచారించుచు రెండవపల్లకీవద్దకరిగి మూర్ఛిల్లియున్న కన్నెం జూచి సీతా సీత యిటురా నీచెలి భిల్లులపాలయినది యని లేపెను. ఆపలుకులామెను మూర్ఛనుండి మేలుకొలిపినందున బాలిక కన్నుదమ్ములవిచ్చి చూచి అమ్మా దొంగలు పోయినారా నాస్నేహితురాలిం గొని

పోయినారా అని యహల్యకంఠమునకు చేతులుపెనవేసి కౌఁగిలించుకొనెను. అహల్య యాశ్చర్య నిమగ్నయై యేమిది అమ్మా నీవు ముక్తాబాయివా. పాపము సీతనే దొంగలెత్తుకొని పోయినారా యని కూఁతుగన్నమోదము సీతచన్నఖేదము చిత్తమున మల్లడిఁగొన ముక్తాబాయిని లేవనెత్తి ముద్దుపెట్టుకొని సీతకై మిగుల విచారించి తనకంటె చెలినిమిత్తము మిక్కిలివ్యథనొందు కూఁతునూఱార్చుచు నామెను సేదఁదేర్చి వెంటఁబెట్టుకొని తనగజముపై నెక్కించుకొని సైన్యమునఁ గలకలముడిపి తిరిగి పైనముసాగించెను. త్రోవలో ముక్త సీతనుదలంచుకొని అమ్మా యిఁక నేను సీతనుజూడను గాఁబోలును. దానిమాట లేమమ్మా అదిపలుకుట యమృతవర్షము గురియుటకాదఁటమ్మా. అహోహో మఱువఁదలచినను దానిచర్యలు మఱపురావు తల్లీ. అది దాసియటమ్మా వరహాల కుప్పగాని హా సీత భిల్లులచేతఁ జిక్కినతరువాత నీవు నాకుదక్కుట యెక్కడిది. వారే దేవతకో బలిపెట్టుదురుగదా యని విలపింప కన్నీరుదుడిచి తల్లి యామె నూరడించి సీతను వెదకించి తెప్పింతునని పలికి భిల్లులమీఁది కరుగునపుడు సీతజాడలు దీయుమని జస్వంతరావునకు రాణి జాబులనంపెను. అట్లు చని యారాత్రి సమీపగ్రామముచేరి యందుండి మఱునాఁడు మఱలబయలుదేరి పయనముసాగించి కొన్నిదినములలో నింబపురసమీపమునకుఁ జనిరి. రాణిరాకమున్నె విని తుకాజీ శివనానా మొదలగు సేనాధిపతులు భయసంభ్రమములతో నామె నెదురుకొని యామె యేనుంగుల కిఱుకెలంకులం దాపునడచి ప్రత్యేకమామెకై వేయఁబడిన గుడారములో నామెను బ్రవేశపెట్టి తద్దేహసంరక్షణార్థమై యేనూరుగుఱ్ఱపుజోదులను గుడారముచుట్టుఁ గావలియుంచి రాణితో శివనానా యిట్లనియెను. అమ్మా మేమువచ్చి నాలుగుదినములయినది. తుకాజీయు నేనును గడుజాగ్రత్తగఁ గోటముట్టడించుచున్నాము. మీరుకూడ శ్రమపడనక్కఱలేకయే కోటలోఁబడును. మీదేహసంరక్షణార్థము మే

ముంచిన యీసేవకులలో నేఁబదుగురు తురకలున్నారు. తురకలని వీరిని తిరస్కారభావముతోఁ జూడవలదు. మతవిషయమున హిందువులకంటెను కృతజ్ఞులుగ నున్నారు. అందీజమాన్ ఖాన్ సాహసవిక్రమార్కుఁడు. రాజపుత్రులువచ్చినప్పటి కీసూరశిఖామణి యూర లేఁడు కాని యుండినచో నింబపురము మీరు రావలసినయవసర ముండకపోవును. ఈతనిచేత మీరెన్ని కార్యములు చేయించుకొనవచ్చును. అనిచెప్పి యొక్క సుందరుఁడగు తురుష్కవీరునిం జూపి యొప్పగించెను. రాణి యీపలుకులకలరి జమానుఖాను మొదలగు మహమ్మదీయులయందు నమ్మకముంచి వారిచే సంరక్షింపఁబడుచు గాఢముగా ముట్టడిజరుపుమని యానతిచ్చి యుద్ధములనారితేజని స్త్రీయయ్యు భయమనక పగలనక రాత్రియనక గుఱ్ఱముపై నెక్కియు నేనుఁగుపై నెక్కియు స్వయముగా సేనలఁబురికొల్పుచుఁ బ్రాలుమాలిన స్వభటుల రక్షింపుచుఁ బరభటులను జంకఁజేయుచు నిరువురచే శ్లాఘింపఁబడఁజొచ్చెను. నింబపురాంతఃపుర కాంతల గర్భంబు లవియఁజేయు ఫిరంగిగుండ్లు గభిల్లుగభిల్లుమని కోటగోడలు దూల్లుపడఁజేయుచుండెను. రాజపుత్రమహారాష్ట్రసైన్యములు దూరములనుండి యొకరిపైనొకరగ్నివర్షములు కురియించుచుండిరి. ఇట్లు ముట్టడిజరుగుచుండ రాణివచ్చిన మఱునాఁటిరాత్రి గుడారములో రాణియు ముక్తయుఁ గూర్చుండి సీతనుగూర్చి ముచ్చటించుచుండఁ గావలిగాచు జమానుఖానుయొక్క కఠినమయిన కంఠధ్వని వారికి వినఁబడ రాణి యొకసేవకునిఁబిలిచి యదియేమని యడిగెను. ఆసేవకుఁడు నమస్కారముఁజేసి 'అమ్మా నలుబదియేండ్ల వయస్సుగల స్త్రీ తమదర్శనమునకు రాఁగోరుచున్నది. యుద్ధసమయములయందుఁ బరుల రానీయనని జమానుఖా నామెను నిరోధించినాఁడు. అదియే నాగడబిడయని విన్నవించెను. రాణి యామాటలువిని నవ్వి స్త్రీలనురానిచ్చిన నేమి నష్టముండును. ఆమెను రానిమ్ము. ఆమె యేమి చెప్పనోయని జమానుఖానునకు

వర్తమానమంప నతఁడామెను లోపలికిఁబిలచెను. పచ్చని దబ్బపండు వంటి దేహచ్ఛాయఁగలిగి పొట్టిగ లావుగ నున్న యాయంగన యెఱ్ఱని చీరఁగట్టుకొని మొగమున నెఱ్ఱనికుంకుమబొట్టుతోడను గుఱుచలగు వెండ్రుకలతోడను బలుచని మొగముతోడను వచ్చి రాణియెదుటనిల్చి 'అమ్మా నామొఱనాలకింపుఁడు. నేను నింబపురవాసురాలను. నాకుమారుని శివనానా నిర్హేతుకముగఁ జెఱలోనుంచినాఁడు. అదిగాక యీ ముట్టడిలో నాపనిపట్టెదనని యిదివఱకుఁ బ్రతిజ్ఞఁజేసినాఁడు. అందుచే నేనసహాయురాలనగుట నబలనగుట మీయొద్దనుండఁగోరివచ్చితిని. నాకుమారుని చెరనుండి విడిపింపుఁడు'. అని రోదనముచేయసాగెను. శివనానా యామెకుమారుని నిర్హేతుకముగఁ జెరలోఁబెట్టఁడని నిశ్చయముగ నెఱింగి యతని నీసమయమున నావిషయమైయడిగినచో నేమికార్యభంగము వాటిల్లునోయని శివనానాన డుగుటకు నుద్యుక్తురాలుగాక భయపడిన యాయంగనను మాత్రము తనతోనుండుమని "అమ్మా నీకుమారునకుఁగాని నీకుఁగాని భయములేదు. ముట్టడియగువఱకు నీవు నా గుడారమున నుండుము. నేనుండ భయమేల" యని యామెభయముడిపి రాణి యారాత్రి నిద్రించెను.

## పదునెనిమిదవ ప్రకరణము.



మనుష్యరక్షితములు గాక యెండకునెండి వానకుఁదడిసిన యడవి చెట్లనున్న పరిమళముల గ్రహించి మందమలయానిలుండు తన గంధవహనామము సార్థకముగా నరుదెంచి యున్నతపర్వతముపై గుడారమునఁ గొలువుఁదీర్చిన శాయాజీహోల్కారుయొక్క శ్రమలన్నియుఁదొలఁగఁ జేసెను. అతఁడొకకుర్చిమీఁద సుఖాసీనుఁడై యదివఱకుఁ బీల్చిన గంజాయిమత్తు తగ్గినందున మఱలఁగొంచెముగంజాయి తనదగ్గఱనిలువఁ

బడిన బాలకునడిగి నాలుగుగుక్కలు పీల్చి వహ్వావ్వా వహ్వావ్వా నీవు మంచివాఁడవురా కుఱ్ఱా నీపేరెవ్వరురా మఱచినాను ఫాజీకాద్దాఖ్ఖుని యాబాలునడిగెను. హోల్కారురాజవంశమున నుదయించినవ్వాని కిట్టి తుచ్ఛమయిన యభ్యాసము లెట్లు నవడెనని మనస్సున నొచ్చుకొనుచు నాబాలుఁడు నాపేరు బాజీరావుకాని ఫాజీకాదండి యని యుత్తరమిచ్చెను. శాయాజీ ప్రత్యుత్తరమిచ్చుటకుఁ బ్రయత్నించుచుండ నింతలో గండాభిల్లుపాండ్యాజీలు గుడారపువాకిట నిల్చి హోల్కారువారి దర్శనముఁ జేయఁగోర నతఁడు వారిరమ్మనియెను. వారు లోనికివచ్చినప్పటికి శాయాజీ బాజీరావు నావలికంపి వారచ్చటికి వచ్చినకార్యమేమని యడుగ హరిహరుఁ డిట్లనియెను. మహారాజా! అహల్యాబాయికి ముక్తాబాయిపై ప్రేమ మిక్కుటమని విని కూఁతుర్ను మనస్వాధీనములో నుంచుకొన్నపక్షమునఁ దల్లి మనము చెప్పినట్లొప్పుకొని కుమార్తెప్రాణరక్షణార్థము మనకు రాజ్యమును వదలివేయునని ముక్తాబాయిని దెచ్చినాము. ఈపర్యాయము తమరు తప్పక రాజ్యము గైకొనవచ్చును. కావలసినచో నీమెను వివాహమాడను వచ్చును.” ఈపలుకులు శాయాజీ చెవులఁబడినతోడనే యేదీ నాప్రియురాలేదీ యని దిగ్గునఁబీఠమునుండి లేచి గుడారమువెలుపలికి వచ్చెను. గండాభిల్లింతలోఁ బల్లకిఁదెమ్మని బోయల కానతిచ్చుటయు వారందున్న యందలమును మోసికొనివచ్చి హోల్కారు నెదుటనుంచి తలుపులఁదెఱచిరి. తనకు మన్నిసుల్తానుబిరుదునొసంగిన తనయేలికయెడ విశ్వాసమధికముగుటచే గండాభిల్లు పల్లవాధరింగని ప్రభువువారు నీనిమిత్త మెమరుచూడ ముద్దులాగున్నఁ గదలిరావేమి యీపాటికిరా యనిమృదుతరమృణాలముల నిరసించు నామె బాహువల్లిఁ బట్టుకొనిలాగ మడకత్తివంటి భిల్లుని మోటచేయి సోఁకుటచే నరముబెణికి కడుబాధ గలుగ, ‘అమ్మా’ యనిజాలిపుట్టనఱచి ప్రతిమలాగు సీత వాఁడుఁబోగివవై పునకుఁ జని నిశ్చేష్టురాలయి పల్లకిఁజేర

బడెను. శాయాజీశరీరము పులకలెత్త కన్నెత్తి యాంపుత్తడిబొమ్మంజూచి మేలిముసుంగు దీయుమనియానతీయ గండాభిల్లుకన్నియండాసి వలదువల దనియామెచేతులతో నడ్డగించుకొనుచున్నను జేతులువిదలించి మేలిము సుంగుదీసెను. తీయుటయు మేఘముసుండి వెడలు మెఱుపువలె తెరచా టునుండి వచ్చు భామవేషమువలె భూమిని సంచరింపవచ్చిన యచ్చరవ లె నపుడుదయించిన పూర్ణచంద్రబింబమువలె ముఖకళలు పర్వఁజేయు చు నాలతాంగినిలువ ముసలివాఁడగు హరిహరుఁడు, శృంగార రస మె ఱుఁగని మోటవాఁడగు భిల్లుండును మోహాతురులై యువ్విళులూర నా గరికుఁడును బహుచువాఁడునగు శాయాజీస్థితి వర్ణింప నేరితరము ! ఇట్లు మోహాసముద్రమునఁ గొంతసేపు మునకలు వేసివేసి వారుమువ్వు రొక రినొకరు చూచుచు భయలజ్జలచే వారింజూడఁజాలక మొగ మావలివై పున కాబాలిక త్రిప్పుకొన్నను వంగి యాముఖముఁ గనులారఁ గనుచు నుండ శాయాజీ వారలతో 'హరహరా ! యీయామె ముక్తకాదు. ము క్తను నే నెఱుఁగుదును. ఆమె యింత సౌందర్యవతికాదు. ఈమెపేరె ఱుఁగను. కాని యాకారము నాకుఁ గ్రొత్తదికాదుసుమీ యని, సుం దరీ ! నీవెవతే" యని యడిగెను. మహారాజుగారిప్రశ్న కామె యుత్త రము నొసంగుట కష్టములేనిదయ్యెఁ దన్ను వారు ముక్తాబాయిగా భా వించుచుండిరి గనుక తనపేరు ముక్తాబాయి కాదని మనవిచేయుచర్చించెనోఁ దన్ను వారు విడుతురను నాసచే నామె, 'నేనుముక్తనుగాను నాపేరు సీత ముక్తాబాయికి నేను దాసిగనున్నాను. నన్ను దయచేసివిడువుఁడు స్వామీ ! మహారాజులు నున్నతగుణవంతులునగు తమకు దాసీసంగమ ముకూడదుగదా" యని ప్రార్థింప నాముద్దుమాటలాలకించి శాయా జీ, సుందరీ నేను నీకుజ్ఞాపకమున్నానా, నాఁడు పురహరనగరములో గుడి లోనికి నీవు పోయి మరలివచ్చుచుండ నేను నిన్ను బాణిగ్రహణము చే యలేదా యని తన్నామెకు విన్నవించుకొనెను. అర్థరాత్రివేళ నడివీథిలో

స్త్రీని జెఱఁబట్టఁ దలఁచిన దోషకర్మ నొంటరిగఁ జిక్కినదానిని విడు
వఁడనియుఁ దనపుణ్యమట్లున్నదనియు భగవంతునిపై భారమువైచి సీత
మిన్నకుండ, వివాహప్రయత్నము చేయింపుమని హోల్కారుచెప్పెను.
ఆపచ్చనిపందిళ్ళనడుమ నాపర్వతశిఖరమున పట్టాభిషేక మహోత్సవము
వలెనే వివాహమహోత్సవమును జరుగుటమంచిదని గండాభిల్లు తగినము
హూర్తమెంచుమని హరిహరపాండ్యాజీతోఁ జెప్పి కావలసిన మృగ
ములనుఁ జంపితెమ్మని నలుదెసలకుఁ దన భిల్లులనంపెను. శాయాజీ
హోల్కారున కీకన్యను వివాహము సేయుట యెందుచేతనో హరిహరు
నకిష్టము లేదయ్యెను. ఈవృద్ధబ్రాహ్మణునకుఁ గూడ నామెయందాశ
గల్గుటయె ప్రాయశః దీనికిఁ గారణమై యుండఁబోలు. అందుచే నాతఁ
డు శుభముహూర్తము నాలుగైదు దినములలోపున లేదని తెలియఁజె
ప్ప వారందఱు సీత నొకగుడారమునునుంచి చుట్టు నలువురు భిల్లులను గా
వలియుంచిరి. మొదట సీత యక్కడికి వచ్చుటతోడనే శాయాజి బాజీ
రావును గుడారమునుండి యావలకుఁ దోలినందున నాతఁడు గుడారపు
చాటున కరిగి యచ్చటఁ గూరుచుండి వచ్చినయాయంగన యెవ్వరో
యనిమాత్రము ప్రేరేపింప గుడారపుగుడ్డకున్న చిన్నరంధ్రమునఁ దనక
న్నులుంచి సీతను జూచెను. చూచినతోడనే యాతనిమనస్సునకేమి పు
ట్టెనోగాని చోటవోటఁ గన్నీరు కాలువలై చెక్కులమీఁదుగ నేత్రద్వ
యమునుండి ప్రవహింప బాజీరావు హాదైవమా! మాకిరువురకుఁ గూ
డఁగనియాపదఁ దెచ్చిపెట్టినావుగదా యని విలపించి తాను దుఃఖించిన
జాడయేరికైనఁ దెలిసిన వారు తన్ను గారణమడిగి తెలిసికొని బాధిం
తురని కన్నీరుసత్వరమే తుడుచుకొని యెట్లైన సీతనొకపర్యాయము
కలిసికొని మాటలాడవలయునని ప్రయత్నించెను. కాని యాదినమున
సమయము దొరకదయ్యె. అతఁడొకటి రెండుసారులు సీతయున్న గుడా
రము ముందఱ కరిగినిలువ భిల్లులతనిఁ గదిమికొట్టిరి. అందుచే నేమియుం

దోఁచక కాలుగాలిన పిల్లివలె నిటునటుఁదిరుగుచుఁ జెప్పిన మాటలుచక్కఁగ వినఁబడమి శాయాజీచే చీవాట్లు దినుచు మితిమీఱిన సంతాప మొందసాగెను. ఆగుడారమునఁ బ్రవేశించుటాది సీత నెమ్మనమున నుమ్మలికను హెచ్చ "హా భవానీమాత నాఁడు సన్యాసిరూపమున నీవే నాపరాభవము దప్పించితివి నేఁడుపంచాగ్నిమధ్యమందు నన్నుంచినట్లు క్రూరజనమధ్యమున నుంచితివి. నన్ను భంగపుచ్చుటకు యత్నించువారేకాని నివారించువారు లేరు. ఏమిపనిచేసినను నీదాననే యని వేవిధముల మ్రొక్కుచు హరిహరుఁడు తనకంపించిన భక్ష్యములుగాని మహారాజుగారు ప్రత్యేకముగఁ దననిమిత్తమైవండించి పంపించిన మాంసాదికములుగాని భక్షింపక యన్నముముట్టక నీరుగూడఁ ద్రావక శుష్కోపవాసముచేసి భిల్లుల చెఱనుండి తప్పించుకొని పోవువఱకు నుపవాసములు చేయునట్లు ప్రతినగావించెను.

శాయాజీ హోల్కారు సూర్యాస్తమయ మయినతరువాత మదనబాణాహతుఁడై పలుమాఱు సీత యున్న గుడారము యొద్ద కరిగి యటనుండుభిల్లులకొఱకై మఱలుచు మఱల నటునైపరుగుచుఁ బ్రతిమాలియో బలాత్కరించియో యామెను దనస్వాధీనముఁ జేసికొనఁ గోరుచుండెను. హరిహరపాండ్యాజీ వృద్ధుఁడయినను వానికోరిక పసుచుతనమందుంచుటచే నెట్లయిన నయముననో భయముననో బాలికను దాను స్వీకరింపఁగోరి నిద్దురలేక సమయమున కెదురు చూడసాగెను. బలవంతముగ గుడారముఁ జేరనపక్షమున హరిహరుఁ డేమనుకొనునోయని శాయాజీయు శాయాజీయేమిచేయునోయని హరిహరుఁడు నొకరికొక్కరు జంకి చతురంగమున నొకగుఱ్ఱమొకగుఱ్ఱముచేఁ గట్టఁబడిన వడువున నామెదగ్గఱ కరుగరైరి. దైవయోగమున నావృద్ధుఁడు బాలుఁడు పరస్పరమత్సరబద్ధులై భిల్లులు నిద్రించుచున్నను గుడారమును గాచుచుండిరి. హరిహరుఁడు నిద్రలేక శవమువలె నేలమేలుకొనుచున్నాఁడో యని

మహారాజునిందింప నీకుజ్జీమీఁగేలదయ్యా మునలెదిరుగుచున్నా డోయని హరిహరుఁడు వాని నిందింపఁదొడఁగెను. ఒకమారు కామాగ్నికిఁదోడు క్రోధాగ్నికూడఁజనింప శాయాజీ ఖడ్గముధరించి హరిహరుని జంపనుంకించి చప్పన తెలివిఁదెచ్చుకొని యది తనభవిష్యదభివృద్ధికి నాశనకారణమని యూఁనిమారి తుదకుఁ బ్రాణములుపిసికి కామపారవశ్యమునుండి తొలఁగింపఁబడి నిద్రాపారవశ్యము నొందెను. అప్పుడు హరిహరుఁడావాడఁ దెలిసి గుడారము జేరఁబోయి యమదూతలవలె భిల్లులు మేలుకొనుటచే వెనుకకుంజని రెవంతసేపు కునికెను. అవగింజంత సమయమెట్లయినఁ జేకుఱునేని దానింబట్టి సీతాదర్శన మొనర్చి మాటలాడఁ దలఁచి రేయి కునుకు లేక శ్రమపడుచున్న బాజీరావు వీరిరువురు నిద్రాసక్తులుగాఁ జూచి భిల్లులంతకుముందే దేహములనుమఱచి గాఢసుషుప్తులగుట నెఱిఁగి యదియేకచీఁకటిరాత్రియగుట నెంచి మెల్లమెల్లగ సీతయున్న గుడారపుప్రక్కకు వచ్చి నిశ్శబ్దముగఁ గూరుచుండెను. కూరుచుండి భూమిని దాకు గుడారపు మూలకగుడ్డను దనచేతులతో మీదికి నెత్తియుల్లము దానికిలోనఁ దూరి లోపలఁ బ్రవేశించి దప్పుసగాయుండ దేకి సీతకడకరిగెను. నిద్రపట్టకున్నను బహిర్భాగ్యక్షమముగ నేమో యాలోచనసల్పుచుండిన సీతయొక్క మృదుదేహముపై బాజీరావు చేతులువైచి తట్ట నామె యులికిపడి శాయాజీయేమోయని వడఁకి ఛీఛీ దురాత్మా పోపో యని గద్గదస్వరముతో నఱచెను. అపలుకుల కలుగక బాజీరావు నేను అక్కయ్యా నేను బాజీరావును. నీవు భయపడకుమని మెల్లనఁ జెవిలోఁజెప్పెను. అమృతసేచనముఁ జేసిన చందమున నామాటలు తన చెవికిఁ దృప్తిగొనసంగఁ జేతులతో వాని దేహముఁదడివి పూర్వము దానెఱింగిన యానవాళ్ళనుబట్టి యతఁడు బాజీరావని గ్రహించి "నాయనా నాయనా నీవును నీమాయభిల్లులచేతి నే చిక్కితివా" యని రవంతసేపు వగచి యూరకనిగుడఁ దీపికొననాతఁడు నామెమోడిలోఁ బండు

కొన్ని ముహూర్తములదాక అక్కయ్యా నన్ను భిల్లులు రెండుసారులు వారిదేవతకు బలిఁబెట్టనెంచిరి. ఈపర్యాయము మనమిద్దరముఁ గూడ నష్టులయగుదుమేమోయని యేడువసాగెను. సీత వానివిలాపమును వారించి యిది దుఃఖమునకుఁ దగినయదనుకాదు. ఉపాయములచే మనమిచ్చటనుండి దాఁటవలయును. నీవు నేను చెప్పినట్లు చేయుము. అని వానికిఁ గొన్నిరహస్యములు చెప్పి యిక్కడనీవున్నచో మనకు నిరువురకు నాపద వాటిల్లును. సర్వాంశమే సాగిపొమ్ము. లేయని వానినంపెను. అతఁడును బూర్వప్రకారమున గుడారమునుత్తిగించుకొని యావల బడి తన యేలికహుజారమున కరిగి తనస్థానమునఁ దానెప్పటియట్లు శయనించెను. ఉదయమున హరిహరుఁడు హోల్కారుకన్న మున్నె లేచి కాల్యకృత్యములం దీర్చుకొని బాజరాయుని జేరఁబిలిచి నుత్రా సీతవద్దకు నీవు సేవకుఁడవగుటచేఁ బలుమారు నీవు పోవుటకు నీ కుత్తరువు గల్గునట్లు చేసెదను. నీవామెతో నాపై ప్రేమగల్గునట్లు నన్ను వివాహమాడునట్లు నొత్తిచెప్పి నాకీయుపకారముఁ జేతువేని చెఱనుండి నిన్ను వదలించెదను. కానలయునేని నీకుధనముఁగూడ నర్పించెద. అట్లుచేయఁగలవా యని వినయమునఁబలికెను. ముసలి వానికింత కోర్కెయున్నదని నగవును దన్నుట్టిదుష్కార్యమున కాతఁడు నియోగించినందు కలుకయు నతనిమనస్సున నుదయింప బాజీరావు వానినివారించుకొని కాలానుసారముగ నర్తింపఁదలఁచి, అయ్యా నాకిదియిష్టమే. శాయాజీకూడ నామెనుగోరుచున్నాఁడు. వానిని గడతేర్చు పక్షమున మీకేమి దక్కునని యుత్తరమీయ హరిహరుఁ డదియెంతపని యీరాత్రి చేతునని సంతోషముతో వానినంపెను.

# పందొమ్మిదవ ప్రకరణము.

అట్లు భిల్లులశిక్షించుటకుఁ బ్రతినఁబూని జస్వంతరావు రాఁశిడిగి కొంతసైన్యమును వెంట బెట్టుకొని భిల్లుల గూడెములపైఁబడి హారిలోఁ బలువురఁబట్టుకొని కొందఱఁ జెరలోనుంచుచు ముఖ్యులగువాను కుల వృక్షములకుఁగట్టి యురి దీయుంచుచు నొకమాఱు వారుతిరుగఁబడునపుడు వారితో వెనుదియ్యక కయ్యములు సల్పుచు నొకమాఱపజయము నొందుచు జయాపజయములవలన నుదయించు సంతోషవిచారములకుఁ దనమనసు పుట్టినిల్లగునటుల ముక్తాబాయిపై హృదయమునిల్పి విజయకాంక్షపై దృష్టినిల్పి విహరింపఁజొచ్చెను. ఒకమూలఁ గొందఱఁబట్టి బరిమార్చుచుండ రెండవమూల మఱికొందఱు భిల్లులు పల్లెలపై బడిదోఁచుకొని బీదకాఁపులగృహములఁ బరశురామప్రీతిఁ జేయసాగిరి. అహోరాత్రములు నిద్రాహారములు లేక జస్వంతరావు ప్రాణములకు లక్ష్యపెట్టక యందఱి శిక్షింపుచున్నను భిల్లు లిసుకపాతరలవలె తగ్గరైరి. కాని యాతని యెడతెగని పూనికవల్లనుఁ నహించిన క్రౌర్యమువల్లనుఁ భిల్లులకుఁ దమ వినాశకాలము దాపుఱునదనుమాట తెలియుటయేగాక జస్వంతరావుపేరును విన్నప్పుడు వారికొకవిధమయిన యడలుకూడ గలిగెను. కాని యాటవికనాయకుఁడును మున్నొకసారి చిక్కి శ్యామసుందరుని తోషముక బాఱెనవాఁడును శాయాజీకిఁ గుడిచేయియయినవాఁడును, నగు గండాభిల్లున్న స్థానమున జస్వంతరావెఱుఁగక వానిని బట్టుకొన్న తనజన్మము సార్థకమనియు నతఁడు చిక్కినతోడనే భిల్లులు కోరలుదీసినపాములవలె లొంగుదురనియు నందు శాయాజీ యసహాయుఁడయి రాణికిఁ లోబడుననియుఁ దలఁచి గండాభిల్లు నిమిత్తము సమస్తప్రయత్నములను సల్పుచుండెను. భిల్లువంశమునకు జస్వంతరావుత్పాతహేతువయి పులులచంద

మునఁ దమవారి నతఁడు వేఁటాడుటవిని గండాభిల్లు సహింపనోపక శాయాజీదగ్గఱ తాను గొలువుండి తాంతియాభిల్లు నిచ్చి తనసేవలఁగూడ దేశనాశనముఁ జేయుమని పంపెను. భిల్లులతోడనేగాక సకలపాపములు మూర్తీభవించినట్లు బహుదురాత్ములతో నీసేనగూడియుండినది. గ్రామములపైఁబడినదాది తల్లులకుఁబాసిన పిల్లలతోడను మగలకుఁబాసిన భార్యలతోడను దినుట కన్నము లేని బీదలతోడను దేశ మెంతక్షోభపడవలయునో యంతక్షోభ పడసాగెను. కాని లయకాలరుద్రుఁడయిన జస్వంతరావును మృత్యువు మూర్తిగైకొన్న తెఱఁగున కృష్ణపంతను నొక యోధవరుఁడును గలిసి విధివిరామము లేక శతసహస్రములుగా వారిని యమాలయమున కంపుచుండిరి. హరిహరపాండ్యాజీ సీతకును శాయాజీకిని వివాహము జరుగు ముహూర్తము నాలుగుదినములున్నదని చెప్పినతోడనే గండాభిల్లు తాంతియాను వెంటఁబెట్టుకొని జస్వంతరావు యొక్క ధాటిని చవిచూతమని తనకొండ విడిచి తక్కినభిల్లులకును రాణిభటులకును గయ్యములుజరుగుస్థలమునకుంజనెను. ఆస్థలమునకరిగి మొగమునఁ గన్నులకుమీఁద చేయిఁబెట్టుకొని యతఁడు పాఱఁజూచునప్పటికి నిఱువదిమంది గుఱ్ఱపురౌతులతోఁ బోవుచున్న యొక యోధుఁడు దూరమున కనఁబడ "తాంత్యా అతఁడు జస్వంతరావని తోఁచుచున్నది. మన మీసమయమున వానినెదుర్కొనఁజాలము. నీవుపోయి యీచుట్టుపట్లనున్న మనవారినందఱ సిద్ధముగ నుండుడనిచెప్పుము" అని వానినంపి తానొక గుహలోడాఁగెను. తాంత్యాభిల్లు తన యజమానుని సెలవుప్రకారముగ సమీపముననున్న పల్లెలకరిగి భిల్లులకు గండావచ్చిన వార్త తెలియఁజేసి మరల నాగుహావైపు పోవుచుండెను. ఇంతలో నిరువదిమందిగల యాసమూహము గుహవద్దనిలిచి పలుదెసలు పరికించునప్పటికి వృక్షములచాటున నక్కియున్న యొక భిల్లుఁడు గనఁబడ "అదె భిల్లుఁడు ! అదె, భిల్లుఁడువచ్చె, నని యఱచిరి. తోడనే జస్వంతరావు

మార్గాయాసమున నడివఱకు మిగుల నలసివాడిన కృష్ణపంతును గుహాముఖ
మున నొక చెట్టుక్రింద నిల్పి తాను దక్కనభటులుం గలిసి యాభిల్లుని
దెస కరుగ నతఁడును లేడివలె దాఁటులు వైచుచు ముండ్లపొదలను రాతిగు
ట్టలను నవలీలగ దుముకుచు వీరికిఁజిక్కక పరుగెత్తసాగెను. ఇచ్చట కృ
ష్ణపంతొక్కఁడును వృక్షచ్ఛాయ విశ్రమించుటఁజూచి గండాభిల్లు మెల్ల
గ నీవలకువచ్చి "తమరెవరి నిమిత్తమిందున్నవారు స్వామీ" యని వా
నిఁబలుకరింప నాతఁడు భిల్లులనిమిత్తమై మేమువచ్చినాము. గండాభిల్లు
ను నీవెఱుఁగుదువా? అతని నొప్పగించిన పక్షమున నీకపాయము లేకుం
డఁజేసెదను" అని కృష్ణపంతు ప్రత్యుత్తరమిచ్చెను. అంతట గండాభిల్లు
"స్వామీ! గండా యింతకుముందె యీప్రాంతములకు వచ్చినాఁడు. ఒ
క నిమిషము క్రిందట మీరు వచ్చితిరేని నేనుజూపియుందును. అయి
నను వాఁడీగుహలోనుండవచ్చును. నావెంటరండి" యని యాతని నాగు
హాప్రవేశముచేయించి యందతని నొక రాతిపైఁగూర్చుండఁబెట్టి యెవ
రయినవచ్చుచుండిరేమోయని మఱల నొకమాఱు గుహాద్వారమునకువ
చ్చి యెవరులువచ్చుటలేదని సంతసించి లోనికింజనెను. ఇచట పరధ్యానము
గనున్న కృష్ణపంతును బలిమిని వెనుకకుఁబడఁద్రోసి తనమొలలోనున్న
సూరకత్తితో నాతని ముక్కుఁగోసి యొక చెవిలో నొకభాగము ఖండించి
"యోరీ దురాత్మ నేనేరా గండాభిల్లును నన్నుఁ బట్టుకొనువారు మీ
రా?" యని తక్షణ మాగుహనువిడిచి కొండమీఁదికెగఁబ్రాకి తనయొం
ట వ్రేలాడు నిడుదకొమ్మున విపరీతమయిన విధమునఁ జెవులు గిం
గుఱుమనునటులూదెను. ఆకొమ్మునాదుట యానవాలుగఁగొని యా
ప్రాంతవాసులగు భిల్లులు మఱలనొకకొమ్మునెత్తి ప్రతిధ్వనిచేసి పుట్ట
లోనుండి వెడలు చీమలవలె నొకవరుసను రెండుమూఁడువందలమంది
గండాభిల్లున్నదెస వచ్చిరి. తాంతియాభిల్లు తమకానఁగొల్పి చిక్కనందు
న జస్వంతరావు తనచిన్నసేనతోఁగూడ వెనుకకుందిరిగి గుహాముఖమున

బోసిముక్కును దెగినచెవియును గల్గి స్రవించురక్తముతో బాధనొందు చున్న కృష్ణపంతునిజూచి తెల్లబోయి స్పష్టముగఁ దెలియని వానిముక్కు మాటలవల్ల గండాభిల్లుచేసిన పరాభవము నెఱిఁగి క్రోధోద్దీపితుఁడై యుండె నింతలో గుమిగూడిన భిల్లులు కొండమీఁదనుండి వీరిమీఁద నమ్ములవర్షములు గురియింపనారంభించిరి. మూఁడువందలమందిలో నిరు వదిమంది కయ్యముచేయుట మృత్యుస్నేహముసేయుటయే యని జస్వం తరావు స్పష్టముగ నెఱిఁగియుఁ దాము వెన్నిచ్చిపాఱినచో వారు తరిమికొట్టి మొదలే బ్రతుకనీయరని తుపాకులతోఁ గొంతయుద్ధముచేసెను. ఇట్లు జరిగినకయ్యమున మహారాష్ట్రులు తుపాకీదెబ్బలుతిని ముప్పదైదుగురు కంటె నెక్కువ సంఖ్యగల భిల్లులు నేలపాలయిరి. జస్వంతరాయుని బల ములో సగముకంటె నెక్కుడుహతులైరి. అంతట జస్వంతరావు రంగ మువిడిచి పోవఁజూచుచుండ దూరమున నాతనిసేనలో నొకభాగము వా నిని వెదకికొనుచు వచ్చుచుండెను. ఆబలము దృగ్గోచరముకాఁగా భి ల్లులు పిట్టలవలె తుఱ్ఱునఁ గొండమీఁదనుండి నానాముఖములఁబాఱి య దృశ్యులైరి. ఇట్లు పూర్వము లక్ష్మణునిచే శూర్పణఖకు జరిగిన పరాభ వమే గండాభిల్లుచే కృష్ణపంతునకు జరుగ నాతఁడు యుద్ధమునుమాని సి గ్గుచేఁ దనవికలాంగిత తనకే యసహ్యకరముగఁదోప మెల్లగ నింటికిఁజ నెను. గండాభిల్లు తాంతియానుగూడుకొని మఱునాఁడు సాయంకాల మునకు శాయాజీహోల్కరువారి సమ్ముఖమునకువచ్చి తనపూర్వోద్యో గముఁ గైకొనెను.

అట నింబపురమున దౌలతరావు రసపుత్రులతోఁ గలసి య హల్యాబాయి సైన్యమును నోడింపవలెనని యెంతప్రయత్నము సల్పు చున్నను మహారాష్ట్రులే యీముట్టడిలోఁ బయిచేయిగలవారుగనుండిరి. గోమోజీరావు రాజపుత్రులకుఁ గావలసిన ప్రతిసహాయముఁ జేయుదు నని వారిని బిలిపించి తనలంచము వారు సత్వరముగ నందఁజేయింప

రైరని వారిపై నలుకఁ బూననేకాని తాను వాగ్దానమొనర్చిన సాయము వారికిఁ దానొనర్పఁజాలనందుకుఁ జింతిల్లఁడయ్యెను. కొత్వాలువద్దనుండి యేసహాయము లేకున్నదని రసపుత్రప్రభువగు నుదయపురరాణావారు భిల్లులను శాయాజీనైనఁ దమకుఁ దోడుగ రప్పింపుమని దౌలతరావును బలుమాఱడుగుచు వచ్చినను శాయాజీరా వప్రయోజకుఁడనియు వానినిబిలిచిన మునుపున్నగోడు చెడుననియు భిల్లులాటవికులగుటచే దేశమును గొల్లగొనుటకే యత్నింతురుకాని నిల్చి కోటలుముట్టడించి క్రమమైన యుద్ధములుచేయుటకు తగరనియు నెఱిఁగి వారిని రప్పింపఁదలఁపక, యట్లున్నవోఁ దనకునేమియు లేదని యిదిగోవచ్చెదనదిగోవచ్చెదనని రేపుమాపని కాలయాపన మొనర్చుచుండెను. రసపుత్రుల కాగ్రహమువచ్చి తన్నెపుడు తనముట్టింతురోయని భయముగలిగి వాఁడాతఁడు పదలఁబ్రయత్నించెను. కాని వారతనినిదాఁటిపోనియక వేయికన్నులతోఁ గాఁచుచుండిరి. ఒకవేళ నేమాయోపాయముచేసియైన సీబందెనుండి వదలించుకొని పోవుదమన్న సీపల జస్వంతరావు భిల్లులవిహ్వాలమునకు నోడలుదాఁచుకొనక పనిచేయసాగుటచేఁ దనకు వారికడ నేమియుండదను మాట నిశ్చయముగ తెలిసికొని యక్కడికిఁ బోవుట యవివేకముగ నెంచి యెట్లయినను రసపుత్రులతో నుండుట యుక్తమనుకొనెను. రసపుత్రప్రభు వాడినమాటతప్పని పురుషుఁడగుటచే గోమాజీరావునకుఁ దానువాగ్దానముచేసిన వేయివరాలును భేతాళసింగుచేతికిచ్చి యంపినను జిత్తులమారితనమున నక్కనుఁ జంపిపుట్టినభేతాళుఁడా విత్తముదానే యపహరించి గోమాజీరాయనకిచ్చినట్లు రాణాకు విన్నవించెను. గోమాజీరావువద్దనుండి భేతాళసింగువద్దకు రాయబారమంపఁబడిన వామనభట్టు మెల్లగాఁ గోటలోఁ బ్రవేశించి కొత్వాలుకీయవలసినసొమ్ము నిమ్మనియు సొమ్మిచ్చిన వెనుక నెంతయు సహాయముఁ జేయుననియు వానినడిగెను.

**భేతాళుఁడాతనిపలుకులువిని “యోయీ, వామనభట్టా గోమాజీ**

రావువకు నేనుసొమ్మిచ్చుటకు వాండునూకుచేసిన సాయమేమి. నేను కృదమ్మిడియైన వానియందు. నీకు నూరురూకలనిచ్చెదను. నీవుసొమ్ముం దీసికొని యీసంగతి రాణాకుం దెలియనీయకుండు" మని వానినొడంబఱచి వానికిముందే బదిరూకలనిచ్చి తక్కినదితరువాత నొసంగెదనని చెప్పి వానిని సమ్మతింపంజేసెను. తరువాత దౌలతరావు రాణానుదర్శించి బాయీజీమహారాజు పక్షమున నహల్యాబాయికి సందేశమంపుటకర్తవ్యమనియు రాజపుత్రులు బాయిగారితోం గలసియుండి విన్నదో రాణి తప్పకకోరిన పద్ధతులప్రకారము నొడంబడిక గావించుకొనుననియు నట్లు వామనభట్టు రాయబారిగ నేగందగిన వాండనియు నచ్చంబలికి రాణాతోం జెప్పవలసినయంశములనెల్ల మనస్సునకు నాటంజెప్పి వామనభట్టును రాణాయనుమతివిూదం దగుపరివారముతోడను జెండాలతోడను రాయబారమంపెను. వచ్చి యహల్యాబాయియనుమతిని నామెహజారమునం బ్రవేశించి వామనభట్టు ప్రాణములనుగ్గంబట్టుకొని భయపడుచుం గూరుచుండ జమానుఖాను మొదలగు తురకలు పదుగురు తుకాజీశివాజీ మొదలగు సేనాధిపతులు బారుదీరి పరివేష్టించి యీసందేశమును వినంగోరిరి. అంతట రాణిమొగమువంక చూచి వామనభట్టిట్లనియెను. "అమ్మా! బాయీజీ! హోల్కారుమహారాజుగారు నన్ను దమవద్దకంపినారు. ఇందూరు రాజ్యమున మీకు లేశమైన భాగమీయమనియు సర్వస్వము తమపాలకజనకులగు మలహారురావుగారిదే యగుటం దమకే రావలయుననియు మనోవృత్తికై మీకుం గొన్ని జాఘీర్లిచ్చెదమనియు రాజ్యము వదలవలసినదనియు వదలకున్న పక్షమునం దాము రాజపుత్రులతోం జేరెదమనియుం దమతో మహారాజుగారు మనవిచేయుచున్నారు. రాజపుత్రులకుంగూడ నాలవవంతు రాజ్యమొసంగవలయునంట. దీనికుత్తరముం జెప్పి నన్ను సత్వరము పంపవలయునని ప్రార్థించుచున్నాను." అనిచెప్ప నహల్య పక్కున నవ్వి "మీమహారాజుగారెందున్నవారు వారు మాకగపడుదురా".

యన నాతఁడు చిత్రము వింధ్యపర్వతములలో నున్నారు. తల్లీ" యని ప్రత్యుత్తరమిచ్చెను. ఇచ్చునప్పటికి జమారుఖాను వెనుకపాటునవచ్చి వామనభట్టుయొక్క భుజదండము గట్టిగఁబట్టుకొని రాణితో, "అమ్మా! వీఁడు కుటిలోఁజేరినవాఁడు వీనినిబట్టి చెఱఁబెట్టినచో సద్భుతములుకొన్ని మనకుఁ దెలియఁగలవు సుఁడీ" యని విన్నవించి వానిరెండుచేతులకు నరదండలు బిగించి వేసి, "నీవు ఖయిదీవయినావురా" అని నిలుపఁబెట్టెను. ఇంతలో నీకార్యముసహింపనోపక వానితోవచ్చినరాజపుత్రులు వరలలోనుండి తళతళమెఱయు కత్తులనూడఁబెఱికి మహారాష్ట్రులపైఁబడి నఱుకఁబోవఁ బ్రతివిధానము నొనర్పఁబోవు తుకాజీమొదలగువారి వారించి; జమారుఖాను వారిపై సింగపుఁగొదమచాడ్పున దుమికి యాపమువ్వురిలో సగమును తత్క్షణమే మృతినొందించెను. తక్కినతురకలు రసపుత్రులఁ బోరిఁగొనుటచేఁ దక్కినయేవురురసపుత్రులు నంతమడిసిరి. వామనభట్టును జెఱఁబెట్టినవార్త దౌలతరావునిని యుక్కఁదక్క శవమునలె కళకాంతులులేక దీర్ఘోచ్ఛ్వాసములచేఁ దన యటమటము బ్రకటితముకాఁగ నింకఁ దనమరణము నిశ్చయమని బెంగఁగొనెను.

ఇ రు వ ది య వ ప్ర క ర ణ ము



హరిహరపాండ్యాజి తన హృదయమును దెలిపి మనోరథమును దెలియఁబరచి బాజీరావు నాకార్యమునఁ బనిసేయుమని నియోగించిన తరువాత శాయాజీమహారాజు మెల్లఁగాని బాజీరావును జేరఁబిలిచి యదివఱకెన్నఁడు జూపనిదయ నాతనిపైఁజూపి మెల్లగా నాతనితో నిట్లనియెను. "ఓరీ కుఱ్ఱవాఁడా! నీవు నాకొకకార్యముఁ జేయవలయును. నీతనునాకు వివాహముసేయుటకు గండాభిల్లు మొదలగువారు నిశ్చయించినారుకాని యామెకిష్టము లేనట్లు గనఁబడుచున్నది. నామీఁద గాఢాను

రాగ ముదయించునట్లు నీవామెతోఁ బలుకవలయును. నీవామెయొద్దకుఁ బలుమాఱు పోగలుగునటుల నేనుత్తరవు జేసెదను. నావంటి మహారాజు చెట్టవట్టి సుఖింపఁ గలుగుట యామె కెన్నిజన్మములకైనను దొరకునా. ఇప్పుడీపర్వతముమీఁద నొంటరిగ నేనుండుట నామెకలక్ష్యముగనున్నది కాఁబోలును. రేపు రాజ్యము స్వాధీనమైనతరువాతఁ దాను రాణికావచ్చును. వెండిగొలుసులతూఁగుటుయ్యెలలోఁ దుంలేని రత్నభూషణములు ధరించుయోగ్యత కామె నోచుకొన్నది. కనుకనే తనవంటి దానిపై నావంటి మహారాజునకు ననురాగ ముదయించినది. నాకు శ్రీకొల్హాపుర మహారాజుగారు సింధియా మహారాజుగారు పిల్లనిచ్చెదమని వర్తమానమంపించినారు. కాని నామనస్సీమెపైఁ దగిలియున్నది. ఈమె నన్ను నిరాకరించినను బలిమిచేనైన నేనీమెపొందు నొందకమానను. కాఁబట్టి యీవివాహమునకు సమ్మతింపుమనియు ముందుగా నేనుదానితోఁ గొన్నిరహస్యములు మాటలాడవలయును గనుక సమయమొసంగఁ జేయుమనియు నామెతో నాపలుకులుగా మనవిజేసి యొడఁబఱచి రమ్ము. ఇదియేరికిం దెలియనీయవలదుసుమీ" అని మహారాజునుమన బాజీరావు కొంచెము యోచించి, "మీసేవకుఁడనగు నేను మీకుఁబ్రియమునుజేయునా! ఆమెను హరిహరపాండ్యాజీకూడ మోహించియున్నాఁడు వానిని మీరు రహస్యమునఁ గడతేర్తురేని యీయామె మిమ్ముదప్పక వరింపఁగలదుసుఁడీ' యని విన్నవించుకొన మహారాజుబ్బి యీవేళ సాయంకాలముననే హరిహరునకు స్వర్గసుఖమిప్పించెద చూడునాశక్తి యని ప్రతినఁజేసి కుబ్జవానిని లోనికిఁజననిమ్మని భిల్లులతోఁజెప్పి మదనాయత్తచిత్తుండై తహతహఁ బొందుచు శాకూజీ హరిహరుని జంపుటకు గనలుచుండెను. జస్వంతరావుచేఁ దనబలము ముక్కముక్కలుగ ఖండింపఁబడుటకువగచి గండాభిల్లు ప్రభువును దమ ముందుపోకలఁగూర్చి కఠినముగ నడుగఁదలంచి వచ్చి గుడారముసొచ్చి యిట్లనియె. "మహాప్రభూ!

ఏలినవారికిఁ బట్టాభిషేకమయినది మొదలు జస్వంతరావు మాచుట్టము లను మేఁకపోతుల నఱకినట్లు నఱకుచున్నాఁడు. దౌలతరావు త్వరలో వత్తునని చెప్పి యీవఱకు రాఁడయ్యె. మేము దోఁచుకొనివచ్చిన ద్రవ్యమంతయు వ్యయముచేసి హాయిగాఁ బిండివంటలతో మీరు ముమ్మారు భోజనముసేయుచు మానిమిత్తము శ్రద్ధచేసినారు కారు. మీరు పరాక్రమవంతులనుకొని యింతమహాపదవి మీకిచ్చితిమిగాని మొదటనే యింతటి వారగుటఁ దెలిసినచో బట్టముఁ గట్టింపకుందుము మాతో మీరు కలిసి యుద్ధమునకు వచ్చెదరా లేదా” యని నిష్ఠురోక్తులనాడి భిల్లుఁడు నిలువ శాయాజీ వానింగన్నెత్తి చూడలేక తలవంచి మెల్లగా నిట్లనియెను. “నేను మిమ్ముననడిపించి మీకు సేనానాయకుఁడనై రాజ్యముఁగొన యత్నించుచుండఁగా నన్నిట్లాడఁదగునా? వివాహమైన తరువాత కత్తిగట్టి యుద్ధముచేయవలెననియున్నది. అదియటుండ హరిహరిపాండ్యాజి మనపై రాణితో నేరములు చెప్పుచున్నాఁడఁట. ఇతఁడున్నపక్షమున మనము నెగ్గఁజాలము. నీవు రాత్రి వీనిని గడతేర్చవేని పెండ్లియైన వెనుక మన మరుగుదము” అనిచెప్ప భిల్లుఁడు గోపముతోఁ గన్నులెఱ్ఱఁజేసి ‘యుద్ధమైన తరువాత నీవు వివాహమాడవచ్చును. ముందుగావద్దు. అదిగాక యీదినమున నారెండవకొడుకును నాకు జయముకలుగుటకై కాళికి బలియిచ్చుచున్నాను. బలియైనవెంటనే మనము వెళ్ళినచో జయముగల్గును. తప్పుతప్పదు. హరిహరుఁడు మనపైఁ గుట్రలెన్నఁడుఁ బన్నకుండఁ జేసెదనులే” యని గుడారమువెడలి యావలకుంజనెను. అతఁడరిగిన వెంటనే బాజీరావు మహారాజువద్దకువచ్చి నిలిచి సంతోషముతో, ‘స్వామీ మీరు చెప్పినట్లు సీతతోఁ జెప్పినాను. మీవంటి నవమన్మథుని మహారాజును జెట్టపట్టుటా మెకిష్టముగ నుండకపోవునా? అన్నిఁటికి నామె యొప్పుకొన్నది కాని మీరాగుడారమునకు రావలదనియుఁ దానే మగవేషము వేసికొని యీగుడారమునకు రాత్రి వత్తుననియుఁ జెప్పుచున్నది కాని మీరు నన్ని

దినమునఁ జెఱవిడిపింపవలయును. లేకున్న నేనిదిచక్కఁజేయనుచుండీ" యని కర్ణానందకరముగఁ బలుక మహారాజుయొక్క శరీరము పులకలెత్త మనోరథసిద్ధి నేఁటికిగదా చేకుఱుటయని యానందమొందుచు నాతఁడు నిన్నీవేళ సాయంకాలమునకే చెఱవిడిపించి పంపెదను భయపడకు. నీమేలు నేను మఱువఁజాలను. మిత్రుఁడా యని గాఢాలింగనమొనర్చి యభ్యంజనముచేసి నూతనవస్త్రాలంకృతుఁడై సూర్యుఁడెపుడస్తమించునాయని పరితాప మొందసాగెను. ఒకమాఱు బాజీరావును బిలిచి నీమాటలు నాకు నమ్మకముగ లేవు. ఆమెచేవ్రాలు నమ్మకమని పలికింపుము. అని వేఁడుకొనుటచే గుడారము ప్రక్కకు మహారాజును గొనిపోయి, బాజీరావు, సీతా నివిందాకఁ జెప్పినట్లు చేయుదువుగా యని యావలనుండి కేకవేయ నామెయు నిశ్చయముగఁ జేసెద సందేహమేలయని మృదుమధురస్వరముతోఁ బ్రత్యుత్తరమొసంగెను. అంతట గుండెదడుపు తీఱనందున శాయాజీ బాజీరావును బంపుప్రయత్నముచేయుచు దౌలతరావునొద్దకు నాతనినంపెదనని గండాభిల్లుతోఁ జెప్పి యొడఁబఱచి పల్లకీబోయలను సిద్ధముగఁ జేసెను. ఇంతలో సాయంకాలమైనందున సీత బాజీరావుచెప్పిన చొప్పున మాటఁ దప్పకుండ వర్తింపఁదలంచి, చక్కని తెల్లయిజారును నల్లదేయుంగరకాయు నల్లదేరలపాగయును ధరించుకొని చేతనొక ఖడ్గముం బూని తన గుడారమునుండి సమయముఁ బ్రతీక్షింపఁదొడఁగెను. ఆరాత్రి సీతనిమిత్తము శాయాజీని సంహరింపఁదలఁచి హరిహరపాండ్యాజీ రెండుజాముల రాత్రియైనతరువాత గాఢనిద్రాసమయమున వానిఁ జంపఁదగునని ముందుగాఁదాను నిద్రించుచుండెను. ఇంతలో గండాభిల్లు గండ్ర గొడ్డలి భుజముపై వేసికొని యెవరితోడఁ జెప్పక హరిహరుని గుడారము సొచ్చి నిద్రాసక్తుఁడై తలనిండనున్న కోఱ్కులచే గడియకొక స్వప్నముగనుచున్న యానిర్భాగ్యునిఁ గని గొడ్డలినెత్తి సత్తువమీఱ నాతనికంఠభాగమున నొకదెబ్బఁదీసెను. వెంటనే శిరము మొండెమును వేఱుగఁ

దొలఁగింపఁబడ మొండెము కొట్టుకొనుటయు నెత్తురుధిరప్రవాహము గుడారము నిండుటయు భిల్లుని నయనములకుఁ బర్వమునేయ, నాతఁడు జుట్టుపట్టుకొని చచ్చినవాని తలయెత్తి త్వరగా శాయాజీయున్న గుడారమునకుంజని వానింగని, "చూడు నీహరిహరుఁ డెట్లున్నాఁడో" యని యా రక్తసిక్తమగుబుఱ్ఱ వానితోడ్తఁ బెట్టెను. అదిరిపడి శాయాజీలేచి గడగడవణఁకి భిల్లుఁ డలుకవహించునేమో తనపని యట్లయగునని తలంపు మదికిఁదట్ట మెల్లగా, "నవ్వునాహాసుఁడవు మంచిపని చేసినావు నీవంటివాని నెందుఁజూడలేదు. మన్నెసుల్తాను బిరుదుకంటె శ్రీసుల్తాను బిరుదు నీకుఁదగుసుమీ" యని వానిని స్తవమొనర్చి చల్లనిమాటలతో సాగనంపి తన పనిమీఁదఁ దానుండెను.

హరిహరుఁడు ధనము ను విడిచి, సీతనువిడిచి ప్రాణములు విడుచుటయు, సీత తనపొత్తున కంగీకరించుటయు, శాయాజీ, బాజీరావును ముందుగఁ జెరవిడిపించి పంపఁదలఁచి పల్లకిఁ దెప్పించి బోయలసిద్ధముఁ జేసి సీతతో మఱల మాటలాడుచున్న బాజీరావును బిలిచి పల్లకి నెక్కుమనెను. వెంటనే గుడారమునుండి యొక విగ్రహమువచ్చి యందుఁ గూర్చుండఁ బోయలొక్కమహూర్తములో వానిని మోచుకొనిపోయిరి. అట్లు బాజీరావును బంపి సీతనిమిత్త మెదురుచూచుచు శాయాజీ మదనతాపము నొందుచు మాటిమాటికి నామె వచ్చుచున్నదేమో యని గుడారము వెడలివచ్చి చూచుచు మనస్తాపము నొందుచుండ నింతలోఁ దన మనోరథసిద్ధి చేయఁదలఁచిన పారిజాతవృక్షమువలె సుందరవదనారవిందము చీఁకటిగుడారమున వెన్నెలఁగాయఁ గావలియున్న భిల్లులు నిద్రించినవెనుక నా పురుషవిగ్రహము మహారాజుయొక్క గుడారముఁ బ్రవేశించెను. ప్రవేశించినతోడనే యెదురుగ నేగి శాయాజీ యాభువనమోహన విగ్రహమును జేయిపట్టుకొని ముద్దుపెట్టుకొని తన మంచమునొద్దకుఁ దీసికొనివచ్చెను. ఆకపటపురుషుఁడుచు మెల్లగవచ్చి ప్రాణేశ్వరా!

మిమ్ము వివాహమాడుటకు నాకు సందేహములేదు. కాని మీరు యుద్ధములుచేయుట కలుగుచుండు. యుద్ధమున మరణమొందుదురేమో యని నాకు భయము గలుగుచుండె యని పలికెను. హోల్కా రామెపలుకులకు సంతసించి నేను యుద్ధమున కెన్నఁడును బోవను. భిల్లులను మోసపుచ్చుటకు కయ్యము సేయుదునని నేనందునే కాని యావంతయు బద్ధము. నిన్ను విడిచి నేనెందరుగుదును? ఇన్నిదినములనుండి నేఁ జేయుప్రయత్నములు సఫలములయినవి. ఏదీ యొకముద్దుఁబెట్టు ప్రాణేశ్వరీ యని ముద్దుపెట్టుకొని చెక్కిలి నొక్కుచుండ స్త్రీవేషధారి యాంకామాతుని చెల్లున నొక చెంపకాయఁ గొట్టెను. చుఱ్ఱున నసాల మంటిన యాదెబ్బతో శాయాజీకిఁ గన్నులనుండి బాష్పములురా నదిముచుకొని మెల్లన నిట్లనియె. "సుందరీ అబ్బా! యిదేమిసరసమే గూబపగిలినది. మాటలతో సరసముకాని చేతులతో నేమిటే" యని మందలించి యా సుందరిని కౌఁగిలింపఁబోవ నాటక్కరి తనమొలలోనున్న బాకుఁదీసి శాయాజీని నేలఁబడఁద్రోచి కుడిప్రక్క నొక్కపోటుపొడిచి యాస్త్రీణమే యేకింగనఁబడక యెటకో చనెను. శాయాజీ యాపోటుతో కెవ్వున కేకవేయుటచే నార్తరవము నాలకించి గండాభిల్లు గండ్రగొడ్డలి భుజముపై వేసికొనివచ్చి పడియున్న శాయాజీని జూచి యాశ్చర్యమొంది మెల్లగ వాని లేవనెత్తి కారణమడుగ నాతఁడు జరిగిన వృత్తాంతమును సవిస్తరముగ నీరసముతోఁ జెప్పెను. ఆమాటలు చెవులసోఁక గండాభిల్లు మహాగ్రహమునఁ గన్బొమలు ముడివడ హూంకునిరీక్షముల నాతనిఁజూచి, "దురాత్మా నాతోఁజెప్పక నీవిట్లుచేసితివి కనుక నీకింతే కావలయును. నీతిచంపుట కాదు నేను నిజముగఁ జంపివేసెదను చూడు నీవు నీచుఁడవు కాని రాజువుకావు" అని మాటలచే నొప్పించి చేతిగొడ్డలి నెత్తెను. అపరిమితబాధపడుచు శాయాజీ యెట్లో లేచి భిల్లుని రెండుపాదములం బట్టుకొని నాతండ్రీ నన్ను రక్షింపుము. నన్ను నిష్కారముగ దౌలతరావు

గంగలో దింపినాను. నాకేర్పడిన కట్టుకట్టి నాప్రాణములు దక్కింపుము. అని జాలికలుగఁ బ్రార్థనలుచేసి యేడ్చుటకు మొదలుపెట్టఁగా, గండాభిల్లు గొడ్డలిదింపి నీకు నేను గట్టుకట్టను చావుమని తిట్టి గుడారము విడిచిపోయి సీతకై వెదకి యామెను బాజీరావును గూడఁ గానక విసికి తనబస కరిగెను.



## ఇరువదియొకటవ ప్రకరణము.



మరునాఁ డుదయమున మంగళతూర్యారావములు సెలంగ నహల్యాబాయి మేల్కాంచి కార్యముల నిర్వర్తించి మహోత్సాహపూరితమానసయై కోటముట్టడి జరుపుచుండ జమానుఖాఁ నామెకు సలాము చేసి రాధాకాంతరావు వచ్చియున్నాఁడనియు రాణిదర్శనముం గోరుచున్నాఁడనియు విన్నవించెను. రాధాకాంతరావుపై సంపూర్ణముగ నలుక వహించిన దగుటచే రాణి జమానుఖానుతోఁ, "నోయీ రాధాకాంతుని మొగము నేనింక చూడఁజాలను. అతని విశ్వాసమును గూర్చి మాకుఁగల పిచ్చినమ్మకము పోయినది. శ్యామసుందరదత్తును వదలిపెట్టుమని గోమాజీరావునకు జాబువ్రాయుటయు రఘునాధరావుతోఁ దానుఁజేరి నాపై కత్తిఁ బూనుటయు నాహృదయమున నాటినవి. అందుచే నాతఁడు నావద్దకు రావలసిన పనిలేదు. రఘునాధరావువద్ద కేఁగుమన రాదా?" యని యుత్తరముం జెప్పెను. చెప్పి ఖానుని వాని పనిమీఁది కంపెను. ఖాను వృద్ధుండగు రాధాకాంతరాయునిపైఁ దన యేలికకువచ్చిన నిర్హేతుకాగ్రహమునకు విచారించి తనశక్తిలో నాకార్యము లేకుండుటచే నప్పటి కూరకుండెను. రాధాకాంతరా వీయలుకకుఁ గతమేమయి యుండునాయని కొంత తడవు విచారించి జమానుఖానుని బిలిచి తానరిగిన దండయాత్రలో జరిగిన విశేషాంశములనెల్ల నాతనికి రహస్యముగఁ

జెప్పి రాణీదయను సంపాదింపఁ బ్రియత్నలోపము లేకుండ నింబపురమునందె నివసించెను. అప్పటికి నింబపురి ముట్టడిలో రసపుత్రులకంటె మహారాష్ట్రులే జయము నొందువారివలె గన్పడుచుండిరి. రాణికిందుచే రాజపుత్రులను జయింపవచ్చునను ధైర్యముదయించెను. అమెకు ధైర్యమును శత్రులకధైర్యము నొకమాత్రే జనియించినందునఁ గడపటివారు జయమున కుపాయములు వెదకుటమాని సురక్షితముగ పారిపోవుట కుపాయము వెదుకనారంభించిరి. రాజపుత్రసేనకు దినుబడిసామగ్రియెందున వారాకలికి నోర్వఁజాలక చిక్కులఁ బడుచుండిరి. కోటలోనికి నీటిచుక్కైనను బోనీయక యహల్యాబాయి నీటియాధారముల నెల్లఁ గప్పించెను. ఫిరంగుల మూలమునఁ గోట భేదింపఁబడి రంధ్రములతో నిండియుండఁ జొచ్చెను. అందుచేఁ దమకు జయమునొందు నాశలేశమయినను లేదనియు నహల్య తమతో సంధిఁ జేసికొనదనియు నుదయపుర రాణావారు నిశ్చయించి పారిపోవుటకు ముహూర్తము నిర్ణయించుకొనుటకు మొదలుపెట్టిరి. శత్రుప్రుల బలమును గుట్టును దనకుఁ జిక్కినందున నహల్య వారిలక్ష్యములేక వారు లోఁబడినట్లే యెంచుకొని జస్వంతరావు గండాభిల్లును దక్క తక్కినభిల్లులనెల్ల దాదాఁపుగ నిర్మూలించినట్లు విని యొక్క శాయాజీ షాహూల్కారువిషయమై చక్కఁజేసికొనవలయునని నిశ్చయించి జమాయుఖానునిబిలిచి శాయాజీయొద్దకు రాయబారము గైకొనిపొమ్మని యానతిచ్చి యొకమూల పీనుఁగువలె నుండఁగియున్న వామనభట్టుకోటనుండి మహారాజు వసించుకొండ నానవాలు చెప్పించి తగుపరివారము తోఁబంపెను. నింబపురమున కాకొండ యొక వారము పయనములో నుండినందున జమాయుఖాను రేయింబవళ్లు నడచి శ్రమయనక యెండయనక కొండలెక్కి వాఁగులుదాటి యరణ్యములం గడచి మూఁడుదినములకు శాయాజీయున్న స్థానమునకువచ్చెను. నాఁటిరాత్రి శాయాజీ సరిసమాడఁబోయి కత్తిపోటుదిని గండాభిల్లు

వద్దనుండి సహాయము నందక కొంతసేపు బాధపడి తనప్రక్క గుడ్డలలో నొ కదానిని గాల్చి మసిచేసి తనగాయమునకుఁ గట్టుకట్టుకొని మఱియొక భిల్లు సాయమున మఱికొంత యుపచారముచేయించుకొని గాయము గుదుర్చు కొని సత్తువ దెచ్చుకొని సమయము దొరకునేని తనకు రాజ్యము గిజ్య ము నలదని భిల్లుల బారినుండి పరతెంచి యేకాశిలోనైన ముష్టియెత్తు కొని బ్రతుకవచ్చునని యత్నము గావించుచుండెను. పట్టాభిషేక మ హోత్సవకాలమునఁ దన్ను సేవించిన భిల్లులొక్కరొక్కరుగ దేశముల పైఁబడి జస్వంతరాయుని ఖడ్గధారాగ్నికి మిడుతలగుటచేతను గొందరా తనిధాటికి వెఱచి దూరదేశములకు బాఱుటచేతను మఱికొందఱు వన మృగములవలె గొండగుహలలో దాఁగుటచేతను జమానుఖాను వచ్చి నప్పటికి రెండువందలకంటె నెక్కుడుభిల్లులాపర్వతమున లేరైరి. ఆరా త్రి గాయమేరగులకయున్న బలవంతముగ గండాభిల్లు శాయాజీని త నతోఁ గూడ యుద్ధమునకుఁ గొనిపోయి యుండెను. రాజభటముఖదర్శ నము సేయు వారికిఁగూడ నమితమైనభయమేకాని సాహసధైర్యములు గలుగకుండెను. జమానుఖాను రాణి వద్దనుండి సందేశార్థములు దెలు పవచ్చినాఁడని విని యామె యొడంబడిక చేసికొనుననియుఁ దనకురాజ్య ము పూర్ణముగ రాకపోయినను గొన్ని జాగీరులైన రాకపోవనియు శా యాజీ యువ్విళ్ళూరుచుండ నతనికి రాజ్యముగల్గిన తమకు నిలువ నీడచే కురునని భిల్లులానందమొంది ఖానుగారిని సగౌరవముగ నాదరించి సందే శము జరుపుటకు వారునిశ్చయించిరి. శాయాజీయుఁ దనపట్టాభిషేకకా లమునధరించు దుస్తులను నాభరణములను దొడుగుకొని శూరశిఖామణివ లె మహారాజ ఠీవితోఁ దన గుడారమునఁ గూరుచుండ నింతలోఁ దన పరి వారముతో జమానుఖాను ప్రవేశించి మహారాజునుజూచి త్రసలోనగవు కొని తలయూఁచి సమర్యాదగా నమస్కారముచేసి యర్హాసనమున పైనా సీనుఁడయ్యెను. గండాభిల్లు గండ్రగొడ్డలినిబూని తనమహారాజుయొక్క

వామభాగమున నిల్చెను. అప్పుడు ఖాను హోల్కారుతో, "స్వామీ! మీతో నేను గొన్ని రహస్యములు మాటలాడవలయును. మీ భిల్లుల నావల కంపివేయుదవలయును. మీ కొక సందేహములేకుండ నాతు రక మహారాష్ట్రసేవకులఁగూడ నావల కంపెదను. మీరట్లుచేయుదురా" యని మనవి యొనర్చెను. అంతట భిల్లులు, మహారాష్ట్రయోధులు గుడారముబాసి దూరముగాఁజన, శాయాజీయు జమాన్‌ఖాను నిల్లు మాటాడిరి.

జమా—దేవా! మీరు రాణీగారివిషయమున నేదో సహాయమును జేయువలయును. ఆమెకు ముద్దులుమూటగట్టు నొక కొమార్తె కలదుగదా.

శాయా—రాణికి నేను రెండుమూఁడు జాగీరులుమాత్ర మిచ్చెదను. నాకు రాజ్యమునంతయు నొప్పగించి యిందూరునగరమువిడిచి యామె యరుగవలసినది. ఇటు లొప్పుకొనకున్న నే నొడంబడికఁ జేసికొనను.

జమా—పాపము దిక్కులేని యాఁడుదానిని మీరింత శ్రమపెట్టుట న్యాయముగాదు మఱి యేపరతులనయినఁ గూడ నేర్పాటుపుడు.

శాయా—ముక్తాబాయిని నాకిచ్చి వివాహము జేసినయెడల నే నామెను రాజ్యము నందుంచి యన్నవస్త్రములిచ్చి కాపాడెదను.

జమా—పోనీ రాజ్యమంతయు మీ కామె వదలివేసినచో మీ రామె కేమియిచ్చెదరు. మీతోడను మీభిల్లురతోడను నామె యుద్ధము చేయఁజాలదు.

శాయా—నెలకు నొక వేయిరూపాయీల మనోవృత్తి నిచ్చెదను. అంతకంటె నెక్కువగా నేనేమియు సహాయ మామె విషయమునఁ జేయఁజాలను.

జమా—ఆమె మిమ్ము పెంచుకొన్నచో మీరు దత్తులగుట కంగీకరింతురా?

శాయా—ఏమో ఆలోచించి చెప్పవలెను. ఆమె నాకు దల్లి యగుట నాకు శ్రేయముకాదు.

జమానుఖా నెందుచేతనో కడుదీనముగా మాటలాడుటఁ జూచి శాయాజీహోల్కారు తనకు వారు జంకినారనుకొని గర్వించి యంతకంతకు నిర్లక్ష్యముగఁ బల్కనారంభించి యావల తన బాహుబలమును దాను నుతియించుకొని జమానుఖానుతో, ‘ నోయీ నీవాడిన మాటలు మాకు మహానందమును గలిగించుచున్నవి. నీవు మాయెడ నింతభయభక్తులతోఁ బలుకఁబట్టి నిన్నిట్లు విడిచితిమికాని కొంచెము గౌరవ హీనముగాఁ బల్కితివేని నిన్నిక్కడ మట్టుపెట్టుదుము నీ వదృష్టవంతుఁడవు చెడ్డటక్కరివి. ఎవరివద్ద నెట్లు మాటాడవలయునో పరిపూర్ణముగ నెఱుఁగుదువు సుమీ’ యన ఖానునకు నిలుపలేనంత యాగ్రహము పొడముటచే నాతఁడు దిగ్గునలేచి, “ నేను మీపరాక్రమ మెఱుఁగుదును. మీరు చెప్పవలెనా ” యని యాతని రెండు భుజములుఁపట్టి గట్టిగనొక్క- చేతిలోనున్న ఖడ్గము నూడఁబెఱకుకొనెను. తెల్లపోయి శాయాజీ నోరెత్తకయుండ ఖాను నిన్ను రాణి తీసికొనిరమ్మనినది రా” యని నేలకుఁద్రోచి రెండుచేతులు వెనుకకుఁగట్టి గుండెలపైఁ గత్తి మోపి, “ దురాత్మా నీవు హోల్కారువా! నిన్నిపుడు నేను దునుమట్టించెద. నీకు దిక్కెవ్వఁడురా?” యని యొక్కయేటున వానినేయఁబోయి యంతట నిలిచి రాణి కాతని జీవముతోడనుండఁగనర్పించుట యుచితంబని పల్లకీఁ దెమ్మని తనభటుల కానతిచ్చెను. ఇంతలో నీసంరంభమును జూచి నూతిలోఁబడిన వానిలాగు శాయాజీ వేసిన కేకలు విని గండాభిల్లు తన మూఁకలం దోడుకొని తుపాకను నఱుకుటకువచ్చెను. భిల్లుల యట్టహాసమును సైరింప నోపక ఖానుయొక్క యంగరక్షక సేనలోనున్న ముప్పదుగురు మహారాష్ట్రులు నిరువదిమంది వచ్చి తుపాకులు నదిపఱకే తుపాకులలో మందు దట్టించి యందున నొక్క పెట్టున

వచ్చి గుడారపుగుమ్మముకడనిలిచి భిల్లులను లోనికరుగ నియ్యరైరి. భిల్లసైన్యప్రవాహము మహారాష్ట్రబలమను గట్టుచే నాపఁబడినందున శాయాజీ నిర్విణ్ణుఁడై హోరున నేడువఁ బ్రారంభించి తన్ను వదలుమని ఖాను ననేకభంగుల వేఁడుకొనెను. కాని ఖానుహృదయము రాజద్రోహులవిషయమున మాణిక్యమువంటిదగుటచే వాని దీనాలాపములు వాని హృదయము గరఁగింప నేరవయ్యెను. అప్పుడు కుపితులగు రెండు వందల భిల్లులకును నేఁబదుగురు మహారాష్ట్రసైనికులకును ఘోరయుద్ధము జరిగెను. మనుష్యులు మనుష్యులను గొట్టుటయేగాక ఢమ్మఢమ్మున పేలు మహారాష్ట్రుల తుపాకులగుండ్లును రివ్వురివ్వున వచ్చి భిల్లుల యెమ్ములను నొంపనొంటికొత్తో వియ్యమొందసాగెను. తుపాకినుండి వెడలిన ప్రతిపొగుండు నొక్క సింధుప్రాణము గొనుటచే జన్వంతరావుచే హతముగాక శేషించిన భిల్ల ప్రపంచమున కది ప్రళయకాలమయ్యెను. ఆదినము నూటపుదు భిల్లులు యుద్ధరంగమునకు బలియైరి. ఒక తుపాకిగుండు గండాభిల్లునియొక్క చెవికిందిగిలి దూసికొని పోవుటచే నాతఁడు రణరంగమును విడచి వెంటనే ప్రాణరక్షణార్థముక కొండగుహలోనికిఁ జనెను. యజమానుఁడురుగి గొట్టుదాఁటుపలె భిల్లులందఱు నొకరివెంట నొకరరిగి యరనిముషములో రణభూమి నిర్మానుష్యముగాఁజేసి శాయాజీయొక్క హృదయమునుగూడ ధైర్యశూన్యమగునట్లు చేసిరి. మహారాష్ట్రసైనికులు హతులయిన భిల్లులపైఁబడి వారికడనుండిన గొలుసొమ్ములను నేనుఁగు దంతములును మొదలగువానిని దోఁచుకొని యుద్ధాంతమందు జరుగవలసిన పూర్వాచారమగు దోఁపుడున్నదనిపించిరి. తరువాత నొక ప్రాఁతపల్లకిలో శాయాజీని గూర్చుండఁబెట్టి జమానుఖానాస్థలమును విడిచి ప్రయాణము సాగించెను. ఈ ప్రయాణములో శాయాజీ తనయుత్కృష్టదశనుండి తప్పించుకొనుటకు చేతన యినంత యత్నము సలిపి కృతకృత్యుఁడుగాక ప్రాణములువారి

కప్పగించి యీశ్వరునిపయి భారమును వేసెను. జమానుఖాను మూఁడు దినములకు నింబపురమునకుంజని తన ప్రతిష్ఠాదికమును దెలియఁజేయ నామె వానిని బహువిధముల మెచ్చుకొని యొకరత్నపుటుంగరమును బహుమానముగ నొసఁగి, తనయెదుటకు శాయాజీని రప్పించెను. నిర్జీవప్రతిమలాగున బద్ధుఁడై యున్నవానిని జూచి రాణి, "యీస్థితి నిట్టియవస్థలో నుంచుట నాకిష్టములేదు. నాతోఁ సరిసమానుఁడు. నాకు మనోవృత్తి నియ్యఁజాలినవాఁడు. ఈతనిని గౌరవింపక యవమానింప నామనస్సు తాళ" దని పల్కి బంధవిమోచనము జేయించి యొకపీఠముపైఁ గూర్చుండఁబెట్టెను. ఆపలుకుల కులికి శాయాజీ జమానుఖాను చేసిన యన్యాయమునుగూర్చి రాణితో ముచ్చటింపఁదలంచి రాణి తనపక్షమున నున్నదని నమ్మి యిట్లనియె. "మనమిరువురము సమానులమయి యేక కుటుంబములోఁ జేరినవారమయితిమి. అట్టి నన్ను నాగౌరవము నెంచకుండ నీతురక చేతులు విరిచికట్టి యిట్లిప్పుడు తెచ్చుట మీరంగీకరించితిరా? ఈవాఁడు నన్ను మీసన్నిధికిఁ దెచ్చుటలో నీతని గొప్పలేదు. నేను రావలెననుకొనుచుండఁగఁ దాను మీచే సన్మానింపఁబడుటకువన్నట్లు పరాభవించినాఁడు తల్లీ" అని మనవిసేయునప్పు రాణి తలయూఁచి సరే యీవిషయమయి నేను విచారణసల్పెదఁగాక నీవాగుడారమున నుండుము. అని యానతిచ్చి పిచ్చుకత్తులతో నుండు పచ్చితురకలఁ గావలియుంచి సురక్షితముగ నాతని నాగుడారమున నుంచెను.

ఇరువదిరెండవ ప్రకరణము.



శాయాజీహోల్కారను నామధేయము నొసంగి యీకుఱ్ఱవానిని బయికిఁదెచ్చుటలో దౌలతరావుయొక్క ముఖ్యోద్దేశ మొక్కటియు జరిగిన దొక్కటియు నయ్యెను. క్రొత్త హోల్కారునకుఁ బట్టాభిషేక ము

గుట బ్రిజలు వినినతోడనే యహల్యాబాయిని విడిచి తమవద్దకు వత్తు గనియు రాణికిం గష్టము గట్టుననియు రాణి జంకి రాజ్యము విడిచి పోవుననియు నతఁడు గొంతెమ్మకోర్కెతో నీకార్యము గావించెను. తరువాత ప్రజలు తన మొగముఁ జూడకపోవుటయుఁ గొందఱు దురాచారులుమాత్రము తమ్ముఁజేరుటయుంజూచి దాలతరావు బెంగఁగొని రిపుత్రులతోఁజేరి వారి కేవిధమైన న్యాయముఁ జేయఁజాలక పట్టినపట్టు విడవలదని ప్రోత్సాహము జేయఁదొడఁగి మరల రాణీయొక్క మొగముఁ జూడక గిల్లులఁ దల పెట్టక యేమిచేసెను రాజపుత్రులే దిక్కని నాతని నమ్మియుండెను. తమరాశిపయిఁ దిరుగుబాటుచేసిన కొందఱనామధేయుల మాటలునమ్మి రాణీత్రాణ దెలియక యట్లు దేశముపై దండువిడియుటకును లంచమిచ్చిన గోమాజీరావు సహాయ మొసంగినందులకును దాలతరావు మాటలు చెప్పుటయేగాని చర్యలు జరుపలేనందులకును నుదయపుర రాణావారు మిగుల నొచ్చుకొనుచుఁ బశ్చాత్తాపమునొంది యీతఁడు దానిని గెలువలేకవచ్చినాఁడని రాజపుత్రకుటుంబములు తన్ను దప్పునని విచారింపసాగెను. అట్లు పశ్చాత్తప్తులగు మహారాణావారి పాదసన్నిధికివచ్చి నిల్చి భేతాలసింగు నమస్కరించి యిట్లనియెను—“ దేవా! యీదాలతరావు మనకుండియేమి? లేక యేమి? ఈతని నేలసాగనంపరాదు. అదియటుండ నేను దమకార్యమునకుఁ బ్రాణములనైన విడిచెద. నేను గోమాజీరావు మాటలునమ్మి మిమ్ము బ్రోత్సాహపట్టి యిటకుం దీసికొని వచ్చితి. అందుచేత నేనిరాత్రి యొక యద్భుతముఁజేసి తమకు జయము చేకుఱఁజేసెద. నాకనుజ్ఞమాత్ర మొసంగుడు.” అని రాణాచెవిలో నొకరహస్యముఁజెప్పి యాతనిసమ్మతిఁ బడసి తనప్రయత్నమునఁ దానుండెను. అంతట నైరానలము చల్లారినదని యెఱింగింపనోయన నెంత చండతనూని, యగుపడదయ్యెను. దేశమంతయు వేఁచిమాఁడ్చిన శత్రుమండల మిదెగుర్తింకుచున్నదనియు దుఃఖ

జలధి మునుఁగుచున్న దనియుఁ జాటనా, భానుమండల మపరజలధి గ్రుం కె. శత్రువుల చండతేజం బడఁగిన వెనుక సన్మార్గవర్తులగు ధవళేయులు ల నేకులుందురని వెల్లడిసేయు తెఱఁగున నంబరమున నక్షత్రకోటు లుద యించె. అది కృష్ణపక్షమగుటచే వెన్నెలమాత్రము లేదయ్యె. ఆరా త్రి జామయిన తరువాతి ముక్తను నిద్రఁదెలిచ్చి యహల్యాబాయి దగ్గఱ నున్న యమ్మ స్త్రీనిఁజూచి యమ్మా! నీకంతవిచారమెందుకు? ఈయుద్ధము ముగిసినదికనుక శివనానా నన్బిలిచి నీకు నూరుని వదలించుటకు నేమియు భ్యంతరమున్నదో యడిగెదను. నీవిట్లు విచారింపకు. అహా! కడుపుతీపు ను మించిన దేదియు లేదుగదా. ఇన్నిదినములుగడపితివి. ఈరాత్రి కూడఁ గడుపుము. నాకు నిద్రవచ్చుచున్నది నీవు మేలుకొనెదవా యని యడుగ, “నమ్మా నాకు నిద్రవచ్చునా? ఇన్నిదినములనుండి యన్నమెట్టిదో యెఱుఁగను తల్లి నాకు పుత్రశోకఁ బెట్టవేని యింక మృ తినొందుదునుమీ యమ్మా” యని రాణిపాదములపైఁబడి కొంతసే పువిలపించి లేచి తన ప్రక్కపైఁ గన్నులు మూచి పండుకొనెను. అహ ల్యాబాయియును స్వక్తమునఁ కంటకమై హాయిగ గుండెపైఁ జేయివై చుకొని నిద్రించెను. దాంతరావారాత్రి నిద్రలేక తన యవస్థఁ దలంచుకొని యింక తన కీర్తిమాపయు లేదని యేమియుఁదోఁచక యిటునటుఁ దిరుగుచుఁ గొంతసేపొక చోటఁగూరుచుండి యిట్లని విల పించెను. “హా నేనేల రాజద్రోహము చేసితిని. చేసినవాఁడ నిందునెవే ఱ నైతి. ఈనసపుత్రులు నన్ను నమ్ముట లేదు. ఏసహాయమును వారికి స లుపలేని నావంటి యప్రయోజకునియందు నమ్మకము వారేల నిల్పుదు రు? ఆకమలపై నాకావెట్టిమోహమేల యుదయింపవలయును. నా భా ర్య! హా దుర్గదుర్గా! నేను నీగొంతుకోసి నా గొంతు కోసికొంటిని. ఇఁక నీసుందరవదన దర్శనము నీమధురాలాపములు నాలకించుట నా కులేదు. భిల్లులతోఁ జేరి యచ్చటనుండక యేటికిచ్చటికి వచ్చితిని. వీరు

నన్ను గదలనీయరు. నాభార్యచేసిన హితోపదేశమును మండోదరీ వాక్యమును నిరాకరించిన రావణునివలె నిరాకరించి యిట్టిముప్పు దెచ్చిపెట్టుకొంటిని. నేను జచ్చుచు నిరపరాధియగు శాయాజీ యనుపేరుగల యాకుఱ్ఱవానినిబ్రాణములఁదీసి వానిని గోతిలోఁ బడఁద్రొక్కి బిచ్చమెత్తుకొనుటయైనఁ బ్రతుకకుండఁ జేసినాడను. ఇప్పుడొకవేళ రాణి పాదములపైఁబడి క్షమార్పణఁ జెప్పుకొన్నదో లాభముండునేమో? ఏమిా నావెఱ్ఱి? నావంటిద్రోహిని రాణి బ్రతుకనిచ్చునా? హా దుండిరావా! నాజీవనమున కుసూగుమనుచు నీవెందున్నావు? హా దైవమా! నేను పాపినగుటచే నాకీమరణమునఁ గనుభయముదయించి యీమొండిబ్రతుకు బ్రతుకవలెనని యున్నదిగదా" ఇట్లు పశ్చాత్తాప మొందుచుండిన దౌలతరావునొద్దకు హఠాత్తుగావచ్చి, "సీతోఁగొంచెము పనియున్నది. రాణావారు నీతోఁ గొన్నిరహస్యములఁ జెప్పుమన్నారు. ఒకమాఱు కోట బురుజుమిాఁదికిరా? అని భేతాళసింగు వానిం బిలిచెను. కోటబురుజుమిాఁది కొంటరిగ నేగుట క్షేమములేనిపాఁడయ్యు, నెట్లైనఁ దప్పుదుకదాయని సింగువెంట నియమితస్థానమునకు విధిలేక నడచిపోయి దౌలతరావు, ఎక్కలేకయెక్కలేక బురుజుపైనెక్కి కోటక్రింది కొకమాఱు తన దృష్టిఁ బరపెను. వెంటనే మహానరకమువలె నగాధమైయున్న కందకమును దిమ్మని దెసల నావరించిన యంధకారమును మహారాష్ట్రునకు భీతిఁగలిగించినందున నాతఁడు గజగజ వణఁకఁజొచ్చెను. ఇంతలో భైరవసింగు వచ్చి వారిం గలిసికొని దౌలతరావును దాదాపుగఁ బ్రాణములు లేనివానిగ నొనర్చెను. వాని భయమును జూచి నవ్వి భేతాళసింగు, "నీకింత భయమేల? నేను నిన్ను సలహాయడుగుటకుఁ దీసికొనివచ్చితిఁగాని నీకు హాని చేయుటకుఁగాదు. అహల్యాబాయి సైన్యమునఁ గలకలము పుట్టినది. వారు పరుగెత్తుచున్నట్టున్నారు చూడుము. నావేఁలిచాయపై నిదానించిచూడు" అని రెండవవ్రేలితో

రాణిసైన్య ముప్పచాయ నాతనికిఁ జూపెను. దౌలతరావు వెట్టివెట్టి చూపులఁ జూచుచు వానితో, "వారు నాకగపడుచున్నారు. పారి పోవుచున్నది. నిజమే" యని యుత్తరమిచ్చునంతలో భేతాళసింగు భైర వసింగును మెల్లన గోకెను. తోడనే భైరవసూపుఁడగు భైరవసింగు ఖ డ్గమును దీసి యొక్కయేటున సకలకలహకారిణుఁడగు దౌలతరావు శిర ముఁ దెగవేసెను. మాఱుమాటలేక మహారాష్ట్రుఁడు బురుజుపైఁబడ భేతాళసింగు నిర్దయుఁడై గుభాలున నాతని నధోలోకమునకుఁ ద్రోచి నట్లు కందకములోనికిఁ ద్రోచివైచి వెంటనే యాతని స్థూలకాయము దడదడ దొర్లుచుండ భేతాళసింగు మహానందమొందుచు వానిమొండె మును గనులపండువుగఁ జూచుచు భైరవసింగుతో, "మిత్రుఁడా లంచ ముపుచ్చుకొని మనమే యపహరించితిమని యీదురాత్ముఁడు రాణితోఁ జెప్పునని నాకనుమానము గల్గినది. అందుచేత నింతపని జేసినాఁడను. ఇఁక మనము సేయఁదలంచిన రెండవకార్యమును కరుగుదముగమ్ము" అని బురుజులుదిగి ప్రాద్వారముదాఁటి కోటవెలువడిరి. అప్పుడు సరిగా రెండు జాములయ్యె. ఉభయసైన్యములయందుఁ గావలి గాచు భటు లు దక్క తక్కినవాండ్రందఱు నిద్రాసక్తులైరి. శత్రువులు పరాజితు లై రేపోమాపో నింబపురమును విడిచిపోవుట కుద్యుక్తులై యున్నవా రనివిని యహల్యాబాయిసేన యంతయు నిద్రించుటయేగాక కావలిగా చు యోధులుగూడ నిద్రకులోఁబడి నడుమనడుమ యులికిపడి చేతుల తోఁ దుపాకులంబట్టుకొనుచు నెడ లెఱుఁగకుండిరి. రాణి గుడారము నను న్న యముననుయను నాసుందరి కుమారవియోగముచేతనో మఱి యొందుచేతనో కునుకు లేక పలుమాఱు తనగదిలోనుండి రాణిగదిలోని కరిగి యహల్యను ముక్తాబాయిని బరీక్షించి చూచుచు గుడ్డతలుపు లం దెఱచి యావల కరిగి యనుగులచప్పుడగుచున్నదేమో యని యాలకింపుచు మనశ్శాంతము లేక తిరుగసాగెను. ఒకచోఁటామె వీథి

లోఁగికిరా జమానుభా నామె యారాత్రిమనుగని యేదియో నేఁడు జరు
గనున్నదని నిశ్చయించి నిద్రవిడిచిపెట్టి భద్రముగనుండి యామెల
కుణముల మెలఁకువతోఁ బాడఁగనుచుండెను. ఆమె నాలుగుసార్లు గు
డారము యొక్క వెనుక గుమ్మముదాఁటి యావలనిల్చి యేఁటిగానక
గుడారమున కరిగి కొంతసే పచ్చటవిశ్రమించి యైదవసారి గుమ్మముఁ
జేరునప్పటి కామె పాదములకేదియో తగుల్కొనెను. సర్పము కాలిని
జుట్టుకొన్నదేమోయని భయపడి తొందరతోఁ గాలువిదలింప మెత్తని
యామె పాదములకు దృఢమైన మనుష్యదేహము తగిలెను. అదియేమ
ని యామె వంగిచూడ నొకమనుష్యుఁడు మెల్లగా, "నేను, భయపడి కే
కవేయకు యమునా! గోపాలికరా! యని పలుక నామె తొట్రుపాటు
తో వచ్చినావా వచ్చినావా గోపాలికరా యని తాను మునుముందు గు
డారముఁ బ్రవేశించెను. వెంటనే యామనుష్యుఁడును తనతోవచ్చిన
తనమిత్రుని గూడ లెమ్మని యిరువురును యమునయున్న స్థలముఁ జే
రిరి. "యమునా! భాగముదాన నన్న నీవే భాగముదానవు. నిన్ను నే
నుంచుకొన్నందుకు నాసొమ్ము నీవింతకాలము తిన్నందుకు నాకీరాణిగు
డారముఁ బ్రవేశింప వీలుచేసితివి. నడచివచ్చినదో మనుష్యవిగ్రహము
నానవాలు పట్టుదునని నేనును వీఁడును నేలఁబండుకొని దొర్లిదొర్లి వచ్చి
నాము. ఇఁక మేము కృతకృత్యులమైనఁ జాలుదు. వినను దైవమేమి చే
యునోయని యమునయొక్క నిద్దంపు చెక్కుటద్దముల ముద్దుపెట్టుకొని
గోపాలికరా దమ్ముఁదీసికొని పొమ్మని యామెనుడుగ నామె మార్గప్రదర్శకు
రాలుగు వారి నహల్యయున్న గుడారమునకుఁ దీసికొనిపోయెను. వీరిరువు
రు యమునాసమేతముగ లోని కరుగునప్పుడే మఱియొక పురుషుఁడు జో
డుతుపాకులను మందుగూర్చి సిద్ధముగనుంచుకొని యహల్య నిద్రించు
గుడారమునకు వెనుక ప్రక్కనున్న గుమ్మముచాటునఁ బొంచియుండెను.
కొత్త పురుషులలోఁ బ్రథముఁడు గుడారమునందలియుఁ బరికించి యొక

మెత్తని పాన్పుపై శరీరమును వైచి జస్వంతరాయనింగలించుకొని ప
లవరించు ముక్తాబాయి ముఖారవిందముం గాంచి నేను దీని గోలికిం బో
వను. ఇది పసికూన యని యామెను గడచి రాజకార్యాంశములం బలవ
రించుచు నొకమూల బ్రహ్మచర్యవ్రతము జరుపుటం దెలియంజేయ
నొకచాపపై మృదుబాహువు దలగడ జేసికొని పవ్వళించిన రాణిం జూచి,
"యీమెయే మనరాణావారి హృదయశల్యమగు నహల్య. ఈమెను
గడతేర్చెద" నని వెండిదీపస్తంభముపై వెలుంగు దీపిక నుఫ్ఫున నూది,
వేసి యహల్యను దగ్గఱగవచ్చి గుమ్మముముందఱ కావలియుండువా
ని రెండవవాని కావత్తిచ్చి మొదట ఖడ్గ సాధనమున నామెను దునుము
టకుందలంచి కత్తియెత్తెను. కాని యొక్కపోటున కామె చావవచ్చుం
జావకపోవచ్చు చావకుండిననో నల్లరియగును మీ యని యమున సమ
యానుకూలముగం జెప్పిన యాలోచనముం బట్టి యాతండు తుపాకి నుప
యోగింపందలంచెను. ఆపురుషుడు తుపాకి బారుచేసికొని రాణిగారియొక్క
నడిపైపున మోకాళ్లు నేలవాల్చి కూరుచుండ నాతనికి సరిగ నెదురుగ
యమున, సమయమునకు రాణికెదలకుండం బట్టుకొనందలంచి రెండవప్ర
క్కను గూరుచుండెను. అంతట నాతండు తుపాకి రాణిగుండెపై గురిపె
ట్టి యింతకంటె నెదురు కణతనుగొట్టిననో మాటల మాటాడక పరలోక
యాత్ర కామె వేంచేయునని యాగురిమార్చి కణతకుంబెట్టి జాగ్రత్త
యని యమునతోం జెప్పెను. ఆవల రెండుతుపాకులం గైకొన్న పురు
షుండు కూడ రాణిపైపై గురినిల్పి ఱెప్పవాల్పక చూడసాగెను. యము
నయు మెల్లగి నహల్యాబాయిపైం జేతులువైచెను. వైచినతక్షణమే
గభిల్లుమని తుపాకి నాదము వినంబడెను. ఆధ్వనితో దద్దరిల్లి మహారా
ష్ట్రసైన్యమంతయు నిద్రనుండి ప్రబోధింపంబడి శివనానా తుకారాంహో
ల్కారుమొదలగు సేనాపతులు సకలయోధులు కలవరపడి లేచి హాహా
కారములతో రాణిమృతినొందినది రాణిమృతినొందినదియని యఱచుచు

నా మొగుడారమును జేరిరి. సైనికులందఱు నాక్రందనధ్వనులతో నానా ముఖములనుండి రాణిగుడారముపై పరుగసాగిరి. శివనానా కన్నీళ్ళతోఁ గావలివాండ్రఁ దిట్టుచుఁ గొట్టుచు మీయజాగ్రత్తచే నేఁడు రాణిచచ్చినదిరా దున్నపోతులారా వెధవలారా పశువులారా మిమ్ము నందఱిఁజంపెదను చూడుఁడీ. అయ్యో యని దుఃఖించుచులోనికరిగి దీపముఁ దెప్పించి యతిదీనముగఁ బడియున్న యొక యాఁడుశవమునుగాంచి 'మాతల్లీ!' యని యామెపైఁబడి యేడువనారంభించెను.



## ఇరువదిమూఁడవ ప్రకరణము.

అహల్య మృతినొందినవార్త శ్రవణానందకరముగ విని శాయాజీహోల్కారు తనకింక సింహాసనము దప్పక యీయఁబడునని యాస జనింపఁ దన దురవస్థను మఱచి, “యామెను నేను దహనముసేయువలెను. సన్నిహితజ్ఞాతి నుండఁగ మఱియొకఁడు వల్లకాదు. నన్ను వదలుఁడి” యని భటులను వేగిరపెట్టెను. కాని వారుజాగరూకులయి వానినిగాని వాని భట్టులనుగాని విడువరైరి. శాంతమునకును నిదానమగు నాలోచనమునకును బ్రసిద్ధికెక్కిన తుకాజీహోల్కారు గుడారముఁ బ్రవేశించి యేడ్చుచున్న శివనానాను గమనించి వారించి యాస్థలముఁ బరికించి తనగంభీరస్వరముతో నిట్లనియె. “రాణిగారు సురక్షితలై యున్నారు గడబిడవద్దు భయములేదు. ఈయమున చచ్చిపడియున్నది. ఆమెప్రక్కను రాజపుత్రుఁ డొక్కఁడుకూడఁ బడి చచ్చినాఁడు ప్రియశః వీఁడు భేతాళసింగయియుండు నూరకొనుండి” యని పలుకఁ బ్రజలు నిశ్శబ్దముగ నుండిరి. శివనానా యామాటల నాలకించి యాశ్చర్యముతో నా రెండుశవములను నిదానించి చూచి కలవలపాటుచే లేచి జడిసిన బాలహరిణమువలె నోటమాట లేకయున్న కూఁతు

నీఁపుపైఁ జేయినైచుకొని కూరుచున్న యహల్యనుగాంచి, అమ్మా మీరు బాగున్నారా యని పాదములపైఁబడి రోదనముచేసెను. రాణి వానిపైఁ దనచల్లని యభయహస్తమువేసి, యీపాపిణిదాననెవఁడు చేసెనోకాని నేనీగడియవఱకు బాగున్నాను. తనకుమారుని నీవు చెఱలోఁ బెట్టితివను నొక వంకబెట్టుకొని యీయమునాదురాత్ములాలు శత్రువులచే నంపఁబడినది కాఁబోలు. నేనది యెఱుఁగక దానిమాటలు నమ్మి లోన నుంచినందులకు నాపని పట్టినది. నీఁడేవా భేశాళసింగు? నీనినిగూర్చి పలుమాఱు విన్నదానను. వానిచావునకే వాఁడిందు వచ్చెనని పలికి తానును ముక్తయు నందఱకుగుపకుటకు గుహారము ముందఱకువచ్చి నిలిచి వెలుతురునచ్చుటకు నెగళ్లు వేయించిరి. అప్పుడు రాణి సజీవురాలయియున్నదని తెలియుటచే శాయాజీకి నిలువునఁబ్రాణము లుపోయెను. అప్పుడు తుకాజీహోల్కారు రాణితో, ‹‹అమ్మా యీమహోపకారముఁ జేసినవాఁడు మనజమానుభానయి యుండవలయును. ఏడీయాతఁ డెక్కడనున్నాఁడు రాఁడేమి?'' యని నలుదెసలంజూచి యాతనింగానక యతఁడొకవేళ శత్రువులచేఁ జిక్కెనేమోయని భయపడసాగెను. అంతలో వానియెదుటఁ జుట్టుజరీపట్టుగల యెఱ్ఱతలపాగఁ జుట్టుకొని పచ్చపట్టుపరాయి సన్నపట్టు నిలువుటంగీ దొడుగుకొని తనయాకారము నెగళ్ళవెలుతురులో నొక వింతకాంతి నొందు ముద్దులు మూటఁగట్ట నొక క్రొత్తవిగ్రహము నిలిచెను. అంద ఱాశ్చర్యనిమగ్నమానసులై వానిమొగముజూచి, ‹‹ ఏమిది శ్యామసుందరద తిట్లు వచ్చినాఁడేమి నీవింతకాలము నెచటనున్నావోయి '' యని యడిగిరి. అహల్య వానిని తప్పక చూచి నీవిక్కడనేయున్నావా యని వానిని బలుకరింప, ‹‹ అమ్మా నిరపరాధయగు శ్యామసుందరుఁడే జమానుభాను సుమీ '' యని యేలికకు నమస్కరించెను. ఆనందబాష్పములతో వానినెత్తి రాణి నాయనా నీమూలమున శాయాజీ మాచేతఁ బడినాఁడు

నీమూలముననే నేనును గూఁతురును శేశాజసింగు పాలఁబడక బ్రతికి తిమి. నిరపరాధినగు నిన్ను నిర్హేతుకముగ నుందీయింప యత్నించి తునకు రాజ్యమునుండి తఱిమితిని. నాయపరాధము నీవు సైరింపఁ దగు సుమీ నాయనా" యని యాతని మందమందమృదూక్తులతో లాలించెను. శ్యామసుందరుఁ డాపలుకులఁ గలరి, "అమ్మా నేనెప్పుడును రాజభక్తియందుఁ దీసిపోనివాఁడనే నేనాదినమున నురిదీయఁబడుటకు సిద్ధముగనుండియు జస్వంతరావుగారి వసంతగృహమున వారందఱు చేరుదురని మీకుత్తరమునంపితి. అందువల్లనేకదా మీరు వారలంబట్టుకొనఁ గలిగినారు" అనెను. ఆమాటలు విని యచ్చట నున్నవారందఱు నాశ్చర్యముఁబొంది దత్తుయొక్క రాజభక్తిని వేనోళ్లఁ బొగడసాగిరి. ఇంతలో నీకోలాహలము నాలకించి రాధాకాంతరావు వినయసంభ్రమములతో నేలికయెదుటకునరుగుదెంచి చేతులుజోడించి, "అమ్మా ఇదె రాధాకాంతుఁడు కనువిచ్చిచూచి రక్షింపుమీ" యన దేవి వానిమొగముజూచి నీరఘునాథరావును విడిచినావేమని యడిగెను. తనపై రాజద్రోహమును హేయమైననేరము స్థాపింపఁబడినందునఁ గొలకుల నుండి కన్నీరు గారఁ దన వృద్ధశరీరము వడఁక నతఁడిట్లనియెను. "తల్లీ గోమాజీరావునందు మీకు మిక్కిలి నమ్మకము కలదుగాని యాతఁడు ద్రోహి. అతఁడు తమ ప్రతికక్షులోఁ జేరి కృతజ్ఞుఁడనగు నన్ను మీసన్నిధినుండి సాగనంపఁదలంచి రఘునాథరావు వచ్చుచున్నాఁడని మీతోఁ జెప్పి నన్ను దూరదేశమున కంపెను. నే నెంతకాలము కనిపెట్టుకొని యున్నను రగోబాకాని యాతని బలముకాని నామీఁదికి రాదయ్యెను. తుదకాతఁడు దండెత్తిరా నిశ్చయించుకోలేదని నాకుఁ దెలిసినది" రాణి చెవుల కీమాటలు వినిపించినతోడనే విశేషాశ్చర్యమొంది రాధాకాంతునితో, "సరే నీవు దత్తు నన్యాయముగ వదలిపెట్టుమని గోమాజీరావునకు లేఖవ్రాసినావు. తరువాత రఘునాథరాయుని

వద్దనుండి నీకు వచ్చిన జాబుఁగూర్చి మాకు దొరకినది. అందుకేమి యుత్తరముఁ జెప్పెదవు” అని ప్రశ్నవేసెను. ఆప్రశ్నవిని యుత్తర మీయలేక యొకకొంతసేపు తత్తరపడి యెట్టకేలకు నాతఁడు, “నేను గోమాజీరావునకు జాబులువ్రాసితినా? రఘునాథరావువద్దనుండి నాకుఁగిమ్మనవచ్చినదా? అమ్మా మీ రెంతనఱకు మోసపోయినారు. నాపై ననూయ గలిగింపవలెనని గోమాజీరావు స్వయముగ వ్రాసియో మఱియొకరిచేత వ్రాయించియో యీజాబులు మీకుఁ జూపినాఁడు. జాబుఁ జూడనిచ్చినచో వ్రాఁత యెవనిదో చెప్పెదను” అని విన్నవించెను. విన్నవింప రాణి యారహస్యము విననలెనను నాత్రిముత్తోఁ దనకు మున్నిచ్చిన గోమాజీరావు సంబంధములగు రెండులేఖలను రాధాకాంతునిచేతికిచ్చెను. ఆయుత్తరములఁ జదువుకొని రాధాకాంత రావు తన యేలికతోఁ దస్తూ రీవ్రాఁత వామనభట్టుది. వానిచేత వ్రాయించి గోమాజీ మిమ్ము మోసపుచ్చినాఁడు. వామనభట్టువల్ల కొన్ని రహస్యములు బయలకునచ్చునని పలికెను. తమచేతఁ జిక్కి యున్న వామనభట్టును రప్పించి రాణి వెంటనే యాయుత్తరములఁజూపి యది యెవరివ్రాఁతయని యడుగ నతఁడు గద్గదస్వరుఁడై యీవ్రాఁత తనదని యొప్పుకొనెను. అంతట శ్యామసుందరదత్తు భట్టుదొడుగుకొన్న యంగరకా జేబులు వెదకి యందుండు మఱియొకజాబును దీసి రాణి కిచ్చెను. వింతతరువాతవింత బయలుదేరుటచే రాణి కోపము నాపుకొని నవ్వుచు నాయుత్తరమును క్రిందివిధమునఁ జదువసాగెను. “గోమాజీరావు భేతాళసింగునకు వ్రాయున దేమన, మీకు నింబపురికోట స్వాధీనమగునట్లు నేను సకలసహాయములును జేసియుండ నాకీయవలసిన సొమ్ము నిచ్చుట మీ కింత కష్టముగ నున్నది. మీరు వచ్చునప్పటికి మహాధీరుఁడైన రాధాకాంతుని, మంచియుపాయముచే, దూరదేశము న కంపితిని. ఆవిశ్వాసమైన మీకు లేదు. ఈయుత్తరమిందిన లక్షణము

నాసామ్మునాశంపుము" అని రాణి చదివిన యాలేఖను విని తుకాజీ శివనానా మొదలగువారు, దత్తు, రాధాకాంతుఁడు నోరెత్తలేక కొత్వాలుచేసిన ద్రోహమునకు సిగ్గుపడి మిన్నకుండిరి. రాణి వారింజూచి నేనింతకాలమును క్రూరభుజంగములమధ్యఁ గాఁపురముచేసితిని. ఇంతింత దురాత్ములుండ దేశము కెట్లు సేమముగల్గును. రాజపుత్రులు నింబపురిపై వానిమాటలు నమ్మి వచ్చినారు. ఈభేతాళసింగు నాప్రాణములఁ దీయఁ దలఁచుటలోఁగూడ గోమాజీయొక్క యాలోచనయుండవచ్చునుసుమీ యనెను. అనవుడు వామనభట్టు మెల్లగ, "అమ్మా! గోమాజీరావుగారు సకారామను పేరుపెట్టి భేతాళసింగును వెంటఁబెట్టుకొని గుట్టులన్నియుఁ జెప్పినారు. నేను కడుబీదవాఁడనై తినుటకన్నములేక యీతఁడు చెప్పినపనిచేసి పొట్టబోసికొనుచుంటిని గాని నే నేలినవారిమీఁదఁ గుట్రఁబన్నుటకు వీరిలోఁ జేరలేదు. తమ పాదరక్షలుమోయుటకైనఁ దగని బీదబ్రాహ్మణుఁడను. నేను తమపైఁ గత్తిగట్టుట కెంతవాఁడను. నన్ను క్షమియింపుము తల్లీ యని వేఁడుకొనెను. ఇది యగుచప్పటికి జాముకోఁడికూసెను. రాణి నిద్రాభారముచే నలసి యందఱకును సెలవిచ్చి ముక్తలోఁగూడఁ దాను నిద్రింపఁదరిగెను. చిరకాలమునకైన పరస్పరసమాగమునకు రాధాకాంతుఁడును శ్యామసుందరదత్తును నానందభరితాంతరంగులై నిద్రపోవక తమకష్టములు జెప్పుకొని యామిగిలినరాత్రికాలముం గడపిరి. ఆరాత్రి భైరవసింగు తప్పించుకొనిపారిపోయి కోటఁజేరి భేతాళసింగుయొక్క దుర్మరణవార్త రాణావారికి విన్నవించెను. రాణావారావార్తవిని భేతాళసింగుతోఁ దనరహస్యముఁ దుదముట్టినదని యెఱింగి ప్రాణములతో నింబపురము విడిచి యుదయపురము బ్రవేశించుట యుక్తమని యెంచి మఱునాఁడురాత్రి భేరీఢక్కాదిధ్వనులు గట్టిపెట్టించి టెక్కెములు చుట్టించి చడిచప్పుడు లేకుండ హతశేషమైనసేనతోఁ గోటవదలి పారిపోయెను. అర్ధరాత్రి శూరశిఖామణులగు

రాజపుత్రులుచేసిన తెగువ నుదయమున నహాల్య విని సంతసించి రణ దుందుభినాదములు తనవిజయవార్తలఁజాట, నున్నతధ్వజములు దనయౌన్నత్యముం దెలుప రత్నాకరము చందమున మహాఘోషసమేతమగు సేనలతో నుభయపార్శ్వముల ముఖ్యసేనాధిపతులు గొల్చిరా, నహాల్య నింబపురికోటఁ బ్రవేశించెను. అట మహారాపురమున నానందబాయి యొకనాఁడుదయమున నింటఁ బ్రొద్దిపని జేసికొనుచుండగ మునుపొక సాఁదివలె గుమ్మములో నొకపల్లకి దిగెను. ఆసమయమునఁ బల్లకి నెక్కి వచ్చువారెవ్వరని సంశయముకలిగి యానంద పరుగెత్తుకొనివచ్చి చూచునప్పటికి మెల్లగఁ బల్లకిఁదిగి యొకవిలాసవతి యానంద కెదురుగవచ్చి యామెను గాఁగిలించుకొనెను. ఆనంద యామెరాక కద్భుతమొంది "కమలా! నీవు బాగున్నావా? నిన్నుజూచి చాలకాలమయినది. నీవు మృతినొందితివని లోకులు చెప్పుకొన్నారు. మాదత్తురు రాణి రాష్ట్రమునుండి వెళ్ళఁగొట్టినది వాఁడేమైనాఁడో నే నెఱుఁగనమ్మా" యని కంటఁ దడిఁ బెట్టుకొనెను. శ్యామసుందరదత్తునకు భయములేదని కమల యామె నూరార్చి మాతమ్ముఁడు మార్గాయాసముచే డస్సినాడు, వానికిఁ గొంచెమన్నమును బెట్టఁగలవాయనుచు నడుగ నానంద యానందమున వాని కన్నముబెట్టెను. బాజీరావు భోజనము సేయుచుండగఁ గమలయు నానందయు నిట్లు మాటాడిరి.

ఆనంద—నీతమ్ముఁడు నిన్నుచటఁ గలిసికొన్నాడు? నీవెందుండి వచ్చినావు?

కమల—నానిమిత్తము మాయమ్మ మాతమ్మునిటకుఁ బంప వాఁడదృష్టహీనుఁడై భిల్లులచేతఁబడి రెండుసారులు చావుదప్పించుకొని యిట్లుండగ నేను రాణిపగ్గఱ సీతయనువేషములో దాసిగనుండి దైవయోగమున భిల్లులచేతఁ బడితిని.

ఆనంద — అయ్యో ! ఆదుర్మార్గులచేతనుండి యెట్లు తప్పించుకొన్నావు.

కమల — అక్కడ శాయాజీహోల్కారను సనామధేయుఁ డొకండు నన్ను బెండ్లియాడవలయునని యత్నింప మేము వానిని మోసము చేసి యిటకు వచ్చినాము. బాజీరావు నాతమ్ముఁడు గాఁడనుకొని యా దురాత్ముఁడు తనకొఱకు నన్నుఁ గూర్చి వీనిద్వారా ప్రయత్నించి నన్ను దనకు సమకూర్చినపక్షమున మాతమ్ముని జెరవిడిపించునట్లు వాగ్దానము చేసెను. నేను మగవేషము వేసికొని రాత్రి శాయాజీని దర్శించునట్లు నిర్ణయింపఁబడినందున నేను మగవానిలాగులోఁగు దాఁగుకొని యుంటిని. అప్పుడు మూర్ఖుఁడగు శాయాజీ ముందుగ నాతమ్ముని జెర విడిపింపఁదలంచి పల్లకిఁ దెప్పింప నేనాపల్లకింగూరుచుంటిని. మగవేషముతో నుండుట నాకు నాతమ్మునకును భేదమేర్పరచుట కష్టమైనందున మాతమ్ముఁడే పోవుచున్నాడనుకొని యామూఢుఁడు నన్ను విడిచిపుచ్చెను. తరువాత మాతమ్ముఁడు వానియొద్దకరిగి వాని నొక్క పోటుపొడిచి యాస్థలముఁ బాసి ముందు ప్రయాణముసేయు నన్నుఁ గలిసికొనెను. వింటివా మా యవస్థ నాటి యీయుపాయ ప్రకారముగ నేసినటకు నేను వర్తించుటచే నాకు మానహాని వాటిల్లలేదు.

ఇట్లు వారు పరస్పరప్రియముచేఁ గష్టసుఖములఁ జెప్పుకొనుచు నా దినమును గడపిరి. కమల యచ్చటఁ గొన్ని దినములుండెను.

## ఇరువదినాల్గవ ప్రకరణము.



వామనభట్టు రాణి శిబిరమునఁ జిక్కినాడను వార్త వినినతోడనే గోమాజీరావు తనగుట్టిక దాఁగనేరదని తెలిసి దారాపుత్రాదుల విడచి యుద్యోగము మానుకొని నాఁ డర్ధరాత్రియందు సింధూరునగరము

బొసి పలాయనుఁడయ్యెను. ఎక్కడికరిగినాఁడో వాని సేవకులుగాని దారపుత్రాదులుగాని యెఱుఁగరు. గోమోజీ యధికమయిన యాశయు స్వల్పమయిన ధైర్యముగల పిఱికి మహారాష్ట్రుఁడగుట నతఁడు తన చర్యల భరింపనేరక దేశముల పాలయ్యెను. జస్వంతరావు భిల్లులనందఱ నాశనముచేసి కృతకృత్యుఁడయ్యె గండాభిల్లు కొంకమి నిండారు సంతోషమొందక కొండలు గుహలు నడవులు వాఁగులు సంచరింపసాగెను. దేశమును గొల్లగొన్న భిల్లులును శాయాజీతోఁ జేరిన భిల్లులును దాదాపుగ హతులగుటచే నితరభిల్లులు భయకంపితులై దోఁపుడను తలంపువిడిచి వ్యవసాయములు చేసికొనుటయు బిచ్చమెత్తుకొనుటయు నారంభించిరి. కొందఱు దొంగతనములు మొదలగు వానినిమాని మారువేషములతో జనులయొద్ద సేవకులుగాఁ బ్రవేశించి పొట్టఁబోసికొనసాగిరి. అందుచే గండాభిల్లు చిక్కుట యసాధ్యమని జస్వంతరావు నిరాశనొంది తుదకల్లీ రాణికి లేఖవ్రాయ వాని నప్పగించినంగాని ముక్తాబాయి నిచ్చుటలేదని రాణి వానికుత్తరమంపెను. అదివఱకుఁ బడినశ్రమ యంతయు వ్యర్థమైనదని గంగాధరుండు మఱలఁ బ్రయత్నముచేయుచు గోసాయీలను బయిరాగులను రప్పించి యడవులయందుఁ దిరుగునెడ వారికి గండాభిల్లుఁ డెందైనఁ గానఁబడునేమోయని యరయుచు నానాశ్రమలొందుచుండెను. అతఁడొకనాఁడు మహాలానగరమున కరుగ నచ్చటి జనులెల్ల నొకమహాత్ముఁడు గ్రామమునకు వచ్చినాడనియు నాతఁడు గండాసంగతి నెఱిఁగింపనచ్చుననియుఁ దెలిపిరి. “ఇట్టి మహాత్ముల నెందఱినో నేనిదివఱకుఁ జూచినాడను. ఎవరును నాకువానిజాడఁ దెల్పనేరరి.” అని తిరస్కారభావముగఁ బల్కి తనబసకుంజనియెను. అయినను మనసు తాళక మధ్యాహ్న మొకసారి యామహాత్ముఁడు జయదేవుని మఠమున కరిగి యాతని దర్శించెనుగాని యాతఁడు మానమ్ముద్రాభరణ మొనర్చిన బయిరాగి యగుటచే నాతని నెఱుఁ

పలుకరింపకయే యింటికి వచ్చెను. రాత్రి జపము ముగిసిన తరువాత నాబయిరాగి వచ్చియు రాని హిందీకీర్తనలు పాడుచు శ్రీకృష్ణుని యమునావిహారములు రాధాసరసములు స్తవమొనర్చి యానందించుచుండ నచ్చటికి మఱియొకబయిరాగి వచ్చి తన సంచి నందుదింపుకొని మొదటివానినడిగి గంజాయి కొంచెము గ్రహించి పీల్చి మహారాష్ట్రభాషలో వల్లభాచార్య స్తవాదులగు పాటలు పాడసాగెను. ఇట్లిరువురు విసుగు వచ్చువఱకు భగవధ్యానముచేసి తమతమ కంబళములపైఁ దామ పవ్వళించిన తఱి రెండవ బయిరాగి మొదటి వానిని బలుకరింప మొదలుపెట్ట నాతఁడు మౌనభంగమగునని కాంబోలు పలుక నిష్టపడక పదిప్రశ్నల కొక్కయుత్తరముఁ జెప్పుచు నిద్రింపఁజొచ్చెను. రెండవ వాఁడు విధివిరామములేక ప్రశ్నలనుగఁ జొచ్చుటచే నాతఁడు విసిగి లేచి కూరుచుండి నీవెన్నిప్రశ్న లడుగఁదలఁచితివో యన్ని యడుగుమని కోపముతోఁ బలికెను. అప్పుడు వారికిట్లు సంభాషణ జరిగెను.

రెండ—మీరు నామీఁద కోపపడవద్దు. గోసాయీలము మనలోమనము చేదోడువాదోడుగనుండకుండిన నన్యు లెవ్వరుందురు. నేను క్రొత్తగ నీయాశ్రమమును స్వీకరించితిని. మీరు మహాత్ములు నాకుపదేశమేదైనం జేయుఁడు.

మొద—నాకుమంత్రములురావు. రామారామా యనుమాట తప్ప నాకేమియురాదు.

రెండ—మీరేయేతీర్థములు తిరిగినారు. మిమ్మెక్కడనో చూచినట్లున్నది.

మొద—నేను ప్రయాగ, కాశీ, గయ, వెళ్లినాను. నన్ను నీవందుఁజూచితివా?

రెండ—అయ్యా యీదినములలో బైరాగులకు సన్యాసులకు దేశసంచారము కష్టముగనున్నది.

మొద—అవును. ఈదేశమున మిక్కిలి కష్టము. జస్వంతరావు బయలుదేరి ప్రతిసన్యాసిని బిలిచి గండాభిల్లును నీవెఱుఁగుదువా యని యడుగుచుండును. అందుచే ననేకులు తమకుఁ దెలియకపోయినను వానినుండి తప్పించుకొనుటకు నేదియో యబద్ధము జెప్పుచుందురు.

రెండ—నన్నా విషయమై యాతఁడడిగినాఁడు. నేనేమియుఁ జెప్పలేదుకాని మీరు చాలదేశము తిరిగినారు. మీరెక్కడనైన గండాభిల్లును జూచియుంటిరా. పాపము వానిజాడ కొంచెము నాకుఁ దెలుపఁగలరా.

మొద—నాకు గండాభిల్లు కనఁబడలేదు. అతని విషయమై వేరేప్రయత్నించుటకంటె మహానగర సమీపమునయున్న ఋషిని బట్టుకొన్నచో నన్నియుం దెలియును. ఆఋషియు గండాభిల్లుఁడును నొక్కటి. భిల్లుల కాలోచన మతఁడేచెప్పి వానినింతదూరముఁ దెచ్చినాఁడఁట.

రెండ—అవును. ఆఋషియే వారి పక్షము గాకున్నపక్షమున నిష్కారణముగ మొదట పట్టుబడిన గండాభిల్లు వాని కుటీరమునుండి యెట్లుపారిపోవును? ఆఋషిని బట్టుకొని యురిదీయింపఁ బ్రయత్నింతము. కాని గండా యెట్లుపారిపోయెనో చెప్పఁగలరా.

మొ—అయ్యో నాకెందుకు. గోడలకు జెవులుండును. ఈ సంగతులుపైని పొక్కినచో నేదియు నెఱుఁగని మనలఁబట్టి యహల్యాబాయియు జస్వంతరావుగారును బాధపెట్టుదురు. మనమీసంగతులు చెప్పకొనవద్దు. రాజుతో పని పాముతో చెలగాటము.

రెండ—ఆమాట నిజమేకాని యీ సంగతులు నే నెవరికిఁ జెప్పను. ఊరూరఁదిరుగు సన్యాసులము. మనకిట్టివెందుకు? వినవలెనను కోర్కెచే నడిగితి. మీకిష్టమైనచో జస్వంతరావును నేనెఱుఁగుదును [illegible]నుక వానితోఁ జెప్పి ఋషిని శిక్షించునట్లు చేసెదను. ఇష్టములేనిచో నదియు మానెదను.

మొన—దుర్మార్గుఁడైన యాఋషిని శిక్షించుట నాకిష్టమే. మన రాణీవిషయమై మనము పనిచేసి దొంగల నప్పగింపక పోయిన యెడల మనబ్రతుకేందుకు. ఆమె సదావృత్తులిచ్చి మనలను రక్షించు యుండును. ఆఋషిసంగతి ప్రయాగలో నొకనాఁడు తులసీదాసు మఠములో నొకగోసాయి చెప్పఁగావిన్నాను. అది చెప్పెదను విను వాఁడు ఋషికాఁడు. మూఁడవపానిపట్టుయుద్ధమున వీఁడు మహారాష్ట్రులలోనుండి సగము యుద్ధమైన తరువాత తురకల పక్షమునకుఁ దిరిగిపోయినాఁడు. తరువాత తురకలు గెల్చియు వీని నిరాకరించుటచే మరల పీష్వారాజ్యమునకు నరిగినచోఁ దనను చంపుదురని యీహోల్కారు రాజ్యమున నున్నాఁడు వీనిపేరు మురారిపంతు. మిక్కిలి వృద్ధుఁడని చెప్పుకొనునుగాని యంతవయస్సులేదు. తా నెఱుఁగుచున్నవిషయముల నెఱుఁగడు. వయస్సునుబట్టి వీనియందుగౌరవముగల్గి మాటలనుబట్టి భక్తిగలిగి ప్రజ లీతఁ డాగతానాగతవర్తమానవేదియని యనుకొని వానితో సర్వకార్యములలో నాలోచనము సల్పుచు మోసపోవుచువచ్చిరి. రాఘాకాంతరావు మొదలగు బుద్ధిమంతులుగూడ వీనిచే మోసపోయిరి. వాఁడు భిల్లులకు సాయమై, దేశము దోపించినాఁడు. కొడుకులు లేరని దిక్కులేని వాఁడనని వాఁడు చెప్పుకొనునే కాని కొంకణదేశములో వీనికందఱు నున్నారు. భిల్లులతో స్నేహముచేసి వారిచే నూళ్లుదోఁపించి యాసొమ్ము బిడ్డలకంపును.

రెంప—ఆహాహా! యెట్టిచిత్రము నేఁడు విన్నాముండి మీకు రాణికి నొప్పులుగదా కాని గంగాభిల్లెట్లు పారిపోయినాఁడో తెలియఁజెప్పినారుకారు.

మొన—ఆహా! అరే మఱచిపోయినాను. నాఁడు ఋషికుటీరముచేరి దత్తు దొంగనక్కడవిడిచి యెక్కడికో యరుగ ఋషియొక గొల్లసిచే దాపునున్న భిల్లునకు వర్తమానమంపి ముప్పురుషులరప్పించి గంగా

భిల్లును దోడుకొని పొమ్మనెను. వాఁడు కావలిగాఁచు బంట్రౌతును జంపి గండాను వదలించుకొని పోవుచుండ ఋషి తనమీఁద దత్తున కనుమానము లేకుండఁ దన్నుఁగూడ కాలుసేతులు కట్టుమని కోరి తన యిష్టప్రకారమే బంధింపఁబడెను. అంతటియుక్తి చేయఁబట్టి వాని దొంగతనమును రాణియు దత్తును బట్టుకొనలేరైరి.

ఈపలుకులు విని రెండవయోగి యెందుచేతనో మితములేని యానంద మొందుచు "మీరు సాక్షాత్తు విశ్వేశ్వరులు, రాణి మీయెడల మిగుల కృతజ్ఞతఁగ నుండును సుమీ" యని పలుక నాతఁడు "మీరు ఋషిని బట్టుకొనవచ్చును. కాని యీసంబంధమున నా పేరు చెప్పఁబోకుఁడి. నానిష్ఠలు తపములు చెఱుపుకొని నేను సాక్ష్యములకుఁదిరుగనేర" నని పలికి యప్పటికి రాత్రి యతిక్రమించుటచే గుఱ్ఱుపెట్టి గాఢముగా నిద్రపోయెను. రెండవయోగి నిద్రరానందున రామస్మరణముఁ జేసికొనుచు మేలుకొనియుండి మొదటివాఁడు నిద్రించిన వెనుక వానిదగ్గఱగి సరిగి మొగముపై మొగముపెట్టి చక్కఁగ వానిఁ బరీక్షించి తలయూఁచి యనంతరమున దూరమునున్న వానిసంచి దగ్గఱగఁదీసి యది తన చంకఁ దగిలించుకొని చప్పుడు గాకుండ మెల్ల మెల్లగఁ దలుపులుదీసికొని మఠముఁదాఁటి చనెను. తరువాత నాతఁడా సంచిలోనున్న వస్తువులనెల్ల వెలికిఁదీసి యందొక ముద్దుటుంగరమును మిగుల విలువగల రతనమమర్పఁబడిన దానిని గని సంతసించి "యుంగరమా నీవు విడిగానుండి నా హృదయము దహించుచున్నావా? ఆమె యెందరిగినది" యని కన్నుల నద్దుకొని ముద్దుపెట్టుకొని దానిని మూటగట్టుకొని తనయిచ్చవచ్చిన త్రోవ సరిగెను. ఇంతలో మొదటి బైరాగి మఱికొంత గాఢముగ నిద్రించి "ఓ జస్వంతరావు రాకురాకు" మని పలవరించి మరల నిద్రించెను. అనంతరమున సరిగ నొక జామగునప్పటికి నిరువదుగురు దృఢదేహులగు భటులతో జస్వంతరావు జసుదేవమఠముదగ్గఱకు వచ్చి నిద్రించుచున్న యాబైరాగి

నిలేపి "స్వామీ మిమ్ముదోడుకొని రమ్మని రాణిసెలవయినది మీరు భిల్లులసంగతియు ముఖ్యముగ గండాభిల్లుసంగతియు నెఱుగుదురని వారికిం దెలిసినది. అందుచే నీలాలకిలోనెక్కి మీరురాణిగారివద్దకు దయచేసి ఋషివిషయమై భిల్లులవిషయమై సాక్ష్యమియ్యవలయును. రండి" యని పలికెను. బైరాగి యామాటల కాశ్చర్యముకొంది యాశ్చర్యమువదలి తన్నుభయము దృఢముగా నావేశించుటచే నివ్వెరపడి తడఁబాటుతో "నేనెఱుఁగను నేను సాక్ష్యము నీయఁజాల; నాజపము విఘ్నమొందును. నన్నువిడువు" మని వేఁడుకొనెను. కాని జస్వంతరావు తాను పట్టిన పట్టువదలక "మీరామూలమున రాజ్యమునకు మహోపకారము జరుగును. దయచేయుఁడి" యని వానిని లాలకిలో నెక్కించి తిన్నగా నిందూరు నగరమునకుఁ గొనిపోయెను.



ఇరువదిమైదవ ప్రకరణము.



అట్లు నింబపురపు కోట నాక్రమించుకొని రాణి గండాభిల్లు దోరక లేదనుదిగులు తదక్క తక్కిన సమస్తశత్రుసంహారమును దనచే నయినదని శ్రీకాళికావిశ్వేశ్వరునకు నమస్కరించి పూర్వ మౌరంగజీబుచే నాశనముచేయఁబడిన యాదేవుని యాలయమును దాను గట్టింతునని మ్రొక్కుకొని శాయాజీతోడను వామనభట్టుతోడను ముక్తతోడను బయలుదేరి మహాసంతోషముతో నింబపురముఁబాసి తుకాజీ, శివనానా, రాధాకాంతరావు, శ్యామసుందరదత్తు మొదలగు సేనానాయకులు పరివేష్టించి యుభయపార్శ్వములఁగొలువ నిందూరుపురికి వచ్చెను. రాణిచేసిన యాదరణముచే శాయాజీ ధైర్యముంబూని తనకామె కొన్నిజాగీరులనైన నిచ్చునను పేరాసగల్గి నడుమనడుమ నేమిచేయునోయని సందేహముతోఁ దానుచేసిన పొరబాటునకు వగచుచు రాణితో నరు

దించెను. రాణివచ్చునప్పటికి జస్వంతరావు యోగినీక మందిరమున నుంచి తానెన్నండును వానిఁబాయక సకలోపచారములు స్వయముగఁ జేయుచు నతిగౌరవమున నాదరించి నగరమందంతటఁ బచ్చని పందిళ్ళు వేయించి తోరణములు కట్టించి యనంటిబోదెలు నాటించి కలయంపులుజల్లించి ముగ్గులువెట్టించి శృంగారించి తనసేనతో నామె నెదుర్కొని యామెచే గౌరవింపఁబడి యామెను నగరప్రవేశము చేయించి యామె సెలవుప్రకారముగ వామనభట్టును శాయాజీమహారాజును గారాగృహప్రవేశము చేయించెను. అప్పటికి తన కాళులుచచ్చినవనుకొని శాయాజీ తానును బచ్చినట్టే యెంచుకొని చెరసాలలోఁ గంటికి నేలకు నేకధారగా నాఁడుదానికంటె పసివానికంటె నన్యాయముగ రోదనము సేయఁదొడఁగెను. సీత యెందును దన కగపడనయ్యెనని ముక్త బెంగఁగొని నింబపురి కరిగిన దాది చిక్కు మఱల నలతగనున్నందున రాణి సీతవిషయమై మరలఁ బ్రయత్నముసేయ నిశ్చయించి తన సరదారులతో నామెను వెదకుమనెను. ఆరాత్రికి మురళీధరదాసును నానందబాయియుఁ దనవెంటరా సోదరసమేతయయి సీత రాధాకాంతుని యింటికి వచ్చిచేరెను. రాధాకాంతరా వామె నాదరించి రోహిణీబాయికింజూప నామెయు సగౌరముగ లోనికిఁదోడ్కొనిపోయి యామెకు నానందకు భోజనమిడెను. మధ్యాహ్నమామెయు రోహిణియు నానందయు రాణిదర్శనమున కరుగ రాణియు ముక్తయు సీతరాకవిని దిగ్గునలేచి యెదురుగవచ్చిరి. అందు ముక్త వీధిగుమ్మమువఱకువచ్చి సీతంగని కౌఁగిలించుకొని “యేమే నీవింతకాలము నన్నువదలి యెట్లుంటివే? అయ్యో నాకు నిజముగ నోటికన్నముపోలేదేసీతా. ఈవేళ నేనెంత యదృష్టవంతురాలనో సుమీ రావే, మాయమ్మనీకై వేఁగిరపడుచున్నది” యని వారలనందఱ నంతిపురికిఁ దోడ్కొనిపోవ రాణి వారిమువ్వుర సగౌరవముగఁ గూర్చుండఁబెట్టి సీతంగని “యింతకాలము నీవెట్లుంటివి. భిల్లుల

పాపము నిన్ను బ్రతుకనిచ్చినారా" యని యడిగి యామె భిల్లుల వలన జరిగిన బాధనెల్లఁ గడుచమత్కారముగఁ దెలుప వినియెను. తరువాత నాస్త్రీమండలమునకు నిట్టి సంభాషణజరిగెను.

అహల్య—చేయఁదలంచిన కార్యములన్నియు నైనవి. జస్వంతరావు లోఁబడి నాడు రాజపుత్రులు పరాజితులైరి. దౌలతరావు ధారిచే నిహతుఁడయ్యె. దుర్మార్గుఁడగు గోమాజీ పలాయనుఁడయ్యె. భిల్లులు నిర్మూలింపఁబడిరి. సీతదొరికినది. శామాజీకూడ చేతఁజిక్కెను.

ముక్తా—ఇన్నిటిలో సీతదొరుకుట ముఖ్యముగాదా, అమ్మా!

అహల్య—కాని గండాభిల్లు చిక్కలేదు. ఎప్పటికైన దొరకక పోడు. అన్నిటికంటె నా కష్టనబాధ యొక్కటియున్నది. నేను కమలను రక్షింపలేనైతినను విచారము హృదయశల్యమైయున్నది.

రోహిణి—అమ్మా! ఆవిచారము తమకెందుకు? ఈసీతయే కమల. దౌలతరావుచే నీమె బాధపఁబడునని మావారు సీతయను పేరు పెట్టి దాసిగ మీకొప్పగించిరి.

అహల్య—ఆమెచావలేదా? ఈమెయే ఆమెయా? ఇదిమాయగానున్నదే శవమునుగూడ దహనముచేసినారని చెప్పినారే.

రోహిణి—అమ్మా! ఆదినముననే మఱియొక స్త్రీ మఱఁదలుతో వివాదమాడి నల్లమందు చెట్లతోఁటలో నూతిలోఁబడి మృతినొందినది. ఆమెతండ్రి మొదలగువారామె బలవన్మరణముచేఁ దమకు మాటవచ్చుననియుఁ దనయల్లునకు మాటవచ్చుననియు నోరెత్తక యూరకొనుటచే నాశవము కమల శవమేయని పౌరులు భావించినారు. ఇట్లు మావారు చెప్పినారు.

అహల్య—అలాగునా. ఇదిమఱియు వింతగనున్నది. పాపము విధవవయిననీమొగము నాఁడుచూచుటకు బదులు నేఁడేచూచిన నా

పూర్తి చేయవలసివచ్చినదికదా. కమలా! నీవింతకాలము నాయొద్దనున్నను నేనెఱుఁగనైతిని.

ఆనంద—అమ్మా! నామనవిఁ జేకొనవలెను. ఈమె విధవకాదు. అవివాహితయగు కన్యక.

అహ—(కోపముతో) ఈయబద్ధములను గట్టిపెట్టి నిజము బల్కుఁడు.

రోహి—అమ్మా! ఆగ్రహింపక యావిషయమై యామెమొఱను గుట మంచిది.

ముక్త—కమలా! సత్వరముగ నీచమత్కారవచనములతో నద్భుతమగు నీచరిత్రముఁజెప్పి చాలకాలమునుండి తుప్పుపట్టిన మాచెవులకు విందుచేయుము.

అహ—కమలా! నీచరిత్ర మామూలాగ్రముగ నెఱింగింపు.

కమల—తల్లీ నాచరిత్రము నాలకించి న్యాయముననరీతి నన్నాదరింపఁగోరెద. శ్రీమానవరావుగారి పాలనమునందున్న పునహానగరము మాకాఁపురము. కులమున నున్నతుఁడై సంపదలలో నిరుపేదయగు సశ్వరచంద్రుని కొమార్తెను. మాతండ్రిగారి మరణానంతరమున మాతల్లి ధనాశకులోఁగి హరిహరపాండ్యాజీయను బ్రాహ్మణాధముని ప్రేరణచే నన్ను వృద్ధుఁడగు రాజోజీపల్కారునకీయఁదలంచిన నేనెన్నిసారులు వివాహమున కనిష్టత సూచించినను మావారు నామాటలు సరకుఁగొనకపోవుటచే రెండుమూఁడుసారులు రాత్రివేళ నేనొంటరిగ భవానీమాత యాలయమున కరిగి నాకా వివాహము దప్పింపుమని యామెను వేఁడుకొంటి. దేవి యప్పటికేమియు బ్రత్యుపకారము నాకుఁ జేయనందున మాతల్లి యాత్మలాభముం జూచుకొని కొంత ద్రవ్యము పల్కారునొద్దనుండి గ్రహించి పెండ్లి నిశ్చయించి తాను పునహాలో వివాహము జరుప శక్తిగలదికానందున నిందూరు నగరమునకు నను దీసికొనిపోయి

పెండ్లియాడుమని నన్నువానికప్పగించెను. అతఁడు నన్ను పెండ్లియాడవ లెనని బయలుదేరుటయు మార్గమధ్యమున వృషభముచే మడియుట యు వీరెఱుఁగుదురు. తల్లిమాట కెదురుచెప్పఁదలఁచుకొనక యామె యాజ్ఞ నెరవేర్ప నాసౌఖ్యమునైన మానఁ దలఁచుకొంటిని గనుక నా మె యిష్టప్రకారము నేను పల్హారును బెండ్లియాడుటకు నిష్టములేక యిష్టపడి వాని వెంటవచ్చితిగాని వివాహమాడకముందె యాతఁడు మృ తినొందినాఁడుగాన నేను కన్యను.

అహ—ఏమీ! దైవయోగము. నీమాటలయందు నాకపనమ్మ కము గల్గుచున్నది. నిన్నాతఁడు పెండ్లియాడకపోయినపక్షమున నీవట్లు నె వ్వరితోడను నేల జెప్పవైతివి. పోని, వైధవ్యమేల యనుభవించితివి?

కమల—ఆమాటకుత్తర మానందబాయి చెప్పవలయును.

ఆనంద—అమ్మా! అందుకుత్తరము నేను జెప్పెదను ఈమెయు గాయముతగిలినరాణోజీయు మాయింటికివచ్చిననాటిరాత్రి తనయవ స్థనంతయు నాకుఁ జెప్పి యీమె తనబ్రతుకుతెరువునుగూర్చి నన్నడు గ నేనిట్లు చెప్పితిని "రాణోజీ బ్రతికినచో సరే. నీవాతనిం బెండ్లియా డుట కర్తవ్యమే. అతఁడు పోయినచో నీవు దురాత్ముఁడైన దౌలత రావు నింటనుండుదువు గనుక వివాహముకాని కన్యకవని చెప్పవద్దు కన్య నన్నచో నీవంటిదాని నతఁడు పెండ్లియాడక పోవఁడు. ఇదివఱకు రా ణోజీ యందఱితోడను తన భార్యవని చెప్పుచున్నాఁడు గనుక జనుల నాయభిప్రాయములోనే యుంచుటమంచిది. లోకులు నిన్ను విధవయ నుకొందుఱు కాఁబట్టి దౌలతరాయుని దౌర్జన్యమును వారు హరించి నీ పక్షమున నుందురు. కన్నెనని చెప్పినచో నిన్నితనికిఁ గట్టిపెట్టక మాన రు. అందుచేతఁ గొంతకాలము దౌలతరాయునియిల్లు విడుచువఱకు భ ర్తృహీనవలె నుండు" మని యుపాయముఁ జెప్పితిని. దానింబట్టియీా మె వర్తించియుండెను.

ఆమాటలువిని యహల్యయు ముక్తయుఁబొందిన యాశ్చర్యము వారిమనస్సులెఱుఁగవలయును. తత్కథాశ్రవణముఁ జేసిన వారెఱుఁగ వలయును. ఎట్టిసారములేని ప్రాఁతిమాటలనైన రసవంతముగఁ జెప్పనేర్పుఁగల కమలాబాయి స్వారస్యములతోఁ గూడిన స్వచరిత్రము నద్భుతముగ విన్నవింపఁదగిన సాక్ష్యముచుటచే నహల్య నమ్మి యానిరుపమానలావణ్యరాశి విధవకానందుల కమితానంద మొంది "నీకు మాముక్తకు నింక వివాహములు చేయుట యావశ్యకమే నీమనోహరు నేనెఱుఁగుదు. మిగులశ్రమఁజెంది యేసుందారకారుని ప్రాణములు నీవు నాతోఁజెప్పి రక్షించితివో యాశ్యామసుందరుఁడని నేఁడలంచెద" నని యానందనుజూచి "నీతమ్మునకీమె నిచ్చి వివాహముసేయుట నీకిష్టమేనా ? రోహిణీబాయీ నీవు కుమారునివలెఁ బెంచుకొనుచున్న మీదత్తునకీమె యనురూపయగు నిల్లాలుకద" యని యనఁగ వారిరువురు దమకు సమ్మతమని నొక్కి చెప్పిరి. అంతట నప్పలుకులకు ముసిముసి నగవులు నగి కమల ముఖకమలము వికసింపఁ జెంగున నొక తెరచాటున కరిగి సిగ్గునఁ దలవంచుకొని చిరకాలముక్రిందట నాటఁబడిన మనోరథబీజము లంకురించి శరీరమందంతట మొలకలెత్తెనోయన పులకలు వొడసూప మనోనేత్రముఁ దెఱచి భువనసుందరుఁడగు శ్రీశ్యామసుందర సుందరముఖారవిందము నానందమున ధ్యానించిచూచుచు నానంద మహాంబుధి నోలలాడఁదొడఁగెను. అంతట వారికందఱకు సెలవిచ్చి ముక్తాబాయి కోరికప్రకారము కమలను మందిరమున నుండఁ బంచి రాణి జస్వంతరావును బిలువనంప నతఁ డూరలేఁడని చెప్పిరి. మధ్యాహ్నము బైరాగిదగ్గఱ శ్యామసుందరుని గాఁపుంచి జస్వంతరావు తురంగము నెక్కి తగుపరివారముతో ఋషికుటీరముఁ బ్రాపించెను. రాత్రి జామగువఱకు ఋషిని వెంటఁబెట్టుకొనిరాకయే తానొక్కఁడు వచ్చి రాణిదర్శనముఁజేసి భిల్లులవిషయమై యెఱిఁగిన బైరాగి

వచ్చియుండుటఁ దెలిసి విచారణసేయుమని యడుగ మఱునాఁడుదయము న సేయవచ్చునని వారినంపి రాణి నిద్రించెను. భిల్లులబాధ యడఁగి రాజ్యమున సౌఖ్యోదయమైన యట్లు చీఁకటిబాధ యడఁగి సూర్యోదయము కాఁగానే రాణి కాల్యములు దీర్చి బైరాగిని వెంటఁబెట్టుకొనిర మ్మని జస్వంతరావునకు వర్తమానమంపెను. బైరాగిని సగౌరవముగఁ దీసికొనివచ్చి రాణియెదుట నొకపీఠముపైఁ గూరుచుండఁబెట్టి జస్వంత రా విట్లనియెను. ఓయీ నీకీరతనపు ముద్రుటుంగర మెక్కడిది స్వామీ' అని చెల్లఁబోయి బైరాగి ప్రత్యుత్తరమేమియీయవలయునని యో చించుకొనుచు దిక్కులు చూచుచుండ రాణి యాయుంగర మందుకొని చూచి "యిది మాముక్తాబాయిది. నాఁడు భిల్లులు దోఁచుకొన్నపుడు పోయినది. ఈబైరాగియు భిల్లులలోనివాఁడా యేమి" యని యడిగెను. ఆపలుకులు విని జస్వంతరావు "శాయాజీని రప్పించినచో దీని విషయ మై తెలియును. అట్లుచేయుఁడీ" యన శ్రీకుమారమహారాజుగారిని రాణి చెఱనుండి రావించెను. రాజభటులు శాయాజీని నిలువఁబెట్టిన తరు వాత జస్వంతరావు వానినిజూచి బైరాగినిజూపి "ఈతఁడెవ్వ"రని యడి గెను. శాయాజీరోదనధ్వనితో "నీతఁడు గంగాభిల్లు గాఁడా" యనిప లికెను. వెంటనే రాణి యాశ్చర్యమొంది యిట్లనియె. "అహల్యాబా యికి హృదయశల్యమును జస్వంతరావునకు జిరకాలప్రయత్నఫలమును దేశసౌఖ్యమునకుఁ గాఱుచిచ్చునగు దురాత్ముఁడా యీబైరాగివేషము ధరించినవాఁడు. గంగాభిల్లుపేరు విన్నచో నిందూరురాజ్యమున నున్న సుందరులకు గుండియ లవిసెనుగద! ఈతని మూలమున నేనును నా ప్రజలును నొక్కనాఁడైనను కడుపాఁ బట్టెడన్నము దినియెఱుఁగము కన్నార నిద్రయెఱుఁగము. ఈతఁడు నాభాగ్యవశమునఁ జిక్కినాఁడు భిల్లులనందఱఁ గూల్చుట యొకయెత్తు వీనినిగూల్చుట యొకయెత్తు సుమీ. నీఋణము నేను దీర్పఁజాల గంగాధరా" యని పలుకు

చండ భటులు గండాభిల్లునకు సంకెళ్ళు వేసిరి. అంతట జస్వంతరా విట్లనియె ' అమ్మా ! నేనే స్వయముగ బైరాగివేషముదాల్చి జయదేవరమఠమున వీనిం గలిసికొని యనుమానపడి ముక్తాబాయియొక్క యుంగరము వీని సంచిలోఁ జూచి వీఁడే గండాయని పట్టుకొంటిని ఋషిఁ గూడ పట్టుకొనవలెనని నే నాకుటీరముఁ జేరి వానిని బట్టుకొంటిని కాని వెంటనే వాఁడు విషముతిని యక్కడనే మృతినొందినాఁడు గండాభిల్లు ఋషికుటీరములోనుండి తలదాఁచుకొనఁ బ్రయత్నింప నాఋషి తనకు మాటవచ్చునని యాతనిని సమ్మతింపఁడయ్యెనఁట. అందుచే గండాభిల్లు కోపించి బైరాగివేషముఁ దాల్చి నాతో ఋషిపై నేరములు చెప్పినాఁడు. అందుచే నీతఁడు చిక్కినాఁడు చచ్చె. ఇక్కడికి శత్రుశేషముఁగూడ నిర్మూలమైనదగదా'' అని పలుకులువిని రాణి భిల్లునకు మరణదండన విధించెను. తరువాత శాయాజీని గని ''నీవు మొదట యాజ్ఞాతియగు శాయాజీవేమో యనుకొంటిని. అతఁడు మృతినొందినాఁడఁట. నీ నిజనామము నీయునికి నీ నీచజన్మము నాకుఁ దెలిసినవి. నీకును మరణదండన విధించినానుపో', యని యాసతీయఁ దనసుందరకాయము నేలఁగూల వాఁడు మూర్ఛిల్లి' అయ్యో ! బిచ్చమెత్తుకొని బ్రతుకకుండ దౌలతరావు నాకొంపఁ దీసినాఁడు. ఎనుబదియేండ్లదిమాయమ్మ జీవించియున్నది. చచ్చి చచ్చి నేనొక్కఁడను బ్రతికినాను. క్షమింపు తల్లీ' యనిప్రార్థించి యాతఁడేడ్చెను. కాని యామె వానిక్షమింపదయ్యె. నెమిలి యీకెలఁదగుల్చుకొని నెమిలినని చెప్పుకొను మాలకాకివలె శాయాజీయను పేరుబెట్టుకొని రాణికి సన్నిహితజ్ఞాతినని స్వల్పకాలము మహారాజభోగ మనుభవించి దౌలతరావుచేతిలోని కీలుబొమ్మయై దేశద్రోహకుఁ గారణుఁడైన మహారాజుగారును మన్నెసుల్తానుగారు గండాభిల్లును నేకకాలముననే యురి దీయఁబడుటకుఁ జెట్లకుఁ గట్టఁబడిరి. పాపము దుండిరావున కెంతకష్టము వచ్చినది ? దుండిరావును గండాభిల్లును నేక

కాలముననే యురిదీయఁబడిరి. వామనభట్టును క్షమియించిరాణివానిని రెం డు సంవత్సరములు చెరసాలనుంచెను. వికలాంగుఁడైన కృష్ణవంతునకుఁబ నిసేయనక్కఱలేకయే నెలకునేఁబదిరూకలు జీవితమేర్పఱచెను. కమల తమ్ముఁడగు బాజీరావునకు నెలకు ముప్పదిరూకలు జీవిత మేర్పఱచి యొక యుద్యోగ మొసఁగెను. తరువాత వెనుకటియుద్ధములలో విశ్వాసవంతు లగు వారికి బహుమానములు బిరుదులు నొసంగుచు శ్యామసుందరునకు గొత్వాలుపని యొసంగెను. తరువాత వివాహములుసేయ నిశ్చయించి ద త్తును గమలయు సమానశాఖలోఁ జేరిన శూద్రులేయని తెలిసి శుభము హూర్తమున వారిరువురకును ముక్తకును పరిత్యక్తసముద్రమును ధైర్యము ను తెప్పచేసేఁదిన జస్వంతరావునకు వివాహముచేసెను. శ్యామసుందరద త్తామన్మథసామ్రాజ్యలక్ష్మిని నాఁటికినేఁడు కన్నులకఱవుదీఱ వీక్షించు నపుడును (శరీరము శరీరముతోఁదాకి నిలుచునపుడును) వానికంటెనామె యు నామెకంటెను నతఁడును ననుభవించిన యానందమును మన్మథవ్యాపా ర పారీణులును నింమజవ్వనముననుండి (ప్రథమసంయోగము) గలవారు ను నూహించుకొందురుగాక ! అట్లు వివాహితులై కమలాశ్యామసుంద రులు మహానందముతోఁజిరకాలము సకల సౌఖ్యములు ననుభవించిరి.



# సౌందర్యతిలక.

## మొదటి ప్రకరణము.

“ భగవంతుఁడగు నారాయణుఁడు మనుష్యరూపము ధరించి ప్రత్యక్షముగ ద్వారకానగరమునుండి జగముల నేలుచుండఁగనే, నావంటి వృద్ధుల కింతపాటును మనుష్యుల కింతచేటును గల్గుచున్నదిగదా! ముందు రాఁగల యుగముయొక్క ధర్మములు మున్ముందుగ నాకే కనులకుఁ గట్టినట్లిపుడుఁ గనఁబడుచుండ వేదవ్యాసునంతటి మహాత్మునకుఁ గనఁబడకుండునా? నేఁ డుదయమునుండి నే నెవ్వరియింటికిఁ జనినను నాకు నొక కబళమన్న నయినను దొరకదయ్యె. ఇదియేమి యాఁకలియో కాని కడుపులోనున్న ప్రేవులను, మాంసమునుగూడ హరించుచున్నది. ఈ ముసలితనమునకుఁ దోడై నాయాఁకలి నన్ను బెట్టు తిప్పలు చెప్పకొందమన్న నాలకించువారెవ్వరు నీగిరివ్రజపురమునఁ గానరారు. అయ్యో! కొడుకా! నీ వెంతచేసితివి! కొడుకులనందఱ దిగమ్రింగి సంపూర్ణమయిన యాయువుతో నేనింక నెన్ని సంవత్సరములు జీవింతునోకద. దైవమా! కనులు గానక చెవులు వినరాక ప్రజలఁ బీడించుచు, దినమంతయుఁ బాచపంచకుఁ దిరిగి పట్టెఁ డోగిరమునయినఁ దెచ్చుకొనఁజాలక హేయమయిన జీవనముఁ జేయుచున్న నాకు బూర్ణాయువొసంగి ప్రజ్ఞావంతులను, సకలైశ్వర్యసంపన్నులను, శ్రేయఃకాములను నేదియో వంకఁ బెట్టి తప్పవేయునంతలో నంత మొందించెదు నీకార్యవైపరీత్యములకెవరు గారణము జెప్పఁగలరా! హా కలి! నామీఁద నీకింత నిండారు ప్రేమమేల? నాకు నేనే భారముగనుండ

నీభూమికి నీనగరమునకు నిండలి ప్రజలకు భారమని తోఁచుట యొక యాశ్చర్యముకాదు. ఎంతలేసి సంకటములు నాకు సంభవించియు, మంచు విరియునట్లు చులకనగ నెగిరిపోవును. భగవంతుఁడా! నానిమిత్తము నీవెన్ని క్రొత్తక్రొత్త దుఃఖములు నిలువవేసియున్నావో యన్నియు నొక్కసారిగ నాపై దండెత్తఁ బంపి నన్ను నీకడకుఁ గొనిపోవఁ గటాక్షింపుము. అహాహా! ఇంతపొడవును నిడివియుఁ గలిగి సకలైశ్వర్యములతో విలసిల్లు నీనగరమేమి! కుబేరునైనఁ దిరస్కరించు నీవణిక్సంఘమేమి! కైలాసపర్వతమువలెఁ గ్రొత్తగా నలఁదిన సున్నముతో నలరారు నీమేడలేమి! నాకుఁ గూడుదొరకకుండుటయేమి. నేనెచ్చటికిఁబోయిన నచ్చట లేచి పొమ్మనువారును, నీకొఱ కెవ్వరాయత్తము చేసియుంచినారనువారును, నీ యజువకు మనువారును జెయి యూరకొనలేదనువారును లోనికి రావలదనువారును గట్టిఁదీసికొని కొట్టవచ్చువారును దిట్టువారునే కాని యీముసలిదయ్యమునకుఁ బిడికెఁడు బియ్యమో పట్టెఁడన్నమో గుక్కెఁడునీరో యాదరించి యొసఁగినవారు లేరయిరి. నేయియుఁ బెరుగుఁ గమ్మని కూరలు బిండివంటలుఁ బొట్టెలు విచ్చునట్లుమెక్కి ప్రొద్దుపోక సాగిటాలో, కల్లజూదమో యాడుచు నుకరిని మిత్రులం గ్లూ[illegible] పందెములకుఁ బయిపందె మిడుచు నన్నుజూచి జాలివహించుటకు మారు వికవికనవ్వి, పీఁకుముచ్చు పీనికాఁకలి యెక్కడిది. వెడల నడువుండని సేవకులకానతిచ్చుచుండువాండ్రు నాలుకలు నాలుకలో యినుపతునకలో నే నెఱుంగను. మద్యపానమునకును గాంతాపరిష్వంగతికును బ్రాణయద్యూతమునకును నీ ప్రభువు లోకనాఁడు వ్యయముఁ జేయు ధనము నాకు రెండేండ్లు బ్రతుకఁజాలు నర్థముగదా. అహాహా! అప్పుడప్పుడే వార్చిన వెచ్చవెచ్చని గంజిలో రవంత యుప్పుఁగూడ వైచి పుల్లని యూరుగాయి నంజుకొనుచు నాకలిదీఱ నారగిం

**నేఁటికి మూఁడుదినములయినది. అయ్యో! ఆఁకలి, ఆఁకలి, దాహము.**

ఓరోరి పాపాత్ములారా! ఓరోరి పౌరులారా! నాకసువు కాలుచున్నది. పసత్రములకుఁ జనినను బోతరించియున్న బ్రాహ్మణుల నాదరించువారేకాని నాదెసఁ జూచువారు లేరేమి? మీరందఱుఁ గటికవాండ్రవలెఁ గనఁబడుచున్నారు. ఇండ్లదగ్గఱఁ గావలియుండు సేవకులు యజమానుల సెలవగుటతోడనే కనికరము దొలఁగి ఊతిమెట్లమీఁదనుండి దొర్లునట్లు నన్ను మెడఁబట్టి గెంటుటకు సాహసించిరి. ఆసమయమునఁ దగిలినదెబ్బలు నన్నింకను బాధించుచున్నవి. అయ్యో! అన్నమన్నము. నాతండ్రులారా! ఇంక నిలువఁజాల" నని యఱచుచు నొకముసలివాఁడు వాడలంబడి తిరుగుచు గిరివ్రజపురజనుల యాచించుచుండెను. అతఁడు శతవృద్ధగుట జీర్ణమయిన కాయము గలవాఁడు. శరీర మెంత జీర్ణమైయుండెనో యతఁడు దాల్చిన వలువయు నంతియ జీర్ణమై పలుచిరుఁగులు గలదై కడు మాసి దగ్గఱనుండువారల కతనిపైఁగల సహజమగు నసూయను ద్విగుణము సేయుచుండెను. వివర్ణమై మోమంతయుఁ బెక్కు ముడుతలతో నిండియుండెను. ఆసయనపటుత్వము తప్పియో, యెల్లప్పు డన్నమన్నమని యఱచుచుండుటనో వానినోరు నిరంతరముఁ దెఱచుకొని యుండుటయు రెండు సెలవులనుండియు లాలాజలము లాఁపిననాఁగక స్రవించుటయు కనుబొమ్మలమీఁది వెండ్రుకలు నయితము నరయుటయుఁ దమ పాటవము దొలఁగినందుకుఁ గన్నులు విలపించుచున్నవో యనునట్లు వానినుండి దుర్జలము దొరఁగుటయు, మొగమునకు విపరీతమైన భయంకరరూపము గల్గుటయు, నాయా కారున కాయా లక్షణము లనురూపములగునట్లు ముసలికారునకుఁ దగునట్లు వచ్చి యీతని నాశ్రయించెను. పూరింపఁబడిన గాలి యంతయుఁ బోయినవెనుక మెత్తనై యణఁగియుండు చర్మభస్త్రివలె వానిదేహము శల్యావశిష్టమై వ్రేలాడుచు రక్తమాంసక్షయమును వెల్లడిసేయుచుండెను. బహుసంవత్సరముల భారమ్ము

వహించుటచేఁ గ్రుంగెనోయనునట్లు వానినడుము నేలఁ దాఁకునట్లు వంగియుండెను. కనులకుఁ జూపు లేదు. చెవులకుఁ జక్కని వినికి లేదు. దంతములు మొదలంట నూడుటచే నాతని బోసినోటనుండి వెడలుమాట యొకపట్టున విస్పష్టముగఁ దెలియుచుండుట లేదు. దేహబలముతో నర్థబలమును, నర్థబలముతో బంధుబలమును దానితో మనోబలమును క్షయము నొందుటయు, విసుగు చిరాకు మొదలగు ముసలి చిన్నెలు వొడసూపుటయు, గిరివ్రజ నివాసులు గాంచి యతని నాదరింపరైరి. పైనుదహరింపఁబడిన తెలుఁగున నాదివమున నీ ముసలివాఁడు వీధులంబడి యఱచుచుండ నత్యంతవినోదముగ నుండికాఁబోలును గొందఱు బాలురా నిఱుపేదవెంబడిం బడి చేతినుండి యూఁతకోల దిగలాగుచుఁ దిరిపమెత్తుకొను పాత్ర నూడఁబెఱుకుచు రాల రువ్వుచు నింక బహువిధముల విసిగింపఁజొచ్చిరి. మితిమీఱి రవులుచున్న క్షుదానలంబునకుఁ గ్రోధానలంబు తోడయినతఱి వానియవస్థ యెట్లుండునో వర్ణింప నేరితరము? జరాభారమును నీరసత్వమును, బాధించు బాలకులను శిక్షలేనివారిగా నొనర్చినను దననోటిలో నేమో గొణఁగుకొనుటయు నోపిక యున్నప్పుడు స్పష్టముగాఁ దిట్టుటయు మాత్రమతఁడు మానఁడయ్యెను. కందిరీఁగలపోటున కోర్వలేక యటు నిటు విదుర్చుకొను ముసలియాలబోతు బలె నతఁడు కొందఱు నవ్వులఁ గసరికొట్టుచుండ నొకఁడు మెల్లమెల్లనచ్చి వాని చెవిలో ఘామ్మని పెద్దపెట్టున గొంతువేసెను. వృద్ధుఁ డదియేమోయని యదలి బెదరిబెదరి చూచుచుండఁ జేతనున్న దండము లాగుకొని యొక పలుగాకి వాని నిరాధారుని జేయ వాఁడును వడవడ వడఁకుచు నేలంబడి బికిరపుటన్నమున్న పాత్రయుఁ బగులఁగొట్టుకొనెను. అంతలో నొకరథముచప్పు డప్పుడు చెవిఁబడుటయు వారు తెగిన హారములోని ముత్యములవలె యథాయథలై నలుదెసలకుఁ బరుగెత్తిరి. వెంటనే సేవకు లిరువురు ముందు పరుగులిడుచువచ్చి బాట

నడుచు జనుల నొత్తిగించుచు, "లెండు. తప్పుకొనుఁడు. ప్రధానమం
త్రియగు పుష్పకేతుని కొమరుఁడు వజ్రదంతుఁ డరదము నెక్కి ప్రియు
రాలితోఁ గూడ మధుసాగరమను నుద్యానవనమున కరుగుచున్నాఁడు.
దారి యొసఁగుఁడీ" యని యఱచుచు జాఱియూఁతకోలకుఁ దడవువాని
భిన్నమగు భిక్షాపాత్రమునకు వగచువానిఁ గుజ్జులనునిందించువానిఁ
దనయవస్థకు రోదనము సేయువాని, ముసలివానిఁ దొలఁగుమని చెప్పిరి.
కాని వానిగోడవలో వాఁడుండి వీరిమాటఁ జెవి నిడఁడయ్యె. సేవకు
లాబలహీనుని బలిమిచే నీవలకు లాగఁ బ్రయత్నింపుచుండ నింతలో
నరదము సమీపించెను. ఏమియుఁ జేయునది లేక భటులు తొలఁగిరి.
అధికారగర్వముచేఁ బొతరించి రథముతోలు సూతుఁడు కనులఁ గానక
యో దయారసము లేకయో, నిలుపక రథముఁ దోలెను. నిమిష నిమి
షము దొర్లుచు నిరుసుపైఁ దిరుగు నిలువనిచక్రములతోడను నానావ
ర్ణములఁ గనులు మిఱుమిట్లు గొలుపు కాంతులతోడను జంగుచంగున
నిరాఘాటముగఁ బరుగువారు ధవళాశ్వంబులతోడను, వెలయు నార
థంబు ముసలియనడియెడమకాలిపై నుండి పోయె. సూతుఁ డెట్టి
యవినీతుఁడో కాని మునుముం దావృద్ధునిఁ దాఁ గనుంగొనకున్నను,
వానికాలిపై నరదము పోవుటఁ దెలిసినంతటనైనఁ దాను జాలిపడఁడు.
రథము నిలుపఁడు. యజమానున కావార్త విన్నవింపఁడు. యజమా
నుఁడు స్వయముగా నేల వారింపఁడందురో యాతఁడును మద్యపానమ
త్తుఁడై ప్రియురాలిపై నానుకొని ప్రపంచ మెఱుఁగక సోలుచుండెను.
ఇట్లు నారథి కనుమూయునంతలో నెంతయు దవ్వునకు రథము తోలు
కొనిపోవుటయు నీయనాథుఁడు కెవ్వున నఱచి నేల మూర్ఛిల్లెను. అతని
యొడలనున్న నాలుగు నెత్తురుచుక్కలు నాఁ డచ్చట నేలఁబడి రాజ
మార్గంబున నరుగు ప్రజకుఁ గనికరంబు గలిగించె. ఈవినోదంబు
సందర్శింప జనంబులు తండోపతండంబులుగ వచ్చి యాతనిచుట్టు

చేరి యీపాపి యింతకాల మేల జీవింపవలయుననియు, దైవము నిందార్హుఁ డనియు సూతుఁడు శిక్షార్హుఁడనియు, వజ్రదంతుఁడు కడుఁ బొగరుబోతనియు, నేలిక కది యెఱింగించినఁ దప్పక యతఁడు రథికసారథుల దండించుననియుఁ బలుకుచుఁ గాలముబుచ్చువారే కాని కాలోచితమగు చికిత్సఁ జేయ నెవ్వరు సాహసింపరైరి.



## రెండవ ప్రకరణము.



"రోహిణకా! ఎంతసేపు నీయంగడిమీఁదఁ గూర్చుండెదవు? ప్రొద్దు వ్రాలినది. నేవచ్చి చాలతడవాయినది. నాప్రియసఖి యేమని యలుకఁ బూనునో? నాకన్న నేఁడు వెనుక లాలస్యముగ వచ్చిన మాద్వార నంపితివి. బేరగాండ్ర నందఱ వెంటవెంటనే పంపి నాపట్టున నిట్లాలస్యముఁ జేసెదవేమి? ఇప్పుడేకాదు. నీ వేమిచేతనో కాని నేనెప్పుడు నీయంగడికి బేరమునకు వచ్చినను జాలసేపు నన్నిందు నిలుపక యనుపవుగదా" అని చిఱునగవు మొగము నలంకరింపఁ దలవంచి పలుకు నాగవల్లిఁ గనుఁగొని, "బాలా నీకడ నాకుఁగల చనువుచే నిన్నుఁ గొంతతడవాఁపి క్రొత్తగా వచ్చిన బేరగాండ్రఁ బ్రావలియంగళ్ళకుఁ బోవకుండ ముందు వారి నంపితిని. నిరంతరము మీ యంతిపురముననే యున్న మాయంగడి పావనంబగుట యెన్నఁడు? ఇంచుకసేపు మా యంగడిపైనుండి నీవు వాలుగంటిచూపులు మాపై, మాపూవులపై, మాయంగడిపైఁ బ్రసరింపఁజేయరాదా?" అని పూలవర్తకుఁడగు రోహిణకుఁ డాపకుచును హెచ్చరించుటయు నామె కినుకతో, "నీపలుకుల కేమి? దండల నిమ్ము. ఈయవేని వేఱొక వర్తకునియొద్దఁ గొనఁ బోయెదనుజుమా!" అని బెదరించుటకు రెండడుగు లిడియె. రోహిణకుఁ డామెచిత్త మెఱిఁగియు రా రమ్మని పిలిచి యిట్లనియె. "ఇవె జాజి

పూవుల దండలు. ఇట్టి వి మగధలో నెందును దలక్రిందుగఁ దపముఁ జేసినను నీవు తేఁజాలవు. ఇవి కమ్మసంపఁగిపూలచెండ్లు. రసికురాలవగు నీకు నేను వీని యుపయోగమును జెప్పనక్కఱలేదు. ప్రణయకలహములుగల కొన్ని దంపతు లొకరినొకరు మోదుకొను నాయుధములుగా నుండునట్లు వీనిఁ జేయించితిని. ఇట్టివి వేయువరా లిచ్చియు నీవు సంపాదింపనేరవు. ఇవె మల్లెపూవులయంగీలు. ఇవి తప్పక మీచెలివద్ద నుండఁదగినవి. నాణెముఁజూచి వెల యడుగుము. మీనిమిత్తమే వీనిఁ జేయించితిని." అని సోత్కర్షముగఁ బల్కుచున్న యవ్వణిజుని గాంచి నాగవల్లి, "ఓయమ్మ నీవుపొగడుకొనుట సహజము. తనవస్తువులు నెక్కుడుగఁ జెప్పని వర్తకు నే నెన్నఁడు నెఱుఁగ. దాసికేమి. ఒక దండయు, నొకచెండును, నొకయంగియు, నిమ్ము. వాని నింటికిఁ గొనిపోయి మా యమ్మకుఁ జూపి కావలయువాని వలయు వెల యిచ్చి తీసెద. అక్కఱలేనివాని మరలఁ దీసికొనవలయుఁజుమీ; అయినను వెల ముందుగా నిచ్చెద. ఇదిగో మూఁడుమాడలు తీసికొమ్ము" అని వానిపై నాణెములవైచి యాసరులు చేతఁబట్టుకొని నిజగృహమునకై పరుగిడుచుండెను. అంతలో రోహణకున కేదియో మాట జ్ఞప్తికి రాగ నతఁడు, "నాగవల్లీ! నాగవల్లీ!" యని పిలువ నాబాలికయు విసుగుకొనుచు వెనుకకువచ్చి, "మాటిమాటికి నిట్టి లాటంకములు కల్పించుచుందువు. నాతో నిపుడేరాజకార్యము మించిపోవుచున్నది" అని యించుక యలిగి నిలుచుండ రోహణకుఁడు మందహాసముతో, "సుందరీ! పూలచెండొకటి తేఁదలఁచి మఱొకటిచ్చితిని. ఇదె గుమగుమతావుల నెల్లదెసలకుఁ బర్వఁజేయుచున్న యీ సంపఁగిచెండు చూడుము. దీని గర్భమున నొక దివ్యకుసుమం బమర్పఁబడియున్నది. దాని నొక సిద్ధుఁ డొసఁగును నందలి తావుల నాఘ్రాణించు స్త్రీ పురుషులకు మనోరథములు కరతలామలకములని యానతిచ్చెను. అందుచే బ్రత్యేకముగ

మీ నిమిత్తమయి దీనిఁ గట్టించితిని." అని కాంచనకందుకమువలె కాంతుల వెదజల్లు నొక పూలచెండొసంగిన దానిఁ గైకొని మునుప టిదాని నారోహణమునకుఁ గ్రిమ్మఱ నొసఁగి వెడలుచుండ బేరమునకు వచ్చి నిలుచఁబడిన యొకవృద్ధాంగనయు నామెకన్న నించుక చిన్నయ గు నొక పురుషుఁడును బ్రసంగవశమున నుజ్జయినిమాట యెత్తినఁ ద నకానుడు ప్రరుచించుటచే నాగివల్లి యించుక తాళి తానేమియు నె ఱుఁగని దాని తెఱఁగున వారి పరస్పర సంభాషణముల నాలకింపఁ దొ డఁగెను.

పురు—అవును. ఈ పనుమ నే నిచటఁ లేను. ఉజ్జయినికిఁ జని నాఁడను.

స్త్రీ—వృద్ధుఁడయిన విక్రమసింహ మహారాజు కుశలముగ నున్నాఁడా?

పురు—ఆఁ, పరలోకమున.

స్త్రీ—పాపము, అతఁడు లోకాంతరమునకరిగెనా! కుమారున కుఁబట్టాభిషేకమహోత్సవము నదా? అందుల కాటంక మేమందును?

పు—అంతయు నాటంకమే! పితృవియోగముచే ఖిన్నుఁడయిన యాతని శోకమును వాసి తల్లి పాండురాజమరణానంతరమున మాద్రి యెట్లు చేసె నట్లు తనపాతివ్రత్యముఁ జూపి ద్విగుణముఁ గావించెను— తల్లిదండ్రులిద్దరి క్షణకాలముననే మృతినొందుటచే దుస్సహమైన దుఃఖవా ర్ధిఁ దాఁటలేక చిన్నరాజు రాజ్యసన్న్యాసముఁ గైకొని హిమాచలము నకరిగి తపమాచరింప నిశ్చయించుకొనెనని ప్రజలు చెప్పుకొను చున్నారు.

స్త్రీ—అట్లయిన నింకనేల సన్న్యసింపలేదు?

పురు—ఈనడుమ సింధురాజు తనదేశముపై దండు వెడలున నియుఁ గౌరవులు వానికి సహాయము వత్తురనియు విని తానీ సమయ

మున సన్యసించినఁ గౌరవులకు వెఱచి యట్లు చేసెనని లోకు లపనింద మోపుదురని జంకి యీ దండయాత్రయే మోఁచూచిన వెనుక తన సంకల్పము నెఱవేర్పఁ దలఁచుకొన్నవాఁడు.

స్త్రీ—ఇది మనయూరిలోఁ గొందఱు ప్రజలకు సంతాప హేతువే.

అని పూలదండలఁ దీసికొని యిరువురు ముచ్చటించుకొనుచుఁ బోయిరి. నాగవల్లి వారిసంభాషణలో నొక్కొక్క శబ్దము వినఁబడుచున్నకొలఁది నామె మొగముతేటలో నొక్కొక్కవన్నె తఱుగఁ జొచ్చెను.

ఆపలుకు లామెపాలికి మంత్రాక్షరములుకా నాయొయ్యారి మాంత్రికుని చేతినాడు పాముఁవలె కదలఁజాలక నిల్చి వారి ప్రసంగము ముగియుననంతరము వారిచేఁ జూడఁబడకుండ వెనువెంటఁ జని యా యిరువురయింట్లఁజూచి గుఱుతెఱిఁగి మన్మథునిచేతి యమ్ములవలె నలరుచున్న యంరుదండలతో సందిగ్ధమగు మనసుతో, విచారాతిశయముచే మందమైన నడకతో గృహమునైపు రాఁదొడఁగె. అట్లు కొంతతడవు తత్ప్రసంగాయత్తమగు చిత్తముతో నడచి, యొకచోట రాజమార్గమున వలయాకారముగఁ బలువురు పౌరులు మూఁగియుండ నాగుంపునడుమనున్న దింతఁ దానును నేత్రోత్సవముగ విలోకింపఁ నిలఁచి దండలు నలుగకుండఁ జేయి పైకెత్తి యామనుజులనడుమకు వచ్చి నిల్చెను. ఇట్లు నిల్చి కట్టెదుట బహుగుమేనితో నొక పీనుఁగుచాడ్పునఁ బడియున్న యా వృద్ధునికాలినుండి తొరఁగు రక్తముఁజూచి, మేను గగుర్పొడువ నటుచూడఁజాలక యించుక యావలిప్రక్కకు మొగముఁ ద్రిప్పి లోనుండి తనంతఁ బట్టరాని వేగముతో బయలు వెడలు జాలికి వగపునకు లోనై యామె యిట్లు విచారించెను. "కటకటా వట్టెదన్ను మడుగుకొని పొట్ట బోసికొను నీముసలి బిచ్చగానికి దైవ మిట్టి

యూపత్తుఁగూడఁ గల్పింపఁజనునా? ఇట్టి నిరుపేద కాపత్కాలమున నుపచరించిన నాపుట్టువు సార్థకమవునుగదా! కావున నాయోపినకొలఁ ది వీనికి సాయమిాయఁ బూనుకొనియెదను” అని కుడిచేతి దండల నె డమచేతఁ బుచ్చుకొని యెల్లరు తెప్పవాల్పక చూచుచుండ నాజీవచ్ఛ మును సమీపించి నాసికాపుటములకడ వ్రేలుంచి కొనయూపిరితో నాతఁ డుండుటెఱిఁగి పరుగుపరుగునఁ బొరుగింటికిఁ జని గుఱ్ఱపుగం జియుఁ గొంచెము శీతలోదకమును దెచ్చి నీటమొగముఁ దుడిచి బలి మిచే నోరు తెఱచునట్లు చేసి యందు గంజిఁ బోసి కడుపుపైఁ జేతి తో నిమురసాగెను. వాఁ డందుఁగొంత చప్పరించి త్రావి మిగిలినదా ని నుమిసి యించుకసేదదేరి యంధుఁడగుటఁ దనకుపచారమొనర్చు బా లికను దన్ను ముచ్చు సెలుగులఁబెట్టిన పలుగాకి పడుచులలో నొకరితగ భావించి, చేరుకొన్న సత్తువతో నల్లనల్లనఁ గట్టయెత్తి యోపికకొలఁది నాగవల్లిని దానితో మోఁదెను అప్పటికిఁ గొన్నిదినములకిందట నా మె కౌముదీమహోత్సవమునకు మనసుపడి తొడిగించుకొనిన వింతగాజు లాదండప్రహారమునకుఁ బొడిగాఁ జిట్లెను. తోడనే వేడుకఁజూడవ చ్చిన జనులు ముక్కున వ్రేలుంచుకొని యక్కజపడి యుపకారమున కుఁ బోవ నపకార మెదురువచ్చెనను మాట యనృతముకాదు. ఇతఁ డెన్ని కానిపనులు చేయుటచే నిట్టి దుర్దశ సంప్రాప్తమయ్యెనో. బా లా! యీ దోసకారికి నీవు పోసిన గంజి విషమై తలకెక్కినది. చచ్చి నఁ జచ్చు. నీవీవలికి రమ్ము. వీనితోనేల” అని మందలించిరి. ప్రా ణతుల్యముగఁ జూచుకొనుచున్న తనదినుసుగాజులు పగిలెననియైనఁ గోపింపక చివురుటాకువంటిమేను గట్టుతాకునఁ గందెననియైన వగవక వారిమాటలు సరకుసేయక వారితో, “మీాపలుకులు చాలింపుఁడు. వీనికాలినుండి నేలఁగాఱు రక్తబిందువులతోడ నాకన్నులనుండి వేఁడికన్నీ టిచుక్కలు గాఱుచున్నయవి. ఇంతసేపటినుండి యూఁతకొనవనితఁడు గా

నిపడుచుండఁ జూచుచు నూరకుండుటకు మీమనసు లెట్లొప్పెను? మీఁదుమిక్కిలి సాయముచేయు నన్ను వెనుకకు దిగలాగెదరేల? మీ రెఱుఁగుదురేని వైద్యుని యిల్లు నాకుఁ జూపుఁడు. లేకున్న నరుగుఁడు" అని తన నెమ్మొగమునఁ గెంపుగదుర వారిఁగసర నందొకఁ డామెను మెచ్చి, "అమ్మా! ఈమూఁడుకాళ్ళముసలి భాషించిననేమి దూషించిననేమి నీయుద్యమము సంస్తవనీయము. రాజుగారి యుద్యానవనమగు పుష్పకరండము సమీపమున ధావకుఁడను మంగలి వ్రణవైద్యమునఁ బేరుమోసినవాఁ డొకఁడు గలఁడు. అతనికడకుఁ దీసికొనిపొమ్ము" అని పలికి తనదారిం జనియెను. నాగవల్లియు ముసలివానిపాలి తల్లియై యొకబండిఁ దెప్పించి, యిరువురు మనుజుల సాయమున నం దెక్కించి, దాని ధావకునిగృహమునకుఁ దోలించుకొనిపోయి, గాయ మావైద్యునకుఁ జూపనతఁడు రెండుమాడ లిచ్చినఁగాని మందిడ ననియె. అనుడు నావజకుఁ దనహస్తము నలంకరించుచున్న విఱిసరములఁ ద్రోవంబోవు నొక వన్నెకానికి మూఁడుమాడలకు విక్రయించి, వైద్యునకును, బండివానికిని వలయుపైక మొసంగి, ధావకుని యింట నాఁగిరిఁ బుండు మానుదనుక నుంపఁదలఁచి, యాతని భోజనమునకు మఱినాలుగు మాడల నీయనొప్పుకొని యామొత్తము తనకడలేమి తన ముద్దుటుంగర మాతనివద్దఁ గుదువపెట్టెను. ధావకుఁడు వ్రణపట్టిక వైచి వెనుకఁ దన్నక్కడకుఁ గొనితెచ్చినందులకు నోటికివచ్చినట్టు లెల్లఁ దిట్టుచున్న మతిమాలిన యాముసలి నందువిడిచి జాగరూకతతో చికిత్స జేయవలయునని ధావకునితోఁ బలుమాఱు నొక్కిచెప్పి కన్నబిడ్డ నెడఁబాయు తల్లివలెఁ దద్గృహ మామె నిర్గమించి స్వస్థానముఁ జేరెను.

---

## మూఁడవ ప్రకరణము.



జయసేనుఁడు విజయసేనునకుఁ గడుఁ గూర్చెడు తనయుఁడు. విజయసేనుఁడు మగధరాజు సేనలలోఁ గొన్నిఁటి కధికారియై, రాజున కత్యంతము హితుఁడై ప్రసిద్ధి వడసిన క్షత్రియవంశ భూషణుఁడు. జయసేనుఁడు తల్లిదండ్రులకుఁ జిరకాలమున కుదయించిన నోములపంట యగుట నెంతయు గారామునఁ బెరిఁగి చిన్ననాఁట హస్తిపురమున ద్రోణాచార్యునియొద్ద విలువిద్దె నేరిచి, వేదములు వేదాంగములు కాశికా నగరమున భ్రమరేశ్వరుండను నొక సన్యాసియొద్ద నభ్యసించి తండ్రి యనుమతిఁ బెండ్లియాడఁదలఁచి చక్కఁదనంబున రతీదేవియు గుణముల దేవియు నగు తారామతిని బాణిగ్రహణము చేసికొనెను. ఆదంపతుల మోహలత పూచిన పూవుచందమున వారికి, నిరుపమానమయిన తెగువయు సౌతుగమునుం గల రాజసేనుఁడనుకొడుకు కడుముద్దుగా నుదయించి, వృద్ధులగు నవ్వారికిం దాతకుఁ బ్రొద్దులుపుచ్చు ముద్దులబొమ్మయై వర్ధిల్లుచుండెను. తండ్రి కొలుచుచున్న రాజు లక్ష్మీకటాక్ష సంపన్నుఁడయ్యు, గుణసంపన్నుఁడు కామి యెఱిఁగి జయసేనుఁ డాతని సేవింపఁదగఁడని యూరకుండెను. అయినను లావును పెంపును గల యారాచపట్టి మగఁటిమి రాజెఱిఁగి యప్పటికిఁ గొన్నిదినములక్రిందట శ్రీకృష్ణునితోఁ జరిగిన మహాయుద్ధమునఁ దనకుఁ దోడురమ్మని జయసేనుని బిలిచెను. మనసులోఁ దన కిట్టికార్య మిష్టము గాకున్నను, దనతండ్రి కాగ్రహముపుట్టునను భయముతో నా కయ్యమునకుం బోయి యాదవులెల్లఁ జెల్లాచెదరై పఱచునట్లు చేసి తన స్వామియగు జరాసంధునకు విజయముఁ గల్పించి వాసుదేవునిఁ బరాజయము నొందించెను. సకలసద్గుణరాశియని జయసేను నందఱుఁ బొగడుచుండినను, రాజును,

రాజుంబట్టి తండ్రియు, దండ్రింబట్టి తదనుచరులును, గొన్నిసమయములయందు, "మనజయసేనుఁడు సర్వవిధముల యోగ్యుఁడే కాని వానికి వాసుదేవునిపై భక్తిమెండు. అతని హృదయమునుండి యావెఱ్ఱితనమును బాఱఁదోలవలయునుడీ" యని తలంచుచుందురు.

ఒకనాఁడు జయసేనుని కుమారుఁడు రాజసేనుఁడు, సంజవేళఁ గార్యాంతరముమీఁదఁ దన మిత్రునిఁ గనఁబోవుచున్న తండ్రితోఁ బోవఁ బయనమై, యాతఁడు రా వలదని కసరఁ జిన్నమొగము చేసికొని పోవువెట్టి వెక్కి వెక్కి యేడువసాగెను. తండ్రి పోయినదిక్కు మొగముఁ గ్రిప్పి బాలకుఁడు తన్నెంద ఱూఱడించినను నూఱడక చేతికిచ్చినబొమ్మల దూరమ్మునఁ బాఱవైచి, యోదార్పవచ్చిన తల్లిచంకను నిలువక, యెవ్వరియొద్దకును బోవక మువ్వలందెలరాపిడి నేలగుబురయునట్లు కాలు నేలరాయుచుఁ గన్నుల నీరు నించుచు గుక్కవెట్టి యేడ్చుచుండెను. ఇంతలో నెటునుండియో వచ్చిన దాసి బాలుని జూసి, చనుప్రునలనఁ దనవంకకుఁ జేతులుచాఁచు రాజసేను నెత్తుకొని, కన్నీరుదుడిచి, చెమటలార్చి, తల్లిదండ్రులపై యప్పసిపాఁడు తనతోఁ జెప్పు నేరముల నాలకించి, తలవాకిటికిఁబోయి, సంజకెంజాయఁజూపి, మెల్లమెల్లఁ వ్యాపించు వెన్నెలలం జూపి, రాజవీథిపరుగు పౌరులం జూపి, తండ్రిమాట మఱపించి, వానినూరడించి, తనవద్దనున్న పొగడపూలచెండును దండయు నాడుకొమ్మని వానిముందు వైచి, క్రిందఁ గూరుచుండఁబెట్టెను. అవి కంటఁబడినతోడనే విలక్షణమైన యొకయానందము బాలుని కుదయింప వడివడి నారెంటిని జెఱియొకచేతను బట్టుకొని తాళము వాయించుచుఁ, దనముందున్న దాసిపై విసరి నవ్వుచు, గొంతసేపు నోటఁ బెట్టుకొని పంటఁ గొఱికి, యొక్కొక్కపూవు నేలరాల్చుచు, రాలినవానివంక రెప్పవాల్పక చూచుచుఁ గిలకిలనవ్వుచు, నూడిన కుసుమములఁ బట్టి పరీక్షించుచు నత్యానందకరములగు శైశవక్రీడావినోద

ములఁ దేలి తేలి యొకనిముసములో నాదండను జెంగును నూడఁబెఱికి పూలకుప్ప చేసెను. మఱికొంతసేపునకు రాజసేనుఁడు పూలకుప్పను విజ్జఁజిమ్మి దానినడుమఁ గానఁబడు ముడిఁచిన తెల్లని మొగలిరేకు నొక దానిని బైటికిఁ దీసి యిదె బూచిబూచియనుచు బెదరించుచు దాసిపై నైచెను. దాసియు బాలుని చాపలమును రెట్టించు తలఁపున జడిసి నదియుఁ బోలె వెనుక వెనుకకు జరిగి భయము నటింపుచుండఁ గుఱ్ఱఁ డును మరల మరల దానిపై రేకు వేయుఁదొడఁగెను.

రేకు కనులఁ బడినప్పుడెల్ల దాసియందలి మహిమమేమోకాని దాసికి దానిఁగైకొననలయుసను నాసక్తి యుదయింప నది మెల్లమెల్లగఁ బిల్లని బెల్లించి దానిని సంగ్రహించుకొని దీపికవద్దకుఁ జని యందులిఖి తములగు ముత్యములవంటి యక్షరములఁ జదువుకొనుచుండెను. అం తఃపురమునుండి తారామతి బాలకుని నూరడించినందులకు దాసిని మె చ్చుకొనుచువచ్చి, దాని సిప్పుపైఁ బండుకొనియున్న చిన్నికొడుకు నెత్తు కొని ముద్దాడి దానిచేతి కేతకీదళమును బుచ్చుకొని చదివి యందలి యర్థముగోచరింపమి, "నీకిట్టి యుత్తరమెక్కడిది. నీకెవ్వరువ్రాసినా రే రాజశేఖా!" అని యడుగుచు నింమిక యలుకఁబూని చీటిమగల గడమట్టు లోలోపలఁ జదువుచుండెను. అంతలో మిత్రదర్శనము చే సి సఫలమనోరథుఁడై మందహాస మొనర్చుచు జయసేనుఁడు గుమ్మ ముదాఁటి లోపలఁ బ్రవేశించెను. దాసియుఁ దారామతియు దివ్వెవం కఁ దిరిగి రేకుఁ జదువుకొనుచుఁ బరాకుననుండి యాతనిం జూడరయిరి. అట్లు సందడిలోనున్న కులకాంతను దాసిని జమత్కారార్థము జడిపింప వలయునని రాచకొమరుఁడు, చిరునగవు నగుచు వెనుకనెవచ్చి రెండు చేతులతో భార్య కనులుమూసి చెప్పవలదని దాసికిఁ గనుసన్న సేయ నింతలోఁ జంకనున్న రాజసేనుఁడు చప్పటలు చఱచి యప్పప్పయని యఱచెను.

ఆమాటలు వినఁబడుటయు దాసి వెలవెలఁబోయెను. తారామతి తెలతెలఁబోయెను. దాసి నెమ్మేను జెమర్పసాగెను. తారామతి తనువెల్ల గడగడ వడఁకఁదొడఁగెను. బాలుఁడు తనంతఁ దగ్గిచంకనుండి దిగఁజారెను. తారామతి చేతనున్న కేతకీదళ మప్పు డప్రయత్నముగ నేలరాలెను. యజమానురాలు దాసివంకయు, దాసి యజమానురాలి వంకయుఁ జూడ నారంభించిరి. ఈవిలక్షణతలఁగని జయసేనుఁడు కారణ మెఱుఁగఁజాలక, నివ్వెఱపడి యిరువుర మొగంబుల నవలోకించుచుండెను. కార్యము తప్పిపచ్చినదని సమయోచితమగు యోచనమునేసి దాసి దీపపుఁ గ్రిందనిలిచి మొగలిరేకును గాలితో నల్లనల్లనఁ దనవైపు లాగుకొనుచుండ బాలుఁ డదిచూచి "ఆ! అదినాది యదినాది" అని యఱచి యారేకుఁ గైకొనెను. తండ్రియుఁ గుమారకుని చేతినుండి చల్లగా దాని గ్రహించి చూచునప్పటి కందు ముత్తియముల కోవవలె వ్రాఁత కనఁబడియె. ఆవ్రాఁతఁ దనలోఁ దాన చదువుకొనుచుండఁ దారామతి యక్కడ నిలువక బాలునైనఁ బిలువక శయనాగారమునకుఁ జనియెను. దాసి పిలిచినది నిలిచినట్లయుండి కాఁగలదైనకృత్యమున కెదురుచూచుచుండెను. అందు లిఖింపఁబడినమాటలలో నొక్కొక్కదానిం జదువునపు డాసూరశిఖామణి యులుకయొక్కొక్కమెట్టెక్కి యుత్తరముచదువుట పూర్తియగువఱకు కాకాశమంటెను.

అనంతరము జయసేనుఁడు లేచి, రాజలేఖ నుద్దేశించి, "ఏమే దీని వృత్తాంతమేమి? దీని లిఖించినవా రెవరు? పూలదండయను నమ్మకముతో నింతకాలమును నాలోఁగిటఁ దాఁచుపామును బాలుపోసి పెంచుకొంటినిగదా! అని యించుక యోచించి తన్నుద్దేశించుకొని, "జయసేనుఁడా! నీవు నిర్హేతుకముగా వంచింపఁబడితివో భ్రాంతిమంతుఁడవై యపోహపడుచుంటివో యించుక నిర్ణయింపఁదగియున్నది సుమీ! **కవ్యసనములును, నీయనురాగములును శోధింప నిదేయదను."**

అని పలికి, తనకాళ్ళు చుట్టుకొని విడువకున్న కొడుకును విదల్చి లోనికిం జనుమని యానతిచ్చి యొక పీఠమునఁ గూరుచుండి, తల మీఁదికెత్తి చూచుచు నెడమమీసముపై నెడమచేయినైచి ద్రవ్వుచు నంతరాయములేని యోచనము సలుపఁదొడఁగెను. దాసి కొండొకసేపటికి కటుదాసి, రాజసేనునిఁ జంక నిడుకొని మందిరంబున కరిగి సంతాపతప్తయగు తారామతికి మగని నెగువమాటలు నతఁ డున్నయునికియు విన్నవించుచుండ నాపడఁతి చెప్పరాని రోసము దన్నావేశింపఁ బానుపునఁ బవ్వళించి కారణము లేక పతిమనమునకు సందియము గల్గినందులకుఁ దగ్గయుఁ బొక్కుచు నెద్దియు నుపాయముగానక, వెక్కసపడుచుండెను. ఈవల సీమగువ యవస్థయు నావల నామె మగని యవస్థయుఁ, గని రాజసఖి తనచిత్తమున నింకెం పుట్టఁగదాయని చింతిలనారంభించెను. జయసేనుఁడు కేతకీదళవృత్తాంతముఁగూర్చి దాసిని జక్కఁగా నడుగకయు, లోనికిఁజని తారామతితోఁ బ్రసంగింపకయు, నామె పూర్వచారిత్రము జ్ఞప్తికిఁ దెచ్చుకొనకయు, గాటముగ ననుమానము నెమ్మనమునఁ బూని పరితపింపఁ జొచ్చెను. ఆదినమున నెద్దియో కార్యాలోచనము సేయవలసియుండుట, రాజు విజయసేనునిఁ దన కోటకుఁ బిలిపించుకొనియె. పరిజనములు జయసేనుని యవస్థఁ జూచి దేవితోడను, దేవియవస్థఁ జూచి జయసేనునితోడను జెప్పఁబోయి కళవళపడఁ జొచ్చిరి. అనుదినమును సంజవేళ తల్లికిఁ బాదాభివందన మాచరించు వాడుకయున్న నాఁడు దేవతాపూజయు మాతృదేవతాపూజయుఁ గూడ మఱచి జయసేనుఁడు, భోజనార్థము సేవకులు పిల్చినను జనక యొక్కమొగి వితర్కసముద్రమున మునిఁగియుండె. తల్లియుఁ గుమారునియొద్దకు వచ్చి సంతాపకారణమడిగియుఁ దెలియఁజాలక భోజనమునకు రమ్మని బ్రతిమాలి నిరుత్తరుఁ డయినకొడుకుచేసి నిరాశ చేసికొని లోనికిం జని మగని దాసిని వగఁగూర్చిన కోపలివలనఁ గానమువంత

కన్న నిద్రింగలేక యీయాకస్మికమగు మార్పున కక్కజపడుచుండె ను. సతీపతులు వేడుకలనెల్లి లో మునింగినప్పుడు నిమిషములవలె జాము లు పరుగులెత్తునట్లు చేసిన కాలము నేఁటి రేయి నిముసములను జాము లుగాఁ జట్టుపట్టి వారి నలయించెను. దురంతమయిన ప్రళయకాల పు రాత్రియో యిదియని జయసేనుఁడు సందేహమందుచుండ నంత లోఁ గాముకుల చెవులకుఁ బిడుగుపాటై నాలవజామున కొక్కరో క్కో యని కుక్కుటములకూఁతవినఁబడియెను. అనంతరము రాజుకోటనై పు నుండి వేకువ జరుగు తూర్యాది మంగళధ్వనులును, వందిమాగధవై తాళికుల కైవారములును, దెల్లవాఱుటఁ దెలియఁజేసెను.



నాలుగవ ప్రకరణము.



మితిమీఱిన బిట్టులుకచేఁ గెంపుగదిరియున్న జయసేనుని ముఖ మండలమువలె సూర్యమండలము పద్మరాగ మాణిక్యముల కాంతు లు దిగంతముల వెదజల్లుచు, నుదయపర్వతముపైఁ దోఁచెను. దినాం తమునఁ దారు విడిచిపోయిన ప్రపంచమంతయుఁ బరికించుటకో యన సూర్యుఁ డుదయశైలమున నించుక మీఁదికి లేచుచుండుట జనుల కగపడఁజొచ్చెను. ఒకరాజు నేలుబడిలో నెంతయు సంతసము నొందు వారు పరరాజు లాక్రమించుతఱి ధాటికోర్వఁజాలక సుక్కుదురను నీతి లోకవిదితమగునట్లు చెంగలువలు మూతి ముడుఁచుకొనుటయుఁ, దమ్ము నేలిన స్వామి యేలుబడి వచ్చునప్పుడు ప్రజలు చెందు ప్రమో దము వర్ణింప నలవికాదని చాటునట్లు తామరపూవులు విచ్చుట యు మొదలగు చర్యలు జరుగసాగెను. పౌరులు తూరుపు రేక లాకస మునఁ బొడగట్టునప్పుడు లేచి సముచిత కర్మములు దీర్చుచుండ జయసే నుఁడు చింతానిమగ్నుఁడగుటచేఁ బ్రభాతమగుటయుఁ దెలియక, కొంత

తడవు, గవాక్షములనుండి వేఁడి కిరణములు సూదులవలెఁ జుఱుకు జుఱుకున నాతని మేనుదాఁకుటతోడనే, లేచి, ప్రాభాతికకృత్యముల నిర్వర్తించుటకు లోనికిం జనియె. పోవుచు నిద్రాభారమునను, మనోవికారమునను మొగలిరేకచ్చటవిడిచి, కొన్ని యడుగులు చనినపిదప జ్ఞప్తికివచ్చి మరల రానశ్రద్ధపొడమ, నింతలో నేమగునని లోనికరిగె. పరిచారకులు యజమానసమేతముగ ,లోననున్న యాసనమయమున జయసేనునితోఁ బనియుండి యొక పురుషుఁడు ముప్పదియేండ్ల ప్రాయపువాఁడు కవాటముదాఁటి లోనఁ బ్రవేశించి జయసేనా జయసేనా యని రెండుమాఱులు పిలిచి యాతఁడు పలుకకునికియు నెవ్వరుత్తరమీయకునికియుఁ జూచి ముహూర్తమాత్ర మచ్చట నొకపీఠమునఁ గూరుచుండె.

అతఁడు మిగుల పొడవగు మేనితో మేని పొడవునకుఁ దగిన యంగపుష్టిలేక గడకఱ్ఱలాగున నుండును. మేనికాంతి పసిమి కెక్కియు నేమికతమునో యుండవలసిన నవకముతో నుండదయ్యె. మొగము, బాల్యమున మిక్కిలి చక్కనిదని పలువురు వర్ణించిరికాని యతఁడు బాల్యమును విడిచి యౌవనమునఁ బ్రవేశించునపుడు మీసకట్టు రామిచే నేఁడిమూతి యతని లావణ్యమున నొకకొరతగ్గించెను. అంతతోఁ బోనక లోనికి దిగుకొనిపోయిన చిన్నకన్నులు వానిసొగసున కంతకు భంగము వాటిలఁజేయుటచే నాతని న్నేఁ గిట్టని కొంటెపిల్లవాండ్రు తిలాంబకుఁడని పరిహసించుచుందురు. ఇవితక్క తెక్కిన యంగసౌష్ఠవమునం దాతనికిఁ గొంత గొంతయు లేదు. నాఁడతఁడు తాల్చిన వలువలు విలువగలయవి. మెడలోని హారములును, ముంజేతుల కంకణములును, వేళ్ళనుల వజ్రపు టుంగరములును, వాని సంపదను వెల్లడిజేయకపోవు. ముఖలావణ్య విహీనమగుట వానిరూపు చందదర్శనము

లేక కేవల నక్షత్రకాంతిగల యాకాశమట్లు భూషణకాంతులచే నంతగాఁ బ్రకాశింపకుండెను. జరాసంధుని కీ పురుషునిమీఁద ప్రేమము మెండు. ఆకారణమున నితఁడు పలుపు దుండగములు కెల్ల రాజునకు వెఱది పౌరులు సహించుచుందురు. చక్కఁదన మెట్టులున్నను గుణముల నితని కీడగువా రాకాలమున నేకాలమునను లేరు. అంతిపురమున నుండు పరిచారికులఁ గూర్చియు, మంత్రి, సేనాధిపతి, లోనుగాఁగల యుద్యోగులఁ గూర్చియు, సత్కుటుంబములఁ జనియించి గౌరవమునఁ గాలక్షేపము సేయు పౌరులఁ గూర్చియు, నితఁడు రాజసన్నిధిని యథేష్టముగ నోటికివచ్చినట్లెల్లఁ బలికి యేలికకు వారి[illegible] నిగ్రహానుగ్రహములను బర్యాయమునఁ గలిగించుచుండును. [illegible] జెనువాను కీడొకటి పగవారివలనఁ బుట్టి పొక్కినప్పుడు, కల్లనిజమ్ము లరయక తానది యెఱిఁగినవాఁడపోలె రాజునకు విన్నవించి నమ్మించుచుండును. అతఁ డుపకారముసలుపునని తెలిసి నొక్కని గూర్చియుఁ జెప్పి యెఱుఁగఁడుగాని, మాపకారంపలు చేసవేలు. అతని మాటలవలనఁ [illegible] ఫురజను[illegible] [illegible]ట్టెం. ప్రపంచమున మాయలెవ్వరు ముందు బయలువడెలనో యెవ్వఁడు ముందు జనించెనో కాలనిర్ణయముసేయుటకుఁ దగిన యాధారములు గనఁబడవు. అయినను వీని కుచ్ఛితములకుఁ గపటోపాయములకు, మాయలకు మెచ్చి, జరాసంధుఁడు రత్నములకు స్థానమగు సంద్రమునకు రత్నాకరశబ్దము సార్థకమగునట్లు, మాయలకుఁ బుట్టినిల్లగువానికి మాయాకరుఁడని పేరుపెట్టుట యొప్పిదాయని యాముద్దుపేరం బిలచుచుండెను. శ్రీకృష్ణపక్షచరులందఱు వీఁడు రాక్షసాంశమునఁ బుట్టెననుకొందురు. గిరివ్రజపురమున నెవ్వఁడేమూల నేపరిహాసపుఁబనిసేయు, నెవ్వఁడేయుత్తరముల నెవ్వరికి వ్రాయు, నెవ్వఁ డెవ్వరితో నెట్టిపలుకులు

పలుకు, నవిమొల్ల నాపూఁట నీతఁడు తెలిసికొని సత్వరమే విభునకు నివేదించుటచే నితఁడు రాజునకు మూఁడవకన్నుగానుండెను.

అతఁడట్లానిర్మానుష్య మైనచోట రెండుగడియలు జయసేనుని నిమిత్తము ప్రతీక్షించి, కొంచెము యోచించి రెండుసారులు తొంగి చూచి యిటునటుఁ బరికించి, యెంతకు నాతఁడు రామికి విసిగి యటనుండి లేచిపోవ సమకట్టి యెట్టయెదుట, రాతిరియెల్ల జయసేనుని చేతనుంట, మొయికాఁకం గమలి, నలిగి, వాడియున్న మొగిలిరేకుంగని యెత్తి యందలి యక్షరములఁ జదివి చడీ చప్పుడుగాకుండ దానిఁ గత్తియొఱలోఁ బదిలపఱచి, యొక్కనిమేషమయిన నచ్చట నిలువక, వడివడిగ నడచుటలోఁ దనకుఁగల బలమంతయు వినియోగించి, తిరిగియైనఁజూడక, యిల్లుఁదాఁకెను. ఇతఁడిలుసొచ్చుటయు, నిలువెడలుటయు, నింటివా రెవ్వరెఱుఁగిరు. అంతట నాతఁడు సనిన మఱియొక గడియకు జయసేనుఁడు ప్రాతఃకాలోచితముల నిర్వర్తించుకొని యథాస్థానమునకు వచ్చి కూరుచుండి, తనకు సంతాపకారణ మగు లేఖలోని కొన్ని మాటలుజ్ఞప్తికరా మఱల దానిఁ జదువ తలఁపున రేకున కీటునటు వెదకుకొనియెను. ఎంత వెదకిన నది దొరకకపోవ నంతస్వల్పకాలములో నది యేమయియుండునని తలపోఁతలకుఁ జొచ్చి, యిట్లనుకొనియెను. "నేనీస్థలము వాయునప్పటి కిక్కడ నెవ్వరు లేరు. ఒరులు వచ్చినారనుటకు వీలులేదు. వచ్చిరనుకొనుము. వారు మాయుత్తరువులేక యిచ్చట వస్తువుల నేలఁగైకొనిపోవుదురు? కైకొనువారు కలరన్నను వారికది యెట్టి ప్రయోజనకారియగు? ఏమీ! యీయాశ్చర్యము. ఇది యుక్తిమకన్న నెక్కుడు వింతగానున్నది. తారామతియు, రాజలేఖయుఁ దమమీఁద నాకుఁగల యనుమానము మాన్పుకొనుటకు రేకు మాపుమాపఁ దలఁచి యిట్లు సేయవలయు. వారికన్న నన్యుల కీ కేతకీదళముతో నక్కఱయున్నట్లు నామతికిఁ దోఁపదు. ఈగడియయవలకేయు

త్తరమునకుఁ దారామతికినిఁ గల సంబంధ మస్తినాస్తివిచికిత్సాహేతువై యుండెను గాని మొగలిరేకు మాయమగుటవలన నాయనుమానము దీఱిపోయినది. ఈసాహసము తప్పక యీమెదియే యైయుండనోపు. ఇట్టి నెఱజాణయగు దాసి యింటనుండ నామె కట్టిపనులు కరతలామలకములగుట కేమియాశ్చర్యము? హా! తారామతీ! ఎంతపని చేసితివి? కలంక మెన్నఁడెఱుఁగని నీ పుట్టినయింటి గౌరవమును, నీకన్నతండ్రి పరువున్నైనఁ దలపోయవయితివి. ఈవల నామాట కేమిగాని పాపములలోఁ బావనుఁడగు మాతండ్రిని మావంగడమున్నైనఁ దలంపవైతివి. అచ్చుపుఁగోలములకు రెంటికి మచ్చదెచ్చితివి నీవు నామనస్సనియెడు దూది బుంగకు రగులుచున్న కొఱవివి సుమీ? నాఁటి నీ ముఖస్తోత్రములఁ దలఁచి నేఁటి యీ కేతకీదళమునందలి వాక్యములఁ దలఁప నీకడ నింత సాహసము కలదేయని సందేహమొదవును. రాచపుట్టువుపుట్టి యిట్టిచెట్టజేసిన పడఁతికి మగఁడనై యునికులు నిలుపుకొనుటకన్న యీ వాడిఁవాలున నన్ను నేఁబొడుచుకొన్న నొప్పదే. గుణసౌందర్యముల నాకన్ననిన్ను వలపించిన యవ్వీరుఁ డెవ్వఁడో యెఱుఁగనైతి. స్త్రీలసాహసములు గ్రంథములలోఁ జదువుటయుఁ బెద్దలనోట వినుటయుఁ గాని యనుభవసిద్ధముగ నెఱిఁగినవారుండరు. నీవు స్త్రీ స్వభావమును నాకనుభవసిద్ధముగ నేర్పిన గురుజనగుట నాకు వందనీయురాలవయితివి గనుక మానసిక నమస్కారము నిండారుభక్తితో నీకు నేనొనర్చెదను. ప్రత్యక్షవందన మొనర్చుటకు నీముఖము నాచి యేను భరింపనోప. హా! మాలదైవమా! జయసేనుని బ్రతుకింత యాఁబడిపోవఁ జేయుదువే. ఇంకఁ బౌరుల మొగము లెత్తియెట్లుగనుఁగొందు? మామయ్యతో నేమొగముపెట్టుకొని మాటలాడుదును? ముద్దులాఁడు రాజసేనునకు నాకు నింతటితో ఋణము దీఱెనోకో! ఏమిసేయుదు? ఎద్ది యుపాయము? అయ్యో! కేతకీదళమా! నీవు సన్నిధియుంటియు లేకుండియు నా

కలమటఁ గలిగించుచున్నావుగదా” అని వగచుచుఁ బాన్పుపై ని
రాశనొందుచు, దైవమును దూఱుచుఁ, గులకాంతను నిందించుచు,
నడుమనడుమఁ దన్నుఁ దామఱచుచు, నాఁకలి యగుటయుఁ, దప్పిగల్గు
టయుఁ, బ్రొద్దెక్కుటయు నెఱుఁగఁడయ్యెను.

అటఁ దారామతియు సజ్జపైఁ జేర్చిన మేను చేర్చినట్లెయుం
డ, కనులనుండి రాలుచున్న బాష్పములు రాలుచునెయుండ, వీడిన
కచభారము వీడినట్లెయుండ, నూరక పతిమతము తెలియక వాపోవుచు
నుండెను. ఆమె నూఱడింపఁ బలుమాఱు దాసి దగ్గఱియు నోరురాక,
దేవికంటె నెక్కువ కన్నీరు కాలువలుగట్టఁ దన తెలివిమాలినతనమునకు
జయసేనుని కారణమనియుని యలుకకు వగచుచుండెను. తారామతి
యు నొకనాఁడు దాసిమొగమునంకఁ జూచి కన్నీళ్లు నిలిపి నేనయవస్థయె
యదియు ననుభవించుట యేటికని, యిట్లని విచారించె. ప్రాణేశ్వరుఁ
డు మొగలిరేకు నాచేతఁ జూచినదిమొదలు లోనికి రాడయ్యెను. నిద్రా
హారములులేక [illegible] యనుమానము నెప్పు
[illegible]
[illegible]
విన్నవింపవలెనన్నను, నాయందట్టియనుమానము కలిగెనో, లేదో
తెలియరాదు. ఏమనుకొనుచున్నవారో, యేమి యోచించుచున్నవా
రో తెలిసికొనక మగవారియొద్దఁ జనువుగలిగిఁ గాని సంభాషించితిమేని
మానహాని వాటిల్లు. నిజము విన్నవింపకున్న హృదయేశ్వరుని మనం
బంతదవ్వుల కరుగునో యని భయము పొడముచున్నది. అయిన న
న్నేలయగు? ఇంతకాలమునుండి యామహాత్మునితోడఁగూడి కాఁపుర
ముసేయుచున్న యిల్లాలి సుగుణదుర్గుణముల నరయక మనోనిశ్చ
యముఁ జేసికొనుటకు విజయసేనుని కుమారుఁడు సామాన్యుఁడా! కట
కటా మొగలిరేకు వజ్రపుబాకువలె నాహృదయమును హృదయేశ్వరుని

హృదయమును వ్రక్కలించుచున్నది. జీవితేశ్వరుఁ డెవఁడగుచున్నను నేనైనను నిందలి నిజ మరయవలయుఁగదా" అని దాసినిఁబిలిచి, దానివెన్నుపుఁదీర్చి లాలనముతో "రాజలేఖా! ఇంతకాలమునుండి నీవు నా యంతిపురమునఁ దలలో నాలుకవలె మెలఁగుచు నెచ్చెలియో యెఱుఁగకయో పంచువంటి నా కాఁపురమునకుఁ జేతులార ముప్పు తెచ్చితివి. గిరివ్రజపురమున నీ కెవ్వరయిన మనోహరుఁడుండి యీయుత్తరము లిఖించెనా? లేక తారతమ్యమెఱుఁగక నానిమిత్త మేదోసహకారి యెవ్వఁడైన నిది యుద్దేశించెనా? ఇందలి నిజముదాఁపక నీకు నేను దల్లివంటిదాననగుట నాతోఁ జెప్పుమని" యుండలించెను. రాజలేఖ యమ్మాటలవిని గడగడ వడఁకుచు గద్గద స్వరముతోఁ గన్నీరు దేవిపవ్వళించిన పానుపుం దరుప నిట్లనియెను. "అమ్మా నేను నిక్కము దాఁపక తెలిపెదను. నేనిందే పాపమెఱుఁగను. ఇందలి సత్యమును గ్రమముగ నెఱుఁగవలయునుగాని యిది యెట్టిదని యిప్పుడు తెలుపఁజాలను. మీ పాదములాన."

## అయిదవ ప్రకరణము.



అట్లు నాగవల్లి బయలుదేరి స్వేచ్ఛముం దడ నగుటకుఁ గస చెలికత్తె చీవాట్లుపెట్టునో యని శంకించుచుఁ గమనది నడుమ నుంకించుచు రాజమార్గమునఁ దన కెదురై తెరలుచుగ వచ్చు జనుల గుంపునకుఁ దొలఁగి నిలుచుచుఁ దనతోఁ బని కలిగియో, తన్నానవాలెఱిఁగియో పలుకరించు స్వపరిచితులమాటల వినుటకు వ్యవధి గానక, సత్వరముగ నిలుచేరు నభిలాషతో నరుగుచుండఁ, దాను విక్రయించిన పూలవృత్తాంతము దన మనమునకు మఱుగుపుచ్చుకొన్న తెలుఁగువ స్ఫురణమునకు వచ్చెను. _ వచ్చుటయు నా సుందరముఖ కి కనుగవఁజాలక యిం

చుక నిలచి “హా యిదియేమి? ముసలివానిపయిఁ గలిగిన యక్కటి కము మిక్కుటమగుట నొడలెఱుఁగని సివమెత్తి పూలదండను చెండును మొగమెఱుఁగనివాని కెవనికో విక్రయించితిని. చెండునందు దివ్య కుసుమదళ మమర్పఁబడియున్నదని పూలవర్తకుఁడు నన్నుఁ బిలిచి నొక్కిపలికి దానినిచ్చెను. సాధారణమైన చెండుగదా యని విక్రయించితిని. కాని యామాట తత్సమయమున జ్ఞప్తికిరాదయ్యె. ఈమాట మాచెలికత్తెకుఁ దెలియకుండ దాఁచియుఁగునా? కాలక్రమమున నిది పొక్కకపోదు. అపుడు మాపురుషోత్తమునకు నామీఁద నలుక వొడముటయు, నీవలను నాయందుఁగలవిశ్వాసము, గౌరవము నశించుటయు సంభవించును. కావున నిజముపల్కి తప్పు నొప్పుకొని యప్పడంతి పాదములపైఁ బడుట యుచితమని తోఁచెనిని. దీనసంరక్షణమన్న మా పురుషోత్తమునకుఁ జిత్తానందకరముగదా. ఈముసలియవద యుసురుల నిలుపుటకు నేనొనర్చిన యీసాహసమునకు నన్ను నామె సైరింపదే. నా యొద్ద నా చెండు గొన్నవాఁ డెవ్వఁడో గుఱుతుపట్టఁజాల; నైన నెదకెదఁగాక” యని ముందునుండి వెనుకకును వెనుకనుండి ముందునకును రెండుసారు లావీథిం దిరిగి వానిం గనుఁగొన నేరక నిబిడమగు నెవ్వగచే నిట్టూర్పువిడిచి “దైవముపై భారముంచి యింక నిలుసేయుట మంచిదని తోఁచుచున్నది. ఇదియిట్లుండ నా చేతి ముద్దుటుంగరము గూర్చి యేమి మూఁడ నున్నదో యని జంకుచు యోచన సేయుచు మనమున సంశయించుచు నెట్టటో తనపు నింటికిఁ జేరవేయఁదొడఁగెను. ఆమె తెంపున నడచుచుండిన నామె మనస్సుమాత్ర మాప్రాంత నిలక పలుతావులఁ దిరుగుచుండుకతన నీయింతి గమ్యస్థానము మఱచి తన యిలుదాఁటి కూఁతవేటు దవ్వేగి, యచ్చట నిటు నటు నలుదెసలు పరికించిచూచి క్రొత్తక్రొత్త మేడలు, వింతవింత గోపురములు దవ కంటఁబడ నయ్యారే దారితప్పి కూడని తావులకు వచ్చితిని. ఈ యుద

యమున నేరిమొగము గనుఁగొంటినో యన్నియు సంకటములె తటస్థిం చుచున్నయవి. ఇది జరాసంధుని యింపుడుకత్తెకొమకును, రాక్షసాం శమునఁబుట్టిన దుండగీఁడును నగు రణార్ణవుని యిల్లని తోఁచుచున్నది. ములుకంపఁదవ్వులో గ్న్న సన్నచీరనలె వీని కంటఁబడిన పడుచు సిలుగు లఁ బడక యూరక సీవలకు రాదు. అదియునుఁగాక నీతఁడు మాగుణో త్తమపైఁ గన్ను వేసినాఁడు. ఇటనుండి సత్వరమ దాఁటుట కర్జము" అని తలపోసి కదలుటకు యత్నించుచుండ, నింతలో వెనుకనుండి యె వ్వఁడో చప్పటలు చఱచుచు భాగవల్లీ భాగవల్లీ కాదు కాదు, రాగవల్లీ! యిటురా, యిటురా యని పిలువఁదొడఁగెను.

ఆ నుడుగు పిడుగువలెఁ జెవులఁ బడుటయు నామె వానికడకరు గుటకిష్టములేక ముందునకు సాగిపోవుటకు ధైర్యమురాక, కదలక నిలు నంబడియుండెను. అంతలో నొక వికృతాంగుఁ డగుపురుషుఁడు వికవిక నవ్వుచువచ్చి ఓసీ త్యాగవల్లీ! పిలుచుచుండఁగనే బొంతకాకివలె నిలిచె దవేమి? ఇంతమాత్రము రాఁగూడదా మాసామి నిన్నుంబిలుచుకొని రమ్మని యానతిచ్చె. ఒక్కమాట వినిపొమ్ము. రా యని, యదరుబెద రు గొనక, యీపలుకులు ములుకులవలెనాటి స్తంభముగేవనున్న యా యన్నుం గుడిచేయి పట్టుకొని 'నిన్న నేను బెండ్లియాడునపుడు నీ కేలుద మ్మినిటులె గ్రహియింతునుజుమీ' యని లాగ, నాగవల్లి కన్నులనీరు నిం చుచుఁ దనకు సాయముసేయుమని దారింబోవువారిఁ జీరుటకునైన సత్తు వలేమి నూరకుండెను. అంతట నాసేవకుఁడు కోపముతో సహజముగఁ గాఱు నల్లఁదనముగల తనమొగము బిగఁబట్టి నీవిపుడ రావేని రావణుఁ డు దమయంతి నెత్తుకొని చన్న వితమున నిన్నెత్తి మాయజమాను స మ్ముఖమునఁ బెట్టఁగలనుజుమీ. జాగ్రత్త హస్తినాపురమున ధర్మరాజు త మ్ముఁడగుకుంభకర్ణునితో చిన్ననాఁడు దండపట్టులుపట్టి గెలిచిన పుర్వ

వక్రిని సన్నెఱుఁగవు గాఁబోలును. నడు. నడు. ప్రాణేశ్వరీ! యని య సందర్భము లగుపలుకులు పలుకుచు మందలించెను.

మద్యపానముచేతనో బుద్ధిమాంద్యముచేతనో రానిమాటలు, పురాణగాథలు, నాగవల్లి కర్థముగాక వచ్చియు రానిచిఱునగవుం దెచ్చి యామె మొగమునకు భయములో నొకవింతశృంగారము గలిగించెను. ఆ మొఱకునియాకార మెంతవికారముగనుండునో మాట యంతమోటదై యుండును. ఇంతలో లోపలనుండి వేత్రాక సేవకుఁ డరుదెంచి సర్వవక్రిని నివారించి కనుచీఁకటిగానున్న యస్త్రీకి నత్తరువున నేరు సనకుంట జూచి నిలుచున్న నాగవల్లిని సందిటంబట్టి యెత్తి గరుడుఁడు నాగకన్యను బోలె పట్టి "దింపు దింపు. నేనే యామెనెత్తికొనివచ్చెద" నని వెనుకకుదిగలాగుచున్న సర్వవక్రినిమాట సరకుగొనక లోనికింజనియె. ఐంద్రజాలికుని చేతి కీలుబొమ్మలాగున నాకొమ్మ సందిట నిమిడియుండి భయకంపితయై వానిచేతులలో మూర్ఛనొంది కనుదమ్ములు మూసికొని కాలభుజంగమంబు చాడ్పున విడి వ్రేలాడుచు నేలదాఁకు కచభారముతోఁ దన్నెఱుంగకయుండెను.

నాగవల్లి లోనికిం గొంపోవఁబడుటయు రత్నాకరుఁడు తను సన్నయొనర్చి సద్దాని యర్థమెఱిఁగి సర్వవక్రిఁడు తటాలునఁ దలుపుమూసి, తమ యనార్యకృత్య మెరులకుఁ దెలియకుండఁజేయ యత్నించె. మూర్ఛిల్లిన నాగవల్లిని రెండవసేవకుఁడు మెల్ల మెల్లగ రత్నాకరుని పడకటింటనుండిన యొక మెత్తని సెజ్జఁజేర్చి మూర్ఛదేఱునట్లు కాలోచితములగు శైత్యోపచారములు గొన్నిఁటి నెరపనెను. కొన్ని నిమిషములకాబాలిక తెలివిఁ దెచ్చుకొని కనుదమ్ములువిచ్చి చూచునప్పటికి రత్నాకరుని ముఖచంద్రమండలము కట్టెదుటఁ గానఁబడ యామె నేత్రపద్మముల ముకుళింపఁజేసెను. అనంతరము మిత్రవురు సేవకుల నావలకుఁ బొమ్మని యానతిచ్చి రత్నాకరుఁడు నాగవల్లి ప్రక్కఁజేరి తనమూలమునఁ గ్రమ్మఱ

మూర్ఛనొందునేమోయని భయమునొందుచు నొకమాఱుమీఁద. శే యిమైచి, 'బాలా, నీకింత వంతయేల' యని యేమోపలుకయత్నించుచుం డ, "అయ్యో! చచ్చితి చచ్చితి" నని బిగ్గరగ నఱచి తన్నితఁడు తుద ముట్టించునని గడగడ వడఁకి పునర్మూర్ఛావస్థ నొందెను. అంతట నా బాలుఁడు మరల నామెను మూర్ఛదేర్చి యల్లనల్లన నిట్లనియె. ఓ సుం దరీ! నాగవల్లీ! నీకు నేను కీడుసేయఁదలఁచి యిటురావింపలేదు. నీతో డఁ గొన్ని రహస్యముల ముచ్చటింపఁగోరి చిరకాలమునుండి సమయ ము నిరీక్షించుచుండ నేఁటికి శంకరుఁడు నాకు తగునదను గల్పించెను. మున్ముందుగ నిన్ను నేనిట్లు పిలిచినను నావలన నేదియో భయముదఁ లఁచి నీవు రాకుందువని యిట్లు బలిమిచే నినురావించితి. మరల సుఖ ముగ నిన్నునీచెలియకడ కనుచుభారము నాయది. వగవక నాపలుకు లాలకించి నన్ను గృతకృత్యుఁ జేయ వేఁడుచున్నవాఁడ. ఇవిచేతులుకా వు కాళ్ళనుమీ" యని హస్తపల్లవములు స్పృశించి దైన్యముతో నుడు వుచుండు, నాగవల్లి తన కాతనివలన భయకారణములేదని కన్నులు తెఱ చి యాతనిదిక్కు మొగమై యాతనిమొఱ యాలించునట్లు కనంబడియె. అంతట రణాణావుండు తన కథనిట్లు చెప్పనారంభించెను.

"పాల సంద్రమునకు లక్ష్మియు, మంచుఁగొండకు గౌరియుఁ బలెఁ జంద్రపాలునకు మున్ను నోఁచిన నోములపంటయై వొడమి యీ నాఁటి రాచపుట్టువులనెల్ల గళవళము పాలుసేయు మీ నెచ్చెలిం గూర్చి యించుక ముచ్చటించెద దయార్ద్రహృదయవై యాలకించి నామాట పలుకుల నాపలుకులుగని విన్నవింపక నీవే నీదు కులుకుముద్దుమాటల తో నించుక మేలవించి యామెతో మనవి యొనర్చి నాయెడఁ గరుణ గల్గింపవలయు. చక్కఁదనముంబట్టిచూడ మీగుణోత్తమ కీనువచ్చెడు రాచవాఁడిజగమునఁ గానరాఁడు. ఆకారణమున నెవ్వనిఁ జేకొన్న నొక్కటియేగదా! కావున నన్నుం జేసికొనినను దప్పులేదుసుమా,

నేను మిూసదుమనుండఁబట్టి యిట్లు సామాన్యునిగ నన్ను బరిగణింతురు; కాని నావంటి ధైర్యసాహసములు, సోయగమును గల క్షత్రియుఁడు లేఁడని నీవుమాత్రి మెఱుఁగవే! నాచక్కఁదనమును వేఱ వర్ణించుటకంటె పలువురు రాచకన్నియలు నాచెట్టఁబట్టఁ దపసులు ధారవోయుచు నాకీమజోషుగామి నిరాకరింపబడి రనుమాట చెప్పిన నే నెట్టివాఁడనో నీవెఱుఁగఁగలవు. సాహసమును గూర్చి యొక్కముక్క నీచెవినివే యవలయు. ఈమధ్యకాలమున మాగధ శ్రీకృష్ణులకు జరగిన కయ్యమున నేను గారణాంతరమున నూరివై పొంటరిగఁ జనుచుండ నన్ను జూచి పిఱికివై పోరువిడిచి పరుగెత్తుచున్నాఁడనియు, రణార్ణవుఁడు నేతిబీరకాయవలె లోని సారములేనివాఁడనియుఁ గిట్టని వాండ్రు పరిహసింపఁ దలఁచి నాపై వేసిన చెడువాడుక నీవు నమ్మినఁ జెప్పఁజాలనుగాని యుద్ధము వచ్చినప్పుడు పగవారిఁ బొడుచుటయో, ప్రాణములు విడుచుటయో నావనిగాని పాఱిపోవుట మాయింటి కుక్కయు నెఱుఁగదు. జయసేనుఁడు తెంపరి కళానందుఁడు పోటుమానిసి యని పక్షపాతమునఁ బాపపు లోకులు కాకులట్లు చెప్పుకొని యఱచుచుందురు. నాకు వారెందును సరిరారు. ఇంతయేల? నేను నీ వెఱుఁగనివాఁడను గాను. మిూగుణోత్తమ నాహృదయము దొంగిలించినయది. నాగవల్లీ! నీకడ నేను దాపక నిక్కము వక్కాణించెద. ఈసుందరిపై వలపు నిలుపుట మొదలు నోటికన్నముఁ గంటికిఁ గునుకు మదికి నిందువేమకయు సున్న. మాసదాశివుని యమగులాన. చూచిన సౌందర్య తిలకనే. తలఁచిన సౌందర్యతిలకనే. పలవరించిన సౌందర్యతిలకనే. వేయేల? ఆగుణోత్తమ యిల్లాలు కాదేని రణార్ణవుని ప్రాణములు నిర్హేతుకముగఁ దీసిన దోషంబు మిూచెలిం జుట్టుకొనును. ఆమెయందు నానిలిపినంత మక్కువ యెవ్వరు నిలుపరు. ఇట్టి నన్ను విడిచి కళానందునిఁ గిలానందుని గేలువట్టుట కులమునకు వన్నియఁదగ్గించుటకాదా! ఈవామెపై కారణముల వరసి యామె

మదికి వచ్చునట్లు, నితరులమీఁద యనురాగము లేచ్చుగ నామీఁది ప్రేమ హెచ్చుగఁబలికి మాసమాగమము నీవుఁ గూర్పవలయును" అని పలుక సోత్కర్షము, పరనింద ప్రధానములుగఁ జేయఁబడిన యుపన్యాసము నంతయు నాయింతి జాగరూకతతోఁ గొనముట్ట గమనించి చివచివ లేచి పానుపుపైఁ గూరుచుండి, తనప్రస్తుతావస్థకును రణార్ణవుని యాదరణకు ననువగునట్లు మృదూక్తుల నిట్లనియె.

"అన్నా! నీమనంబిట్లు మాగుణోత్తమ కారణముగ నుత్తలనుండుట మున్నెన్నఁ డెఱుఁగనైతి. నన్ను బలాత్కారముగ మీయింటికిఁ గొనిపోనిరానేల. కాకిచే వర్తమానమంప నేను నీయడుగుదమ్ముల సన్నిధికివచ్చి వ్రాలకుందునే. మానెచ్చెలి గుట్టుగుట్టు నీతోడ మనవి యొనర్పవలయునని పెక్కునాళ్ళుగ నామనమునఁ దలంపుగలదు. ప్రథమమూర్ఛనుండి తెలివిగలిగిన వెనుక నాతలంపు తెలుఁగఁజేయుట కవసరము నేఁటికివిధముగ వచ్చెఁగదా" యని సంతసించుచుంటికాని బలిమిని నన్ను రావించితివని వగచుటలేదు. నీమాటలయందలి చమత్కృతియు, యర్థగాంభీర్యమును, నీనోటనుండి వినినకొలంది నాకుఁ జెవులవిందగుచున్నది. ఆహాహా! నిజముగా నిట్టి మనోజ్ఞములగు ద్రాక్షపండ్లవంటి తీయనిమాటలు మాచెలి యొకమారు చెవులార వినిన నిన్ను విడువఁగల్గునే. చక్కఁదనమున్నయెడ సాహసౌదార్యము లుండుట యరిది. ఇవి యున్నచోట సిరియు, విద్యయు నుంట గగనకుసుమము. అన్నియునున్న గుణముకుదిరి నలువురలో మేలగి భళీ యనిపించుకొనుట యరిది. అన్నిటందక్కువ లేకయున్న నిముఁబోలు పుణ్యజనవతంసము కొఱకు నోములునోఁచిన మాచెలికి వేయిపుట్టువులకయిన లభించునే. అయినను మాచెలియు లేలినవారియెడ నసూయఁ జూపునదికాదు. మనసున మిము పాణిగ్రహణము నొనర్చుట కిచ్చగించియుఁ బ్రౌఢయగుట నది మానోట వినఁదలంచి యసూయ నప్పుడప్పుడభినయించుచుంట

జూచి వివేకనిధియగు నామెయయ్యా చంద్రపాలుఁడు బిక్షయను మో
మోట నొకమూలఁ ద్రోసి యామెంగసరి నీకేలువట్టుమని చెవి నిల్లుగట్టు
కొని పోరుచుండును. దాసినగుటచే నాకంత స్వాతంత్ర్యంబు లేమి నవస
రమగునప్పుడెల్ల నూరకుండక నాశక్తివంచన లేకుండ నాయంత నేను
గలుగఁ జేసికొనుట యుచితముకాదని మాట సాయము చేయుచుండు.
కళానందునకు నేను సాయమెట్టిదియుఁ జేయఁజాలఁజుమీ. నీవింక బెం
గగొనక మనోధైర్యముఁ జిక్కఁబట్టి యుండుము. ఆలతకూన నినువిడి
చి యన్యుని గైకొనదు."

ఈపలుకులు రణార్ణవుని మోహార్ణవమున ముంచి తాండవనృ
త్యము చేయించెనని వేఱచెప్ప నావశ్యకత లేదు. కాని క్రొత్తగా నంకు
రించిన యావేశముచే నాతఁడు లేచి నిందువేడుకచే వ్యక్తముకాని మా
టలతో నాగవల్లికి మ్రొక్కి, "వహవా! వహవా! నాగవల్లీ నాకు
నీవు తల్లివనినను దప్పులేదు. సిబ్బుణము నెన్నిపుట్టువులెత్తియుఁ దీర్పనా
తరమే. మఱవఁ దలంచిన మఱవరాని మేలు నీవు నాకొనర్చితివి. ఇంక నె
నర్పఁ దలఁచుకొంటివి. కళానందునిపై నాయిందువదన కసూయఁ గలిగిం
చుటకు నీవు జతన సేయువలయు. ఆపాపి చెడిబ్రతికినవాఁడు; నే నాగర్భ
శ్రీమంతుఁడ. వాఁడు మననగరమునకు మహాశత్రుఁడు. వాసుదేవానుచ
రుఁడు. నేను జరాసంధ పక్షపాతిని. నాకామె నొసంగక కళానందుని
వంటి మందున కర్పించుట కాకిముక్కునకు దొండపండుఁ గట్టుటకాదే.
ఇది యటుండనిమ్ము నీవు నాపక్షముదానవగుటచే నీకెఱింగించినను
దోసములేదు. పుష్పకేతుని కుమారుఁడు వజ్రదంతుఁడు మొదలగు నే
స్తకాండ్రు సాయమునఁ గొన్ని దినములలోఁ గళానందుని దుదముట్టిం
చెద. చూడు నాదెబ్బ. అంతియకాదు. అతని మిత్రుఁడగు నుజ్జయి
నీపతి విక్రమదేవునిపై మగధరాజు దండువెడలి మాళవదేశమునకు
నన్ను రాజుగాఁ జేయఁ బ్రయత్నించుచున్నాఁడు. ఈపలుకులు నీహృద

యమున నిలుపవలయుఁగాని యేరితో ననఁగూడదు. నీవీరాత్రి మా యింటనుండి నాయొసంగు నాతిథ్యము నంగీకరింపవలయు ” నన నాగవల్లి మొగము వెలవెలఁబోవఁ దనప్రియసఖి తననిమిత్త మెదురుచూచుచుండు ననియుఁ దానరుగక తప్పదనియు నెన్నెన్నో నెపములఁగల్పించి యాతని మనసు గరఁగింపఁ బ్రయత్నించియు నట్లుచేయలేక యూరకేయి తనకు రణార్ణవునివలన రాఁదలఁచిన మహోపద్రవసముద్రము నీఁదఁ దలఁచి యచ్చటఁ గూరుచుండెను.



## ఆఱవ ప్రకరణము.



మగధమహారాజగు జరాసంధుఁడు నివసించు మందిరము దక్షిగిరివ్రజపురమున నుండు మందిరముల నన్నిటఁ జంద్రపాలుని గృహమునకు సాటివచ్చునిల్లు గానఁబడదు. పొడవును నిడివియుఁ గలచుట్టుగోడలును, నాలుగుగోడలనడుమ వసంతుని విడిదియిల్లట్లు రాజిల్లుసుందరోద్యానవనమును, వనమధ్యమునఁ బాలముస్ఫటికిలోఁ దెలిదీవిచాయఁ బురజనుల కనులకుఁ బెనువిందుసేయు మేడయు మేడపైఁ జిత్రితములై నానావర్ణముల నింపుగొల్పు సాలభంజికలును నిరుపమానమైనసౌందర్యమును గిరివ్రజపురమునకుఁ దెచ్చుచుండెను. ఆమేడ మూఁడవ యంతస్తుగోడకుం గల గవాక్షములు రాజమార్గంబున కభిముఖములై యుంట గృహలక్ష్మి కన్నులు దెఱచి నగరముం జూచుచున్నదో యని తోఁచు. గృహలక్ష్మి విలాసార్థము తనువల్లిం గప్పికొనిన తెల్లని దువ్వలువ చందమయి వెల్ల కనంబడుచుండు. చంద్రశాల

యనఁబడు మూఁడవ యంతస్తునందు వ్రాయఁబడిన చిత్తరువుల సొగ సుఁజూడ నగరవాసు లనుదినము వచ్చుచుందురు. అచటి యడుగు భాగము స్ఫటిక శిలానిర్మితమయి, గృహలక్ష్మి నునుఁజెక్కుటద్దమట్లు వెలయుచుండును. ఆమేడ కలంకారముందెచ్చు చిత్తరువుల కలంకార మొసంగునదియు, గృహలక్ష్మికి నగలువెట్టి వన్నెలు దిద్దునదియు, సౌందర్యతిలకయను నామాంతరముగల గుణోత్తమ యుత్తమోత్తమమై యందు వసియించు. ఏలావణ్యసిద్ధి యుదయమగుట మొదలు తండ్రి యగు చంద్రపాలునకు నింద్రసమానవైభవులగు మహారాజులు చేతు లుమోడ్చి చేయుమనవి సనవులు నిరాకరించునంతటి గౌరవము లభి యించె. నే బంగరుబొమ్మ లావణ్యము నృపకుమారకుల హృదయస ముద్రముఁ గలఁచుఁ గవ్వపుఁ గొండయై మోహంబను నమృతం బుద యమొందు కారణమయ్యె, నే యింతి సన్నిధాన వర్తనులగుట నాగవల్లి మొదలగు దాసీజనంబునకు రాజాంతఃపురముల నింతింత యనరాని మ న్నన సంభవించె, నే మంజువాణి వీణవాయించువేళ దాసీజనంబును వేఁ డి తెలిసికొని రాచకొడుకులు ప్రచ్ఛన్న వేషులై సుధారసమొలుకుఁ పా టల నాలకించి ధన్యులగుచుందురు, నేచక్కని కూఁతుమొగము కనులనిం డఁ జూచిన దృష్టిదోషంబు ప్రాపించునను భయమునఁ దలిదండ్రులు, నెచ్చెలులు, చుట్టములు మనసారఁ జూడ వెఱతురా పూవుబోఁడి, యామె లనాఁగ, యాకనకాంగి యామేడనివసించు. నాగవల్లి పూవులదేర నలు వెడలుటమొదలు నిమిత్తము గుణోత్తమయుఁ బ్రియసఖియగు రాగల తికయు క్షణక్షణ మెదురుచూచుచుండిరి. "రోహిణకుఁడు పూవులీయక యింత తడవు మనసఖిని నిలిపెనో, యామెయే మార్గవశమున నేరయి నఁ గనఁబడిన మాటలాడుచుండెనో, దురాత్ములేవైన చెరగొనిరో" యని రాగిలతిక విషాదమొందుచు, గుణోత్తమ తత్తరపాటు నివారిం చుచుఁ జేఁతటిపడు నంతదనుక నెట్టులోప్రియసఖ వియోగమునసయిరించెను.

కాని సూర్యుఁడు పడమట సముద్రమునం గ్రుంకుటయు, వీరి మనో ధైర్యములు జంకసాగెను. చంద్రపాలుఁడు కూఁతు మనోవేదనఁ జూచి నాగవల్లిని వీథులంబడి వెదకి తోడ్కొనిరమ్మని మువ్వురు పరిచారకుల ననిచెను. తలవాకిటికి రాగలతిక మాటిమాటికిఁజని సఖివచ్చుచున్న దోయని మార్గమునఁ బోవునంగనలఁ బిలుకరించుచు మఱల నాహార్త చెలియకు విన్నవించుచు మనశ్శాంతి నొందక కాలుగాలిన పిల్లివలె నట్టును తిరుగఁ దొడఁగెను. హృదయమునకు హృదయమగు ప్రియసఖి యింతకురామి, గుణగ్రామ రాగలతికతో “ఓసీ! యింకేమనము దాని జూడ నానోచికపవచ్చును మనలఁబాసి యది యిన్నినాళ్ళుగ నెన్నఁడైన నింతతడవ పొందొక చోటఁ నుండదే! కటకటా! అది యొక్కర్తు లేకున్న నంతయు లేనట్లు లీమందిరమెంత చిన్నవోయి కాననయ్యేమనో చూడుము. అది యెక్కడఁ జూచిన నక్కడనేయుండి చిలుకలఁ గూయించుచుండు గొదమ కోయిలల బెదరించుచుండు మనల నవ్వించుచుండు నన్నిపనులం జక్కఁ బెట్టుచుండు. అది పదుగురుపెట్టుగదమ్మా అయ్యో! దాని నింక నెటఁజూతు రాగలతికా! యని వాపోవుచు నుత్ఫుల్లపుండరీకముల చాడ్పుననున్న కన్నుఁగవనుండి నిల్లి దొరఁగ నెజ్జపు మేనువాల్చెను. రాగలతిక యనురాగము నందుకొని కొంతయాలాపముసేసి తనచేత నైనంత కన్నీరు సఖిచిత్తము విడిచి కొండొకసేపటికి నెచ్చెలి నూఱడించి కన్నీరు చీరచెఱఁగునఁ దుడిచి మరలఁ దలవాకిట నిలిచె. అంతటఁ గొన్ని నిమిషములకు రాగలతికచూచు దిక్కునుండిగాక యొండొకవైపు నుండి గమనవేగము సూచించు చెమ్మటతోడ నొకతె మువచ్చి యామె యెదుట నిలిచెను. రాగలతిక యాపడఁతి నెమ్మొగముఁ గనుంగొని “నాగవల్లీ! నాగవల్లీ” యని యఱచి “ఓసీ, నీవు జీవముతోనున్నావే. నిన్నెన్నఁడో చూచినట్లున్నదిసుమీ. నీనిమిత్తము మనగుణవృత్తమారిత్రము పొందుతల్లిరము పల్లింపఁ దలముతాడు. అయ్యో! నన్ను నీ

వొక్కసారి బిగ్గఁగౌఁగిలించుకొని నామనస్సంతాపము మాన్పవే" యని యాలింగనము చేసికొని, దానిరాక యెఱిఁగి సత్వరమె మేడమీఁదికి రమ్మని పిలుచు గుణోత్తమను జూడ, సౌధముమీఁదికిఁ దీసికొనిపోయెను. నాగవల్లియు గుణోత్తమఁ గనుంగొని కంటనీరు పెట్టుకొని "అమ్మా మిమ్ము నందఱఁ జూచుభాగ్యము మరల సంభవించునని నేననుకొననైతి. ఈ వేళ నెట్టిదుశ్శకునము నాకయ్యెనో చచ్చి క్రిమ్మఱఁ దల్లికడుపునఁ బుట్టితిఁ జుడీ" యనియంగలార్చుచుఁ జెప్ప నాయిరువురు దద్వృత్తాంతము నెఱిఁగింపుమని యడుగుటయు నాగవల్లియుఁ దా నిల్లువెడలి రోహణుని పూలయంగడి కరుగుట మొదలుగ నిలుసేరునందాఁకఁగల కథఁ దనవాక్చమత్కృతితో రసపుష్టి చేసి కవి కావ్యమునకువన్నె పెట్టునట్లు దానికందము దెచ్చి వినువారికి విసుపుపుట్టకుండఁ జెప్పెను. సౌందర్యతిలకయు రాగలతికయు నావృత్తాంతము విని కరుణాద్భుతరసముల మునిఁగి మనచెలి సాహసమునకు మెచ్చుకొని రణార్ణవుని బారినుండి తప్పించుకొన్నందులకు నదృష్టవంతురాలవని దాని సంభావించిరి. అనంతరము నాగవల్లి చేతులు జోడించి యా జవ్వని యెదుటనిలిచి "నన్ను క్షమియించి మీరు రక్షింపవలసినదని వేఁడుకొన నక్కఱలేదు. చిన్ననాఁట నీవునాకు మక్కువమీఱఁ జిటికెనవ్రేల నిడిన యుంగరము గుదువఁబెట్టి మనలివాని యుసురులు గాపాడితిని. అదిగాక రణార్ణవుని బెండ్లియాడునట్లు నిన్నొడంబఱతునని వాగ్దానము చేసివచ్చితి.

ప్రాణభీతినాడిన కల్లగావున క్షమింపబడఁదగినది. అమ్మా! ఆ రణార్ణవునికి జడిసియుంటకన్న వానికడనున్న సాకేతనాముఁడగు సర్వభక్షుఁడను వానికి నా పడిన భయ మింతింత యనరానిది. నాయసురు తగిలి రణార్ణవుని వంశ మెన్నఁడు నిర్మూలమగునో! ఒక్కగడియ నాపడిన మనక్షోభంబె వానికులాంతమునకుం జాలు. వానిసేవకుఁడేమమ్మా! అమవసచీఁకటికన్నఁ గారునలుపువాఁడు. ముందున కెదిగివచ్చిన మిట్టపండ్లు

వాఁడు. మీఁదుమిక్కిలి మతిలేనివాఁడు. కొంకిబికివేసంబువాఁడు. మిడిగు డ్డవాఁడు. పగలుచూచిన రాత్రికి కలలోనికివచ్చు. నీవొక్కసారి వాని మోముగన్న నాఁటిమాసము లన్నము రోఁతచే ముట్టవు సుమీ! ఇది యతి త్రిశయోక్తి కాదు. వానిగుణరూపాదులు వర్ణింప నా నేర్పుపలుకులు చాలకునికి నేనట్లిట్లో యిట్లు రవిదీపన్యాయముగ వర్ణించితిని. రణార్ణవుని చర్యల నాలకించియే యుంటివి. కళానందాదులు మూర్ఖులఁట. తాను క్కఁడ నీహృదయేశ్వరుఁడగుటకర్హుఁడఁట. చెప్పనేటికి? వానిచిన్నెలన్నియు విని తీరవలయును. పిదప నన్నిరేయి తనయింట నుండుమని చాల నొక్కిచెప్ప రావణునిలంకనున్న జానకివిధముననే మంచముమీఁద నిలిచి ట్టులుండి వానిని గడునమ్మించి యాతఁ డారగింప లోనికిం జనునప్పుడు నాకడ కావలియున్న మందుఁడగుపర్వతకుని కెద్దియో పనిఁ గల్పించి యూరలకుం బనిచి చప్పుడు గాకుండ పెరటితలుపుం దెఱచి యూరలంబడి మెల్ల మెల్ల నిలు సేరుకొంటి. అని తనచరిత్రము ముగింపఁబోయి మరలనేదియో స్ఫురణకురాఁ జంకుచు నల్లనల్లన నిట్లనియె—"అమ్మా! ముద్దుటుంగరము కుదువబెట్టుటకన్న, నాడరాని కల్లలాడుటకన్న నెక్కుడు నేరంబు నేఁడు సేసితి. కొంతవెఱచియుఁ గొంతమఱచియు నింతదనుక దానిం జెప్పక యూరకొంటి. రోహణకునొద్దఁ దీసికొని ముసలవాని నిమిత్తము విక్రయించిన పూలచెండులో నొక దివ్యకుసుమంబుగలదనియు నద్దాని ధరియించినవారికి మనోరథసిద్ధి కరతలామలక మగునని యు నీకుదానినిమ్మనియుఁ బలుమాఱు చెప్పి నా కతఁడొసఁగె. ముసలివానిపైఁ బ్రేమంజేసి నీమాటమఱచి యద్దానిని మొగమెఱుఁగనివాని కొకనికి విక్రయించి నీకుఁ గడునపకార మొనర్చితి."

అని నాగవల్లి తన యొనర్చిన తప్పు నొప్పుకొని, పూలమాలికకు నగచుచు నరుణచరణ పల్లవములకడ దిగులు దెలుపు ముఖమై ఖరితోఁ గూరుచుండె. అములయప్రి గుణానుభవులు చెవులఁ జొచ్చుటయు,

రాగలతిక యదరిపడి లేచి, అయ్యో! నాగవల్లీ! యెంతపనిచేసితివే. నీసలిపిన యీయవివేకపుంబనికతమున, శాశ్వతమైన యుపకారము మనకు మనవారికిఁ బ్రాపించెదునని నాకు నడలు వొడముచున్నది. నీకింత యొడలెఱుఁగని శివ మేల యెత్తెనే? తనకుమాలిన ధర్మము మొదలు చెడిన బేరము నెరవువెంగలి నిన్నొకదానినిఁ గాంచితి. ఆపాపమునసలి దయ్య మెక్కడ దాఁపురమయ్యె? అయ్యయో యెన్నినోములునోచియు నెన్నిజన్మములనెత్తియు నెందఱ నుపాసించియు దివ్యకుసుమంబు నందుకొన నేరికిం దరమగునే? అట్టిది మన పూర్వసుకృతవిశేషమున స్వయంప్రాప్తముగా సిరిరా మోకాలొడ్డినతీరున చేతులారఁ దానిని గంగపాలుచేసినట్లు పోగొట్టితివి. నీవు తలక్రిందుగఁ దపముచేసి యట్టికుసుమ మొకటి గ్రమ్మఱ సంగ్రహింపఁ గలవే? నీమదికి యోచన మేలట్టుక పోవలయు? నీకడఁ బైకమున్న దానధర్మముల నిర్వర్తింపఁ దగుఁగాని పరులసొమ్ము విక్రయించి యనదల రక్షించుట యుచితేతరము. దాసివై యొడలు దాఁచుకొనక పనిచేసి పొట్టపోసికొను నీవంటి దానికిఁ దలకుఁ దగనిబరువులు బూనుకొనుట కేవలము నింద్యముకాదా? యజమానురాలికార్యము చక్కఁజేయుటకు మాఱు చక్కఁబడినదానిని భంగముచేసిన నీసాహస మెట్టిదియో నేనూహింపఁజాలఁ. మనము దాసీజనమనుమాట మఱచి యజమానుల మనుకొంటివో! మన మెంత, మన మనికియెంత, మనయునికియెంత! యింతనుండి జాగ్రత్తగ నడుచుకొనుము. ఇది నీమేలునిమిత్తమే నుడివితిఁగాని నానిమిత్తముగా దలఁపకుమీ, చెలీ, యని నెఱకులు నడలఁజేయు శూలములవంటి వాగ్జాలములతోఁ దలవాచునట్లు నాగవల్లిని జీవాట్లుపెట్టెను. స్వయంకృతాపరాధమున నోరెత్తఁజాలక సిగ్గునఁ దలయెత్తనోపక రాగలతికనోటనుండి వెలువడు వాగ్బాణములు ప్రాణములు దీయుచుండ నాగవల్లి తన చెఱుదాఁటినపనికిఁ బశ్చాత్తాపమొందుచు మనోగత

దుఃఖమును గన్నీటఁ దెలియఁజేయసాఁగెను. అట్లు పెనుఁగినుక నెత్తిని మొగమునుగల యారాగలతికను బెదురుగపున దీనవదనమైన నాగవల్లిని జెంగలువయుఁ నల్లగలువయుఁబోలె నలయఁ దనయొక్కొక కంటఁజూచి గుణోత్తమ యలుకమూనుమని రాగలతికకుఁ గనుసన్నయొనర్చి రెం డ్రసమయములనైనఁ గలకల వెన్నెలలుగాయు నాగవల్లి మొగమిట్లు మితి లేని జాలిగొల్పుటచే మనసుకరఁగి యిట్లనియె.

"ఓసీ! రాగలతికా! నాకడ దానికెంగల చనువునుబట్టియో, పారమార్థిక చింతనో, చేసిన యీనాగవల్లి యవివేకముపకుఁ గసరి నేలకి ధర్మకార్యము నెఱపువారు తమ్ము దామెఱుఁగక సంచరింతురు. నాగవల్లి జాలిగుండెగలయది గావున దానిమనస్సు వృక్షసంరక్షణమునందే నిలిచి పూలచెండుపై, నందలి దివ్యకుసుమంబుపై నరుగదయ్యె. మఱి యెంత మహీపావంతులకయినను సహాజమట్టి దో బేలయగు మన నాగవల్లికిఁ గల్గుట యేమియక్కజము! మనఃపూర్వకముగాఁ జేయవలయునని చేసినపనికాదు నీతప్పు సైరింపఁబడఁదగినయది. ధర్మకార్యార్థము పుణ్యపురుషులు, స్త్రీలు, సర్వమహీరాజ్యమును, దారపుత్రాదులను, బతిసుతాదులను, వేయేల యవసరంబగుచుఁ దమ ప్రాణములఁ గూడ నిశ్చింతతో నర్పించుచుండ, నొకచిన్న దివ్యకుసుమమును, బరోపకారార్థము వినియోగించి తనకును దనయజమానురాలనగు నాకుఁగూడ మంచిపేరు దెచ్చిన దీని నేమనుటకు నాకు నోరు రాకున్నది. దైవికము లొక్కొక్కయప్పుడు కొండలవంటి విపత్తుల సంఘటించునట్లగపడి యుదకు నొంతయు మేలొడఁగూర్చుచుండు. ఇయ్యదియు దైవికము కాన నేమిమేలుకానున్నదో తెలియఁ జాలము"

ఈమాట లనియెడు తేటపేటినోనలు వెలువడ నాగవల్లి, మును రాగలతిక పలుకులుకులఁ జెందిన మనోదైన్యము ముజ్జనసేసి తెలివి నొంది తనకిఁక భయము నొందవలసినకారణము లేదని కినుకఁ జూపిన

సహచారిణికిని, గరుణఁజూపిన యజమానురాలికి నిట్లని విన్నవించె. "నా సలిపినది యవివేకపుఁ బనియని నే నెఱుఁగుదు. యజమానురాలికపకారంబు దీసఁబుట్టుననియు గుదు. నెఱుఁ ఆదిక్కుమాలినవానిపై నాకాపాముజాలి యుదయింప విహ్వలచిత్తముతో నేనంతపనిచేసిన యనంతరము నాకాదివ్యకుసుమంబుమాట జ్ఞప్తికివచ్చె. నాయవివేకము, నాకలుగఁజేసికొన్న లేనిపోని స్వాతంత్ర్యము, మీరుపెట్టిన చీవాట్లకన్న మిన్నగ నామనసుఁ గాల్చుచున్నయవి. అయినను నాచేతులార నేఁబోఁగొట్టితిఁ గావునఁ దద్విషయమై నాయెడనప్రీతి నాలకింపుఁడు. ఆ దివ్యకుసుమంబు మనసీదినప్రీజంబున నెట్టియెట్టి సామంతునిచేతఁ జిక్కినఁ జిక్కనిమ్ము. ఎవ్వరియింట నేయంతిపురమున నేమూలమూలనుండిన నుండనిమ్ము. నే నీనగరియ మొద లహోరాత్రములు కన్నునిండ నిదురింపక, కడుపునిండ గుడువక, పుర నెల్లమూలలు గాలించి వెదకి యాకుసుమము మరల నీకుసమర్పించుదానను. ఇట్లు నెఱవేర్చనైతినేని నీమొగము మరలఁ జూచుదానంగాను. నాకాఱుమాసము లీయుత్కృష్టకార్యమునకు గడువు దయసేయుము. ఈకాలంబున నాయందు నీనగరమునందు నీవెట్టిచరిత్రములఁ గనివినియెదవో నేనిపుడుచెప్పనోప."

అని రోసమునఁబలుక దంచెలికత్తెయలిరువురు, గనుమూయుక యామెవంకఁ జూచుచు నిదియెంతికయిన సాహసురాలేయని తమలోననుకొనిరి. అంతఁగుసుమ యాపలుకులకు సంతసించి సిద్ధదత్తమైన దివ్యకుసుమంబు తప్పక దొరుకునని యెంచుక యూసవోడమ నాగవల్లితో సఖీ! నాకిప్పుడు మనసార యూపిరిపుచ్చుకొన్నట్లున్నది. నీమనసు చిన్నబోవునేమోయని నేనింతదనుకఁ గొంతగాంభీర్యముం దెచ్చిపెట్టుకొని యిటులుంటినిగాని నిజముజెప్పవలసినదేని నాహృదయమెంతయు మఱుఁగుమండిపడు యొప్పుకొనకతప్పదు. ఏమహాత్ముఁడు దయాంతస్సైకచిత్తమున దానినొసఁగెనో యెట్టికార్యములు దానిసాయమున

సవలీలసిద్ధింపఁగలవో యయ్యది యుండిన సాటి రాచకూఁతులలో నే నెంతటిధన్యనగుదునోగదా! అట్టివన్నియు నీశ్వరేచ్ఛ భగ్నమొుందినవని నిర్విణ్ణహృదయనై యుండి నీమనసు నొవ్వనాడఁజాలక యూరకుంటి. నీకెంత రోసమును బూనికయుఁ గల్గినవి కావున నేఁగినపని నెప్పనంతురాలవని యెన్నుకొనుచుంటి. నీకాఱునెలల గడువుకాదు. రెండాఱునెలల గడువైననొసంగుదు. కార్యసాఫల్యముఁ జేయవలయు. ఇది క్రమ్మఱలభించునేని నీవు నాకుఁగాదుకాని నేను నీకాజన్మాంతము పరిచారికనై యుండెదనని చెఱుఁగవుఁగుచుఁ బల్కి మీఁదఁజేయివైచి నిమిరి "యింకనిదురింపఁ బొమ్మా. పాపము నీపదినములఁ గనుఁదప్పి చన్ను చెదరియుంటివి. నేయి చాలగడచుట నాకునిద్రాభారమున నావులింతలు మెండుగవచ్చుచున్నవి. రాగలతికా నీవుంబన్నుండవే" యని మెల్లమెల్ల మల్లెపూవు సెజ్జపై మేనువాల్చె. రాగలతికయు జరిగినవృత్తాంతమంతయుఁ దలఁచుకొనుచుఁ గొంతసేపు తదేకధ్యానమున నిదురరాక పాన్పుపైఁబొరలుచుఁ దుదకు నిదురించె. నాగవల్లి తననెయ్యురాండ్రిరువురు నిదురించువఱకుఁ దానుఁగూడ మంచముపైఁబన్నుండి నిద్రనభినయించి వారుగుఱ్ఱుపెట్టిన నెంటనే నిద్రచాలించి మంచముమీఁదఁ గూరుచుండి చెక్కిటఁ జేయిచేర్చి తనలో నిట్లని విచారింపఁబోచ్చె. "ఈదివ్యకుసుమంబు నే మరలసంపాదింపఁజాలనేని కార్యభంగంబుజేసిన యపనింద నామీఁద నాచంద్రార్కము నిలుచును. అందెట్టిరహస్యముఁ లున్నయవియో! ఆయంశము లన్యజనము లెఱుఁగఁదగినవో కావో! అవి యెఱుఁగఁదగనివేని నాకతమున నెంతలాపదలైన వాటిల్లు. సిద్ధుఁడొసఁగినది సాధారణమైనదయి యుండదుకదా? హా! మాలదైవమా! నాకెంతమనఃక్షోభముల దెచ్చిపెట్టితివి? అయిన వివాహించినగార్యమేమి? నానెఱజాణతనమిందుఁ బరులకుఁజూపి యీదివ్యకుసుమమును దొంగకు దొంగనై సంగ్రహించెద. ఎవఁడు

దానిని మూచెలినిమిత్త మొసఁగె వాని పేరరసి కనుఁగొని, యెవ్వఁడు పూలచెండులో నిమిడ్చె వానివృత్తాంతముఁ దెలిసి, యెవఁడు నావద్దఁ బువ్వులుగొనియె వానిగుఱుతుపట్టు విచారించి యెవనికడ నిప్పుడదియుండు వానియిల్లుత్రివ్వి యందలిహృదయములఁ జిచ్చువెట్టి కాల్చి యాజరాసంధుని రాజధాని నొకకడకుఁ దెచ్చి విడుతు. నాయంతమదియో, దానియంతయు నేనో కనుఁగొనవలయు. పూలచెండులో దివ్యకుసుమమమర్చినవాఁడు రోహిణాకుఁడగుటచే దీనియర్థమాతనినడుగఁ దెలుపవలయు. తరువాతి నాతనిశిరో ముచ్ఛేదింపనగు" నని క్రొండొకసేపు విమర్శించి మనఃక్షోభము గనబడకుండఁ జేయుచునంతటివేగముతో వచ్చుచున్న నిద్రికిలోనై కనులుమూసికొని పండుకొనియె.



## ఏడవ ప్రకరణము.



వెనుకటిప్రకరణమునందు వర్ణింపఁబడిన యంశములు జరిగిన కొన్నినాళ్ళకుఁ దరువాత నొకనాఁడు, సాయంకాలమున, నమూల్యాభరణములు విలువలేని వలువలు మేనఁదాల్చి, శుభలక్షణముల ముద్దులమూటగట్టు పారశీకహయము నెక్కి యొకపురుషుఁడు రాజాంతఃపురమునకై పరుగు మిందెను. ఆతనిఁజూచి వీధియరుగులపయిఁ గూరుచుండువారందఱు లేచి జోహారొనర్చి వినయముగ నెదుర నెలవుగైకొనిపోవు నాతఁడు దాఁటి చన్నపిదప "రాజపుత్రుఁడు కోటకుఁ జనుచున్నవాఁడు. నేఁడెవ్వని మాయువు మూఁడినదో గదా" యని తమలో రహస్యముగఁ జెప్పుకొనసాగిరి.

ఆబాటసరుగుపోయి లాయూశ్వికునిఁ గని యొత్తిగిల్లి భయముతో డారియొసంగుచుండ నాతని కెదురైన మంత్రిసామంతాదులగు నుద్యోగులు సామాన్యులట్ల తమతమ యాసనములు, గుఱ్ఱములు దూరమున

నిల్పి యాతఁడు చన్నవిధమ సాగిపోఁదొడఁగెను. ఇట్లు కొంతదవ్వరిగి రాజాంతఃపుర సమీపమునకుఁ జని క్రొత్తగా నలఁదఁబడిన సుధావిభూతితో, నందము మీఱి యౌన్నత్యమున, ధావళ్యమున, హిమాలయమును మఱపించు నొకమేడముందటఁ దనగుఱ్ఱము నాపి మెల్లనదిగి, మహారాజదర్శనార్థము మనకు సమయమగునా కాదా యని కావలివాండ్రి విచారింపకయ మేడమీఁదికరుగ మెట్లెక్కఁదొడఁగెను. రాజభటులెక్కడివారక్కడఁ దొలఁగి యూరకుండిరి. ఈపురుషునకు రాజునొద్దగాంతఃపురమునందుఁగల స్వాతంత్ర్యము, చనవు నెల్లవారెఱిఁగినగుట నెవ్వరు నాతని నేమనరాఁదరు. అట్లు మెలమెల్ల మెట్లన్నియు నెక్కి యంతస్సువెనుక నంతస్సుదాఁటి కడమేడమీఁద స్ఫటిక శిలావినిర్మితమై తనప్రతిబింబము గనఁజేయు నొకచోట నించుక నిలిచి యరమూయఁబడిన తలుపుసందునుండి లోనికిఁ దొంగిచూచి మహారాజు ప్రధానులలో నొకనితో రహస్యము మాటలాడుట యెఱిఁగి యది యవసరముగాదని శంకింపక తలుపులఁ ద్రోసికొని గుభాలున లోనికిం జనియె.

చని సవినయసంభ్రమచిత్తంబుతో కరములుమోడ్చి కట్టెదుట, నున్నతపీఠముపై సుఖాసీనుఁడై యున్న జరాసంధుని చరణరాజీవములకు మ్రొక్కి యవి కన్నులనద్దుకొనియెను. పాదములపైనున్న రత్నార్ణవుని లేవనెత్తి జరాసంధుఁడు తనప్రక్క నొకపీఠముపైఁ గూరుచుండ నియమించి యెద్దియో కార్యవిశేషమున నాతఁడువచ్చుట యెఱిఁగి మంత్రికి సత్వరము సెలవొసంగెను. అనంతరము రత్నార్ణవునిఁ గుశలమడిగి రాజు పురవార్తల వినఁ గుతూహలము నొందుచున్నట్లు ముఖవైఖరి తెలుపుటయు వారిరువురు నిట్లు ముచ్చటించిరి.

జరా—కుమారా! గిరివ్రజమున జరుగుచరిత్రములన్నిటిఁ జూపునట్టి నిలువుటద్దమువై నీవు నాకడనుండఁబట్టియే యింతనిర్విచారముగా నేనీమహీభారమును వహించుచున్నాఁడను. నగరమునఁ గ్రొ

త్తగఁ గొఁదఱు వాసుదేవానుచరులు బయలుదేరుచున్నారు. వారి నిర్మూలించుట మనకు మొదటిపనిగదా.

రణా—దేవరవారియనుగ్రహము నాపయిఁ గలుగ నేను స్వామికార్యమున నప్రమత్తుఁడనై యుండి వాసుదేవానుచరులపయిఁ జిచ్చు అపిమగులాగునఁబడి, కొంకటివేళ్ళతో వారినందఱుమొందించెద.

జరా—ఇప్పుడేపయిన వింతల విన్నవింప వచ్చితివా? యీరిక చూడ నరుదెంచితివా?

రణా—నిమిత్తములేక యిట్టివేళల రణాగ్నివ్రుఁ డెన్నఁడేని మిముదర్శింపవచ్చునే? మునుపటివానికన్న నెక్కుడు చిత్రమైనదియు, ముఖ్యమైనదియు, ముందుగా విచారింపఁ దగినదియు, నగునొక యంశమున్నది. నాకు మూఁడునాళ్ళక్రిందట మొగలిరేకుపై లిఖింపఁబడిన యుత్తరమొకటి చేఁజిక్కినది.

జరా—కుమారా! ముందుగా లేఖ ననుఁజూడనిమ్ము. నామనసు తత్తరపడుచున్నది.

రణా—అయ్యా, నేనే యీలేఖను జదువువాఁడ తాము వాక్యసందర్భములను, దానియందలి యంశములను జక్కఁగాఁ బరిశీలింపుడు. చదువుచున్నానిదిగో వినుండి.

"త్రిలోకసుందరీ! నాఁడు గోరువంక నిమిత్తము నిన్నుఁగలసికొని నీముఖారవిందము గనుగొనుటమొదలు నాహృదయము నిన్ను విడువదు. నీకును నాపైఁగరుణ యుంచుక కలదని కర్ణాకర్ణిం బలుమారు వినియున్నందున విదేశమునఁదుండియు మును ముందు నేను నీకు లేఖ నంప సాహసించితి.. మనసమాగమము సర్వవిధముల నసంభావ్యమని తోఁచెడు. ఈకార్యసంఘటనమునకుఁ జమీా యేసిట్లు వెడలి నామిత్రుఁడును, నీకు సర్వదా మేలుగోరువాఁడు నగు నొకపుణ్యపురుషుని సందర్శింపవచ్చితి"

జరా — ఇది కేవలము కాముకవ్యాపారముగ నున్నది. ఇందు దేశింపఁబడిన యంగన యొకని యిల్లాలో, కన్యయో తెలియరాదు.

రణా — దేవా! ముచ్చటయింతయు ముందున్నది. ఉత్తరము నందలి మిగిలినభాగముకూడఁ దమరు చిత్తగింపవలయు.

"భర్తా, మరణమునొందు నుపాయము నన్వేషించుటలో నీ దాసుఁడు మెలఁకువగ వర్తించుచున్నాఁడు. మన రాజ్యలక్ష్మికి వైధవ్యమును, మనకు కళ్యాణమును నేకముహూర్తమునందె యయ్యెడునని నాకుఁబొడకట్టుచున్నది. ఊరక బేలవై చింతింపవలదుసుమీ?" అని యుత్తరమందున్నది.

జాబులోనున్న కొదువ మాటల వినునప్పటికన్న నీకడపటి వాక్యములు వినినప్పుడు జరాసంధుని ముఖము జేవురించి యెల్లప్పుడు చూచు రణార్ణవునికే మది నతిభీతిగొలుపఁ జొచ్చెను.

వజ్రపంజరముచాడ్పున నతిదృఢమై యాయుధదుర్భేద్యమగు తన నెమ్మొగము బిట్టులుకఁ గంపింపఁ బటపట పండ్లుగీటుచు "ఛే. ఛే. దురాత్ములారా రాజద్రోహులగు మీకులకాంతలు, వైధవ్యము వహింపకమున్నె మీరందఱు యమగృహమునకు నతిథులుగఁ జనకమున్నె సర్వధాత్రీ చక్రమునఁగల రాజచక్ర మట్టుడికినట్టుకకమున్న రాజపురు గనుపేరుగూడ నశియింపకమున్న మగధరాజ్యలక్ష్మికి వైధవ్యము ప్రాపించునే! రణార్ణవా యీకేతకిదశ మే దురాత్ముని యింట నెవనిచేత నెన్నందు నీకులభించెనో ముందుగా ఋజువుఁజేయుము. ఈ నాయులుకచే రాజద్రోహులు మనగిరివ్రజమున నింక నుండరుసుమీ" యని తనమందిరములు, మేడలు, ప్రతినాదముసేయు గంభీరస్వరముతో నాతఁడు పలికెను. రాజునకుఁ గోపాగ్ని జ్వాలలుగా మండుచున్నతఱి నందు సమయోచితముగ సమిధలు తగిలించుట రణార్ణవునకు వెన్నతోఁ బెట్టిన విద్యయగుట నదను దాఁటనీయక, నిజానిజములు నిదానమ[illegible]

బరిశీలింపక పాపపుణ్యాదులను వెఱవక, తన మందబుద్ధికిఁ దోఁచిన తెఱగున నిట్లని యాతఁడు విన్నవించె. “ మహారాజా ! ఈ లేఖ వ్రాసినవాఁడెవ్వఁడో నిర్ణయించుటకుఁ నాకుఁ బ్రస్తుతము తగిన యాధారములు గానరాకున్న వయినను నామెఱింగిన యంతవట్టు తమగల యనురాగము, నాచేఁ జెప్పింపకపోదు.

మూఁడునాళ్ళక్రిందట నుషఃకాలమున తమకత్యంత ప్రేమాస్పదుఁడగు విజయసేనుని యింటికి జయసేనుని సందర్శించునిమిత్తము మెల్లమెల్లగనరుగుచున్నప్పటికి నాకంటికి జయసేనుఁ డగపడకయ్యెఁగాని యొక పీఠముమీఁద నీమొగలిరేకు చిత్రితమ్మైన వర్ణములతోడఁ గాననయ్యె. అట్టివి కంటికిఁ గాననగుటయు నాచేఁజిక్కుటయు నొక్కమారెయగునని తమతో వేఱుగ నేను విన్నవింపనక్కఱలేదు. “ రాజకార్యమున దొంగతనమొనర్చినను దాన దోషము వాటిల్లదను దృఢవిశ్వాసముతో దీనిని సంగ్రహించి యేలినవారి కర్పించుటకు నామనసు మనసులోలేదు. ఈ యుత్తరము మనపురమున [illegible] యగునొకకన్యఁ గూర్చి యొక తేజోలావణ్యరాశియైన రాచపట్టిచే వ్రాయబడినదనియు నాతఁడు ప్రస్తుతము దేశాంతరమున నున్నవాఁడనియుఁ దన హృదయపీఠమునఁ బాదుకొనియున్న యాయింతి కీహాబిమ్మని జయసేనుని బంపియుండవచ్చుననియు నాకుఁ దోఁచెడు. మీఁద దేవర చిత్తము.

అనవుఁడు మగధేశ్వరుఁ డాశ్చర్యము నాగ్రహము నేకకాలమునఁ దన్ను బరిగొన నాకు బాల్యస్నేహితుఁడగు విజయసేనుని నందనుఁడు జయసేనుఁడుగూడఁ గుట్రలోనివాఁడని యనుటకు నాకు నోరాడకున్నది హా ! జయసేనా, మగధరాజ్యలక్ష్మికి సైదోడునైయుండి వాసుదేవ బలరామప్రముఖుల సంగరమున నిర్జింతువని మెంచితిఁగాని యిట్లు నిష్కారణముగ సంబంధములేని కుట్రలంజొరఁబడి నాకోపాగ్నికి మిడుతవై కాలమరణము నొందుదువని తలంపనైతి. అబ్బా యుష్మంతుఁడయ్యు

వగునిన్ను దలపనాకుఁ గోపాగ్నిలో జాలిపొడముచున్నది. విజయసే నునకుఁ బుత్రశోకమహాదుఃఖము శాశ్వత మగునపనిందఁదెచ్చి శ త్రుఁడవెకాని పుత్రుఁడవుకావుసుమీ !" అనిపల్కి యాక్షణము జయ సేన విజయసేనుల నిరువుర వెంటఁబెట్టుకొనిరమ్మని యిరువురు సేవకుల నంపఁదలఁచి మఱల నట్టిపని కావశ్యకత లేదని, మరునాఁడుదయమునఁ బ్రధానవర్గముతోఁ దగుయోచనముసల్పి, విచారింపవచ్చునని గణార్ణవు నితోఁ గొంతసేపు ముచ్చటించి వానినింటికంపెను.



## ఎనిమిదవ ప్రకరణము.

నాఁడు కేతకీదళమట్లు లఘ్వశ్యమగుట ను జయసేనుఁడు రాజలే ఖనిఁడు రాజలేఖకన్నఁ దారామతిమీఁద గట్టియనుమాన మూని రేకు నిమ్మని దాసినిఁ గొంతపడనడిగి భయకంపితైను యామె నిరుత్తరు రాలుగా నామెనువిడిచి కడుదిగులు గొనియుండెను. సాయంకాల మగునప్పటికి జయసేనుని మొగమంతయుఁ దొంగలివికాసముజ్జగించి, నేత్రాగ్నుల యావిరిచే వన్నె సడలి మలినమైయుండుటయుఁ, దండ్రి, యాతని గూడ నెద్దియో భయము కలుగునని వానివిషయమై యత్యంతము జాగ్రత్త వహించి యారాత్రి మేలుకొని తనసంగతి కుమారుఁ డెరుగ కుండ నప్రమత్తుఁడై మెలఁగెను.

అప్పుడు రమారమి రెండుయామముల రాత్రియై యుండనోపు. ఆ రాత్రి మనసునందలి కలఁతయును మున్నీరు పెల్లుబ్బి పొరలు కతమున నిద్రపోవని జయసేనుఁడు లేచి యేరినింబిలుఃనక తలుపులందెఱచి యుత్తరీ యముఁగూడ గదిలోన వదలి యిలువిడిచి యొంటరిగఁ జనుచుండెను. ఆనిమిషమున నతని మొలలో నాతఁడు సర్వకాలసర్వావస్థల ధరియిం చు కత్తియుఁ దండ్రి కొన్నినాళ్లక్రిందట ముద్దుగా వ్రేలనిడిన పచ్చల

యుంగరము దక్క నితరవస్తువు లెవ్వియు లేవు. విజయసేనుఁడు కుమారుని చేష్టలఁ గనిపెట్టియుండియుఁ జెవులకించుక వినఁబడి వినఁబడకయున్న తలుపుచప్పు డస్యముగాఁ భావించి, బద్ధకముచేఁ గదలఁజాలకయించుక సందేహించి మరల నదియేమో చూడవలయునని లేచి కొడుకు నిజస్థానమునం దగపడకుని కొంతయుఁ దొట్రుపాటునం దలవాకిటికిం జని చూచునప్పటికి వడివడి జయసేనుఁ డెందులకో యరుగుచుండెను. సేవకులను దనసహాయార్థము రమ్మని పిలువ వ్యవధి లేమి విజయసేనుఁడు దానొంటరిగ నలక్షితుఁడై కొడుకు వెంటఁ జనుచు నాతని గమ్యస్థానము నెఱుఁగఁదలఁచెను. నిష్కాముఁడై యాదబవిడిచి చను శుకయోగి వెంటనంటి తిరుగు బాదరాయణునివిధమున జయసేను వెంట విజయసేనుఁ డరుగ నరుగఁ గొంతసేపటికి నెట్టయెదుట వికసించిన కల్వలుగల్గి, ముకుళించిన తెలిదమ్ములుగల్గి, యలసి సొలసి వచ్చు బాటసారులందేర్చు తేటనీరుగల్గి నలుగట్లబారుతీర్చిన జోడుల పగిది నున్న చెట్లుఁగల్గి వారెరువురకు మనోవ్యథల మఱపించు నొకసరస్సు గానవయ్యెను. గవ్యూతి దూరమున నది పొడగట్టుటయు, శీతలజలకణములతో వియ్యమొంది పుష్పములతో నసఁగి పెనఁగి, దక్షిణ దిశనుండి వెడలెడు మలయమారుతము దండ్రిఁగొడుకుల నానందవార్థి నోలలాడించెను. ఆనందముఁ బయికిఁ దోఁచనీయక జయసేనుఁడు మూఁగచాప్పున నోరెత్తక ముందు సాగిపోవుచు నాకొలఁకునఁ జేరఁబడి మీఁగాళ్ళు, చీలమండలు, పిక్కలు, మోకాళ్ళు క్రమముగఁ దడియునట్లు లంతకంతకు లోఁతుగఁ జనుచుండెను.

ఆజలాశయమునఁ జొచ్చి బలవంతముగ ముద్దులపట్టి యాత్మహత్య గావించుకొనునో యనుభయమును, భయముతోఁ దొట్రుపాటునుఁ దన్నుఁ బరికొలుప, విజయసేనుఁడు పట్టరాని కడుపుదీఁపిచేఁ గనుఁగొలకుల వెచ్చనినీరు గాఱఁ గొలఁకులోనున్న కొడుకు నుద్దేశించి

"వత్స ! నఖలు సాహసమ్ నఖలు సాహసమ్. అహమస్మి అహమస్మి" యని గీర్వాణభాష యతని కభిమానభాష యగుట నందు నుందలించెను. ఆమాటలు విని యదరిపడి జయసేనుఁడు వెనుకకుఁజూచి తన వైపు వచ్చుచున్న యాపురుషునిఁ బొడగని తెఱచినకన్ను మూయక వానివైపొక్కరీతిగఁ జూడనారంభించెను. అంతలో విజయసేనుఁడు పరుగెత్తుకొనివచ్చి కుమారుని చేయిపట్టుకొని "వత్సా! ఇదియేమి సాహసము. నీకేతికేదితివృత్తాంతమంతయు రాజలేఖ నాకు విన్నవించినది. తారామతియు దాసియు నిందు నిర్దోషులు. ఆత్మహాని యొనర్చుకొంట పౌరుషమే ? నినునమ్ముకొని దినములకై యెదురు చూచుచున్న నన్ను దుఃఖజలధినిముంచి యీజలముల నీవు పడఁదలఁచితే? రా నాయనా" యని తటాకమునుండి వెలికిఁ దీసికొనివచ్చి యనేక ప్రశ్నములాతని నడిగెను. కాని యందొక్కదానికేనియు నాతఁడు ప్రత్యుత్తరమొసంగక బొమ్మవలె కనులప్పగించి చూచుచుండెను. కూర్చుండు మన్నప్పుడు కూర్చుండుటయు, నిలువుమన్నపుడు నిలుచుటయు, నాగినడువుమన్నప్పుడు నడుచుటయు మొదలగు చర్యలేకాని వానికి నోటిమాటలు లేవయ్యె. ఈవైపరీత్యముఁజూచి కుమారునకు మనోవైకల్యము కతమున మతిచెడినదని తండ్రి నిశ్చయించి తగిన చికిత్సఁజేయింపఁ దలఁచి యంతవఱకు నిది రహస్యముగ నుంపఁడగునని ప్రియపుత్రుని నొకచాటు గదిలోనుంచి తలుపుమూసి తద్ద్వారమునఁ దానుఁ గావలియుండి యేరిని లోపలికిఁ జననీయకుండెను.

అట్లు రణాన్నవృఁడు జరాసంధునకు మొగలియూకు జంబునొసంగి చెవులలోఁ గొండెమను విషముఁబోసిఁ యంరాత్రి యరిగినపిదప రాజుమరునాఁడు పఱువాత లేచి యంతిపురమునఁడాగిఁ యుదయభాస్కర బింబమోయనునట్లు లారుణ్యమునఁ బెరియు ముఖమై ఖరితో నొక పోటఁ గూరుచుండి జయసేనవిజయసేనులఁ దోడుకొని రమ్మని యిరువురు యువ

దూతలవంటి కింకరులనంపెను. అప్పటికి జయసేనునకుఁ జిత్తచాంచల్య ముదయించి మూఁడుదినములయ్యెఁ. స్వామి యూరతినేగాని, పిలువనంపిన కారణములం దెలుపక రమ్మని త్వర పెట్టుచు నిరువురు సేవకులువచ్చి నిలుచునప్పటికి విజయసేనునకు నేమికతనమునో గుండెలు చెదరిపోయినవి. సేవకులు పెట్టుకొనివచ్చుఁ జూడ నీతనికి మనమాయము నెమ్మనమున నెంతయుంబాడమి కతనఁ దమకుంగల శ్రీయ నాశేఁ జిక్కని తనలో వితర్కింపసాగెను. 'అక్కటా! అవివేకముగానున్న కుమారుని మహారాజున న్నిటఁ గ్లేశపెట్టుకొనిపోవువాఁడను. ఈసేవకుల మొగముఁజూడ నెవ్వరో మామీఁద నేరమో కొండెములు చెప్పి యలుక పుట్టించినట్లు కానఁబడుచున్నది. అయినను విజయసేనునకు నాశకాలములో దైవము మిక్కుటమని జనులు చెప్పుకొనువాక్యము నేఁడు నిజముగాఁ గాంపించుచున్నది. నాతనయుఁడు వాసుదేవుని పాదరాజీవములు మొదటినుండియు నమ్మినవాఁడు కాఁడా" యని కొడుకుం బిలుచుకొనిపోక తానొక్కఁడె యరదమెక్కి సేవకులతోఁ గాలినడకఁ గోటకుఁ బయనమై యరిగెను. సేవకులు మెల్లమెల్లగ వానిం దోడుకొని రాజునెదుటికిం గొనిపోయి విడిచిరి. విజయసేనుఁడును దానును బలుమాఱు చనిన యాయంతఃపురమునకుఁ గ్రొత్తవానివలె సాహసముతోఁ జనక వెనుకకు లాగుచున్న యంతరాత్మతోఁ దినముండుటఁ గనాఁడు గద్దెమీఁద భుజపరాక్రమదర్పయును మగధ రాజ్యలక్ష్మియను శుద్ధాంత కన్యక చిందులుద్రొక్క ననువగు వజ్రపీఠమువంటి విశాలవక్షస్థలముతోడను, మొగమను పచ్చపుట్టమునుండి వెలికిఁ బ్రతిబింబించు కోపాగ్ని జ్వాలాకాంతియో యను సందియము నొదవించు ముఖకాంతితోడను, రాక్షస శౌర్యమును క్షాత్రధర్మము జంటగా మూర్తిగైకొనెనో యనిపించు తేజముతోడను నొప్పుచున్న ఱేనిఁ గాంచి యెదుట నిల్చి జోహారొనర్చెను. రాజసభలో విజయసేనునకు మున్నెంతయు గౌరవముండెను. నాఁడు జరాసంధుఁడు విజయసేనునిపైఁ బొడమిన కినుకచే

నాతనికిఁ గూరుచుండఁ బీఠ మొసఁగక మునుపటియట్లు చేయునగవు మోగమున సంకురింపఁ బలుకరింపక, తొంటిచవవాతని కొసంగక రూక్షవీక్షణములతో నాతని కిట్లనియె. "విజయసేనా! వాసుదేవ పక్షపాతివైన నీకుంర్మి కొడు కెక్కడ."

విజ—దేవా క్షమియింపుము. నాకుమారుఁడు గృహమునఁ గలంత కలతమునఁ జిత్తచాంచల్యము నొందియున్నవాఁడు. అందుచే రా లేదు.

జరా—మగధరాజ్యలక్ష్మికి వైధన్యము సంఘటించుటలో నీకుమారుఁడు కడునప్రమత్తుఁడై యున్నాఁడుగదా. అతని కీచిత్తచాంచల్యమేల?

విజ—రాజభక్తికి నిధి యగు మాకుటుంబముపై మహారాజుగారి కట్టియనుమాన ముదయించుట మాదురదృష్టఫలము.

జరా—రాజభక్తికిఁ గాదు. ఇప్పుడు రాజద్రోహమునకు నిధి. భక్తిమాట యటుండనిమ్ము. ఇప్పుడు ముఖ్యముగా నీకుమారుని నిమిత్తము మేము వార్త నంపితిమి. అతఁడు చిత్తచాంచల్య మొందినను సరియె, ఏమయినను సరియె, వచ్చితీరవలయుఁ జచ్చితీరవలయు—ఓరీ! నలువురు సేవకులు విజయసేనుని యింటికేఁజని జయసేను నొకబండిపైఁ గూర్చుండఁబెట్టి సత్వర మిటకుఁ దోడుకొనిరండు.

అని భటుల నంపుచుండ విజయసేనుఁడు చూచుచు నూరకుండి రాజుమాట యథార్థముగాఁ జింతిల్లుచుఁ గుమారునిపై నాసవిడిచెను. అట్లుకొన్ని నిముసములు జరాసంధ విజయసేను లొండొరులతోఁ బలుకక మనోగత కోపదుఃఖములకు లోనై యుండునప్పటికి వాకిట నెద్దియో యరదము నిల్చినచప్పుడు వినఁబడి విజయసేనునకుఁ దనకుమారుని దురవస్థ సమీపించెనని విధి చాటుచున్న చప్పుడువలెఁ దోఁచె. అంతఁ గొన్ని నిముసములకు జగము నెఱుఁగక యున్నవాని, వివర్ణవదనుఁడగువాని జయసేనుని సేవకులిద్దఱు తోడుకొనివచ్చి రాజుముం

దర నిలువఁబెట్టిరి. మహారాజునొద్ద గౌరవము భయము భక్తియు రని వునట్టి విజయసేనకుమారుఁడు నేఁడు రా జఁదున్నట్లు దలంపనివాఁడు వోలె, నిశ్శంకముగా ముఖమెత్తి చూచుచు బెదరిన యాలబోతువిత మున తెప్పవేయక యామాగధుని జూడసాగెను. మగధరా జాతనిము ఖశైఖరి నవలోకించి విస్మితుఁడై యించుక చూచి “శరీరమున నెట్లున్నది? ఆలాగున నున్నావేమి” యని యడిగెను. జయసేనుఁడు యథా ప్రకారముగఁ దన్ను గానియట్లు లూరకుండెను. అంతట శాంతినొందక జరాసంధుఁడు మొగలిరేకు జాబునుఁగూర్చియు, మగధరాజ్యవ్యవహార ములఁగూర్చియు, ననేకప్రశ్నలడిగి నిరుత్తరుఁడగు జయసేనునిపై నెంతయు నలుకఁబూని నిందించి యొక్కొకమారు అతని విలక్షణపుఁ జూపులకు నగుచుఁ దుదకు విసిగి యిట్లనియె. “ఓయీ! విజయసేనుఁడా! మగధరాజ్యమున కపాయము సూచించు మాటలుగల యొకమొగలియాకు జాబు నీకొమరునొద్ద మా సేవకులలో నొకనికి లభించినది. నీతనయుఁ డిదివఱకే వాసుదేవానుచరుఁడన్న నానుడి జగత్ప్రసిద్ధముగదా! అందుచే నాపైఁబన్నబడిన దుస్తంత్రంబులలో నీపట్టిచేరి పనిచేయుననుమాట విశ్వాసార్హము. ఇప్పుడీజయసేనుని యం దారోపింపఁబడిన చిత్తచాంచల్యము, కుమారుని ప్రాణాంతకావస్థము నీవు బోధించిన మంత్రమో స్వయముగా నాతఁడే యభ్యసించిన విద్దియయో మాకుఁ దెలియకున్నది. అంతవఱకు నీతనయుని శత్రురాజమండలముతోఁ గారాగృహబద్ధుఁ గావించెద. నీవుఁనీగృహమున కరుగవచ్చు. ఓరీ యెవఁడురా యక్కడ! ఈజయసేనుని చెఱసాలకంపుఁడీ” యని యానతిచ్చి పీఠముమీఁదనుండి లేచెను. విజయసేనుఁడు గొడ్డలిదెబ్బల నేలరాలు వృక్షమువలె మూర్ఛల్లెను. జయసేనుఁడు తొంటియట్లు కంటఁజూపెకాని నోటమాటలేక రవ్వని సేవకులు చెఱసాలకుఁబిలువ గంగిగోవువలె వారివెంటఁజనియెను.

---

# తొమ్మిదవ ప్రకరణము.



నాగవల్లి యారేయికలంత నిద్దురనొంది కోటీకూంత వినంబడున ప్పుడు మేలుగాంచి తానొనర్చిన దుస్తరప్రతిజ్ఞలను దలంచుకొని య ట్టికార్యము తాను సాధింపనలవియగునాయని తన యశక్తతకును జేయవలసిన కర్జమునందలి కష్టమునకును వగచుచుఁ బ్రభాతమయిన వెనుకఁ జిత్తము కార్యాయత్తము గావించి దేహము గృహకృత్యముల కు నప్పగించెను. అట్లు తనకార్యసాధనతకు నుపాయముపయి నుపాయ మువెదకి వానియందు దనకు వాటిలు నపాయములను దూరదృష్టిగలి గి యెఱుఁగుచు నాలుగుదినములు రాగలతికతోడను, గుణోత్తమతోడ ను బుచ్చి యైదవనాఁడు నిశి భోజనానంతరము నెచ్చెలులకిరువురకు నిట్ల నియె. “పూలచెంబుమాట రోహిణకునడిగితిని. అతనిం గాలుకను పులు బట్టుకొని నే నెంతయుల బతిమాలి యీరహస్య మన్యులకు నెఱుఁ గఁజేయనని యెన్నోబాసలు చేసి యడుగఁగా నాతఁడు మిగుల కష్ట మునీఁద నాతో నిట్లనిచెప్పె:—

“ఓనాగవల్లీ! దీనివృత్తాంతము కడునమ్మశేయము. నీకుఁజెం బు నేనొసఁగిననాఁటికిఁ బూర్వదినమునఁ గడసంజయగుతఱి బేరగాండ్ర తోఁ బూలవిక్రయించుసందడిలో నేనుండ నాచెవులకు “నారాయణ నారాయణ” యనుశబ్దము వినవచ్చెను. వెంటనే బేరగాండ్ర నించుక తొలంగుడని చూచునప్పటి కొక్కసన్యాసి నాదృష్టిపథమున నిలిచెను. కోరికలనెల్ల జయించిన పరివ్రాజకులు, గాముకజనోపభోగ్యము ల గునెత్తావి పువ్వులు గొనవత్తురా యని నేను సందేహమొంది లేచి వం దనమొనర్చి స్వామీ యిందు వేంచేయుఁడని పూలబుట్ట నిడుకొను ముక్కాలిపీట నాయనకొసంగి కార్యమున్నఁగాని మహాత్ములు నన్ను భోలు నల్పుల ననుగ్రహింపరారని నిశ్చయించి బేరగాండ్రనందఱ నడి

వడినంపి యాస్వామి యమునగ్రహమ్మునకు నెదురుచూచుచుఁ గట్టెదుట నిల్చితిని. ఆకారముదాల్చిన వినయముచాడ్పున నిలువఁబడియున్న నన్నుఁ గూర్చుండుమని యానతిచ్చి యాయతి "నీవా రోహణకుఁడ?" వని యడిగెను. దేవరవారు సెలవిచ్చినట్టే యీ తమసేవకుఁడే రోహణకుఁడు స్వామీ యని చేసంటిని. అనంతరము మహాత్ముఁడతఁడు నన్ను నఖశిఖపర్యంత మొకమారు చూచి యంగడిమీఁద నెవ్వరు లేరుగదా యని యడిగి "రోహణకా! నీతోఁ బరమరహస్య మొండు తెల్పవచ్చితి. నాయుపదేశింపఁబోవునదియు, నీవొనర్పవలసినదియు నగుకార్యము దైవహితము. దీనిం దప్పక నెరవేర్తుననియుఁ గుట్టుదాఁపఁగలవనియుఁ బ్రమాణమొనర్తువేని నావచ్చుపని నీకెఱింగించెద" అనవుడు బ్రహ్మతేజముట్టిపడ నెదుటివారి వాగ్బంధనముసేయు నాతని మొగమ్మువారు నాడెందమునఁ గ్రొత్తబత్తిఁ గల్గించుటచేఁ దప్పక యట్లు సలువువాఁడనని యతీశ్వరుని పాదములఁ గొట్టి బాసచేసి సిద్ధముగనుంటి. అంతటనాతఁడు కమండలములో రెండువేళ్ళఁ బోనిపి యొక తెల్లనిమొగలిరేకు నీవలకులాగి తన కాషాయవస్త్రములతోఁ దాని తడియారదుడిచి నాతో "రోహణకా! కలదుగదా యీనగరమ్మున సౌందర్యతిలకాభిధానయగు గుణోత్తమ. ఈయుత్తర మాపుత్తడిబొమ్మ కెట్టులేనియు నందఁజేయవలయు మన ప్రసంగ మన్యులచెవులఁ బడఁగూడనట్లు మొగలిరేకు నెవరికంటఁ బడఁగూడదుసుమీ" యని యది నాచేతికిచ్చి "ఇక్కడ నేఁ దడయరాదు. గౌరీమఠమునందలి సన్న్యాసులు నానిమిత్త మెదురుచూచుచుందురు. ఈ యమరహితకార్యము నిర్వహించు భాగ్య మిందఱు వర్తకులలో నీకొక్కని కబ్బెనది. జాగ్రత్త" యని చెప్పిన నంగడిమీఁదనుండి లేచి నాలుగడుగులు సాగనంపఁబోయిన నన్ను రావలదని నిల్పితిరస్కరిణీవిద్యచే నదృశ్యుఁడయినట్లుగాదిరి నెటకో చనియె. అగ్నిహోత్రుని యచ్చిన్నువంటివా

ముఖవర్చస్సుంగల్గి నిలుకెల్లఁ బూయఁబడిన బూదియకాని వేఱొక యైశ్వర్యమునెఱుఁగక, కాషాయవస్త్రముల రక్తిమగాక యొండొకరాగ మెఱుఁగక, వేల్పుకొలుడించి వేఁడికన్నుడాఁచి, మేనితెల్పు, మెడనల్పు గప్పుపఱిచి, పులితోలు ముమ్మొనవాలు నింటమఱచి, లేఁతనెలను శేషిపిల్లనువిడిచి, నింతమఱగవేషముతో నేలకుగ్రమ్మఱు శంకరుఁడేమో యని నాకాతనియందు భయముభక్తియుఁ గుదిరినందున నాతఁడానతిచ్చినభాతి మరునిచేతి చికిలిబాకుఁబోలు నాకేకు చెంతునందమర్చి నీకిచ్చితిని. "నాగవల్లీ! ఈవృత్తాంతము పరమగోప్యముసుమీ. నీవు నోరుజాఱ నెచ్చటనైన దీని నూఁదితివేని నిర్హేతుకముగ నేను యతిశాపహతుఁడనగుదునుమీ! నన్ను మిగుల జాగ్రత్తతో వర్తింపఁజేయవలెనని యాతఁడది యమరకార్యమనియెనే కాని యది నిక్కమరసి చూడఁగా మూకవ్యాపారము. ఆకేకుపై నక్షరములు లిఖియింపఁబడినవి. నేను జదువను వ్రాయను నేరని వర్తకుండనగుట నేమివ్రాయబడెనో యెఱుఁగనైతి. మీగుణోత్తమ యాలేఖ "జదువుకొనియెనా" యని రోహణకుఁడు దళముచరిత్రము పూసగ్రుచ్చినట్లు నాకరమరలేక తెలుపుటయు, నేనును, గొంతగాంభీర్యమువహించి కేకుపోయినదని వానిచెవులవేయక కేవల మబద్ధమాడక పాముచావకుండఁ గఱ్ఱవిఱుఁగకుండఁ బ్రత్యుత్తరము చెప్పివచ్చితిని.

నాగవల్లిచేసిన యుపన్యాసము గుణోత్తమను దత్తఱమొందఁజేసి రాగలతికను విషాదమున ముంచెను. అందు గుణోత్తమ "హాచెలులారా! మనమనుకొన్నదానికన్న భిన్నయగునంశములు నేఁడు నాచేత వినఁబడినవి. ఈయుత్తరము దేశాంతరమునందుఁ బ్రస్తుతము కొన్ని కారణములవల్ల వసించుచున్న మనమిత్రుఁడు వ్రాసియుండును. అది యీజరాసంధ పక్షపాతు లగుచెనంటులచేతఁ జిక్కనేని చంద్రపాలుఁడు కూఁతు కతమునను, మనమిత్రులు మనకతనను నెంతయు దుఃఖ

పడుదురుగదా? హా! యెంతకష్టము. అది క్రిమ్మరి నా కెట్లుల భించు, నేమి యుపాయము?"

అనవుడు రాగలతిక మూతి యావలకుఁ ద్రిప్పి కోపమున "మాతాత నాకగపడుటయు, నాగవల్లిరేకు మరలఁ దెచ్చుటయు నొక్కనాఁడె. నీకన్నీరు దుడుచుటకు నాగవల్లి యల్లిన యల్లిబిల్లికల్లలకు నీవూరక యువ్విళ్ళూరెదవు. గుణోత్తమా! నిన్నుబోలు బేల నాకేలోకంబునఁ గానఁబడదు. ఏవానిచేత నిది చిక్కియుండు నాతఁ డందుండు పలుకుల కర్థముగాక చింపినసుజింపు. అది లోహదారు నిర్మితముకాదు. కావునఁ జిరిఁగి యీపాటికి నామావశిష్టమైనను గానొప్పు. నాగవల్లి తన్నుఁ గనుంగొనుదాక రేకు కనిపెట్టుకొనియుండునా!" యని నిష్టురోక్తులు, నిరుత్సాహజనకముగఁ బలుకఁ జొచ్చెను. అంతట నాగవల్లి మెల్లమెల్ల రాగలతిక కుత్తరముఁ జెప్పనట్లు! గుణోత్తమ చిత్తవైకల్యము దీర్చవట్లుకూడ నుండవలయునని, యిట్లనియె "అమ్మా! నాకల్లలు పొల్లుపలుకులు, చిన్నతనమునుండియుఁ జెవులు తడకలుకట్టునట్లు విని విసివియున్నారు. ఇంకఁ గొన్నినాళ్ళుకూడ నాలకించినఁ దొంటికన్న నెక్కుడుకీడు మీఁకురాదు. పుట్టినవెనుక యజమానురాలియెడల నాయొనర్చిన నేరమిది యొక్కటియేయని నాయభిప్రాయము. దీనికి నేనొక్క యుపాయముఁ బన్నితి. గిరివ్రజపురమునకుఁ గ్రొత్తగా జ్ఞాననిధి యనుపేరుగల యొక పరివ్రాజిక వచ్చి యెచ్చటనో విడిసి యున్నదఁట. ఆమె భూతభవిష్యద్వర్తమానవేదిని యనియు నడిగిన సందేహము లున్నవున్నట్లు తూచాతప్పకుండఁ జెప్పుననియు వాడుకకలదు. ఆమె నిండుజవ్వనమున నున్న యంగనయగుట దుశ్శీలురగు పురుషుల కంటఁ బడనొల్లకయో యింక నెందుననో తెరమఱుఁగున నుండియె ప్రత్యుత్తరము లొసఁగునుగాని స్త్రీలకయినఁ గానఁబడదఁట. జగదీశ్వరియగు భవాని ప్రసాదమున నాపరివ్రాజికి యిట్టిమహిమలకుఁ బుట్టినిల్ల

మ్యొనని చెప్పెదరు. నేను రెండు మూడు మాసములలో నామె దర్శనముచేసి నాసందియమడిగి తెలిసికొని నీమనోరథము నెరవేర్తును."

ఎట్లయినఁ గార్యముసాధించుటయె ప్రూనికగా నేర్పఱుచుకొన్న చలికత్తెను బుల్లవిఱుపు మాటలాడి యుల్లము రాయిచేయుటకన్న నామె ప్రూనికకుఁ దోసపడి యుత్సాహముఁ గోల్పినఁ గార్యము శీఘ్రసాధ్యమగునని నిశ్చయించి కార్యవాదమునందె బుద్ధినిల్పి, గుణోత్తమ, రూపల్కులకు సంతసించి యటుసేయ ననుజ్ఞ నొసఁగెను. అనంతరము కొన్నిదినములకు, నొక్కనాఁడుదయమున గుణోత్తమ విరిసెజ్జనుండి లేచి యప్పాన్పుపైఁ గూరుచుండి యప్పుడప్పుడే నిద్రమేల్కను బద్ధకముచే, నావులింతలు మెండుగ వచ్చుచుండఁ గన్నులఁ దుడుచుకొనుచు, పడిద్రవేలాడు కచభారము జారుముడివైచి, నిద్రాసమయమున నలఁగునని యొకచోనిడిన చంద్రహారము మరలఁ గంఠమున నుంచుకొని "నాగవల్లి! అద్దమొకసారితేవే, అని కేకవేసెను. పిలువఁబడిన నాగవల్లి రెండుమూఁడు పిలుపులకైనఁ బ్రత్యుత్తర మొసంగుటయు, వచ్చుటయు జరుగదయ్యె. ఈలోపల రాగలతిక చేతనున్న పనిమాని యామెకద్దము దెచ్చియిచ్చి "యీదినమునఁ దెల్లవారుటాదిగ నాగవల్లి నాకగపడలేదు. నేనామెను గూర్చి మనజంబుకుని తలఁచి యనుగ నాతఁడేదో విపరీతమైనకథ చెప్పుచున్నాఁడు. అది నానోటనుండి వినుటకన్న జంబుకుని ముఖమునవినుట నీకత్యానందము గల్గించునుగాన నాతనిఁబిలిచెద" నని యట్లుచేసెను. జంబుకుఁడు చంద్రపాలుని తండ్రియగు శశిపాదుని కాలమునుండియు నింటనుండుటచే నాతఁడు చేయునది సేవకవృత్తియైనను గౌరవాస్పదముగనుండెను. అతనినొకచోటఁ గ్రిందఁ గూరుచుండుమని నియోగించి గుణోత్తమ నాగవల్లి పోయిన తెరువునుగూర్చి కొన్ని ప్రశ్నములడుగ నాతఁడిట్లనియె. అమ్మా! తెల్లవారుజామున నాగవల్లి నేనిక మంచముమీఁదనుండి లేవకమున్నె నాకడకువచ్చి నన్ను "జ-

బుకా! నాయొనర్చిన తెలివిమాలిన తనమును బట్టి రాగలతిక నన్ను గరము నిందించుచున్నది. దివ్యకుసుమంబు గనుఁగొనఁగలనని పట్టిబీర ములు పల్కితిఁగాని యదికనుఁగొనుట నాతరముకాదు. అందుచే రాగలతిక పోరుపడలేకయు, గుణోత్తమ మొగముఁ జూడలేకయు, నేనీయూరువిడిచి, యొకపల్లియకుఁజని యందు వసియింతు. నాతెక్కలు చల్లగనున్న నాపట్టెడన్నము దెచ్చుకొని నే బ్రతుకఁజాలనే? నేనిలు దాఁటుదాఁక నీరహస్యమేరికిం జెప్పక తెల్లవారినవెనుకఁ జెప్పుము దయయుంచవలయుఁజుమీ" యనియెటకో చనియె. ఇంతకుమించ నేనే దియు నెఱుఁగనని జంబుకుఁడూరకుండెను. పరులవశ మగుకేతకీదళము మరల నాగవల్లి తెచ్చునని గంపెడాసతోనున్న గుణోత్తమ యామున లివాని మాటలకు నిశ్చేష్టయయ్యె. రాగలతిక తనమాటయే వయును న్నదికదాయని పరిహాస మొనర్ప నారంభించెను.



## పదియవ ప్రకరణము.



అవనీతలమున వెలసిన వైకుంఠమని భక్తనరులును, దమకోడి ముణ్ణీటవందనందనునిచే నిర్మింపఁబడిన దాఁగుడుచోటని వైరులును దేని నభినందించి నిందించి హృదయ సంతుష్టియొనర్చుకొనుచుండిరట్టిద్వార కానగరము ద్వాపరయుగమున రాచవారు కట్టిన ప్రోలులలో విభవ మున మొట్టమొదటిదియుఁ గాలమునఁ గడపటిదియు నై తనరెను. ఉ పేంద్రునకు రాజధానియగుటనో, దాసజనుల మనోరథ ఫలముల నవ లీలనొసఁగు వాసుదేవ పారిజాతమందుం డుటనో విలాససంపద నిది దా నికి దీటుకొనుటనో, సత్యభామ నిమిత్తము మున్నువేల్పురేని నందన వన మునుండి యమృతుండుతెచ్చి పెరటిచెట్టుగా నాటిన నిజమయిన పారిజా తవృక్ష మందుండుటనో యకూ్రరప్రముఖులందఱు నాద్వారకను రెండవ

యమరావతి యని పిలుచుచుందురు. పొగడ్తకుఁ గాక నిజముగ సిరికి నెలవని ఘంటాపథముగఁ జాటఁదగిన యాద్వారకాపురమున కొక రాచబిడ్డ సంజతితి వచ్చుచుఁ దోడనున్న సేవకునితో దినమెల్ల శ్రమపడి పయనముఁజేసిన జాడ మొగముమీఁది చెమ్మట తెలుపఁ గొంత దవ్వు నడచినడచి పురమువెలి యొక చెట్టుక్రింద నాయాస మపనయింపఁ దలఁచి యించుక విడిసి, తనకన్న మున్న దుస్సహమార్గఖేదమున నేలఁ జతికిలఁ బడియున్న శ్రీవణునిఁ జూచి యిట్లనియె. శ్రీవణా! ఎన్నఁ డిల్లు విడిచి యెఱుఁగని నీవు నానిమిత్త మింతింతయనరాని బాధల నొందుచున్నావుగదా? పాపము పలుమాఱు నావెంట రావలదని నేనెంత నొక్కి చెప్పినను వినక నాపైఁగల ప్రేమ పెంపున వెంటవచ్చి యనుభవించుచున్న సుఖ మిదియే కదా! ఐనను గైవల్యామృత చంద్రమండల మగు భూలోక వైకుంఠ మల్లదె కనుదోయి కఱవుఁదీఱఁ గనఁబడుచున్నది. కన్నులారఁజూడ, మనయిరువుర యాయాస మొక్కమాఱు పటాపంచలయి నశింపఁగలదు" అనిన శ్రీవణుండును యజమానునికిం దనపై నునయించు నపార కృపకు సంతసించి వినయము గదుర నిట్లని ప్రత్యుత్తర మొసఁగెను.

దేవా! సేవనమే జీవనముగాఁ గల నేను మీయొద్దనో మఱి యింక నొకరియొద్దనో దేహాయాసము మనోవ్యథయు నొందుచునేయుందును. నాకయి మీరు వగవఁబనిలేదు. అగర్భశ్రీమంతులరగు దేవరవారు మీకొఱకే విచారింపనోపు. చెట్టునుండి కోయఁబడిన పూవు చందమున నింటనుండి వెడలినవెనుక మీరు దినకరకరస్పర్శమువలనఁ జెన్నుచెదరి పట్టరాని నెంజలి నాకుఁ గల్గించుచున్నారు. అని తన నిమిత్తము పొక్కు సేవకుని సమయోచిత శాంతవచనముల నూఱడించి తనవలె నతి దూరప్రయాణమున డస్సి జేవుఱించిన నెమ్మొగంపుఁ గాంతులచేఁ గళంకరాశముల శోణము గావించుచుఁ బడమటి కొండపై నెక్కి

ముల ముచ్చటింపఁ దలఁచుచున్నాఁడని భగవంతునితో మనవి యొనర్ప మని యావేత్రహస్తునితో నుడువుటయు వాఁడును గ్రొత్తమొగమును జక్కఁగాఁ బరీక్షించి వాసుదేవ భూవరులు తమచుట్టములు కొందఱి తోఁ గొన్ని రాజకార్యముల ముచ్చటలాడుచున్నారు. నిన్నిప్పుడు లోనికిఁ బననీయరాదని వాక్రుచ్చుచు నించుక మనోరథ భంగముఁ గలుగఁ జేసెను. అంతట నాతఁడు సేయునది యేమని యోచించుచుండ నంతలో నొక సేవకుఁడు పరుగు పరుగున వగర్చుచు వచ్చి స్వామివారు నిన్ను రమ్మని యానతిచ్చినారు రా రమ్మని పిలిచెను. ఆనాఁటి రేయి యా పండువెన్నెలలోఁ జెమ్మట లార్చెడు మలయంపుఁ బిల్లగాడుపులు చెల్లాచెదరుగఁ బరుగులెత్తు నాసమయమున యదుకులచంద్రుఁడు చందమామరాలమేడమీఁదఁ గడపటియంతస్తుపైఁ గూర్చుండి సత్యభామయు, మిత్రవిందయుఁ గరారవిందములఁ జామరములఁ బూని మంజుకంకణక్వణము లెసఁగ వీవఁ బాండవమధ్యముం డగుపార్థునితోఁ గొంత మంతనముండి చిఱునగ వంకురింప సత్రాజిత్కుమారిం బలుకరింపుచు మిత్రవింద వదనారవిందమున నెలకొన్న మందహాసముఁగని యుప్పొంగుచు నర్జునుని మాటల కెడనెడ నుత్తరములం జెప్పుచు రుక్మిణీదేవి చుట్టియిచ్చు తమలపాకుల చుట్టల నందుకొని నమలుచుఁ బారములేని వినోదసముద్రమునఁ దేలుచుండెను. చిత్తపారవశ్యముఁ గలిగించు నావినోదరత్నాకరమునఁ దేలుచుండియు మాగధుఁడు వచ్చెనను మాట యెవ్వరో నివేదింప సత్వర మాతనిఁ దోడ్కొనిరమ్మని ముదల యొసంగి సత్యారుక్మిణీ మిత్రవిందల మొగములవంకఁ జూడ నా తలోదరులు తమతమ పనులఁ జాలించి యంతిపురమునకుం జనిరి. అంత నామాగధుఁడు దౌవారికునిచే మాధవుని సమ్ముఖమునకుఁ దోడ్కొని పోవంబడి రాతిమెట్టు లెక్కియెక్కి బహుద్వారములు గడచికడచి యంతస్థుల దాఁటిదాఁటి తనరూపు ప్రతిబింబించుచున్న పటికంపు గోడల

సారున కచ్చెరువందుచు మెల్లమెల్ల నడుగులిడుచు వాసుదేవుఁడు పార్థవ సహితముగనున్న నెలవునకువచ్చి యాయదుకులజలధికౌస్తుభమగు కౌస్తుభలాంఛనుని కట్టెదుట నిల్చి కనికరము నలుగెలంకుల వెదఁజిమ్ము విశాల పుండరీకలోచనములును లోచనాంతరముల నంటు శ్రీకారములఁబోలు వీనులును వీనులమీఁదినుండి నునుజెక్కుటద్దములఁ జిందులాడుచుఁ బ్రతిబింబించు మణికుండలద్వయధావళ్యమును నింద్రనీలముల కమ్మలయొప్పును హత్తినమీసంపు నిగనిగయు తొలుకారు మబ్బుతీరున నెలయు కోమలశ్యామలశరీరమును బాలకదలికూఁతురు సుఖోపవిష్టయగు నింద్రనీలంపుబీఠమనఁదగు విశాలవక్షమును గనుగొని తనయంత నుదయించి హృదయపేటిక నాఁగి బయటఁబడు మహాభక్తి నెడలెడుఁగక వ్యాసశుక ప్రముఖమహాయోగివాగమృతధారాశిలోచ్చయుఁడు, ప్రహ్లాదనారదాంరీషాదిభక్తజనహృదయనివాసపీఠుఁడును, జరాసంధశిశుపాలాదివైరివర్గ ప్రళయాంతకుఁడు నగు యాదవపారిజాత మితఁడెకదా యని యొక మాఱు కనుదమ్ములు విచ్చి కఱవుదీఱ నవలోకించి, తనివిపోమి మఱలఁజూచి కేలుమొగిచి తనకుఁ దోచినలాగున నభినందింపయత్నించి యప్రయత్నముగ నీక్రిందిపలుకుల నుచ్చరించెను.



పదునొకండవ ప్రకరణము.

"శ్లో॥ దామోదరాయ దళితాఖిలదానవాయ
ధారాధరోపమతనుద్యుతిశోభితాయ
దాసావనోత్సవనిరంతరలీనచిత్త
పంకేరుహాయ మహితాయ నమోనమస్తే॥

శ్లో॥ యదుకులాంబుధిపూర్ణసుధాకరం
భువనమోహనవిగ్రహధారిణం

స్వజనధారణమారణకారణం
మనసినందకిశోర ముపాస్మహే."

అని నుతించి "కాళియాహిపడగలను రంగస్థలమునఁ జిందులుద్రొక్కి, మున్ను బలిచక్రవర్తి మాణిక్యఖచితకిరీటముపైఁ గొంతసేపు విడిసి, జగత్పావనహేతువగు నాకాశగంగకుఁ బుట్టినిల్లయిన నీ చరణద్వంద్వమునకడ ప్రణామిల్లెద" నని యంగంబులెనిమిదియు నేలఁ దాఁక నమస్కరించి నిలిచెను. అట్లు పరమభాగవతుని లీలఁ దనయెట్టయెదుటఁ జేతులుమోడ్చి నిలిచిన రాచకొమరునకును గన్నులువిచ్చిచూచి, పుండరీకాక్షుండు విస్మయమును, సెవరును, వెలికిఁ దోఁపనేయు తనమొగ మాతనివైపు ద్రిప్పి యాతఁడేదో మహాకార్యముపై వచ్చియుండఁబోలునని నిశ్చయించి యొక యుచితాసనమునఁ గూర్చుండ నియమించి యిట్లనియె.

"చిలుకవారువము నిప్పుడే దిగి, చెఱకువిల్లును బూవుటమ్ములు నెచ్చటనో మఱచివచ్చిన మన్మథునిలాగున్నను నీ వెవ్వఁడవో యెఱుఁగునంత దాఁక నామనము తత్తరమొందుచున్నది. రాచవాఁడవే యగుదువేని నీవంటివాని పుట్టుకచే రాచకులము నిక్కముగఁ గృతార్థత నందెనని నే నమ్ముచున్నాను. సత్వరము నీచరిత్రమును, నాతోడ నీకుం గల కార్యము నెఱిఁగించి యీ మన పరిచయము నిక్కపు నెయ్యమగునట్లు హృదయము మఱుఁగుపఱుపక పలికి నాయింట నతిథివి గావలయు" నని సన్మానపురస్సరముగఁ బ్రత్యుత్తర మొసఁగుటయు ధైర్యముఁ దెచ్చుకొని తన వృత్తాంతమిట్లు వినుపింపఁ దొడఁగెను.

"మధుసూదనా! నానసించు నూరుపేరు చెప్పినంతనే నన్ను శత్రుపక్షమునఁ జేరినవానినిగా నెంచకుందువను దృఢవిశ్వాసముతో నేను మగధరాజ్యములోనివాఁడననియు, గిరివ్రజపురనివాసుఁడననియు, జరాసంధమహారాజు పాలనకు లోఁబడినవాఁడననియుఁ జెప్ప సాహసించు

చున్నాను. నందనందనా! నీకుఁ బగతుఁడగు నాజరాసంధుని యేలు బడియుంటచే నన్ను నీవెఱుఁగవుకాని నేను నిరంతరమును నీ చరణార విందములను నమ్ముకొనిన భక్తగణములోనివాఁడను. అది యిఁ కమీఁద నే నెఱిఁగింపఁబోవు నాచరిత్రముచే నీ వెఱుఁగఁగలవు. నే ప్రద్యుమ్నుఁడనుగాను. దేవా! నా జన్మకారణము భువనపావనతఁగాంచి గోకులంబు మించు నాచంద్రమామకోలమె నాకును జన్మకారణము. నన్ను గంగానందుఁడని జనులు పిలుతురు. మాతండ్రి విక్రమవర్మ జరా సంధునిమహాసేన కధిపతియై చాలకాలము రాజభక్తి నిండార నాతనిఁ గొల్చి, నీకును మగధరాజునకును గొన్ని సంవత్సరములక్రిందట జరిగి న మహాయుద్ధమున నాదురదృష్టవశముననో, తన యదృష్టవశముననో, నీచేత సంహరింపఁబడియెను. అతఁ డదృష్టహీనుఁడే కాకున్న దుర్లభ మగు నీచేతిమరణ మేట్లువానికి సిద్ధించును? తండ్రి బ్రతికియున్న కాల మున నాకుఁ జెల్లిన గారాబమును, నాకు జరిగిన ముద్దుముచ్చటలును, నన్ను నేఁ బొగడుకొనుట కాదుగాని మాధవా! మీప్రద్యుమ్నునకైన జరిగియుండదని నానమ్మకము. అశ్వారోహణము, గజారోహణము మొదలుగ, యస్త్రశస్త్రసంధానమోక్షణంబులు, చతుర్వేదములు, నానాశాస్త్రములు, కావ్యనాటకాలంకారములు, నాకు నిరాఘాటముగఁ బదునెన్మిదియేండ్లప్రాయములోపుననే నేరిపి యేవిద్యయందును నాకు సమానుఁ డుండకుండఁ జేయవలయునని మాయయ్య యెంతయుఁ బాటుపడియె. మందభాగ్యుఁడనగు నాకు నాతండ్రి యెట్లుదక్కును! అట్లు నాతండ్రి నన్ను విడిచి పరలోకమునకుఁ జనుటయు, నాతల్లియు, నేనును నిరాధారగతిఁ గాలముఁ బుచ్చుచుండ నింతలో నీవును మీతాతో జరిగిన కయ్యము సమాప్తమయ్యెను.

నాకు పిల్లలయాటలలోఁ గత్తిత్రిప్పుటలోఁ గల నేర్పునుబట్టి నన్ను పిల్లలెక్క వెట్టి పోరున నిల్చునేని, మహాత్మా నీవును నీయన్నయుగు

బలభద్రుఁడును నిలువఁజాలరని మారాజునకును బ్రజలకును గట్టి నమ్మకము గలదు. ఇది స్తోత్కర్షమని నాపై నలుగవలదు. ఇది యయ్యల యభిప్రాయముగాన నేనుడువవలసివచ్చె. అందుచేత మాతండ్రి తీరిన కొన్నినాళ్లకు జరాసంధుఁడు మాయింటికివచ్చి నన్ను గౌఁగిలించి పితృవియోగదుఃఖము గొంత తనశాంతవచనముల నుపశమింపఁజేసి నాకన్నఁ బెద్దలు, ధనుర్విద్యం గృతచిరపరిచయులు, పెక్కండ్రుండిన, వారి నిరాకరించి సైన్యాధిపత్యమునకు నన్నభిషేకింప సమకట్టెను. ఐనను నాకది యిష్టము కాకయుండుటచేఁ గొన్నినాళ్ళు కడచిన వెనుక నట్లభిషేకము గావింపవచ్చునని దినములు జరపుచు వచ్చితిని. ఇంత మహాపదవి యింత చిన్నతనమున నాకువచ్చి స్వయముగాఁ బైఁబడుచుండ నిరాకరింపవలసినంత యవసరమేమని మీరడిగిన నడుగవచ్చును. దాని కుత్తరముఁ జెప్ప సిద్ధముగా నున్నాఁడను. మాయయ్య జీవించియుండఁగ నించుకించుకయు నాతఁడు గతించిన వెనుక నెంతయు నెక్కుడుగను నాకు మాయేలికపై యాతని దుర్గుణములఁబట్టి యసూయ యెంతవారించిన నిలువక పొడమి తుద కుద్యోగము మానిపించునంతటి యౌద్ధత్యంబు వహించి, మాతండ్రియుండఁగా నాతనికి జంకి కొంత నాయభిప్రాయమును దాఁచితినిగాని, తదనంతరమున నాయిచ్చవచ్చినట్లు వర్తింప స్వాతంత్రియము లభింపఁజేయుటంజేసి నేనే కొలువితోఁ దలఁ గోకికొంటిని. ఆకడపటి కయ్యమున సైన్యాధిపత్యమున కంగీకరింపకున్నను మీపైఁగ త్తికట్టి తక్కున జోదులతోఁ గలసి పోరుమని నన్ను బలవంతపెట్టి జరాసంధుఁడు స్వయముగా బతిమాలెను. కఠినమైన నామనస్సు విఱిగినందున నేనీయకొననైతిని. నాఁటనుండియును నాయేలిక నన్ను మ్రింగివేయవలయునని యున్నాఁడు. ఇది నాచరిత్రమునఁ బూర్వభాగము."

ఈకథ లిట్లు కళానందుఁడు వాగమృతధారలు గురియ నుపన్యసించుచుండ శ్రీకృష్ణుఁడు వాని మొగమువంక తెప్పవాల్పక చూచుచుఁ

బొల్లయినఁ బోకుండ నాలకించుచుండ నర్జునుండును బాహుబలమున, విలువిద్దియ నీతఁడు తనకుఁ దుల్యుఁడగుటకు సందియము లేదని యను కొని తనకార్యమున కాతఁడు తోడుపడుటయే సంభవించునేని యది నెఱవేఱుట సిద్ధమని నిశ్చయించెను. అనంతర మారాజ కుమారత్రయ మిట్లు ముచ్చటింపఁజొచ్చిరి.

కృష్ణుఁడు—కళానందా! నీచరిత్రమునఁ బూర్వభాగము కడు వినసొంపయి యున్నది. నీయుత్తరభాగమునుగూడ వినుపింపవే.

అర్జునుఁడు—ఇపుడు వచ్చినపనికూడ నందుఁ దేటపడునని తోఁచెడును.

కళా—అయ్యా! ఇంకఁ జెప్పఁబోవు పలుకుల స్వప్రయోజనమును బరోపకారచింతయుం గూడఁ గలసియున్నవి. అందు నాలాభ మేమియున్న లోకోపకారార్థము తమరు నాయడిగిన సాయమైనఁ జేయుదురని మీయిరువుర వేఁడుకొనుచున్నాను.

కృష్ణు—ఆ రెంటినిగూడ నిర్విఘ్నముగఁ గొనసాగు. నీవు మాచెవులఁబోయు వాగమృతమే యింతవఱకు యోచించుచున్న కార్యమునకు జీవమును గల్గించుఁగాక యని దీవించుచున్నాను.

కళా—చిన్నతనమున విద్యకలఁచునాఁడు మొదలు నాడెందము మగధరాజు నలువు చెలువుల సేవగోరుచున్నది. ఇప్పుడది వేయిమడుంగు లెక్కుడగుటకుఁ గారణము కల్గినది. చంద్రపాలుఁడను క్షత్రియకులభూషణుండు గిరివ్రజపురమునఁ గలఁడు. తనుజూచినవారి హృదయములనెల్ల నాకర్షింపు మోహనయంత్రమువలె నలరు సౌందర్యతిలక యను కూఁతు రాజన్యునకుఁ గలదు. ఆచంద్రముఖిని గనులార శుకయోగియే నొకమాఱుచూచిన నియమభంగము నిశ్చయముగ నొందునని యీనాఁటివారిం పలుకు వేయినోళ్ళఁ బొగడుచుండ నావంటి ప్రాకృతుఁడా యలుకఁబోడిని వలచుట యొకవింత కాదు. ఒకనాఁ డాజవ్వని

గీచుకొని చేసెను గొలుసువంక రెండొకటి దాచి చేసిన పొరపాటు కతము
న గోటితోండి రొమ్ముగీఱి నామెడమీఁద వ్రాసిన నామె చెలియగు నాగ
వల్లివచ్చి పొదించుకట్టి యిచ్చిన నన్ను నేఁడుటయు నేర్చిన నేను దా
చించుకట్టి స్వయముగ నామెకై నాఁగకడకుం గొంపోయితిని. సౌందర్యతిలక
యు, పెంపుమిక్కుటపయిగల కనికరము పెంపున యూవనవతులను గప్పు
సిగ్గు దొరిచినైచి నాహృదయమును లాగుకొన్నట్లు గొలుసువంకను నాచే
తనుండి లాగుకొని యనంతర మెంతయు సిగ్గువడి తన సాహసమునకు
నొచ్చుకొనెను. నేఁడు మాయిరువురకుఁ బ్రథమదర్శనము. ఆమె నాఁట
నుండి నాయందు వలపు నిలిపినట్లు నాగవల్లి ముఖమునవిని యెంతయు
నిరాశఁ జెందుచుంటిని.

ఆ యిందువదన నను వలచెననుమాట వినక మున్నె రణస్తంభపురాధి
నుఁడు జరాసంధుని యంపుమునకు దొరకెను, దానిపయి నెయ్యంబుని
లిపి, కొన్నినాళ్లకు మొదలుబెట్టెంబు నాపయి హత్తెనని విని, తండ్రి
పయిఁ బడి బలిమిచేఁ దనకా ముడుగుమ్మ నిప్పింపుమని వేఁడుకొనుటయు
నా నేలఱేఁడు నాపయిం గోపమునఁ జేసి యాలేమతండ్రియగుచం
ద్రపాలునిఁ బిలువనంపి రణస్తంభపుర కాంతసౌని నిమ్మని యడుగ,
నతఁడు పెండ్లితనె సంపాదింపుమనవుడు చూడవచ్చునని విభునకు బదు
లుచెప్పి పుత్రికా వివాహార్థమై యెంతచింతఁ గూరియున్నవాఁడు.
నిండు జవ్వనంబు పెంపున యువతీజనంబు లొండొరులపయిఁ
దెలియరాని వలపు నిలుపునెడ వారి తల్లిదండ్రులకు నాటంకములు పొడ
మిన వారిహృదయము లెట్లు నిర్వేదముఁ జెందునో, యెంతటియాపద
వారికి వాటిల్లునో రుక్మిణీకళ్యాణకాలమునకు మున్నె నీ వనుభవించి
తివి. కాన నే వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. ఈ కార్యమున నీభక్తునకు
నీవు తోడుపడవలయును. దీనిఁ బట్టి యాత్మలాభపరాయణుండయిన
వాఁడువచ్చెనని నన్ను దలంపకుము. నేను బరిత్యక్త మీకార్యార్థినయి

రాఁ జేదు. నే నొకవేళ నబద్ధమాడినను సకలలోకాంతర్యామి వగు నీకెఱుఁగక పోవుఁగదా.

కృష్ణు—నే నొనర్పవలసిన లోకోపకారముఁగూడ వాకొచ్చి నీ సందేశము ముగింపుము.

కళా—నేను రాజద్రోహినని నాయందు మీరు దోష మారోపించిన నారోపింతురుగాక. నావిషయమయి మీ రింక నేమను కొన్న ననుకొందురుగాక. మాయేలిక యగు జరాసంధుని చెడుగుల విన్నవించు తలంపున ధరణీభారంబు మాన్ప నవతరించిన మిమ్ముఁ గల్పింప వచ్చితిని. ఆదోసకారి కతమున రాజమండలము పొందుచున్న పాట్లు చూడఁజాలక నాకుఁ గల భూతదయ రాజభక్తిని డెందము నుండి పారఁదోలి నన్నిందుఁ దెచ్చినది. మిడుతలదండుఁబోలు సేనతోఁ బలుదేశములపయి దాడివిడిసి పురముల నాక్రమించి జయించి పుష్పశరసమాకారు లగు రాచకొమరులం దెచ్చి చెఱసాలను బంధించి యనుదినమును భైరవపూజఁ జేసి తన్నివేదనకు ఈ రాజులలో నొకరినో యిరువురనో బలియిచ్చుచుండును. ఇంద్రసమానపదవిఁ బాసి యంతదైన్యము నొందు మూర్ధాభిషిక్తులఁ జూడఁజాలకయుఁ దండ్రులకుఁ బాసిన బిడ్డల గోల వినఁజాలకయు, మగలకుఁ బాసిన పతివ్రతల యార్తనాదముల నాలకింపఁజాలకయుఁ గన్నులు కాయలుగాచి చెవులు చీములు కట్టుచున్నవి.

“ఈవల సాక్షాన్నారాయణ స్వరూపుండవగు నీవు వేంచేసి యుండ, నావల నీకు మేనమఱందియై, మగఁటిమి నీసాటి రాచకొలమునకుఁ దలపూవగు నీయర్జునుండుండ, భీష్మద్రోణాదిమహాయోధులుండ మీకన్నులయెదుట నొక దురాత్ముం డింత ఘాత లోకమునకుఁ జేయుచు బ్రదికియుండునా? ఇట్లుదాసీనులై మీరెల్లరు వాని కట్టుసేయక సెలవిచ్చుట మీకప్రతిష్ఠయేగాని యశస్సంపాదకముకాదు. మాధవా!

నీభక్తజనపాల బిరుద మెందరిగినది? కవ్వడీ నీరాచపాడియేది? నంద నందనా! నీవు మనసారఁ దలఁచుకొన్న నీచక్రిధార కాజరాసంధుని యుసురు లెంతపాటివి? ఈవఱకు నీవు కడతేర్చిన రక్కసుల మీఁక కన్న నీతఁ డెక్కువవాఁడా? ఈతని జంపుటయే చంపుట. వేయేల? జగత్కంటకుండగు నీ మనుజాధమునిఁ బిల్కుమార్చి రాజచక్రమున కభయ మొసంగవేని, యారాజభార్యల యుసురు తగలకపోదు. దేవా! భూతదయ పెంపున నిట్లనరానిమాట లంటిని. క్షమింపవలయు" నని యాకళానందుఁడు ముగించుటయు, వాసుదేవుఁడు వానితోఁ దానాకార్యము దలపెట్టుటకుఁ గాలము సమీపించుచున్నది. భయపడవలదని పార్థుని మొగమువంకఁజూచి "మన మనుకొను పని కిది శుభసూచకముగా నున్నదిసుమా" యని చిఱునగవునగి యప్పటికిం బోద్రాయెనని కళానందునితోఁగూడ విందారగింప లోని కరిగెను.



పంజ్రెండవ ప్రకరణము.



ఆరేయి బంధుమిత్రులతో నందకుమారుఁడు విందుల నారగించి, పండువెన్నెలలోఁ బూలసెజ్జవేయించి యద్దానిపైఁ గళానందునిఁ బండుకొన నియమించి, పార్థునకుఁదగు పాన్పు నమర్పం బనిచి యంతిపురమునకుంజని తాను యథేచ్ఛముగఁబవ్వళించెను. కళానందుఁ డామృదుశయ్యపై మేను వాల్చుటయుఁ దనమనసు హరియించిన పూవుఁబోడి జ్ఞప్తికివచ్చి, కంటికిఁ గొంతతడవు కూర్కులేకుండఁ జేసెను నమమనదుడు వీచు చందనాచలపుఁగమ్మతెమ్మెరలు మనస్తాపమును హరింపఁ జేసి యించుక నిద్రాసౌఖ్యమును గలుగఁజేసెను. గోవిందుఁ డంతటికన్న ముందుగఁ బ్రాతఃకాల మంగళతూర్యారావముల మేలుకని, మేలుకాంచియు నిద్దుర బద్ధకమున లేవలేక కనులు మూసికొనియున్న పా

న నానా మహారాజకిరీటమణిరాజములు చరణరాజీవములకు నీరాజన మిడుచుండఁ గార్యపరతంత్రులగు మంత్రులుఁ జుట్టములు, నెయ్యురుఁ బరిచారకులు సైనికులు మొదలగువారు తన్నుఁగొలువ నిరుకెలఁకుల గదాగాండీవములు కేలమెఱయ, మాభీమసేనుఁడును నేనును నిలువ గద్దెకు ముందునిలిచి వందనములుసేయు రాచవారల పేరులు దనకు నకుల సహదేవులు విన్నవింప, మాయన్న యుధిష్ఠిరుఁ డొకనాఁడు, నిజముగా నఖండల విభవముతోఁ గొలువుఁ దీర్చియుండ నారదుఁడు మహతియను వీణ మెల్లమెల్ల మీటి, దాని మృదునాదముతోఁ దన కంఠస్వరము మేళవించి, నీలీలలంగొన్నిటిఁ బాడుచు నాసభామధ్యమునకుఁ గన్నులు మిఱుమిట్లుగొలుపునట్లు వచ్చి నిల్చెను. స్ఫటికమునుబోలు దేహకాంతితో సభకుఁ గ్రొమ్మెఱుంగులువెట్టుచు నామునిచంద్రుఁ డట్లు నిలువ యుధిష్ఠిరుండు మొదలు ప్రతీహారివఱకు, రచ్చనున్నవా రెల్లరును మోడ్పుఁగేలున నిల్చి మెదలకయుండిరి. అనంతరమున గద్దియడిగ్గి మాయన్న జడదారికిఁ బాదాభివందన మొనర్చి, యర్ఘ్యపాద్యములఁ బూజించి, యుచితాసనమునం గూరుచుండఁజేయఁ బ్రసన్నుండై రాజనీతి యొక్కింత మాకుపదేశించి, యామునివల్లభుండు మాసభను నలుదెసలఁ గనుఁగొని, వర్ణించి యేలికవైపు మొగమై యీరీతిం బల్కెను.

" యుధిష్ఠిరా! అఖిలధర్మములలోఁ దలిదండ్రులసేవ యుత్తమమని ధర్మవక్తలు పలుకుదురు. అదియ సర్వోత్కృష్టముగుటఁ గాదె? ఏల సమస్తప్రపంచసౌఖ్యమును విడిచి మున్ను రాఘవుఁడు, తండ్రిపంపున నన్నవస్త్రములకు దూరుఁడై కాఱడవుల నంతవంతనొందుట! సర్వలోకసందర్శన కుతూహలినగు నేనీనడుమ నొకనాఁ డింద్రలోకమునుండి మరలుచు మార్గవశమున యమలోకముం గనుగొనఁబోయితిని. రాజా! ఈచెదం వార్త మీకుఁ దెలుపకుండనున్న వలనుపడదు. తనకంటె నత్యైశ్వర్యవంతులు నల్పబలాఢ్యులునగు మహీపాలు రింద్రమందిరమున నక్షయ

సౌఖ్య మనుభవింపుచుండెఁ, బాపము, మాతండ్రి పాండురాజు దీనావను డై, చూచువారలకు గుండెలు నీరగునట్లు జాలిఁగొలుపుచు, నాయమ లోకమున నొకమూల దిక్కులేనివానివలెఁ గూరుచుండెను. భూలోక మునందు కాలమున మీయప్పకును నాకును బరిచయముఁ గొంతకలి గెను. కావున యమలోకమంతయును జూచినపిదప, నేను, పాండువిభుని సమీపించితిని. నను జూచినంతోడనే పంచప్రాణములు లేచివచ్చినట్లు కనుభక్తిఁ నన్ను సమీపించి, "మునీంద్రా! చూచినారుగదా నాదుర వస్థ. ఈపాట్లనుభవించుచు నింక నేనెంతకాలముందును? మీరు శ్రమయ ని యోచింపక నాసమిత్తమొకసారి మర్త్యలోకమునకుఁజని, నాకుమారు లగు యుధిష్ఠిరాదులకు, నాదురవస్థఁ దెలిపి, వారిచే నెట్లయిన, రాజసూ యముఁ జేయింపవలయు. ఆమహాధ్వరము నిరంతరాయముగ ముగియు నేని, నే నీయమలోకము నందు బురందరతుల్యుండనై మహాసుఖముల నను భవింపుచుందును. మాయుధిష్ఠిరుఁడు లోకము బిడ్డలవంటివాఁడు కాఁడు, భీమార్జును లతిసాహసులు, క్షత్రియులగు నకుల సహదేవులు గడుయో గ్యులు, మావాసుదేవునకు నేనన్నఁ బ్రాణముగదా! ఇఁక రాజసూ యము నెరవేరకుండు టెట్లని యముఁడు వినకుండ నాచెవిలో మెల్లమెల్ల నఁ బలికెను. అజాతశత్రూ! యెంతభోగమనుభవించిన నేమి? ఎంత ప్రతాపవంతుఁడయిన నేమి? ఎంతెంతవారలుకుమారులున్న నేమి? ఎవ నికైనఁ గర్మమనుభవింపక తీరదుగదా యని యప్పుడు నామనస్సునకుం దోఁచినది. మీరు, కీర్తికిని, దేశాక్రమణమునకును గాదు కాని పితృసం రక్షణార్థము రాజసూయము జేయవలయు" నని చెప్పెను. వాసుదే వా! ఈపలుకులు నారదుని నోటినుండి వెలువడుటయు నన్నగారు, గద్దియ మీఁదనే, కొయ్యబారిపోయిరి. భీమసేనుఁడు చేతినుండి గద తనం తనె జార నొకపీఠముపైఁ జతికిలబడియెను. నేను యుధిష్ఠిరుని పాదపద్మ ముల సన్నిధి నుస్సురనుచుఁ గూరుచుంటిని. తక్కినవారందఱును నివ్వె

రపడి చూడసాగిరి. సర్వమహీధురంధరులగు మావంటి కొడుకులేవురుండి దిక్కుమాలిన వానిచందమున మాయయ్య యమలోకమునందుండి వనటఁ జెందునే, తనకొడుకు లప్రయోజకులని పాపము మాయప్ప యెంత మఱుఁగుచున్నవాఁడోగదా! దుర్యోధనునకుఁబోలె, మాకుఁ గూడఁ దండ్రి జీవించుటయు, నాతని గన్నుల నద్దుకొని పూలఁ బూజించి సుఖించుటయుఁ బ్రాప్తము లేదు సరేకదా, పరలోకముననైన జనకునకు సద్గతిగల్గు కర్మములు సేయనైన మేము నోఁచుకొనమైతిమే" యని యంగలార్చుచుఁ గన్నీరు నొత్తుకొని దీనాననుండై యున్న పార్థుని వైఖరియు, వేలతనమును, పితృభక్తియుఁ గని నగి, మాధవుఁడు, తన మేనమఱందిమీఁదఁ జేయునైచి నిమిరి "పార్థా! ఈవిషయమున కింత కనుపుపగిలి వాపోవుటదేల? రాజసూయము సేయుటమాట యాలోచింతము. రాజసూయముఁ జేయుట చులకనగాదు. అభిమానధనులగు సూర్యచంద్రవంశపు రాజులు తమకుఁదారై మనకు వశులుకారు. జగత్కంటకుఁడగు జరాసంధ గంధసింధురుఁడు మనశత్రువులకు మొనగాఁడై యున్నవాఁడు. అతఁడు జీవించియున్న యెడల యాగము జరుగుట సున్న, మఱియు శిశుపాల సాల్వప్రముఖులు మహాబలశాలురు, జరాసంధవహ్నికి శిశుపాలవాయువు తోడగుచేసి యార్ప మనతరముగాదు. శకయవన పుళింద తురుష్క బర్బర పారసీకాదులు మ్లేచ్ఛనాయకులున్నవారు. ఇందఱితోఁ గ్రిక్కట్టి పోరి గెల్చికదా యజనము ముగించుట. ఐనను మనవారందఱకుఁ బెద్దయుఁ బూజనీయుఁడునగు యుధిష్ఠిరుఁడిందుల కియ్యకొనియెనో యెఱింగించి నీయభిప్రాయమును గూడఁ దెలియపఱుపుము. అనవుఁడు ఫల్గునుం డన్నగారి మత మెఱింగించువాఁడై మాధవుని జూచి యిట్లనియె. "బావా! మాయన్నగారి సంగతి నెఱుఁగనివానివలెఁ గ్రొత్తగా నడిగెదవేమి? వాసుదేవుని యభిప్రాయమే నాయభిప్రాయమని భారమంతయు నీపై మోపినాఁడు. కరుణా

మృతము వెదఁజల్లు నీచల్లని క్రేఁగంటిచూపులును, నావింటితూపులు నక్షయములై యుండెనేని యిట్టిరాజసూయములు వేయియైనను నవలీలగ నిర్వర్తింపఁబడు. త్రైలోక్యైకత్రాణనుండగు మాభీమసేనుని ప్రతాపాగ్నిలోఁ బడి యీసాళ్వాది శలభములు మ్రగ్గవే? నీవు తలఁపు మాత్రము నిలిపిన రాజసూయము నిర్విఘ్నముగ నగుఁగాన మాకు ననుజ్ఞ నీయవలయు" నని చేతులు జోడించి ప్రార్థింప నాతనిమనవి నాలకించి మాధవుండు తలయూఁచి "సరే యుధిష్ఠిరుఁడు మనమున నుత్తలపాటు నొందుచుండును, నీవిఁక నింద్రప్రస్థపురమున కరుగుము. రాజసూయము నెఱవేఱు నుపాయము వెదకి కొన్నినాళ్ళలోన నీకు వర్తమానమంపెద. కళానందుఁడు మనపని కుపయోగించుఁగాత" యని హెచ్చరించి, యుత్సాహంబుఁ గల్పించి, యాపూఁట పార్థుని సబహుమానంబుగ సాదరంబుగ ధర్మనందనుని కడకుఁ బుత్తెంచెను. కళానందుఁడు పార్థుని యొద్ద సెలవుఁ గైకొని కృష్ణునియింటఁ గొన్నిదినములుండి ద్వారకానగరమునందలి విచిత్రములను, వాసుదేవుని లీలలును, గొడుకులబలగము గావించు వినోదములును, గన్నులారఁగనుఁగొనుచు, హృదయేశ్వరి నిమిత్త మెడనెడ విచారించుచుఁ బ్రొద్దులు పుచ్చుచుండెను.



## పదుమూఁడవ ప్రకరణము.



చ. అరమర లేకనే మొగలి ♦ యాకుపయి న్లిఖియించియంపు ను
త్తరము లతాంగి కందినదొ ♦ దానిహరించిరొ త్రోవ దుర్జనుల్
సరసిజనేత్రి యెంతటి వి♦షాదము నొందెనొ నానిమిత్త మె
క్కరణిఁ బుచ్చుచున్నదొకొ ♦ కాలము దుష్టుల మధ్యనుండుటన్.

కూఁతును రణార్ణవున కిమ్మని యా జరాసంధుఁడు బాధించుటఁజేసి, ముదుకఁడగు చంద్రపాలుఁడు రాజున కెదురాడనోపక మెత్తవడి యియ్య

కొనెనో, నాహృదయేశ్వరియె నాపై నిరాశఁజెంది, రణార్ణవునో, మరి యొకనినో చెట్టఁబట్ట సమ్మతించినదో, దైవమా ! ఏమికానున్నదో తెలియదు. తీయువిల్తుఁడు ప్రాణములఁ దీయుచున్నవాఁడు. హా ! హృదయేశ్వరీ ! పౌరుషవంతమగు రాచకొలమునఁ బుట్టిననీవు తుచ్ఛభోగముల కాశపడి, మున్ను నామీఁద నిలిపిన చిత్తమును మరలింకొకనిపై నిలుపవను స్థైర్యమున నొడలఁ బ్రాణములతో నుంటేఁగాని, మఱియొకలాగునఁ దోఁచునెడ, నేనీపాటికె మాయయ్యాకడ నుందునుజుమీ ! కళానందునిఁ దక్క నితర రాజనందనుని కేలు బట్టనని మున్ను చెలులతో నీవుచేసిన ప్రతిన నాగవల్లినాకు నీవులవిందుగా విన్నవించిననాఁటి యానందము మరల నెన్నఁడును గలుగదయ్యె.

తే. గీ. పంజరమునుండి విడివడి ♦ పరుగులెత్తు
చిన్నిగొఱవంకఁ బట్టి నీ ♦ చేతికిచ్చు
వేళ నామీఁదఁ బఱపిన ♦ వాలుఁజూపు
లించువిలుకాని తూపులై ♦ ధృతినిఁ దూల్చె.

అని పెక్కు విధముల మదనవికారమునొంది కళానందుఁ డొకనాఁటిరేయి విలపించుచు, నించుకయు నిద్దురలేక మఱునాఁడు కెంపుఁబాఱిన కనుదమ్ములతో మాధవుని యెదుటఁ గూరుచుండ నీతని యవస్థ నాతఁడు గ్రహించి కార్యము సత్వరముగ ముగింపకున్న నిక్కౌతుకముగ నీరాచపట్టి కృశించితీఱునని మనమునం దలఁచి యాతనితో నిట్లని ముచ్చటించె.

కృష్ణ—కళానందా ! నీయిచ్ఛాప్రకారముగ జరాసంధునిఁ బరిమార్చునుపాయ మరసెదఁగాని నాకుఁజేయు సహాయమేమో చెప్పుము. ఇందు నీలాభముఁగూడఁ గొంతయున్నది గదా ?

కళా—దేవా! సర్వశక్తుఁడవగు నీకు నేను సహాయము చేయఁగలనా? అయినను మీరెద్దిసేయుమనియెద రద్దియు కావింప నుద్యుక్తుఁడనై యున్నాను.

కృష్ణ—నీవిది నీమనసులోనుంచి ప్రయత్నము సేయవలయును. దగ్గఱగా రమ్ము నీకీరహస్యము నెఱిఁగించెదను.

అని చెవిలో నేదియో యొకరహస్యము నూఁది యథాస్థానమునఁ గ్రమ్మఱఁ గూరుచుండ నియమించి యిట్లనియె.

కృష్ణ—నీవును మీశ్రావణులును గలసి నాసందేశముం గైకొని యింద్రప్రస్థమున నున్న యుధిష్ఠిరునకు నొసఁగవలయును. ధర్మజుఁడు రాజసూయముఁ దలపెట్టినపుడె జరాసంధుని మరణముఁ దలపెట్టెను. కావున నీవింద్రప్రస్థపురమునకుఁ జని కుంతీనందనునితోఁ బార్థుఁడు తెలిపిన యంశముల విని దాని పూర్వోత్తర సందర్భములఁ జక్కగ విచారించి రాజసూయము సేయింపఁ గృతనిశ్చయుఁడనైతి ననుము. దానినారంభించుటకు మున్నె వసుంధర జరాసంధ శూన్యము గావలయు ననుము. ఆపనిఁ దీర్పఁగల మేటిమగఁడు మన భీమసేనుఁ డొక్కరుఁడ యనుము. ఈనడుమ గిరివ్రజముఁ బ్రవేశించుటకు జరాసంధు నాయువు పట్టుఁగుఱుకు నెన్నియుం జన్నుగడల నేను బన్నుచుందు ననుము. ఇది శిశుపాల దుర్యోధన ప్రముఖులకుఁ దెలియనేని కడుమోసము వాటిల్లు ననుము. నాచెప్పినట్లు మెలఁగుదురేని రాజసూయము నెక్కు వ్రేల్మిడిఁ జేయించి యుధిష్ఠిరుని భూలోకదేవేంద్రునిగా నొనర్చుభారము నాయదియనుము. మఱియు నేనక్కడకుఁ గతిపయదివసములలో వత్తుఁగాన నీవాదె పాండవుల కతిథివై యుండుము. అదియును గాక శిశుపాల దుర్యోధన జరాసంధుల వేగులవాండ్రు వేషములు వేసికొని దేశములు సంచరించుచు మీవంటి బాటసారులకు నమ్మకముఁ బుట్టఁబల్కి గుట్టుమట్టెఱింగి హానిసేయుచుందురుగాన, గమనప్రమత్తుండవై మెలఁగవలయును. ఈయాలోచన

లు పరమగోప్యంబులనుమాట నీవ మెఱుంగుదువుగదా " యని సందేశ ము హితోపదేశముతోఁగూడ జెప్పి మఱునాఁడు వానిం బంపఁదలఁచు చుండ నంతలో సాత్యకి యరుగుదెంచి యన్నకుం బ్రణమిల్లి నిలిచె. వాసుదేవుఁ డాతనినెమ్మొగముఁజూచి "తమ్ముఁడా తొట్రుపాటున వచ్చితివేమి ? ఎప్పటునన్నైన వింతలు పుట్టెనే " యని పలుకరించెను. సాత్యకియు నలుగడలు బరికించి పరులేరును లేరని తెలిసికొని "అన్నయ్యా! మనవేగువాండ్రలోఁ గడుఁజాఱుఁగలవాఁడగు సారంగుడి దే వచ్చియున్నవాఁడు. జరాసంధుఁడదె ద్వారకపై దండువిడియఁదలఁ చి యీమహాయాత్రకుఁ బెక్కుసైనికులఁ, బసులఁ, బసులకు మేతల, గుఱ్ఱములఁ, దగినరౌతులఁ బోగుసేయుచున్నాఁడఁట. ఇంతకన్న వింత లేవియుండు " నని విన్నవించె. ఆమాటలు విని దేవకీతనయుఁడు సారంగుని బిల్చి కొన్ని ప్రశ్నముల నడిగి వానిమూలమున వాఁడు విన్న మాటలోని నిజమెంతవఱకున్నదో యరసి సాత్యకితో "తమ్ముఁ డా! మాగధుఁడు మనపైకింతలో రాఁజాలఁడు. హంసడిబికుల నిరువు రఁ దెగటార్చి తెక్కలులేని పక్షివిధముఁ జేసితిమి. సన్నాహమొనర్చి మనపై వచ్చునప్పటి కాఱునెలలకన్న నెక్కుడుకాలము పట్టునని తోఁ చెడును. నేనొనర్పఁదలఁచుకార్య మీలోపున జరిగవలయు. అయినను మనము జాగరూకులమై మెలఁగుట కర్తవ్యము. కళానందా! నీవు రేపు రేపకడ బయలుదేఱి కార్యనిర్వాహ మొనర్పుము. మగధరాజునకు శిశుపాలాదు లెవ్వరయిన సాయముసేయ నుద్యమించుచున్నారేమో యరసి నాకు వర్తమానమంపుమని మాపార్థునితోఁ జెప్పుము. అట్లు లేనైనను మున్నవారి పీచమడఁచి వెనుక మాగధుని నుక్కడంచెద. అని మఱియుఁ గొన్ని రాజనీతులు వానికుపదేశించి మఱునాఁడాతనిం బొమ్మని సెలవొసఁగె. ఉదయమునఁ గళానందుఁడు లేచి పయనమయి వాసుదేవుని చరణారవిందములకుఁ బ్రణమిల్లి తన సౌకుమార్యము,

దేహకాంతియుఁ జూరులు చూచి యచ్చెరువడ నా బ్రాహ్మణునితోఁ గూడ నాతఁడు పోవుచుండెను.

ఈయిరువురు నిట్లు బయలుదేఱి మార్గమున ననేక పుణ్యనదులఁ గాంచి యందుఁ గ్రుంకులిడి, బహు దివ్యక్షేత్రములమెట్టి, యున్నత పర్వత శిఖరముల నెన్నియేని నెక్కి, పలుదేశముల గ్రామములఁ బట్టణముల వీక్షించి, వారివారి భాషావైచిత్ర్యములకు, నాచారభేదములకు రూపభేదములకు నెంతయు వినోదము నొందుచు మానవస్వభావము నేర్చుకొనుటకుఁ బ్రపంచజ్ఞాన మువార్జించుటకు దేశాటన మెంతయు మూలంబని తెలిసికొని, యాయాచోటులం గల వింతలను బ్రాహ్మణునకుం దెలియఁ జెప్పుచు సంజవడినచోట విడిదిగాఁ జేయుచుఁ గడు నుల్లాసముగా నడచుచుండిరి. ఇట్లు ప్రొద్దులుజరుగుచుండ నొక్కనాఁడు కళానందుఁడు బ్రాహ్మణునితోఁ గూడ నేదియో ముచ్చటింపుచు, మాటల సందడి దారితప్పి, కొంతదవ్వుచని యొక కుగ్రామముఁ జేరి యందు విడియందలఁప నది మాదిగపల్లియని యందలి నివాసులు తెల్పిరి. వేదాధ్యయనముఁ జేసిన కర్మిష్ఠుఁడగు నుత్తమ ద్విజునకుఁ జండాలవాటి యందు నోటికన్నము నీరు నెట్లుపోవునని పసులఁగోసి యెండవేసిన తోళ్ళకంపున ముక్కు మూసికొని యందు నిలువలేక యక్కడకు దగ్గఱ గ్రామ మెద్దియని యొక మాదిగవానినడిగి మూఁడుక్రోసులదూరమున నున్న వేఱొక యూరికింబోయి వంటఁజేసికొన నిశ్చయించి సాగిపోవుచుండెను. ఆనాఁటి మట్టమధ్యాహ్నము చండభానుఁడు తన సహస్రకిరణములతో వసుమతీమండల మంతయుం గాల్పఁజొచ్చెను. గాడ్పులు నిప్పులం జెరుగుచు, మొగమెత్తినడుచుటకు వీలులేకుండఁజేయ జంతుసంతానములు హాహాకారములంజెలంగి మహాతాపోపహతములై పానీయములకు నలుదెసలఁ బరువులెత్త నారంభించెను. కారుచిచ్చు వృక్షములరాపిడివలన జనించి రాజుల కలహములవలెనే బహువంశంబుల

దహించుచుండ విస్ఫులింగములు చెదరి యెంతయు దూరమునం బడి యచటి పల్లెలంగూడఁ బరశురామప్రీతి సేయఁదొడఁగె. దూరమున రవులుచున్న కాఱడవుల పొగయెగసి బ్రహ్మాండమంతయుఁ గప్పి కాలపురుషుఁడేయు నల్లని తెరచాడ్పున నొప్పియుండె. ధూమమునంజేసి కన్నులఁగానక కొన్నియు, నాసెగఁదాఁకి కమలి కొన్నియును, ప్రాణసంరక్షణార్థమై పరచుచు నిప్పునంబడి కొన్నియు బహుమృగములు మ్రగ్గెను. నాల్కలిగిరి పిడుచకట్టుకొనిపోవుచుండుట దాహబాధకోర్వక మృగములు చూపుమేరదవ్వున జలాశయములట్లుగాన్పింప నత్యాశ నందునీరుద్రావఁగోర సమీపించునప్పటికది మృగతృష్ణయగుట నిర్విణ్ణములగు మనస్సులతో నవిదప్పివోఢమి యుంగలాప్పుచుఁ గడుశ్రమమునొందఁజొచ్చెను. క్షుత్పిపాసాదు లఖిలజంతువులకును సమానములుగద! మాదిగవాఁడు చెప్పిన గ్రామమెంతనడచినను సమీపింపకున్కియు మట్టమధ్యాహ్నమాఁకలితోడయి మేరమీరిన వేదనను గలుగఁజేయుటయు శ్రావణునితోఁ బలుకనైనఁజాలకఁ గళానందుఁడుగూడ జంతుధర్మమగు క్షుత్పిపాసాబాధకు లోనై యడుగుకీసి యడుగు నిడలేక నెట్టులో యోపిక పట్టి కొన్నియడుగులు నడచి తుదకు నరములబలిమి సడలుటయు వచ్చియు రానిమాటలతో "శ్రావణా! యుదకముదక" మని యొక చెట్టుక్రింద మూర్ఛిల్లెను. తలవంచికొని వెనుక నడచివచ్చు శ్రావణుఁడా పతనధ్వని నాలకించి యజమానునివైపు కన్నెత్తిచూచి పరుగుపరుగున నటుపోయి "యయ్యో! యయ్యో" యని కుయ్యిడసాగెను. కళానందుఁడు మాటలాడ నోరురాక తనకు దాహము నిమిత్తము నీరుదెమ్మని సన్నఁజేసెను. అసన్న నెఱిఁగి శ్రావణుఁడు చల్లనియుదక మెందు లభియించునని నలుగెలంకులఁ బరికించి, కన్నీరు పెట్టుకొని హా! దైవమా! గంపెడు బలగముఁ గలవాఁడయ్యు, సకల సంపదలఁ గొఱంత లేనివాఁడయ్యు, దిక్కుమాలినవానితీరున నీభూలోక మన్మథుండు పట్టెం

డన్నము గ్రుక్కెఁడు నీరును లేక మృతినొందును గాఁబోలు నని వగచి, తన కన్నీటి ధారలంబోలె నేలనంటు నూడలుగల పెనుమఱ్ఱిచెట్టు నొక్క దానినెక్కి పాఱఁజూచునప్పటికి నరక్రోసుమేర నొక సరోవరము గానిపించెను.

కాంచి యచ్చోటికి సత్వరము యరుగఁదలఁచి మంగలముఁలోని పలగిఁజలవనువున జంతువులను వేచుచున్న యాపట్టపగటి యెండలోఁదలయుఁ జరణములు మాఁడుచున్న సరకుఁగొనక నడుచుచుఁ ద్రోవలోఁదమవలె పిపాసార్థ మొక పాత్రములో నీరుదీసికొనుపోవు బాటసారుల నిరువురు పురుషులఁ గని యించుక జలమిమ్మని వేఁడెను; కాని వారు వానిమాటలను లెక్కసేయక యరిగిరి. శ్రీపతియును వారి కఠినతకు న్వెరువడి యతిత్వరితముగ సరోవరమునుజేరి, యచ్చటి శీతల జాలాన్వమగు మలయానిలునకుఁ బారవశ్యము నొంది, కనుపు పట్టినంతనీరు గ్రోవి మఱ్ఱియాకుల దొప్పలుకట్టి యందుఁ గళానందుని నిమిత్తము కొంత జలమును బోసి క్రమ్మఱ బయలుదేఱెను. అంత శ్రమజెంది స్వామి ప్రాణరక్షణార్థము నీరు దెచ్చి యాచెట్టుక్రిందికివచ్చి చూచునప్పటి కాస్థలమునఁ గళానందుఁ డుండఁడయ్యెను. కాని వెఱపుగొలుపు క్రొన్నెత్తుటఁ దడసినకత్తియుఁ, గళానందుని యుత్తరీయము మాత్రము గానవయ్యెను.



## పదునాలుగవ ప్రకరణము.

నెత్తుటఁ జొత్తిల్లిన యుత్తరీయము, గత్తియుఁ గంటఁబడినతోడనే, పాఁతపగచేతనో, ధనము మరిచ్చిలనెత్తిన యాసచేతనో యెవ్వరో నరహంతకులు తనయజమానునిఁ దెగటార్చి రని శ్రీపతియును తలఁచి గుండెపైఁ జేతితో మోదుకొని, హా! కళానందా! నీ పాదసేవకు

నెంటరిగ నట్టడవిం దిగవిడిచి పరలోకమునకుఁ జనఁ గడఁగినాఁడవే. వివాహమునకు విఘ్నములు వాటిల్లినవని వాని నివారింపఁ దలఁచి దాఁరకకు వచ్చి యిట్లగుదువని యెన్నఁ డనుకొననయితిని. నూరేండ్లు నిండి కాటికి కాలుచాపుకొని నీరాక ప్రతిక్షణము నిరీక్షించు మీయమ్మతో నేనేమని విన్నవింపుదు? అయ్యో! నీమీఁదనె పంచప్రాణములు నిల్పికొనియున్న యాముసలి యన్న యీమాట విని గుండెపగిలి చావదే. ఆమెమాట యటుండనిమ్ము రూపున రతియు, విద్యను భారతియునై, యౌవనమున జనించు మోహసముద్రముఁ గళానందుండను తెప్పసాయమున నీఁదఁ దలఁచిన సౌందర్యతిలకమాట యేమి? నీయకాలమరణమున మగధరాజ్యమున నెవ్వియేని వింతలు వొడమకపోవు. చిదిమినఁ బాలుగాఱు నీసోయగంపుమే నెంతలో నేలపాలయ్యె! హా! భూలోకమన్మథా! బ్రదికియున్న నాలుగుదినములు నెంతలెంతలద్భుతకార్యములు సేసితివి! శ్రీకృష్ణునంతవాని నిరువదియొక్కసారులు పోరిలో గెల్చిన మేటిమగఁడగు జరాసంధు సంతతివానిఁ జీరికిఁగొనక ప్రతికక్షఁబూనఁగల సాహసికుఁ డింక ద్వాపరమున జన్మింపఁడు. అయ్యో! నిన్నుగ్రుమ్మిన కలుషవాలుతో నాఘాతకుఁడు నన్నేల క్రుమ్మఁడయ్యె. ఇట్టి ఘోరవార్తను నీచుట్టముల కెఱిఁగించు వ్రాఁత నా మొగమున వ్రాసియుండ నాకేల మరణము సంభవించును. నీతోడఁ బయనముఁ జేసినన్నినాళ్ళ నీమాటల నేర్పువలన నీ దయారసమువల్ల నాకు మార్గాయాసమైనఁ గానఁబడదయ్యె. పెద్దకాలపువాఁడనగు నామ ముప్పు నీవ గడపుదువని యాసఁజేసి కొలిచి కాండవులలో నీముప్పు నేనే గడపితినిగాని నాకు నీవు కావైతివి. ఎందఱిని పడుచువారిని దిగమ్రింగకుండ నీశ్రీణుఁడు మేను దొఱఁగునా. నాతండ్రి ప్రపంచమునకు నిష్ప్రయోజనుఁడైన నావంటివాఁ డుండి సర్వవిధములను గనకవృక్షమవగు నీవు కడతేఱుట నాపాపముగాదా! నిన్నెత్తుకొని

మోఁదినకాయలు నాబుజమున మాయనైన లేదు. నాకన్నులముందఱ నీకొకగడియలో రూపుమాసె. ఏమి సేయుదు నయ్యో యని తన దైన్యముం గూర్చి పెక్కువిధములఁ బొక్కుచు వేఁడి కన్నీళ్ళు ముడుతలు పడిన ముసలిచెక్కులమీఁదనుండి జాఱి నేలరాల నేడువసాగెను. అట్లు కొండొకతడవు వాపోయి యాపూఁట కూడు దొరకకునికి నాయాసము తిన్నలమినం జేవయఱి యొక చెట్టునకుఁ జేరఁబడి యుస్సుఁగుస్సురనుచుఁ గొంతసేపు వగర్చి కన్నులుమూసి పరవశుఁడై యుండెను.

ఇంతలో నాతనికిఁ గునుకుపట్టి యించుక నిదురించుచుండ భానుఁడు గ్రుంకి యపరజలధిఁ బడి జగముం జీఁకటుల ముంచెను పట్టపగటనే సూర్యరశ్మి కానరాని యాకారడవిలోఁ బ్రొద్దు గ్రుంకిన వెనుక నెట్టు లుండునదియును వర్ణింప నెవ్వరితరము. ప్రొద్దుగ్రుంకు నప్పటికి శ్రావణుఁడు కునుకుఁ జెందినందున భయంకరమగు చీఁకటినుండి తొలఁగి యెటకేనియుఁ బొందఁడయ్యె. చీఁకటిపడిన వెనుక మేలు కాంచి చూచునప్పటికిఁ గళానందుని నిమిత్తము పడుచున్న నెవ్వగయంతయు నడంగి యపూర్వమగు భీతివాడిమి యొడలు వడఁకఁజేసెను. ఎంత వడఁకిన నెంత భీతిలినం దన్ను దానె యాశ్వాసించుకొనవలయును గాని యాయరణ్యమునఁ దనకు శరణ్యులగువారు లేనందున నెట్టకేలకు మనము నిబ్బరము చేసికొని యెదుట నేదియున్నదియో వెనుక నేది యున్నదియో యెఱుఁగ లేశమైన నవకాశము నొసంగక దన్ను జుట్టుముట్టిన గాఢాంధకారముచేత మది నేవెరపుఁ దోఁచకునికి మెల్లన నాతఁడు జేరఁబడిన చెట్టునకు వీఁపు నానుకొనెను. తోడనే యాతని కర్మవశమునఁ జిటుక్కున నేదియో విషజంతువు కుట్టెను. నిప్పుపెట్టి కాల్చినయట్టుల నెమ్మేను బగ్గున మండుటయు నావృద్ధఘటము తాళఁజాలక యబ్బా యని కుట్టినచోటునఁ జేయివైచి రాచికొనుచు నది నొవ్వఁగుట్టినందున మిక్కిలి బాధపడుచుండెను. ఆయవస్థలో నాదీనుని

మనోవ్యాకులత యెట్లులుండెనో వ్రాయుటకన్న నూహించుట సుకర
ము. తాను సర్పదష్టుఁడ నైతినని యొకమారు భయపడుచు మందైన
వేయువారు లేమికి నగచుచు, నెట్లులయిన నాకట్టడి మేనువాసి పరలో
కమునను న్న తనయజమానునిఁ గలయుట సంభవించునని సంతసించుచు
నేదియుఁ జేయఁజాలక తన పల్కు లరణ్యరోదనముగా విచారపడఁ
జొచ్చెను.

ఇట్లు రెండుగడియలు మేరకుమీఱిన బాధ పడుచుఁ జీఁకటిసము
ద్రములో మునిఁగియున్న యామృదుసలికిఁ బాపాత్మున కీశ్వర సందర్శ
నము లభియించినట్లు రవంత వెలుఁగు కానఁబడియెను. మొట్టమొద
ట శ్రీవణుఁడు దానిఁ గనుగొని యది తన మనస్సునఁ జెందు భ్రాం
తియో, లేక యరణ్యమునసుండు నింత పురుపుల మేనికాంతియో య
దియును గాదేని కొండలలో విద్యుల్లతలుండునని పెద్దలు చెప్పుదురు
గాన వాని వెలుఁగో యని శంకించి క్రమముగ సూర్యకిరణములవలె
దాని కాంతులు వృక్షములు సందునుండి తన చాయ కరుదెంచి వచ్చు
టయుఁ జూచి నిజముగా వెలుతురై యుండనోపునని యూహించె.
అది సమీపించినకొలఁది శ్రీవణునకు నించుక ధైర్య ముదయించుటకు
మాఱు, యక్ష కిన్నర గంధర్వ పిశాచ రాక్షసుల మూఁకలు కాఱడవు
లఁ గాఱుఁజీఁకటులఁ గ్రుమ్మరుట నిందుము. ఈవచ్చువాఁ డం దెవ్వఁ
డేని యైయుండి నాబడలిన మేను దనకు సంజకబళముగా వినియోగిం
పఁబోవునని శంకింపుచుండ నంతలో నలుఁగఁగొట్టిన కొఱవిపాలకట్టఁ
గాగడాగా వెలిఁగించుకొని దీపపుఁ గ్రీనీడతో వియ్యమొంది యచ్చటి
కాఱుఁజీకటికి వన్నెలు సవరింపఁగలయంత నలుపు దేఱి మేనిచాయతో
బలముగల పొడవువాఁ డొకఁడు శ్రీవణుని కట్టెదుట నిలిచెను. అతని
కన్నుగొలుకు లెఱుపుమీఱి చింతనిప్పులచొప్పునఁ జూచువారి గుండెల
కు భయోత్పాతముఁ గలిగింపఁజొచ్చెను. ఎడమచేతఁ బాలకట్టయు

గుడిభుజముపై గండ్రగొడ్డలియు నప్పుడప్పుడే పట్టివధించి జఠరాగ్ని కింధనముగాఁజేసికొన్న కాలెనుపోతు క్రొన్నెత్తుటఁ దడిసిన కఱకు మీసములను జూచి యాతఁడు రాక్షసుఁడని యెఱిఁగి శ్రీవణుఁడు, తన యంత్యకాలము వచ్చెనని జంకుచు ఖేదపడుచుండెను. అంతట నాకేదిమ్మరీఁడు ముసలివాని యవస్థఁజూచి రాక్షసజాతికి విరుద్ధమగు జాలి తన్ను బాదున వానిఁ గడతేర్చక "ఓరీ ఏమిరా నోటనుండి వోంగలుగ్రక్కుచు నటు బాధపడియెదవు. నీకేమిరోగమురా?" యని యడిగెను. ప్రత్యుత్తర మొసఁగుట కిష్టములేకున్నను, బదులు చెప్పకున్నను నాతఁడు తన్నొకచఱపుఁ జఱచి చంపఁగలఁడని శ్రీవణుఁడు మెల్లమెల్లగ "నన్నిచట నెద్దియో కుట్టినది. చెట్టునకుఁ జేగిలఁబడినపుడు నావీఁపు బగ్గున మండినది. నాయనా" యని పలికెను. ఈపలుకులు విని వెంటనే వాఁడందు నిలునక వడినడిఁ గొన్ని యడుగులదూర మరిగి యందు నిటునటు నెమకి యెద్దియో గ్రహించి క్రమ్మఱవచ్చి ముసలివానిఁ బలుకరింపకుండనె రెండుఱెక్కలుబట్టి వానిని లేవనెత్తి యక్కటా! యిదియేమి దైవమా యని యాతఁడు మొఱపెట్టుచున్నను సరకుఁగొనక గొన్ని యాకులు నలిపి యాపసరు నాతనివీఁపున గట్టిగా రాచెను. ఆమోటురక్కసుఁడు చేసిన మోటు వైద్యముతో ముసలివాని వీఁపుమంట రెండుగడియలలో నుపశమించుటయు నాతఁడు నేదఁ దేఱి సంతసించి వానితో నిట్లనియె.

శ్రీవ—అయ్యా నన్ను రక్షింపవచ్చిన దైవమువలెఁ దోఁచు నీవెవ్వఁడవు. పాము పూలదండయైనట్లు నీవు నాకు మొదట భయము గొల్పి రక్షకుఁడవైతివి.

రెండవవాఁడు—ఓరీ! వినలేదా జ్వాలాజిహ్వుఁడను రాక్షసరాజు పేరు? నేనామహాత్ముని సేవకుఁడను. నాపేరు కపాలమాలి. ఈయరణ్యము మాప్రభువుగారికి జరాసంధుఁడు శిశుపాలుఁడు బట్టముగట్టి

రియొనఁగినారు. నేను రాక్షసదండనాథుఁడను. పాండవపక్షులను వాసు దేవానుచరులను బట్టి శిక్షింపుమని మారాజు నాకానతిచ్చె. నీవు వాని లో నెక్కండవైతివేని యిదిగో నానోటఁబడుము.

అని తన వెడఁదనోరుఁ దెఱచి మేకువంటి పండ్లను జిహ్వ పలక కాయఁబోలు తన నాలుకను జూపి శాత్రిణుఁ గడలఁబెట్టెను. శాత్రిణుఁ డామాటలు విని ద్వారకనుండి వచ్చుట వానికిఁ దెల్పినఁ దన్నతఁడు సంజుకొనునని తనరాక మాటుఁజేసి చెప్పఁదలఁచుచుండ నింతలో నా పాలసుఁదిండి " యోరి నీవెవ్వఁడవో చెప్పవేమిరా! యని బిగ్గరగా నఱచెను." అంతట శాత్రిణుఁడు మెల్లమెల్లన నిట్లు విన్నవించుకొనియె ను. "కపాలమాలీ నీకు నేను బరమాప్తుఁడను సుమా! ఏపురము నీ నెచ్చెలియగు జరాసంధునకు గాఁపుర మాపురమే మాకుఁ గాఁపురము. నే నుజ్జయినీపురమునకుఁ బోయి యచ్చటనున్న మాచుట్టములను జూచి మరల నింటికిఁ బోవుచు దారితప్పి యిటువచ్చితిని. నాకు దారిఁజూపి కాపాడఁగల భారము నీయదియసుమీ" యని నోటికి వచ్చినన్ని య బద్ధములు సెప్పి రాక్షసునకు నమ్మకముఁ గల్గించెను. అంతట దై త్యుఁడు తలయూఁచి " సరే యెట్లయిన నీవుమాతొము మాప్రభువగు జ్వాలాజిహ్వుని దర్శనముఁ జేసి యాతనియొద్ద సెలవుఁ గైకొనిపోవ లయు రమ్మ " ని చెక్కులు పట్టుకొని యాతని లాగఁదొడఁగెను. ఈ నడుమఁ గాగడాగా నుపయోగించు పాలకట్టె క్షయమైపోవుట నాతఁడు చంకనున్న రెండవకట్టె నంటించుచు గాలికెదురుగాఁ దిరిగి నోటితో నుష్టని యూఁదుచుండ నాసందెటిఁగి యజమానుని కత్తియు మన్న గృష్ణుఁ డాతని కిచ్చిన లేఖయు నేలఁబడియున్నందున వానిని సంగ్ర హించి యుత్తరముదాఁచి వాలుఁ గేలఁబూని శాత్రిణుఁడు రక్కసునివెం టఁ బయలుదేఱెను.

## పదునైదవ ప్రకరణము.



అట్లు కపాలమాలి తన మేలికయగు జ్వాలాజిహ్వునియొద్దకు వృద్ధుఁడగు శ్రావణుని వెంటఁబెట్టుకొని యరుగుచుండ, బహువిధముల గు పులుఁగుల యెలుఁగులు, ఘాతుకజంతుసంతతుల యఱపులు, నందు ముఖ్యముగా బెబ్బులుల గాండ్రుగాండ్రు మను కేకలు, త్రాఁచుపాముల బుసలు శ్రావణుని కమిత భయము నాపాదించెను. ఎంతయు దిగులు న నరుచేతఁ బ్రాణంబుల నిడికొని యేఁగుచున్న వాని మద్దఁ గైకొన్నమూర్తి యో యన్నట్లు వారి కట్టెదుట వఱువాతి మొదలు నాహారింప నెట్టిజంతువు లభియింపమింజేసి పేరాఁకలిచే నకనకంబడుచుండి మనుష్యదర్శనంబగుటం సంతసంబునఁ జివాలున లేచివచ్చు నొక వ్యాఘ్రము వారి కంటఁబడియె. వెంటనే శ్రావణునకు నొడలు కంపమెత్తి నందున "నయ్యో యేమిసేయుదు నేమిసేయుదు" నని కపాలమాలిని బిగ్గఁ గౌఁగిలించుకొనియెను. ముందు శ్రావణుఁడును, వెనుకఁ గపాలమాలియును వచ్చుటంజేసి యాశార్దూలము మందభాగ్యుఁడగు నాసేవకుఁ దుదముట్టింప మీఁదికి వచ్చుచుండ దాని నెదుర్కొని కయ్యము సేయుటకుఁ గపాలమాలి సంరంభించుచుండెను. కాని మొఱకువాఁడగు ముదుసలి వానిని వీడఁడయ్యె. రక్కసుండును బెబ్బులికన్న భయంకరాకారముఁదాల్చి తన్నుఁ గౌఁగిలించి విడువకున్న యాయనదను జేతులతో నెత్తి వెనుకప్రక్కకు విసరివైచి యప్పటి కొక్క యడుగు దూరములోనికి వచ్చిన క్రోలుపులిపైఁ గవిసెను. అదియును హుమ్మని యొక్కసారి రక్కసుమీఁదఁ బడుటయు నాబండ తనబాహుబలమున మండఁగఁ బులిని నేలం గూలఁద్రొబ్బి తన రెండుచేతుల దానితోఁకఁబట్టుకొని మున్నాఁడు భీమసేనుఁడు గదాదండమును ద్రిప్పు చందమున గిఱగిఱఁద్రిప్పి యొకపాషాణముపై వైచికొట్టె. కొట్టుటయుఁ

దలవఱియ్యలై నెత్తురుఁ గ్రక్కుచు నది యొక్క అపటచి మృతి నొందెను.

శౌర్యమునందె కాక బాహుబలమునఁ గూడ బెబ్బులినిమించిన ట్టి రక్కసుని పరీక్షకు నరుఁడు తాత్కాలికానందము నందియు వానిచేతి నుండి తాను మృత్యుదేవత బారిఁ బడకుండ మరలఁ దనవారి నెన్నఁడే ని చూడఁగల్గుదునా యని వగచుచుండ నాదుండగుఁ డరుదెంచి తలపై నొక్కదెబ్బ వైచి "యోరీ, పిరికిగొడ్డా! ఈదినము నీవు చచ్చుటయే గాక మీఁదుమిక్కిలి నను గూడఁ జంపుదువు సుమీ. అపాయము వచ్చి నప్పుడు నాకుఁ దోడగుటకు మాకు ననుబట్టి విధవనైతివేమిరా! నీని మిత్తము నేనీవాహనము దెప్పించితి నెక్కుదువు ర" మ్మని బలిమిచేఁ జే యిఁబట్టుకొని యానేనకుఁ డావ్యాఘ్రికళేబరము మీఁదఁ గూరుచుండఁ బెట్టి "శ్రావణమహారాజుగారూ! మహారణ్య రాజ్యమునకుఁ బట్ట ముఁ గట్టుకొనుఁడీ" యని పరిహసింపఁ జొచ్చెను. ముసలివాఁడును బుద్ధిలేని యాపాడు రక్కసుని చేతఁ దానింక నెన్ని యిడుమలఁ గుడువ వలసియున్నదో గదా యనియు, యెట్టివాఁడైననేమి? ప్రాణదానముఁ జేసిన పుణ్యాజనుఁడనియు నెంచి యప్పాడు వయ్యమునకు ముచ్చటతీఱునం తవఱకు వాని చెప్పినచొప్పున పులిపీనుఁగుపై నాసీనుఁడై యుండ, వాఁ డును దనచేతి పాలకట్ల కొఱవితో ముమ్మారు వానిమొగముకడఁ ద్రి ప్పి "మహారాజుగారికి కొఱివియిచ్చినాను లెండీ" యని ఱెక్కఁ గూడ మూ డివచ్చినట్లు లాగెను. "ఎట్లయిన నాతనివెంట నరుగక తప్పదుగదా" యని శ్రావణుఁడు లేచి మెల్లమెల్లన నడుగులిడుచు నిస్సత్తువచే నడువ లేక త్రోవలో నిలుచుచుఁ బోవుచుండ రేదిర్మ్మరి రెండుమూఁడు సారులు వానినిమిత్తము దానుగూడ మెల్లఁగ నడచుచు నతని కిట్లని యెను. "ముసలివయ్యా? నీవు నడవీనుఁగు చావనున్నావు. ఇప్పుడు చాల ప్రొద్దాయెను. మాస్వామినామొనర్చిన యాలస్యమునకు

నాపైఁ గినుకఁబూను. నీ వమిగిడఁజాలకున్నావు. నిన్ను విడిచి నేఁ జనరాదు. కావున నీవు నాభుజముపై నెక్కుము. నిన్ను ముహూర్తములోన మాయింటియొద్ద దింపివైచెద" నని తన మాట లింక ముగియకమున్నె వాని నువ్వెత్తుగఁ బట్టి యెత్తి భుజముపై నిడుకొని నడువసాగెను. ఇప్పుకల్లు చిత్తమెఱుఁగకుండఁ దాగిన వానిమూఁపునఁ గూరుచున్నందుకు శ్రీపణుంకు మనశ్శాంత యొకింతయుఁ గానరాక "యిఁక నీ చంచలచిత్తుఁ డెందుఁ దన్ను కస్మికముగఁ బారవేయునో" యని భయమందుచు, వాని కంఠమునకుఁ జేతులు పెనివేసి కనులు మూసి, భగవంతునిపై భారమువేసియుండెను. అట్లు కతిపయదూరమరిగునప్పటికి వాఁడొక్క మిట్టు నేలనెక్కి నడచుచుండె. మీఁదఁగూరుచున్న శ్రీపణుంకుఁ గన్నులముందట, పెనుమంటల నెగసెడు నాలుగునెగళ్ళును, వానిచుట్టును గూరుచున్న కాలకింకరులఁబోలు పదుగుఱు భీకరాకారములును, జెవ్వలు పిక్కలు సేయు వారలయార్పులును గనఁబడి వినఁబడి కూరుచున్న ముసలివానిని భుజముమీఁదనే పరవశుని గావించెను. ఆ పాఱవశ్యతనుండి, వాఁడు మేల్కొనునప్పటికిఁ గపాలమాలి యాప్రదేశమునకు వానిఁ దోడ్కొనివచ్చి, యొక వోట మూటదింపినచందమున వానిని గుభాలున నేలఁ బారవైచెను. ముసలివాని కెముకలన్నియుఁ జూర్ణమగునట్లు దెబ్బలు తగిలెను. కాని విధిలేక తక్షణము నిలువఁబడెను. నిలువఁబడి చూచునప్పటికి నక్కడనున్న మూఁకలలో "మానిసి మానిసి" యని యొకకోలాహలము బయలువెడలెను. అంతలో నచ్చటనున్న స్త్రీపురుషులందఱును వచ్చి వానిచుట్టును మూఁగి, కపాలమాలి ననేక పరిశ్నపూర్వకముగ వాని యిక్కడెద్దియనియు నామ మెద్దియనియు నరయఁజొచ్చిరి. కొఱికి పాఱవైచిన యెమ్ములు, నెండవైచిన జంతువుల చర్మములు, గుళ్ళిన మాంసపుముద్దలు, నేలఁ బ్రవహించి యెండి యట్టకట్టిన నెత్తురులు·

ముక్కు బద్దలగునట్లు దుర్వాసనఁ గల్గించి శ్రావణుఁడు నిలుచుటకు వీలులేనట్టుచేసెను. దానికిఁ దోడై తన్ను జుట్టుకొన్న రక్కసి మూఁకల దేహములనుండి వెడలు గబ్బు వశింపఁ దరముగానంతదై యదియె నరలోకమై యుండవచ్చునను సందియమును శ్రావణునకుఁ గలుగఁజేసెను. క్రిక్కిరిసిన రక్కసుల నొక్కప్రక్కకొత్తిగించి కపాలమాలి, శ్రావణుఁ దన యేలికకుఁజూపు తలంపున వానిని వెంటఁబెట్టుకొని, కేటొక చోట నేలపై నెత్తుగాఁగట్టిన యొక మంచెపైఁ గూరుచుండి, సేవకుఁడు నెగడిలోఁబేల్చియిచ్చు నేదుఁబంది నంజుడుఁ గుందమకముతో మెసవుచు నెడనెడ హరిణశాబకముల మాంసముఁ జవిచూచుచుఁ బులివలె నందఱకు భయంకరుండై మంటలవెలుఁగున సంపూర్ణముగఁ గనఁబడు చిన్నకొండవంటి మహాకాయుడు సేవకులకు భీతిఁగొల్ప నానందపారవశ్యముచేత నడుమనడుమ గుండియలు పగుల నఱచుచున్న జ్వాలాజిహ్వునిఁ గని జోహారొనర్చి, యొకమూల నొదిగి నిలిచెను.

తనువున నసువులెగిరిపోయెనో నిల్చెనో యను సందియము గలిగించునట్లు శ్రావణుఁడు వడఁకుచు వానివెనుకఁ దన యొడలి క్రీనీడయె రాక్షసేశ్వరునకుఁ గనఁబడునట్లు నిలిచెను. మూఁడేడుబందులు నాలు లేడిపిల్లలు గొన్నిపక్షుల నాహరించి యొకరీతిగా క్షుదానలముఁ జల్లార్చుకొని యెదుటనున్నవా రదరిపడునట్లు దేన్చి కనులువిచ్చి తల యెత్తి యెదుటనున్న కపాలమాలింగాంచి "యోరీ? నీవింత యాలస్యముగ వచ్చుటకుఁ గారణమేమి? నీవెనుక నక్కపోతులాగు నక్కి గుక్కుమిక్కుమనకుండ సగము చచ్చినవాఁ డెవఁడురా" యని మెల్లగాఁ బలికెను. కపాలమాలియుఁ జేతులుజోడించి "యీపాపాత్ముఁడు మనుష్యుఁడు, మార్గవశమ్మున వీఁడొక చెట్టుక్రింద నీకాలుపువులలోఁ బడి యెటు నరుగఁజాలక నటునిటుఁబడుచుండ నీతనిం గలసికొని మార్గఘుండనియు, జరాసంధుండు మన కాప్తుఁడు, కావున వీఁడును మన కాప్తుఁ

డని యెంచితిని. మీఁదఁ దమచిత్తము దేవా" యని విన్నవించెను. అనవుడు నాదనుజనాయకుఁడు నగి "యీతఁడు మనుజుఁడా? ఓరీ యిటురారా" యని పలికెను. తోడనే నలువురు రక్కసి జెట్టు లరుగుదెంచి, భయమున వడఁకుచున్న శ్రావణుని రెక్కలం బట్టుకొని తేని ముందఱఁ బెట్టిరి. రేఁదిమ్మరిఱేఁడు వానిం గనుంగొని 'యీముసలివయ్యా మిట్లున్నవాఁడేమిరా?' యని వాని కాలుకీలుపట్టినొక్కి వీఁడు స్పృశించినమాత్రమునఁ జచ్చునట్లు తోఁచెడును. ఓరీ నీకాఁపురము మగధరాజ్యమేనా? అని యడుగ వాఁడును సభయముగఁ జిత్తము నేను మాగధుఁడనే' యని ప్రత్యుత్తరమిచ్చెను. అంతట రక్కసులసామి యొక చిన్న రక్కసుఁబిలిచి "మన యిందుమతి యీతని నెఱుఁగునేమో యడుగుద మామెనిటు కొనిరమ్ము" అని ముదల యొసఁగ నాసేవకుఁడు లోనికరిగి యొకముహూర్తమున నాయిందుమతిని వెంటఁబెట్టుకొని వచ్చెను. ఇందుమతి యనిన పేరు వినఁబడినతోడనే యది నాకుసాంగనయై యుండవోపుననియుఁ దనమీఁద లేనినేరము లెవ్వి సెప్పునోయనియు శ్రావణుఁడు జంకఁదొడఁగెను. కాని యామె వచ్చిన పిమ్మట నాతఁడనుకొన్న దన్యథాయయ్యెను. ఆవచ్చిన యిందుమతి వికృతివేషిణియగు నొకరక్కసి కన్నియగాక దివ్యసుందర విగ్రహయగు నొక మానవకన్యయైయుండెను. మణిభూషణములు జీనాంబరములు లేకయున్న ననాగరికులనడుమ కాలముఁ బుచ్చుచున్నయామె మేనలంకరించిన ముదుగుచీరయు వేనలిని ముడువఁబడిన యడవిపూవులును, బదునెనిమిదియేండ్ల నిండుజవ్వనముచేఁ బరిపూర్ణదశఁ బ్రాపించిన యందమునకు వన్నెయిడుచుండెను. కారడవులఁ జిరకాలము సహవాసముఁజేసి గజరాజునొద్దనుండి నేర్చికొనిన గమనవైఖరినాఁడు ప్రదర్శింపఁజేయుచున్నదో యనునటుల మందగజగమనంబుతో ముద్దులు మూటగట్టుచు సింగారముట్టిపడు వదనచంద్రబింబముతోఁ జేరలం గొలువఁ

జాలిన కనుదామర రేకులతో విచారమును సూచించు వైఖరితో సార్థకనామధేయమగు నిందుమతి వచ్చి నెగళుల వెల్గునఁ దన యంగసౌష్ఠవముఁ గని ముక్కిడి రక్కసిబాలకులలోపల మదనతాపమొందవచ్చి జ్వాలాజిహ్వుని కట్టెదుట నిలిచెను. రాకసుఁ డాపెనుజూచి "బిడ్డా యీ మనుజునిది గిరివ్రజపురమఁట, నీ వెఱుఁగుదువే" యన నాపె శ్రావణుని ముఖాంబుజమును దప్పక రెప్పవేయక చూచి "నేనెఱుఁగ" నని పలికెను. "ఔను నీవేమి యెఱుఁగుదు వప్పటికి నాలేండ్లదానవేగదా" యని రక్కసితోఁ దుస్త్రగము చెప్పి యామెకు లోనికరుగ నానతిచ్చెను. ఇందుమతియు నెద్దియో యించుక యోచించుచు రెండుమూఁడుసారులు శ్రావణుని నెమ్మొగముఁగాంచి మెల్లమెల్లగ లోనికరిగెను. అనంతరము రాకసేశ్వరునకు నిద్రవచ్చుటచే నాతఁ డందఱకును సెలవొసంగి యామంచెపైఁ గూఁడవలెఁ బండుకొనెను. కపాలమాలియు శ్రావణునకుఁ బట్టెడన్నముఁ బెట్టించి, యాతని నొకచోటఁ బండుకొన నియమించి, తానును దక్కిన రక్కసులును గడుపుపట్టినంత యిప్పకల్లుఁద్రావి దూరముగ నరిగి యఱచుచు నేల దొర్లుచు బహువినోదములం దేలుచుండిరి. శ్రావణుఁడు పంచాగ్ని మధ్యమున నున్నటులున్న తనయవస్థం దలఁచి యించుక వగచి యిట్లని తనలోఁ దాను వితర్కించుకొనఁజొచ్చెను. "అహాహా! తుమ్మచెట్లనడుమఁ గమ్మసంపెంగమొక్క మొలచుట విచిత్రము గనున్నది. ఈ లావణ్యపయోనిధియగు నిందుమతి యీరాక్షసుని పుత్త్రికయైయుండునా? ఇది యసంభవము. ఈమె తప్పకమనుష్యాంగన. కారాగారాంతరమున నిందుండఁబోలు. నే నిందున్నదినములలో నెట్లయిన నీమెస్థితి నరసి యీమె కేదయిన నుపకారమొనర్చి చెఱబాపయత్నింతు" నని కొనుచుఁ గన్నులుమూసి నిద్రించెను.

# పదునాలవ ప్రకరణము.



మఱునాఁడు శార్వణుఁడు రక్కసులకన్న మున్న మేలుకాంచి యెట్లయిన నిందుమతి చరిత్ర మరయుతలంపున నామె పండుకొన్న చోటికరిగి చేరువనె చియున్న తలుపుఁ దెఱచెను. మువ్వురు రాక్షస స్త్రీల నడుమ నిద్రించుచున్న యా యిందుమతిని గనుంగొని యాతఁడు మేలుకొలుపుటకు సంశయించి యెద్దియుఁ దోఁచక నిలిచి యుండ నంత నొక్క రాకాసి యొత్తిగిలినందున నాతఁ డశలి వాండ్రు తన్నుఁ గనుఁగొనిరేనిఁ దుష్టునియలు గావించి నంజుకొనఁ గలరని గిఱుక్కున వెనుకకు మరలి తనతావునకుఁ జేరెను. రక్కసు లందఱు మెల్లమెల్లఁ బ్రొద్దెక్క లేచినవెనుక జ్వాలాజిహ్వుఁడు జాముప్రొద్దెక్క నప్పటికి మేలుకాంచి సేవకులు పరిచర్యలు సేయఁ గాల్యములఁ దీర్చి యంతక మున్నె యామత్తముసేయఁబడిన కొన్ని మేకముల నంజుళ్ళు వెంక్క రక్కసులతో ముచ్చటలాడుచుండెను. తక్కిన ముక్కిడి రక్కసులెల్లఁ దమతమ పనులం దగిలిరి. శార్వణునకు వారిచర్య లెంతయేనఁ గల్గించు చున్న నెంత త్వరితముగ నందుండి యతఁడు దాఁటఁదలంచిన నించుక యు వీలు గలుగదయ్యె. అది యటులనుండఁ దనప్రాణముఁ గోలుపో యియైన నిందుమతిని గాపాడవలయునని యాతఁడు కృతనిశ్చయుఁ డయి యుండెను. కాని నోరెత్తి యామెను బలుకరించుటకైన నవ కాశ మతనికిఁ జిక్కకుండుటచేఁ దన మనఁబున "దైవమా! మేలిమి బంగారుబొమ్మబోలు నీమెను రాక్షసుల కప్పగించి నేనెట్లు నా యసు వుల రక్షించుకొందును? నేను సకల సుఖదుఃఖముల ననుభవించిన వృద్ధుఁడను. నేనెట్లయిన భయములేదు. ఇందుమతినిమాత్రము చెఱ నుండి విడిపించి తీఱవలయు" నని నిశ్చయించుకొని సమయమున కెదురు చూచుచుండెను.

ఇట్లు పదునాలు దినములు సనియెను. అంత నొక్కనాఁడు రక్కసి మూఁకలన్నియు మహాసంరంభముతోఁ బరవశమ్ములై తిరుగు చుండెను. "అంతటి మహాసంతోషమునకుఁ గారణమేది" యని తన మిత్రుఁడగు కపాలమాలి నడుగ నాతఁడిట్లనియె. "ఈదినమున మా రాక్షసకులచక్రవర్తి యగుహిరణ్యాక్షుఁడు భూమి నంతయుఁ జా పగఁ జుట్టినదినము. అందుచేత మాకందఱకుఁ బండువ. నీవు నీ వేడుక ననుభవింతువుసుమీ" యన శాగ్రిణుని మొగ మొందుచేతనో సంతస మున వికసించెను. అంతటఁ గొంతసేపటికిఁ గొందఱు రాక్షసులు వేడుక లకొలఁది నిప్పకల్లు దాటికల్లు నీరకల్లుఁ దెచ్చి వరుసగ దింపిరి. వేఱొక కొందఱు బహుమృగజాలములఁ జంపి గుట్టలుగా వేసిరి. అం తయు నాయత్తమయినవెనుక నొక ముసలిరక్కసి వచ్చి యందఱఁ గూర్చుండఁబనిచి గంభీరస్వరముతో నిట్లనియె. "ఓ రక్కసులారా! యీదినము సుదినము. మనకులమునఁ బెద్దయు, మనకుఁ బూజనీయుఁ డును, భగవత్స్వరూపుఁడునైన హిరణ్యాక్షులవారు భూమిని జాప గాఁ జుట్టినదినము. ఆపాపపువిష్ణువు వారిఁ గడతేర్చెను గాని లేకున్న చో మన యధికారమే యధికముగా నుండి యుండును. దినములు బాగుండి పాపాత్ములైన దేవతాధములు గెల్చుటయు మన మోడుట యు సంభవించినది. ఆమహాత్ముని పేరు చెప్పకొని యీసురను మీరు దప్పిదీఱఁ గ్రోలి నంజుడ్లు మెక్కి మెక్కి సుఖించి కులగురువును గౌరవిం పుఁడు" అని ముసలి రక్కసి ముదల యొసఁగుటయుఁ దక్కినవాండ్రం దఱుఁ గడవల యొద్దఁజేరి తమపని నారంభించిరి. ముంతలతో ముంచి త్రాగువారును గడవలనెత్తి కల్లంతయు నొక్కమాటె వంచుకొనువారు ను, జెఱియొకచేతఁ జెఱియొకబాననెత్తి యవలీలఁ గ్రోలువారును నై యా సురద్వేషులు శ్రావణున కద్భుతముఁ గొల్పిరి. త్రాగుటకు విసుగుఁ దోఁచిన మాంసమును దినుటయు, పలల భోజనమునకు విసుగుదోఁ

చినఁ గలు ద్రావుటయు నను రెండుపనులయందుఁ దగిలి వారు నర్తిం పఁదొడఁగిరి. ఒకఁడు సురఁ గ్రోలి విడిచిన కడవఁ గిరీటముగ ధరించి వికవిక నవ్వెను. ఒకఁడు, దానినెగరవైచి తన వీఁపొగ్గి వేయి వ్రయ్యలుగ గుభాలున వీఁపుపైఁబడ నానందమొందు. ఒకఁడు చెట్టెక్కి యొడలెఱుఁగక యొక కొమ్మపైఁ గూరుచుండి నేలఁబడు. ఒకఁడు మృగచర్మములఁ గప్పుకొని కిచకిచలాడును. వేఱొకఁడు మేనుమఱచి దొర్లును. ఇట్లు దనుజులు స్త్రీ పురుషులు శిశువులుగూడ మద్యమాంసలోలురై మహాకోలాహలము సేయుచుండ సాయంకాలమయ్యె. ఈయొడలెఱుఁగని యావేశమునఁ దన్ను దనుజులెక్కడ బలిమొనర్తురో యను సాధ్వసమున శ్రావణుఁడు తరులచాటున నక్కి కానఁబడకుండ జాగ్రత్తపడియెను. ఇందుమతియు వీరి విలక్షణములు కనుఁగొని తన నిరంతర దుఃఖ మించుక మఱచి మందహాసము సేయుచుండెను. అంతటఁ గొంత తడవున కంధకార మెల్లదెసలఁ గ్రమ్మె. అందఱును మద్యపాన విహ్వలురగుట నాఁడా యడవి నెగళ్ళు వేయువారు లేరైరి. స్త్రీపురుషులు దానవులెల్ల మత్తున నొడలెఱుంగక వజ్రాయుధముచే నఱుకఁబడిన కొండచఱియల చాడ్పున నేలఁబడియుండిరి. అంతట శ్రావణుఁడు తన డాఁగినచోటునుండి యిందుమతియున్న తావునకు మెల్ల మెల్ల నరుగఁదలఁచి ముందుగాఁ జచ్చినట్లు పడియున్న సోఁకుమూఁకలనెల్లఁ బరీక్షించి వారిదెస భయములేదని యా కన్నియయున్న గదియొద్దకరిగి నిలిచెను. ఆగదిలో నామెయు నొకచిన్న నెగడివేసికొని యొద్దియో తలపోయుచుఁ జెక్కిటఁ జేయిఁజేర్చి మంచముపైఁ గూరుచుండెను. శ్రావణుఁడు తలుపుఁ దెఱచి లోనికిఁ దొంగిచూచుటయు నామె లేచి "శ్రావణుఁడా రావచ్చును; అపాయదయ్యము లేవియు లేవులే" యని ముద్దు ముద్దుగాఁ బలికెను. శ్రావణుఁడును ధైర్యముతో లోనికరిగి యొక వ్యాఘ్రచర్మముమీఁద నాసీనుఁడై యారాక్షసోత్సవమును

గూర్చి తనకుఁ గలిగిన యబ్బురమంతయు నామెకుఁ జెప్పి ప్రసంగవశమున నిట్లనియె.

"బిడ్డా! నిను గన్నదిమొదలు కన్నవానివిధమున నాహృదయము మితిమీఱి మఱుఁగుచున్నది. నీ చక్కఁదనము, నీజవ్వనముఁ గాఱడవులపాలు కావలసినపాప మెట్లు సంభవించె? నీ వెవ్వతెవో, నీ తలిదండ్రు లెవరున్నవారలో, నీ యునికిపట్టెయ్యదియో, యిందుంటయే నీ కిష్టమో నా కెఱుంగఁజేయవలయు. ఈ పదాఱు దినముల నుండియు నేనెన్నిమాఱులు నీతో ముచ్చటింపఁదలఁచిన నదను సంభవింపదయ్యె. నీగుట్టు దాఁపక నా కెఱిఁగింతువేని నా యోపిన సాయము నీ కొనర్చి నా జన్మము కృతార్థత నొందించుకొందును. బిడ్డా! నన్నన్యునిగాఁ దలంపకుమీ" యని హెచ్చరించుటయు నించుక యూరకుండి యాబాల కన్నుదమ్ములనుండి నీరు దెచ్చుకొని వెక్కివెక్కి యేడువసాగెను. శాస్త్రి వణఁకును డగ్గఱి కన్నీరు దుడిచి భయములేదని చెప్పి మఱలమఱల వృత్తాంత మెఱుంగఁజేయుమన నామె యూఱడిల్లి యిట్లని వినిపింపఁ దొడఁగెను. "అయ్యా! నీవు నాయందతినిర్హేతుకకృపఁ గల్గి యడుగుచుండునపుడు నీతో మర్మము విడిచి చెప్పకతప్పదు. కాఁబట్టి నాచరిత్రమును నుడువుచున్నాను వినుము. మాకాఁపురము జరాసంధపరిపాలిత మగు మగధరాజ్యములోని పాటలీపురము ; నాతండ్రి వసుమిత్రుఁ డనుక్షత్రియుఁడు. రాజునొద్ద నుద్యోగము లెవ్వియుఁ జేయక మాతండ్రి పితార్జిత మగుభూమి కొంత యుండుటచే దానిపై వచ్చు సొమ్ముఁ దెచ్చుకొని గౌరవముగాఁ గాలక్షేపము సేయుచుండెడువాఁడు. చిన్నతనమందు మాయయ్య క్షాత్రమున కనుకూలము లగు సామువిలువిద్దెల నేరువక విరాగు లగుసన్యాసుల వెంటనంటి తిరిగి, దేశాంతరముల సంచరించి, కాశీ మొదలగు సకలదివ్యక్షేత్రములు సేవించి నలువదియేండ్ల వయసు వచ్చునప్పటికి, మరల నిలుసేరెను. సంసారముపై విరక్తితోనున్న యా

తని మాచుట్టము లందఱును బలవంతముఁ జేసి యతఁడు వలదువలదను చుండ వివాహముఁ జేసికొనున ట్లొడంబఱిచిరఁట. గుణములపేటికయు, లావణ్యసీమయు, నగు మాతల్లి నతఁడు వివాహమాడి యామెయందు సంతానముఁ గనక చిరకాలము వగచుచుండెను. మాయమ్మయుఁ బెక్కండ్రు మునులను సేవించి యెన్నియో నోములునోఁచి పెండ్లియైన యిరువదియేండ్లకు నన్నుఁ గనియెను. కటకటా! అవ్వల నేమి చెప్పుదు? ముద్దుముచ్చట లొక కొన్నియైనఁ దీఱకమున్న సంతానము గనిన వెనుక పట్టుమని పదునాళ్ళు సుఖింపకమున్నె, నను గన్న యేడవనాఁడె మాయమ్మ పరలోకమునకుఁ జనియెను. ఆదిమొదలు మాయప్ప మాయమ్మ పోయిన వెలితి నాకుఁ బాటిలకుండఁ బెంచుచుండ మాకు దైవవశమున దరిద్రస్థితి వాటిల్లెను. మాటికిఁ బేదనైనను గులమునఁ గడు ఘనుఁడగుటచేత మాయయ్య గొలువుల యాచించియు, నుద్యోగములఁ జేసియుఁ బట్టుపోసికొనుట కిచ్చలేక భూముల నమ్మి కాలముఁ గడపుచుండ మా మేనమామ గిరివ్రజపురనివాసి (ప్రాయశః జీవించియే యున్నాఁడు) కీర్తివర్మ మమ్మిరువురఁ దోడ్కొనిపోయి తనయింట నుంచుకొనియె. ఆబీదతనమునందే యాదరిద్ర్యహింసలచేఁ గాసిఁ జెందుచునే, లేక లేక కలిగితి ననియుఁ దల్లిలేని పిల్లననియు నన్ను మాయయ్య చేసిన గారాబ మెంతయో వాకొనలేను. గిరివ్రజమున నున్నకాలమున నాచక్కఁదనముం బట్టియు నాసుగుణసంపదం బట్టియుఁ బౌరులలో ననేకులు నందు ముఖ్యముగాఁ బుష్పకేతుఁడు మొదలగు మంత్రులు, విజయసేనాదు లగు దండనాథులుఁ ద్రిలోకమల్లుఁడు లోనగు రాజబంధువులుఁ దమతమకొడుకులకు నన్నిమ్మని పలుమాఱు మాతండ్రి నడుగుచుండ నతఁడు మాత్రము తొందఱయేమని కడపుచువచ్చెను. ఇట్లుండ నే నాఱువత్సరముల వయసుఁ గలదాననై యుండ మా మేనమామ కుమారున కుజ్జయినిలోఁ బరిణయమహోత్సవము తటస్థమయ్యెను. మా

మేనమామ రమ్మని మాయయ్య నెంతబలవంతముఁ జేసిన నతఁడు బయలుదేఱక నన్నుమాత్రము పెండ్లివారితో నంపెను. మేనమామ కొడుకులు కూఁతులు నాయీడుజోడువారు నుండుటచే నా పయనము నాకపరిమితానందముఁగలుగఁజేసెను. మే మందఱమును వడివడి నడచుచు నరదములపై నెక్కి వనాంతముల విడియుచు సరోవరముల జలక్రీడలు సేయుచు గమనవినోదముగాఁ బయనముసేయుచు దిన మొక్క నిముసము లాఁగునఁ బుచ్చుచుంటిమి. ఇట్లుండ నొక్కనాఁటిరాత్రి మహారణ్యమధ్యమునఁ బయనము సేయుచుండ గాలియు వానయుఁ బ్రచండగతిని మమ్ము వేదింపఁజొచ్చెను. గుభల్లుభల్లు మని మహావృక్షములు మహావాయువుచే నేలఁబడుచుండుట సేవకు లిరువురు చెట్లక్రిందఁబడిచచ్చిరి. అందఱమును వానకుఁదడిసి గజగజ వడఁకుచుంటిమి. మనుష్యులుకూడ కొట్టుకొని పోవునంతటి ఝంఝూమారుతము వీచెను. అంతలో నాటవికులగు దొంగలు వచ్చి మాపయిఁ బడిరి. అపుడు స్త్రీజనముఁ బిల్లలు సల్పిన యాక్రందనధ్వనియు "దోఁచుకొనుండు దోఁచుకొనుం" డని చోరులు వేయు కేకలును బ్రహ్మాండకర్పరమును భేదించి యుండునని నేనెంచితిని. చోరులతోఁ గొంతతడవు పోరాడి మామేనమామ హతుఁడయ్యెను. భయంకరాకారుఁ డగునొక కిరాతుఁడు నను బండిలోనుండి లాఁగి తన మూఁపురముపై నెక్కించుకొని పోవఁజూచుచుండ నసహాయనై కెవ్వున నఱచి మూర్ఛపడితి. అనంతరము నూఁగంపెను బలగముమాటయేమైనదో యిప్పటికిని నేనెఱుఁగను. మఱునాఁడు నేనీరాక్షసులమధ్యనుండుటఁ దక్క నెట్లిందువచ్చితినో నీకుఁ జెప్పఁజాలను. నన్నాచోరుఁ డెత్తుకొని చనుచుండ జ్వాలాజిహ్వుఁడు మార్గమున వాని కెదురై వానిం దెగటార్చి నన్నిందుఁ దెచ్చెనని కొన్నినాళ్ళకు రాక్షసాంగన యొకర్తు నాతోఁజాటుగఁ జెప్పినది. నాఁటఁగోలె జ్వాలాజిహ్వుఁడు నాకద రాక్షసకృత్యముల నెవ్వియుఁ జేయక గనుగోముగఁ గోరినదెల్ల నిచ్చు

పెంచుచున్నాఁడు. ఈరక్కసులవలన నీపదియేండ్లు నే నెంతజాగరూకతతో మెలంగితినో శ్రీమన్నారాయణుఁ డెఱుంగును. ఇంతటి గారాబము నాకీదానవుఁడు సేయుచున్నను నాకీయునికికన్న మరణమే మేలని తోఁచును. ఈజ్వాలాజిహ్వునకు శిశుపాల జరాసంధు లాప్తమిత్రులు. ఒకమారి చేదిరాజు మృగయాక్రీడ కిందువచ్చి నన్ను గాంచి తనకుఁ బెండ్లిసేయుమని రాకసు నడుగ నాతఁడు వల్లెయనియె. నాకు శిశుపాలుఁడు భర్తయగునేని నాచేతి వజ్రపుటుంగరము నాకు సుఖమీయఁజాలును. ఈ వెఱనుండి తప్పింప నీ వేదనున నాకు సాయమొనర్తువేని నిన్ను నేజన్మాంతరములుదాఁక మఱవను. నీకెంతయుఁ బున్నె ముండుఁజుమీ" యని తన దీనచరిత్రము విన్నవింప శ్రీవణుఁడు విని యక్కజమొంది 'నీకు నేను సహాయ మొనర్తును; ఇపుడు రక్కసు లొండ లెఱుఁగక పడియున్నారు. ఇదే తగునదను. నీవు సిద్ధమైయుండుము. ఈరాత్రి పోవుద" మని పలుక నామెయు వల్లెయని తత్ప్రయత్నముఁ జేయసాగెను.

శ్రీవణుఁ డీనడుమఁ దనవిడిసిన చోటికింబోయి, మున్ను గళానందుఁ డొసఁగిన యుత్తరీయము బదిలపఱచి యూతనికత్తిఁ దన పాణిసంరక్షణార్థము కేల గ్రహించి, తన గుఱ్ఱములమూట భుజముపై నిడుకొని రక్కసిమూఁకలలోఁ నేరికైన మెలఁకువ వచ్చెనదో యని యొకసారి చూడవచ్చెను. ఒక్కొకరక్కసియొద్దకుఁ బోయి యొక్కొక నిముసముండి నిదానించి చూచి గాఢనిద్రాపరవశుఁడై యున్నాఁడని నమ్మకముఁ గొనిన పిదప నొండొకనియొద్దకుఁ జనుచుఁ గొంతకాలముఁ బుచ్చెను. అంతలో దానవుఁ డొకఁడు మేలుకాంచి తల విరియఁబోసికొని యా పెనుచీఁకటి నడుచుచుండ నాతఁడు కార్యవిఘ్నంబుఁ జేయనోపునటాయని వగచి వృద్ధుఁ డుపాయము వెదకి యొకముంతెడు కల్లుదెచ్చి యాతనిచేతి కందిచ్చె. ఎవ్వరిచ్చిరో యారయక యే యాదైత్యుఁడు సుర గుటగుట

గ్రోలి నాలుగు నిముసములలోఁ గ్రమ్మఱమత్తుచే నేలకొఱగెను. ఒఱగుటయు శ్రీవణుఁ డమితానందమునొంది యిందుమతియున్న నెలవున కరుగుదెంచి, " యమ్మా నీవు సిద్ధముగ నుంటివా ?" యని పలుకరించెను. " ఎన్నఁడీ యగ్నిహోత్రిమధ్యమునుండిదాఁటుట యని నేనున్నదానను, సిద్ధముగనుండక నాకేమి యాలస్యమున్న " దని యబ్బాల తనకు రాక్షసుఁ డొసఁగిన సకలాభరణంబుల నటవదలి కట్టుబట్టతో నీవలకుఁ జనుదెంచెను. వృద్ధుఁ డాయరణ్యముననున్న కాలమునఁ బట్టపగట నటనుండి దాఁటిపోవుటకు ననువగు మార్గములఁ గనుపెట్టుచు వచ్చుటచేత నాదినమున నాయాసములేకయే యొకదారిత్రొక్కి యిందుమతిని వెంటఁబెట్టుకొని నడువసాగెను. కొంతద వ్వంధకారమున నడచి రాక్షస సామీప్యమును బాయుటతోడన తన చేతనున్న పాలకట్ట కాగడా వెలిఁగించి శ్రీవణుండు బాలికకుఁ జీఁకటివలన వెఱపు జనింపకుండఁజేయుచు నెడనెడ మార్గమధ్యంబున నడ్డముగనుండు ములుగంపలఁ దొలఁగించుచు బెబ్బులియెలుంగుల కాలతాఁకి. యులుకకుండ మీఁదఁ జెయివైచి తట్టుచుఁ గడు జాగరూకతతోఁ గొనిపోవుచుండెను. క్రూరరాక్షస మధ్యమున వసించుటకన్న నెట్టి యాపదపాలైనను సరియేయని కాఁబోలు నాబాల, తన్ను వెంటఁబెట్టుకొనిపోవు నాతఁడు విదేశీయుఁడని శంకింపక వృద్ధుఁడని వెఱవక తన యసహాయత్వమునకుఁ గుందక యెట్టులైన నావలఁబడినఁ జాలునని పోవుచుండెను. అంతటిసుకుమారి యంతటి చక్కఁదనఁపుటక్క తన వెంట నొంటరిగఁ దన్నునమ్మి యాచీఁకటినరుదెంచుటఁ జూచి శ్రీవణుఁడు తనలో " అయ్యో నేఁజూడఁ గడు పెద్దవాఁడను. రాక్షసులు మాజాడనెఱిఁగి తఱిమివచ్చి పట్టుకొన్న నేను వారి నెదిర్చి యీయిందువదనను రక్షింపఁజాలను. అసాధ్యమగు కార్యమునకుఁ దలపెట్టితి. వారిబారినుండి బయటఁబడిన యామెను నాయొద్దనుండి యేకఱుకుటీఱుక యైనఁ దీసి

కొనిపోవఁదుగదా. నాకతమున నీమె కెట్టియాపదలు మూఁడనున్నవో. ఏమయిన నాప్రాణములు కంఠమున నుండ నీమె కాపదరానీయను. పరోపకార వ్యాపారమునఁ బ్రాణముపోయినను మంచిదే" అని చింతించుచు నామెకు నెడనెడఁ జిత్రములగు కథలుచెప్పి మనోవ్యథఁ దొలఁగించుచుఁ బయనము సేయుచుండెను.



## పదునేడవ ప్రకరణము.



శ్రీకృష్ణునకు మేనత్తకొడుకు, బద్ధవైరుఁడు నై యజాతశత్రుఁడగు యుధిష్ఠిరునకుఁ బిన్నతల్లిపట్టియై చేదిరాజ్యమున కభిషిక్తుఁడై పారాశర్యుఁడు మొదలగు జడదారులచే రాక్షసాంశసంభూతుఁడని యెన్నఁబడుచు శిశుపాలుఁడు చేదిపురమున నత్యంతవిభూతితోఁ బ్రజాపాలనముఁ జేయుచుండెను. దనుజుని యంశమునఁ బుట్టుటచే శిశుపాలునకుఁ గోపాలునిపైఁ బాలపాపఁడగుట మొదలు ననిష్టముండుట యొకవింతకాదు. కాని యా చిఱుతయలుక రవులుటకు భేదకారణము దైవవశమున సంభవించెను. త్రిలోకలావణ్యరాశియైన రుక్మిణిని, రుక్మి తనకీయ సమకట్ట వావివరుసలయినఁ దలపోయక యిరుగురకుఁ గల చుట్టఱికమైనఁ బాటింపక యాదేవిని వాసుదేవుఁ డపహరించి రాక్షసవివాహ మొనర్చుకొన్న నాఁటఁగోలె చేదినాథునకు యాదవునిపై యలుక ముమ్మరమై నానాఁటికిఁ బెరుఁగుటయే కాని తఱుఁగదయ్యెను. నందనందనునకు జరాసంధునకు జరుగు పోరాటములలోఁ జేదిరాజు మగధరాజుపక్షమై యాతనికి బాసటవచ్చి వాసుదేవునిపైఁ గత్తిఁగట్టి జయాపజయంబులవలనఁ గలుగు సుఖదుఃఖములఁ దానుగూడ మాగధునితోఁ బాటనుభవింపఁ జొచ్చెను. వెనుకటి దట్టుండ మనకథజరిగెడుకాలమందు నందనందన జరాసంధులకు మహాయుద్ధమగునని శిశుపాలుఁ డె

తిరిగి యాజరాసంధునకుఁ దోడుపడ నిశ్చయించి యాతనికిఁ దన మనో నిశ్చయవార్త నంపి ద్వారకానగరమునుండి వచ్చు బాటసారులఁబట్టి పరీక్షించి చెఱనిడుమఁ గృష్ణుని కేరాజుతోడను వేగునడువనీకుండఁ జే యవలయునని నిశ్చయించెను. సింగంబునకుఁ బులియుఁ జిచ్చునకు గాలియు సాయమై వచ్చినట్లు మగధరాజునకుఁ జేదిరాజు తోడుపడుట చే బలరామకృష్ణులు దక్క తక్కిన యాదవులు జయమునందు సందియ మునొందుదు సాధ్యమగు నంత త్వరితముగ జరాసంధ శిశుపాలురు కింత ము నాపాదింపఁ దలపెట్టిరి.

ఒక్కనాఁడుదయమునఁ జైద్యుఁడు వ్యసహారివేదులగు కొందఱు మంత్రులు తన్ను గొలువ విహారార్థము తన యంతిపురము నంటి యున్న యొక పూవుఁదోటకేగుదెంచి బండిగురివెందతీవ లల్లిబిల్లిగ నల్లుకొని చల్లఁదనము వెదజల్లు నొకమంటపము క్రింద స్ఫటికపు శిలల తో నిర్మింపఁబడిన యొకవేదికపైఁ గూరుచుండి నానావిధ కుసుమ సౌరభములఁ గ్రోలి యాపుష్పములనొడలంటఁ బూసికొని మెల్ల మెల్ల మన్యపాన మొనర్చి మేనగందమలందుకొని చను కాముకుని వడువునఁ దమపైఁ బ్రసరించు మందమారుతమువలన జనించు నానందపార వశ్యమున నించుక కనుదామరల మోడ్చి బహు దేశములనుండి తెప్పిం చి నాటించిన పూలతీవల సౌరభంబుల గుణవిశేషణంబులఁ జేతులు జోడించి నిలుచు మంత్రులకుఁ దెలుపుచు జరాసంధకృష్ణుల ప్రసంగ ము నడుమరాఁ దద్దండయాత్రిం గూర్చి కొంత ముచ్చటింపసాగెను.

అట్లు వినోదించుచున్న సమయంబున శిరమునఁ బొంజడలు వ్రేలాడ మొగమున భస్మోర్ధ్వపుండ్రంబు మెఱయఁ బాదుకలఁ దొడఁగి నల్లనిమేని చాయగల యొక రాయబారివచ్చి వారి కెట్టెదుర నిల్చెను. వెంటనే శిశుపాలుఁడు లేచి చేతులుమోడ్చి నమస్కరించి “దేవా దేవర యెవ్వరో యెందుండి రాకయో యెఱుఁగఁజేయ దాసుఁడు వేఁడుచు

న్నాఁడు. ఆనతీయవలయు" నన నాతఁడు పక్కున నగి "వీరినందఱి
నావల కనుపు మనంతరము నాయుదంతమంతయు నెఱింగించెద"
ననిన మంత్రులు జేని యిచ్చనెఱింగి తమకుఁ దామ యచ్చోటువాసి
యరిగిరి అనంతరము నాజడదారి జేరి పాదములకు మ్రొక్కి "దేవా
నన్ను మఱచితిరే, మందప్రజ్ఞుఁడను నాకు మీరంజలిఁజేయ న్యాయమే"
యని పలికెను. రాజును వెనుకటి వృత్తాంతమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని
"మూరా నీవఁటరా. అహాహా నీవు నన్నే యింతభ్రమపెట్టితివి.
ప్రపంచమునందలి ప్రకృతి జనుల కన్నుల నెట్లు దుమ్ముకొట్టుదవో
నేఁడుగఁ జెప్పనేల? నీవంటి జగద్వంచకుండుండ నాకు లోపమెద్ది వాటి
ల తెప్ప? నీవేమి క్రొత్తవింతల మూటఁ గట్టుకొని వచ్చితివో సత్వర
ముఖుగఁజేయు" మని యుత్తరమిచ్చి పాదములపైఁ నున్నవాని నెత్తి
నిలువఁబెట్టెను. జడదారియుఁ గరములుమోడ్చి "యేలినవారికి నా
చేయుచున్న పని మాటలతో విన్నవించుటకన్నఁ బ్రత్యక్షనిదర్శనముఁ
జూపుట మేలు చిత్తము. "ఓరీశిష్యులారా! అందఱు నిటురండురా" యని
తన శిష్యుల నుద్దేశించి పలుకుటయు నంతదనుక నొందేని చాటునఁ
గూర్చియున్న యిరువురు సేవకు లొకదివ్యసుందర విగ్రహుఁడగు పసు
చు వానితోఁగూడఁ బ్రవేశించి వల్లభునకు జోహారొనర్చిరి. శిశుపాలుఁ
డును వారి నిరువురనొకసారి కనువిచ్చిచూచి వెంటనే తనచూపు మారని
చూపువాడ్పునున్న యాలేబ్రాయఁపు మానిసపైఁ బఱపి యెంతచూ
చినఁ దనివోని యాతని మేని సౌరున కచ్చెరువడుచుఁ గొంతోకసేపటికి
జడదారి కిట్లనియె. "మందప్రజ్ఞ! వీని నెచ్చుండి తెచ్చితివి వితనిఁబట్టితే
రి నీమనసెట్లొప్పినది? వీనివృత్తాంతమించుక నాకుఁ దెలుపవలయు" నన
జడదారి నగుచు "స్వామీ మేము భవదాజ్ఞచే సకలారణ్యములు
సంచరింపుచుండ నొకచెట్టుక్రింద నీ భూలోకమన్మథుండు పడఁగొట్టి
మూర్ఛవడియుండి మాకంటఁబడియె. అతని కించుకనీరుఁ ద్రావనిచ్చి

యొడలు తిన్నఁగ నెఱుఁగకయున్న యొకబండిపై వీనినెక్కించుకొని మేము దేవరవారి యొద్దకుఁ గొని తెచ్చుచుండ నంతలో నాతనికిఁ దెలివివచ్చుటయుఁ మీరెవ్వరని మమ్మడిగి పరుషముగ మాపై నలిగి తనయిచ్చవచ్చిన తెఱఁగునఁ బోనఁ దలంప నిరాయుధుఁ డగుట నీతనిఁ బట్టుకొని పాఱసీక యిటులఁ దెచ్చితిమి. ఎన్నివిధముల నాతనిచరిత్ర మడిగినను మిన్నకుండెనే కాని యుత్తరమీయఁడయ్యె. మీఁద దేవర చిత్తము" అని యూరకుండెను. శిశుపాలుఁడును దచ్చరిత్రము నాకర్ణించి యాతనినుద్దేశించి కొన్ని ప్రశ్నముల నడుగ వారిరువురు నిటు మాటలాడిరి.

శిశు—అయ్యా! చక్కనివాండ్రలో మిగుల చక్కనివాఁడవగు నీ వెందుండి వచ్చుచు మా సేవకులచేతఁ జిక్కితివో యెఱుఁగఁజేయువలయును. కులగోత్రములు జన్మప్రదేశము నెఱుఁగఁజేయకున్న మేము నిన్నెచ్చటికిని బోనిచ్చువారముగాము. కావున నిజమును వాక్రుచ్చుము.

పురు—అయ్యా! నేను గిరివ్రజవాసుఁడను.

శిశు—ప్రియమిత్రుఁ డగు జరాసంధుని పాలనమున నుంటచే మాకాప్తుఁడవే మోయని తోఁచెడును. కాన నీవెందుండి వచ్చెదవు?

పురు—ద్వారకానగరమునుండి యొకచోటికిఁ బోవుచు దైవవశమున మీభటులకుఁ జిక్కితిని.

శిశు—వాసుదేవహతకుని పొలిమునుండి వచ్చుటచే శత్రుఁడవో యని తోఁచుచున్నది. అయినను నీకొదువచరిత్రమునుగూడఁ జెప్పుము.

పురు—రాజా నేనేమిపనిమీఁద నెందుకరుగుచున్నవాఁడనో యది గోప్యముగుట మీకుఁ జెప్పనొల్లను. నాపేరు కళానందుఁడందురు. ఉత్తమక్షత్రియుఁడను.

శిశు—అవురా! నీవు కులమునఁ జూడ సాటిరాచబిడ్డవు; ఆకారమ్మునఁ జూడ ద్వాపరయుగమునఁ బుట్టిన మదనుఁడవు. జరాసంధునిపాలన

మున నుండుటచే మాకు నన్ని విధములఁ బోరానిచుట్టమవు. కానిదు రాత్ముఁడైన శ్రీకృష్ణునియొద్దనుండి యేగుచున్నట్లు నుడువుచున్నావుగాన మాకు వినవరాని పగతుండవేమోయని తోఁచెడును. అట్లని విడువగాదు. ఇట్లని విడువకుండరాదు. సోయగముఁగన్న హృదయము గరఁగుచున్నది. పూర్వోత్తరములనారసిన జంకుజనించుచున్నది. కావున నీ నిజచరిత్రము తెలియునంతకు విడిచియు విడువనట్లొకవిధమున నిన్ను జెఱలోనుంచువాఁడను. నిన్ను నిజవృత్తాంతమెఱుఁగఁజేయుమని యెంత నొక్కి యడిగిన నెఱిఁగింపవైతివి. కావున నందలి లోపంబు నాయందుఁ గానరాదు. మందప్రజ్ఞుఁడా! నీవును నీయనుచరులును జని వీనిఁ గారాగృహమున నుంపుఁడు. తక్కిన నీచులవిధమునఁగాక వీనిని సగౌరవముగఁ నాదరింపవలయునని చెప్పుము.

అని శిశుపాలుఁ డనుమానముగఁ గళానందుని బందెలోనుంప నానతిచ్చి మందిరంబునకుం జనియె.



## పదునెనిమిదవ ప్రకరణము.



ప్రశాంతము లగు జడదారులయాశ్రమములు నిరంతరము నానందనిలయములయి యుండునుగదా. జ్వాలాజిహ్వుని యరణ్యమునకుఁ గొన్ని యామడల దూరమున నానందాశ్రమ మనుపేర నొక ఋషివాటిక తనరుచుండు. అందు సాటిలేని తపము పెంపున బ్రహ్మర్షులనెల్లఁ గేలిసేయఁజాలినవాఁడు కరభుఁ డనుతపసిరాయఁడొకరుఁడు వసియించుచుండు. పాలువిడువని పసితనమునాఁడె నారాయణనామస్మరణము జనకునివలన నాతఁడు నేర్చి యైదేఁడుల ప్రాయము వచ్చుతోడనె ప్రాఁజదువుల్ మొదలుపెట్టి మునికులమెల్ల నచ్చెరువడునట్లు పండ్రెండువత్సరముల యీడు రాకమున్న నాలుగువేదములు భువనైకప్రజ్ఞాధురంధరుఁడై యువ్వల

వేదాంతశాస్త్రము నభ్యసించి యసమానుఁడై యాత్మతత్వంబును బ్రకృతి తత్వంబు నెఱిఁగి చిత్తము పరమపురుషాయత్తమొనర్చియుండఁ దల్లి దండ్రులు జ్ఞానమార్గమున యోగబలంబునం జేసి మేను వాసిరి. నాఁటఁగోలె దారాస్వీకారము మనోవికార కారణ మనియు సంతానప్రాప్తి పున్నామనరకమునుండి తొలఁగించునది యైనను బహునరకంబు లనుభవింపఁ జేయుననియుఁ బరమేశ్వరుని సాక్షాత్కరింపఁ జేసికొనుటకన్న పురుషార్థము వేఱొండు లేదనియుఁ దెలిసికొని యామరణమును బ్రహ్మచర్యము నెరపనిశ్చయించి తమకుఁదారు వలచివచ్చు ఋషికన్యకల ననేకుల నిరాకరించి, ఋష్యశృంగుఁడు మున్నెట్లు కేలకు మదినిబ్బరము విడనాడి మగువ కేలునట్లుఁగాని యింతఁడు మాత్రము మనోవికారమొందఁడని యానాటిమును లందఱు నుడువఁదగ నింద్రియ నిరోధముఁ గావించెను. కోపమునచ్చుటయు శాపమిచ్చుటయు ననునవి తచ్చిష్యు లేకాలమునఁగాని యెఱుఁగరని లోకు లెన్నుచుండ గురుఁడగు నతనియందట్టివి లేవని యుగ్గడింపనేల? వేయేల? ఆతఁడు వ్రతభంగముగాని విశ్వామిత్రుఁడు; నీచనుగు రాజాశ్రయమున బ్రదుకని వశిష్ఠుఁడు; కలహప్రియుఁడుగాని నారదుఁడు. పూవిల్తుని పదును చిగురాకుబాకు లెవ్వనిమీఁద పనిచేయవన్నఁ గరభునిఁ బేర్కొనవలయును; శుకయోగికి ద్వాపరమున నెవ్వఁడు దీటువచ్చునన్నఁ గరభునిఁబేర్కొనవలయును; పిపీలికాదిబ్రహ్మపర్యంతమును సమానదయాపరుఁ డెవ్వఁడన్నఁ గరభునిఁబేర్కొనవలయును. అతని బ్రహ్మతేజము గనుంగొనియు నతనిమహిమలువినియు వేటతమకముఁగల రాచవారు రక్కసులు వానియాశ్రమము పొంత కరుగవెఱతురు.

కరభమునికి మఱకథ జరిగిన కాలమునాఁటికి వయసు మరలి వృద్ధుఁడగుట లౌకికవ్యాపారములఁ బొత్తుగవదలి పారలౌకికనియముల యందు డెందంబునిల్పి యాశ్రమము వెడలి యెటకుం బోవక యుండెను.

ఈతనియాశ్రమమున కొకనాఁడు వేవెలుఁగు వేయి వెలుఁగుల తోడ బ్రహ్మాండకటాహము నంతయుఁ గాల్చుచున్న సమయమున ముసలివాఁడొకఁడు జవ్వనినోర్తు వెంటఁబెట్టుకొని కరముడస్సి "పుడిసెడునీరును, బట్టెడన్నము దొరకకపోవునే" యని యెంతయు దూరమునుండివచ్చెను. వచ్చి వారిరువురు మునీంద్రునిక్కృపాసములీల నెంతయుఁ జల్లఁదనమును వెదజల్లు నీడలుగలచెట్లను గని తమపున్నెము పండినవనువుననే యచటఁబరిపక్వములై చెట్లవ్రేలాడు పండ్లగెలలఁ గనుంగొని "రండు దయసేయుఁ" డని తమకు స్వాగతముఁ బలుకు శుకబ్రహ్మచారులఁగని చివురుగుత్తులమెక్కి క్రొవ్విన భాగ్యవంతులచందమున నెరులలక్ష్యములేక ప్రేలు పికదంపతులఁగని సత్పురుషులకుఁజంపు పాపములతీరునఁ దమ్ముఁ గాంచి వెనుకవెనుకకుఁబోవు ఘాతుకమృగములఁ జూచి పరస్పరవిరోధములవిడిచి యందు విహరించు జంతుసంతానములఁ జూచి యాసయు, వైర్యము నక్కజము సంతసము నొక్కసారి తమ్ములము, వటువులు సేయు సామగానంబు వీనులవిందు సేయఁ, గట్టెదుటఁగనఁబడు పర్ణశాలయొద్దఁ గరుగుచుండిరి. అల్లంతదవ్వుల వారలం గనుంగొని మునిశిష్యులుకొందఱు పరుగుపరుగునవచ్చి బహువినోపచారముల నెరపిరి. ఒకఁడు రెండుదర్భాసనములుపఱచి యందువారినిఁ గూర్చుండఁబనిచె. ఇరుగురు రెండు వింజామరలఁగైకొని వారికిఁ జెమటలార్చిరి. ఒక్కఁడు తటాకమునకరిగి చల్లనినీరుదెచ్చి వారికిఁ ద్రావనిచ్చె. ఇఁకనొకఁడు చెట్లంబండిన తీయనిపండులందెచ్చి వారికి సమర్పింప వానినారగించి సేదదేఱి శ్రవణుఁడును మన యిందుమతియు "అమ్మా యింకబ్రదికితిమి సాహసించినందులకు, దురాత్ములకంటఁబడకుండఁ జేరవలసిన చోటఁ జేరితిమి. దైవమే యింకతోడగుఁగాక" యని తమ్ముఁ దామూఱడించుకొనిరి. అనంతరము చపలత్వమున వటుగులడుగు ప్రశ్నములకు నుత్తరములిచ్చి శ్రావణుఁడు తనవృత్తాంతమునంతయుఁ జెప్పక యిందుమతిచరిత్రము నువారలకుఁ దెలిపెను.

సాయంకాలమునందు తనతపోనియమమును జాలించి పర్ణశాలవిడిచి రెండవబ్రహ్మం బోలు కరభమహాముని బైటికివచ్చి నిరుపమానశైత్యముతోడ మాంద్యముతోడ సౌరభముతోడ వీచు మలయమారుతము గ్రోలవచ్చి యొకచోట వ్యాఘ్రచర్మము వేయంబడియుండ నందు గూరుచుండ నరుగుచుండెను. తెల్లనిజడలు సంతకన్నం దెల్లనిగడ్డము నరసిన కనుబొమలమీఁది వెండ్రుకలు కరభమహామునివయస్సు చెప్పక చెప్పుచున్నవి. మాంసహీనములై ముడతలుపడి వ్రేలాడు చర్మముతోఁ జేత దండముఁబట్టి పాదుకలు దొడిగి కాషాయాంబరములఁ గట్టి యెంత మూఢునయిన మ్రొక్కమనసు గలవానిగాఁ జేయుచు ప్రకాశించుచున్న యీ తనిబ్రహ్మతేజమున కచ్చెరుపడి మెడనున్న యొఱజన్నిదంపుఁ బోఁగు బ్రహ్మచర్యముం దెలుపుచుండ నామహామునిదార్ఢ్యమునకు మిగుల నాశ్చర్యపడుచు శ్రావణుఁడు నిందుమతియు నమస్కరించిరి. మూర్తిఁగైకొన్న ముసలితనమో యన్నట్లున్న యాముని మూర్తిఁగైకొన్న జవ్వనము వలెనున్న యామెనుగని "దీర్ఘసుమంగలీభవ" యని దీవించి "యిష్టార్థసిద్ధిరస్తు" అని శ్రావణుని దీవించి "మీచరిత్రములువిన మాకుఁ జెప్పుటకు మీకచఁయేపి వినఁగోరెద" నని పలికెను. ఇందుమతి తనకథ మునిపతికి విన్నవింపుమని సన్నచేయ శ్రావణుఁ డాతనితోఁ బూసగ్రుచ్చినట్లంతయు నెఱుఁగఁజెప్పెను. కరభుండు కథనాలకించి యామెబలఁబై జాలి వొడముటయుఁ గరుణారసము చిప్పిలుపలుకుల నిట్లనియె. బిడ్డా! నీ యిచ్చవచ్చినన్ని దినములు నాయాశ్రమమున నుండుము. నీకే భయంబును వాటిలకుండఁగాఁ జేసెదను. నీవు మాగిరి వ్రజపురమునకుం బోవలయునేని మాశిష్యులఁ దోడిచ్చి యనిపెదను. ఇది నీపుట్టినయిల్లుగా మెలఁగుమని యానతిచ్చి హస్తమలంకరించుచుండిన రుద్రాక్షమాలికను ద్రిప్పుచు వ్యాఘ్రచర్మము మీఁదఁ గూరుచుండి ధ్యానముజేసికొనఁదొడఁగెను. శ్రావణుఁ డది మొదలుకొని యిందుమతివిషయమై వగవఁబనిలేదనియుఁ బెద్ద

కాంచనమాలయు తానెట్టియైన బాధపడదనియుఁ దనయొద్దనున్న కళానం దుని కత్తియును నందనందనుండిచ్చినజాబు నామెకిచ్చి దాఁచుమని చెప్పి నగరు యాశ్రమప్రాంతముల సంచరింపుచు మునికుమారులవలన వన మునందలి చిత్రములరయుచు నెంతయువేడుకతోడ శాత్రవణుఁడు ప్రొ ద్దులుపుచ్చుచుండెను. అందువాండ్రులేని యాయాశ్రమమున నిందును తి మతి వెలసినట్లుండి కొన్నినాళ్ళపిదప వటువులు తోఁబుట్టువులుగవర్తింప స్వాధ్యాయముఁ జెప్పు శుకపికశారికాది శకుంతసందోహముతోఁ గాలము గడపుచు మునికన్యవలె నుండెను.

ఇట్లు మత్స్యపానమత్తులైన రక్కసులందఱు నెడగ్లెయుఁగక యారే యుపాలిపాలి మఱునాఁడు పగలు నట్లువర్తించి సంజకెక్కించుకనుస్తు విడిచి లేవనేరక పీఁనుంగులచాడ్పునఁ జెట్లను మేనులుచేర్చి కూరుచుండ నింతలో రాకాపిశాచము వచ్చి "యిఁదుగతిలే దిందుమతిలే" దని యఱచె ను. వెంటనే మఱియొకరక్కసవచ్చి "శాత్రవణుఁడులే"డని యఱచెను. ర క్కసులందఱును బడలికమేనులతోడ నిట్టనట్టుఁబరుగులెత్తి కలవరపాటు నొందసాగిరి. అంతట జ్వాలాజిహ్వుఁ డావార్తవిని యదరిపడి "హా యి న్నినాళ్ళపెంచి తుదకాబాలను గోలుపోయితిని. ఆమెను బెంచి శిశుపా లునకుఁ బెండ్లిచేసి నాకు నతనికిఁగలవైరము బెద్దజేసికొనఁదలంచితి ని. దానికట్టిదుర్బుద్ధి యావృద్ధహతకుఁడు కలిపి వెడలఁదీసియుండును. మీ రందఱును సకలారణ్యములు వెదకి వారినిగని బాలికనేమనక యిరు గుఁబోడి తెండు" ని యానతిచ్చెను. మఱునాఁడు వారందఱు నావాని క్కులకంపెను. ఆపాలను రిక్కలు వెదకనియుడవులు చూడనిగుహలు నె క్కనికొండలుఁ బరీక్షింపనిపల్లెలు నామట్టుపక్కలనెందును లేవు. అం దుండదనియో కరభుని మహిమను వెఱచియో వారాతనియాశ్రమము నుజేరరైరి. ఇట్లు వెదకివెదకి వారిఁగానక విసిగి రక్కసులూరకుండిరి.

అంతఁ గొన్నినాళ్ళకు దైవయోగమున నొక్కనాఁడు శ్రావణుఁడు కరభశ్రమపాింతములఁ గుిమ్మరుచు నొంటరిగ నాశ్రిమమునకు మఱల నరుగుచుండ నెవ్వఁడో వెనుకనేవచ్చి హా! వృద్ధహతకా! యెందుఁబోయెదవురా యని వెన్నుపై నొక్కచఱపు చఱచెను. శ్రావణుఁడు వెంటనే యబ్బా యని నెత్తురులుగ్రక్కి నేలఁగూలఁబడెను. అతని మూఁపుపై నెక్కించుకొని యారాక్షసుఁడు జ్వాలాజిహ్వుని సమ్ముఖమునకరిగి యప్పటికి మూర్ఛనుండి తెలివినొందిన శ్రావణుని వానియెదుట నిలిపెను. జ్వాలాజిహ్వుఁడును "నిందుమతినెందుంచితి" వని పలుమాఱులు వానిని నయమున భయమున నెన్నివిధముల నడిగెను గాని యాతఁ డించుకయేనియుం జెప్పక మొద్దువలె నిలిచెను. రాక్షసరాజు బిట్టలుక నొంది పీనింజంపి తినుఁడని తన సేవకుల కాతని నొప్పగించెను. శ్రావణుఁడును తనజన్మము పరోపకారమున సార్థకతం జెందెనని సంతసించి, యిందుమతి నిరపాయమగు నెలవున నుంటకు మది ముదమంది యేవిచారము లేక మనమున వాసుదేవపాదరాజీవములను నిలిపి యింటియొద్దనున్న దారపుత్రాదులనుగూర్చి యించుక వగచి వగచినను గార్యములేదని యెఱింగి, గిరివ్రజమునుండి వేరొకపనిమీఁద వెడలి రాక్షసులచే మరణమొందవలసినట్లు నియమించినవిధిచెయిదములకచ్చెరువడుచు మరణమునకు సిద్ధమైయుండెను. అంతట రాక్షసులు వచ్చి వానింబట్టి కత్తిచేఁగోసి క్రొన్నెత్తురుఁద్రావి మాంసమంతగా లేని వాని వృద్ధకళేబరము నంతతమకముతోఁ గాక కసిదీరున ట్లొకవిధముగ భక్షించిరి.



## పందొమ్మిదవ ప్రకరణము.



ఇందుమతీపాణిగ్రహణము సేయ శిశుపాలుఁడు చాలకాలము నుండి తీవ్రమగు నుత్కంఠతో నెన్నియుందోఁచక వలనుపడినంత శీఘ్రముగ నది చేకుఱఁజేయుమని జ్వాలాజిహ్వుని వేఁడుకొనుచు వచ్చెను. అనంతర మీచిత్రకథ జరగినదనివిని చేదిరాజు చేతఁజిక్కినపండు బా నైచుకొన్నవాని తెఱంగున నెంతయు వందురుచుండెను.

అట శ్రావణుఁ డానందాశ్రమమున కెప్పటియట్లు రాకునికి సంజ తఱిమొద లిందుమతి యెంతయుఁ గలవరపడి మునికుమారకులఁజీఱి వృద్ధుని నిమిత్తము వెదకుమని వేఁడుకొనుటయు వారు నలుదెసలకుం బోయి తామెఱిఁగినచోట్లనెమకి యంతటను గానక యొక్కొక్కరుగ నంద ఆశ్రమమునఁ జేరి యిందుమతికావార్తను దెలియఁజేసిరి. వారు లలో నొక్కఁడు మాత్రము మఱికొంతసేపు పోసి వచ్చి బడలికను విసుగు దోఁచు నెమ్మొగముతో నుస్సురనుచుఁ దనతోడివారు నిందుమతియును విను నట్లిట్లనియెను. "అమ్మా మున్నా శ్రావణుఁడు గ్రమ్మఱునెలవులెల్ల వెదకి యెందునుం గానైతిని. ఎవ్వఁడో యొకరక్కసుఁడు వృద్ధుఁడొకని తనయుబికటం బెట్టుకొని పరువెత్తుచుండఁ దాను గాంచితినని యొకయెఱుకు నాకుం జెప్పెను. ఇఁక శ్రావణుఁడు మనకు నెక్కటకిది. అతఁడు పోలసుఁదిండ్లచేఁ దీఱిరాఁడని నానమ్మకము" అని పలుక నిందుమతి మూర్ఛిల్లి నటువులు పలుకుల, శైత్యోపచారముల నించుక సేదదేఱి "హా మాలదైవమా! చుట్టముల, నెచ్చెలులఁ, గన్న వారి నెడబాపుటచాలక యించుకసాయము సేయువచ్చిన యీనిఱుపేద ముసలివానినిగూడ మ్రింగించితివే! పాపమానిసి నగు నాకెవ్వరుపకార మొనర్చిన వారికిఁ గీడుమూడకున్నె? నానిమిత్తమ మాతఁ డేలచావవల యును. ఆదేవుఁడు నన్నుఁ గొనిపోరాదా" యని విలపింపఁ దొడఁగెను,

కరభమహాముని తపోనియమములను జాలించి సమాధినుండి లేచి యాము రవస్థఁ దెలిసికొని తత్పోపదేశమున నామెనగపును గొంతతగ్గించెను. అట్లామె మనమున శాంతినిమిత్తము నగచుచు నానందాశ్రమమున వసించుచుండ నొక్కనాఁ డనేకులు ఋషులు ఋషికుమారులు నచ్చో టికరుదెంచి కరభునిచేఁ బూజితులై యొకదివసమందుండి మఱునాఁడు రాత్రి యిట్లనిరి. "కరభమునీంద్రా! జాబాలి యిచ్చటి కనతిదూర మున నొక యాశ్రమముఁ గల్పించుకొని యుంట మీరెఱుఁగుదురుగదా! ఆతఁడిప్పు డొక్కజన్మమును మున్నెవరను జేయనిదానిని జేయఁదల పెట్టినాఁడు. వేదవేదాంగవిమలగు తామద్చోటికి విజయముచేసి మునుల సదస్సునలంకరించి జన్మము సఫలముఁ గావించి తన్ను ధన్యుఁజేతురని జాబాలి మిమ్ము వేఁడుకొమ్మని మమ్ముఁబనిచె. తాము శిష్యసమేతముగ నెల్లి పయనమైరావలయును" అని కరభుఁడు ముదిమిచే నాశ్రమము వాసి యెండొక్కచోటికి నరుగ నవసరముగాని సమయమయినను దన యందలి గౌరవమున జాబాలియంతటి జడదారి యన్నివిధములఁ బ్రా ర్థింప నరగకుంట యనుచితమని పోవనిశ్చయించి యింతమతికి సాయ ముగఁ గొందఱు శిష్యులనుంచి కమభద్రమనిచెప్పి నాలుగుదినములలో వత్తునని యిందుమతికొఱకుంబుఱది చనియెను.

ఆమహాత్ముఁ డరిగిన రెండవనాఁడు సాయంకాల మానందాశ్ర మ సమీపమునందు మహాకోలాహల మొకటి వినవచ్చెను. పఱచెడు పులులు, పఱువంజాలక నేలఁగూలు నెలుఁగులు, పాఱునెడఁ దమకొమ్ము లు గుబ్బములకుంఁ దగులుకొని పారిఁభీతిఁజచు లేళ్ళు, హతములగు జాలిపోడమున స్లాకరించు నితరమృగములును నాశ్రమవాసులకుఁ గానవచ్చెను. అదియేమని మునికుమారులు బోయలనడుగ క్షత్రియ కుల భూషణుండగు నొకనృపునివేఁటయనిచెప్పిరి. అంతఁ గొంతతడవునకు రాజసేవకులందఱు నాశ్రమమునఁ బ్రవేశింపఁబోడఁగిరి. మృగయా

వినోదమున నరుదెంచి భూపాలుఁడు కరభాశ్రమమున విడియుట యు మునివలన నాతిథ్యమునుబడయుటయుఁ బ్రాయికముగఁ గలదుగాన వచ్చిన పరిజనమును మంత్రులను సేనాధిపులను వటువులు గౌరవించి వారికి బసలొసఁగిరి. అనంతర మామహారాజు మందగమనముతో నరు దెంచు మదపుటేనుఁగునెక్కి యాశ్రమమునకుఁజొచ్చి యొకచోఁదిగి ముని వటువులుపఱచిన వ్యాఘ్రచర్మముపైఁ బరివారముఁగొలువఁ గూరుచుండి మునుల పల్లెల వైచిత్ర్యములను జూడఁగోరి యించుకసేపటికటు విలా సముగ తిరుగఁజొచ్చెను. అట్లు తిరుగుచుండ నాఁకేరికి చిలుకపిల్లలకుఁ బండ్లు దినుపించుచు వానికి మాటలు నేర్పుచున్న యొకజవ్వని త్రిలోక రాజ్యలక్ష్మియట్లు కనంబడి నేత్రములకు విందునొసఁగెను. ఆచిన్నారి కన్నులఁ బడ నామె యెవ్వతెయని యచటి వటువుల నడుగ వారామె కత నంతియు నెఱుఁగమనియు జ్వాలాజిహ్వుని యాశ్రమమునుండి యొకవృ ద్ధుఁడు దెచ్చెననియు నామెపే రిందుమతి యనియుఁ జెప్పిరి. ఆపలుకులు చెవులఁ జొరఁబడినంతనే నృపుని నెమ్మొగము వికసించె. పట్టరాని మోహంబును హృదయము నాక్రమించె. వెంటనే పరిజనమును బొమ్మని సెలవొసంగి తానద్దేవి సన్నిధికరిగి మాటలాడ నిశ్చయించి, మునిలేని సమయమని శంకింపక తనసాహసమునఁగలుగు నష్టమునరయక యామె వంకఁ జనియెను. చని యామె వెనుకప్రక్కను నిలిచి చిలుకపలుకులను వినుపుష్టిసెయు నామెపలుకుల నాలకించి పూర్ణచంద్రమండలమట్లు ధావ ళ్యముఁజూపు మొగము తనకు వెనుకనున్నకలశఁ గానఁబడుచున్నను దానికాంతికచ్చెరువడి మెడమీఁద ముద్దయైన చీకటిచాయ్పున నున్న ధమ్మిల్లమును జూచి, యంగసౌష్ఠవమును జూచి యామహావల్లభుఁడు ఘవిష్టిలుతునత్ప్రాకల కాఁగలేక కట్టెదుటకేఁగెను. నిలుచుటయు నామెల నాఁగ భయసంభ్రమములతో నడుగులు తడఁబడఁ బ్రక్కనున్న పర్ణశా లలోనికిఁ జని తలుపుచాటుచేసికొనెను. రాజునకప్పుడు తానున్న దా

శ్రీమమనియుఁ బుణ్యదాయకమగు చోట నట్టి కాముకవ్యాపారముఁ దలఁపనైనఁ దగదనియుఁ దెలియక కామగ్రహావేశచేఁ బరవశుఁడై యామెతో లోనికిఁజని యిట్లనియె. బాలా! దైవము మనఘటనమునం దనుకూలభావము వహించినాఁడనుటకుఁ దప్పిపోయిన నిన్ను మరల సమకూర్చుటయే నిదర్శనము. రాక్షసరక్షణమునుబాసి యరిగిననాఁడె నీయెడ నాసవిడుమకొన్నవాఁడను. అట్టియెడ నిన్ను నాకొనఁగూర్చుట పరమోపకారముగాదే. ఇంతదనుక నిన్నుగూర్చి వినివిని యూటలూరితిఁగాని యున్నఁడు నింతకనులపండువుగఁ గాంచనైతిని. ఎన్నిదినములు నీనిమిత్తము కామాయత్తుండనై వేఁడినిట్టూర్పులు విడిచితిని! ఎన్నివసంత రాత్రులు కునుకు లేక నీధ్యానము సేయుచు జాగరముగావించితిని. ఎందఱు జోతిశ్శాస్త్రవిదుల నాకునునీకును సమాగమము కాఁగలదోయని యడిగితిని. అంతయు నేఁటికి సఫలమయ్యెను. ఏరాజు నీపైఁగల మోహమునుగ్రమునఁ బడి యౌవనయను నుడుపముచే నిన్నినాశ్ర మేచ నుసు అలఁసిల్లెనో, యేరాజు జ్వాలాజిహ్వుని యొద్దనుండి తనకు నిన్నొసంగునట్లు వాగ్దానమును గ్రహించెనో యేరాజు నీదాసుఁడై రాజ్యలక్ష్మిని నీకర్పింపఁదలఁచియున్నవాఁడో యాశిశుపాలుఁడనుజుమీ నేను. పుట్టుకచే రాచకన్నెయై కారణాంతరముచేఁ దాపసకన్యకయైన శకుంతలను దుష్యంతుఁడు పోలె నిన్ను నేఁ గేలునట్టుట ధర్మేతరముగాదు. నాఁడు కణ్వుఁడుంటనేము, నేఁడు కిరిభుఁడింట లేఁడు. ఇది సర్వవిధముల శోభాకరము. నాతోడఁ జేదిపురమునకు రా రమ్మని సునోక్తులచేఁ దనయటమటందెలుపుటయు నాపడంతుక సిగ్గునఁ గొంతదడ వెద్దియుఁ బలుకనేరక మందమందమ్మదూక్తుల నిట్లనియె. రాజేంద్రా! నామనమున నిక్కముదాఁపక తెలిపెదను. నీపై ననురాగ మించుకంతయును నాకు లేదు, నీవురాజువు, ధర్మాధర్మములన్నియు నెఱింగియు మునినిలయముననున్న నన్నిట్లాడుట **యుచితేతరము. పాడిదొఱఁగి వర్తించినవాఁడు భూలోకదేవేంద్రుఁడైనను**

సించుచుగా నెన్నఁబడునుగదా. అన రోసమును నీసును నిండమున్ల సంపడింప శిశుపాలుఁడు స్త్రీలోలుండై "అన్నన్నా నీజవ్వనము కాఱు చిచ్చుల పాలుగావలసినదే! చెట్టునంబుట్టి యెవ్వరికిని ననుభవయోగ్యము గాక తనంతనపడి యడవిని రాలి నశించుపండునో లె-నీసోయగము నీతో నశించునదియే! నీనారచీరలకు మాచీనిచీనాంబరములు తగవో! నీద ర్భశయ్యలకు మాహంసతూలికాతల్పములు దీటురావో! నీయాకలముల కు మాకలమాన్నములు బిండివంటలు సరిగావో! యేల నీకింతమోటు తనము. ఎంతబేలవో. నీమేలు నీవెఱుంగవు. సౌందర్యమునందలి పారిశ్ర మ్యము నెన్నఁజెఱుఁగని యీకటికి జడదారి వేదాధ్యయన మొనర్చి పరిప్రాయుఁడగు నొక మోటబ్రహ్మచారికిచ్చి నిను బెండ్లిసేయును. అపు డు నీవెంతయేని వగతువు కాఁబట్టి నావెంట రా రమ్ము" అనిన నామె యలుకచే మొగముజేవురింప, దురాత్మా! నాశాంతము నీవు మఱెంత పొగరుఁ బురికొల్పెడినో! ఛీ నాయెదుట నిలువకుము. అని యింకనెద్ది యనా యనుచుండ రాజు రాజబింబాస్యహస్తముం బట్టుకొనియెను. ఇం దుమతియుఁ గిరభమునేందారి! యని యఱచి గుభాలున మూర్ఛిల్లెను. రాజు బంచుకయు జంకక యదియు యదనని యిరుగురు సేవకులంబిలిచి పసిండిచిఱుగంటలు మెఱయు జయధ్వజముగలఁ తనయరదము నాయ త్తముచేసి యందానెలంతుక నుచుప్రమని వారికానతిచ్చెను. మునికుమా రు లాయింద్రమతి యాక్రందనధ్వనివిని పరుగుపరుగునవచ్చి రాజునకెదు రాడ నెఱచియుఁ బరమవైదికులు ఛాందసులునగుట సమయోచితముగఁ బల్కనేరక రాజును గొంతతడవు వేఁడి బ్రతిమాలి యతఁడియ్యకొనమి ని నోరు నెత్తి మోఁదుకొని జన్నిదములఁ ద్రెంచుకొని యంగలార్పసాగి రి. ఆయరదమునఁ దాను గూరుచుండి శిశుపాలుఁడు స్కంధావార మెల్ల బయలుదేఱవలయునని యానతిచ్చి తేరు సాగఁదోలుకొనిపోయెను. సే నలన్నియు నారాత్రియె యానందాశ్రమముఁ బాసి యరిగెను.

అంతట నాలుగవనాఁటి సాయంకాలమునకు జాబాలికృతమగు జన్నమునుండి కరభుఁడు వచ్చునప్పటికి, గురువు తిన్నమనానో యనుభయమున నొకఁడు దేశాంతరము బోకపోయెను. రెండవవాఁడు ప్రాణము లఱచేత నిడుకొని కరభునిఁ గాంచినతోడనే బాలుమని యేడ్చి యచ్చట జరిగిన వృత్తాంత మంతయు సవిస్తరముగ నివేదించెను. మునిపుంగవుఁడు శిష్యుల బేలతనమునకు నగచి రాజు మోటుఁదనమున కలిగి బాలిక యబలభావమున కించుక దుఃఖించి తనలో నిట్లని వితర్కించె. కటకటా ప్రశాంతములుఁ బవిత్రములు నగు తాపసాశ్రమములె యబలలగు స్త్రీలకు క్షేమమునొసఁగకున్న నింక నరక్షితలకు క్షేమమెందుండును. రాజధర్మముం దలపెట్టువారు మునులు వారెంత సమర్థులు. హా నాశరణముఁజొచ్చి నాపాలఁబడిన బాలను రక్షింపనేరని నాజన్మమేల? ఇది కలిద్వాపరసంధి యగుట రాగల కలిపురుషుని ఛాయం బర్వుటచే న్యాయపరిపాలకులగు రాజులకుఁగూడ దుర్బుద్ధులు పుట్టుచున్నయవి. ఇపుడు నే నలిగితినా యీదపుడము భస్మమగునట్లు శిశుపాలుఁడు నిర్మూలమగునట్లు జగతిని రాజపురుగు లేకుండునట్లు శపియింపనోపుదును. అయినను తపఃక్షయము సేయనేల? అదిగాక శిశుపాలుఁడు వసుదేవుని చేత సంహరింపఁబడునట్లు మున్నశరీరవాణి పలికె. అదికాలమున నదియుం జరుగును. “హా! శిశుపాల! నీయాయువు క్షయ మగుటచేతనే మునులనుఁగూడ నిట్టులు దలపెట్టుచున్నావుసుమీ” అని యొక శిష్యునిఁ బిలిచి వత్స! నీవు చేదిపురంబునకుం బోయి శిశుపాలుం గాంచి నాపలుకులుగా నిట్లు చెప్పుము. “రాజా సింహాసనము నీకు మేలు నాపాదింపదు. ఇందుమతిని నీవు బలిమిచే నింటికిఁ గొనిపోవుట మృత్యుదేవతను నిగ్రహమునకుఁ బిలుచుటజుమీ. ఆమె నను నమ్మి మా యాశ్రమముఁ జేరినది. క్షత్రియకుమారుఁడవేని సలిపిన దుష్కృతమునకుఁ బశ్చాత్తప్తుఁడవై తపసి కొంతకాలము బ్రదుకఁదలఁచితివేని నా

సమ్మతియు నామెసమ్మతియును లేక నీవాబాలఁ బెండ్లియాడఁ దలపెట్ట కుము. మునులతోడి పగలు త్రాచులతోడి సరసములు సుమీ! కర భునిమాట లక్ష్యముగాఁ దలఁపకుము." అని మఱునాఁ డుదయమున నావనముగుంబు త్తెంచి ప్రత్యుత్తరమున కెదురుచూచుచుండెను.



## ఇరువదియవ ప్రకరణము.



అట గిరిప్రజమున నాగవల్లి యిల్లువెడలి యేరికింగనరాక యెం దేనిఁ జనుటయు సిద్ధసత్త్వమగుదివ్యకుసుమంబు జాడ లెన్నినాళ్ళకుఁ దెలి యకుండుటయు జనాపవాదమునకు దన్ను రక్షాస్థానమున కిమ్మని జనకుని బలు మారును పీడించుటయుఁ దలంచి యాగుణోత్తమ యహోరాత్రములు నిద్రయు నిదురయు మజ్జనంబు చిక్కి శల్యమై చూచువారు తనకార్యము నను భయ మొందుచుండెను. రాగలతిక యెన్నివిధముల నూరార్చిన నామె యింతయు దుఃఖ మూనదయ్యె. గుణోత్తమ కళానందునిపై నలపు నిలిపిన దని చెలులవలన విని చంద్రపాలుఁడు కళానందునినిమి త్తమునేయుచు రాజవలనఁ దనకుఁ గీడు మూఁడునని మాటిమాటికి దే శాంతరమునకుఁ బోయెనని నాలకించి రాడనియుఁ గూతురుఁ దక్కదనియు నిశ్చయించి భారము దైవముపై మోపి దినములు గడపుచుండెను.

ఒక్కనాఁటిరాత్రి యింట నందఱు గాఢముగ నిద్రించుచుండ సౌందర్యతిలక నిద్రపోవుచుండి యులికిపడి లేచి "యక్కటా! రాగలతి కా! ఏమి సేయుదునే? ఇంకను మేలుకొనవైతివే" యని యెలుఁగెత్తి పిలిచి వెక్కివెక్కి యేడువ నారంభించెను. రాగలతికయు నదరిపడిలేచి రోదనమునకుఁ గారణము తెలియమి నీఁపుపైఁ జేయివైచి చఱచి భ యపడవలదని సందిటఁ జేర్చి యనేకభంగుల దుఃఖకారణముం దెలుపు మని వేఁడుకొనియెను. ఆశాంతవచనములఁ గొంత యూఱడిల్లి యబా

లిక మెల్లమెల్ల నిట్లనియె. ‘ఓసీ! రాగలతికా! యేమని చెప్పుదును. నేడు పాడుకలఁ గంటిని. హృదయేశ్వరుఁడు కళానందుఁడు భువనమనోహర మగు తన తొంటియాకృతిఁ గోలుపోయి కసుమాసిన ప్రాఁతచీరలు గట్టి నా యెదుట నిల్చి యుచితాసనమునఁ గూరుచుండుమని నేనెంత వేఁడుకొనిన నామనవి నిరాకరించి దూరమునందుండి నన్నుద్దేశించి యిట్లనియె. ‘ఓసౌందర్యతిలకా! నీవు నాహృదయేశ్వరివి కావు. నీకు నాకు ఋణముదీరినది. నేను పరరాజులచేతఁ జిక్కినాఁడను. ఎల్లియొ నేఁడో వారు నన్ను యమపురమున కతిథిగా నంపఁ జూచుచున్నారు. కడసారి నిన్నుఁ జూడఁగోరి యిటువచ్చితిని. నాపేరు మఱవకుము’ అని చెప్పి వడివడి నడచి మరల వెనుకకువచ్చి నాపై నీకుఁ గల యభిమానము పుత్త్రహీన యగుముదుసలితల్లిపై నిల్పి యామెం గనిపెట్టుచుండు మని నాప్రార్థన యనుచుఁ జెచ్చెర నచ్చోటువాసెను. అయ్యో! నన్ను బిగ్గఁగౌఁగిలించు కొనవే? పిడుగులఁబోలు నానుడువు లిప్పటికిని నాచెవింబడుచున్నట్లె యున్నవి. ఆభయంకరాకార మిప్పుడు నాకన్నులఁ గట్టినట్టియున్నది. ఓసీ! నామాట నమ్మవుగాని మునుపటి కళానందుఁడే గాఁడే? ఆమధ్యమలోకమన్మథుని కంతమాయరూప మెట్లువచ్చినదే! హా! నాపుణ్య మెంతలో మఱియొకలాగైనదే. వెండియు నంగలార్చుటయు రాగలతిక కన్నీరు తన కొంగునఁదుడిచి వీడినకొప్పు సవరించి కట్టి బాలా నీవొకబేలవు కల నిజమగునా? స్వప్నవృత్తాంతము లొకప్పుడు మున్ను మనమెన్నఁడు గని విని యెఱుంగనివిగా నుండును. ఒకప్పుడు పూర్వదృష్టములుగ నుండును. ఎట్లయిన నవి నిజము లని వగచుట యెండమావులలో నీట నెట్లుతానమాడుదు నని వగచుటగాదె! యన నాగుణోత్తమ యిట్లనియె. ఓసీ! కలలు సాధారణముగ నబద్ధము లని నే నెఱుంగుదును. కాని యిం దేదియో నిక్కమున్నదని నాకు భయముకలుగుచున్నది. కొన్ని పాడుకలలు వచ్చినట్లువచ్చి యన్నంతపనిఁ జేసితీ

రును. ఇఁక నా కా నారాయణుఁడే దిక్కు. నాకాయుదు టింకను బోలే ను. నేను నిదురించువఱకు నాపైఁ జేయివైచికొని యుండుమని యామె యించుక కన్నుమూసి తిరుగ భయంపడి లేచి మరలం బండుకొని యెట్టకేలకు నిద్రించెను. రాగలతికయు నామెకుఁ గునుకుపట్టిన వెనుక మేనువాల్చెను.

మఱునాఁడు రేయిఁగలతనిద్దురచేతఁ గల్గిన బడలికచే సౌందర్యతిలక మేలుగాంచునప్పటి కించుక ప్రొద్దుపోయె. ఆమె లేచి నిలువుటద్దములోఁ దన నెమ్మోమునుఁ జూచుకొని కేశ సవరించుకొనుచుండ రాగలతిక పరుగుపరుగువచ్చి "అమ్మా! ధారుణీదేవిగారు మిమ్ముఁ జూడఁగోరుచున్నారు. అప్పగారితోఁగూడ నామె యిల్లు వచ్చుచున్నది." అని పలికెను. గుణోత్తమ తిరిగి చూచునప్పటికిఁ దండ్రియు ధారుణిని వెంటఁబెట్టుకొని మెల్లగ మేడమెట్లెక్కుచుండెను. వారు నెమ్మదిగ లోని కరుగుదెంచుటయు, సౌందర్యతిలక యెదురుగాఁ జని యా దేవి పాదారవిందములకు వందనమొనర్చెను. ఆమెయు గద్గదకంఠయై యనురూపవరమణునిఁ జేపట్టుమని దీవించె. అనంతరము రాగలతిక వేసిన పీఠములపైఁ జంద్రపాలుఁడును ధారుణియుఁ గూరుచుండిరి. తరువాత వారిట్లు మాటలాడిరి.

ధారు—బిడ్డా! సౌందర్యతిలకా! నిన్ను నేను జూచి చాలదినము లాయెనది. ఈనడుమ నెన్నఁడు నాకన్నులు నిన్నుఁ గాంచి యానందించుటకు సమయ మబ్బదయ్యె. ఎల్లప్పుడును నిన్ను జూచుకొను భాగ్య మింక నబ్బ లేదు.

చంద్ర—అమ్మా మీరు వచ్చినపని యేమి? ఆయుష్మంతుఁడగు మనకళానందుని జాడ యేమయినఁ దెలిసినదా?

ధారు—నాయనా? అంతటిభాగ్య మీమందభాగ్యురాలి కేల్ల కలుగును. మీకేమయినఁ దెలియవచ్చినదా యని యడుగుటకే యిటవచ్చితి. తెలిసెనేని నాకించుక యెఱుఁగం జెప్పుము తండ్రీ?

చంద్రి—అమ్మా! నీకుమారునిసంగతి నేనుగూడ యెఱుఁగను.

ధారు—హాకుమార! ఎన్నఁ డిల్లువిడచియెఱుంగవు. ఎండ కన్నెఱుఁగని సుకుమారుఁడవు. ఆఁకలి దప్పికల కెట్లు లోర్చుచుంటివో? వేళకుఁ బట్టెఁడోగిరము నించుక ద్రావ నీరు నిచ్చి నిన్నాదరించువారెవ్వరు? ఏయడవులలో నేచెట్లపుట్టలక్రిందఁ బడి మూర్ఛిల్లితివో! ఏనయ్యాపు నీకుఁ గీడు సలుపునో కదా! ఎన్నఁడుఁ జూతు నవ్వొత్తోఁచు నీమొగ మింకఁ గాంచు పున్నె మీఘటమునకుఁ గల్గునే. ఏదుఃఖ మెఱుఁగకపోయిన మీ యయ్యయె పుణ్యాత్ముఁడు.

చంద్రి—అమ్మ, అట్లు వాపోవకుము. అతఁడు కుశలియై రాఁగలఁడు. అయినం బోవునపు డెందుకొఱకుఁ బయనమై యతఁడు సనియెనో నాకెఱింగింపుము. అక్కడకు సేవకుని బంపి వెదకించెదను.

ధారు—అయ్యా! ఈదేశయాత్రకుమున్న కొన్నిదినములు మానత్ప పరాయత్తచిత్తమునఁ నే నన్నమాటలు వినిపించుకొనక తా నన్నమాటఁ గ్రమ్మరిననుచు నొకవిధముగా నుండెను. దానింబట్టి యది నవయౌవనారంభ మగుటచే నేస్త్రీయో మోహాఁపు విత్తనముల హృదయక్షేత్రమునఁ జల్లినదని యెంచుకొని యడుగుట యుచితము కాదని యూరకయుంటిని. అంతఁ గొన్నిదినములు గడవ నొక్కనాఁడు మాయయ్యనిదురించుటయు నేను మేల్కనియుండుటయు సంభవించినది. అప్పుడు మావాఁడు నిద్దురలో "సౌందర్యతిలకా కొఱవంక యిదిగో" యని పలవరించెను. అదియాధారముగ నాతనిచిత్త మీముద్దుగుమ్మయందుఁ దగిలె నని సంతసించుచు ధన్యురాల ననుకొని నీతోడ వియ్యమొందు కాల మెన్నఁడువచ్చుననియు, నుభయకుల పవిత్రతయు రూపున గొన

మున నసమానయు నగు నీమె నాకుఁ గోడలయి యిలుమెట్టు టెప్పుడని యుఁ జిలుకయుఁ గొఱవంకయు లాఁగునఁ గొమరుకుం గోడలును ముద్దు ముచ్చటలతోఁ గాఁపురముసేయఁ గన్నులారఁ జూచుకొని వారిలుదిద్ది నాకుపచారముఁ జేయ సుఖించు కాల మెన్నఁడుగల్గునని యెదురుచూ చుచుండ నంతలో నొకనై పరీత్యము సంభవించెను.

చంద్ర—అంతట వచ్చిన వైపరీత్యమేమి?

ధాయి—అయ్యో! యంతలో సౌందర్యతిలకను జరాసంధుఁడు బలాత్కారమున కప్పింపఁదలఁచినాఁడని యొకవార్త నగరిలోఁ బొక్కెను. అది విని మావాఁడు నిర్విణ్ణహృదయుఁడయి దానికిఁ బ్రతిక్రియ సేయఁ గాఁబోలు, నుజ్జయినికిం బోయినవాఁ డమ్మా! యొక నెలకువచ్చునని నన్ను నిట నుంచి చని యిప్పటికి కాలునెలలయ్యె. ఏపాపపు గడియలో నిల్లు వెడలెనో కాని మరల నిలుసేరలేదు. నాకుఁ గాలము సమీపించినది. ఆ యొక్కకుమారుని చేతిమీఁదుగాఁ గడతేరు యోగము నాకు లేదు. అయ్యో! బాలెప్పుడ్రైన వానివార్తఁ విన్న నాకు సత్వరముగ నెఱిఁగింపుఁడు గాక.

చంద్ర—అమ్మ! అందులకు సందియమేమి? అతనిరాక నాకుఁ గూడ నపేక్షితేయమేకద! కళాసంధుఁడు చంద్రపాలున కన్యుఁడు గాఁడు.

ధాయి—ఆ వాత్సల్యము వానిపై నుంచుము. వాఁడు తండ్రి లేని పిల్లవాఁడు. ఇఁక నే నింటికి కరిగెద. నాకు సెలవిమ్ము.

అని లేచుటయు సౌందర్యతిలక యామెకు వెండియు నమస్క రించి యాశీర్వచనములఁబడసి యామెను పిలిపించి యనిపెను. చంద్రపాలుఁ డామెను సాగనంపి యామెకుం దనకుఁ జరిగిన సంభాషణముంగూర్చి తనలోఁ దాను వితర్కించుకొనుచుండెను. అప్పల గుణోత్తమ రాగలతి కలం జూచి యోసీ! పాపము! ఆకథవిని మనకే యింతజాలిగనున్నది.

తల్లిప్రాణమెట్లున్నదోగదా! అహాహా! నెచ్చెలీ! నానిమిత్త మాసుకు మారుఁ డెంత కష్టము నొందుచున్నాఁడే! ఈమహాదేవికిం గోడలనై యాతని చెట్టఁబట్టునట్టి యదృష్టము నావంటిదానికిఁ గల్గుటరిది. కోటి నోములు నోఁచి యెక్కుశుభఫలములు గోరఁ దగునా? యని వేఁడి కన్నీరు దొరఁగ వగవసాగెను. అనంతరము రాగలతిక సమయోచితము లగువచనరచనల నూరార్చి భోజనమునకుఁ దోడ్కొనిపోయెను.



ఇరువదియొకటవ ప్రకరణము.



రణార్ణవుఁడు మొగలియానుజాబుఁ దనకుఁ జూపిన నాఁటఁగోలె జరాసంధుఁ డాగ్రంధకర్తే పేరెఱుఁగఁగోరి యెన్నియేనిజతనములు సేయఁదొడఁగెను. మొట్టమొదట ననుమానము జయసేనుఁ డాకుట్రలో నివాఁడని యాతనినెమ్మది నుదయించెను గాని యారాకొమరుని మతి భ్రమణము నొందుట విన్నపిదప మగధరాజు నిరపరాధినిఁ జెఱసాలనుం చితిఁ గాఁబోలు దైవమా యని యపుడపుడు చింతిలుచుండెడివాఁడు. అదియునుంగాక జయసేనుని యిల్లాలు భర్తదురవస్థకు బెంగఁగొని ప్రాణావశిష్టయై యున్నదని సేవకులవలన విని యాపరమపతివ్రత నంతమ నఃక్షోభంబు పాలుచేసినందు కాయుసుఱు తనకుం దనవారికిఁ గలుగకు న్నే యని యొకప్పుడు వగచుచుండును. ఇది యిటుండ రణార్ణవునకు సౌందర్యతిలకనిప్పించి పెండ్లిసేయింపఁ దలంచుటచే నది యెట్లునెఱవేఱు నని రాజు నిరంతరము నుపాయము నన్వేషించుచుఁ జంద్రపాలుని మనసు నొవ్వకుండ రణార్ణవునికోర్కె భంగముకాకుండ మెలఁకువతో వర్తింప వలయునని నిశ్చయించెను. కాని సౌందర్యతిలక చిత్తము కళానందాయ త్తమైనట్లు కర్ణాకర్ణి నాలకించి యాకన్నియ నన్యుని కిప్పించుటచే నాతని మనసు చివుకుమనునని కొంత తలఁచుచుండెను. ఈతలఁపులన్నియు

ముప్పిరిగొని నెమ్మనము నుమ్మలికమ్మున ముంప నొక్కనాఁడు మగధరాజు తామరాకులోని నీరు చందమున డెందము కుదురుపా టెఱుఁగక సంచలింపఁ దనయంతిపురమునఁ గూరుచుండి మగధరాజ్యలక్ష్మి భావిదశం గూర్చి యోచింపుచుండ సర్వస్వతంత్రుఁడగుటచే రణార్ణవుఁడు తలుపులం దెఱచి లోనఁ బ్రవేశించి తేనియెదుటఁ జేఁదోయిమోడ్చి నిలువంబడియెను. జరాసంధుఁ డెప్పటివాత్సల్యముతో వానిఁగనుఁగొని "కుమారా యిటురమ్ము కేతకీదళమున లిఖించిన మహాపాతకుని జాడయేమైన దొరకినదా" యని పలుకరించెను. రణార్ణవుఁడును వానిప్రక్కనున్న యొకపీఠముపైఁ గూరుచుండి దేవా యెన్నిభంగుల నాతపమంతయు ధారవోసి నేఁ గనుంగొనుచున్నను నాకావంతయు జాడ కానఁబడదయ్యె. ఐనను నేఁడు దాని కొక్క నిరపాయమైన యుపాయము నూహించినాఁడ. వినుండు. ఈగిరివ్రజపురమునఁ గొన్నిదినములనుండి యొకవింత జరుగుచున్నది. పార్వతీదేవి యవతారమని పౌరులచేత మితిమీఱునట్లు కొనియాడఁబడుచున్న యొకయోగిని మనపురముఁ జొచ్చినది. అదిమొదలు మన నగర మట్టుడికిన ట్లుడుకుచున్నది. ఎట్టిప్రశ్నలు నెవ్వరడిగిన వారికెల్లఁదగినయుత్తరముల నొసఁగునఁట. ఒక్కప్రశ్నమునకేని తప్పఁ జెప్పియెఱుఁగదఁట. గిరివ్రజపురవాసిఁగాక మగధదేశమున వసించువా రనేకులు కడుమార్గాయాసమున కోర్చి వచ్చి తమమనోరథముల నామె నడిగి సంతుష్టహృదయులై చనుచుందురు. రాత్రులయందెకాని పగటివేళ నామె యేప్రశ్నమునకు నుత్తరము నొసంగదు. రేలయిన నేరికంటఁ బడక యొకగదిలోఁ దలుపు మూసికొనియుండి యావలనుండి యడుగువారి కుత్తరము లొసంగునఁట. అది యేమిమహిమమో నేనెఱుఁగను గాని యామె గుమ్మముముం దిసుక వేసిన రాలకుండునట్లు జనులు గుంపులు గూడి యుందురు. ఇమ్మొగలిరేకు నామెకుం జూపి దీనికర్త యెవ్వఁడని యడిగిచూచెద. దాన సంతయుం దేలునని రణార్ణవుఁడు పలుకుటయు

రాజు చిఱునగవు నగి నీయిచ్చవచ్చిన తెఱంగునఁ బ్రవర్తింపుము. ఎట్లైన దానిఁ గనుఁగొనుటయె మాకావశ్యకము. అందు సఫలీకృత మనోరథుఁడ వయ్యెదవేని నీకోరినమేలు నీకొనర్చెద" నని వాగ్దానముఁ జేసెను. నిరాశయను గ్రీష్మమున నెండిన రణార్ణవుని హృదయలతిక యావాక్యామృత వర్షమున వెండియుఁ జివురొత్త నాతఁ డత్యానందముతో నిట్లనియె. తండ్రీ నాకు నీవొనర్పఁ దగినదియు నేను నీవలన నపేక్షింపఁ దగినదియు నగు మేలు సౌందర్యతిలక కేలువట్టించుట గాక వేఱొకటి లేదు. అక్కన్య కళానందుని పాలగునని తోఁచెను. చంద్రపాలుఁ బిలువనంపి నీతో నెట్లయిన వియ్యమందునట్లొడంబఱపుము. ఈకార్యమున నాకాశాభంగము వాటిల్లెనేని నీపాదారవిందములపైఁ బడి ప్రాణములు విడుచువాఁడను. ఇంక వేఱుగతి లేదు. కావున నీవు యావచ్ఛక్తిని వినియోగించి నామనోరథసిద్ధిఁ జేయవలయు. ఇంక నేనరిగి నాప్రయత్నమున నుండువాఁడ" నని ముదలఁగొని యాతఁ డరుగుటయు జరాసంధుఁడు రెండు నిముసములు వాని పోయినవలను జూచి తన నెమ్మనమున నిట్లు వితర్కింపఁ జొచ్చెను. "పసితనమునుండియు వీనిం బెంచినకతమ్మున నీతనిముద్దు లన్నియుఁ జెల్లింపకతీఱదు. ఈతని నిమిత్తము చంద్రపాలునితో మొగముఁ జెండుకొని ముచ్చటింపవలయును. అతని కుమార్తెసౌందర్యతిలక కళానందుని వలచినదనుట ప్రసిద్ధము. ఆమె రణార్ణవుని మెచ్చదు. చంద్రపాలుఁ డాయలరుఁబోఁడిని రణార్ణవునకు మనఃపూర్వకముగ నొసంగఁడు. తలపెట్టుక వెనుక బలిమినైననఁ గపటోపాయముననైన నామించుఁబోఁడిని హరించి పెండ్లిసేయక నేనుమానను. సాపరాధియో నిరపరాధియో యెఱుఁగక జయసేనునిఁ జెరసాలనుంచినందులకు విజయసేనునికుటుంబమును, సంపూర్ణముగ నెంతో రుల బంధముల నాటుకొనిన మోహాలతఁ ద్రెంపి సిద్ధమైన పెండ్లి విఘ్నము గావించినందునఁ గళానందుని కుటుంబమును, గతిహోత్రులచే

నొప్పించి తనకూఁతు నపహరించిరణార్ణవునికి వివాహము జేయుటకుఁ జంద్రపాలుని కుటుంబమును, నాకుఁ బగతుర కొలములోఁ జేర్చుట నిశ్చయము. మఱియు వారింబట్టి వారిచుట్టములు బక్కములు నెయ్యు రాండ్రులు బరిచయులును మాపైఁ గత్తికట్టుట తప్పనిష్పత్తి రాజధానిలో స్వసైన్యకలహము గలుగుటకవకాశమొసంగుట పగతురకుఁ దనలోతుఁ దెలియఁజేయుట యని రాజనీతివిశారదులు వాక్రుచ్చుట యెఱిఁగియు విధివశముననో పుత్రవాత్సల్యముననో యిందుఁబ్రవేశించితిని. కాని నందనందనుని కీఘట్టు తెలియకుండ జాగ్రత్తపెట్టవలయును. జరాసంధుఁడు రాజసామాన్యముననైన యింత లాతులకు జంకునే యని మీసముపైఁ జేయివైచి తలయూఁచి లేచి యిట్టటుఁ జూచి సేవకు నొక్కనిం బిలిచి చంద్రపాలుం దోడుకొని రమ్మని యానతిచ్చె. రాజు మనస్సుకన్న నెక్కుఁడు వేగముగఁ జంద్రపాలుని గృహమున కాసేవకుఁడు పఱచి తనస్వామి యానతిం దెలుపుటయు నతఁడు మనమున నొక్కింతుక శంకించి కొంతొకసేపటికి ధైర్యముఁ దెచ్చుకొని దైవికములు మనమునందు హానికరముగాఁ దోఁచి పిదప కుశలపరిణామము లగునని నిశ్చయించి యాసేవకునితో బయలుదేఱి వచ్చెను. నిష్కళంకమగు వంశముఁబట్టియు సుప్రసిద్ధమగు సచ్చరితఁబట్టియుఁ జంద్రపాలుఁడు రాజుచే నెల్లపుడు గౌరవింపఁబడుచుండెను వాఁడు. కావునఁ దనకు మున్ను నడచినమర్యాద నడచునో లేదో యని యాతఁడు భయపడెను. కాని మగధరాజాతనిం దొంటికన్న మిన్నగ గౌరవించి కూరుచుండఁబెట్టి యథోచితములగు కుశలప్రశ్నములఁ జేసి మగధరాజ్యవిషయము నెంతయుముచ్చటించి ప్రసంగవశమున నిట్లనియె. నెచ్చెలీ! చిన్ననాఁటఁగోలె నీవు రాజ్యతంత్రములయందు సైదోడు నాగునఁ దోడుపడుచుండ నీతోడఁగల నెయ్యమునకుం దనివోక చుట్టఱికము సేయవలయు నని కోరుచున్నాఁడ. కలదుగదా భువనై

సుందరి యగుసౌందర్యతిలక నీకూఁతురు. ఆముద్దుగుమ్మసోయగము బుద్ధినేర్పు వినుటచే నాకుఁ గోడలుగ నబ్బాలిక నొనర్చుకొనుటకెంతయు నభిలాష వొడమెను. ఆయింతిచిత్తము కళానందునిపైఁ దవులుకొనిన దని వినినాఁడ. చక్కఁదనమున, బాహుబలమున నాతని కీడువచ్చువాని వేఱొకనిఁ గానవా! తనగరువంపుఁజేష్టలచే రెండుమూఁడుసారులు నాకలుక వొడమించుట నీవెఱుఁగుదువు. ఏకుఁ గనుంగూర్చువాఁడు సర్వవిధములఁ బూజనీయుఁడు నాకాత్మజుఁడు నగు రణార్ణవుఁడు నీ కల్లుఁడు గానోపు. వారిదాంపత్య మనుకూలమ్మై సెలంగు. నీతోడివియ్యము నాకుం బరమానందము. మిత్రమా! నావచనంబు లన్యాంబులుగాఁ దలంపక నీ కూఁతును రణార్ణవున కొసంగుము." అని నొక్కిచెప్పుటయుఁ జంద్రపాలుఁడు భయమును మొగమోటయును దన్ను మారుపలుకనీకుంటచేఁ గార్యనిశ్చయము సేయనోపక నాలుగుదినములలో మీకుత్తరముఁ జెప్పెద. నాకుఁ బ్రస్తుతము సెల వొసంగుఁ డని బ్రతిమాలి యాతని యనుజ్ఞవడసి యంతిపురిఁబాసి బయలుదేఱి యిలుసేరెను.



## ఇరువదిరెండవ ప్రకరణము.



అట్లు రణార్ణవుఁడు మాగధునియొద్ద సెలవుఁగైకొని మున్ను జయసేనుని యింటనుండి తాను సంగ్రహించుకొనివచ్చిన మొగలియాకుజాబుఁ జేకొని గిరివ్రజపౌరులచే నత్యంతమును గొనియాడఁబడుచుఁ ద్రికాలవేదియనిపేరుఁగన్న యోగిని యున్నమఠమునకుం జనియెను. చనునప్పటికి సాయంకాలమగుటయు యోగిని మఠముముందు జనులు వేనవేలు గుంపులుగూడి చొచ్చుట కెడమునొసంగమి రణార్ణవుఁ డది యసమయమనియు నట్టిరాజకార్యములు రహస్యముగఁ బ్రవర్తిలుట యుచి

తమనియుఁ దనమనమునఁ దలపోసి వెనుకకు మరలిపోయెను. యోగినియు నిజతపోమహిమచేఁ దన్నుఁ బ్రశ్నములడుగవచ్చిన వారికందఱికి కుచితములగు నుత్తరముల నొసంగి సంతృప్తమనస్కులఁజేసి యంపి మరల స్నానమాడి భవానీచరణరాజీవములఁ గుంకుమతోఁ బూజ సేయుచుండెను. అప్పటికి రెండుజాములరాత్రి యగుటచే రాజవీధులు నిర్మానుష్యములయ్యెను. చండశాసనుఁడగు జరాసంధునియాన మూర్తులై కొన్నదో యన్నట్లు రాజభటులును వేగులవాండ్రును నగరమంతయుఁ దిరుగుచు నారాత్రి జరగుసంగతులను స్వామికి నివేదింపఁ జూచుచుండిరి. అంతలో రణార్ణవుఁడు జరాసంధుఁ డుం దనకు గారాముపెంపున నొసంగిన మణిభూషణములన్నింటిం దాల్చి విలువయెన్నరాని వలువలుగట్టి కుడిచేతఁబడునుబాకు నెడమచేత మొగలితేకుంబూని తెల్లనిగుఱ్ఱముపై నెక్కి యోగినీమఠమున కరుగుచుండెను. రాజభటులచే నివారింపఁబడక వేగులవాండ్రచేఁ బరీక్షింపఁబడక మఠమున కతఁడరుగునప్పటికి యోగినియొద్దనుండు పరిచారిక యరుగుపై నిలువంబడి యాపురుషుని జూచి వినయముతో నొకపీఠమువైచి వానిపై గరసి యోగినితో మనవి యొనర్ప లోనికేఁజనియెను. పరిచారికతో నామెయించుక ముచ్చటించి మరలనామె నీవల కంప నదివచ్చి "దేవా! మీరువచ్చినపనియేమో యడుగు" మని యోగిని నా కానతిచ్చినది. చాల ప్రొద్దాయె సత్వరమె సెల వొసంగుదురేని మాదేవి నిద్రింపఁజనియెడు" నన రణార్ణవుఁడిట్టులనియె. మగధమహారాజు జరాసంధుఁ డీమెయొద్దకు నన్నతిరహస్యమగురాజకార్యముమీఁద నంప నేనిందువచ్చితిని. మీదేవి నాతోడఁ బ్రత్యక్షముగసంభాషింప ననువగునేని యటుసేయుట యుత్తమోత్తమము. అని యింకనేదియో యనఁబోవుచుండఁ బరిచారిక వానిమాట కడ్డమువచ్చి "చాలుచాలు; ఆదేవి కొమ్ములుదిరిగిన వారితోడనే మాటాడదు. రాగాదుల జయించిన మునీంద్రులకైన వసుంధరయంతయుఁ బాలించ

చక్రివర్తులకైన దర్శనంబొసఁగదు. నీబోఁటిసామాన్యునకా" యని మందలించెను. చోటుగాని చోటఁ గాలిపట్టుబట్టుట కార్యభంగమునకు హేతువని జంకి యెప్పటివలె నీముఖముననే యుత్తరప్రత్యుత్తరముల జరగనిమ్మని యాతఁడు తనపని నిట్లని విన్నవించుకొనెను.

"మగధరాజున కపాయముఁజేయఁదలఁచి కొందఱు కుటిలాత్ము లు దుస్తంత్రములు పన్నుచున్నారు. వారికుట్రలపెట్టెయుంబోలె మాకు వారిజాబొకటి లభించినది. కాని యెవ్వరాలేఖను లిఖియించియుందురో యెఱుఁగఁజాలకున్నారము. ఈయదియే యామొగలిరేకుజాబు. దీని నామూలాగ్రముగ మీరు చిత్తగించి వ్రాసినదురాత్మునిపేరు మాకుం దెల్పి మగధరాజ్యమును మహారాజును రక్షింపవలయును. అని పరిచారికచే నామొగలియాకును లోని కంపెను. యోగిని దీపమును బాగుచేసి దాసియెదుట నాజాబుంజదువుకొని యందలి ప్రత్యక్షరమునకును మితిమీఱిన యానందమునొందుచుఁ జదువుటముగియఁగనె మరల రెండుమూఁడుసారులు చదివి కొంతసేపటికిట్లని మెల్లమెల్ల లోననుండి ప్రత్యుత్తరమిచ్చెను. "ఈజాబున కింత కలవరమొందవలసినపనియేమి? మీకుం గిట్టనివాఁడు, విదేశమున నున్నవాఁడు యువతీమోహమునఁ దవులొన్నవాఁడు దీనిని వ్రాసియుండనోపునని విస్పష్టముగాఁ దెలియుచుండ మీరింతమూర్ఖులై యోజింపనేరకుంట నాకక్కజముగనున్నది. అయినను మీయూహ నిజమగునో కల్లయగునో యనుసందియము మీకున్నదిగావున మూఁడునాళ్ళలో వానిపేరును వానియున్నతావును మీకెఱిఁగించెదను. ఒకవేళ వీనినెఱుఁగ నాకు సాధ్యముకాదేని నాకుఁగల యద్భుతదివ్యశక్తిచేఁ గైలాసమున కరిగి శాంకరీముఖమున నదియెఱిఁగివచ్చి మీకుఁదెలిపెద. జరాసంధుఁడు భైరవపూజాధురంధరుఁడగుటచే మహాకాళికని మహేశ్వరునకును వాసియందుఁ బుత్రిప్రేమ. నేను గైలాసమునకరిగినపుడెల్ల భవాని యీతనిమాటయె చెప్పుచుం

మును. భవానింబట్టి నాకును మగధరాజ్యమన్న నింతింతయనరానిపక్ష
ము. అయినను మాకిందొక్క సంశయమున్నది. జరాసంధుని రహస్యముల నీ వెఱుఁగఁదగిన చుట్టమవో, టక్కరితనమున నాతనిరహస్యముల నెఱుఁగ నీవఁకఁబెట్టుకొనివచ్చినపగతుఁడవో నాకు నిజముదెలియకున్నది. కావున నీకారహస్యములఁ దెలుపవచ్చునని నా మనంబునకు దృఢవిశ్వాసముగలుగునట్లు జరాసంధుని వ్రేలియుంగరము నానవాలుగఁ దెమ్ము. ఆవల నంతయు శుభమగును.

ఆపలుకులు చెవినిబడ రణార్ణవుఁ డామెమహిమ కచ్చెరువడి యీవలనుండియె వందన మాచరించి యెట్టులైన నాయుంగరమును మఱునాఁడుదయమునఁ దెచ్చి యిచ్చుటకొప్పుకొని సంతుష్టహృదయుఁడై యింటికేఁజనియెను. అనంతర మాయోగిని యాలేఖను మరలమరలఁ జదివి తలయూఁచి "హాదురాత్మా! నేఁటికిఁ జిక్కితివిరా! పాపాత్ముఁ డెన్నఁటికైనఁ జిక్కకపోఁడు గదా! యని దానిం బువ్వులసెజ్జలో నుంచి పరిచారికయుఁ దానును నాఁటిసంగతులు ముచ్చటించుకొనుచు నిద్రించిరి.

ప్రొద్దుపోయి నిద్రించుటచేఁ జాలినంతనిద్దురయుండమి రణార్ణవుఁడు కన్నులు నులిమికొనుచు బద్ధకముచే నొడలు విఱుచుకొనుచు నావులించుచు లేచి చీఁకటి వీడకమున్న రాజగృహమున కరిగెను. రణార్ణవుని సందేశ మేగతిఫలించినదో యెఱుఁగఁగోరి పెందలకడ మేలుకాంచి జరాసంధుఁడు వీనికొఱకెదురుచూచుచుండ నింతలో రణార్ణవుఁడువచ్చి నమస్కరించి యెదుటనిల్చె. జరాసంధుఁడు యథోచితముగ వాని నాదరించి యోగినీవృత్తాంతమంతయు వినఁగోర నాతఁడు పూసగుచ్చినట్లు జరిగినకథయెల్ల తూచాతప్పకుండ విన్నవించి యామెమహిమలు వేయినోళ్ళఁబొగడి యుమామహేశ్వరులకు మగధరాజ్యముపైఁగల యభిమానమును వక్కాణించి తమకార్యము నిరభ్యంతరముగ నెఱవేఱునని

ధైర్యముతో నుండెను. జరాసంధుఁ డాసంభాషణమంతయు నాలకించి యించుక సేపు వానితోఁ బలుకక యోజించి యెట్టకేలకు "కుమారా మనకుఁ గిట్టనివాఁడు దేశాంతరమున నున్నవాఁడు. యువతీమోహమునం జిక్కినవాఁడు, నెవ్వఁడై యుండవచ్చును? ఈయర్థము మనకుం దోఁచకున్నది. కళానందుఁ డూర నున్నాఁడా? ఈనడుమ జాడలేఁడేమి యని యడిగెను. రణార్ణవుఁడును వెంటనే "కొంతకాలమునుండి యూరలేఁడునుఁడీ" యని యుత్తరముచెప్పి తనలో నిట్లని వితర్కింపసాగెను. "కళానందునిపై రాజునకే యనుమానముతగిలినది. సౌందర్యతిలక కా కళానందహతకుఁడు మనోహరుఁడగుటచే నెట్టులైన నాతనిఁ గడతేర్చిన పక్షమున నాయిందువదన డెందము నాపై నిలుపును. కొందఱు మంత్రికుమారులు నేనునుం గలసి యాదురాత్ముని నిదివఱకే రహస్యముగఁ దుదముట్టింపఁ గుట్రలు పన్నినారముగాని యాతఁడపు డూరలేమి నది సాగదయ్యె. ఈలేఖ సీతఁడే వ్రాసియుండు. వ్రాయకున్న నేమి? రాజునకాతనిమీఁద నలుకవొడమించితిని. వాఁడు మరల నగరముఁబ్రవేశించినతోడనే వధియింపఁబడును. కాని యేనితోఁ గాలానుగుణముగ ముచ్చటించి మనోభీష్టముం దీర్చికొందును. ఏయుపాయముచేతనైన శత్రునాశన ముచితముగదా!" అని యెద్దియోమాటలాడఁబోవుసప్పటికి రాజంతలో రణార్ణవా! పలుక వేమియని హెచ్చరించెను. అది సందుగా రణార్ణవుఁడు తన క్రోధమహానలముచేఁ గళానందవంశోద్వాసముసు మసిఁజేయనిశ్చయించి యిట్టులనియె. "దేవా! ఈసరికిఁ గొన్ని మాసములనుండి కళానందుఁ డూరలేఁడు. ఆతనిజాడ లెవ్వరు నెఱుఁగరు. ఇది యాతనిపనియై యుండునని యోగినీవచనముంబట్టి తోఁచుచున్నది. ఎట్టులైన నాతనిఁబట్టి తెప్పించినఁగాని మనకునేమముండదు. ఇదె నామనవి" యనుటయు మగధరా జామాటలువిని యెద్దియో స్ఫురణకు వచ్చినవాఁడువోలె హా! తెలిసినది! ఆపాపాత్ముఁడు

## ఇరువదిమూఁడవ ప్రకరణము.



కూఁతును రణార్ణవునకిమ్మని తనయేలిక మాఁటమోటవిడిచి తన్ను నడుగుటచేఁ జంద్రపాలుఁడు మిగులఁ జింతాక్రాంతుఁడై యామాట యెవ్వరికిం దెలుపక దీనాననుండై "రాజుతో నేమని మనవి యొనర్చువాఁడ దైవమా! గడువు సమీపించుచున్నది. రణార్ణవుని పేరు మాఁగునో త్తమ యేవగించు. ఈమహితావివాహముకతమున నాకు మరణము సంభవించునని తోఁచెడును. అయినం గాదలఁచినది కాకపోదు. మా యమ్మాయితో నొక్కసారి యీనావస్థ చెప్పి యామె కిష్టమగునేని రణార్ణవుని కేలునట్టుమని ప్రార్థించెద. ఇష్టములేకున్న నాకులాంతిమైనను సరియ కాని బిడ్డసుఖమున కడ్డునెట్టు" నని కొండొకసేపు తలపోసి కూఁతునొద్దకుం బోవసమకట్టి రెండడుగులు నడచి "సీ! నాజన్మమేల? ఎంతకఠినహృదయుఁడనోకద, కళానందునియందు డెందము వత్సకు నాటియున్నదని యెఱిఁగియు సర్వవిధముల నయోగ్యుఁడగు పురుషాధముని వరియింపు మని యడుగ నాకు నోరెట్టులాడు? మున్ను గళానందుని వేనోళ్ళఁబొగడి నేఁ డేమొగము బెట్టుకొని రణార్ణవుని విషయమై ప్రసంగింతు. అక్కటా! బిడ్డయొద్దకుం బోవమానుదునా? కాదు కాదు, పోయిచెప్పెదను. అని నిశ్చయించి మెలమెల్లన మేడమెట్లెక్కుచుండెను.

కడచిన రెండుదినములనుండియుఁ దండ్రి మొగము దైన్యమును సూచించుటచే సౌందర్యతిలకయు నది తనవిషయమైన విచారముగ నుండనోపునని నిశ్చయించి తనమూలమున జననీజనకులకుఁ గలిగెడు మనోవ్యాధికిఁ జొక్కుచు నందులకుఁ బ్రతిక్రియ నరయుచు నెంతయు వ్యాకులము దానునుగూడఁ బొందసాగెను. నాఁటియుదయమున రాగలతికయు సౌందర్యతిలకయు మేడపై నొకచోటఁ గూరుచుండి కలభావము

నాలోచించుకొనుచుండఁగా నింతలో సోపానములమీఁద నడుగులచప్పు
డు వినంబడియెను. వచ్చువార లెవ్వరో చూతమని రాగలతిక యించు
క తొంగిచూచునప్పటికి మెట్లుదాటి చంద్రపాలుఁడు కొంతదూరము
వచ్చెను. తోడనే యిరువురును లేచి నమస్కారముఁజేసి దీవనలఁబడసి
నిలువఁబడియుండ నాతఁడు తానొకపీఠముపైఁ గూరుచుండి బిడ్డలా
రా! కూరుచుండుఁడి యని యానతియిచ్చి చేయిపట్టుకొని కూఁతు నొక
పీఠముపై సమీపమునఁగూరుచుండఁ బెట్టెను. సౌందర్యతిలక సిగ్గుచేఁ
దలవంచి పెడమొగమై యుండెను. రాగలతికయుఁ గొంతతడ వూరకుం
డి చనువు పెంపున నిట్లనియె. రెండుదినములనుండి మీరు తొంటియ
ట్లుండుట లేదు! మీస్థితిఁజూచి మాచెలియుఁ దదనుగుణముగనున్నది,
మీమనోవేదన బిడ్డల కెఱుఁగఁజేయఁ దగినదైన మేము వినఁగోరుచున్నా
రము. అప్పుడుఁ జంద్రపాలుఁడు చిఱునగవుఁ దెచ్చుకొని యమ్మా!
నేనుండ నాయలమట తీరునది కాదు. మీ రడిగిరి కావున నామనోవేద
నము నంతయుం జెప్పెద నాలకింపుఁడు. మగధరాజ్యమునవసించుట పా
ములపుట్టలోఁ గాఁపురమునుసేయుట. మొన్న జరాసంధుఁడు నన్ను బి
లువనంపి బిడ్డను రణావర్షునకుఁ బెండ్లిసేయింపుమని నాతోడ నొ
క్కి చెప్పెను. ఇంతకన్న నాకు దుఃఖకారణమేది? అతని కీయవలసిన
యుత్తర మీవలనకే యొసఁగుదునుగాని వత్సతో ముచ్చటించి యవ్వలఁ
గార్యనిశ్చయముఁ జేయఁదలంచితిని. అమ్మా! నీమత మెఱిఁగింపుము.
రాజుమతమునకు వ్యతిరిక్తముగ నరిగినంతనె నాకుఁగల్గు పాట్లు నీ వెఱుఁ
గుదువు. కళానందుని విడిచిన నీ కేమగునో నే నెఱుంగుదును. కావు
న నీవన్నియు సరసి నీయభిప్రాయము నాకెఱిఁగింపుము. కూఁతురై
నను గొడుకైనను నాకు నీవకాన ప్రాణాంతమయినను సరియు. క్షు
లాంతమైనను సరియే. నేను నీమనోభీష్టము నెఱవేర్పఁ దలఁచియున్న
వాఁడ. నాయెదుట జంకక మోమోటమువిడిచి హృదయమున నున్నదున్న

ట్లు పలుకుము. నాకు నీకన్నఁ గూర్చు పదార్థ మన్య మొక్కటి లేదుగదా! యని తనయుమ్మలికమును నచ్చివపనియు నెల్లడించిన భయసంభ్రమము లంజేసి సౌందర్యతిలకమేను చెమ్మటవరదలతో నిండసాగెను. రాగల తిక చంద్రపాలునిమాట లన్నిటిని జక్కఁగఁ బూర్వోత్తర సందర్భములతో నాలకించినదగుటఁ దన చెలి భయభ్రాంతయైన కతనఁ దండ్రికిఁ దగినయుత్తర మీయఁజాలదని తానె యాతని సన్ముఖయై యిట్లనియె. " అప్పా! మీకు నచ్చునప్పటికి నేనును మాచెలియు నీయంశమును గూర్చియే ముచ్చటించుకొనుచుంటిమి. ఆమెయున సంతయు నాకెఱుఁగఁజెప్పుటచే నాబాలికయభిప్రాయము మీకు విన్నవింపఁగలను. ఇవి నాపలుకులుగ గ్రహింపక నచ్చెలిపలుకులుగ గ్రహింపఁ బ్రార్థించెదను. కళానందుని విడిచి రత్నార్ణవుని పెండ్లియాడ, యింద్రియములఁ బాలెనైచి మసి బొగ్గుఁగై కొనుట. కళానందునకును ననురాగలత నాటికొని వేళ్ళుపాఱి చాలకాలమైనది కావున దానిఁ ద్రిప్పుటకు మఱల నాప్రేమము రత్నార్ణవుని పై నిలుపుటకు వేదోక్తప్రక్రియగా వశముఁజేసినను నాతరముగాదు. ఉత్తమకులజుఁడు మన్మథుఁడు లోకమన్మథుఁడు నగు కళానందునిఁ దలఁచి నీచకులజుఁడు కురూపియు నగు రత్నార్ణవునిఁ దలఁపనైనరాదు. చెందమాటనిప్పుడు కలలోనైన ముచ్చటకైన నొకమాఱు కూడ నరుగదు. గాఢానురాగసక్తములగు కాముకజన హృదయములు రాజాజ్ఞలకు లోఁబడి చెప్పినట్లు వినునవికావని జరాసంధునితో నా మాటలుగా విన్నవింపుము. వివాహములు దేహసంబంధములుకావు. హృదయసంబంధములు. కళానందునకు చెందమింతకుమున్న యర్పింపఁబడుటచే నేనాతనికిల్లాలను. ఆదేహ మన్యులకొసంగుట పతివ్రతలక్షణముగాదు. తండ్రీ! కనకలతయు నీకుఁగూడ నాదురాత్మునివలన నపాయమువాటిల్లునుగాన, మనసుగిలియనివానికేలు పట్టుటకన్నఁ గన్యత్వమునఁ గాలముబుచ్చుదాన నని మావత్సువివాహమునే యుజ్జగించి

బ్రహ్మచర్యవ్రతమామరణము నిర్వర్తింపఁ దలఁచెనని రాజుతో మ నవి యొనర్పుమని గొంకులేక యుపన్యసించుటయు రాగలతిక మొగ ముఁజూచి చంద్రపాలుఁడు మిగుల నక్కజమునొంది బిడ్డపైఁగను జాలి వడి యమ్మాటకు సంతసించి కూఁతునుద్దేశించి యెట్టకేల కిట్టులనియె. అమ్మా! నాప్రతినవినుము. పదునెనిమిదేండ్లు నిన్ను గారాబమునఁ బెంచి తుదకు రాజున కలుకవొడమునను భయముచే నేను బ్రదికియుండి నాకన్నులయెదుట నీచేత బ్రహ్మచర్యవ్రతముఁ జేయించుచుఁ జూచి యూరకుండుటకు నాహృదయ మొప్పునే? రాజునకుఁ బగతుఁడనైన నాదునుగాక. ఏమివాటిలిన వాటిలుగాక! నేను నీయిచ్చవచ్చిన తె లంగున వివాహమునెఱపెదను. బిడ్డా నాదెస భయపడకుము. నీకుఁ గానియెడ నాతనువు కాల్పనేయని యూఱడించి యచ్చోటువాసి క్రింది కిం జనియెను.

తండ్రియరిగినవెనుక సౌందర్యతిలక తనమొగమెత్తి రాగలతిక యిచ్చినయుత్తరముచేఁ దనకత్యానందముంగల్పించిన నామెను గౌఁగిలిం చుకొని యోసీ! నాహృదయ మున్నదున్నయట్లు, నామనసునచ్చునట్లు, మాయయ్యమనసు నీరగునట్లు, నాగౌరవమునకుఁ దగునట్లుత్తరముఁ జెప్పితివే! నీప్రజ్ఞ నేమనికొనియాడుదు! మనమెంత దృఢనిశ్చయుల మైనను నేమి లావణ్యారాశిజాడ తెలియదుకదా! ఓసీ! అన్నట్లు, నాకు జ్ఞాపకము వచ్చినది. ఈనగరికివచ్చిన యోగిని యడిగినప్రశ్నములన న్నిఁటినిఁ జక్కఁగాఁ జెప్పునఁట. కళానందుని యున్నతావుఁగూర్చి యు నాకాతనిపొందు లభించుటం గూర్చియు నామెనడిగివత్తువా? దా నంజేసి హృదయము కొంత యూరటఁజెందునేమో! అనిపలికెను. ఆ మాట కేదియో మాఱువలుకఁదలంచి చెలకత్తె యుద్యమించుచుండ నిం తలోఁ దలవాకిటనుండి రాగలతికా రాగలతికా యని పిలుపు విన బడెను. రాగలతిక మేడదిగివచ్చి గుమ్మముదగ్గఱనొక ముసలిదానిం

జూచి నీవెవ్వ రేమికతమున వచ్చితివని యడిగెను. ఆమెయు నాయూ రుపేరు నీకేల? నీతోడ విమ్యమందఁదలఁచినపుడు చెప్పెదనుగాని ముందిది యాలకింపుము. నాఁడొకసన్యాసి సౌందర్యతిలక కెట్టులైన నందఁజేయుమని పూలవర్తకునిచేతి కిచ్చిన దివ్యకుసుమం బిదిగో. యో గిని మీాకందఁజేయుమని నన్నంపినది. ఇంకనన్ను నీప్రశ్నలతో బా ధింపకుము. నేనరిగెదను. అని యొక గుడ్డమూటనిచ్చి రాగలతిక యే దో యనుఁగదలఁచి యెన్ని పిలిచినం బలుకక వడివడి నడచిపోయెను. ఆయద్భుతప్రసంగముచే రాగలతిక మాప్రన్పడి కొంతసేపు వెఱ్ఱిచూపుఁ జూచి తుదకు మేడమీాఁదికిం జని యావృత్తాంతము దనచెలికిం దెలుప నామెయు నమ్మలేకనమ్మి రాగలతిక చేతినుండి మూటలాగికొని పట్ట రాని సంభ్రమముతో దానిని విప్పి యంగలత గడగడవడఁకఁ జెమ్మట లుగురియ నలిగియున్న మొగలియాకు టుత్తరమును దనలోఁ దాను చ దువుకొనసాగెను. రాగలతికయు నింతకన్న నెక్కుడగు నాతురముతో దానిం జూడఁగోరెను. కాని చెలి యేమనునో యని సందియమొంది యూరకుండెను. గుణోత్తమ తత్తరమున నుత్తరమెల్లఁ జదువుకొని కను దమ్ములనుండి యానందబాష్పములు ముత్యాలచేరులట్లు చెక్కుటద్ద ములనుండి దిగజారు "రాగలతికా! ధన్యురాలను. ధన్యురాలను. న న్నుఁబట్టుకొనవే! అయ్యో! రావే యనిపిలిచి యదిరాకమున్న సెజ్జపై వ్రాలి "హా! ఇది యామహాపురుషుని యొద్దనుండియే వచ్చినది. ఇది మనమనుకొనినటుల సిద్ధకుసుమముకాదు. మొగలియాకు. ఇదిగో చూ డుమని రాగలతికపైఁ బాఱవైచెను. రాగలతిక దానిజదువుకొనుచుం డ గుణోత్తమ నడుమ దాలింబిలిచి యోసీ! ఆయక్షరములపొంకమేమే! ఆసౌందర్యశుద్ధియేమె? వచనరచనఁ జూడుము! హా! ప్రాణేశ్వరా! ఈ మందభాగ్యురాలికతమున నిలువిడిచి దేశాంతరములపాలై పోతివిగదా! యనుచు నిట్టూర్పు నిగుడ్పసాగెను. రాగలతికయు మొగము మ్లానవహ్నో

సచంద్రికలచే వికసింప "చెలీ! నీవుకావుగాని మేము ధన్యులమైతిమి. పాపము! సంతసించుటకు నాగవల్లి లేదయ్యె. పాపమిది దొరకదనునిరాశచే నది యెంతేనియరిగినది. ప్రాణసఖీ! దీనింబట్టి కళానందుఁడు సుఖియై యున్నవాఁడని తోఁచెడును. నీవింక వగఁగూలవలసినపనిలేదు సుమీ! అని హెచ్చరించి యాలేఖఁ గ్రమ్మఱ నామెకిచ్చెను. కమ్మ మరలఁ గైకొని యింకొకసారి చదివిచూచి రాగలతిక తన చేష్టలఁజూచి నవ్వుచున్నను సరకుఁగొనక మొగలియాకును ముద్దుబెట్టుకొని కన్నులకద్దుకొని చేతులుమోడ్చిమ్రొక్కి చెలింగనుంగొని యిట్లనియె. ప్రియసఖీ! ఇందలి సువర్ణములు సువర్ణములు కుప్పవోసినట్లున్నవి చూచితే! ఈలేఖ పలువురిచేతులం దిరిగివచ్చుటచేఁ గమలినదయ్యుఁ జలితిమబ్బులచాటుననుండు లేఁతచందురులాగున శోభ లీనుచున్నది సుమీ! అంతదూరమున నున్నను హృదయము నామీఁదనే నిలిపియున్న యా రాజకుమారున కేమి ప్రత్యుపకారముఁ గావింపనోపుదునే! ఈలేఖలో వాసుదేవునిమాటఁ దలపెట్టుటచే నీతఁడు ద్వారకానగరమం దున్నవాఁడని తోఁచెడును. అతనిం దోడితెచ్చుట కేరి నయిన నంపుమని మా యప్పతోఁ జెప్పవే; అని కేతకీదళము నుద్దేశించి "మోదళమా! ఎన్నినాళ్ళు నీనిమిత్తము నిద్రాహారములు లేక పలవరించితిని! ఎన్నిప్రయత్నములు చేయించితిని! నీ వచేతనపదార్థమవయ్యు నెంతకాలము నాకగపడకుండఁ దడవుచేసి నన్నలమటనొందించితివే! ఎంతజాగొనర్చినఁ బ్రాణేశ్వరుని కుశలవార్తఁ దెలిపితివి. కావున నీవు వందనీయురాలవే యగుదువు. ఇదె నాయంజలిం గైకొనుము. ఆసుకుమారుని హస్తపద్మమునందుండుటకు నీ వెంతపున్నెముఁ జేసితివోకదా! యని పరిపరివిధములఁ గాముకజనసామాన్య మగు చిత్రసంభాషణము సలుపుచుండెను. ఇంతలో భోజనమునకు రమ్మని పరిచారికలరుదెంచుటయుఁ దత్ప్రసంగముమాని యాలేఖను భద్రముగా దాఁచు

మఱి రాగలతికకు నొక్కిచెప్పి యిచ్చి లోనికి వికసించిన ముఖారవిందముతో చులుకనైన హృదయముతో, నానందము దెలుపు చూపులతోఁ, గొంతకాలమునుండి యెన్నఁడులేని యొయ్యారముతోఁ బానసంబున కరుగుచుండ సేవకులెల్ల నామె కొంటివగపు విడుచుటకు నెద్దియేని కారణముండవలయునని యూహించిరి. భోజనముసేయుచు యోగిని తనకుఁజేసిన మహోపకారమును దనపై నామెకుఁ గలనిర్హేతుకజాయమానకృపయుం దలంచి మనమున నామె కనేకవందనములఁ జేయసాగెను. భోజనానంతరమున రాగలతికయొద్దకువచ్చి మఱునాఁడుదయమున యోగినికిఁ దర్శనము సమర్పింపుమని యానతిచ్చి యాదినమున వీణాగానముతోడను బుస్తకము వ్రాయుటతోడను నాట్యముతోడను గని విలాసముగాఁ బుచ్చెను.

మఱునాఁడుదయమున రాగలతిక యోగినిఁదర్శించుటకుఁ బోవ సమకట్టి తలవాకిటకు వచ్చునప్పటికిఁ బురిజనులుకొందఱు బాటంబోవుచు యోగిని నిన్నరాత్రియే శ్రీపార్వతీదేవి నారాధింపఁ గైలాసమున కరిగినదఁట ; ఆహాహా ! ఆమె మహిమము నెన్న నెవ్వరితరమగు " నని తమలోఁ జెప్పుకొనుచుండవిని చెలి కావార్తఁ దెలిపి పయనము మానుకొనెను. రణాగ్రపుఁడుఁగూడ నావృత్తాంతమునువిని తనతో నామె మున్ను వాక్రుచ్చినట్లు చేసియుండుననని యోగినిరాక నిరీక్షించుచు దినములు గడపసాగెను.

మొదటిభాగము సమాప్తము.



# సౌందర్యతిలక.

## ద్వితీయభాగము.

### మొదటి ప్రకరణము.

పాండవులపాలికిఁ దనసందేశముఁ గైకొని చనిన కళానందుఁ డెన్నినాళ్ళకును ద్వారకానగరమునకు మరలిరామి వాసుదేవుఁడు తద్దయుఁ జింతించి యాతని నమ్మకమును గూర్చి యించుక సంశయమంది మరల నతఁడట్టివాఁడుగాఁడని నిశ్చయించి యుధిష్ఠిరుఁడు వానినంపక జాగొనరించెనో మార్గమధ్యమున నాతఁడు దైవవశమున శిశుపాలాదులగు జరాసంధ పక్షపాతులచేతం జిక్కెనో యని తనవేగులవాండ్ర నలుగెలంకులకంపి యరయుచుండెను. ఎంతయారసిన నాతనిజాడ రవంతయేనిఁ జిక్కకునికి విసిగి విసిగి యసురాంతకుఁ డొక్కనాఁడు తనకనుకూలవర్తనుఁడగు నక్రూరునిఁ జేరఁబిల్చి కూరుచుండ నియమించి యిట్లనియె. "అక్రూరా! ఎఱుఁగుదువుగదా నాఁడిక్కడకు వచ్చిన కళానందుని! కార్యాంతరముమీఁద నాతనిఁ బాండునందనులపాలి కనిపినాఁడను. ఎన్నినాళ్ళకు నారాజకుమారుఁడు రాఁడయ్యె, నీవొక్కసారి యింద్రప్రస్థమునకుం జని జాగునకుఁ గారణము దెలిసికొని పాకముదప్పినఁ గార్యము సెడునని యుధిష్ఠిరునితో దృఢముగాఁ బలికి కళానందుని వెంటఁ బెట్టుకొనిరమ్ము. జరాసంధసంహారముగాక రాజసూయము నెరవేఱుట యసాధ్యమని యారాజుతో నాపలుకులుగా విన్నవించి కార్యసాధనము గావించుకొని సత్వరము రావలయుఁజుమీ. అప్పుడు

నక్రూరుఁడు నల్లెయని యెద్దియో పలుకఁజూచునప్పటికిఁ బ్రతీహారివచ్చి జోహారొనర్చి దేవా! నలుగురు శిష్యులతో నెన్నఁడును మనము కనివినియెఱుఁగని యొకముదుసలి జడదారి కరభుండనువాఁడు దేవరతోఁ గొన్ని యంశములు ముచ్చటింపఁ గోరుచున్నాఁడు. ముదలయయ్యేనేని తోడుకొనివత్తునని మనవిసలుపుటయు సందనందనుఁడు త్వరితముగ వారిందోడి తెమ్మని యానతిచ్చి యుచితాసనములు వేయఁబనిచి ముని రాక కెదురుచూచుచు నిలువంబడియెను. మూర్తిఁ గైకొన్న నాలుగు వేదములవడువునఁ గంఠములెత్తి స్వస్తిపనసలు చదువుచు నలువురు శిష్యులు వెంటరా వేదపురుషునట్లు కరభుఁడు బహుద్వారములుదాఁటి మాధవుకడ కరుదెంచుచుండ నల్లంతదూరమునఁ గాంచి యాదవుఁడు మానిబ్రహ్మతేజమునకును శాంతమునకు నచ్చెరువడి భక్తి యినుమ డింపఁ గేలుమొగిచి యెదురువచ్చి చరణారవిందముల కెఱఁగి పీఠమునఁ గూర్చుండఁబెట్టి యర్ఘ్యపాద్యములసమర్పించి సుఖోపవిష్టుండైన యాత నితో నిట్లనియె. దేవా! మీరుద్వారకానగరమును మాగృహమును బావనము సేయఁదలఁచి యరుదెంచిన మహేశ్వరులనిఁ తోఁచుచున్నది. సాటిలేని మహిమగలవారనియుఁ గోపమెఱుఁగని సుశీలురనియు బాల్య మునుండి వీనులవిందుగా విందుఁగాని కన్నారఁగన్న భాగ్యములేదు. నేఁటికిఁగదా మాకన్నులకఱవు దీఱినది. ఇప్పుడుగదా మానోఁచిననో ములు పండినవి, మాచేత నేకార్యముచేయించి తక్కిన రాజలోకము లో నన్నెక్కువగా గౌరవింపఁదలఁచివచ్చిరో యాపని యానతిచ్చినన్ను ధన్యునిఁ జేయవేడెద.

అనవుడు కరభుండు వాసుదేవుని నెమ్మొగముఁజూచి మెల్లమెల్ల నిట్లనియె. దేవా! జగమునఁ గల వంగసములలోనెల్ల రాచకొలము పాపభూయిష్టమైనది. ప్రజాపరిపాలన మొనర్తుమను వంకబెట్టుకొని పడు తులఁ జెఱఁబట్టుటయు జనులంబీడించుటయు మునుల ధిక్కరించుటయుఁ

గాని వేఱొకటికానరాదు. క్షత్రియాన్వయములపై నాకింతకినుక పొడము
టకుఁగల కారణమేమనినఁ జెప్పెద నాలకింపుము. జ్వాలాజిహ్వుఁడను
మ్రుక్కడిరక్కసునిచేతఁ జిక్కి సురుక్కుచు నిందుమతియను కోశరాచ
పట్టి యదృష్టవశమున నందుండి తప్పించుకొనివచ్చి నాయాశ్రమముం బ్ర
వేశించి నాశరణముఁ జేరి సుఖంబుననుండె. అంతఁ గొన్నినాళ్ళకు వేట
తమకంబున శిశుపాలుఁడు మదీయాశ్రమము నేనింటలేనితఱిఁ బ్రవేశిం
చి యిచ్చవచ్చినట్లు పరివారసమేతుఁడై మెలఁగి కట్టడితనమున నెట్టకేల
కు నిందుమతిం బట్టి బలిమిచేఁ దనపురంబునకుం గొనిపోయెను. కట
కటా! తనకభయప్రదానముగ నుందునని నానెలవుఁజేరిన యాయిందు
మతిని నేను సంరక్షింపలేనయితిని. ఆయింతి యెంతపొగులుచున్నదో!
నారాయణా! నాటఁగోలె నామెనిమిత్తము నాచిత్తమెందు నుత్తలపా
టు చెప్పతరముకాదు. నాకలుక సంపూర్ణముగఁ బొడమిన బ్రహ్మాండ
ములను గడగడవడంకఁజేసి శిశుపాలుని నిర్మూలింపలేనె! ఆదురాత్ముని
సాహసముఁ జిత్తగింపుము. నాయాశ్రమమున నున్నదనియైన నాపఁశతి
ని విడువక యెత్తుకొనిపోయెను. తెలియనివానిపై నలుకఁజూపరాదని
నేను ధర్మమార్గోచితముగ నాతనికి నాశిష్యులవలన సందేశమంపి కన్యను
నాయొద్దకుఁ బుత్తెంచుమని వేఁడుకొంటిని. దానికి బ్రత్యుత్తరముగ నాపా
పాత్ముఁడంపిన సందేశమునాలకింపుము. "యువయువతీజనముల పరస్పరా
నురాగములును, జిగురుబోండ్ల వాలుచూపులవాడిమియు, మోడుచెట్లవ
లె నామరణబ్రహ్మచారులగు నిరాబారు లెట్లెఱుఁగుదురు. మీకుఁ దెలి
యని యంశములతో సంబంధము గలుగఁజేసికొని యున్నగౌరవ మేల
చెడఁగొట్టుకొందురు? అదియటుండ నాపడఁతుక యవివాహితకావున
నొకరిసొత్తుకాదు. దీని నపహరించిన దోషంబులేదు. ప్రజల యర్థము
ప్రాణము, శరీము సర్వమును రాజుదేయని ధర్మశాస్త్ర ముద్ఘోషించు
చున్నది. ఈనుడిత నాదేశమున నుండుటచే నాయిచ్చవచ్చినట్లు చేయు

ట ధర్మేతరముకాదు. పరిపక్వమైన ఫలంబు చెట్టుపైనఁగానఁబడిన రాచిలుక దానిపైనుఱికి పంటనొక్కి రసమాని యనుభవింపక విడుచునే! కన్యాత్వము బాయనిదియగుబాల కనఁబడుట రాజట్లుచేసిన నేమి యనుచితము! ఈధర్మములు మీకుఁదెలియవుగాన కొన్నినాళ్ళు శుశ్రూషజేసి నేరిచికొనుండు" అని. మాధవా! సందేశమిది." అని కోపావేశమున నించుక యూరకుండెను.

వాసుదేవుఁడును జరగినచిత్రకథకును శిశుపాలుని సాహసమునకు నచ్చెరువడి యదియు నించుకమంచిదేయని మనమునహర్షించి చైద్యునకంత్యకాల మాసన్నమగుట నిశ్చయించెను. ఇంతలో సంధ్యాకాలము సమీపించుటఁజేసి మౌనియు శిష్యులును నారాయణుఁడును నియమితార్ఘ్యప్రదానము నొసఁగఁజనిరి. అనుష్ఠానములు ముగిసిన వెనుక యతి నతిసీతిమై లోనికింగొంపోయి వాసుదేవుఁడు కందమూలములు ఫలములు నావుపాలుఁ పిండివంటలతో విందారగింపఁజేసి సంతుష్టహృదయునింజేసి కృతార్థుఁడనైతినని పలుమ ఱుగ్గడించెను. తరువాత వెనుకటి కథాసందర్భమందుకొనుటకు మౌని యత్నించుచుండ - నింతలోఁ బ్రతీహారియరుదెంచి చేతులుజోడించి, దేవా! దివ్యపురుషుని యటుల నున్నాఁడు. ఊరుపేరుజెప్పుమన్నఁ జెప్పఁడఁట. ఒకనిమేషమయిన జాగుసేయక మీతోమాటలాడవలయునఁట. సెలవేమి యని యెదుటనిలువంబడియెను. అంతటిత్వరితమున వచ్చినవాఁడు రాజకార్యముమీఁదఁ గాని రాడని లోనికి వేగముగరమ్మని యానతిచ్చెను. ప్రతీహారియు నావలకుఁజని యాపురుషుని మాధవునిపాలికంపెను. మునియును, శిష్యులు ముకుందుఁడును దివ్యసుందరవిగ్రహమువాని, నతిచాకచక్యముగలవాని మీసకట్టుబొత్తుగా రానివాని నిరువదియేండ్ల వయసుఁగలవాని నారాచకొమరుకుంగాంచి యితఁ డెందుండివచ్చెనో యని ధ్యానించుచుండిరి, అతఁడు సమీపించుటయు వాసుదేవుఁడు చేసన్నచే

నొకపీఠమునఁ గూరుచుండుమని చెప్పెను. ఆవచ్చినపురుషుఁడు వాసుదే
వుని సన్నిధింగని యాతనికింజోహారొనర్చి యెదుటనిలచి యిట్లనియెను.
నాకుఁగల కార్యమువేగిరము నన్ను గూరుచుండనీయదు. నందనందనా
నీమాటకడ్డుపలికితినని కోపింపక యొక్కసారి యొకగదిలోనికి వచ్చితివేని
నాకులగోత్రములు నాపేరు నాయున్న యునికియు నావచ్చినపని నీకువి
న్నవించెదను. అనవుడు నందకుమారుఁడు మునిపురందరు ననుజ్ఞవడసి
యాపురుషుని లోనికిఁదీసికొనిపోయి రెండుగడియలసేపు ముచ్చటించిరి.
వారిసంభాషణ మెట్టిదో యెవ్వరు నెఱిఁగినవారులేరు. మునికిఁగాని శి
ష్యులకుఁగాని వచ్చినపురుషుని పేరైనఁ దెలియరాకుండ పురుషోత్తముఁ
డాతనితో వలయునంశములన్నియుఁ బ్రశంసించి యెట్టకేలకు వానితో
గదినుండి బైటకువచ్చి వాని నామునిసన్నిధానమునఁ గొండొక సేపుం
డుమని కూరుచుండఁబెట్టి యేకారణముననో ముని యచ్చటికి వచ్చిన
పని యంతయు నాతనికిం దెలియఁజేసెను. తనపని కొఱ్ఱత్త వానికి నంద
నందనుండు తెలియఁబలుకుటచే నాతఁడెవ్వఁడో యెఱుఁగఁగోరి కరభుం
డు శాంతవచనములతో నిట్లనియెను. మాధవా! ఈపురుషుండెవ్వఁడు?
ఈతఁడు మనకార్యమునకుఁ దోడగునే? అనిన వాసుదేవుఁడు పురుషుని
వంకజూచెను. చూచుటయు నాపురుషుండు చిరునగవు మొగమున నం
కురింప మునీంద్రా! నేను గిరివ్రజపురమునుండి వచ్చితి. నాపేరు జా
తవేదుఁడు. నేనొకరికి మిత్రుఁడగా నొకరికి శత్రుఁడనుగాను. మీసం
కల్పము జనార్దనుఁడు నాకెఱుఁగఁజేసినాడు. నాయొనర్పఁగలసాయము
న్న నేనొనర్చెద. కాని నాకొక్కమాటఁ దెలుపవలయు. నాపోవుకార్య
మున నాకు జయముసిద్ధించునట్లు మీరాశీర్వచనమొనరించితిమనుటయే
నని పలికెను. కరభుఁడు వానిమాటలకలరి "యీప్సితార్థసిద్ధిరస్తు" నిదీ
వించి యటనుండి పోవనమకట్టి వాసుదేవునితో నిట్లనియె. "నేనింక నా
యాశ్రమముంగూర్చిపోవలయును. నీవు నిష్పక్షపాతమతివి చుట్టమువ

డనేరమున్న నూరకుండవు. సామోపాయయుక్తినో దండోపాయశక్తినో మాయచేతనో శిశుపాలుని శిక్షించి యిందుమతిని నాకర్పింపవలయును. అనంతరము నీయిచ్ఛవచ్చిన వానికా మచ్చెకంటినిచ్చి పెండ్లిసేయుము. సంసారసంబంధములు తెగ్గింపుకొన్న మాకును దైవవశమున ననురాగగుణములు సంభవించినవి. చేదినగరవృత్తాంతములు నీవేమైన నెఱుఁగఁ గోరితివేని యిదె నాశిష్యుఁడు చారాయణుఁ డక్కడనుండి వచ్చినవాఁడు. వానినడుగవచ్చునని పలుకుటయు వాసుదేవుఁడు చారాయణునిఁజూచి యిప్పుడు శిశుపాలుండెందులకైనఁ బయనమైయున్నవాఁడా? ఆతనినగరమున నూతనపురుషుఁడెవ్వఁడైన బంధీకృతుఁడై యున్నవాఁడా? ఇప్పటికిందుమతి నింకను బెండ్లిచేసికొనలేదుగదా! యని యడిగెను. ఆచారాయణుఁడును నారాయణునువంక వడంకుచుఁ జూచి "దేవా నేను చేదిపురినుండి బయలుదేఱునప్పటికి శిశుపాలుఁడు మగధరాజసందర్శనార్థమై యరుగఁదలఁచి పయనమునకు జతనము సేయించుచున్నాఁడు. ఇఁక నాలుగైదుదినములలోఁ బోవచ్చును. మఱియుఁ గొత్తపురుషుఁడొక్కఁడు వానిపేరెవ్వరో నేనెఱుఁగనుగాని యతిసుందరుఁడు మార్గవశమున నొంటరిగఁబడి యుండఁ జాడలచేఁబట్టువడి చెఱలోనున్నవాఁడు. ఏకారణముచేతనో యింతవఱకు నిందుమతిని రాజు పాణిగ్రహణము చేసికొనలేదు. నేనింతకన్న నేమియు నెఱుఁగనుజుఁడీ" యని విన్నవించెను.

అనంతరము కరభముని తన్నడిగినమాటలకుఁ దానొనర్పవలసిన సాయమునకుఁ దగునట్లు గోవిందుఁడు వానికి వీనులవిందుగా నిట్లనియె. మునివర్యా! శిశుపాలుండు జన్మప్రభృతిఁ గడుదుర్వర్తనుండై యున్నవాఁడు. కాలాగ్ని తుల్యుఁడగుజరాసంధున కితఁడు దండనాథుఁడై యాతని యండనుండి నన్ను సరకుగొనక నాతోడిచుట్టఱికము మానుకొని యున్నవాఁడు. ఆదురాత్ములిరువురు జగత్కంటకులై యున్నవారు. అందు శిశుపాలుని ముందుగా శిక్షింపవలనుపడదు. జరాసంధుని గడతేర్చిన

యనంతరమునఁ గోలలాడినపామును మోదినట్లు చులుకనగా శిశుపాలు నేలపాలుజేతు. వాఁడు నాచేతఁగాని చావఁడని మున్ను వాఁడుపుట్టినయప్పు డశరీరవాణి పలికినది. నాబుద్ధిబలమునకుఁ బాండవేయుల బాహుబలము నకు మీయాశీర్వచన బలంబుతోడుపడునేని యాజగత్కంటకుల పీడ తొలంగి యనతికాలమున వసుమతిసుఖింపఁగలదు. తమరాశ్రమమునకుఁ బోవఁ ద్వరపడుచున్నారు. కావున నేను తమసెలవునకాటంకము చెప్ప వాఁడనుగాను. అన్నిటికన్న మున్న మీయిందుమతి మీయాశ్రమమున కనతికాలమున వచ్చును. దీనికి సందియము లేదు. మీరలింక నరుగవచ్చును. అని దండప్రణామముచేసి దీవెనలువడసి పయనమైన మునిని గొంతదవ్వు సాగనంపి మరలవచ్చి జాతవేదునితోఁ గొన్నిరహస్యములను ముచ్చటింపఁదొడఁగెను.

జాతవేదుఁడును శ్రీకృష్ణుఁడును గొంతసేపు మాగధుని చర్యఁ జెప్పుకొని సంతసించి శిశుపాలుని జరాసంధునితోఁ గలియకుండఁ జేయవలయునని తలపోసి యుపాయము వెదకుచుండిరి. అంతలో వాసుదేవుని మనమున కేదియో తోఁచుటం జేసి యాతఁడు జాతవేదుని చెవిలో నొక రహస్య ముపదేశించి తన వేగులవాఁడయిన కుశీలవుని వానికి సాయముగ నుండుమని చెప్పి ప్రొద్దుగుటచే నిద్రింప నరుగఁదలఁచుచుండ నంతలోఁ బ్రతీహారి మరల కైవారముసలిపి “దేవా! పాండవులపాలినుండి సూతకుమారుఁడు ప్రాతిగామి వచ్చి దేవరచరణారవిందముల సందర్శింప నున్నాఁ”డని విన్నవించె. వాసుదేవుఁ డామాటలువిని చిరునగవునగి “యేమి! యీదినమున రాజకార్యము లనేకములు వితర్కింపవలసివచ్చె. ఇది కడుసుదినముగద!” యని వాని సత్వరము రానిమ్మని ప్రతీహారి కానతిచ్చె. అంతటఁ గొన్నినిమిషములలో సూతులకుచితమగు వేషముతోఁ దన పొడుగువిగ్రహమునీడయే దనరాకఁ దెలియఁజేయ బ్రాతిగామి మందిరముఁ జొచ్చి దేవకీతనయుని చరణసరసీరుహములకుఁ బ్రణమిల్లి చే

తులు మొగిడ్చి నిలిచెను. చిరునగవుతో నాతనిదీవించి వాసుదేవుఁడు పాం
డవుల యందఱికుశలము వేఱువేఱుగనడిగి యాతనిఁ గూరుచుండఁబనిచి
సందేశమెఱిఁగింపుమన వాఁడిట్లనివిన్నవింపఁదొడఁగెను “ స్వామీ ! నాఁ
డర్జునుఁడు దేవరసాన్నిధ్యమునుండి యిందప్రస్థమున కరుదెంచి తమరు
పంపుదుమని సెలవిచ్చిన వర్తమానమున కెదురుచూచుచుండెను. ఏ
నాఁటికిని మీయొద్దనుండి యేమాటయుం దెలియకునికి యుధిష్ఠిరార్జును
లు మనమున నెంతయుఁ జింతిలుచున్నవారు. నారాయణా ! యర్జునున
కును నీకును మేనులు రెండుగాని యాత్మయొక్కటి యగుటచే నీయొద్ద
నుండి రాఁదగినవర్తమానము రానందుల కాతఁడొందుపరితాప మింత
యనిచెప్పరాదు. రాజసూయమహాధ్వరముం గూర్చి యుధిష్ఠిరుఁడు
మీనిశ్చితాభిప్రాయ మెఱిఁగిరమ్మని నన్ను బుత్తెంచె” అనవుడు యాదవ
కుంజరుఁడు ముక్కునవేలుపెట్టుకొని యక్కజపడి “ కళానందుఁ డక్క
డికిఁ జేరనేలేదా ! హా ! యేమివిధికృతము ! అట్లయినఁ జారాయణుఁడు చే
దిపురమునఁ జూచినవాఁ డాతండై యుండునా?” యని వగచి ప్రాతిగామిఁ
గనుంగొని యధ్వరముంగూర్చియుఁ దక్కిన రాజకార్యములఁగూర్చియు
నేనే కొన్నినాళ్ళలో వచ్చి ముచ్చటింతునని యుధిష్ఠిరార్జునులతో ను
డువవలయు. నీవుదయమున నిందప్రస్థపురమునకు మరల నరుగవచ్చు
నని సెలవిచ్చి జాతవేదునకుఁ గొన్నిసంగతు లుపదేశించి యారాత్రి యి
రువురును నిద్రించిరి. మఱునాఁడు జాతవేదుఁడు లేచి తనదారినిఁబయ
నమై మెందులకో యరిగెను.



## రెండవప్రకరణము.



కరంభాశ్రమమునుండి యిందుమతి శిశుపాలునివలన బలిమిచే నిజ పురమునకుం గొనిపోవంబడినది మొదలు బెంగఁగొని యాయంగన యున్మాదినియుంబోలె వ్యవహరింపఁ జొచ్చెను. నాలుగైదుదినము లాగతి మతిచెడియుండి యనంతర మలవాటుపడి తనపై నాపడఁతి వలపు తప్పక నిలుపునను నమ్మకముతోఁ జేదినాథుడు దానియాక్రందనధ్వనులను రోదనమును సరకుఁ గొనఁడయ్యెను. కాని యెన్నినాళ్ళకు నాయింతి యొక్కమచ్చుననే చచ్చినదియుంబోలె నెవరుపలుకరించినం బలుకక, యేమియిచ్చిన మెచ్చక విరియఁబోసికొనిన కచభారముతో, డస్సిన మేనితో శిశుపాలుని కులనిర్మూలముఁ గావించు మహారాక్షసియో యన భయంకరాకారమైయుండె. పురజనులందఱుఁ జేదిరాజు వంశమునకుఁ గీడుమూడుకాలము సమీపించుటచేతనే శిశుపాలున కట్టివిపరీతబుద్ధు లుత్పన్నములైనవని చెప్పుకొని భయపడసాగిరి. పౌరులమాటలొకలె క్కలోనికింగొనక తనకు హితము నాలోచించిచెప్పు నాప్తమంత్రుల యుపదేశము చెవినిడక శిశుపాలుఁ డాయిందుమతిపై దండముఁదలిపి యామెకిష్టమున్నను లేకున్నను నెట్టులయినఁ బెండ్లియాడ నిశ్చయించు కొని తనభోగకామినులఁ గొందఱ నామెకడ నియోగించి తనపై ననురాగ ముదయించునట్లు చేయుమనెను. తనశక్తికొలందిని వారును మాటిమాటికి నిందుమతికి ధైర్యముదెలిపి శిశుపాలు గుణములు స్తవముజేయుచుఁ బ్రయత్నము సేయఁదొడఁగిరి.

కళానందుఁడు చేదినగరమున శిశుపాలునిచేత నొకవిధముగాఁ జెఱనుంచఁబడియుఁ దనమాటల చమత్కృతిచేతను, బాండిత్యప్రకర్షచేతను రాజుమనమున కానందము గలిగించుచు, బాధింపఁబడిన వానియట్లుకాక స్వేచ్ఛగా నున్నవానిచందమున మెలఁగుచుఁ దనకులగోత్రములు

నామధేయముమాత్రము జెప్పక యప్పటికప్పు డెద్దియో వంకజెప్పుచు సౌందర్యతిలకపై హృదయమును నిలిపి వాసుదేవ పాదరాజీవములపై మనస్సునుంచి యాతనికృపచే నీవిచారసముద్రము దాటవచ్చునను నాసతో మేనునిలిపి కాలము బుచ్చుచుండెను. కళానందుని చక్కదనమునకును, తెలివికిని, శిల్పములయందుఁగల విజ్ఞానమునకును శిశుపాలుండు మెచ్చి యచ్చెరువడి యతనిం దనదేశమున నుంచుకొని యెద్దియో యున్నత మగునుద్యోగము నొసఁగవలయునని పలుమాఱు తలఁచుచుండెను. ఇందుమతిని మహారాజు చేదిపురమునకుఁ దోడుకొని వచ్చుటయు, నామె నిరంతరసంతాపమున గ్రుక్కుటయు, నామె ననునయింప భోగకామినుల దాసీజనుల నాతఁడు నియోగించుటయుఁ, గర్భశిష్యుఁడగు చారాయణుఁడు సందేశముఁ దెచ్చుటయు, మునివాక్యముల రాజు నిరాకరించుటయు విని కళానందుఁడు దిక్కులేని యానెలంతుక పూర్వవృత్తాంత మెఱుంగఁగోరి సమయమున కెదురుచూచుచుండెను. అట్లుండ నొకనాఁడు శిశుపాలుండు వేటతమకమున నెందేనియరుగుటయుఁ గళానందుఁ డిందుమతీసమీపమున నెల్లప్పుడుండు నొక్కదాసిం బిలిచి చమత్కారవచనముల దాని నవ్వించి దానిచిత్తవృత్తి యెఱిఁగి మెలఁకువతోఁ బుజ్జగించి తనమాట లెవ్వరితోఁ జెప్పకుండునట్లు దానిచే నొట్టుపెట్టుంచుకొని యిట్లనియెను. "ఓసీ! ఇందుమతి జన్మాదికవృత్తాంత మడిగి తెలిసి నాకెఱిఁగింపవలయును. నాకీపనిఁ జేసితివేని నీఋణముఁ దీర్చుకొందును. ఇక్కడివారందఱిలో నీవు గడుయోగ్యురాలవుగఁ గనఁబడుచున్నావు. ఎవ్వరులేనిసమయమున నామె నడిగి యట్టిసమయమున నే నాకుఁ దెలుపఁదగుఁజుమీ!" యని పలికెను. అదియు నాపలుకుల కలరి యిట్లనియె. దేవా! యీమాత్రపుఁబని నేనొనర్పలేనే, యింతియగా దీయిందుమతిచెఱ విడిపించు ప్రయత్నమేదైన మీకొనరింతురేని నాచేతనైన సాయమును నేను జరపుదును. ఇది మాయంతిపురి!

వచ్చిననాఁటఁగోలె నామనస్సు విచారాగ్నిచే సంతప్త మగుచున్నది. నా కీశిశుపాలుని కొలువునుండ నిచ్చలేదు. నిరంతరము మద్యపానాసక్తుఁడై సుందరియగు పరాంగన తన కంటఁబడువేగమే దానిం దనకుఁ గూర్పుమని మమ్ము శ్రమపెట్టుచుండును. వీనిపెట్టు నిక్కట్టులు పడఁజాలక యేదేశాంతరమైనఁ బోవఁజూచుచున్నాను. తమ రీచెఱనుండి విముక్తులగుతోడనే నన్ను మీయొద్దనుంచుకొనవలయునని వేఁడుకొనుచున్నాను. అదిగో నావల నెవ్వరో వచ్చుచున్నారు. మీచెప్పినపని యం దప్రమత్తచిత్తముతో వర్తిల్లెద.” అని సాగిపోయెను. తాను శత్రుమండల మధ్యమునసుండుటచేఁ దనహృదయ మొకింత వెలికిఁబోక్కనఁ దనకుం దానురక్షింపఁదలఁచినవారికిం గూడ చేటువాటిల్లునని మెలఁకువతో వర్తింపఁ బ్రయత్నించి కళానందుఁడు కృషిచేయసాగెను. తరువాత మూఁడునాళ్ళుగడచుటయు నానాఁటిసాయంకాలమున దాసి మెల్లమెల్లనవచ్చి కనుచీఁకటి నొకమల్లెపందిరియొద్ద నెద్దియో చింతించుచుఁ గూరుచున్న కళానందునిఁగాంచి చెవిలో నిట్లనియె. “ అయ్యా! యీదినమున నంతఃపురకాంతలు మద్యపానముజేసి విలాసముతో నాట్యమాడుదురు. నాకాయుత్సవమున కరుగనిచ్చలేదు. నీవు రెండుజాముల రాత్రి యగునప్పటి కిందుమతియున్న గదిలోనికివత్తువేని యామెచారిత్రము నీవువినునట్లు పలికించెద. నీగుణములు నీచక్కఁదనము నీకామెపైఁ గలిగిన నిర్హేతుకకృపయు నేనామెకు విన్నవింప నెంతయునామె సంతసించి నిన్నుజూడఁగోరెను. వత్తువే ” యనవుడు నాతఁడు వల్లెయని చెప్పినకాలమునకు సిద్ధముగనుండెను. దాసివచ్చి యాసమయమున కాతని నాగదిలోనికిఁ దీసికొనిపోయి యామెయెదుట నొకపీఠముపైఁ గూరుచుండఁ బెట్టెను. వెంటనే యిందుమతి సిగ్గునలేచి తలుపుచాటునకుం జని మున్ను తన్నలమియున్న నెవ్వగయంతయు నెందోయరుగ దాసింబిలిచి యేమియో గుసగుసలాడెను. కళానందుఁడు దాసికిం గనుసన్న యొసఁ

గుటయు నది యిందుమతికి సంజ్ఞచేయ నామె తనచారిత్రమునంతయు మున్ను శ్రావణునకుఁ జెప్పినచందమున విన్నవించి శ్రావణుఁడు దన్ను రాక్షసమధ్యమునుండి బ్రదికించి తననిమిత్తము మేనుదొఱఁగెనని చెప్పెను. తోడనే కళానందుఁడు వేఁడికన్నీరు కొలకులవెడలి చెక్కులదిగజాఱ "హా! శ్రావణా! కడతేఱితే" యని మూర్ఛిల్లెను. ఇందుమతియు దాసియు నిదియేమని యక్కజపడి శైత్యోపచారముల నాతనికిఁ దెలివిఁ గలుగఁజేసిరి. "హా శ్రావణా! సేవకుఁడవను పేరేకాని తండ్రిలాగున నను బెంచితివి. పెద్దకాలములో సుఖముగా నింటఁ గాలము బుచ్చవలసిన నిన్ను నిర్దయాత్ముఁడనై కాఱడవులందును మహాశైలములమీఁదను దిప్పి నీకు మరణము గలిగించితిని. హా కళానందుఁడా! మోహసముద్రమునఁదగిలి నమ్మినసేవకుని ప్రాణములు పుచ్చుకొంటినే! అయ్యో! శ్రావణా! మరణసమయమున నేమనుకొంటివో! ఎంతనీప్రాణము నొచ్చెనో! కఠినాత్ముఁడైన కళానందుఁడు నను విడిచినాఁడని తలంచితలంచి పొక్కితివి కాఁబోలును. నామీఁదఁ బ్రేమచేత నను వెంబడించితివి. మార్గమున నొక్కనాఁడైన విడకుండఁ గాపాడిన నిన్నెట్లు మఱతునని వాపోవఁజొచ్చెను. విలాపముంబట్టి శ్రావణుఁడు కళానందుని సేవకుఁడని యిందుమతియు దాసియు నెఱిఁగి వాని నూరార్చిరి. తనకథయంతయు ముగిసిన వెనుక నిందుమతి కంట నీరుబెట్టుకొనుచు రాజనందనునితో నిట్లనియె. "రాజకుమారా! మాతృగర్భమునుండి ధాత్రిపైఁబడిన దాదిగా నింతింతయనరాని యాపదలపాలైతిని. పుణ్యశీలుఁడగు శ్రావణుఁడు రాక్షసుల బారినుండి రక్షించినాఁడని సంతసించుచు నేనుండ నింతలో నంతకన్న నెక్కుడుచేటు నాకు సంప్రాప్తమైనది. ఏనాఁటికిని నాదుఃఖముల కంతములేదు. పాపపుదైవము నాకాయువుపోసి చిరకాలజీవినిగా జేసెను. నాకంత్యకాలము రారాదా! అయ్యో! నాయందు దయయుంచి నాదురవస్థ మాన్పుట కెద్దియేని సాయముచేయ

వేఁడెదనని రోదనముజేయసాగెను. కళానందుఁడు దీనసంరక్షణమునం దాసక్తిగలవాఁడగుట నామె కభయహస్తమిచ్చి గిరివ్రజవాసిని గావున నభిమానము హెచ్చి యెట్లైన నామెకు సాయమొనర్ప నిశ్చయించుకొని యాఁగదివిడిచి తనతావున కరిగి నిద్రించెను. ఇందుమతియు ధైర్యముఁదెచ్చుకొని దాసిమాటయుఁ దనమాటయు నొక్కటిగ నడవందలంచి యారాత్రినిద్రించెను. ఇట్లు లోకకొన్నినాళ్లుచనెను. మఱునాఁడు శిశుపాలుఁడు వేఁటనుండి వచ్చెను.

అట్లుండఁ గొంచొకనాఁడు గిరివ్రజమునుండి జరాసంధుని వేగులవాండ్రలో నొకఁడగు తురంగకుఁడు తనస్వామియానతి నెద్దియో పనిగలిగి బహుదేశములు సంచరింపుచుఁ జేదినగరము బ్రవేశించి మహారాజు శిశుపాలునిదర్శనముజేసి యతని యిచ్చచొప్పునఁ గొన్నినాళ్లందుండి యొక్కనాఁడు కళానందుని చూచి యక్కజమొంది "హృదయమా! ఇంక కుమరుపకుము. స్వామి మనోరథమును నాపుణ్యమును బండినవి" యని తనలో సంతసించి జాగుసేయరాదని శేనియొద్దకుం జనియె. చని యాతని నొక్కచాటుచోటునకుంబిలిచి చెవిలో రహస్యముగ "మహాప్రభూ! యీకళానందుఁడు పరమదుర్మార్గుఁడు. మగధరాజ్యలక్ష్మి కపాయము నాపాదింపఁ బ్రయత్నించి దేశమునుండి పాఱివచ్చినాఁడు. జరాసంధుఁ డీతనిఁబట్టి తెచ్చినవారికిఁ బారితోషికము నిత్తునని వేగులవాండ్ర నెల్ల నానాదేశములకుం బంపియున్నాఁడు. వీనిని స్వేచ్ఛగా విడుతువేని మనలను భంగపఱచి పారిపోవును. చిక్కకచిక్కక చేఁజిక్కిన యిక్కవటెని విడవిన మనపై జరాసంధునకుఁ దీనియలుక వొడమును. కావున విచ్చుకత్తులుగలభటులఁ జుట్టునిల్పి వీనిని కారాగృహమున బంధింపవలయును. ఈతఁడు దొరకినాఁడనువార్త మగధరాజునకుఁ దక్షణము నేనఱిగి విన్నవించి బహుమానముల నందుకొందును. నాకు సెలవొసంగుఁ" డని కొండెములు చెప్పి ధనముదొరకునని యు రాజునకు దయగలుగునని

యు మహాసంతోషమున మగధకుం జనియెను. శిశుపాలుఁ డాపలుకులువిని కళానందునిపైఁగలయభిమానమెల్ల నశింప నతికఠినముగఁ గారాగృహమున నుంచి రేయింబవళ్ళు వానిపై నొక్కకన్నుఁబరపి జాగరూకతతో వర్తింపఁజొచ్చెను.

## మూఁడవ ప్రకరణము.

వాసుదేవుని వలనఁ దనకుసాయమంపఁబడిన కుశీలవుఁడును వేగులవాఁడును దనవెంటరా జాతవేదుఁడు కొన్ని దినములు పయనమొనర్చి యెట్టకేలకుఁ జేదినగరమును బ్రాపించెను. ప్రయాణముచేసినన్నినాళ్ళు గుశీలవుఁడు కడుమాటనేర్పుతో రుక్మిణిసాముభావమును సత్యభామ ప్రౌఢతనమును లక్షణ శృంగారలక్షణములును మిత్రవింద యందమును వారిసవతులకయ్యములను, వాసుదేవుని తగవులుదీర్చునేర్పరితనమును మొదలగు ద్వారకానగరవిశేషములు చెప్పి జాతవేదునకు మార్గాయాసము నివారణచేయుచుండెను. చేదిపురమునుబ్రవేశించుటకుమున్నారు బైట జాతవేదుఁడు మార్గమధ్యమునఁదాల్చుకొనినప్రాఁతవలువలు విడచి మంచిదువ్వలువలు దొడిగికొని చూపరు తనవేసమునుజూచి భళీ యనునట్లొప్పి కుశీలవుంజూచి యిట్లనియెను. ‘‘ఓయీ! నేను నీకొక్కపరమరహస్యము నెఱింగించెద నాలకింపుము. నీకాఁపురము ద్వారకాపురమని యెవ్వరికిని దెలియనీయకుము. శిశుపాలుఁడుఁ దన్నగరవాసులు నిన్నడుగుదురేని గిరివ్రజమునుండి వచ్చువాఁడనని నీవు వాక్రువ్వవలయును. నేనెడనెడఁ బ్రయోగించు టక్కరితనములకెల్ల నీవు తలయూఁచి యూరకుండవలయునే కాని యిదియేమని నన్నడుగరాదు. సరిగదా నానుడివిన తెఱఁగున నీవువర్తింతువేని జరిగెడు చిత్రములను జూడు మనుటయుఁ గుశీలవుడు పక్కుననవ్వి ‘‘దేవా! యెంతమాట! కార్యసాధకనిమిత్త

ము మీరు చేయు నింద్రజాలములకు నేను భంగము వాటిలఁజేయుదునే? నేనుమాత్రము వేగులవాఁడనుగానా ? తాతకు దగ్గులు నేర్పవలెనే" యని యతనితో బయలుదేఱి చేదిపురమున బ్రవేశించెను. నగరమునం దలి గుట్టుమట్టంతయుఁ దెలియకమున్న రాజమందిరముఁజొచ్చుట యు పాయకరమని చింతించి యొకపేదబాపనముసలిదానియింట బసయుండి జాతవేదుఁడు మెల్లమెల్ల నాయమ్మకుఁ గొంతవిత్త మొసఁగి కోటలోజ రగు వృత్తాంతములఁదెలిసికొనియెను. జాతవేదుఁ డావృద్ధయువతిని బ లుమారు గళానందుఁడను రాచకొడుకు కారాగృహావాసియై యున్న వాఁడాయని యడుగుచురా నామె యెఱుఁగననిచెప్పి యనంతరము గ్రా మమునఁ గనుంగొని కళానందుఁ డాతనిపేరగునో కాదో, కాని యొక ది వ్యమంగళవిగ్రహముఁగల సుందరపురుషుఁడు బంధీకృతుఁడై యున్నవాఁ డని తెలియఁజెప్పెను. ఆపలుకు లాలకించి యాపురుషుండు తప్పక కళా నందుండ కాదలంచి యాతంము తలపంకించి యానాఁటిరేయి శిశుపాలు ని యంతిపురమునకరిగి ద్వారపాలకు నొక్కనింజేరి జరాసంధమహారాజు నొద్దనుండి సందేశముగైకొని యొక మిత్రుఁడు వచ్చినాఁడని శిశుపాలు నకు వర్తమానమంపెను. శిశుపాలుఁడు తత్సమయమున నొకపూలసె జ్జపై మేనుజేర్చి యిందుమతిపై డెందముగూర్చి మరునికాఁకలపాలై బేలయై యంగలార్చుచు రెండుమూఁడుసారులు సేవకుఁడు క్రొత్తవారి రాక విన్నవించినఁ జెవినిడక యెట్టకేలకు వానిమాటవిని చివాలునఁ బాన్పునుండి లేచి " యెవరురా వచ్చినవారు ? లోనికిందోడుకొనిరమ్మ మ్మ" న్మని యానతిచ్చి తానొకపీఠముపైఁ గూరుచుండెను. ప్రతీహారియు ననంతరమున నామనుజద్వయంబును రాజసమ్ముఖమ్మునకుం దోడుకొని వచ్చి తానవలకుంబోవుటయు వారి వారి నర్హాసనములపైఁ గూరుచుండఁ బనిచి మీవృత్తాంతమంతయు నాకుఁదెలియఁబఱుపవలయునని యడిగెను. మార్గాయాసముచేఁ జెన్ను చెదరినవాఁడువోలె జాతవేదుఁ డున్నుసరస్సుర

నుచు నాలుగునిమిషము లలసటనభినయించి తేరికిట్టులనియెను. మహారాజా! మున్నెన్నఁడేలినవారి దర్శనము నొనర్చినవాఁడను గాకున్నను మీకాప్తుఁడగు మగధేశ్వరుని పాదములు గనిపెట్టుకొనియున్నవాఁడనగుట నేరించుక చనవుఁగైకొని మాటలాడి జరాసంధుని సందేశమెఱింగించెద. సావధానులై యాలకింపవలయు ననఁ జేదిరాజు బద్ధకమునెల్ల దూరమునకుఁ బాఱఁద్రోలి, యిందుమతిపైనున్న మతిని జేఁబిలచి ధైర్యము జిక్కఁబట్టి సావధానుఁడై యుండె.

అంతట జాతవేదుఁడు "దేవా! కొన్నికారణములనుబట్టి మగధమహీపాలకుఁడు ప్రస్తుతము వాసుదేవునిపై దండువిడియఁడు! మీరు గిరివ్రజపురమునకు దయచేయఁదలపోయుచున్నవారని యెట్లో మగధేశ్వరుఁడాకర్ణించి మిమ్మాప్రాంతములకింతలో రావలదని నొక్కి చెప్పుమనియెను. మీరిచ్చటనేయుండి వాసుదేవుని వ్యూహములు కుట్రలు వేగులనంపి యరసి తనకెప్పటికప్పుడు వర్తమానమంపవలయునని మఱిమఱి నాచెవి నిల్లుకట్టుకొని పోరినాఁడు. ఇట్టిసమయమున మీరిల్లువిడిచి వత్తురేని మాగధునికి మనపైఁ గినుకలుగవోఁడముగలదు. అదియునుగాక మగధరాజ్యమునకెంతయు ద్రోహముగావింపఁదలంచుచున్న కళానందుఁడను పరమపాతకుఁడొక్కఁడు మీచేతఁ జిక్కినట్లు తెలిసి మనమహారాజుపొందెడు నానందమింతింతయని నేను వర్ణింపఁజాలను. ఆదురాత్ముని సత్వరమ తనతావునకుం దోడుకొనిరమ్మని నన్నుబుత్తెంచె. ఆయుధపాణులైన కొందఱు రక్షకభటులనిచ్చి యామదుష్యాధముని మనస్వామికడ కంపకున్న మనకు మాటదక్కదు. కావున తద్విషయప్రయత్నము నొనర్పవలయుజుమీ" యని యుపన్యసించుటయు జాతవేదుని నెమ్మొగమువంక గొన్నినిముసములు తెప్పవాల్పక చూచి రాజిట్లనియెను. నేను గిరివ్రజమునకురాఁదలంచుటయుఁ గళానందుఁడు నాచేతఁజిక్కుటయు నిక్కువము. అందు మొదటికార్యము నేను మానఁగలవాఁడ. కాని

నినునమ్మి కళానందుని విడిచిపుచ్చుటకు నాకు మనసు తాళకున్నయది. నీవెవ్వరివాఁడవో సమగ్రముగ నేనెఱుఁగకమున్ను జరాసంధుని యానతి చొప్పున వర్తింపనొప్పదుగదా! అన జాతవేదుఁడు మందహాసముతో మోముదమ్మివికసింప రాజేంద్రా! అగువారెవ్వరో కానివారెవ్వరో తెలియనైతివి; జరాసంధునకు నాయందుఁగల దృఢవిశ్వాస మింక నేరియంమను లేదు. నీకింతయనుమానము దోఁచినపక్షమున నాకు జరాసంధ మహీవల్లభుం డిట్టియవసరముల నుపయుక్తంబగునంచు నొసఁగిన జాళువా పసిడియుంగరమిదిగో. ఈయానవాలైనఁ గాంచిన మీకుఁ దగునంతనమ్మకము నాయందుఁ బొడమకపోదు." అని యుత్తరీయపుకొంగునఁ గట్టిన యంగుళీయకము విప్పి యప్పుడమిఱేనిచేతం బెట్టెను.

రాజాయుంగరమెంతోగారవమునఁ జేకొని మగధరాజు ముద్రయందున్నదో లేదోయని దీపికఁ దేరఁబనిచి పరీక్షించి తనలో "నిది నిజముగా మనమహారాజు పంపిన సందేశమే కానియెడల నీయుంగర మెట్లితనికివచ్చు? ఈతనివాక్యములు విశ్వాసార్హములు. నేనీతనిచెప్పినచొప్పున వర్తింపఁదగు" నని యాయుంగరముం దనయొద్దనుంచుకొని "యోయీ! నీమాటలు మాకు విశ్వాసనీయముగ నిప్పుడు తోఁచెడిని. మగధరాజ్యమునకుం బోవసమకట్టి యున్నారముగాని యిఁక మానుకొందుము. కళానందుఁ డింతటి కుత్సితుండని యెన్నఁడెఱుఁగక వాని కెంతయుఁ జనవొసంగి మన్ననఁ గావించినాఁడ. ఐనను వానినింక జరాసంధునియొద్ద కనిపివైతును. నీవిఁక నేమైన నాతో ముచ్చటింపవలసినయంశములున్నవే?" యని యాశిశుపాలుఁడు పలుకుటయు జాతవేదుఁడు మోదముతో నిట్టులనియెను. మహాత్మా! మీరిందుమతియను మదవతిపైఁ జిత్తము హత్తంబుజేసినారనియుఁ దద్విషయమై యెంతయుఁ బరితాపమొందుచున్నవారనియు నాయింతి యెంతయు గయ్యాళితనమున మీప్రార్థనల కీయకొనలేదనియుఁ గూడ నేను వినియుంటిని. ఆకార్యము

నందు వలయుపనినొనర్చి యూరెములనాఁగపోత్తు మీకొనర్పఁగలుగను ధై
ర్యము నాకుఁగలదు. క్రమక్రమముగా నున్నకొలఁదినిగాని నాసంగతి
మీరలెఱుఁగఁజాలరు. అని మఱియు నెద్దియో యనఁబోవుచుండ శిశు
పాలుఁడు మహానందముతోఁ దుర్రిళ్ళిపడి లేచి శరీరము పరవశముగా మి
త్రుఁడా! నీపేరెవ్వరో యెఱుఁగనుగాని నీమాటలువినినంతనె నాకుఁ
బంచప్రాణములు లేచివచ్చినవి. ఎత్తెఱఁగునఁ గార్యము సహాయత్త
ముజేసి నాచిత్తమునఁగల యుత్తలపాటు హరియించెదవో చెప్పఁగదే
యని మీఁదఁజేయినైచి తట్టుచు నడిగెను. జాతవేదుఁడును జిఱునగవు
తో దేవా! నీవంటిపుణ్యజనునకు మేలుసేయుట మాజన్మము పవిత్ర
ము జేసికొనుట. ఇక్కడికి మూఁడుక్రోసులు దూరమున మీయేలుబడి
కి లోనైన గ్రామము మహిళావతి యనునది కలదు. అందు మాచె
లియలున్నది. ఆమె పేరు హేమావతి. నాపేరు మీరడిగినారు ముం
దుగాఁ జెప్పమఱచితిని, నను జాతవేదుఁడందురు. చిన్ననాఁటనుండియు
మాహేమావతి వచోచమత్కృతికని, శత్రువులనైనఁ దనమాటలపొం
దికచే వశముజేసికొను నేర్పునకును గను పేరుమోసినది. దానిం దోడు
కొనివచ్చి యీయిందుమతితో నొక్కమాఱు మాటలాడించితిమేని
యామె దారికివచ్చి మీయిచ్చవచ్చిన తెఱఁగున మసల నంగీకరించు.
నాకనుజ్ఞ నొసంగుదురేని నేను సత్వరము రేపు రేపకడ దానిం బంపెద.
దానిమగఁడును నాకు మఱఁదియు నగు మావిశారదుఁ డొకవేళ నన్ను
బంధుభావముచే నచ్చట నిలిపినను నిలుపుంగాక. ఒకవల్లకిలో మా
హేమావతిం గూరుచుండఁబెట్టి కుశలవుని సాయమిచ్చి యిచ్చోటికిఁ బ
నిపెద. ఇందుమతిని దానిస్వాధీనముఁ జేయుఁడు. అంతయుఁ జక్కఁబ
డఁగలదు. నాకు ననుజ్ఞ దయచేయుదురేని యిప్పుడు మహిళావతికిం
బోవువాఁడ నని ప్రేమ యుట్టిపడునట్లు పలికెను. అమృతవర్షము గు
రిసినట్లు తద్వాక్యములు చెవులఁబడుటయు శిశుపాలుఁడు తనసోఁచి

నోములపంట మూర్తీభవించినదని వానిం గొనియాడి జాతవేదా! నేను నీవాఁడ. నాప్రాణములు నీయవి. నీమేలుమఱువఁజాల, నను రక్షింపవలయును. సత్వరము రావలయుజుమీ యని కౌఁగిలించుకొని వాని నంపి నిద్రింప నరిగెను. జాతవేదుఁడుఁ గుశీలవసమేతుండై యంతఃపురము బాసి యొంటరి చనియె. ఆరాత్రి యంతయుఁ జేదినాథుఁడు హేమావతి వచ్చినట్లు తన సెజ్జ మీఁది కింపుమీఱం జేర్చినట్లు కలలు పెక్కులుగాంచుచు మెలఁకువవచ్చినప్పుడెల్ల నిందుముఖి యేదని పొరపాటుచే వెదకికొని యంతలో నది స్వప్నమని సిగ్గుపడి నిరాశచే నిట్టూర్పు నిగుడ్చి మఱల నిద్రించుచుండెను.

## నాలుగవ ప్రకరణము.

“ కలుగునే నాకు మహానందదాయకమగు నిందుముఖి బిగియారు కౌఁగిలింత! దొరకునే యెన్నఁడైన మృదుహంసతూలికాశయ్యా నామెనెమ్మనితో నామేనువాఁకఁ బవళించి సౌఖ్యవారాశి నోలలాడుట! లభియించునే నను బోఁటి యదృష్టహీనునకు మర్త్యములోకరంభ యగు నాయిందువదనను బట్టపురాణిగా నొనర్చి రాజచక్రమున నెక్కుడుగారవముగాంచుట! అట్టిసుఖము నాకేలకలుగును.” అని తలఁచుచు శిశుపాలుఁడు మహిళావతీపురమునుండి యా హేమావతి వచ్చుచున్నదేమో కనుఁగొని రమ్మని సేవకుల నంపి వేకువనె మేలుకాంచి చలచిత్తుఁడై యుండెను. అతఁ డెంతచింతాక్రాంతుఁ డయ్యెనో జాతవేదుని చెల్లెలిరాక యాతనికంతదూరమయ్యెను. ఉదయమగుటతోడనే చైద్యుఁడు మహాగ్రహావేశముతో జాతవేదుఁడు మోసగాఁడనియు మాటలయదనమే కాని చేఁతలు ఘూతలని వాని నిందించుచుఁ బ్రభాకరుని యెండకై కుమ్మాము హెచ్చుకొలఁదిని తనతాపాగ్నియుఁ గోపాగ్నియుఁ బ్రజ్వరిల నాఁడు

దెలియక పిచ్చివాఁడువోలె భయంకరాకారుఁడై యుండెను. రెండుగడియల ప్రొద్దువేళ నెట్టెటో యాతఁ డొకమా ఱుద్యానవనమునకుంబోయి చంద్రకాంతవేదికపైఁ బూలసెజ్జ మేనుజేర్చి యుస్సురుస్సురనుచు నిందుమతీవిరహాగ్నిం బొరలుచుండ నంత నతిత్వరితముగఁ గుశీలవుఁ డరుదెంచి జోహారొనర్చి "పరాకు మహారాజా! పరాకు, హేమావతి యింక నొకగడియలో దేవరమందిరమునకువచ్చును. ఆమెభర్త జాతవేదుని రానీయక నిలిపినాఁడు. కావునఁ దన్ను క్షమియింపుమని జాతవేదుఁడు మఱి మఱి యేలినవారిం బ్రార్థించితినని మనవిజేయుమనియె" నని విన్నవించెను. వెంటనే ముక్కుచు మూల్గుచు లేవ సత్తువలేక యుండు నారాజు చప్పున పానుపునుండి లేచి చకచకనడచి మందిరముచేరియుఁడునప్పటికి చండభానుండు చేదిరాజు శాసనముననే త్రైక్షణ్యముఁడింది యెల్లరకు దగ్గనీయుఁడై యపరవారినిధిం జొచ్చె. శిశుపాలుని మనసునం గ్రమ్ముకొన్న కామాంధకారముభాతి నలుదెసలం గాఱుచీఁకటులు గ్రమ్మియుండెను. అంత నోంకార నాదములతో బోయలచే మోయంబడు పల్లకి యొక్కటి కోటగుమ్మముకడఁ గానఁబడుటయు శిశుపాలుఁడు మేడదిగి వచ్చి యాపల్లకిని మెల్ల మెల్ల నిందుమతియున్న గదికిందీసికొనిపొమ్మని యానతిచ్చి కుశీలవునిం జేరంబిలిచి నేనా హేమావతి నొక్కమాఱు చూడవచ్చునే యని యడిగెను. కుశీలవుండు నవ్వుచు "దేవా! యీయామె పరపురుషులకెన్నఁడును గానంబడదు. పరమసాధ్వి మహారాజులు సోదరసమానులగుటచే మీకంటఁబడుటకు మీ ప్రశ్నములకు జాబొసంగుటకు నీయకొనియె. అదియైన నొక్కమాఱేకాని దినదినమును మీవంటివారికగుపడుటకు సిగ్గుపడును. కావలసిన నిప్డే యొక్కసారి మీరు ముచ్చటింపవచ్చును." అని యుత్తరమిచ్చెను. హేమావతి పల్లకిడిగ్గి యిందుమతియొద్దనున్న దాసియొక్కర్తు తనకాగది లోనికిం దారిజూప నందుఁ బ్రవేశించి యొకపీఠముపైనఁ గూరుచుండె

ను. అతిథియైవచ్చిన యాసుందరాంగిని గడుమన్నన సేయుమని రాజా నతిచ్చుటచే దాసియు దానితో నిందుమతియు నామెను గారవించిరే కాని యామె యెవ్వరో యేలవచ్చినదో వారెఱుఁగరు. హేమావతి కూరుచున్న కొన్నినిమిషములకుఁ గుశీలవుఁ డరుదెంచి "యమ్మా మహారాజుగారు తమసందర్శనముఁ జేయఁగోరుచున్నవారు. వారుమీకు సోదరప్రాయులగుటచేఁ దమరు సంశయింపఁ బనిలేదుసుఁడీ" యని పలికెను. హేమావతి సిగ్గునఁ దలవంచుకొని యూరకుండుటచేఁ గుశీలవుం డది యంగీకారసూచకమే యని నిశ్చయించి మహారాజును దోడు కొనివచ్చెను.

మహీకాంతునిఁగాంచి కాంతలెల్ల దిగ్గునలేచి నిలిచిరి. కుశీలవుఁడు రాజున కొకపీఠమువైవ నాతం డందుఁ గూరుచుండెను. అంతఁ గొంతసేపు వారెవ్వరు నోరెత్తక నిశ్శబ్దముగ నిలిచియుండ, రాజు హేమావతింజూచి యిట్టులనియె. అమ్మా! నీవు పుట్టినింటికి వచ్చినట్లు భావింపవలయునుగాని యన్యథా యెంచవలదు. జాతవేదుఁడు నేనును నీకు సోదరులమే. నీయిచ్ఛవచ్చినన్ని దినంబులు నీయిచ్ఛవచ్చినట్టు లిచ్చట నుండి యనంతరము నీగృహమున కరుగవచ్చు. మాయన్నగారు నీతో నంతయు నామూలాగ్రముగఁ జెప్పియుండవచ్చునని నేఁదలంచెదను." అనవుడు హేమావతి సిగ్గునఁ గొంచెముసే పూరకుండి మొగమింకొకవైపునకుఁ ద్రిప్పి రాజునుద్దేశించి యిట్లనియెను. దేవా! మాయన్నగారు నన్ను బలవంతమున నిటకనిపె. సోదరునిమాటఁ ద్రోసివేయఁజాలకయు సోదరతుల్యులగు రాజుగారిమాట యుపేక్షణీయముగాదనియును నాప్రాణేశ్వరు నెట్లో యొడంబఱిచి యిటవచ్చితిని. పుట్టి బుద్ధియెఱిఁగిన తరువాతఁ బరపురుషులతో నేను సంభాషించి యెఱుఁగను సరియేకదా వారి మొగములు పొరపాటుననైనఁ జూచియుండలేదు. అందుచే నాకిపుడుదక్క యేలినవారు మరలదర్శనమీయవలదని నేను మనవి చేసికొందును.

అంతియుకాదు. నాగదిలోనికి నేనుండునంతకాలము నన్యపురుషులు స్త్రీలు రానలనుపడదు. ఇందునకు మీరంగీకరించి యుండవలయుఁ గతినమైన యుత్తరవొసంగుడు లేని యెడల నేనుండుదానఁ గానిచో నని యింక నేమేమో చెప్పఁబోవుచుండఁగా శిశుపాలుఁడు మాట కడ్డమువచ్చి “చేడియ చ్చవచ్చినట్లుండుము. స్త్రీలయిన నీవు వసియించు నాగారముదరికి రాకుండఁజేసెద. శిశుపాలుఁడు చండశాసనుండనుట నీవెఱుఁగవే! ఇఁక నే భోజనమునకరిగెద. ఈదాసి నీవడిగినపదార్థములెల్ల నీకిచ్చు. ఇదికాక మీకుశీలవ్రతుఁడు మీకున్నవాఁడుగదా!” యని చెప్పి లోనికిం జనియెను. శిశుపాలుఁడున్నంతసేపు నిందుమతి గుండెలు దడదడఁగొట్టుకొనసాగెను. ఆతఁడు గదివిడచిచనినపిదపఁ గుదుటఁబడుటయు నామె యీక్రొత్తజవ్వని యేలవచ్చెనని తలపోఁతలకుంజొచ్చెను. దాసి యంతట బంగరు పళ్లెరములతో నారగింపఁ బంచభక్ష్యపరమాన్నములు దెచ్చి నివేదింప నిందుమతి యేదోదైన్యముతో నారగించెను. హేమావతి చింతయేమియు లేక భుజించెను.

భోజనానంతరమునఁ గొంతవడికు, శిశుపాలునిచర్యలు, లోకవ్యవహారములు మొదలగునవి చెప్పుకొని కాలముంబుచ్చిరి. మాటలసందడిలో నొకమాఱు ఇందుమతి హేమావతింజూచి “యమ్మా! మీరెవ్వరో యేల యిచ్చటకరుదెంచిరో నాకెఱిఁగింపఁగలరా” యనెను. అవ్వుడు నామె ముహూర్తమాత్రమునేపు యోజించి యెట్టకేలకీచందమునఁ బలుకఁదొడఁగెను. అమ్మా! నాజన్మవృత్తాంతమంతయు నీకేల? నాపేరు హేమావతి. జాతవేదుఁడను నాయన్నగారు జరాసంధుని యొద్దనుండి శిశుపాలుని యొద్దకువచ్చినాఁడు. కళానందుఁడు మగధరాజ్యమునకు ద్రోహముఁ జేయఁదలఁచుచు దైవవశమునఁ నిటఁజిక్కె. ఈతనిని మగధరాజునొద్దకుం దోడుకొని మాయన్న యరుగునన నిందుమతి మొగము వెల్లనై లఁబాఱ శరీరము గాలితాఁకునంగదలు తీఁగచాడ్పున వడఁకఁ గన్నుల నీరు

గ్రమ్మ నోటమాట లేక యుండెను. హేమావతియు దాసియు నామెను బట్టి యూరార్చిరి. ఆదుఃఖకారణ మెద్దియని హేమావతి పలుమారు నొక్కియడుగ గద్గదకంఠయై యిందుమతి యిట్లనియె. హా! దైవమా! ఏనాటికానాఁడె నాకోర్కులు భగ్నముజేసి నన్నడఁచివేయుచుంటివి! నన్ను జెఱనుండి విముక్తురాలను జేయుదునన్నందులకుఁ గాఁబోలు కళానందునకుఁ గూడ నిందు మహాపద మూడఁదలఁచియున్నది! ఈమంద భాగ్యురాలిని రక్షింపఁదలఁపకున్న నాకళానందుఁడైన బ్రదుకుఁగదా! కటకటా! జరాసంధునిచేతఁ గళానందుఁడు చిక్కుట పులినోట మేకపిల్లపడుటఁగాదె! ఇంక నాతనికి బ్రదు కెక్కడిది! అమ్మా! నీసోదరుఁడెంత ఘాత యొనర్చెనమ్మా! అయ్యయ్యో! ఇవె రాజకార్యముకదా! ఆయన లోపమేమున్నది. హా! కళానందా! నన్నీపరమదుర్మార్గుల మధ్యమునఁ బాఱవైచి నీవరిగెదవే! అయ్యో! అమ్మకడుపునఁ బుట్టినదిమొదలు పట్టుమని యొక్కనాఁడైన హాయిగా నిదురింపనైతి. దినదినగండము వేయియేండ్లాయు వన్నట్లు మొండినై జీవించుచున్నాను. హేమావతి తల్లీ! నాకేమయిన గతిచెప్పుమమ్మా!" యని యామె పాదములపైఁబడి వెక్కి వెక్కి యేడువనారంభించెను. హేమావతియు నామెనూఱడించి ధైర్యముఁజెప్పి దాసినావలకుంజనుమని "యిందుమతీ! నిన్ను దనకుఁగూర్చుమని శిశుపాలుఁడు ననురావించినాఁడు. నీకొక్కయాలోచనము నెఱిఁగించెదవినుము" అని యెద్దియో యొకజామునసే నామె కుపదేశించెను. అతిశ్రద్ధతో నాయుపన్యాసమంతయు నాలకించి యిందుమతి యూరడిన్యపుమాటలు తన కమితధైర్యముంబురికొల్ప "హేమావతీ! నీవు నాతల్లివి. మాయమ్మ మఱలవచ్చి నీరూపమున నవతరించెనని తోఁచెను." అని దాసింబిలిచి "దాసీ! మహారాజుగారి కుత్తరము వ్రాయవలయు నొకకలమును దీసికొనిర"మ్మని చెప్పెను. అదివఱకే శిశుపాలునిపేరనున్న సేవగించుకొను నిందుమతి యాతనికుత్తరము వ్రా

యఁదలఁచుట యెంతయేని యాశ్చర్యముగా నెంచుకొని కలముదెచ్చి యిచ్చెను. ఇందుమతి యొకజాబువ్రాసి దివ్వెవెలుఁగున హేమావతికిం జూపి యామెయు నది చక్కగా నున్నదనిన వెనుక మడఁచి యొకచో దాఁచి యెంతయుసంతసించెను. హేమావతియుఁ గొంతసేపటికి గుఱ్ఱుపట్టి నిద్రించెను. దాసిమాత్రము కలవరపడి యీమాయకు నచ్చెరువడి నిద్రపట్టక ప్రక్కమీఁదఁ బొరల నారంభించెను.



ఐదవప్రకరణము.

"హృదయేశ్వరా! తమరసికతయు నాయందలి గాఢానురాగమును దెలియఁజాలక యింతకాలము బేలనై మీప్రార్థనలకుఁ బెడచెవియొగ్గితి. చేదిపురమునకువచ్చిన నాఁటఁగోలె దేవరవారి గుణములు చెవులారవినుటఁబట్టియుఁ, దమచర్యలు కన్నులారఁ గాంచుటంబట్టియు, మీపై నాచిత్తము హత్తియుండి యెద్దియుందోఁచకున్నది. చూడఁ జూడ నీవ పుణ్యజనాగ్రగణ్యుఁడవనియు, నీవ యోగ్యుఁడవనియు, నీవ రసికుఁడవనియు నామదికి దృఢముగా నచ్చినయది. మీకు శాశ్వతసౌఖ్యము గలుగఁజేయఁ మనమున సంకల్పించియున్నదాన. మీకేలువట్టుటకన్న నాకు నెక్కుడు భాగ్యమున్నదే. ఐన మాచుట్టపక్కముల నందఱం బిలువనంపి వారువచ్చిన వెనుక వివాహము జరగించుకొనుఁడని వేఁడుకొనుచున్నాను. నాకింక నిముస మొక్క మహాయుగముగఁ దోఁచుచున్నది. తాళఁజాల. కావునఁ దక్షణము నాకీచెఱనుండి విముక్తి గలుగఁజేయఁ గోరుచున్నదాన. శిశుపాలమహారాజు సాధనము. ఇందుమతి శిశుపాలునిధనము. ఇంతకాలము నాయొనర్చిన యవివేకవర్తనమును మన్నింపవలయు" నని యున్న యొకజాబుఁ జదువుకొనుచు శిశుపాలుం డుదయమునఁ దన యంతిపురమున నొకచోఁ గూరుచుండెను.

ఆకమ్మఁ దెచ్చి యిచ్చినదాసి తోడనే యక్కడ నుండి తన నెలవునకుం బోయె. మహారాజు జాబు మొదటనుండి తుదవఱకు నత్యంతానందముతోఁ జదువుకొని యామాటల తియ్యఁదనముచే నాజాబు విడువఁజాలక పదిసారులు చదివి యందలి ప్రత్యక్షరసౌష్టవమునకును, బ్రతిపదమార్దవమునకును దనలోఁ దాన మెఱియుచు నానందపారావారమున నోలలాడఁదొడఁగెను. ఇఁక జాబు కన్నులనద్దుకొని హాయిహాయియని యొక్కమాఱును, హృదయమా! నీవింకశాంతినొందుమని యొక్కమాఱును కామదేవా! నీవు నాపై విక్రమించి యధికారము చేయు కాలము గడచినదిసుమీ యని యొక్కమాఱును, హా! యిందుమతీ! నామనసు పట్టఁజాలక నన్నింతకాలము చిక్కులపాలు చేసితివికదా. నిజము నిలుకడమీఁదఁ దెలియకపోదుసుమీ యని యొక్కమాఱును, కఠిభమహామును నాపైఁ గినుకవొడమినదేమి, వ్రతముసెడిన ఫలముదక్కినట్లు నాహృదయేశ్వరి, యిందుమతి, నాపాలఁబడినదని యొక్కమాఱును దలపోయుచు క్షణక్షణము చిత్రభ్రమకులోనై అబ్బా! చుట్టములు వచ్చుదాఁక నన్నాగుమన్నది. ఈవిరహామునైఁప శిశుపాలుని వశమా? యిప్పుడే యేలపోయి యామెలనాఁగ బిగియారుకౌఁగిలిఁ జేరరాదు! కాదుకాదు, కాముకులు వేగిరమునఁ బ్రిణయిజనమునకు నలుకవొడమించినవోఁ గార్యము చెడునని పరిపరివిధములఁ జింతించుచుండెను. ఇట్లిందుమతియందుఁ దగిలినడెందముతో నాతఁడు భోజనంబు మఱచి ప్రొద్దగుదాఁక మహాశనమునకుం జనకునికి సేవకులువచ్చి మధ్యాహ్నమైనదని విన్నవించి యెట్టకేలకు లోనికిం దీసికొనిపోయి యారగింపఁజేసిరి.

భోజనానంతరమునందు మహారాజు కొంతశాంతమునొంది తనకట్టి మహోపకారముఁ గావించిన హేమావతిం జూడఁదలఁచుకొనుచుండ నింతలో దాసిడాసి “ దేవా! హేమావతి యింటికింజనుటకు సెలవు వేఁడుచున్నయది. అత్తవారింటఁ గాఁపురము సేయుచున్నదగుట నిటఁ

దడవుచేసిన నెగ్గగునని మనవిచేయుచున్నది. దేవరవారిసెల వెప్పుడైన నప్పుడ క్రిమ్మఱవత్తునని చెప్పుచున్నది. ఆనెలఁతను నిలుపుట మనకును శ్రేయముకా" దని విన్నవింప నించుక యోజించి యది యట్టిదికాఁ దలఁచి ప్రయాణమునకు సమ్మతించి పల్లకిబోయల నాయత్తముచేయుదు మని సేవకులకానతిచ్చెను. దాసియు హేమావతితో రాజుగారియుత్తరువుఁజెప్పి పయనమై యుండుమనియె. అంతలోఁ బల్లకి బోయలు మోసికొనివచ్చి యాగదిముందరదించిరి. కతిపయదినముల మైత్రియైనను హేమావతికిం దనకు మనసుకలిమిచే నిందుమతి యామె నెడఁబాయఁ జాలక బెంగగొని కంటఁదడిబెట్టుకొనుచు నిలిచెను. హేమావతి పల్లకిలోఁ గూరుచుండఁ జనుచు నిందుమతిని బుజ్జగించి తనచెప్పిన దారిఁద్రొక్కిన సకలసౌఖ్యములు సేకుఱునని నొక్కి చెప్పెను. అంతలో మహారాజవచ్చటికరుదెంచి హేమావతి నుద్దేశించి "అమ్మా! నీవు నానిమిత్తము పడిన శ్రమకు నీకునేను బ్రత్యుపకార మెట్లుసేయుదు. అయిన నామనంబు సంతసించునట్లు నీ వీపసదనముల గ్రహింపవలయు" నని కొన్నినగలు, సన్ననివలువలు కుశీలవుని చేతికిచ్చి యామె కిమ్మనెను. హేమావతి యాభూషణంబులందుకొని పల్లకిలోఁ గూరుచుండ రాజు కుశీలవుని జూచి "నీవీమెతో నరిగి యీమె నింటికడ నప్పగించి జాతవేదుని జూడకునికి నాకెద్దియుం దోఁచుటలేదనియు సత్వరము ర"మ్మనియుం జెప్పి వారినంపెను. బోయలు పల్లకి మోసికొనిపోవుచు క్షణకాలమున నచ్చటివారి దృష్టిపథమునుండి దాఁటి చనిరి. ఆమె చనిన కొంతసేపుదనుక నిందుమతి వగచి దాసితో హేమావతి కలిసికట్టుతనమును, వచోచమత్కృతియుఁ గార్యసాధకతయందలి నేర్పరితనమును వెయినోళ్లఁ బొగడుచు నామె సహవాసము లేనందులకుఁ గుందసాగెను. శిశుపాలుని మతి యిందుమతీవివాహమునందు లీనమైయుండి లోకవ్యవహారము మఱచి జాతవేదునికై నిరీక్షించుచున్నది.

తన పన్నిన పన్నుగడ కొంతవఱకు సాగినందులకు ముదమందుచు జాతవేదుఁడు కుశీలవునితోఁ గూడ మఱునాఁడు సంజవేళఁ జేదినగరము నకుఁ జని మహారాజును సందర్శించెను. జాతవేదుని దర్శనము మహారా జునకుఁ గుతూహల జనకముగ నుండుటచే నాతనిం గాంచుటయు దిగ్గు నలేచి "మిత్రరత్నమా! యరుదెంచితే. ఈ రెండుదినములు దుర్దినముల ట్లు నాకుఁదోఁచినవి. మిత్రదర్శనము లేకున్న మామూఖాంభోజములు వికాసముదప్పియుండుట యొక్కయచ్చెరువే. రమ్మిటఁగూర్చుండు" మని పీఠముంజూపెను. జాతవేదుఁడు నందుఁ గూరుచుండి మెల్లమెల్ల రాజుతో "దేవా! మాచెల్లెలు తమయానతి చొప్పున వర్తించినదిక దా" యని యడిగెను. ఆపలుకులకు తేఁడు చిఱునగవునగి "సరిస రి వర్తించినదికదా యని మెల్లఁగ నడుగుచున్నావా? మీచెలియలినే ర్పరితనమును దానివాగ్రచనయు నెట్టివియో నే నెఱుఁగను గాని నాపే రువినినప్పుడు గజగజ వడఁకునట్టి యిందుమతి నాపై వలపు నిలిపి నా కుత్తరము వ్రాసినది. ఆహా! ఏమి హేమూనతి! నీసోదరియైన యామె నేర్పరితనమునఁ గొదువగ నుండ నేర్చునే? ఆమె మాటలకే కాక రూ పమునకుఁగూడ నచ్చముగ నిన్నుఁబోలి నీకుఁ జెలియ లనఁదగియున్నది. ఇందుమతి వివాహ మగుదాఁక నాడగ్గఱ నుండవలయు జుమీ నెచ్చె లీ!" యని శ్లాఘించి వేఁడుకొనెను. ఆమాటలఁలోఁ గడపటిది తన కిష్ట ముగాకున్నను రాజునకలుకవొడము ననుసందియముతో వల్లెయని మా టలచే నాసంగతి మఱపించి జాతవేదుఁ డిట్లనియె. "దేవా! నేమవచ్చి నకార్యము దేవరవారు మఱచినారు. గిరివ్రజమునకు మీరింతలో రా నక్కఱ లేదనియుఁ గళానందుని నాతోడ నంపుమనియు మగధరాజు మీకు సందేశ మంపినందున నే నిందులకు వచ్చితిని. నాయిచ్చవచ్చిన ట్లు నే నిందుఁ దడవుమసలినఁ జండశాసనుఁ డగు మగధనాయకుఁడు మన మురుగురపై నలుగు. అతని కలుకవొడమించుట గాఱుచిచ్చున నుఱు

కుట. మీకు సందియము నాయెడఁ దోఁచనేరాదు. తోఁచిన నీయుంగ రముంగనుంగొని నాసందేశము మాగధునిదిగా నిశ్చయింపఁజనుఁగదా! కళానందుని గిరివ్రజమున విడిచివచ్చి యిందుమతి చుట్టములఁ బక్కము ల నెచ్చెలులఁ దోడఁదీసికొని యొకమాసమునకు నేనిట కరుదెంచి యిం దుమతీవివాహము కనులారఁ గాంచి యానందింతు. కావున నాకు తే పు మొదల దయసేయవలయు. రాజునానతి నతిక్రమించి వర్తింపవలసి చి యిట్లు దేవరవారి కెదురాడవలసినందుల కెంతయు సిగ్గుపడుచున్న వాఁడ నన్ను క్షమియించి సెలవొసంగుఁడు." అని జాతవేదుఁడు వేఁడు కొనుటయు శిశుపాలుఁ డాలోకించుక యోజించి తాను బలిమిచే జాతవేదుని నాపుట మగధేశ్వరున కకారణము యలుక పుట్టించుట యగుననియు నాతఁడు నిశ్చయముగ మగధరాజుచే నంపఁబడిన యాప్తుఁడనియు న మ్మి యాతనితో నిట్లనియె "మిత్రుఁడా! నిన్ను జరాసంధుఁడే నాయొ ద్దకుఁ బుత్తెంచెనుమాట నిశ్చయము. కళానందుని సత్వరము గిరివ్రజము నకనుపకున్న నా మహారాజు మనలపై నలుగుట సత్యమే కాని నినుజూ చినది మొదలు నినువిడువ మనసురాకున్నది. అసుటన ఘటనాసమర్థుఁ డ వగు నీవపరపరమేష్టివని తోఁచుచున్నది. ఇందుమతి బందుగులనెల్ల వెంటఁబెట్టుకొని వత్తునని నీవు నామీఁద నొట్టుబెట్టుకొందువేని నినుబంపె ద. అన జాతవేదుఁడు నగి "దేవా! ఎంతమాట! మీతో వాగ్దానముఁ జేసి మరల రాకుండుటకు నామనసు నిలుచునే! మీతోడు. నేను త ప్పక వచ్చువాఁడ" నని యొట్టుబెట్టుకొనెను. తరువాత శిశుపాలుఁడు వారిపయనము మఱునాఁ డుదయముననే యని నిశ్చయించి భోజనమున కుంజని జాతవేదునితోఁ గూడ సంతోషముతో విందారగించెను. భోజ నానంతరమున నాతఁడు కళానందుని బిలువనంపి యాతనితో నిట్లనియె. "ఓయీ! కళానందా సాటిరాచవాఁడవనియుఁ గళావిదుఁడవనియు ని న్నింతయు గారవించితిని. నాకుఁ బ్రత్యక్షమున నపకారముసేయకున్న

మాకుం బూజనీయుఁడగు జరాసంధున కెగ్గు దలపెట్టిన కారణమున నీవు మాకుఁ బగతుఁడవు మగధరాజ్యమునకు వినాశముఁ దలపెట్టుట స్వవినాశముఁ గోరి తెచ్చుకొనుట. గిరివ్రజమునఁ బుట్టి పెరిగి యీ మహీపాలునిచే ననేకములగు నుపకారములఁ బడసి తుదకాతనికి హానిచేయ యత్నించుట నీకుఁ దగినది కాని మఱియొకనికిం దగదు. అయినం దీకు వాకసము నిలుపఁ గాలు పైకిఁ జాపినట్లు నీవంటి యప్రయోజకుఁడు మగధరాజ్యమున కేమికీడు గావింపఁ గలఁడు? నీచక్కఁదనము నీపరుచుపాయము సవిద్యావైభవముఁ జూడ నేమనుటకు నేమిసేయుటకు నాకు మనసురాదు. నీవు నాతావునయుండ జరాసంధుఁ డొకఁగి నిన్నుం బోడి తెమ్మని యీజాతవేదునంపె. వీనితో నీకు తేపునయమునసే పయనము. నీయాయుష్కాలము ముగియుటచేతనే నీకింత చెడుబుద్ధి పుట్టినది." అని శిశుపాలుఁడు మందలించుటయుఁ గళానందుఁడు తద్వచనశ్రవణమున మొగము రక్తవిహీనమై చిన్నబోవఁ దనయంత్యకాలము సమీపించినదని నిశ్చయించుకొని సౌందర్యతిలక తనపై నిలిపిన యనురాగము తుదకీ చందమునఁ బరిణమించినదనియుఁ దనముసలితల్లి యీమాటవినినపక్షమునఁ దక్షణము గుండెయవిసి చచ్చునని యు వగచి దైవికమునకుఁ బ్రతిక్రియ మనుష్యయత్నమున లేదని యెఱిఁగి శిశుపాలుని మాటలకుఁ బ్రత్యుత్తరము సెప్పక నిలిచియుండెను. అనంతర మిరుగురు సేవకులఁ బిలిచి రాజు కళానందుని యథాస్థానమునకుం గొంపొవుఁడని యానతిచ్చెను.

అతఁడవ్వలకరిగిన వెనుకఁ జేదిరాజు జాతవేదుని నెమ్మొగముఁ గనుంగొని యిట్లనియె. "మిత్రుఁడా! నామనసు సహజకఠినమైనదయ్యు నీతని యవస్థకు మిగులం జాలినొందుచున్నది. ఈతనిఁ గాంచిననాఁటఁగోలె వీనియందు నాకతిస్నేహమైనది. ఇందులకుఁ గారణమరయఁజాల చక్కదనమునకా భూలోకజయంతుఁడు, చదువులకా పుంభావసరస్వతి, చేసినవా రాజద్రోహము; అట్లని హానిసేయ మనసురాదు; ఇట్లని

యూరకుండరాదు. వీనినెట్లయిన రక్షించి నాకడ నిలుపవలయునని కోరుచున్నాఁడ దీనికి నీవేమందువు? అనవుడు వెడవర్వ మొగమున వెల య జాతవేదుఁడు రాజుతో « మహారాజ! రాజద్రోహము సకలపాత కములలో నెక్కుడు. అన్నృతము మొదలగు పాతకముల నొనరించిన మనుజుఁడు తానె చెడు. కాని రాజద్రోహము సేయువాఁడు దేశ మునకంతకును హానిదెచ్చును. మీరు వీనివిషయమై పాపముదలఁపరా దు. ఈకళానందుఁడు శిక్షార్హుఁడు. ఈతఁడు చక్కఁదనమున మదమున ట్టులొప్పియుండి కార్యముల నతిద్రోహబుద్ధి పూనియున్నవాఁడు. కాఁబ ట్టి యీతనిఁ దక్షణము జరాసంధుకొద్ద కనుపుట యుక్తకరము. ఇది గాక యిందొకరహస్యమున్నది. ఇందుమతి యీతనిపోయగ మొక్క మాఱు పొరపాటునఁగాంచిన నీయందు హత్తినడెంద మాతనిపై నిలుపు ట నిశ్చయము. మీకెఱుఁగనిదేమున్నది. ఆఁడువాండ్రచిత్తములు చంచలములగుట జగత్ప్రసిద్ధముకదా. ఆమె హృదయముటుతిరిగెనా యిటుతిప్పుట కేరిశరమును గాదుసుమీ!” యని యాతనికి నమ్మకము దోఁచునట్లు పలికెను. పూర్వోదాహృతములగు కారణములలోఁ గడ పటిది శిశుపాలుని మనసునకు గాటముగ నాటుటఁజేసి మఱునాఁడుదయ మునఁ గళానందుని ప్రయాణము నిశ్చయించి జాతవేదుఁడొక్కఁడు వా నింగొనిపోవ నోపండని రత్నఖేటుఁడను నొక దండనాథుని మఱినలుగు రు వీరభటుల సాయమిచ్చి తెపకడ జనుమని యానతిచ్చెను.

కళానందుని పయనముసుగూర్చి యాయిందుమతి దాసివలన విని మునుపటియట్లు లంతగాఁ బైకివాపోవదయ్యె. హేమాంవతి వచ్చిన దాది యిందుమతియవస్థలో నెంతయు మార్పుగలుగుటకు దాసి యక్క జమంది కారణము నిజస్థితియు నెఱుంగక కలవరపడసాగెను. కళానందుఁ డు మృత్యుముఖమున కరుగుచున్నాఁ డని మున్ను దుఃఖించినదయ్యు నేఁడూరకుండెనే కాని యేకారణము చేతనో రాతిరి యామెకంటికి నిదు

రరాక మ్మనఃక్షోభ మొందసాగెను. మఱునాఁ డుదయమున జాతివేదుఁ డు పెందలకడలేచి రత్నఖేట ప్రముఖులఁ బిలిచి కళానందుని వెంటఁబె ట్టుకొని శిశుపాలునియొద్ద సెలవుదీసికొని బయలుదేఱెను.



ఆఱవ ప్రకరణము.

“ అట్లా యోగిని ముద్రుటుంగరమును గైకొని కైలాసంబున కరి గివత్తునని చెప్పి చాలకాలమైనది. లోకమాతయగు గిరికన్య మావిష యమై యేమనినదో యెఱుఁగనైతి. నిశ్చయముగ నామె యోగిని యో మమువంచింపఁదలఁచి యొరులచేనంపఁబడిన రాక్షసాంగనయో నాకుఁ దెలియకున్నది. మామహారాజు పెక్కుచిక్కులలోఁ దగుల్కొ ని యున్నవాఁడు. మున్నాప్తులైన రాకొమరులనేకులు నేఁడు కార ణాంతరమునఁ బగఱలై కత్తిగట్టనుంకించుచున్నవారు. నాకతమునఁ జంద్రపాలుఁడుకూడ మహారాజునకు శత్రుపక్షములోనివాఁడగును గాఁ బోలు. నాపాడుహృదయము సౌందర్యతిలకపై నేలహత్తుకొనవలయు. చంద్రపాలుఁ డాపూవుఁబోఁడిని నాకొసఁగునే? అంతటిభాగ్యమానాకు? ఈదినమునఁ జంద్రపాలుఁడు తనయభిప్రాయమును జరాసంధునకు వి న్నవించునఁట నేనిప్పు డక్కడకరిగెదఁగాక. అని తనలోఁదాను శం కించుకొనుచు రణార్ణవుఁడు గృహమువెడలి రాజమందిరమున కరిగె ను. ఇంతలో మహారాజునొద్దకు జంద్రపాలుఁడు రాఁదలఁచుకొని సింగ మువసియించు గుహకుం జనుమేఁకపోతువలె బెదరసాగెను. తనకూఁ తురను రణార్ణవున కిచ్చుట వలనుపడదని క్రూరకర్మనిరతుఁడగు మహా రాజుతో నెట్లువిన్నవింతునని చంద్రపాలుఁడును, తనకతమునఁ దండ్రి కింతవందురుట చేకురెనని గుణోత్తమయు నాదినమున, రాజు వృద్ధుఁడ గు చంద్రపాలునిపై నలిగి యేమిచేయునో యని యందఱును డెందమ్ముల

రాయివడినట్లు చింతాక్రాంతులైరి. చంద్రిపాలుఁడాదినమున ను దయమునవే మేలుకాంచి యిలువేల్పులకు మ్రొక్కి యప్పుడప్పుడే యు దయశైలము నలంకరించిన భగవంతుండగు ప్రిభాకరునకు నంజలి యొనర్చి యొక్క యరదముపై నెక్కి రాజగృహమునకరిగెను. జరాసం ధునొద్దకరుగుచున్న జనకునిగాంచి కూఁతురు కంటనీరుదెచ్చుకొని రాగ లతికతో “ నోసీ ! మాయయ్య మరల నాకన్నులకుఁ గానఁబడునే. అకటా ! నానిమిత్తమున మాయప్పకిపు డెట్టికీడుమూఁడనున్నదో ” యని యంగలార్చుచుండ రాగలతికయుఁ దనకుఁగల భయమునదియే యగుట నించుక శంకించి తానుసగచిన గుహోత్తమబొత్తుగ నాఁగజాలద ని ధైర్యముచెప్పి దుఃఖోపశమనముఁగావించెను. బాలికయు నాపూఁట చలిది యారగింపక తండ్రి వచ్చినవెనుక నాతనితోఁగూడ భుజింతునని యూరకుండెను.

అటఁ జంద్రిపాలుఁడరుగకమున్న రణార్ణవుఁడు పరుగుపరుగున నప్పుడప్పుడేలేచి కాల్యకృత్యములు దీర్చుకొని కూరుచుండిన నృపాలు నిపాలికిఁజని వందనములు గావించి వినయమెసఁగ నొకచోఁ గూరు చుండెను.

అత్తఱి మహారాజుమొగము విచారసూచకమై యత్యంతమనః క్షోభమును దెలుపుచుండెను. కొండొకతడవొండొరులతోఁ బలుకక వారూరకయుండ నెట్టకేలకు జరాసంధుఁడిట్లనియె. ఉంగరముం గేశకీ దళమునుంగూడఁ గైకొని యోగిని యెంతకాలమయ్యె నిచ్చటనుండిచని? ఇంక నామెవచ్చునను నమ్మకము నీకుఁగలదే ? అనవుడు రణార్ణవుండు భయమున వెలవెలఁబోవు మొగముతో నిట్లనియె. “ దేవా ! ఆమె కైలాసమునకుఁబోయి శర్వాణితోఁ బ్రసంగించి తప్పకవచ్చునను నమ్మ కముఁకలదు. వేగరపడినం గార్యము చెడునుగదా! ” అని మఱియు నేమో యనఁబోవునప్పటికిఁ బ్రతీహారి కన్నెదుట నిలిచి “ దేవా! చంద్రపాలుఁడు

వచ్చి దేవరదర్శనముం గోరుచున్నవాఁడు. మొదలయమ్యేనేని గోడుకొ నివచ్చెద" నని విన్నపముగావింప వానిం దోడుకొనిరమ్మని యానతిచ్చి రాజు రణార్ణవునితో "వత్సా! ఈదినముననే చంద్రపాలుఁడు తన కూఁతును నీకొసంగునదియు లేనిదియుఁ దెలియఁజెప్పవచ్చె. నీవిచ్చటనుం డరాదు. ఆప్రక్కగదిలోనికింజను" మని యనిపెను. ఇంతలోఁ జంద్రపా లుఁడును మెల్లమెల్ల సౌధాంతరముంజొచ్చి తేనిసన్నిధికింజని యభివందన మాచరించి యాతని యెట్టయెదుట నొకయుచితాసనమునఁ గూరుచుం డెను. మగధదేశవ్యవహారము లొకకొన్ని యాతనితో ముచ్చటించి భూమిపాలుఁడు చంద్రపాలునితో నిట్లనియె. "ఆయుష్మంతిమైన సౌం దర్యతిలక వివాహమునుగూర్చి యేమిచేసితివి. మారణార్ణవునకిచ్చి నాతో డ వియ్యమొంది నాముద్దుచెల్లించి రాజబంధువుఁడవై గౌరవమొందుదు వుగాక యని నాతలంపు నీయభిప్రాయము నేమియుండాఁపక నాకడ వెల్లడిచేయునది." యని యానతిచ్చుటయుఁ జంద్రపాలుఁడు తనయవస్థ మిగుల నపాయకరమైనదని యెఱిఁగియుఁ గుమారిక యభిమతముం దెలు పనిర్ణయించి తేని కభిముఖుఁడై చేతులు జోడించి యిట్లని విన్నవించె. "రాజేంద్రా! రాజులకు న్యాయపరిపాలనము నిసర్గమగుట నాకు న్యా యమె జరగునను ధైర్యము కలదు. మీయడిగిన యర్థమున నాపను మనోవ్యాకుల మిట్టిదనియు నింతయనియుఁ జెప్పఁజాల. వెనకకువచ్చిన నూయియు ముందుకువచ్చిన గోయియుగా నున్నది. నాయాపద నార్చ వాయఁదీర్చువారు మీరుదక్క యన్యులులేరు. నన్నుగూర్చి మీరు జా లిపడుదురను దృఢవిశ్వాసముతో మనసులో నున్నదంతయు వెడలఁగ్రక్క నిటవచ్చితి. నాకుమారిక వివాహము చేయువాఁడను నేనుగాని వివాహ మాడునది నాకూఁతురేకదా. ఆమెకు రణార్ణవుని పేరువిన్న నెంతయు భయము నేవయుం గలవు. దానిచిత్తము కళానందునిపై హత్తియున్న ది. లేకలేక కలిగిన యాకూఁకిమిబిడ్డను దానికిష్టములేనివానికిం గట్టిపెట్టి

గొంతుకోయఁజాల. దేవరవారెట్లు తలఁచినసరే. ఎట్లునన్ను శిక్షించినను సరే. నేను నాకన్నకూఁతు చిత్తమునకు వ్యతిరేకముగఁ జేయఁజాల. అది సుఖసౌఖ్యములనొందుచుండఁ జూడ నాతరమగునె. ఇదియ నాయభిప్రాయము. మీఁద దేవరచిత్తము." అని నిలువంబడియుండెను. అతనిమాటలు జరాసంధున కెంత యప్రియములుగనుండెనో యిందువ్రాయ నాశక్యముకాదు. చంద్రపాలు సంభాషణ ముగియునప్పటికి మగధరాజునకు వానిపైఁగల యనురాగము ముగిసెను. చంద్రపాలునిపలుకులు వినివిని రాజు తలయూఁచి యూఁచి తనయెదుట నంతకుమున్నితఁడెన్నఁడు నెదురాడ నోడువాఁడు నేఁ డంతధైర్యసాహసములతోఁ బలుకఁగలిగినందుల కచ్చెరువందుచుఁ దుదకిట్లనియె.

“ చంద్రపాలా ! మగధరాజుతోఁ బ్రతికక్షుబూనఁదలఁచిన నిన్నుఁజూడ మిగుల జాలివడుచున్నవాఁడ. ఏమేమి! నీకూఁతు మనసున కెదురుచేయఁ జాలవా ? ఏమైన సరేకాని నీబిడ్డను గళానందున కిచ్చెదవే ? అహాహా ద్వాపరహరిశ్చంద్రుఁడవు! అయిన నీపంతమెట్టిదియో కనుఁగొనువాఁడ. ఓరోరి పాపాత్మ! ఇంతకాలము కళానందు నెందో దాఁచి యాతనిచే రాజద్రోహములఁ జేయించుచు, నట్లుచేసినందులకుఁ బారితోషికముగా సాలంకృత కన్యాదానము చేయఁదలఁచితివిగా చూతము నీకూఁతు రణార్ణవున కెట్లు పెండ్లిచేయవో. ఇదే నాప్రతిజ్ఞ వినుము. నాకంఠమునఁ బ్రాణముండ హరిహరబ్రహ్మాదులువచ్చిన ముజ్జగములుతలక్రిందైన సౌందర్యతిలక కళానందునిబెండ్లియాడదు. రణార్ణవుని కేలువట్టుట నిక్కువము. అదియటుండ రాజద్రోహము సేయఁదలఁచిన మహాపాతకునితోఁ జుట్టరికము గలుపఁదలపోయుచున్నవాఁడవు. కావున నీపై మగధరాజునకుఁ గల నమ్మకము చెడిపదది నీవాతనితోడి బాంధవ్యము మానుకొనునంతకుఁ గారాగృహంబున నుండుము. బాల్యస్నేహితుఁడవనియు వృద్ధుఁడవనియు నేనూరకుంటిని కాని వేఱొకఁడైన నింతకు నుసురులు

దీయకుందునే. ఛీ ! యింక నాయెదుట నిలువఁదగవు. ఓరీ భటులార ! ఈపరమపాతకుని చెఱసాలలోనికిం దీసికొనిపొండు. అని తన పీఠమునుండి లేచి యాగ్రహావేశమున జేవురించిన నెమ్మొగముతోడ శుద్ధాంత సైరంధ్రికలు దన్ను జూచినంతన వెఱపుగొని పరుగువాఱ నంతిపురముకే కతికోపమునఁజనియెను. జరాసంధుని నోటనుండి కారాగృహావాసముకే కుఁ దన్నుగొనిపోవుమని యానతి వెడలుటతోడనె చంద్రపాలుఁడు నిశ్చేష్టుండై తనయవస్థందలంచియుఁ దనకింతఘాతచేసినరాజు తనకూఁతు నేమిసేయునోయని యామెయవస్థందలంచియు నొకమారు వగచి సేవకులతో నాతఁడు చెఱసాలకుంజనియెను. ఈమాటలింటికడఁ దెలిసినపుడు గుణోత్తమ మూర్ఛిల్లెను, రాగలతిక నిశ్చేష్టయయ్యెను. ఇంట నందఱు మహాదుఃఖసముద్రమున మునిఁగియుండిరి.



## ఏడవ ప్రకరణము.



కళానందుని వెంటఁబెట్టుకొని పదిలముగా రత్నఖేటుఁడు వానివెనుకను జాతవేదుఁడు ముందు నడచుచు నిరుగెలఁకుల నాయుధపాణులైన జోదుల నిలిపి వారు పయనమొనర్చుచుండిరి. గాఢసంతాపమున బయలువెడలు వెచ్చని నిట్టూర్పులచే సుందరవదనారవిందము కలుషమైయుండ నడువనోపికలేక కళానందుఁ డెట్టెటో సాగివచ్చుచు నూహోదయములఁ దనపై మాగధున కత్యాగ్రహోదయ మగుననియూఁ దదస్తమయములఁ దనకస్తమయము సమీపించుచున్నదనియూఁ దలఁచుచు నది తదనకెంత వేగమువచ్చిన నంత సంతసముగ నుందుననియు వారలతోఁ జెప్పుచుఁ బయనమగుచుండెను. కళానందుని విషయమున రత్నఖేటుఁడు లోకవిధముగఁ గరుణార్ద్రచిత్తులై యుండిరికాని జాతవేదుఁడుమాత్రమేకారణముననో కఠినకఠినముగ వర్తించుచుండెను. దారి

నుండి యెక్కడునైనఁ దొలఁగనీక, యిటునటుఁజూడనీక, యెంటరిగ నెందుఁజననీక, యితరులతో మాటలాడనీయక యారాచకొమరుని జాతవేదుఁడు పెక్కువిధముల వెతలఁబెట్టుచు హరిశ్చంద్ర నక్షత్రకుల న్యాయము జ్ఞప్తికిఁదెచ్చుచు జాతవేదుఁడు "రాజద్రోహికిఁగూడ నంతచనవు నొసఁగుచున్న వా" రని రత్నఖేటప్రముఖుల నిందింప నారంభించెను. రత్నఖేటుఁడును, జాతవేదుఁడున్నంతవఱకు రాచకొమరుఁడు తప్పించుకొని పాఱిపోవఁజాలఁడనియుఁ దానెంతయుజాగ్రత్తగా నున్నను భయములేదనియు రేల హాయిగ నిదురింపసాగెను. జాతవేదుఁడు దనశరీరముంగప్పి నిలువ్రుటంగియు శిరోవేష్టనము నెన్నఁడుభోజనసమయమునైనన విడువకుండుటయు మాసినమడుగుల విడుచునెడఁ గడుఁ హాస్యముగ నెందేనిజని క్రొత్తవలువలు దొడుగుటయుఁ గొలమును గోత్రమును నెన్నిసారు లడిగినం దెలుపకుండుటయుఁ గాంచి రత్నఖేటుఁ డితఁడెవ్వఁడై యుండునాయని నిరంతరము యోచించుచు మీసకట్టు లేశమును లేమి పేడివానిమొక మెట్లు జరాసంధుఁడు జూడనోపెనని సందియమొందుచు నంతయుఁ గతిపయదినములలో వినవచ్చునని మనశ్శాంతి కలిగి యూరకుండెను.

ఇట్లు కొన్నిదినములు చేదపురమునుండి పయనముచేసి యొకనాఁడు సంధ్యాకాలమునకు నొకయరణ్యముసేరి దాపున నూరుపల్లెలు గానఁబడమి దారి తప్పితిమో యని వారలంకఱు నిముసము యోజించి మఱి కొంత దవ్వరిగి చూతమని యింకను నడచి నడచి పసుల యడుగుల జాడలు మనుజుల యలుకుడు, గోడికూఁత యెందును లేకునికి తుదకది మహారణ్యముగా నిశ్చయించి యందే యారాత్రి నిద్రింపఁదలఁచి యొక్కచో నేలపై నుత్తరీయములంబఱచిరి. నడుమఁ గళానందుని బండుకొనఁజేసి నాలుగుప్రక్కల నలువురు సేవకులఁ బండుకొనఁజేసి, రెండుజాములు రత్నఖేటుఁడును రెండుజాములుజాతవేదుఁడును రక్షకుఁడుగానుండ నిర్ణయించుకొనిరి. జాతవేదుని నిదురింపమని రత్నఖేటుఁడు మొదటి రెండుజాములుధా

నుగాఁ బుండితనవంతుఁడీరుటయు వాని లేపి తాను నిదురబోయెను. నిద్దురబద్ధక
ముచేఁ గన్నులు నులిమికొనుచు జాతవేదుఁడు వాలుగేలఁబూని నాలుగు
గడియలిటునటుదిరుగునప్పటికి బద్ధకమెల్లఁబోయెను. పిమ్మటనాతఁడు కళా
నందునిదురవస్థయుఁ జంద్రపాలనందన యాసయుఁ దలఁచి దైవవైపరీత్య
మునకచ్చెరువుపడుచుండ నేదియోధ్వని వానిచెవులకువినఁబడినట్లయ్యెను.
వినినతోడన నాతఁడు కళానందునిమీఁదఁ జేయివైచి లేపి మరల నా
ధ్వని యగుడు నతనిని వినుమని వానికివినిపించి యిరువురును బెబ్బులిధ్వని
యని నిశ్చయించిరి. అంతట జాతవేదుఁడు కంఠమెత్తి "అయ్యో వ్యా
ఘ్రము! వ్యాఘ్రము!! లెండు లెం"డని యఱచెను. ఆమహానాద
ము నిదురించుచున్న యాయేవుర నొకమాఱు మేలుకొలిపె. అపుడు
వారందఱును లేచి భయూరులై కళానందుఁడు జాతవేదుఁడు నున్నవైపు
న కరుగక, దారి తెలియక, యొకరిమాట యొకరువినక యాక్రందనధ్వను
లతోఁ జెల్లాచెదరై నలుదెసలకుం బరువెత్తిరి. జాతవేదుఁడు భయకంపి
తుఁడై గడగడ వడఁకుచుఁ గళానందుని చేయి గట్టిగఁ బట్టుకొని "భయ
ము లేదు నిలు నిలు" మని యాతఁ డెంత ధైర్యముఁ జెప్పుచున్న నదిచెవిఁ
బెట్టక రాజకుమారు నీడ్చుకొని పాఱిపోవసాగెను. జాతవేద కళానందు
లొక వైపునకుం దక్కిన వారందఱొకవైపునకుం జనిరి. కొంతదూర
ము పరువెత్తి రత్నఖేటుని సేవకుల నెలుఁగెత్తి పిలిచి పిలిచి వారు మా
రుపలుకకుని కెంతయు విసిగి కళానందునితోఁగూడ నడువసాగెను. అట్లు
నడువ నడువఁ గొంతదవ్వరుగునప్పటికి బల్లున తెల్లవారెను. అప్పుడు
మహోన్నతములగు వృక్షముల చాటునుండి యుదయ మొందుచున్న
యంశుమంతుని బింబ మించుకించుక వారికిఁ గానఁబడఁజొచ్చెను. కొన్నిని
మిషములలో నాతెరవరు లిరువురును నాగహానముదాఁటి బయలు సేరిరి.
అంతట భానుమంతుని యరుణకిరణ సహస్రములెకాక వారికనుదమ్ము
లకు నమితానందజనకముగ ననేకగోపురములు బహువిజయపతాకము

లు పెక్కు మేడలుఁ గానవయ్యెను. అంతకంతకు సమీపమునకుం జనుచు సిరులకుఁ గాఁపురమగు నాపుర మెయ్యదియై యుండునని కళానందుఁడు యోజించుచుండ నింతలో నంతరిక్షమును దాఁకునట్లు గరుడధ్వజము గానఁబడెను. దానంజేసి యయ్యది ద్వారకానగరముగ భావించి కళానందుఁడు మహానందభరితుఁడై నెమ్మనమున "అహహా! దైవమునాయందుమిగులఁ గరుణకలవాఁడు జాతవేదుఁడు నన్ను గిరివ్రజమునకుం గొంపోఁదలఁచియుండ భగవంతుఁడు ద్వారకకుం దెచ్చె. మూఁడునాళ్ళక్రిందట వీరు దారితప్పిరి. దైవసాహాయ్యమున్నచో నిఁక నెవరెట్లుకావించిన భయము లేదుగదా! యని సంతసింపుచుండెను. జాతవేదుఁడును దానది ద్వారక యని తెలిసికొని చింతాక్రాంతుఁడు గాక సంతసించినవాఁడుపోలె కానఁబడెను. ఇద్దఱును నగరముం బ్రవేశించి యాపూఁట మాధవు నంతిపురమునకుం జనక యొక శూద్రగృహమునందు బసచేసియుండిరి.

భోజనాంతరమునందు రాత్రి వీరలిద్దఱును వాసుదేవుని మందిరమునకుంజని తమరాక యతనికిం దెలియఁజేసిరి. యదుపుంగవుఁడు ప్రతీహారి నంపి వారిందోడ్కొని రమ్మన నాతఁడట్లుచేయుటయు వారు నందకుమారు మ్రోలనిలిచి సాష్టాంగదండప్రణామంబుం జేసిరి. వారలదీవించి కృష్ణుఁడుచితపీటముల నాసీనులుగాఁ జేసి కళానందుని రాకకు సంతసించి "కళానందా! ఎంతకాలమయ్యె నిన్నుం గనుంగొని! నీవింద్రప్రస్థపురమునకుం జనలేదా? నాసందేశము ధర్మనందనున కెఱింగించితివనుకొంటిని. పాపము నీకు నాగంతుకముగఁ బెద్దయిడుమలు రానోపు" నని పలుకరించెను. వాసుదేవుని చల్లని క్రీగంటిచూపులును, చెవులపండువుసేయు పలుకులును గళానందుని నెమ్మనమున నాటిన యమ్మలికముఁ గొంతశాంతింపఁజేయ నాతఁడిట్లనియె. "నారాయణా! నీకడ సెలవు గైకొన్న దాదిగ నాపడినయిడుమల నేమని చెప్పుకొందు. మార్గమధ్యమున విధివశమునఁ జేదిరాజు భటులచేఁ జిక్కి యక్కడ నిన్నాళ్ళుఁ

చెరలోనుంటిని. అంతకన్న నిప్పుడు నెక్కుడుకీడు మూడనున్నది. కీడన నే
ల? మరణమె నాదుఃఖముల నంత మొందింపనున్నది. ఈజాతవేదుఁడు
నన్ను జరాసంధునియొద్దకుం గొనిపోవనున్నాఁడు. కతిపయదివసములలోఁ
బరలోకమునకుం జననున్న నాకు నీచరణారవిందముల సందర్శనమయ్యె
నింక ముక్తిలభియించు" నని బిట్టుగ గ్రుచే నంతకన్న మాటలాడఁజా
లక దీనాననుఁడై యున్న యారాచపట్టిదెస జూచి నందకుమారుఁడు జాలి
నొంది మీఁదఁ జేయివైచి తట్టి వత్సా! వెఱవకు. వాసుదేవుఁడు నిన్నూ
రక జరాసంధుని చేతులఁబెట్టునె! నీకు సకలకళ్యాణములు సేకూఱు"
నని ధైర్యముం జెప్పి వానివంత కొంత బాపెను. అనంతరము వాసుదేవుఁ
డు జాతవేదుని మొగమువంకఁజూచి కొన్నిరహస్యములు ముచ్చటింపఁ
దలఁపుఁగలుగుట వాని ముఖవైఖరింబట్టి తెలిసికొని లోనికి రమ్మని వా
నిం బిలిచి యొకచోఁ గూరుచుండి వానితో ననేక విషయములు ప్రశం
సించెను. శ్రీకృష్ణుని పేరువిన్న మండిపడునట్టి శిశుపాలున కాప్తుఁడై
వాసుదేవునకు బద్ధశత్రుఁడగు జరాసంధున కంతకన్నఁ గూరిమిచుట్టమైన
యీజాతవేదుఁడు కృష్ణునికిఁగూడ నాప్తుఁడై రహస్యములు మాటలాడు
చుండుటఁ జూచి కళానందుఁ డత్యాశ్చర్యము నొంది "యీతఁ డెవ్వఁ
డో యేరికిం దెలియదు. వీనిచరిత్రము విచిత్రము. వీనినెచ్చెలులెవ్వరో ప
గతురెవ్వరో కూడఁ దెలియదు. వీఁడు నాకుపకారము సేయునో యపకా
రము సేయునో క్రియనుబట్టి చెప్పవలయును గాని వీనిమనస మిట్టిది
యని నిర్ణయింప నెవ్వరితరముగాదు. అయినను వాసుదేవునికడ నున్న
వాఁడను గదా యనుకొనుచుండెను. ఇంతలోఁ దమ విస్రంభ సంభాషణ
ము ముగియుటయు జాతవేదుని వెంటఁబెట్టుకొని వాసుదేవుఁ డీవలకువ
చ్చి కూరుచుండెను.

కళానందుఁ డంతట వాసుదేవునితో "దేవా! నామనవి యొ
క్కటియున్న యది శిశుపాలుని మందిరమున నిందుమతి యను నొక సుంద

రియున్నది. ఆరాజవదన నారాజు బలిమిచేఁ గేలువట్టఁదలఁచుచున్నాఁడు. నేఁ జేదిపురమునుండ నాయిందుమతి తనకించుక సాయముజేయు మని వేఁడుకొనుటచే నేనటులఁ జేయుదునని వాగ్దానముచేసితిని. నాయవస్థ యిట్టులుండ నేనామెకుఁ గావించు సాయ మేమున్నది? మాధవా! నేనింక పరలోకప్రయాణోన్ముఖుఁడ నగుటచే నొకమనవి యొనర్చుకొనియెద. ఆయిందుమతి నెట్లయిన వాని బారినుండి రక్షింపవలయు" నని వేఁడికోలు సలుపుటయు యాదవుఁడు చిఱునగవు నగి "యామెకు నీకుఁగూడ భయములేదు. ఇందుమతినిగూర్చి జాతవేదుఁడు తగుయత్నములఁ జేసియున్నవాఁడని జాతవేదుని నావలకుఁ జను" మని కనుసన్న జేసి కళానందునితో నిట్టులనియె. "రాజకుమారా! నీకుఁ మహోపకారముజేయఁదలఁచితిని. జాతవేదున కిష్టములేకున్నను నిన్ను నే విడిచిపుచ్చెద. నీవు గిరివ్రజపురమునకరిగి నీహృదయేశ్వరియగు సౌందర్యతిలకయొద్దనుండి రహస్యముగ నాచెప్పిన చొప్పున వర్తింపుచుండుము. ధర్మనందనుఁడు నన్ను రమ్మని పలుమాఱు వేఁడుచున్నాఁడు నేనింద్రప్రస్థపురమునకుం బోయి యుధిష్టిరునకు రాజసూయయాగము సేయుమని నొక్కిచెప్పి యల్పకాలమున జరాసంధసంహారము గావించెద. ఏద్వారమున గిరివ్రజపురముఁ బ్రవేశింపఁదగు, నెట్టికాలమున వానింజంపనగు నేవిధమున మందిరము బ్రవేశింప నుచితమగు నవియెల్ల నరసి పూలవర్తకుల పేరులు గొందఱు సేవకుల పేరులు మాకుఁ దెలియఁజేయుము మాకుఁ దోఁపనియంశములావశ్యకము లగునని నీకుఁ దోఁచినవియెల్లఁ గాలానుసారముగ నెఱింగింపుచుండుము. నీవుమాకు వ్రాయునుత్తరములలో నీపేరువ్రాయక "దేవభూతి" యని వ్రాలుచేయుము. నేను నీకు వ్రాయవలసినంత యావశ్యకత యుండదుగాని యున్నపక్షమున గుణభూతి యనివ్రాయుచుందు. అది నాపేరుగా నీవుగ్రహింపు. నాయొద్దనున్న వేగులవాండ్రలో మిగుల నేర్పరులున్నవారు. మాఁగవానివేషమువేసికొని యద్భుతములు సేయఁగల

వాఁడు కోరకుఁడు; గుడ్డివానివేషము వేసికొని యెంతెంతో పనులు చేయువాఁడు కాణభూతి. టక్కరితనముల మాయల వీరల జయించినవారెవ్వరును లేరు కావున వీరలఁదోడుకొని నీవు గిరివ్రజమున కేగుము. నేను ఱేపింద్రప్రస్థమున కరిగెద." అని తనహృదయస్థిత మగు రహస్యముల నెల్ల వాసుదేవుఁడు కళానందునితోఁ జెప్ప నాతఁడు తన బంధవిముక్తికి, జరాసంధుని మరణము సమీపించినందులకు నత్యానందము నొంది యాయుపకారము జేసినందులకు వాసుదేవునకుఁ బునఃపునః ప్రణామములు జేసి మఱునాఁడు పయనమని నిశ్చయించుకొని పండుకొనియెను. పిదప జాతవేదునితోఁ గొంతదనుక ముచ్చటించి వాసుదేవుఁడు నిదురించెను. కళానందుఁడు పండుకొని నిదురరామి చిరకాలముక్రిందటఁ గనులపండువుగఁ గాంచిన సౌందర్యతిలక ముఖచంద్రమండలము మరలఁ గాంచు భాగ్యము కలిగినదిగదా యని యొడలెఱుఁగనియానందమున నోలలాడుచుఁ బ్రియురాలి ముఖాంభోజము దలఁచుకొని భావిసౌఖ్యముగూర్చి యువ్విళ్ళూరుచుండెను. జాతవేదుఁడు కొంతసేపు మేలుకొని నిదురించెను.

మఱునాఁడు కోరక కాణభూతులతోఁ గళానందుఁడు ద్వారకానగరము విడిచి చుట్టములం బక్కములఁ జూచువేడుకఁ బయనముచేసెను. వాసుదేవుఁడు తనయుద్యమ మెవ్వరికిం దెలుపక కార్యాంతరమున నింద్రప్రస్థమునకుం బోవుదునని బలరామప్రముఖులగు యదువీరులతో విన్నవించి రుక్మిణీసత్యభామాదులగు నష్టమహిషీమండలమునొద్ద సెలవుగైకొని సాత్యకిని దనవెంటఁ గొంపోవనిశ్చయించి ప్రయాణోచిత మగు వేషముం దాల్చి సిద్ధముగనుండెను. అంతలో సారథి గరుడధ్వజలాంఛితమై నానావిధరత్నశోభితమై విజయప్రదమై యలరు నరదమునకు గోవిందుని కీర్తిమూర్తులుగైకొనినవో యనినట్లు శ్వేతధవళతురంగములను బూన్చి యాయత్తము సేయఁ బురుషోత్తముఁ డందు సాత్యకిసమేతుఁడై ప్రవేశిం

చెను. ఆజానేయతురంగములు నందనందనుఁ డధిష్ఠించిన తోడనే యర దములాగి చంగుచంగునఁ బరుగెత్తుచుఁ బయనము సేయుచుండెను.

---

## ఎనిమిదవ ప్రకరణము.

పార్థుఁడు మున్ను దనయెడఁ గృపాంతరంగిత మనస్కుఁడై యొనర్చిన మహోపకారమునకుఁ బ్రత్యుపకారము సేయుతలంపున దానవవిశ్వకర్మ యగు మయుఁడు పాండవేయులకు ముజ్జగముల దానికీడులేని సభామండపము నొక్కదాని నిర్మించి యొసంగె. అందుఁ జెక్కఁబడినరతనములఁ గాంచిన వారలందఱు నిఁక రత్నాకరములయందుఁగాని భూగర్భమునఁగాని రత్నములుండునే యని శంకింపఁజొచ్చిరి. మహేంద్రునికొలువుకూటము దీనికి నన్నివిధములఁ దీసిపోవునని నారదాదిమునులు నిష్పక్షపాతబుద్ధితో ననుచుండ మహీమండలమునఁగల రాచవారి కొలువుకూటములు దీనితోఁ బోల్చుట దాని నగౌరవించుటయని తోఁచెను. పాండవకౌరవమహావైరమున కంకురమై పాండునందనఖ్యాతికి మూలకారణమై, యానాఁటిమేటి రాకొమరులకు భయాంపాదకమై, సొగసులదీవియై, వింతలతావునై, ముద్దులమూటయై, రతనాలపేటియై, చూపఱకుఁగన్నులపండువై రాజిలు నమ్మహాసభ పాండునందనుల యదృష్టవశమున వారికి లభియించెఁగాని యన్యుల కెట్లది లభియించు. నిర్మలసరోవరములట్లు కన్నులకు భ్రమగలిగించు నింద్రనీలమాణిక్యస్థగిత ప్రదేశములును మనుజుఁడొకఁడు నడుచునపుడిరుగురు నడుచుచున్నట్లు తోఁపఁజేసి నడుచువారికి నడలుగలిగించు పెనునద్దంపు పలకలును నెట్టి చిన్నగొంతుతోఁ బలికినఁ దద్దయుం బెద్దగాఁ బ్రతిధ్వనియొసఁగు మేడలును గూరుచున్న జనమునకు నుష్ణతాపములేకుండ మందమారుతము లోనికరుదెంచుటకనువగు ననేకవాతాయనములును సభామంటపమున కపూర్వాలంకారమును దెచ్చుటచే నది ద్వాపరయుగ చిత్రములలో నొకటియని మెచ్చఁబడియె.

ఈవిధమున సొగసులకుప్పయై యొప్పు నమ్మహాసభామంటపమునం దొక్కనాఁడు భరతకులప్రదీపకుఁడు కుంతీగర్భశుక్తిముక్తాఫలమును ధర్మావతారుఁడును నగు యుధిష్ఠిరుఁడు తమ్ములు నలువురు పార్శ్వముల, రాజమండలముచుట్టును గూరుచుండి కొలువ మంత్రులు సామంతులు దండనాయకులు వీరభటులు రాయబారులుఁ జుట్టములు నెచ్చెలులుఁ బురోహితులుఁ దమతమ యుచితప్రదేశముల నాసీనులై యుండఁ గొలువుదీఱియుండెను. అత్తఱి ధౌమ్యుఁడు, మున్ను రాజసూయాశ్వమేధములుగావించి యశముఁగన్న రాజన్యులచరిత్రములను విన్నవించుచు సందర్భవశమున నిట్లనియె. "యశోదాకిశోరమనియు దేవకీతనూజుఁడనియు నందనందనుఁడనియు వాసుదేవుఁడనియుఁ బేరులుగాంచి మనుజలోకముఁ బావనముగావించుచున్న యీమాధవుఁడే మున్ను త్రేతాయుగమున దశరథరాజనందనుఁడై శ్రీరామాఖ్య నవతారము దాల్చి యశ్వమేధమొనరించి జగద్విఖ్యాతుఁడయ్యె. అట్టిమహారాజులింక ననేకులున్నవారు" అని మఱియు నెద్దియో యనఁబోవుచుండ నింతలోఁ బ్రతీహారివచ్చి "దేవా సాత్యకిసమేతుఁడై వాసుదేవుఁడు వచ్చియున్నవాఁ"డని విన్నవించెను. విన్నవించుటయు సభయెల్ల విస్మయానందభరితమయ్యెను. అర్ఘ్యపాద్యములఁ దెమ్మని సేవకులకానతిచ్చి యుధిష్ఠిరుఁడు లేచె. ఆతనితో నలువురుతమ్ములును లేచిరి. తమ్ములతో రాజమండలమెల్ల లేచె. రాజమండలముతోఁ బరివారమెల్ల లేచె. అందఱితో ధర్మరాజు సభాద్వారమునకుం జని యప్పుడే యరదము డిగిన యాయదుకుంజరద్వయమును విలోకించి పులకితశరీరుఁడై వికసితముఖారవిందుఁడై యనుగమ్యమానసోదరుఁడై యెదురేగెను. వాసుదేవుఁడు జనసమేతుఁడై యుధిష్ఠిరుమ్రొక్క నతఁడు తనపాదములపైనున్నవారిని లేవనెత్తి దీవించెను. పిమ్మట యాదవసింహము తనకుఁ బాదాభివందనమొనర్చిన భీమార్జునమాద్రేయుల దీవించి వారిసేమ మడిగి బంధుసామంత పరివా

రము సేయు జోహారు లందుకొని యందఱితో సభామంటపమున
కుంజనిరయె. తనగద్దియకు దాపున నవరత్నఖచిత మగుపీఠమొందు వే
య్యేబనిచి యందతని నాసీనుఁజేసి యనంతరము దానును దక్కఁగల వ
రివారమును గూరుచుండిరి. యదువృద్ధుల సేమము భరతవీరులును గురు
వృద్ధుల సేమము యదువీరులును కనుఁగొనిరి. మాధవుఁడు సభనున్న
వారినందఱను బేరులెత్తి వేఱువేఱఁ బలుకరించి సేమమరసి యుల్లాసము
దలంపు చేసెను. సాత్యకియు భీమార్జునులకు నడుమఁగూరుచుండి బావ
మఱఁదుల కుచితము లగు సరసల్లాపముల మునిఁగి తేలుచుండెను. అం
తట యుధిష్ఠిరుఁడు భక్తి వినయములు గదుర దేవకీనందనుని మోమువంకఁ
జూచి యిట్టులనియె. "దేవా! పిపీలికాది బ్రహ్మపర్యంతమును భూత
కోటియందు సమదృష్టినిలుపు నీకు మాయందింత యాదరము గౌరవము
ప్రేమయు జనియించుట మాభాగ్యముగాని వేఱుకాదు. ద్వాపరంబున
దేవకీవసుదేవుల కుద్భవించి దుష్టదానవమానవకోటులఁ బరిమార్చి వసు
మతీభారము నడఁపవచ్చితి వని తెలిసినవారలందఱు నందురుగాని నాకు
మేనమఱఁదివై కొంగుబంగారమవై నాయశము మహీమండలము నం
దు వెలయింప మాయేపురను గాపాడవచ్చితివని నేనూహించెద. గాం
ధారేయులు విషభోజనంబిడినను లక్కయింట మమ్మునిచి చిచ్చువెట్టిన
ను మాకపాయము వాటిలకుంట నీకటాక్షమునఁగాదె? మాధవా! నా
రాయణా! జనార్దనా! నిన్నుఁగొనియాడ నాకుఁ దరమే?? అని విన్నవిం
ప గోపకుమారుఁడు మందహాసముతో నిందుకుల శేఖరుం గనుంగొని
"మహారాజా! సజ్జనులకు దుర్మార్గులు కీడుసేయఁగడఁగుదురేని భగవం
తుఁడు వారలకురవోమపడి మూడఁదలంచిన కీడుఁ దొలఁగింపఁడే! సత్య
సంచారివైన నిన్నుఁబోలు రాజెందుఁగలఁడు? చల్లని నీపరిపాలనము
నందుండి యాదవులగు మేమందఱము నేబాధయు నెఱుఁగక హాయిగా
సుఖించుచున్నారము. భీమపార్థమాద్రేయులచేత సురక్షితమగు నీరాజ్య

లక్ష్మీ నీకీర్తికాంతతోడం గలిసి యనేక నూతన దేశముల విహరింపనున్నది. అన్నట్లడుగమఱచితిని. కళానందుఁడు మీకడకు రానేలేదా? "యని ప్రశ్నఁజేసెను. అంతట యుధిష్ఠిరుఁడు "కళానందుఁడను పేరు వినుటయేకాని వానింజూచి యెఱుంగను. అతనిచేత నీవు నాకనిపిన సందేశార్థము లెవ్వియో వినవలతు "ననుటయు జనార్దనుం డిట్లులనియె." రాజా! ఎఱుంగనివాఁడువోలె నీవిట్లనియెదవేమి? అర్జునా! అదియెట్టిదియో నీవు మీయన్నకు విన్నవింపవైతివా? మీయన్నదమ్ముల గడసుఁదనము లిట్టివియే కదా! ఎఱిఁగియున్న యంశముల నెఱుఁగనట్టులభినయించి యెదుటివానినోటఁ బలికింతురు. కడుపులోనున్న వెల్లఁ బలుకుటకు మీతమ్ముఁడు వెఱ్ఱివాసుదేవుఁడుగాఁడుగదా!" అని పరిహాసోక్తులం బలికి వెండియు నిట్లనియె. రాజా! నీయనుజులకందఱకు నందుముఖ్యముగాఁ గిరీటికి నీచేత రాజసూయమహాధ్వరము చేయింపవలయునని మనమున గట్టిసంకల్పమున్నయది. అది నాతోడ నాలోచించుటకు నీతఁడానడుమ ద్వారక కరుదెంచె. అప్పుడే జరాసంధునకు జంకి నాశరణము వేఁడివచ్చిన కళానందుఁ డందుండినవాఁడు. అపుడు రాజసూయముఁగూర్చి నాయభిప్రాయముం దెలుపుమని పార్థుఁడు నన్నునొక్కియడిగెను. కాని నేను గొన్నినాళ్లు చనిన వెనుక నామతమును దెలుపుదునని వాక్రుచ్చి మీతమ్మునంపితి. నాఁటఁగోలె నేఁటివఱకు నీయాశమునందుఁ బూర్వోత్తర సందర్భములఁ జక్కఁగాఁ బరిశీలించి లాభనష్టములు వితర్కించి స్వపక్షపరపక్షంబుల బలాబలంబులఁ బూర్వపక్షసిద్ధాంతముగఁ దరచి మంచిచెడ్డలరసి తుదకు నయ్యధ్వరము నీవొనర్చుటయె కర్తవ్యమని నిశ్చయించి నామతము నితరులనోటనుండి నీకుఁ దెలుపుటకన్న నాముఖముననె తెలుపుట యుచితమని యెఱిఁగింపవచ్చితి" అనునప్పటికి సభాసదులందఱుఁ బల్లవితముఖులైరి. "వహవా! బావా! క్షాత్రము నిలిపితివి సుమీ" యని భీమసేనుఁడనియె. భగవంతునిచే భరతకులమ

నుగ్రహింపఁబడినదని యర్జునుఁడును "వాసుదేవుఁ డన్యథాసేయఁడ
ని నేనెఱుంగుదు" నని నకులుఁడును, "పాండురాజునకుఁ గొఱంతదీఱె
న" దని సహదేవుఁడు ననిరి. సభనున్న తక్కుఁగల జనము యథోచిత
ముగ నామాటలను మెచ్చుకొనిరి. శ్రీకృష్ణుఁడు తన వాగమృతధారా
వర్షముచేత యుధిష్ఠిరు మనము మెత్తనఁ జేయవలయునని తలఁచి మ
రలఁ దనయుపన్యాసమందుకొని యిట్లనియెను. "రాజా! యీయాగ
మువలన నిహాముంబరముఁ గూడ నున్నది. ఇహమున రాజరాజవై
భూమండలాఖండలుండవై నేలయంతయు నేలుట. పరమున యమలో
కమున వసియించి ఖేదపడుచున్న మీయయ్య యింద్రలోక వాసియగు
ట. అవియటుండ మనకుఁ బెద్దకాలమునుండి పగతురై జగత్కంటకు
లైన క్షత్రియాధములు నిధనమొందుట. ఇది రాజనీతికనుకూలమగు
యోచన. ఇన్నివిధముల నుపయుక్తమగు నీకార్యమును నీవుదక్క నిత
రులు నిర్వహింపనోపరు. కాఱుచిచ్చుల తెఱఁగునఁ దేజోరాసులగు భీ
మార్జునులు గదాగాండీవశోభితపాణులై కవలు కృపాణాలంకృతులై
దిగ్విజయార్థము దిగంతములవఱకు నరుగునపుడు వారినెదిరింపఁ జాలి
కట్టెదుట నిలుచువాఁడెవఁడు. మొనలుదీర్చి నీయనుజన్ములాలమున నిలు
వ విక్రమించి యున్నతఱి వారిఁ గన్నెత్తి చూడఁగలాఁడును విల్లెత్తి వారి
నేయఁగలాఁడును ధ్వజమెత్తి వారిపై నడువఁగలవాఁడును రాజకోటింగలఁ
డె? అన్నియునెఱిఁగి యిట్లనెదరేల. మీభీమసేనుఁడు కుపితుఁడగునేని
ప్రళయకాలరుద్రుఁడు. ధనుఃపాణులలో నగ్రగణ్యులు శంకరరఘురామ
భృగురాములు, వారింబోల్కొనిన వెనుక నీయనుజు శ్వేతవాహనుం బేరు
కొనవలయునుగాని వ్రేలుమడచి యింకొకనిఁ జెప్పఁదగదుగదా! కత్తిప
ట్టిన నకులసహదేవుల కీడెవ్వరుందురు? నివురుగప్పిన నిప్పులచొప్పున నీ
యెదుర వినయనయభయములతో సంచరించు నీతమ్ముల బాహువిక్ర
మములు నీవెఱుంగవుగాని లోకులనుకొనుమాటలు వింటివేని యీవా

జసూయమునకు నీకు సందియమొదవదు. అంతటిపై దోసుల మగఁటిమి యేమి? యింతటి బందుగులబలఁగమేమి? ఈవలఁ దోషనీడలాగు నీక నువర్తనుండనగు నేనేమి? సామాన్యరాజలోకంబు చాడ్పున రాజసూయముఁ గొనర్ప నీవు బెదరు టేమి? చతుస్సముద్రముద్రిత మహీమండలంబునంగల నృపనందనులందఱు నీసేనలదాడికోడి కప్పములు కానుకలు నీకర్పించి చేతులుజోడించి నీయెదుటనిలువ వారిపైఁ జల్లనికటాక్షనిరీక్షణములఁ బ్రసరింపఁజేసి కన్నుసన్నలవారి నాసనములంగూర్చుండ నానతిచ్చుచు బ్రాహ్మణాశీర్వచనఘోషము రత్నాకరధ్వానముమీర ద్రుపదరాజనందనతో రాజసూయమహాధ్వర మొనర్చి పేరోలగమున సకలభూనాయకపరివృతుండవై యుండ నినుజూచి కన్నులకఱవుదీర నానందింపవలయునని నీతమ్ములు నేను నువ్విళులూరుచున్నారము. నీవీ యాగమునారంభింపవేని రాజకులమున కెల్ల నగౌరవమువాటిల్లు. మాకెల్లఁ దలవంపులగును. నీకీర్తి యాచంద్రతారార్కము వెలయఁజేయుటకు భరతకులమునకు వన్నెఁ దెచ్చుటకు లోకముద్ధరించుటకు నిదే సమయము. పితృవాక్యపరిపాలకుఁడవేని, భరతకులాభివృద్ధిఁ గోరెదవేని, రాచపాడి తప్పనివాఁడవేని పౌరుషంబుగలదేని, యభిమానధనుఁడవేని నీయనుజుల దోర్దర్పమెఱుఁగుదేని నామాటయందు ననంతగౌరవము నమ్మకమును నిలుపుదేని యధోగతిపాలైనతండ్రి నుద్ధరింపఁ దలఁపు గలదేని రాజసూయముఁ దప్పక నీవు చేయసమకట్టవలయును. నీవనుమతింతువేని తక్కినయది నేనును భీమార్జునులును జక్కఁజేసెదము. అని యుగ్గడించి యుక్కెక్కించి పలుకుటయు యుధిష్ఠిరుఁడు మహాయశస్సంపాదమునకుఁ గారణమైన యీజన్నము నొనర్చుట యుచితమని యెఱిఁగియు రాజచక్రమున కనిష్ఠముగ నుండునని సందియమొంది వారినడఁపఁదగిన లావు తనతమ్ములయొద్దనుంట తెలియక వాసుదేవుని మాటలకెదురాడనోపక యుయ్యెలలూగు మనముతో నందకుమారునకిట్లనియె "జనా

ర్దనా! నీవుచెప్పినట్లు రాజసూయయాగము భరతవంశమునకుఁ గన్నువన్ని యఁదెచ్చుననుట నిశ్చయము. యుధిష్ఠిరుఁడు సార్వభౌముఁడై మూర్ధాభిషిక్తుల నరిగాపులఁజేయుననుట నిస్సంశయము. కాని కురుదేశమునకుఁ జుట్టుచున్న కడిఁదిమగలగు పగతుఱఁదలంప నాగుండియ జల్లుమనుచున్నది. అవల చండశాసనుఁడగు జరాసంధుఁడుండ నీవల మునఖు బద్ధశత్రులగు శిశుపాలదంతవక్త్రులుండ నింకఁ బోతరించి కన్నుగానని పౌండ్రకవాసుదేవ ప్రముఖులును బుళిందబర్బరయవనవల్లభు లుండ నేనా రాజసూయము దలపెట్టి నెరవేర్చుట! కుబ్జులగు నాతమ్ము లెంత బలవంతులైన వారిమీఁది కనుపఁజాల. ఒకవేళ నేనది సేయసమకట్టినను నిన్నుఁజూచుకొని నేనట్లు చేయవలయునుగాని సహోదరులంగాంచికాదు. నాదొరతనముంబట్టికాదు. ఈకార్యమెత్తఱఁగునైన దీర్చి పితౄణముం దీర్పఁదలఁచుచుంటి" అనవుడు చిఱునగవు నగుచు వాసుదేవుండిట్లనియె "రాజా! పగతురబలిమినిదలంచి వగవఁబనిలేదు. నీయనుజుల విపులదోర్బలమునకు నాబుద్ధిబలము తోడుపడునేని యీయాధ్వరము నిర్విఘ్నముగ నెఱవేఱును. శిశుపాలపౌండ్రకవాసుదేవాదు లొక లెక్కలోనివారు కారు. శత్రుపక్షమున కెల్ల శిరోభూషణమై జరాసంధుఁడున్నవాఁడు. భీమార్జునులను నాకుఁ దోడుపంపెదవేని జరాసంధుని నిముసమున యమలోకమునకనిపెదను. వాఁడు పిల్కుమాలినఁ దక్కినవారుక్కుదక్కి కోఱలుపీఁకిన పాములచందమునఁ గూలఁబడుదురు. జరాసంధుఁడైన నిపుడు హంసడిభకులు లేమి ఱెక్కలు తెగిన పక్షివలెఁ బడియున్నాఁడు. ఈవిషయమున సందియమొందక మాకనుజ్ఞయిమ్ము. ఆమగధేశ్వరుని గుట్టుమట్టు నాయెఱింగినంతవట్టు నీకుఁ దెలిపెదను విను," మని యాతని జన్మవృత్తాంతము గిరివ్రజపురముఁ జొచ్చునుపాయముఁ గళానందుఁడొనర్చు సాయమును జెప్పె. ధర్మరాజు నవియెల్ల విని యెట్టులో యుద్యమమునకు సమ్మతించెను. శుభముహూర్తము నిశ్చ

యించి భీమార్జునసమేతుఁడై శ్రీకృష్ణుఁడు గిరివ్రజపురమునకు జరాసంధసంహారముకొరకుఁ బోవ నిశ్చయించెను. అంతట సాయంకాల మగుడు కొలువు చాలించి యుధిష్ఠిరుఁడు మందిరముం జేరెను.



## తొమ్మిదవప్రకరణము.

" నెచ్చెలీ! అనుదినమును రేయును బవలు ననుభేదము లేక యిట్లునీవు కన్నీరు విడుచుచు వాపోయెదవేని యీదుఃఖవృష్టియు పూచు పూవులవలెనె కంటఁ బుప్వులుపొడమి దృష్టికి భంగము కలిగించును. మహారాజు మీాతండ్రిని చెఱఁబెట్టినాఁ డన్నంతమాత్రమున నీవు ని రాశనొందవలసినపని లేదు. భక్తవత్సలుఁడగు పరమేశ్వరుఁడు తన్నే వెరయు నమ్ముకొనిన మనకు నించుకయుపకార మొనర్పంగాని యుపేక్షింపఁడు. నీవన్నపానీయములను నిదురను రోసి కడుఁదూలి చెన్నే చెదరి చిక్కి సగమైతివి. నిన్నంగని మాయమ్మ యెడల నూపిరిలేకయున్నది. నీకుఁ దండ్రిపైఁగల కూరిమి యలోకసామాన్యమని నేనెఱుంగుదును. అయినను నీవిట్లు దుఃఖించిన మాత్రమున జరాసంధుఁ డాయన ను విడుచునా! కావున భగవంతునిపై భారమువైచి యుండుము. నా మాటవిని శాంతింపవమ్మా!" అని రాగలతిక యెంతయు వదరుచున్న సౌందర్యతిలక నూఱడించి కన్నీరుదుడిచి, యామె యన్న మక్కఱ లేదని యనుచున్నను బతిమాలి యెట్టెటో భోజనమునకుం గొంపోయెను. ఆగుహోత్తమయు రెండుమెతుకులు కతికి తన కాదినమునఁ బట్టరాని విట్టలమట కలుగుటచే దాని నాఁపఁజాలక రాగలతికను సంతోషపెట్టుటకై భోజన మాయినదనిపించి మగుడ మేడమీాఁదకిఁజని సెజ్జపైఁ గూరుచుండి పెద్దపెట్టున నేడ్చి రాగలతికం గౌఁగిలించుకొని " యోసీ! ఇంక నా బాంధిని బ్రాణములుండఁజాలవు. మాయయ్య మొగముఁ జూపుము.

హా! తండ్రీ!! నేను నిన్నువిడిచి యెట్లుజీవింపఁగలుగుదును? ఇంచుకయే ని యలమట నేనొందఁ జూడఁజాలవు, నేఁడింత పెనువగ పాలుసేయుట ధర్మమే? హా దురాత్మా! జరాసంధుఁడా! ఎందఱికై నను మరణము సం ప్రాప్తమైనదిగాని సకలరాజకులమునకు, మహీమండలమునకు నెగ్గుసే యుచున్న నీకుమాత్రము చావురాకున్నది. తండ్రీ! నిన్ను నాకూ్రరుఁ డు భైరవదేవునకు బలిగా నొసంగక విడిచిపుచ్చునే? మరల మాయప్ప యెప్పటియట్ల నాకంటఁబడునే? ఇంతటి మందభాగ్యురాలికా యంతటి యదృష్టము? మగధరాజుచేతఁ జిక్కినచుట్టములు దక్కుట యెంతటి యదృష్టవంతులకు? ఛీ! నాపాడుపెండ్లి మాయప్పమృతికిఁ గాఁబోలు సంభవించినది.” అని నానావిధముల విలపింపఁజొచ్చెను. ఆబాలిక ధ్యానసముఁగాంచి రాగలతిక యడలి యాత్మగతమున “దైవమా! దీనికిని నాకును బుణముదీఱినట్లున్నది. ఇంతదుఃఖముతో నీపె జీవించు నను నమ్మకము నాకులేదు. ఈయతివమనసుఁ దండ్రిమీఁదనుండి త ప్పించుట కుపాయమొండు తోఁచిన బాగుండును. అప్పుడుకాని యీా మె మాకు దక్కదుగదా!” యని వితర్కించుచుండెను. ఇట్లుకొన్ని దినములు గతించె. కాలముగతించుకొలఁది నెవ్వరికైన దుఃఖము వె సుకపట్టునుగాని యీాబాలికకె దుఃఖము చెట్టువలె వేళ్లుపాఱి నాటు కొనియెను.

ఎడతెగని పితృవియోగముచేత నాయిందువదన యిట్టు లగ్గలమ గు నుమ్మలికమునొందుచు నానాఁటికి నెక్కుడుకార్శ్యతనొంది తల్లికి, నె చ్చెలులకుఁ, జుట్టములకు నత్యంతభయావహమగు నవస్థనుండ నొక్క నాఁ డుదయమున వారందఱుఁ గూడుకొని యీామె ననునయించుచుండి రి. అపుడు నడివయస్సుననున్న యొకమనుష్యుఁడు వీధివెంబడిఁబోవుచు నాలుగైదు గుమ్మములెక్కి యియ్యది చంద్రపాలుని యిల్లగునే యని యడుగఁజొచ్చెను. మేడమీఁదనుండి రాగలతిక యప్పురుషుని గనుం

గొని క్రిందికి దిగివచ్చి తమయిల్లుగానక యిట్టట్టుదిరుగుచున్న యా పురుషుంజేరి "యిదియే చంద్రపాలుని గృహ" మనిచెప్పి లోనికి ర మ్మని పిలిచి మేడమీఁదికిం గొనిపోయెను. అతనిం గాంచి యచ్చటి వారెల్లఁ గూరుచుండుమని యాసీనుంజేసి వానివృత్తాంత మడిగిరి. అనుగుటయు నాతఁ డిట్లనియె. "నావృత్తాంతమున కేమికాని మీకొ క్క మేలువార్త నెఱిఁగింపవచ్చితిని, చంద్రపాలుఁడుగా రెందున్నవా రో నాకుఁ జూపవలయు" నన వారందఱుఁ గన్నుల నీరొలుక నూర కుండిరి. ఈమనుష్యుఁ డాయాలాపములఁబట్టి "పూజ్యుఁడయిన చం ద్రపాలుఁడు మఱియొకలాగయ్యెనా! పాపము వాని గాదిలిపుత్త్రియై న సౌందర్యతిలక యేది" యని యడిగెను. రాగలతిక వానికుత్తరము గా నిట్లనియె. అయ్యా! ఆయన మఱియొకలాగు గాలేదు. జరాసం ధమహారాజు వారిం గారణాంతరమునఁ జెఱనుంచె. ఈమెయె యాత ని ముద్దుకూఁతురగు సౌందర్యతిలక" యను పలుకుల కాతఁడించుకచిం తించి "యిక్కడనున్న వారందఱు మనకాప్తులేకదా ! పరులెవ్వరును లేరుగదా! "యని యడిగి యందఱు మనకాప్తులేయని రాగలతిక ప్ర త్యుత్తర మొసంగినయనంతర మిట్లనియె. "ఈసౌందర్యతిలక ప్రాణము లకుఁ బ్రాణమయిన కళానందుఁడు నారాయణుని కృపవలన నెట్టెటో చేదిరాజు చెఱనుండి దాఁటి బైటఁబడి యిచ్చటికి వచ్చియున్నవాఁ డు. మీకు సమ్మతియయ్యేనేని నాతని నిందుఁ దోడ్కొనివచ్చెదను. అతని రాకయు నునికియు మీరు గడురహస్యముగా నుంచవలయును." అని యూరకుండెను. ఆపలుకులువిని రాగలతిక "యమ్మయ్య యిఁక బ్రదికినాముగదా" యని కేకవైచెను. అచ్చటివారెల్లరును సంతసించి రి. శ్రవణానందముగావించిన యావచనామృతధారలకు సౌందర్యతిల క యుబ్బి యంతదనుక పానుపుపై మేనుజేర్చి పలుకఁజాలకుండియు న పుడు దిఢాలున లేచి "యేమి! హృదయేశ్వరుఁడు నిశ్చయముగ నీ

గ్రాహ్యముమునం దున్నవాఁడా? రాగలతికా! యీతని కేదయినఁ బారితోషికముగా నీయవే" యని కన్నులనుండి యానందబాష్పములు రాలఁ బరవశయై యుండెను.

చిరకాలమునుండి ప్రియవియోగముచేతను బితృవియోగముచేతను వివర్ణమై దైన్యతం దెలుపు నామెముఖారవిందము కళానందుని రాకచే విచ్చి తెలివొంది యొక వికాసమొందెను. తల్లియు నింటఁగల కొందఱు పెద్దలు నాతనిం దోడుకొనివచ్చిన జరాసంధునివలన నెద్దియేని కీడు మూడునోయని యెంచి తలఁకియు నాతనిరాకచే బాలికయైనం బ్రిదుకఁగాంచునని యీతనిం దీసికొనిరమ్మనిరి. రాగలతికయు నదియుక్తమని శ్లాఘించెను. ఆమహాశూరశిఖామణి మానాయనగారిని గారాగృహమునుండి విముక్తుని జేయఁగల బిరుదుమగఁడు గదా!" యని యబ్బాలిక పలికెను. వచ్చిన యాక్షత్రియవాఁడు వారితో "పగటివేళ నాతఁడువచ్చినఁ గీడుచేయువాండ్లు. ఈరేయి రెండుజాములగు నప్పటికి మేము వచ్చువారము. మీరు జాగరూకతతో మేలుకొని యుండవలయును." అని యిచ్చవచ్చినతెఱఁగునఁ బోయెను. బాలికయు రాగలతికయు మాత్రము సౌధముమీఁద నుండిరి. తక్కినవారు క్రిందికి దిగి యథోచితకృత్యముల నిర్వర్తించుచుండిరి. ఆవేళ నాఁగ రాగలతిక మోమువంక చూపునిలిపి రాగభరితమైన తనయంతఃకరణమును జెలిమికత్తెకు నెఱిఁగింపఁదలఁచి యిట్లనియె. "ఓసీ! నిశ్చయముగ నామానసలోకమన్మథుఁ డీదినమున నిచ్చటికి వచ్చెనేని నాయుమ్మలికయుఁ దీఱినదని యనవచ్చును. అతని వదనసుధాకరమండలమును దర్శించుభాగ్య మబ్బెనేని యాతని వచనామృతధారావర్షమునం దడియునంతటి పున్నముఁ జేసికొంటమేని కొఱంతలెల్ల నడఁగంట భూలోకస్వర్గము ననుభవింపనా! ఆయనపేరు వినినంతనే మంత్రాక్షరములచేతన శించునట్లునాయుల్లమంటయంతయు నెందోయడఁగినది. ఆమోముశందము,

నామేనిసొబగు, నావాలుమాపులు, నాయెలనవ్వు, నానడలహొయలు, నామాటలతీయఁదనము నొక్కసారి మనకుఁదేటపడ నామహాత్మ్యము వచ్చి మనమధ్యమున నిలిచినపక్షమున నింద్రజాలుని చేతికీలు బొమ్మవలె నేను విశ్వమునంతయు మఱచి యానందవార్ధి నోలలాడనే? అబ్బా భగవంతుఁడగు సూర్యుఁ డెంతకుం గ్రుంకఁడేమి? అయ్యో చెలీ! యీదినమున సూర్యుండస్తమించుట యుండునే?" అని కాముకజనముల కుచితమగు నాలాపములఁ జేయుచుండ రాగలతిక నవ్వుచు నెచ్చెలీ! నిజముగ నాఁపరాకచే నీవట్లుండి మమ్ముం దఱుమఱతువు. పొద్దిప్పటియట్లే తిరుగుచున్నది. నీవేగిరిపాటున నీవిట్లు పలవరించెదవుసుమీ!" యని యుత్తరమిచ్చెను. ఎట్టెటో యాదినముమురిగియఁ గళానందుఁడిల్లె యీరేయి చంద్రపాలునిసౌధంబుఁ బ్రవేశించునని యెఱింగించుటకోయనఁ బ్రభాకరుఁ డపరవారినిధియందుఁ గ్రుంకెను. కళానంద సౌందర్యపాలకల హృదయములఁ గ్రిందుకొనియున్న మోహాంధకారము తెలఁగున మహాంధకారము దిక్కులఁ గ్రమ్ముకొనియె. ప్రియులనిమిత్తము తలుపుచాటునుండి మొగములించుక యగపడఁ దొంగితొంగిచూచు సంగనామణుల చాడ్పున నక్షత్రములు మినుకుమినుకుమని కానఁబడఁ జొచ్చెను. క్రమక్రమమున నగరముననున్న జనులు వ్యాపారములుమాని నిదురింపనేగిరి.

ఆకాలమున జరాసంధ శ్రీకృష్ణులకు మిక్కుటమగు పగయుండుటచే ద్వారకానగరమునుండి వేగులవాండ్రు పెక్కు మారువేసములతో వచ్చి గిరివ్రజమునఁగల్లు గుట్టు నెఱిఁగి పోదురను ననుమానముతో మగధరాజు బాటసారులఁ జక్కఁగఁ బరీక్షింపవలయుననియు వారిచర్యలు మాటలు ననుమానాస్పదములుగ నుండునేని వారింబోనీయక యారాత్రి నిలుపవలయు ననియు నారక్షకభటులకుఁ గఠినమైన యుత్తరువుల నిచ్చియుండె. అందుచే ముఖ్యముగా రాత్రులందుఁ బయనముసేయు

బాటసారులను రాజభటులుపట్టి బాధింపక విడుచుటలేదు. టక్కరితనములయందు మహాసముద్రులగు కోరక కాణభూతు లనునిరువుర వెంటఁబెట్టుకొని కళానందుఁడు ద్వారకానగరమును బాసి నిరంతరప్రయాణముల గిరివ్రజమునుజేరి యేరికిం గానఁబడుట కిష్టములేక యూరసందఱుఁ దన్నెఱింగినవారగుట రాత్రి పురముఁ బ్రవేశించి క్రొత్తగా నక్కడకు వచ్చియుండి తన్నెఱుఁగని యొక బ్రాహ్మణుని యింట దిగి మరునాఁడు పగలు కోరకునిచే సౌందర్యతిలకకు తనరాకఁ జెప్పఁబుత్తెంచెను. ఆసందేశము నిదివఱకు మీరలు వినియున్నారు. నాఁటిరాత్రి కళానందుఁడు తత్సేవకద్వయముతోడఁ జంద్రపాలుని గృహముజేరఁ బయనమై యొక్కయెద్దుబండినెక్కి రాజభటులచేతఁ బరీక్షింపఁబడకుండ పోవలయునని యోజించుచు నందుఁ బండుకొనియెను. బండివెనుక కోరక కాణభూతులు వచ్చుచుండిరి. బండివానికి గమ్యస్థానముఁ దెలియఁజెప్పకయే వారు శకటముం దోలించుకొని పోవసాగిరి. అట్లరుగుచుండఁ గొంతకొకయెడ రాజభటు లాబండిని దూరమునఁ గాంచి తమవైపు వచ్చుచుండటఁ జూచి కాణభూతి కళానందునితో "నయ్యా! మీరు మాటలాడవలదు. రాజభటు లిటవచ్చుచున్నారు. దీని కుపాయము నేనును గోరకుఁడును బన్నువార" మని మెల్లగా ననులోపల రాజభటులు సత్వరమున వచ్చిరి. అంతకుమున్న కాణభూతి "హాతండ్రీ! మాగతి యేమిచెప్పితి" వని కన్నీరు దుడిచికొనుచు నేడ్వసాగెను. కోరకుఁడు హా దైవమా! యెంతపనిచేసితి"వని బొమ్మమోదుకొనసాగెను. రాజభటులువచ్చి పొదివి బండినిలిపి "యెవ్వరు మీ రెందేగుచున్నా" రని యడుగ బండివాఁడు నివ్వెరపడి చూచుచుండెను. సేవకులిరువురు పెద్దపెట్టున నేడువఁజొచ్చిరి. భటు లత్యాశ్చర్యముతో దానికిఁగారణము నడుగ వెక్కి వెక్కి యేడ్చుచుఁ గాణభూతి యిట్లనియె. "అయ్యా! యీతఁడు మాతండ్రి, కడువృద్ధుఁడు, వీని నొకగడియ క్రిందటఁ బురుగు

ముట్టుకొన్నది. నోటమాటలేదు. చికిత్సనిమిత్తము విషవైద్యుని యిం టికిం గొనిపోయెదము." అని నేలంబడి యిరుగురును దొర్లి రోదనము చేసిరి. రాజభటు లది నిశ్చయమకా వగచి పొమ్మని సెలవిచ్చిరి.



## పదియవ ప్రకరణము.



పొద్దుగ్రుంకినది మొదలు రాగలతిక తనచెలి వసియించు మందిరము నెంతయు నలంకరింపందలంచి పెక్కుదీపములు పెట్టించి పట ములు బొమ్మలుః మొదలగువానినుంచి యింక ననేకములగు చిత్రము లం దేరంబంచి తనచెలి హృదయమునుండి నెవ్వగను బాపినచందమున మందిరముననుండి మాలిన్యముందుడిచి పాఱవైచి యామె మొగము చందమున మందిరముగూడం గను విలాసవంతముగ నగపడం జేసెను. అంతలో నిలువక సౌందర్యతిలకకుం గమ్మసంపంగినూనెతోం దలదువ్వి జాళువాపసిడినగలు విలువకెక్కు రతనాల సొమ్ములు పెట్టి కైసేసి యొంతటి నియమముంగైకొన్న విరాగిమనసున్నైనంగలంపం జాలి కాముని చేతి బాకుచాయనున్న తనచెలిసోయగముంజూచి తానెయక్కజమం ది దృష్టిదోషము దగులునను భయమునం బలుమాఱు లాచాయం జూడమానెను. భోజనానంతరమునం గొంతసేపు కూరుచుండి తల్లియు నితరబంధువులును మేలుకొనం జాలక లోనికరిగి నిదురించిరి. సౌంద ర్యతిలకయు రాగలతికయు నిదుర యనుదాని నెఱుంగక తెప్పవాల్ప కయుండిరి. చీమచిటుక్కుమన్నం బ్రియుండరుదెంచినాండనుగదాయని కల వరమొందుచు నట్టిధ్వనికిం గారణమరసి రమ్మని రాగలతిక నంపుచు, నిముస మొకసంవత్సరముగం గడపుచుం దీవ్రమైన యుత్కంఠతో నా యిందుముఖి యెద్దియుందోంపక కాముకజనమున కనుభవైక వేద్యమ యిన మనశ్చాంచల్యమునకు లోనై యుండెను. జాముబాత్రియైనది

మొదలుగ రాగలతిక చంద్రశాలనుండిదిగి కవాటమునొద్దఁ గూరుచుం డి, మార్గమున నెవ్వరుపోవుచున్నఁ దలుపుఁదెఱచి కనుంగొనుచు నెంత యేని మెలఁకువతోఁ గావలియుండెను. ఇంతలో నొకశకటము దడదడఁ బరుగెత్తుకొనివచ్చి తమయింటి ముందర నిలుచుటయు, నందుండి యొ కపురుషరత్నము వెడలి వచ్చుటయు, వానివెంట నిరువురుసేవకు లుం డుటయు, వారు బండివానికిఁ గొంతసొమ్మిచ్చి వానినంపి, పిమ్మటలో నికి రాఁబోవుటయుం గాంచి రాగలతిక తలుపుఁదెఱచెను. వారుమువ్వురు ను మాటలాడకయే లోనంబొచ్చిరి. ఆరాగలతికయుఁ బలుకకుండ క వాటము బంధించెను.

రాగలతిక కళానందుని గుర్తుపట్టి "అయ్యా! జ్ఞాపకమున్న దా!" యని యడిగిన నాతఁడు లేనగవు మొగమునఁ దోఁప "నాకేల జ్ఞాపకముండకపోవు" నని యుత్తరమిచ్చెను. పిమ్మట కొరకశాణాభూ తుల కిరువురకుఁ బండుకొను నిమిత్తము చెఱియొక పక్కచూపించి యం దు విశ్రమింపుఁడని వారితోఁ జెప్పి కళానందునిజూచి "దేవరవారు మే డమీఁదికి వేంచేయవలయునని చిఱునగవుతో మెల్లన ననియెను. తా ను ముందునడువ నారంభింపఁ గళానందుఁడు నెంటఁ బోవుచుండ శకట ము తమ వాకిట నిలుచుటయు లోనగుసందడి యెఱింగి సౌందర్యతి లక యెన్నఁడరముగాని యానందముతో మేడమీఁదనుండి యామహా త్మునిఁ జెపుడుతనకనులకఱవు దీర్చునని యువ్విళు లూరుచుండె. రాజ నందనుఁడు సోపానములు మెల్లమెల్లగ నెక్కి మీఁదికి వచ్చుచున్న ధ్వ ని నాలకించుటతోడనే తీవ్రమైన యుత్కంఠచే నీసుందరాంగికి గుం డియలు కొట్టుకొనసాగెను. అంత నారాజకుమారుఁడు మహానంద భ రితహృదయుఁడై తానంతిదనుక నెక్కటొక్కటిగ దాఁటివచ్చిన పెక్కు చిక్కుల చాప్పున మెట్లుదాఁటి వచ్చి కట్టెదుటఁ దనపై జరానంధున కసూయపొడముటకుఁ గారణంబై చిరకాలమునుండి హృదయస్థితమై

నేఁడు తనమనోరథము ఫలించిన చాడ్పునఁ బ్రత్యక్షమై దీపికా మధ్యమున నిరుపమానదీధితుల వెదలఁజిమ్ముచు జగన్మోహనావతారమో యని భ్రమఁ గలుగఁజేయు నామందయానం గనుంగొనియె. కనుఁగొని లావణ్యామృతము స్రవించు వదనసుధాకరమండలమును, సిగ్గునృత్యముచేయుచున్న విశాలపుండరీకలోచనములును, విరహవ్యథాగ్నిజ్వాలచేఁ గృశించి వన్నియదేరిన నెమ్మేనిబంగారుచాయయు, నిచ్చవచ్చిన తెఱఁగున ననుభవింపుమని రెండుకన్నులు నొప్పించి తాను నివ్వెరపడి నిలువఁబడియె. అబ్బాలికయు రాకొమరుఁడు లోనికి వచ్చుచుండ మొగమునందము కొంతసేపు సోగకన్నులమురిపెముఁ గొంతసేపు వెడఁదఱొమ్ముపేర్మిఁ గొంతసేపు దీర్ఘబాహులపొలుపుఁ గొంతసేపు తనివితీరియుఁ దీరనట్లు గనుంగొని యాతండు డగ్గఱినతోడనె సిగ్గుపెంపునఁ దలవాంచి మేలుతూపులఁ బోలు వాలుచూపుల కందనంతవఱకు నానృపకుమారుని లావణ్య మనుభవించుచుండెను. రాజకుమారుఁడు నివ్వెరపాటు తన్ను విడిచిపోవుటయు రాగలతికతో నెద్దియో మాటలాడ నుంకించుచుండ నింతలో యొకపీఠము వైచి నామె వానినం దాసీనుంగమ్మని ప్రార్థించెను. ఆవేడికోలు నంగీకరించి కళానందుఁడు పీఠముపైఁ గూర్చుండె యేరితో నపు డేమనుటకుఁ దోఁపకునికి నూరకుండెను. పరస్పరాలోకనముల నెంతయుఁ దనివిదీర్చుకొనుచున్న యాపనుచువాండ్రు నిరువురను జూచి యామెకన్న నాతఁడె చక్కనివాఁడో వానికన్న నాయమ చక్కనిదియో నిశ్చయింపఁజాలక యట్టియసమానరూపసమేతములగు వారిశరీరములు పార్వతీపరమేశ్వరులలాగున నెన్నండేని దాంపత్యవిధిచేఁ గలసికొను భాగ్య మబ్బునే యనుకొనుచు నింతటి చక్కఁదనము విధాతసంఘటింపం జాలెనో యని యక్కజ మొందుచుండెను. అంతఁ గొంతసే పందఱు నూరకున్నఁ గళానందుఁడు రాగలతిక నుద్దేశించి “ మీచెలి సుఖము గానున్నదా ? పాపము పూజ్యులైన చంద్రిపాలునకు నేననుకొనినట్లె

కష్టము సంభవించినది. అయినను మీరు వగవఁబనిలేదు. స్వల్పకాలమున మీయప్ప మఱల మీకగపడఁగలఁడు" అని పల్కెను. ప్రియుఁ డూరడించుచుండ నామెలనాఁగకుఁ దండ్రివృత్తాంతము జ్ఞప్తికివచ్చెను. కనుగొలఁకులనుండి వెచ్చని బాష్పము లురల నామించుఁబోఁడి యించుక దుఃఖింప నప్పటికి హృదయముకరఁగి కళానందుఁడు నిజపీఠమునుండి లేచి యాచివురుఁబోఁడి దగ్గఱకుఁజని కన్నీ రుత్తరీయాంచలమునం దుడిచి వగవవలదని బుజ్జగించి చల్లఁదనమునకు తావగు నామె పాణిపద్మముం గేలఁ బట్టి తన సమీపమునం దొకపీఠముపైఁ గూరుచుండఁ బెట్టుకొనియెను. ఆకరస్పర్శసుఖముచేత వారిరువురును హాయిహాయి యని యానందమనువెల్లువను మునింగిరి. అంతకు మున్నెవ్వ రెట్టిభంగుల నూఱడించినను బితృవియోగ దుఃఖమునుండి తేరని యాయబల ద్రాక్షపండులఁబోలు ప్రియవచోరచనలచే నాశ్వాసింపఁబడి నెవ్వగమాని తత్కరస్పర్శనమున నలమట యెటకేనియుంబోవ సంతోషాయత్తచిత్తమున నుండెను. రాజనందనుఁడు సలిపిన యాయాదరణముచేఁ గొందొకపరిచయము జనవు గాంచి యాకలికిమిన్న మును దన్నలమినసిగ్గుపెంపునువిడిచి తలయెత్తి యాతఁ డడిగినమాటల కొకవిధముగా నుత్తరమొసఁగుచు మరల నొక్కయెడ లజ్జించుచు ననేకావస్థలకు లోనై యుండి నడుమ నొకసారి యిట్లనియె. "రాగలతికా! ఈమహాత్ముఁడు మనపురము బాసినది మొదలు నింతదనుక నెందెందువసియించె నేమేమి యొనర్చె నదియెల్ల నీవు వినుట కుత్సహింతువని తలంచెద." అనవుడు రాగలతిక తచ్చరిత్రము నెఱుఁగఁజెప్పుమని వేఁడుకొనియెను.

ప్రియురాలి నోటనుండి యంతమాత్రపుమాట వెలువడునా యని కనిపెట్టుకొనియున్న ప్రియుఁ డామెయానతి శిరసావహించి యిట్లనియెను. "కరుణాద్భుతరసములకునికిపట్టగు నాచరిత్రము నంతయు మీకుఁ దెలిపెదఁగాని ముదుసలివైనను నామీఁదనే తన యాసలెల్లనిలిపి

నాకయి కంటికి నేలకు నేకధారగా నేడ్చు మాయమ్మ జీవముతో నున్నదా! పుత్రశోకపీడితయై మందభాగ్యురాలగు నామె నిరాశచే బెంగపెట్టుకొని మాతండ్రింగలసికొన్నదా! ఆవార్త ముందుగా నెఱింగించి నాసందియము నాఁపవలయును." అని దీనాననుండై యడుగుటయు రాగలతికాగుణోత్తమ లైకకంఠ్యముగ ధారుణీదేవిగారు గుశలముగానున్నారు. రేపటియుదయమున మీకామెదర్శనము రహస్యముగ నగునట్లుచేసెద" మని యుత్తరమిచ్చిరి. ఆపలుకులువిని సంతోషితాంతరంగుఁడై యాకుమారపుంగవుఁను తనయుదంత మెఱింగింపఁదలఁచి యిట్లనియె.

"కళ్యాణీ! నాపాలి పెన్నిధియు నానోఁచిన నోములపంటయు నాయదృష్టదేవతయు నగు నిన్ను జరాసంధుఁడు రణార్ణవున కిప్పింపఁదలఁచినవార్త నాచెవింబడియె. అయ్యదివిని నేను శ్రీకృష్ణసహాయమున నామనోరథసిద్ధి నొందఁగలనని ద్వారకానగరమునకుఁ బోవసమకట్టి యాదవ్వుపయనము మాయమ్మవినిన నప్పుడ మృతినొందునని పాటలీపురమునకుంబోయి వచ్చువాఁడనని" యామె సెలవుగై కొని ద్వారక కరిగి నందనందన చరణారవిందముల సందర్శించితిని. అతఁడు నాకభయహస్తమొసంగెను. అందుచేతనే కాదె యచ్చటనుండి నీకు మొగలియాకుటుత్తరము వ్రాసి యొకసన్యాసి కిచ్చి పూలవర్తకున కిమ్మని" యనిపితిని. అది మీకందెనేమో నేనెఱుఁగ. నాఁడు గోరువంకను నేను దెచ్చి నీకిచ్చినపుడ నాచిత్తము నీయందుఁ దవుల్కొని యెంతమరల్చిన మరలదయ్యె. ఆప్రథమదర్శనముకాని రెండవమాఱు మనముకలసి ముచ్చటింప నవకాశమొదవదయ్యె. కాని నాగవల్లి రెండుమూఁడు సారులు నాకడకరుదెంచి నీడెందము కళానందునిపై హత్తియున్నదని శ్రవణానందముగఁ జెప్పి నన్ను గృతకృత్యుని జేసినది. అట్లు నాగవల్లిముఖమున నీమనసు జాడకట్టియే కాదే నే నుత్తరమువ్రాయ సాహసించితి"

అని నుడివి యనంతరము తాను ద్వారకనుండి బయలువెడలుటయుఁ గృష్ణసందేశము నింద్రప్రస్థపురమునఁ బాండవాగ్రజునకు విన్నవించుటకుఁ దానరుగుచుండ మార్గమధ్యమున శాత్రవణుఁడు మృతినొందుటయుఁ దన్ను జేదిరాజు సేవకులు చెఱబట్టుటయుఁ దానక్కడఁ బెక్కుసిలుగులఁ బడుటయుఁ గొన్నినాళ్ళకు జరాసంధునిపాలనుండి జాతవేదుఁడువచ్చి తన్ను వెంటఁబెట్టుకొని వచ్చుటయు మార్గమధ్యమునఁ దాము దారితప్పి ద్వారకకుఁ బోవుటయు నచ్చట నందకుమారుఁడు దన్ను విడిపుచ్చుటయుఁ దాను గోరక కాణభూతులతో వచ్చుటయు లోనగు చరిత్రమెల్ల యిందుమతీచరిత్రాద్యుపాఖ్యానములతో రసపుష్టిచేసి చెప్పి గుణోత్తమకు రాగలతికకు నాశ్చర్యము శోకమును గలిగించి కట్టకడపట నంతకుమున్న మాయాసముద్రములగు కోరక కాణభూతులు తన్ను బండిలోఁ బరుండఁబెట్టి రాజభటులకుఁ దెలియకుండఁజేయ వారు పన్నినయుక్తి నుగ్గడించి కడుపులు పగులునట్లు వారిని నవ్వించెను. ఆ నవ్వులయినవెనుక మరలఁ గళానందుఁడు సౌందర్యతిలక మొగమువంకఁ దన నెమ్మొగముఁ ద్రిప్పి యిట్లనియె. “ఓమంజువాణీ మండువేసవియం దాముటేనుఁగు చల్లనినీరుఁ దెచ్చి జఠరమునందు నిలువయుంచుకొని తాప మెక్కుడయినతఱి నానీరు నాసానాళములను బీల్చి పయినఁ జల్లుకొని సుఖించునట్లు మన తొలికలయిక నాఁడు నీవు నాపైఁ బ్రసరింపఁజేసిన వాలుఁజూపులు, లేతనగవులు, సిగ్గుపెంపులు, గారాబుమక్కువలును జ్ఞప్తికిఁ దెచ్చుకొనియేసుమీ సంతాపము నొందునపుడెల్ల నేనూఱటనొంది యిన్నినాళ్ళు ప్రాణములు మేనిలోనుంచుట. శిశుపాలునివీట నాపడినయలమటయు మార్గమధ్యమున నన్నలయించిన మనఃక్షోభము, జరాసంధుని కతనంగల్గిన యలజడియు నేఁడుగదా నీముఖారవింద సందర్శనమునను నయనారవిందకటాక్షవీక్షణమునను గరారవిందసంస్పర్శనమునను దీఱె తాపత్రయశూన్యుఁడగు ముకునిచందమున

హాయిగా నున్న వాఁడను." అనిచెప్పి యూరకున్న కళానందునితో మెల్లమెల్ల రాగలతిక తానంపిన మొగలియాకుజాబు సన్యాసి పూలవర్తకున కొసఁగుటయు నాతఁడు నాగవల్లి కిచ్చుటయు నది పేదముసలివాని నిమిత్త మొరులకు దానినొసఁగక విక్రయించుటయు దానికై తాను నెవ్వగఁబొందుటయు నాగవల్లి యిల్లువిడిచి భయంబున నెందేని జనుటయు నెట్టకేలకు యోగిని దానిం దమకుఁ బంపుటయు నాదిగాఁగల వృత్తాంతముం జెప్పి యిట్లనియె. "నేఁడు మాచెలి మిమ్ముఁ గాంచినకతన బ్రదికినది. ఇది మీయది. మీనిమిత్తముకాదె యట్టితండ్రి చెఱలోనుండుటకయిన నంగీకరించినది. ఇంక మీరెందు నరుగవలదు. పూజ్యులయిన చంద్రపాలుఁడు క్రమ్మఱవచ్చి మీవివాహము సేయునంతవఱకు రహస్యముగ మీరిందుండవచ్చు. మిమ్మువిడిచి మాచెలి క్షణమేనియు మేన నుసుఱులు నిలుపనోపదు" అని చెప్పిన సౌందర్యతిలక తలవంచి నాచెలి నాహృదయమునం దున్నదానికన్న వ్యతిరేకమేదియుం జెప్పలేదు. చెఱనుండి మాతండ్రిని మనోవ్యధనుండి నన్నును విముక్తులను జేయుటయె యార్యపుత్త్రుని పనులని నాకుం దోఁచుచున్నది" అనిపలికెను.

ప్రాణేశ్వరిహృదయము తనకుఁ దెల్లమైనందులకు మహానందభరితుఁడై కళానందుఁడును, ప్రాణనాయకుమనము తెలిసినదను సంతసముచేతఁ గుతూహలాయత్తచిత్తయై సౌందర్యతిలకయు సంతృప్తమానస్కులై చాలప్రొద్దాయెనని యారాత్రి నిదురింపఁదలఁచిరి. అంతట హంసతూలికాతల్పముమీఁదఁ గళానందుఁడు పవ్వళించి గుండియపైఁ జేయి వేసికొని నిద్రించెను. సౌందర్యతిలకయు రాగలతికయు వేఱొకపాన్పుపై నిద్రపోయిరి. మఱునాఁడు తెపకడ రాగలతిక పడకవిడిచి ధారుణీదేవియొద్దకుఁ బోయి కమురహాస్యముగఁ గొడుకురాకఁ జెప్పి యామెం దోడుకొనివచ్చి చిరకాలవియోగవ్యధచేఁ బీడితులగు తల్లిని గొడుకును గలపెను.

వారొండొరుల గౌఁగిలించుకొని కన్నీరు వెట్టుకొని యింకను దుఃఖించి కొంతవడి కూరడిల్లి యొండొరుల కష్టసుఖములను జెప్పుకొనుచుఁ గూరుచుండిరి. చంద్రపాలుని భార్యలోనగువారు కళానందునిఁగాంచి సంతసించి వానితల్లినిఁగూడ నందె యుండుమని ప్రార్థించిరి. ధారుణీదేవియు నందుల కియ్యకొనియె.

ఇట్లు చాలాకాలమున కైన వారికలయిక సార్థమగునట్లు పలుపిండి వంటలుగల విందులచేతను, వాసనాపానములచేతను, లీలోద్యానవిహారములచేతను, శ్రావ్యవీణాగానముచేతను, వివిధ కథాప్రసంగములచేతను, చమత్కార వచోరచనలచేతను, పరస్పరవిలోకన కుతూహలముచేతను సొగటాలుమొదలగు నాటలచేతను, జిత్తరువులుమొదలగు విన్నాణములచేతను దినమొక్కనిమిసముగఁ బ్రొద్దులుపుచ్చుచు సకలమనోవ్యథలు మఱచి తమ్ముఁదామె మఱచి ప్రపంచమే మఱచి యాజవరాలును రాకొమరుఁడును వేడుకల వెల్లిని మునిఁగి తేలుచుండిరి.



## పదునొకొండవ ప్రకరణము.



గిరివ్రజనగరమున జనులందఱు నొకనాఁడు మిగుల నద్భుతరసమున మునిఁగియుండిరి. ఇది పరమాశ్చర్యమనువారు నిట్టి లెన్నఁడే యుగమునఁ గనివినమనువారు, నిది మాయయనువారును, మాయయైన నిన్నినాళ్లు డాగునే యనువారు, నీసాక్షితో నిజమంతయుఁ దెలియుననువారుఁ దేలుట కేమున్న దిట్టివానియందుఁ దమకు విశ్వాసము లేదనువారు నై ప్రజలు గుంపులుగుంపులుగాఁ గూడి ముచ్చటలాడఁజొచ్చిరి. శర్వాణీ ప్రసాదమున నాగతానాగతములనెల్ల నెఱిఁగి తన్నడుగవచ్చిన జనులకుఁ దెల్పి దివ్యమైన తనప్రజ్ఞ లోకమునఁజాటి కొండొకకాలముక్రిందట

నంతర్ధానమునొందినయోగిని క్రిమ్మరఁ దత్పురమునఁ బ్రవేశించుటయే యీకలవరమునకుఁ గారణమని చదువరులూహింపవలయును. చాలకాలముక్రిందటఁ దనయొద్దనుండి మహారాజుగారి ముద్దుటుంగరమును, దనకు బ్రయత్నముగ లభించిన మొగలియాకుజాబును గైకొని కైలాసమునకుఁ బోయివచ్చెదనని చెప్పి యరిగినయోగిని వెండియుఁ దమనిమిత్తము వచ్చినదని విని రణార్ణవుఁడు తనవిశ్వాసము ముమ్మడిగా నాశుభవర్తమానము నుజరాసంధునకు విన్నవించి యాతని యనుమతిఁబొంది మఱునాఁటి రాత్రి తద్దర్శనార్థమేగెను. యోగినియు మున్ను దాను వసియించిన చోటనె బసచేసియుండి తనశుశ్రూషనిమిత్తము వెనుకఁ దన్ను సేవించిన దానిని రావించి తన్ను బ్రశ్నములడుగు వారలకుఁ గానఁబడకుండ నెప్పటియట్ల యవనికచాటున నుండియె యుత్తరములు చెప్పుచుండెను. ఆమహానుభావురాలు తన్నగరమునకు వేంచేసిన నాఁటిరాత్రియుఁ మరునాటిరాత్రియుఁ దమభావిశుభాశుభములఁ దెలియఁగోరి బహుజనులువచ్చి యామె నడిగి తృప్తినొందిన యంతరంగములతో నరిగిరి. అందఱు జనిన వెనుక రణార్ణవుఁడు కడుసాగసు మిగులు వేషముతో నరుదెంచి పరిచారికచేత సన్మానింపఁబడి యొకపీఠముపైఁ గూరుచుండి యొకగడియసే పూరకుండి యనంతరము వినయవయభయచేతస్కుండై చేతులు జోడించి యిట్లుల నియెను, "ఓమహాదేవి! నీవు సాక్షాత్పార్వతీమహాదేవివి. నీచరణారవిందములను గన్నులపండువుగఁ గనుఁగొన్నవారికి మరల జన్మదుఃఖములుండవు. కొందఱు మొఱకులగు జనులు నీవు రాక్షసాంగనవనియు మమ్మువంచించిపోతివనియును వచింపరానిదుష్ప్రలాపము లాడి దోసము మూటగట్టుకొనిరి. ఇంతటి ప్రజ్ఞానిధి మహిమాఢ్యవైన నిన్నట్టు లనుటకు వారినోరెట్టులాడెనో తెలియదు. నీవు కైలాసముననుండగా నచ్చట నేమిజరగినదో మావిషయమై యేమివచ్చినదో తెల్లముగ నెఱిఁగింపవలయునని దీనముగఁ బ్రార్థించెను.

భయమును భక్తియు విశ్వాసమునుగల యాప్రార్థన చెవిఁబడుటయు యోగిని తెరచాటుననుండి రణార్ణవున కగపడకయే కెవ్వుననఱచి పండ్లు పటపటఁగొఱికి మహాగ్రహాయత్తచిత్తుఁడై యిట్లులనియె. « హా దురాత్ములారా! పౌరజనపదహాతకులారా! మందభాగ్యులరగు మీరందఱు నామహాగ్రహమునంజేసి హతాసులైతిరిరా! ఏమేమి! మేము వంచనార్థమై వేంచేసితిమనియు రాక్షసాంశమున జనియించితిమనియుఁ గొందఱు దురాత్ములు కాఱులఱచిరా! ఆపాపాత్ములెవ్వరో యెఱిఁగింపుము. ఆదుష్టకష్టజనంబుల నీక్షణమే మదీయదారుణ శాపోపహతులఁ జేసెద. చెప్పవేని నిదెచూడు పురాంతక మురాంతక బలాంతకు లడ్డవచ్చి ననుసరే యీమగధరాజ్యమును మహారణ్యము గావించెదను. ఈగిరివ్రజపురము భస్మీభూతము గావించెదను. ఈజనమెల్ల మహానరకకూపములఁ బడునట్లు మదీయయోగసంపాదితమగు మహామహిమావిశేషమున శపియించెద. అట్లు ప్రజలు ప్రేలుచుండ నీవు నీరాజు నేమైరిరా? మీరాజు పశువా? నీవుపశువువా! వారినిహరించి శిక్షాభాజనులను జేయలేదా! ఇదెచూడు సకలజననిర్మూలనమునకై సంకల్పించెదను. « అని మహానాదముగల యొకగంట గణగణవాయించి « ఓం భైరవాయనమః, చండీశ్వరాయనమః, రుద్రాయనమః, మహాకాళేశ్వరాయనమః, త్రిపురాంతకాయనమః" యను రుద్రనామస్మరణ జేయునప్పటికి రణార్ణవుఁడు మహాభయావేశమునఁ బెదవులెండిపోయి మాటరాక యుండ మేనెల్లఁజెమ్మటగ్రమ్మ గడగడవడఁకుచుఁ జేష్టలుదక్కి యుండెను. పరిచారిక యింతలో లోనికరిగి « అమ్మా! పాపమీతఁడు మీకుఁ గడుభక్తుఁడు. వీనినెట్లయిన సైరింపవలయును. కడుదీనుఁడై చేష్టలు దక్కియున్నవాఁడునుఁడీ!" యని మనవిచేసి యీవలకువచ్చి రణార్ణవునితో « నోయీ యామెపాదములపైఁ బడి శాపోపహతులరు గాకుండ నిన్నును నీరాజును రక్షించుకొను" మనియెను. అతఁడును లేచి యుత్తరీయము విండకుఁ

జుట్టుకొని యామెయడుగులు తెర కీవలనుంపుమని ప్రార్థించి యామె య టుసేయ నాచరణంబులంబట్టుకొని భయమున వడఁకి యేడ్చి క్షమించితినని యోగిని యనునంతకును విడువకుండెను. యోగినియు వానిని క్షమించి ప్రసన్నయై యనంతరము వానితో నిట్లనియె. "ఓయీ! నాకలుకవొడ మించినవా రిక్కరకురారు. నాదయకుఁ బాత్రులగువారు మహదైశ్వర్య ముల ననుభవింతురు. నేను మీరాజ్యమున కత్యంతహితము నాపాదిం పఁ దలఁచుచుంటిని. నేను కైలాసమునకుఁ బోయినపుడచ్చట జరిగినచి త్రములు వినుము. భక్తవత్సలుఁడగు శంకరుఁడు భవానీసమేతుఁడై యొక నాఁడు కైలాసముమీఁదఁ బ్రమథగణములు, వేలుపులు నింద్రాదిదిక్పాల కులు నారద వశిష్ఠ జామదగ్ని మార్కండేయప్రముఖులగు జడదారులు ప రివేష్టింపఁ గొలువుదీర్చియుండె. అప్పుడు వినయనయభయసంభ్రమముల తో నేను నాసభామధ్యమునకుఁ జని ముందు మామహేశ్వరులకు నవలఁ దక్కినవారలకు జోహారొనర్చి నిలిచియుండ శంకరుఁడు నన్ను గూరుచుం డుమనియె. పార్వతియు నామహిమ మెఱుఁగుటచేతఁగాఁబోలు నన్ను బ్ర త్యేకముగాఁ దనయొద్దకు రమ్మని యొక పీఠము వేయించి కూరుచుండఁజేసి నన్ను వేయివిధముల నుగ్గడించె. ఆపలుకులువిని దిక్పాలురు దమ కెన్నఁ డును జరగనిగౌరవము లభియించుటఁజేసి యందఱు నక్కజముఁ బొందిరి. ఆగొడవ లేటికి మనవిషయమై చెప్పెద నాలకింపుము. మేమందఱు మచ్చ టనుండ భవాని మహేశ్వరు నుద్దేశించి దేవా! కృష్ణజరాసంధుల బల తారతమ్యముల నీవఱకుఁ గొంత సెలవిచ్చితిరి. వారిలో గెలుపోటము లె ట్లు నేకుఱునో యానతీయరే యని యడుగఁ గరుణాంతరంగిత హృదయుఁ డై దేవదేవుఁడు పెదవివిటిచి యిట్టులనియె. దేవీ! జరాసంధుఁడు మహా బలసంపన్నుఁడు, కృష్ణునకు బాహుబల మంతగాలేదు. కాని బుద్ధిబలమె క్కుడు. అందుచేత నిదివఱకు మగధరాజుచే నిరువదిరెండుసారు లోడె ను. తుపర్యాయము మాగధవాసుదేవులకు ఘోరయుద్ధము వాటిల్లు.

పాప మందుఁ గృష్ణుఁడోను. యాదవకులము నాశనమొందును. ఇది భూలోకమునందుఁ దెలియరాదు. మునులారా! మీరెవ్వ రెందు నిది నోటజాటి యనవలదుసుఁడీ!" అనిపలికెను. అందఱు నాశ్చర్యరసమగ్నులైరి. కొందఱు దుఃఖితాత్ములైరి. తరువాతఁ గొన్నిప్రసంగములు నెఱపి మహేశ్వరుఁడు నాఁటికిఁ గొలువుచాలించెను. నేనక్కడనేయుండి మగధరాజు వన్నెపినాఁడని యుంగర మానవాలుచూపి యామొగలియాకుకుత్తరమువ్రాసినవానిపే రడిగి యింకను గొన్నిరహస్యములనడిగి తెలిసి వచ్చితి. అవియెల్ల వెంటనేచెప్పరాదు. ఇక్కడనయుండి కొన్నిదినములు జరగుటయు నంతయు మీరాజుతోడనే స్వయముగఁ జెప్పెదను. ఇంక మగధేశ్వరుఁడు హాయిగానుండవచ్చును. తనయల్లుఁడైన కంసుని సంహరించిన మహాపాతకుని వధించి యత్యంతానందము నొందఁగలఁడు. కృష్ణుఁ డింక హతాసుఁడైనవాఁడని నమ్ముము.

అని కర్ణరంజనముగ నామెపలుక రణార్ణవుఁ డుబ్బి తెలివొందిన మొగముతో "నమ్మా! కళానందుఁ డెన్నిదినములలోఁ బట్టువడును? సౌందర్యతిలకపొందు నాకు లభింపఁగలదా? ఆమె యింటికి హాటమునఁబోయి యాబాలికను బలిమిమై రాజాంతఃపురమునకుఁ దెప్పించుకొనవలయునని మహారాజు యత్నించుచున్నవాఁడు. అది నిర్విఘ్నముగ నెఱవేఱునా? శ్రీకృష్ణుని వేగులవాండ్రలో గుడ్డివానివేసము వేసికొని జగమును వంచించువాఁడొకఁ డున్నాఁడఁట. వాఁడు మననగరమునకే వచ్చియున్నవాఁడేమో సెలవీయవలయును. ఉంగరమును మొగలియాకుజాబును నాకు మరల నిచ్చుటకిష్టమున్న ననుగ్రహింపవలయునని వేఁడుచున్నాఁడను" అని మనవి యొనర్చుకొని యామె యులిగి యేమిచేయునో యని వడఁకుచుండెను. అనుసువు లాలించి యించుక చింతించి యోగిని యిట్లనియె. కళానందుఁడు బహుళశః మీకుఁ జిక్కఁడు. నీకొన్నియు తప్పక భార్యయగును. మీరామెను బట్టుకొ

ని రాజాంతఃపురమునకు నిర్విఘ్నముగఁ గొనిపోవఁగలరు. కృష్ణుని చారులలో గుఢ్ఢివేసము వేసికొనినవాఁడు ముసలివానివలెఁ గానఁబడుచు నీపురవీథుల బిచ్చమెత్తుకొనుచు మిము వంచించుచున్నవాఁడు. వానిని సత్వరము బంధింపుఁడు. ఉంగరమును మొగలియాకును నీకుఁగొన్ని నాళ్ళలో నిచ్చెదను. నీవింక పొమ్ము." అని యోగిని ముదలయిచ్చుటయు రణార్ణవుఁడు మహానందముతో నారేయి దనకుఁ జంద్రపాలవందన చేకూఱినట్లు మురియుచుఁ బరవశుఁడై యిల్లుచేరెను. ఆరాత్రి నిమరించి మఱునాఁడు మహారాజును దర్శించి యోగినికడ నడచిన సకల ప్రసంగముఁ బూసగుచ్చినట్లు చెప్పి యామెమహాత్మ్యము గ్రహించి కృష్ణుని పరాజయము నిక్కువమని చెప్పెను. మహారాజాపలుకులకెంతయు సంతసిల్లి యోగిని భవానీదేవి యంశమునఁ బుట్టినదని నిశ్చయించి కృష్ణుని వేగులవానిం బట్టింపఁదలఁచి యోగినీదర్శనము దానుం జేయందలఁచి కృష్ణసంహారము దాను సేయఁగలుగుట కనేక విధములఁ బరమేశ్వరుఁ బ్రశంసించి యాదినము మొదలు భైరవపూజఁ దొలుతటికన్న నెక్కుడుగఁ జేయఁదలఁచెను.

ఇది కడచిన రెండుదినములకుఁ గళానందుఁడు రాగలతికయు సౌందర్యతిలకయును మేడమీఁదఁ గూరుచుండి సరససల్లాపవినోదములఁ దేలుచుండ న్మాలిక చెలితోడ" యోగిని మరల నిక్కడకు వచ్చినదఁట. ఈమె కరుణచేతనే కాదె యామహాత్ముఁడు వ్రాసినలేఖ మనకందినది. ఈమె సర్వవేదియగుట నీమెను రెండు ప్రశ్నము లడుగవలయును. మాయప్ప చెఱనుండి యెప్పుడు విముక్తుఁడగుననియును" నని రెండవది చెప్పక సిగ్గువఁదలవంచి యూరకుండెను. కళానందుఁ డాభావము నెఱిఁగి చిఱునగవు నగియె. రాగలతికయు నెలనవ్వుతో "చెలీ రెండవప్రశ్నము నాకుఁ దెలిసినదిలే. నీవివాహమెప్పుడగునని వేగిరపడుచున్నదానవు. ఆమాట కనుంగొనుమనికదా! అట్లె యారాత్రి నే

నందుఁబోయి నీమనోరథమును నెఱవేర్చెదను." అని ప్రియసఖికి సంతోషముగాఁ బలికెను.

ఆరాత్రి రాగలతిక జామయినవెనుక మెల్లమెల్ల యోగినీదర్శనమునకుఁ బోయి యామె స్త్రీలకుఁగూడ దర్శనమీయక తెరచాటున నుండ నీవలఁగూరుచుండి యోగినికిఁ దనరాకఁ జెప్పిపుచ్చెను. పరివ్రాజికతోఁ బరిచారిక రాగలతికరాకఁ జెప్పటయు నామె మాటలాడక ప్రశ్నములు పరిచారికాముఖముననే విని దానితోడనే యుత్తరములు చెప్ప నిశ్చయించెను. రాగలతిక తనప్రశ్నములు రెండును బరిచారికకుఁ జెప్పె. ఆమె యోగినికి విన్నవించి యుత్తరముఁదెచ్చి యిట్లు సెప్పె. సౌందర్యతిలక కళానందునిఁ బెండ్లియాడుటనుగూర్చి నేఁజెప్పను. తండ్రి చెఱనుండి స్వల్పకాలమున విముక్తుఁడగు. కాని కళానందునకు గొప్పయాపద రానున్నది. అతఁడు మీయింట నున్నటుల నాదివ్యదృష్టివలన నేనెఱిఁగితి. ఈరాత్రి యాతనిని మీయింటనుండి యెందేనిఁ జనుమని యాతనితోఁ జెప్పవలయు. కాకున్న హానివాటిల్లు. తుదకంతయు శుభముగాఁ బరిణమించును. ఈపలుకు లాచెలికిఁ దెలియనీయవలదు. నీవింక జాగుసేయక పొమ్ము" అను నీమాటలు విని రాగలతిక విషణ్ణహృదయయై విచారముతో నొక్కయుపాయమైన నరయఁజాలకయేదియుందోఁపక యోగిని తమకు హితమునాచరించుననియు నామె పలుకులంబట్టి నడచుట కర్తవ్యమనియు నిశ్చయించి యింటికి వచ్చి చెలి యప్పటికి నిదురవోవుటచే నామెతో మాటలాడక కళానందునిబిలిచి, యావృత్తాంత మంతయు విన్నవించి తక్షణమె వెడలుమని కన్నీరువెట్టుకొనుచుఁ జెప్పెను. కళానందుఁడు పిడుగడిచినట్లులు నిశ్చేష్టుఁడై కొంతసేపటికిఁ దెలివితెచ్చుకొని నౌకరకాణభూతులను లేపి వారికాసంగతి యెఱుఁగఁజెప్పి బయలుదేఱుమని నిద్రించుచున్న ప్రియురాలిచేయి త

వగుండియుపై నొకమాఱు చేర్చుకొని చెప్పఁజాలక యిల్లువెడలి సేవకులతోఁ బోవఁదలఁచి పయనమయ్యెను.



## పండ్రెండవ ప్రకరణము.



పూర్వ మొకనాఁడు గిరివ్రజపురమునందు బిచ్చమెత్తుకొనుచుఁ గనులు గానక చెవులు వినరాక యాఁకలికి నకనకంబడుచు మంత్రికుమారుని బండిక్రిందఁబడి కాలు విఱుగుటచేఁ గడుబాధపడుచుండ నాగవల్లి కనికరము పెంపునఁ దనచేతి పూలదండను, జెంబు నమ్మి వానికి సాయముఁ జేసి పుండుమాన్పుటకు మంగలియింట విడుచుట మీ రెల్లఁ జదివియేయున్నారు. ఆమెచేత సంరక్షితుఁడయిన యానిరుపేదముదుకఁడు సుఖముగా నుండెను. కాని వానిరక్షించిన యాసాధుశీల, పూలచెండు విక్రయించినకతమునఁ దనచెలికి నింటికిఁ గడుదూరమై యే దేశాంతరములకోచని మరలఁ గనఁబడదయ్యె. ఆదీనుఁడు మంగలివానిసాయమునఁ గాలిమీఁదిపుండు మాన్పుకొని యెప్పటియట్ల కఱ్ఱయు మూఁకుడును జేతఁబట్టుకొని వాడలంబడి యన్నమడుగుకొని తినుచుఁ దనకే భారమైన యాజీవితము నెట్లో గడుపుచుండెను. అట్లుండి యొకనాఁడు వాఁ డుదయమున రాజవీధిలో నొక యింటిముందఱ నిలుచుండి వార్ధకముచే వంగిన తననడుము నిలుపఁ దనకఱ్ఱ యూఁతగొని యింటివారు లేదుపొమ్మనినను వినరామినో దైన్యము పెంపుననో యచ్చోటువాసి పోవక యింటివారిచేఁ దిట్లుదినుచు "నయ్యో నిలువఁజాల. కాళ్ళులాగుచున్నవి. ఇంచుక వార్పు నాకిచ్చి ప్రాణమునిలుపుఁడి" యని వేఁడుకొనసాగెను. వారెన్నిసారులు లేదనినను వాఁడు తొలఁగకునికి నాగ్రహమాయజమానుఁ డొకపెద్దకఱ్ఱదీసికొనివచ్చి "యోరిముండకొడుకా! నీనిమిత్తమై తెల్లవారకముందే యెవరువార్చి సిద్ధముచేసినారురా !!" యని ధా

నితో వానిని మోఁదెను. తోడనె వాఁడు హా చచ్చితి! చచ్చితి!! నని నేలఁబడి యేడ్వసాగెను. చుట్టుప్రక్కలనున్న వారందఱును జేరి యా దురాత్ముని నిందించుచు నీదీనుని లేవనెత్తుచుండ నింతలో రాజభటులు పలువురు వడివడి నడిచివచ్చి "తొలఁగుఁడు. దారియొసఁగుఁడు." అని త్వరలో నాజనమధ్యమునఁ బ్రవేశించిరి. ఆనిఱుపేదవానిని రక్షించి వానింగొట్టినందుల కాగృహయజమానుని శిక్షించుటకు రాజభటులు వచ్చియుందురని తలఁచుచుండ వారిలో నొకభటుఁడు ముందఱకువచ్చి యిట్లనియెను. "అయ్యా! ఈముసలివాఁడు మీరంద ఱనుకొనునట్లు ముదుకఁడుగాఁడు. వీఁడు శ్రీకృష్ణుని వేగులవాండ్రలో నొకఁడు. గిరివ్రజమునందలి రహస్యములు ద్వారకకుఁ గొనిపోవఁ దాను వడుచు వాఁడయ్యును గృష్ణమహిమచే వృద్ధునిలాగునఁ గానఁబడి యందఱకును జాలిగలుగునటులఁ బ్రవర్తించి లోకమును వంచించుచున్నాఁడు. వీని వంటి పాపాత్ముఁడు లేఁడు వీనింబట్టి చెఱలోనుంపుఁడని మహారాజుగారు మాకానతి యిచ్చినారు. తొలఁగి యావలకుఁజనుఁడు" అని కఠినస్వరముతోఁ బలుకు రాజభటుని జూచి పౌరులు వెఱచి యొక్కరొక్కరుగఁ దొలఁగిరి. రాజసేవకులు వెంటనే యాముసలివానిం బట్టుకొని రారమ్మని లాగిన వాఁడు వారెవ్వరో కనుఁగొనఁజాలక యెక్కడి కెక్కడి కని యడిగెను. ఆమాటకుఁ బ్రత్యుత్తరమీయకయె వానిని గెంటుకొని పోవుచుండ వాఁడు రోదనముఁజేయుచు "నయ్యో, యయ్యో! యెవ్వరో నన్నెత్తుకొని పోవుచున్నారు. రక్షింపుఁడు. రక్షింపుఁడు దైవమా! వీండెవ్వరో రెక్కలు నొప్పియెత్తునట్లు నిర్దయాత్ములై నను గెంటి లాగుచున్నారు. తండ్రులారా!" యని యార్చుచున్న రాజునానతికి వెఱచి నోరెత్తఁజాలక యెవ్వరును దొంగిచూడక పోయిరి. ఆ కీనునట్లుచేయుటకుఁ గారణమేమని యెవ్వరేని యడిగిన మున్ను చెప్పిన యుత్తరమె చెప్పుచు వారు వానిం దోడుకొని కారాగృహమునకుం

బోయి చంటిపిల్లవానిచందమున నొక్క పెట్టున నేడ్చువానిని జెయిలోఁ బెట్టి
రి. పౌరులందఱు గుంపులుగూడి "కటకటా! వీఁడు కృష్ణుని వేగులవాఁ
డుకాఁడు. మొదటనుండియు నీపురమునందుండి తిరిపమెత్తుకొని బ్రదు
కుచున్నవాఁడు. ఇంతకన్న నన్యాయమేమున్నది. చీ చీ! జరాసంధమ
హారాజ పరిపాలన కరము ఘోరముగనున్నది. అముదుకనిజూడఁ గను
పు చెఱుపగుచున్నదే! ఈదిక్కుమాలినవానివలన రాజ్యమునకు హాని
కలుగునా" యని పలువిధముల వగచువారలై రికాని రాజభటులకును
రాజునకును దమయెఱిఁగినదంతయు విన్నవించు సాహసికులు లేరైరి.

అట్లు కళానందుఁడు రాత్రి కోరిక కాణభూతులతో నిలువెడలి
పోవుటయు మఱునాఁడు సౌందర్యతిలక జేపకడ మేలుకాంచి మనోనా
యకునందుఁ గానక రాగిలతికను లేపి యాతనివార్త లడుగ నదియు
నించుక సంశయించి "అమ్మా! రాజకార్యములఁ గొన్నిఁటిని నీసేమ
మునిమిత్తము ముచ్చటింపఁదలంచి ప్రియస్నేహితునియింటికిఁ బోయి
యున్నవాఁడు. ఈదినమునఁ దప్పకవచ్చునులే" యని యుత్తరమిచ్చెను.
ఆపలుకులు వినిన గుండె జల్లుమనుటయు నామెలనాఁగ "యది
యెద్దియో మిషయనియు నిజముగ రాజకార్యమున్నయెడలఁ దనకుఁ
జెప్పక హాటమున నింటినుండి రాత్రి లేచిపోవుట సంభవింపదనియు
నెద్దియో యాతనికిం దనకుఁ గీడు రానున్నదని విచారించి యా
కారణ మెఱిఁగింపు" మని రాగలతికను బహువిధముల వేఁడుకొనియెను.
ఎంతబ్రతిమాలినను రాగలతిక తనకుఁ దెలియదనియు నాతఁడు క్రమ్మఱ
వచ్చునియు నాశ్వాసించుటయెకాని యోగినీవచనములఁ జెప్పదయ్యె.
యోగిని యేమున్నదని యామె నొక్కియడుగ శీఘ్రకాలమున మీయి
రువురకు వివాహమగునని యామె యానతిచ్చెనని పలికెను. ఈపలుకు
లెల్ల సౌందర్యతిలక చిత్తమున కాశ్చర్యము గొలుపఁజొచ్చెను. ఉత్సా
హమంతయుఁ గళానందునితోడనె పోయెనో యనునట్లు బాలిక యెప్పటి

యట్లు దీనాననయై మునుపటికన్న నెక్కుడగు బెంగగొని యాపూంట సరి గ నన్నముదినక జాలిగొలుపుచూపులతో రాగలతికహృదయమున కత్యంతదుఃఖమును గలిగింపఁజొచ్చెను. ఆనాఁడు బాలిక తలదువ్వించుకొనక పువ్వుదోఁటయందుఁ దిరుగక వీణవాయింపక చిలుకలకుఁబండ్లుపెట్టక సన్యసించిన శృంగారదేవతవలెనుండి సాయంకాలమునఁ బ్రియుఁడరుదెంచు ననుమాహతో నెప్పుడు పొద్దుక్రుంకునోయని కనిపెట్టుకొని యుండెను. అట్లుండ నాలుగుగడియల ప్రొద్దువేళఁ బుష్పకేతుఁడనుమంత్రి పదుగురు రాజభటులతోడను నలుగురు దాసీజనులతోడను జంద్రపాలుని గృహమునకువచ్చి నిలిచెను. రాగలతిక క్రిందనే యుండుటచే నాతని నుచితాసనము వేసి కూరుచుండవేఁడుకొని చంద్రపాలునిభార్య కతనిరాక యెఱింగించెను. ఆమెయుఁ దనభర్తకుఁ బ్రాణమిత్రుఁడైన యాతనిని సందర్శించి గుడ్ల నీరుగుక్కుకొనఁజొచ్చెను. పుష్పకేతుఁడామెనుజూచి కంటనీరుపెట్టుకొని యమ్మాయి యెక్కడనున్నదని యడిగెను. అప్పుడందఱును మేడమీఁదికింజనిరి. వృద్ధుఁడైనపుష్పకేతుని గని లేచి సౌందర్యతిలక యొకచోనిలువఁ బుష్పకేతుఁడు బిడ్డా! కూరుచుండుమని యామె నొకపీఠముపై నాసీనురాలినిగాఁజేసి కన్నీరుతో నిట్లనియె. "అమ్మా మీతండ్రిగారి దురవస్థకు మీరెట్లువగచుచున్నారొ నేనునట్లె వగచుచుండెదను గాని దురాత్ముఁడనైన నేను మీకంతకన్న నెక్కుడుకీడుసేయ నిందువచ్చితిని. రణార్ణవునకు సౌందర్యతిలకనిచ్చి పెండ్లిచేయుటకు నిశ్చయించి రాజుగారు నిన్నంతిపురమునకుఁ దోడుకొనిరమ్మని నన్ను—" అని చెప్పవాక్యము ముగియకమున్నె సౌందర్యతిలక కన్నీరు కాల్వలై పాఱ హాతండ్రీ యని నేలఁబడిమూర్ఛిల్లెను. బిడ్డయవస్థనుజూచి తల్లియు మూర్ఛిల్లెను. రాగలతిక నేలఁజదికిలంబడి వెక్కివెక్కి యేడువసాగెను. పుష్పకేతుఁడును దానంతటి ఘోరకృత్యమును జేయవలసివచ్చినందులకుఁ జింతాక్రాంతమనస్కుఁడై వారియవస్థలఁజూచి ముగమున నుత్తరీయము వైచికొని

యేడ్చెను. ఇంతలో నొకమాఱు సౌందర్యతిలక తెప్పిఱిలి 'హా తండ్రీ! హా తల్లీ! నాగతి యిటుచేసితిరా' యని యేడ్చి మరల మూర్ఛిల్లెను. పుష్పకేతుఁడు సేవకులఁ బిలిచి పల్లకిఁ దెమ్మని యానతిచ్చిన వారు నదివఱకే తెచ్చి దూరమునఁదుంచివచ్చిన యాపల్యంకికను గొని తెచ్చి వాకిట నునిచిరి. కూడవచ్చిన యాఁడువాండ్రు పలువురు మేడమీఁదికి రాఁగా నాదాసీజనముతోఁ బుష్పకేతుఁడు మెల్లగా "నీబాలికను బురుషులంటరాదు. మీరెత్తుకొని యాపల్లకిలో మేను నొవ్వకుండఁ బెట్టుఁడీ" యని గద్గదస్వరముతో నానతిచ్చెను. అప్పుడే రెండవమూర్ఛనుండి తెలివియించుక గాంచినయాబాలిక యాపలుకులువిని పునర్మూర్ఛావస్థనొంది నిశ్చేష్టయై యుండె. నలుగురుదాసీజను లామెయొద్దకుంజని నిలుచునపుడు తల్లి చూచి నోరునెత్తి మోఁదుకొని గుండెలబాఁదుకొని పుత్రికయొద్దకుఁబోయి యామెపైఁబడి "హాకుమారీ! నాతల్లీ!! యిన్నిదినములు బెంచి నిన్ను మృత్యుదేవతకప్పగించినాను. అయ్యో! నీవులేని యీయింటిలో నేనెట్లుండఁగలనే? అమ్మా మీతండ్రిగా రట్లయినను నిన్నుజూచుకొని కాలము గడపుచున్నదాన. నాకెవ్వరుదిక్కు తల్లీ! మాభాగ్యరాశీ! మాయింటిమహాలక్ష్మీ! రణార్ణవుని పెండ్లిమాట విన్నతక్షణమే నీప్రాణముపోవును. ఇట్టిబంగారుబొమ్మ నాకెట్లుదక్కునే? నీసౌకుమార్యము, నీ యందము, నేలపాలుగావలసినయోగ్యత యున్నది కాఁబోలును. హా జరాసంధమహారాజా! నీపాపమునకు మేరలేకయున్నదిగదా! హా పాడుదైవమా! నాకెంతహాని గలిగించితివి" అని యందఱి హృదయములు కరఁగునట్లు కరుణరసము పొంగివచ్చినట్లు పెక్కువిధముల విలపించెను. ఆమెను వారించి దాసీజనము బాలికను స్పృశించి పుష్పకేతునితో "నయ్యా! ఈమె నిశ్చేష్టయైనది. ఎత్తి పల్యంకికలోనుంపవచ్చునా?" యని యడిగి యాతఁడు ప్రత్యుత్తరమీయఁజాలక తలయూఁప నది సన్నగా వారును బాష్పాకులలోచనలై యామెనెత్తిరి. తల్లి

యాఘోరకృత్యముజూచి మూర్ఛిల్లెను. రాగలతికయుఁ గొయ్యబారిపోయెను. తల్లికిఁ దెలివిరాకుండఁ దీసికొనిపోయిన బాగుండునని మెల్లమెల్లగా సర్వచేష్టలుండక్కియున్న దానిం గొనిపోయి పాలకియందుంచి పుష్పకేతునితోఁగూడ రాజమందిరమునకుం జనిరి. తల్లియు రాగలతికయు స్పృహగలిగిన వెనుక నొండొరులఁ గౌఁగిలించుకొని పెద్దపెట్టున రోదనముచేసి బాలికవాయించువీణ, చదువు పుస్తకములు, నాడుకొను బొమ్మలుఁ బవ్వళించుపాన్పుఁ బెంచుచిలుక మొదలగువానిం జూచిచూచి తలఁచి తలఁచి చుట్టుపక్కలవా రెందఱువచ్చియూరడించినను నూరడక వాపోవఁజొచ్చిరి.



## పదుమూఁడవ ప్రకరణము.



కళానందుఁడు నాఁటిరేయి రాగలతిక పలుకులువిని చంద్రపాలుని గృహము వెడలి క్రూరకకాణభూతులు తన్ను వెంబడింపఁ దన్నొరులుకాంచి గుర్తింపకుండ, మొగమునిండ ముసుఁగువైచుకొని తనస్వగృహమునకుఁ బోయెను. తనతల్లి చంద్రపాలునియింటనే యుండుటయు నింటఁ జిన్ననాఁటనుండియుఁ దన్ను బెంచిన ముదుసలిదాసి యొక్కర్తదక్క నన్యులు లేమిని మెల్లన దానిఁబిలిచి తనరాక చాటుగనుంచుమని వేమరు నొక్కిచెప్పి లోపలఁబ్రవేశించి కొండొకవడి ప్రియావియోగవ్యథచేఁ గుంది యొకగదిలో నిదురవోయెను. ధారుణీదేవియు సౌందర్యతిలక రాజగృహమునకుఁ గొంపోఁబడుటయుఁ దనకుమారుఁ డెందేని మరల నేగుటయుఁ దలఁచి శోకించి చంద్రపాలునియింటియొద్ద సెలవుఁగైకొని స్వగృహముం బ్రాపించి యందుదాగియున్న నిజకుమారునిగాంచి సంతసించి గుట్టు పరులకుఁ దెలియకుండఁ గాపాడ నిశ్చయించుకొనెను. తన ప్రాణనాయిక చంద్రపాలనందన బలిమిచే రణార్ణవునకుఁ బెండ్లిచే

యఁబడునని వగచి యాతఁ డాకార్యము జరగకమున్న జనార్దనునియొద్ద కుఁ గోరకునంపఁదలఁచి యతఁ డానతిచ్చినట్లు పూలవర్తకులు కొంద ఱితోఁ బరిచయముచేసికొన నిశ్చయించి వారిలోఁ బాపభీతిగలవాఁడు ను దైవభక్తియుతుఁడు నగు రోహణకుని మంచివానిగానెంచి వానితో నెయ్యముచేయుఁడని కోరకకాణభూతులనంపెను. కోరకుఁ డంధునియ ట్లు నటించుచుఁ దన్నూఁతకోలతోఁ దీసికొనిపోవుటకుఁ గాణభూతిని నియోగింప వాఁడును మూఁగవాఁడయి యెవ్వరు పిలిచిన వినఁబడని వానియట్లు పలుకక, యెవ్వరుమాటలాడవచ్చిన నవ్యక్తములగు ధ్వను లెకాని మాటలాడక సంజ్ఞలచేఁ దనభావముఁ దెలియఁజేయుచుఁ గోరకుని వీధులవెంబడిం ద్రిప్పసాగెను. అట్లు వారిరువురు బిచ్చగాం డ్రై యింటనింటఁదిరుగుచు రోహణకుని యిల్లు సేరునప్పుడెల్ల నెంత యుఁ దడ వందు నిలుచుచుందురు. కోరకుఁడు తన నేర్చినపాటలచే రో హణకుని మెప్పించుచు నాతనిచే సంతృప్తుఁడగుచుఁ గాణభూతిసమేత ముగ నగరమునఁగల వార్తలన్నియు గ్రహించుచు రాత్రియో పవ లో వచ్చి వానినెల్లఁ గళానందునకు విన్నవించుచుండెను. ఇట్లుండఁ గొం డొకనాఁడు రోహణకుఁడు కోరకుని పాటలకుమెచ్చి వానిపయిం గనికర ముప్పతిల్ల "నోయీ! నీకన్నులెందుచేతఁ బోయిన"వని యడిగెను. కో రకుఁ డాపలుకుల నాలకించి యిట్లనియెను. "అయ్యా! నాచరిత్రమించుక చెప్పెద వినుఁడు. పూర్వము నాకు స్వప్నములయందు నమ్మకములేదు. అట్టులుండ నొకనాఁడు నాకలలో నొకయోగివచ్చి "యెల్లి మాధవుఁడు బ్రాహ్మణవేషమున నీయింటికివచ్చు, వాని నఖిలసత్కారములఁ దను పవలె"నని వాక్రుచ్చి యంతర్ధానమాయెను. నాకును మెలఁకువ వచ్చి నది. కలయువ నాకు విశ్వాసములేదుగావున నిర్విచారముగనుంటిని. మఱునాఁడు మధ్యాహ్నమున నొక ముసలిబ్రాహ్మణుఁ డరుగుదెంచి తనకు భోజనము నిమిత్తము నేయి యిమ్మని నన్నెంతయుఁ బీడిం

చెను. ధనలోభముచే నేనాబ్రాహ్మణుని కోరికదీర్పకపోవుటయేగాక వాని నొకకష్టతో మొత్తి వానికి బుద్ధిచెప్పితి. విప్రుఁడు చిన్నమొగముతో వచ్చినత్రోవనె పోయి మరలఁ గానఁబడఁడయ్యె. ఆసాయంకాలము మొదలు నాకన్నులుగానఁబడవు. ఆమహాదోషముగొట్టి నాకింతగతి పట్టినది. అంతకుముందు నేనుఁ గొంతపాటి భాగ్యవంతుఁడను, పిల్లలుగలవాఁడను. నాఁడుమొదలు నాసంసారము చితికిపోవ నాకులేమివచ్చె. బిడ్డలు చచ్చిరి. ఆలు పరలోకమునకుం జనియె. తుదకు బిచ్చగాఁడనై మీావంటివారిని బీడింపనుంటి"నని చెప్ప నాచరిత్రము విని రోహణకుఁడు జాలినొందెను. అనంతరము కోరకుఁ డిట్టులనియెను. నాఁడుమొదలు నాకు వచ్చిన కలలెల్ల నిక్కములయ్యె. ఇపు డొకచిత్రము నీకుఁ దెలుపవచ్చితి. నిన్నటరాత్రి నాకొకస్వప్నము, మాధవుం డిందులకు వచ్చినట్లు మీాయింట బసచేసినట్లు, వచ్చినది. నాయట్లపచారలోపము సేయకుమా నాతండ్రీ!" యనిన రోహణకుఁ డక్కజమొంది యయ్యో దేవదేవున కపచారమొనర్తునా! అతఁడు వచ్చుభాగ్యము నాకుఁ గలుగవలయు"నని వారిననిపెను. వారును బోయి రాత్రి కళానందునితో రోహణకుని దమవానిగాఁ జేసికొన్నవార్త నెఱిఁగించిరి. ఇట్లు కృష్ణచారులగు కోరక కాణభూతులు శత్రుపురమున నిరాఘాటమగు విహారము మాయవేషము వేసికొని చేయుచుండిరి. రణార్ణవుని ప్రాణమిత్రుఁడు తారకుండను వాఁడు శూద్రుఁడు గలఁడు. వాఁడు త్రాగుబోతు, జూదరియునగుట, వానియన్నదమ్ములు వాని నిల్లువెడలనడిపిరి. నాఁటఁగోలె రణార్ణవు నాశ్రయించియుండ రాజుతోఁ జెప్పి యొకయుద్యోగము జెప్పించి జీవనంబున కాధారముఁగల్పించె. పగతురవేగులవాం డ్రెవ్వరైన వచ్చి గిరివ్రజమునఁ జరించుచుండిరోయని యరసి కనుంగొని యట్టివాఁబట్టి బంధింపుమని జరాసంధుఁ డాతని నియోగించె. అదిపనిగా **వాఁడు రేలుంబవలనక యెండయనక వానయనక నగరమంతయుఁ**

గ్రుమ్మరుచుండు. ఒకనాఁడు తారకుఁడు నిజసేవకసమేతుఁడై వీధులం గ్రుమ్మరువాఁడు తనముందటఁ దిరిపమెత్తుకొనుచున్న గోరకకాణభూతులం గాంచి సేవకులతో నిట్లనియె. "వీండ్రు దొంగలవలెఁ గానఁబడుచున్నారు వీరి తెఱఁగరసి బంధింపఁదగదే" యనిన నామాటలు నిరంతరము జాగరూకుఁడగు గోరకుని చెవులంబడియెను. వినుటయు వాఁ డవి విననివాడువోలె తారకుఁడున్న యెడకుం జనుదెంచి చేతులు తడవుకొనుచు నొకమూల నిలుచుండి "అయ్యా! తారకులెందున్నవారో నాకగపడరు. వారితో నేనొకరహస్యము నుచ్చరింపవలయు ననియె. అనుటయు నాతఁడు దిగ్గునలేచి గోరకుని కైపునకువచ్చి నాతో నేమిరహస్యమున్నయదిరా" యని యడిగెను. గోరకుఁ "డిందెవ్వరు నన్యులు లేరుగదా" యని యిట్లనియెను. "ఈనగరమునకుఁ గళానందుఁడు వచ్చియున్నవాఁడు. వాఁడున్నచోటు మీకు నేనెఱిఁగించెద. ఈరాత్రి మీరొంటరిగ నూరువెలుపల నుత్తరదిక్కున నున్న పెనుమఱ్ఱిచెట్టుకడకు రావలయును." అనినఁ దారకుఁడు తారాపథము నంటునట్లు మహానందభరితుఁడై యీకార్యముచేత జరాసంధునిదయకుఁ బాత్రుఁడనగువాఁడనగుదుననియుఁ గోరకకాణభూతులు నిజముగ గ్రుడ్డియు మూఁగయు ననియు వారు మోసగాండ్రు గారనియు నిశ్చయించి సాయంకాల మెప్పుడగునని వేఁగిరపడుచుండెను. గోరకకాణభూతులు బిచ్చమెత్తుకొని సంజతఱి నాపెనుమఱ్ఱికడకుం బోయిరి.

మాగధుల యజ్ఞానతిరముఁబోలె గాఢాంధకారము నగరమంతయుం గ్రమ్మెను. తారకుఁడు కళానందుని బట్టఁదలంచి యుత్తరపుదిశనున్న మఱ్ఱియొద్దకుఁ బోవుచుండెను. అతఁ డాప్రదేశముఁ జేరునప్పటికి జాము రాత్రికన్న నెక్కుడగుటఁ గోరకకాణభూతులు ప్రొయిమంటఁ బెట్టి యన్నము వండుకొనుచుండిరి. తారకుఁడు వారిం బ్రాంపించి గ్రుడ్డివానిం బలుకరించెను. వాఁడును వినయవిధేయుఁడై తారకునితో "స్వామీ!

ఆవల పదియడుగులదూరమునఁ దమనిమిత్త మొకచాఁపవేయించితినందు దేవర విశ్రమించునప్పటికి మావంటకము ముగియును.” అని చాఁపఁజూపుమని మూఁగవానికి సన్నజేయ నాతఁడును దారకునిసమీపించి కేకలువేయుచు రమ్మని చేసన్నయొనరించి వెంటఁబెట్టుకొని పోయి యాచాఁపఁజూపి తాసీవలనిలచెను. ఆచిమ్మచీఁకటిలోఁ దారకుఁడాచాఁప యెందున్నదో తెలియఁజాలక కాలితోఁదడవి కనుంగొని దానిమీఁదికి నడచి రెండడుగు లిడునప్పటికిఁ బాపఁ మాతఁడును జాఁపయు గుభాలున నొకపాడునూతంబడియె. దుర్వాయువులతో నిండి పలుదుర్గంధములు గలిగి కండచీమలపుట్టలు, తేళ్ళగుట్టలు బుసకొట్టు త్రాఁచుపాములును గలిగి భయంకరమైన యాపాడునూతిలోఁబడి యాపాటుచేతను దలపగిలి నెత్తురు లురుల భీతిచేత శరీరము పరవశమునొంది గఱచెడు పాములుఁ గుట్టెడు తేళ్ళుఁ బీఁకెడు చీమలుఁ బ్రాఁకెడు పురుగులును గంపమొందింప వాఁడు బ్రహ్మాండము పగుల నార్చుచు రక్షింపరేయని యేడువఁజొచ్చెను. చుట్టుపక్కల గుడిసెలలోఁ గాఁపురముండువారందఱును నీమహార్తనాదమేమని పరువులెత్తుచు వచ్చుచుంటఁజూచి కార్యముతప్పినదని కోరక కాణభూతులు పెద్దపెట్టిన రోదనముఁజేయుచు నఱచుచు గుండెలుమోఁదుకొనుచు వచ్చువారి కెదురుగఁబరుగెత్తిరి. వాండ్రు కోరకునిజూచి “ఏమిది? మీరిట్లు పరువులెత్తి యఱవనేల? ఆమహార్తనాదమెవ్వరిది?” యని యడుగ వగర్చుకొనుచు నోటమాట రాక తుదకు కోరకుఁ డిట్లనియె. “అయ్యో! ఈపాడునూత నొకమహారాక్షసి ప్రవేశించినది. అది మనుష్యమాంసమును మెక్కవలయునను కోరికతో బావిబ్రవేశించి తానొకమనుష్యుఁడ ననియుఁ దన్నందెవ్వరో పడద్రోసిరనియు బైటకుందీయవలయుననియు వేఁడుకొనుచుండును. అజ్ఞానులెవరైన నూఁతకోలనొసఁగియో త్రాళ్ళువేసియో తన్ను వెలువరింపఁ జూతురేని వారిని గ్రిందికి దిగలాగి భక్షించుచుండును. మావి

చ్చుగాండ్రు ముప్పురసీవఱకు దిగలాగి విఱిచికొని తినిరి. కన్నులులేమి నేనుబ్రదికిపోతిని. అయ్యలారా ? మీరైన నీరాక్షసిచేతఁ బడి చావక బ్రదికిపొండు. దీని మీరందఱు మీఁద ఱాళ్ళువైచి చంపుదురేని సత్వ ఱమె మీకు క్షేమముగలదు. లేకున్న మిమ్ములమీబిడ్డపాపలఁ గడతేర్చి మెక్కఁజాలును" అనవుడు వారందఱు నదినిజమనియు నాపని లెస్సయనియు నూతియొద్దకుఁజని యందున్నవానిని నిందించి మీఁద ఱాళ్ళు ఱువ్వ నారంభించిరి. వాఁడు నేను తారకుండను రాజసేవకుఁడ నని యెంతయఱచిన నీజనుల కోలాహలము నడుమ నది యెరికిని వినఁబడదయ్యె. పెద్దశిలలు దొర్లించి యానూతన వారు వేయ నదివఱకే తలపగిలియున్న యానిర్భాగ్యుఁ డేశిలాఘాతముచేతనో యేఘణివిషముచేతనో లోకాంతరమునకు విజయముచేసెను.

వేగులవాండ్రు పాలిటికి యముఁడగు తారకుని మడియించి కోరక కాణభూతులు సంతోషహృదయులై యాజనులందఱు తమతమ యిండ్లకుఁ బోయినవెనుక మెల్లమెల్లగఁ గళానందుని గృహమునకుఁబోయి యాతనికావార్తఁ నెఱిఁగించిరి. కళానందుఁ డత్యాశ్చర్యముతో వారి మాయలు మెచ్చుకొని కోరకునుద్దేశించి "యోయీ నీవింక మాధవు నిపాలికిఁ బొమ్ము వానికి నేనొకకమ్మ వ్రాసియిచ్చెద. ఇప్పటికి మనకీ నగరమునందుఁ దెలియఁదగు నంశములు తెలిసినవి. జనార్దనుఁ డేయదియు రయుండని మీకును నాకు నాదేశించెనో యదియెల్ల నెఱిపితిమిగదా ?" యని యొకకమ్మవ్రాసి యందు జనార్దనున కావశ్యకములగు నంశములనువ్రాసి యాతఁ డెట్లువ్రాలుచేయుమని మున్నుచెప్పె నట్లు చేవ్రాలు చేసి వానికిచ్చి పొమ్మని యానతిచ్చెను. కోరకుఁ డాజాబునుగ్రహించి మాధవుఁడనుదెంచువఱకు మిక్కిలి జాగరూకతతో నుండుమని కాణభూతితోఁ బలుమాఱు నొక్కిచెప్పి యానాఁడు తెల్లవారుజామున బయలుదేఱి ద్వారకానగరమునకుఁ బోయెను. కాణభూతియు వానిని సాగనంపి

తానెప్పటియట్ల మూఁగవానివేసము వేసికొని నగరమంతయుఁ దిరుగుచు బిచ్చమెత్తుకొనుచుండెను. ఆరాత్రి తారకుఁడు బలవన్మరణము నొందుట వానిమిత్రులెవ్వరు నెఱుఁగక మఱునాఁడు వాఁడు కానఁబడమి నగరమంతయు వెదకిరిగాని వానిజాడ యొకింతయుఁ గానరాదయ్యె. అట్లాకస్మికముగఁ దనప్రియమిత్రుఁడు మాయమగుటకు వగచుచు రణార్ణవుఁడు వానితెఱఁగునెఱుఁగ సకలప్రయత్నములను జేసియు నేమియుం గార్యములేమి విచారమనస్కుఁడై యూరకుండెను.

అంతఁ గతిపయదినములుగతియింపఁ గళానందుఁ డొక్కనాఁడు, ప్రియురాలికిఁ దనకుఁ గల్గిన వియోగముఁ దలఁచితలఁచి మాధవుని యాలస్యమునకు వగచివగచి చాలప్రొద్దయిన వెనుక నిద్రించెను. ఆయూరఁ దారకుని యనుచరులలో నొకఁడగు మందహాసుఁడు జీవింపనెద్దియు వృత్తిగానక దొంగతనము జేయ మొదలుపెట్టి యాపనులయం దారితేఱి యించుక ధనమార్జించి జీవనము చేయుచుండెను. ఆనాఁటిరేయి కళానందుని యింటికిఁ గన్నముత్రవ్వి లోనున్నవిత్తము నపహరింపవలయునని నిశ్చయించెను. కళానందుఁడు నగరమున లేఁడు గదా యనియు నాఁడుదియు వృద్ధయు నగు ధారుణీదేవికి మెలఁకువరాదనియు వచ్చెనేని నోరునొక్కి యున్నంతయర్థము గ్రహింపఁగలుగుదుననియు నాసచేసి వాఁడానాఁటియర్ధరాత్రమునఁ గళానందుఁడు పవ్వళించిన గదికిఁ గన్నము వేసెను. కన్నములోనుండి లోనికిఁ దలపెట్టి యందఱు నిద్రించుచున్నవారో లేదో యని చూచి ప్రవేశించి గంటవలెనున్న దీపము నార్పఁబోయి దానియెదుట దివ్యప్రభాభాసితుఁడై నిద్రించు కళానందుని గాంచి" యహాహా! యీతఁడు రహస్యముగ నిందేయున్నవాఁడు గాఁబోలు! ఏమి! ఈతని లావణ్యము! ఇందుచేతనే చంద్రపాలనందన వీనిని వరియింపఁగోరె. ఈతనికి మెలుఁకువవచ్చిన నాకొక చిల్లపెంకయిన దొరకదు. కావున సత్వరమ యిటనుండి పాఱిపోవలయునని దీపిక నార్పివైచి యాప్రమిదలోనున్న యాము

దము తనబోఁడితలకు శరీరమునకుఁ బులిమికొని పట్టుకొన యత్నించువారిచేయి జారునట్లుండి కళానందుని మెడలోనున్న ముత్యాలహారము నూడఁదీసికొన నిశ్చయించి పరుగెత్తుటకు ముందు తలుపు లన్నియుఁ దెఱచి నిర్భయుఁడై కళానందుని మెడలోఁ జేయివెట్టి హారముపట్టియెత్తి యది తలఁదూఱిరామిఁ బుటుకునఁ ద్రెంపి జలజలరాలిన ముత్తియముల నేఱుచుండ నింతలోఁ గళానందునకు మెలఁకువవచ్చెను. వచ్చుటయు నాతఁడు కన్నులు దెఱచి యెవఁడురా యని వానిచేయి గట్టిగాఁబట్టుకొని వాఁ డెంత పెనఁగులాడినను విడువఁడయ్యె. మండూకుఁడు పట్టువిడిపించుకొనుటకుఁ గళానందుని గఱచె. కళానందుఁడు వానినోటిపట్టు వదిలించుకొనుటకుఁ జెప్పున వానిచెంప పగులఁగొట్టెను. నోటిపట్టు వదిలి మండూకుఁ డేయుపాయమును దోఁపమి నెడమచేతిలోనున్న కన్నపుఁగత్తితోఁ గళానందుని చేయి నఱికెను. ఆయేటుతోన రాచకొమరుఁడు కడునొచ్చి యెడమచేతితో సిగ నొడిచిపట్టుకొందమని యీచేయివిడిచి యాచేయి చాపునంతలో దొంగ పలాయితుఁ డయ్యెను. తనరహస్యవర్తన మొరులకుఁ దెలియునని వానివెన్నంటి పఱవఁడయ్యె. తరువాత, తల్లిని దాసిని లేపి కళానందుఁడు గాయమునకుఁ గట్టుగట్టుకొని, వగచు తల్లి నూరార్చి శేషించినరాత్రి నిదురింపఁడయ్యె. మండూకుఁడు తనకు రెండుమూఁడు ముత్తియములుదక్క తక్కినవి చిక్కకునికికై వగచి మృత్యుముఖమునుండి బైటఁ బడితినని సంతసించి కళానందుఁ డింటనున్న వార్త రణార్ణవున కెఱిఁగించెను. అతఁడును వానికిఁ బారితోషికమిచ్చి మహాసంతోషముతో ఱేనికడకుఁ బోయి యావార్త నెఱిఁగఁజెప్పి సైనికులను సేనానాయకులను గొందఱిని దోడుచేసికొని జాముప్రొద్దెక్కునప్పటికిఁ గళానందుని గృహమువద్ద నిలిచి తపులు దీయుమని కేకలువైచె. ఎఱుఁగక వృద్ధయగు దాసి వెంటనే తలుపుఁ దీయుటయు బిలబిలలాడుచు నందఱు లోనఁ బ్రవేశించిరి. కళానందుఁ డప్పుడే స్నానముచేసి భోజనమునకు సిద్ధముగనుండ

వీ రెల్లరు వానికట్టెదుట నిలిచిరి. విస్మితుఁడై యారాజకుమారుఁడు చూచుచుండఁ గొందఱు సేవకులు హస్తములు పట్టుకొనిరి. ఒకఁడు చేతులకు సంకెలలు వేసెను. ఒకఁడు పదపద మని త్వరపెట్టెను. రణార్ణవుఁడు పకపకనవ్వి "యోరీ! నీవాసుదేవుఁ డద్దురాఁడేమి" యని యడిగెను. ధారుణీదేవి యాదురవస్థఁజూచి కష్టదుఃఖించి యన్నము దినినవెనుకనైనఁ దీసికొనిపొమ్మని వేఁడికొనె. ఆముదుసలిమాటలు వినువారెవ్వరు నందు లేరైరి. నడువుమని వారు త్వరపెట్టుచుండఁ గళానందుఁ డదియె తన కంత్యకాలమని నిశ్చయించి తల్లితో నేమనుటకు నోరాడక యిలు వెడలి రణార్ణవునివెంటఁ బోయెను. తల్లి మూర్ఛిల్లె. కళానందుని దుస్థితికిఁ బౌరు లందఱు గడుజాలి నొందిరి. అట్లు చిరకాలమునుండి రణార్ణవ జరాసంధులకు హృదయకంటకుఁడగు కళానందుఁడు చిక్కుటయు వారు వానిని రాజునొద్దకుం గొనిపోయి యెదుట నిలిపిరి. ఆమహారాజును బండ్లుగీటుచు వానిదర్శనమునఁ గోపాగ్ని ప్రజ్వరిల్ల నొడ లెఱుఁగక ఖడ్గము నెత్తి యేయఁబోవుచుండ రణార్ణవుఁ డడ్డముసొచ్చి "దేవా! భైరవదేవున కర్పింపక యిటుసేయుదురే" యనియె. ఆమాటలు విని జరాసంధుఁడు వెనుకకుఁ దగ్గి "హాదురాత్మా! మగధరాజ్యలక్ష్మికి వైధవ్యము నాపాదించెదవుగా! నీకుఁ గళ్యాణము జరగునా? నీవింకను జేదిరాజుకడ నుంటివని చారులవలన నేను విని సంతసించితి. అతని భంగపెట్టి యిటులఁజేసి మాయలఁ బన్నఁదలఁచితే? శత్రుపక్షములోవారెల్లఁ జిక్కిరి. ఇఁక నిర్భయులమయి యుండవచ్చును. వీని నిఁక గారాగృహమున నుంపుఁడి" యని వారినంపి రణార్ణవునకు వివాహము సేయ యత్నముల జరప నిశ్చయించెను. కాణభూతి యదివిని వగవఁ దొడఁగెను.

## పదునాలుగవ ప్రకరణము.



సహదేవుఁడు జరాసంధక్షమావల్లభునకు ముద్దులకుమారుఁడై గిరివ్రజనివాసులకుఁ గనులచందమామయై సకలవిద్యావిశారదుఁడై బంధులోకసంరక్షకుఁడై పరాక్రమనిధియై శాంతస్వభావుఁడై యలరుచుండు. గుణములలోఁ దండ్రికిఁ గొడుకునకును గల వ్యత్యాసము గనుంగొని బుధజనములు కొడుకు దేవతాంశసంభూతుఁడై మహాపురుషుఁడై యుద్భవించెనని భావించుచుందురు. రాజలోకమును దండ్రి బంధించి భైరవపూజకు దిక్కుమొక్కరుని వధియించుటఁగాంచి కుమారుఁడు మిక్కిలి యక్కటికమునంబడి చేయునది యేమియును లేక తన కట్టిపని కిట్టదనియు నట్టియొప్పనిపని ప్రకృతిజనుల కసూయగావించుననియుఁ గ్రూరకర్మనిరతుఁడగు రాజు నైశ్వర్యము చిరకాలము నిలువదనియు మంత్రులచేఁ బలుమాఱు చెప్పియంపె. తండ్రి యమ్మాటలు సరకుఁగొనక తేజోవిహీనులైన కొందఱు పౌరులమాటలువిని కొడుకట్లు పలుకఁ జొచ్చెనని నవ్వుకొనుచు యూరకొనుచు వచ్చె. జయసేనుని జెఱఁబెట్టిన నాఁటఁగోలె నీసహదేవుఁడు నెమ్మనమునకుఁ దీఱని యమ్మలికము బైలుపొడమ నెచ్చెలు లెందఱు నివారింప నెంతయత్నము చేసినను వారింపఁబడఁడయ్యె. సహదేవుఁడు యువరాజయ్యు రాజఠీవికి లాఘవమగునని యెన్నక యప్పుడప్పుడు ప్రకృతిజనుల యభిప్రాయము లెఱుఁగుటకు వారితోఁ గలసిమెలసి వర్తించుచుండును. కావున వారతనితండ్రికార్ర్యము మొదలగు గుణములు చెప్పుకొని భయమునొంది కొంద అన్యరాష్ట్రములకుఁ బాఱి యందుల నివసింపఁగలఁచుట విని తన యమ్మలిక మినుమడియై నెయ్యరితోనైన మాటలాడక నిరంతర విచారాధీనమానసుఁడై యుండఁజొచ్చెను. పువ్వుఁదోటలలో విహరించుటమాని, యువరాజానర్పవలసిన రాజ్యతంత్రములజోలికిఁ జనక ప్రియమిత్రులతో సల్లా

పములు సలుపక విదూషకాదుల హాస్యములకు మందహాసమైనఁ జేయక, గజాశ్వరథముల నధిరోహింపక యంతిపురమునకుఁ బోయి ప్రియురాలితో ముచ్చటింపక దీనాననుండై యున్న కుమారుని వైఖరినంతయు సేవకులవలన విని జరాసంధుఁడు తత్కారణముల నరయవలయునని యాతఁడున్న తావునకుం బోయె. మహారాజుగారి రాక విని యువరాజు దిగ్గునలేచి పాదాభివందన మాచరించి వినయమును సూచించు నెమ్మొగముతోఁ బ్రక్కను నిలిచెనేకాని యామొగమునఁ దండ్రికి నేత్రానందకరమైన తొల్లిటి వికాసము గానంబడదయ్యె. జరాసంధుఁడు ప్రియపుత్రుని బిగియారఁ గవుంగిలించుకొని శిరము మూర్కొని తానొక యాసనముపైఁ గూర్చుండి చెంత నొక్కపీఠముపైఁ గుమారుఁ గూరుచుండఁ బనిచి మీఁదఁ జేయివైచి తట్టి యిట్లనియెను.” వత్సా! నీకింతనెవ్వగకుఁ గారణంబేమి? భారతవర్షమునంగల రాజుల నందఱ నిర్జించి వారిని బాదాక్రాంతులుగఁ జేసి తదీయైశ్వరము లపహరించి యగారముల నింపితి. అమాత్యసుహృత్కోశాదిసప్తాంగపరిరక్షిత మయిన రాజ్యలక్ష్మి సేమమున నున్నయది. ఎంతలెంతలు శత్రువులు నారాజ్యలక్ష్మిని నన్నును దేఱిచూడఁ జాలరు. నీవ నాప్రాణము, నామనోరథము, నాజీవము, సేవకులు నీపనుపు చేయరా! మంత్రులు దండనాయకులు నీనియోగము నడుపరా; పరరాజులు నీకు వశవర్తులుగారో, యంతిపురింగల యెల్లసుందరిగాని నీమనోరథము ననుసరించి మెలఁగదో, యెవ్వ రెట్టియవినయమును నీదెసఁజూపిరో యెఱిఁగింపుము. భయంకరశాసనుఁ డగు నీతండ్రి వారిని గఠినశిక్షకుఁ బాలుచేసి నీయలుక వోవనడచు. కుమారా! నీమహామందిరములు, నీకొలువుకూటములు, నీపూవుదోటలు, నీయపారధనసంచయంబు నీయనర్ఘమణిపుంజము, నీయాజానేయపారసీకతురంగములు నీభద్రజాతిగజములు, నీమహాయుధములు, నీసేనలు, నీలేఁబ్రాయఁపుసుందరులు నీ కింపుఁబెంపఁజాలకున్న నాకివి

యన్నియు నేల? నీవు వగచుచుండ నాకీరాజ్యలక్ష్మి సుఖముఁగొల్పునే? ఈధనము నాకానందమును గల్గించునే? ఇవి యన్నియు నీనిమిత్తముగాక నాకొఱకా? నిన్ను యౌవరాజ్యమున కభిషిక్తుంజేసితి. కొలఁది కాలమున నీకీరాజ్య మశేషము నభిషేకించి యేను దపోవనమున కరుగఁ జూచుచున్నాఁడ. ఇంత మహదైశ్వర్యమధ్యమున నుండ నీకింత వగపునకుఁ గారణ మేమి? నారదాదిమునులు ముల్లోకములఁ గ్రుమ్మరి వచ్చి నా యైశ్వర్యముం గాంచి దీనికిఁ దులయగునది యేయుగమున నేజగమున లేదని నుతియించుచుందురు, నాతండ్రీ! నీమనోగత మగువ్యథ యేదియో తెలిపి నన్నుం గృతార్థుంజేయవే యని గడ్డము పట్టుకొనియెను. ఈవేడికోలును విని సహదేవుఁడు తండ్రికిఁ దనపైఁ గల కూరిమికిఁ దగిన తెఱఁగున దాను మృదుమధుర వచనముల నిట్లనియె "తండ్రీ! అకుంఠిత మైన దేవరపరాక్రమ మెఱుఁగుదు. దిక్పాలకుల సంపదలను మించిన యీమహదైశ్వర్యము ననుభవించుచున్నవాఁడ. చండశాసనుఁడవగు నీయాన నతిక్రమింప నెవరితరము? నాపనుపు లందఱుఁ గడువినయభయములు గదుర సేయుచుందురు. నాకెందునను లోపములేదు. కాని యీభోగములవలన జనించు సౌఖ్యములనెల్లఁ గప్పిపుచ్చు నొక మహాసంతాపము నాహృదయముఁ గాల్చుచున్నది. నాపై నలుగకుండ నదియెల్ల వినుము. నీయొనర్చు క్రూరకర్మములంబట్టి ప్రకృతిజనులకు మనపై నసూయ వొడముచున్నది. నిరపరాధుఁడైన జయసేనుని గారాగృహమునఁ బెట్టించితివి. వృద్ధుఁడును బౌరులకు హితుఁడునగు నాతని తండ్రి విజయసేనుఁడు పుత్రవియోగముచేఁ గృశించి మరణావశిష్టుఁడై యున్నవాఁడని వినుచుంటి. విజయసేనుని యిల్లాలు మహాపతివ్రత, తారావతి చిక్కి శల్యమైనదఁట. ఒకమనుజుఁ డుసురుపడనేని, యొక్కపతివ్రత క్షోభపడిన రాజ్యము నాశనము నొందుట యేటివింత! ఆలుబిడ్డలను మగని నెడఁబాయఁజేయుట దోసము గాదే! నే

రములున్న శిక్షించుట రాజధర్మము. లేకున్న విడుచుట యుచితము. ఎంతకాలము విచారణలేక యాతఁడు చెఱలోనుండుట? అపనింద తన మీఁద వేసినకతమున నాతనిమతి చెడియె. ఈపాపములు మనలఁగొట్టు ట యటుండనిమ్ము. చంద్రపాలుఁడు రాజభక్తికిఁ బెట్టినది పేరు. అతఁ డు మనకుఁజేసిన యపరాధ మేనెఱఁగినంతవఱకు నెన్నఁడును లేదు. నీక తఁడు బాల్యస్నేహితుఁడు. అతనికిఁ బుత్రసంతానములేదు. లేక లేకకలిగిన యాసౌందర్యతిలకను దన కిచ్చవచ్చినవానికిఁ దనకూఁతురు వలచినవా నికి నిచ్చి పెండ్లిసేయఁదలంచుట వాని తప్పగునే? జనులు చేసికొను సంబంధబాంధవ్యములలో రాజులు జోక్యముఁ గలుగఁజేసికొందురేని యది యనర్థము గలిగింపక మానదు. రణార్ణవుని గుణములు సౌందర్య తిలక మెచ్చదు. అబలయనక సుకుమారియనక నాపుత్రుఁబోఁడిని గూడ బంధించితివి. ఇందులకు జనులు నిన్నెట్లు నిందించుచుండిరో నీ వెఱుం గవు, నీకు జడిసి నీయనుచరులు నీముందట నీ సలుపు పనులు నుతియిం చి యావల నిన్ను బ్రువ్వఁదిట్టుచుందురు. ఇంక దల్లిదండ్రులకుఁ గూఁ తుల వివాహముల విషయమై స్వాతంత్ర్యము నశించినదని జనులు చె ప్పుకొనుట విని నాకుఁ గష్టముగనున్నది. ఆసౌందర్యతిలక యన్న ము ముట్టుటలేదు. నీరుత్రాగుటలేదు నీవు రణార్ణవున కీబాలిక నీయని శ్చయించితివేని వజ్రపుంబొడి మ్రింగి మృతినొంద నామె నిశ్చయిం చుచున్నయది. పురజనుల కాబాలికపైఁ బ్రేమమెండు. అది గాక క ళానందుని బట్టి తెప్పించి చెఱఁబెట్టించితివి. అతఁడు సౌందర్యతిలకపైఁ బ్రాణము నిలిపియున్నవాఁడు. ఆమెను రణార్ణవునకీయ నీవు యత్నిం చుటమొదలు రాజద్రోహమునకు యత్నము సలిపెనేగాని యంతకు మున్ను మనతోఁగలసి వాసుదేవునిపైఁ గత్తిగట్టఁడే? అతఁడు బలవం తుఁడు. మతిమంతుఁడు. గుణవంతుఁడు. వానిని మనమెట్లో స్వజన ములోఁ గలపికొనుట రాజ్యలక్ష్మికి శ్రేయము. కళానందునకు సౌంద

ర్యతిలకనిచ్చి పెండ్లిసేయుటయుఁ, జంద్రపాలుని విడిచిపుచ్చుటయు, జయసేనుని విముక్తుఁ జేయుటయు నర్హాకృత్యములు. వెండియు నిరప రాధు లగురాజులఁ బెక్కండ్రబంధించి దినమొక్కని మహాభైరవున కర్పించుట యతికౄరముగాదె? తోడిమానవుల నందును మహారా జులఁ బసులుమేఁకలట్లు తెగనఱికి యీశ్వరతృప్తిసేయుట హేయభాజన ము. సమస్తజనములకు నీయందసూయకలుగుట కిదే కారణము. ఆ రాజులను విడుచుట యుచితము. మఱియు వాసుదేవుఁడు విష్ణ్వంశము న దుష్టులశిక్షింప యదుకులమునఁ బుట్టెనని మును లనుచుందురు, స్వ జనమునకు మనపై నిపుడు పెద్దయసూయ గలిగి యున్నది. ఇది యద నుగ వాసుదేవుఁడు మనల నెట్టియేని జేయునని భయమగుచున్నది. నాకును మాకుటుంబకును మాచెలియండ్రగు కంసభార్యలకును దుస్వ ప్నములు దుర్నిమిత్తములు పెక్కులు గలుగుచున్నవి. అమ్మయుఁ దోఁ బుట్టువులును గంటికి నేలకు నేకధారగ నేడ్చుచున్నవారు. మగవాఁడ నగుట నేనించుక ధైర్యము చిక్కఁబట్టియుంటిని నాయుమ్మలికమునకు నామనోవేదనకు నిదియే కారణము. మొగలియాకులోని మాటలు "మగధరాజ్యలక్ష్మికి వైధవ్య" మనునది హృదయశల్యములవలె న న్నుఁ బీడించుచున్న యవి. తండ్రీ! నాచెప్పినచొప్పున వర్తించి నీకపా యము వాటిలకుండఁ జేసికొని వంశము రక్షింపవే" యని పాదముల పైఁబడి కన్నీరొలుక దుఃఖించి యచటనుండి లేవఁడయ్యెను.

అనుగుల పైఁబడియున్న కొడుకును లేవనెత్తి మగధరాజొక చోట వానిని గూర్చుండఁబెట్టి యాతనికిఁ దనపైఁగల నిండుప్రేమకు మెచ్చి యాతని బేలతనమునకు జాలినొంది యాడినపలుకులకుఁ గినిసి యిట్టులనియె. "కుమారా! ఆఁడువారగుట మీయమ్మయుఁ దోఁబు ట్టువులును వగచిన వగతురుగాక! మగవాఁడవై యన్నియుఁ గన్నులఁ జూచుచున్న నీవిట్లు తుందఁ జెప్పెదివేమి? జయసేనునియందు దోషము

గలదని నేననలేదు. అనుమానముచే నాతని బంధించితి. మతిచెడిన నాతనికర్మము నేనేమి సేయుదును? తండ్రి బెంగఁగొనినాఁడనియు నిల్లాలు వగచుచున్నదనియు నపరాధుల విడిచితిమేని యిఁక రాజ్యతంత్రము జరుగుటెట్లు? అట్లుసురు తగులుటకు జంకితిమేని ధరాపరిపాలనము మాని యడవుల మునివృత్తినుంటమేలు. జయసేనుని గొలఁది దినములలో విడిచిపుచ్చెద. కళానందుఁడు పాపాత్ముఁడు. వాఁడు చేసినచేతఁ దెఱిఁగియు వ్రాసినవ్రాఁతలు చూచియు వానిని విడిచిపుచ్చుమని పలుకుటకు నీకు నోరెట్లువచ్చె. రాజద్రోహి యదృష్టవశమునఁ జేఁజిక్క వానిని విడుపుమను నుడువులు కొడుకవగు నీనోటినుండి వచ్చెనుగాని వేఱొకఁ డుచ్చరించిన నీవఱ కాతనిని యమలోకమునకుఁ బంపియుందును. సింహపరాక్రమనుగల నాకడుపున మేఁకపిల్లచాడ్పునఁ దేజోవిహీనుఁడ వైననీ పుదయించితివని తద్దయుఁ గుందుచున్నవాఁడ. ఆదురాత్ముని రక్తధారలు గురియకున్న నాకోపాగ్ని చల్లారుటయెట్లు? చంద్రపాలుఁడు నాపలుకులు నిరాకరించి నందుల కట్టుబంధించితివి. హానిపాగరట్లు చేసినది. కళానందునకుఁగాని కూఁతునీయనఁట. చంద్రపాలుఁడు సౌందర్యతిలకయుఁ జూచుచుండఁ గళానందుని శిరము నరికి భైరవదేవునకు రక్తాభిషేకము గావించి యర్చించి యాదినముననే యాబాలికను రణార్ణవునకిచ్చి పెండ్లిచేసెదను. ఈరెండింటికి ముహూర్త మొక్కనాఁడ యేర్పఱుపవలయును. అవియన్నియు నటుండనిమ్ము. ఆవాసుదేవుని కింత యడలెదవేమి? వాఁడు కులహీనుఁడు, మానహీనుఁడు, జారుఁడు, చోరుఁడు, నీచుఁడు, బసులఁగాచికొని జీవించువాఁడు. వాఁడా నన్ను నిర్జించుటలు. ఈవఱకు నాచే వాఁ డొకటిరెండుసారులు కాదుగదా యిరువదియొక్కసారి పరాజితుఁడై నాధాటి కాగఁజాలక పితృపితామహుల నాఁటఁగోలె నివాసమైన మధురాపురమును విడిచి సముద్రమధ్యమున ద్వారకానగరము గట్టుకొనియెను. ఆదొంగ, యాపాపి, యాయధముఁడు

శ్రీమన్నారాయణుని యవతారమని యడవులఁ జరియించు మృగప్రాయులగు మానులు, నీచులగు పాండవులు వానికాళ్ళు పట్టుకొందురు. కాని నేనాపలుకులు విశ్వసింపను. ఈయభాగ్యుఁడేమి! విష్ణునవతారమేమి! నాకొడుకువై నీవెట్లునమ్మితివి! రాజులందెచ్చి నేను భగవంతుఁడైన భైరవదేవుని మెప్పించుచుంటి నది క్రూరకర్మమైనను సరే మతిరోమైనను పరియే మెవ్వరుచెప్పినను మానువాఁడనుకాను. స్వప్నశకునములు కాకతాళీయముగ నగుచుండును. వానిని విశ్వసించి వగచినం గాదు. నాకేమియు భయములేదు. మీరు వగవకుండు డంతియచాలు. నీవింక లోనికిఁబొమ్మా." యనిపలికి తాను కొలువుకూటమునకుం జని కళానందుని బట్టించిన దండనాయకునకు బహుమానము లిచ్చి సౌందర్యతిలకార్ణవుల వివాహమునకును గళానందుని మరణమునకును సౌఖ్యముహూర్తము నిశ్చయింపుఁడని సిద్ధాంతుల రావించి నియోగించి కొలువుచాలించెను.



## పదునేనవ ప్రకరణము.



అట శిశుపాలుఁడు తనమనోనాయిక యగు నిందుమతి బంధుగు తెన్నఁడునత్తునో, యెన్నఁడు మనోవ్యథయశేషము హరియింపఁబడ నిందుమతీపాణిగ్రహణము చేయఁగల్గుదునో యని గిరివ్రజమునుండి వెళ్ళి చేరివచ్చిన వారింటిలోపలంపి జాతవేదుని వృత్తాంత మడిగితెలియవచ్చునే యని యరయుచు నిన ముక్కమమాఘముగ మునగాఁ గడపఁ జొచ్చెను. ఇంతలోపలికి నామొకడనున్న దాసికి మైత్రి నానాఁట నతిశ్రద్ధముగ నాటుకొనుటచే దదనంతరము హేమావతిచెప్పిన రహస్యములనెల్ల దానికెఱిగించి యదియుఁ దాను నొకరాత్రివిరామధ్య నమయమున కలసిమెలసి యుండిరి. దాసియు శిశుపాలుని [illegible]

శ రాజాంతఃపురమున వసియింపఁదలఁచి కాలమున కెదురుచూచుచుం డెను. కృష్ణునిచారుఁడు కుశీలవుఁడు తనజాణతనమునఁ జేదినగరమున నిలిచి శిశుపాలుని మనసు మెప్పించి యాతనికిఁ దనయందు విశ్వాసముఁ గలిగించుచు జాలవేదుఁడు తన్నిందుమతిసేవమునిమిత్త మచ్చటవిడు చుటచే నామె కేయుపాయము రాకుండ మెలఁకువతో వర్తింపసాగెను. శిశుపాలుఁ డప్పుడప్పు డిందుమతియుండు మందిరమునకువచ్చి యామె తో సరససల్లాపములకుంజొచ్చి కడుఁబ్రీతుఁడై యుండు. ఇట్లు లొండొ రుపు లమపుమెఱసియుండ నొక్కనాఁ డిందుమతి మహారాజును ద్దేశించి వినయముగదుర మొగమునఁ జిఱునగవు వెన్నెలలుగాయ నిట్లనియె. "దేవా! నాకొక్కకోరికయున్నది. హేమావతిని గాంచి చాలదిన ములయ్యె. దాని నింకొకమాఱు చూచి కొన్నిపొద్దులచ్చటఁ బుచ్చ వలయునని మనము నభిలాషము వొడముచున్నది. నాయీమనోర థము సఫలముఁజేయ దేవరవారి చరణారవిందముల వేఁడుకొనుచున్న దాన. మరల నతిశీఘ్రమున మీకడ నుండుదాన" నని యమృతరస మొలుకునట్లు పలుకుచుండు ప్రియురాలి వచనము విని తన్నతిధన్యుని గా భావించి చేదిరాజు మెల్లమెల్ల నాపల్లవపాణితో నిట్లనియె. "హృ దయేశ్వరీ! నీమనోరథముఁ దీర్చుట నామనోరథముఁ దీర్చుకొంటగాదె! నీకుంగల యీకోరికఁ దీర్పనేని నేనేల? నారాజ్యమేల? ఎల్లి నీవు చం దనపురమునకుంజని నీకును నాకును సంగమకారణభూతిక యగు హే మావతింజూచి మూఁడుదినములలోఁ గ్రమ్మఱిరమ్ము. నీవు లేనిదినము ల నీమందిరము చంద్రుఁడులేని రాత్రివలెఁ గళాహీనమై యుండు. ని న్నెడఁబాసి యాదినములు ప్రాణములెట్లునిలుపఁగలనో నాకుఁ గడుసం దియమగుచున్నది. నీముఖలావణ్యము కన్నులకఱవుదీఱఁ గ్రోలఁగ ల్గుగుట లభింపదేని యాదినము దుర్దినముకాని సుదినముకాదు. నీ తోడ మనకుశీలవుని నీకుఁ గడుగూర్చు నాదాసిని తోడుకొని పల్లకి

యెక్కి రేపటియుదయమునఁ బైనమైపొమ్ము. హేమావతిని నేను చాలనడిగితిననియుఁ దనమేలు మఱవఁజాలననియు నాకృతజ్ఞతను దెలుపుము. వివాహమునకుఁ దప్పక రావలయుననుము. వైళము రాకపోయెదవుసుమీ. నను జంపుకొన్నట్లె" యని యొట్టుపెట్టుకొని తద్వియోగమును భరింపనోపక పెక్కువిధముల నంగలార్చి మఱునాఁడు చందనపురమునకుఁబోవ నిందుమతి కొక్కపల్లకియు దాసి కొక్కబండియు సిద్ధముచేయించి వెంటఁ గుశీలవుని బొమ్మని యానతిచ్చి రాజు నిజాంతఃపురమున కరిగె.

తనసంకల్పము సిద్ధించినదని యిందుమతి యత్యానందభరితయై మఱునాఁడుదయమునఁ బల్లకియెక్కి కుశీలవుఁడు పాదచారియై వెంటరా శకటారోహణమొనర్చి దాసి వెంబడింప బయలుదేఱి చందనపురమునకుఁ బోయెను. ఆమె చనినచోటున నెంతకు నెడఁబాయరాని నెచ్చెలు లుండుటంజేసి కాఁబోలు నాయిందువదన రాజుతో వాగ్దానముచేసినట్లు మూఁడుదినములనాటికి రాఁజాలదయ్యె. ఆయెలనాఁగ యన్ననాఁటికి రాకమికి శిశుపాలుఁడు వర్ణింపనలవికాని యలమట నొందఁజొచ్చెను. ఆమూఁడుదినములు ప్రాణములు బిగబట్టియుండి దినత్రయమగుటయు నెంతయుఁ గలవరమొందసాగె. అదియటులుండ నాలుగవనాఁటి రేయి యిందుమతీవియోగవ్యథచేఁ బాన్పుపైఁ బొర్లుచు నుమ్మలికము నొందుచు రాజుండ మున్ను గళానందునివెంటనంపఁబడిన సేవకులలో నొక్కరుఁడువచ్చి వాకిటనిల్చి తనరాక మహీవల్లభునకు విన్నవించెను. ఱేఁడు వానిని లోనికి రమ్మని వానిముఖవైఖరిఁజూచి సందియమొంది యోరీ కళానందుఁడు సురక్షితముగ గిరివ్రజముచేరెనా లేదా యని యడిగెను. సేవకుఁడు భయమున వడఁకుచు గద్గదకంఠుఁడై యిట్లనియె. "దేవా! మే మొకనిర్జనప్రదేశమున నిదురింపుచుండఁ బెబ్బులి యొకటి మాపైఁ గవియవచ్చె. అందఱమును భయభ్రాంతుల

నై తలవంచుకొనిపోఁగఁ బరువెత్తితిమి. మరల నేఁటికి నెంతో యత్నములఁ గాం చఁజాలమైతిమి. స్వామిభక్తిచేత నేనాటనైనఁ గళానందుఁడు దృష్టి గోచరుఁడగునేమోయని కనుఁ బ్రయాసపడి పలుదేశములు వెతకియుంటి తిని. ఎందును జాడయేని గానక విసిగి దేవరపాదములసన్నిధికిఁ జేరు కొంటిమి" అని శిశుపాలుఁ డదరిపడి దిగ్గున లేచి కోపారుణితలోచనుం డై "ఓరీ దురాత్ములారా! ఎంతపనిఁ జేసితిరిరా! ఇఁక మగధరాజు మొగము నెట్లు చూతును? అతని రాజ్యలక్ష్మి కపాయముఁ జేయఁజూచి న దురాత్ముఁడు చేతఁ జిక్కియు నిట్లు పలాయితుఁడయ్యెనే! జరాసంధు నకు దండనాథుఁడనై యుండి యింతపాటిమేలు మహాత్మునకుఁ జేయఁ జాలనైతి. నాపాల సేవ జేయుచున్న మీరందఱు నాకింత ద్రోహముఁ జేసి తలవంపులు దెత్తురే! ఓరీ! సేవకులారా! ఈయధమజాతి మను ష్యుని వధియింపుఁడు. స్వామిభక్తిలేక రాజద్రోహిని విడిచినపాత కుని మొగముఁ జూడరాదు. వీని నతిత్వరితముగ మృతుఁ జేయుఁడీ" యని యానతిచ్చెను. కింకరులు వానిం గొనిపోయి వధించిరి. ఉరిసిన పుండు మీఁద నుప్పువెట్టినట్లు ప్రియురాలి వియోగముచేతనే వనటఁ బొందు చున్న యాకుంభిరుఁడు కళానందుని పలాయనమువిని గట్టుమీఁదికి కో పప్రవాహముగ నా నిరపరాధుని జంపించి రాత్రియంతయు నీరెండు కారణములచేతఁ గంటికి గూర్కురాక బిట్టలమటనొందుచుఁ జైద్యుఁడు భూలోకముననె నరకబాధ ననుభవించుచుండెను. ప్రియురాలు రేపువ చ్చును మాపువచ్చునని యాఱుదినములు చూచి తుద కామె కెద్దియో బాధ గలుగుటచే రాఁజాలదయ్యెనని నిశ్చయించి, కుశలవ్రుడైనఁ దనకా మెవార్త నేలవిన్నవింపఁ డయ్యెనని వానిపై నలిగి, హేమావతి కింత తె లివిమాలినతన మేలయుండవలయునని, యామె యాఁడుది, యేమిచేం గలదని తుద కామె సేమ మరయఁదలఁచి యిరుగురు సేవకులఁ బిలిచి చ దనపురమునకుఁ బోయి హేమావతి యుంటున్న యింటియందు వా

కొంతవడికి ప్రభుప్రసాదమతి శిరసావహించి యిరువురు సేవకులును జని యాగ్రామమం దంతట హేమావతియింటి నరసి యెవ్వరు నిది యది యని తెలుపమి మరలవచ్చి యావార్త స్వామికి నివేదించిరి. ఆపలుకులు విని చేదినాథుఁడు మహాకోపమున మండిపడి యాగ్రామములోనికరిగి యందుఁ గాఁపురమున్న జనులవలన తెలిసికొనఁజాలని మందప్రజ్ఞలు నాకడ నున్నవారుగదా! ఈహీనుల నుద్యోగములనుండి తొలఁగింప రాదేయని వారినట్లుచేసి తానే స్వయముగఁ జందనపురికిం బోయి ప్రియురాలిని వెంటఁబెట్టుకొని రాఁ దలఁచెను. మఱునాఁడు సూర్యోదయమునకు మున్న మేల్కాంచి యనుష్ఠానములఁ దీర్చుకొని సకలభూషణభూషితుండయి పవనజవముగల పారసీకహయములఁబన్నిన యరదము నెక్కి పదుగురాశ్వికులు నూర్వురు పదాతులు దన్ను బలిసి కొలువ వైభవముతో నాతఁడు చందనపురమునకుఁ జనియెను. ఇతనిరాకవిని పౌరులందఱు నతిభక్తియుక్తులై యూరుబైటవచ్చి నిలిచి రాజుంగాంచి సత్కారములందఁజేసి తగుమందిరమున విడియించిరి. భోజనానంతరమున శిశుపాలుఁడు గ్రామమునందలి పెద్దలఁగొందఱఁ గాంచి హేమావతి యిల్లెక్కడనని యడిగెను. వార లొండొరుల మొగంబులు చూచుకొనుచు వెలవెలఁబాఱుచు నామె యిల్లెఱుఁగమనిరి. అట్టి భువనైకసుందరి సుప్రసిద్ధురాలుగదా యామె యిల్లెఱుఁగనివార లుందురే! ఇది చిత్రముగానున్నది యని యూరిలోని జనులందఱఁ బిలిచి యడుగ వారును న[illegible] తమయజ్ఞానమును వెల్లడిసేసిరి. రా జాశ్చర్యమహాగ్రహములం త[illegible]ం బీడింప హేమావతియిల్లెఱిఁగినవారున్న వచ్చి చూపుఁడని చాటించెను. చాటుటయే గాని వానిఫలము తొలుతకన్న నెక్కుడేమియుఁ [illegible]బడమి రాజా విచారము నొంది చేదిపురమునుండి మున్న హేమా[illegible] జాతవేదుని నిటలముల నిండుమతిని మోచితెచ్చిన బోయలఁబిలువ[illegible]ను. బోయలువచ్చి కట్టెదుటనిలిచి మ్రొక్కం జూచి వారలతో

నోరీ జాతవేదుని హేమావతిని మొన్న నిందుమతిని మీా రేగృహమున దింపిరో చూపుఁడని వారిని వెంటనిడుకొని పరిజనముతోఁ బోవ వా రూ రికట్టకడకుంజని యట పాడుపడి నిర్జనమయిన యొక పాత్రియిల్లు జూ పి వారందఱు నిందువిడిసి మమ్ముఁబొమ్మని యానతిచ్చుచు వచ్చిరి. అంతకన్నఁ దా రెద్దియు నెఱుఁగమని యూరకుండిరి. ఆపలుకులు విని రాజు విస్మితుఁడై యిదియంతయు మాయగాఁ దనమదికిందోఁప హే మావతిని దనప్రియురాలిని మొఱకులెవ్వరయినఁ దమయింట దాఁచి యుందురని గ్రామమునఁ బ్రవేశించి యందున్న యాఁగనల నందఱఁ జూచి శోధించి యందు హేమావతియు నిందుమతియు లేకపోవుట యె ఱింగి దుఃఖింపసాగెను. పురజనులు రాజునెదుటకు వచ్చుటకు సిగ్గుపడి కడుమనోవ్యథ నొందిరి. పురమెల్ల చాందోవ్రిదయఘూర్ణమానసాగ రముచందమున నుండె. ఆబాలగోపాలము నిట్టిరాజునకు మరణమెన్నఁ డు సంభవించును దైవమా యని బ్రివ్వదిట్టిరి. అనంతర మామహారా జు మహాదుఃఖము నాగ్రహము మల్లడిగొని యొడలెఱుంగక స్యందనా రూఢుఁడై నిజపురమునకుంజని తల్పమునఁ బవ్వళించి రాజ్యవ్యాపారము విడిచి మిత్రులతో మాటలాడక పట్టపుదేవి రా మొగమేనియుం గనుం గొనక యనుజుల మాటల కుత్తరములీయక యాహారనిద్రలుమాని దుః ఖార్ణవమగ్నుఁడై యుండి యాత్మగతమున “ హా యిందుమతీ ! ప్రాణేశ్వరీ ! భువనైకసుందరీ ! యెందుఁబోయితే. న న్నెడఁబాయుట కు నీమన సెట్టులొప్పె ? నేను నీదాసుఁడ నీకు విధేయుఁడనంటి ! ఇట్టి దీనుని భంగపెట్టి దూరదేశమున కరుగుట యుచితమే ? నీనిమిత్తము క రభమహామునిశాపముల పాలైతి. కటకటా జాతవేదుఁడు కడునేర్పరి తనముతో వంచించె. నే నాఁడుదానిచేత వంచింపఁబడితి. జాతవేదుఁ డు కృష్ణునిపనుపున నన్నువంచింప వచ్చినటక్కరి గాకుండునే ? హేమా వతి యాతనిచేతఁ గల్పింపఁబడిన మాయాంగన. అదియు యిందు[illegible]

నింతకాలము నాకడనమ్మించినట్లు నిలిపి తుద కిట్లువంచింపుమని యిందు మతి కుపదేశింపనోపు. ఆమెపన్నుగడ నిర్వహించుటకుఁ గుశీలవుఁడింత చేసె. హా! జాతవేదా! ఎంతఁగపుసుదనముగాఁ బ్రవర్తించితివిరా! జరాసంధుని వ్రేలియుంగరమెట్లో కపటమున నపహరించి నాకుంజూపి కళానందుని నాచెఱనుండి ముక్తునిఁజేసిన పాతకుఁ డాజాతవేదుఁడే యై యుండనోపునని నాకుఁ దోఁచుచున్నది. ఆజాతవేదుని మొగమును హేమావతి మొగమును నచ్చుగ్రుద్దినట్టు పోలియుండు. వాఁడే హేమావతి వేసమువేసి నను భంగపెట్టలేదుగదా! అదియే నిజమని తోఁచెను. ఇందుమతికిఁ జుట్టములు గిరివ్రజమున నుండరు. అదియునువాని మాయయే అయ్యో! ఆలతకూన నాకెట్లుచేకూఱు. నేనింకజీవింపను. అయినను దానింగూరిచి యరసి కనుఁగొందము. ప్రయత్నలోపమేటికిఁ జేయవలయు" నని విచారించి నలువురు సేవకులం బిలిచి మీరలు గిరివ్రజమున కరిగి కళానందుఁ డందు రాజుచేతఁ జిక్కెనో లేదో యిందుమతి చుట్టము లందున్న వారా లేరా కనుఁగొనిరండని పంచెను. మరియు గూఢసంచారులగు చారులంబంచి చేదివిషయమునకుఁ జుట్టుపక్కలనున్న సకలదేశముల కంపి యిందుమతి జాడల నరయవలయునని యానతిచ్చి తద్విరహతాపమునఁ దాను గృశించి కను వందుచుచుండె.



## పదునాఱవ ప్రకరణము.



కళావందుఁడు నిర్హేతుకముగ మగధరాజుచేఁ బట్టువడియెనని కాణభూతి పెద్దయువగచుచుఁ గోరకుఁడు లేమి నింతపుట్టెనని చేయునది లేక మూఁగవానివేసముతోఁ నగరమునం దిరుగుచుండెను. యోగిని జరగిన చర్యలన్నియు విని జరాసంధుని నిశ్చయమెఱింగి యచ్చటనెయుండి యున్నిపనులు సంపూర్ణముగ జరిగిన పిదపనె యచ్చట నుం

డీ చనవచ్చునని నిరంతరసంతాపహృదయుఁడైయుండె. రణార్ణవుఁడును దనకోర్కెలన్నియుఁ దలఁచినవి తలఁచినట్లు కొనసాగెనని యమితానందభరితుఁడై చెలిమికాండ్రం గూడి మనసుదీఱ భక్ష్యములమెక్కి మద్యపానములఁ జొక్కి వెలయాండ్రయాటపాటలం దనిసి భూలోకపుణ్యసౌఖ్య మనుభవించుచుండెను. జయసేనుఁడు కారాగృహనివాసమున కలవడి చెడినతనమతి క్రమక్రమముగఁ దనయంతఁజాన చక్కఁబడి యథాస్థితికి రా నించుకప్రాపంచికజ్ఞానము మరలఁదెచ్చికొని తన నిరపరాధతకును జరాసంధుని యరయమికిని వగచి తారావతియు, రాజసేనుఁడు విజయసేనుఁడు సురక్షితులైయున్నవారే యని కోటలోపలి సేవకుల నరసి తెలిసికొనుచు నొకవిధముగఁ గాలము కడపుచుండెను. తనకుమారున కెన్నటికిఁ జెరనుండి విముక్తి కలుగదయ్యెనని యాఱనిదుఃఖముపాలై విజయసేనుఁడు చిక్కి మంచమెక్కి తనకన్న దురటిల్లు తారావతి యేమగునోయని బెంగగొని పండువలెనుండుచునట్టి సంసారమింతవఱకుఁ దెచ్చితే దైవమా యని మనస్థిమితము గానకుండెను. పురమున వాడలంబడి బిచ్చమెత్తుకొను గ్రుడ్డిముసలివానిని కృష్ణునిచారునిగా వగచి కారాగృహమున రాజు బంధింపఁ జేసిననాఁటఁగోలె వాఁడు రుగ్ణతకు లోనై తగుచికిత్సలేమిఁ దుదకు దారుణసన్నిపాతజ్వరపీడితుఁడై మున్నె చెడినమతి మఱింత చెడ మరణావస్థుఁడై తనభారము పురజనుల భారమున నడగునట్లు పరలోక ప్రయాణమునకు సిద్ధముగ నుండెను. పురజనులు వానిచేత విని యింతఘోరమెందును గని విని యెఱుంగమనిరి. చంద్రపాలుఁడు తానట్లగుటకు వగచిన దానికన్న గూఁతురు మగధరాజు నంతిపురమున నుంటయు, నామె మనోహరుఁ డాదుర్వస్థలో నుంటయు, మగధవిభుఁ డామెలనాఁగను రణార్ణవునకుఁ బెండ్లిసేయఁ గృతనిశ్చయుండగుటయు, గూఁతు రాఘోరకార్యము జరగకమున్నె వెనుకనో తప్పక యుసుఱుబాయునని తలఁచితలఁచి యు

పుడు శోకించి యాదుర్వార్త తనచెవిని బడకమున్న తానె ముందుగా మరణమొందుట లెస్సగా నుండుననియు నది యెట్లు చేకూరుననియు యోజింపఁ దొడఁగెను. సౌందర్యతిలక కొన్నినాళ్ళు ప్రియజనకుని దుర్గతిఁదలఁచి చింతించి యనంతరము తనకుఁ బాటిలిన తలఁపరాని కష్టమునుగూర్చి కొండొకవగచి నేఁడు హృదయేశ్వరుఁడగు కళానందుని వంతు వచ్చినందుల కెంతయుఁ బొగలఁజొచ్చెను. జరాసంధుని కూఁతురు నంతఃపురాంగనలు దాసీజనములు నెంతధైర్యము సెప్పిన రణార్ణవుని ప్రజ్ఞాదికము నెంతపొగడిన నాయింతి పెడచెవులం బెట్టి యాహారింపక నిదురింపక నిరంతరబాష్పపూరితలోచనయై తలవిరియఁబోసికొని జరాసంధనిర్మూలనముఁ జేయఁ దలఁచి కోటలోఁ బ్రవేశించిన రాక్షసియట్లు చూపఱకు వెఱపుదయింపఁ జేయఁజొచ్చెను.

కళానందుని భైరవదేవుని కర్పింపను దన్ను రణార్ణవునకిచ్చి పెండ్లిసేయను ముహూర్తము నిశ్చయింపఁబడెనని విని యాసుందరి మూర్ఛిల్లి దాసీజనములుసల్పు శైత్యోపచారములఁ దెలివొంది వేఁడినిట్టూర్పులు విడిచి వారియెదుట జరాసంధునిందూఱి తనచేతివజ్రపుటుంగరము బెఱికి యావజ్రము నూరుకొని త్రావి మనోవ్యథ కంతముగలగఁజేసికొనయత్నించె. అదియెఱిఁగి పరిచారికలు బాలికకరముఁ బట్టుకొని యాయంగుళీయకము నూడలాగుకొనిరి. రోసము దుఃఖము దన్ను మైమఱచునట్లుచేయ యావిరిబోఁడి కొండొకవగచి దాసీజనముందిట్టి సేయునదిలేమి సెజ్జపైఁ బవ్వళించి రోదనముచేసి కొంతసేపటికి నిదురించెను. అపు డంగనలు దలుపులుమూసి యావలకుంజనిరి. అంతలో నామెయము మెలఁకువగాంచి యామందిరమ్మున నెవరును లేమికి సంతసించి సెజ్జవిడిచి లేచి గది నలుదెసలం బరికించి చూచె. అట్లు వెదకవెదక నుకగూటిలో చిన్నమొలకత్తియొండామెకనులంబడి పెనుపండువుసేసె. అత్యాది మహానందమున గ్రహించి దానిమొన [illegible]

మరియు సంతసించి యిప్పుడే తనప్రాణములు దానిచే నంతమొందింప వలయునని యాకత్తిం గుత్తుకపైం బెట్టుకొని యంతలోం గళానందునిమాట జ్ఞప్తికిరా నాత్మగతమున "నయ్యో! ఆమహాత్ముం డింక జీవములతో నుండ నాకీసాహసమేల? ఏవేల్పుకృపచేనైన నెద్దియేని మేలు మాకిరువురకుం గలుగం గూడదే! ఆహా! శరీర మున్నంతవఱకును నీయాశాపిశాచము ననుంబట్టి విడువకున్నయది. అయిన నీయాయుధ మావశ్యకమగునప్పటికి దాంచుదానునని తగుచాటుచోటు గనంబడమి బాన్పుజేరి యాదూదిలో నాయాయుధమును గప్పి పుచ్చి యెప్పటియట్లు పాన్పుపైం బవ్వళించె. కళానందుండు తాను బట్టువడకమున్న తనప్రియురాలెన్నటికైన విముక్తయగుననియుం దా నారసికురాలి పొం దనుభవించు సమయము సమకూడదుంగాక యనియు నువ్విళు లూరుచుండెను. తనకు బంధము సంభవించిన గడియ మొదలు తనమరణము నిశ్చయించి తనకను దనబహిఃప్రాణమైన సౌందర్యతిలకకు నింక శాశ్వతమైనయెడబాటు సంభవించెనని వగచినం గార్యములేదని రాంబోవు నిజఘోరమరణము జ్ఞప్తికి వచ్చినపుడెల్ల మేనువడంక నులికిపడుచు నరకుకులకు రక్షకుండు రాజీవాక్షుండ యని నిరంతర నారాయణస్మరణము చేయందొడంగెను. రేలం గనులమూంతయే పడుటలేదు. ఒకవేళం బడిన నొకమాఱు తన్ను భైరవదేవునకర్పింపంగొంపోయినట్లు మెడమీందం గత్తినిలిపి నఱుకవచ్చినట్లు నొకమాఱు హృదయేశ్వరి తన్నుం గవుంగిలించుకొని "ప్రాణనాయకా నన్ను విడిచిపోయెదే?" యని వాపోయినట్లును వేఱొకసారి తల్లి తనదురవస్థంగాంచి మృతినొందినట్లు పాడుకలలుం గనుచు నతిభారమైన యాజీవనముకన్న మరణమే యుక్తమని దానికెదురుచూచుచుండెను.

ఇట్లు దురంతచింతాక్రాంతుండయిన యారాజకొమారునొద్ద కొకభటుండువచ్చి దీనవదనుండై యిట్లనియె. "అయ్యా! ఈజరుగుచున్న మహాసంభ్రమమునుంబట్టి సౌందర్యతిలకకు రణార్ణవునకు వివాహమగునని

నీవే యెఱుఁగుదువు. రేపురాత్రి యావివాహము జాముప్రొద్దుపోయిన వెనుక నగు. కళ్యాణానంతరమున మగధరాజు నిన్ను శ్రీభైరవదేవున కర్పించు. ఈవార్త నీకెఱుఁగఁజెప్పుమని రాజు నన్ను నియోగింప నే నచ్చితిని. దుర్వార్తఁజెప్పితినని నాపై నలుగకుమయ్యా" యని నిలిచియుండె. తా నటుజరగునని యెఱిఁగియున్నను దుర్వార్త యెన్నఁడోవచ్చునని తన్నిమిత్త మెదురుచూచుచున్నను సేవకుని దారుణవచనములు శ్రవణగోచరములగుటయుఁ గళానందుని మనస్సున నాకసముపై మెఱుపుపాతినచందమున రొక్కమాఱు వికారము ముప్పతిల్లి శరీరము గడగడ వడఁకఁజేసి నోటమాటరానీయదయ్యె. ఎట్టకేలకు ధైర్యముఁదెచ్చుకొని సేవకునితో నిట్లనియె. "నీవు చేయున దేమి? స్వామియానతి నెఱవేర్చుకున్న నాయవస్థ నీకును సంఘటిల్లు. చచ్చెడువానికి జగము తృణప్రాయముగదా! మీరాజు నన్నింతకన్న నెక్కుడుశిక్షపాలు సేయఁజాలునే? కావున నావచనములుగ నిట్లు జరాసంధునితో వచియింపుము. ఓరీ జరాసంధహతకా! నీవు సలిపిన మహాపాతకములలో నిదియొక్కటి. నీయదృష్టము పెంపునను నాకొదవిన భాగ్యలోపమునను నేను నీచేతఁ జిక్కవలసివచ్చెఁ గావున నీవు నన్నంతమొందింపగలవు కాని కొలఁదిదినములలో వాసుదేవుఁడు నీప్రాణములను హరింపకపోఁడు. నేఁడా రేపా యను విషయమొక్కటియేగాని నీకును గాలమాసన్నమైనది. బంధింపఁబడిన యీరాజుల భాగ్యపుఁబంట పండినది. నీవును నేనును బరలోకమున నతిశీఘ్రకాలములోనే కలియఁగలము. మీ మగధరాజ్యలక్ష్మికి వైధవ్యము గలుగుఁ నవసర మిదియే. నిరపరాధులు నబలలు ననదలు ననేకులు క్షోభపడినఁగాని నీపాపము పండదు. ఇపు డంతయు సమాప్తమైనది. ఓయీ సేవకా! జంకక గొంకక యీ వచనములు నే ననిన వనినట్లు తెలియఁజెప్పుము పొమ్ము". అన వాఁడును వల్లెయని యచ్చోటు వాసిపోయె. ఆదినమునను సౌందర్యతిలకను

పెండ్లికూఁతును జేయుమని రణార్ణవుని పెండ్లికొమరునిఁ గావింపుమని యు జరాసంధుఁ డానతిచ్చె. నాఁ డంతఃపురాంగనలు సంపంగినూనెఁ దెచ్చి యాబాలికకుఁ దలయంటవచ్చినపు డాపడంతుక యన్నెలఁతుకలఁ జెంతరానీయక మహాగ్రహముతోఁ గొంతతడవు వారలందూఱి వారందఱును వచ్చి తన్నులమి బలిమిం బట్టుకొని తలయంటఁజూచినపుడు చేయునది లేక మనసున నెద్దియో నిశ్చయించుకొని కొయ్యబొమ్మ వడువున నుండె. అంగన లిచ్చవచ్చినట్లు తలయంటి నలుఁగిడి పన్నీటఁ జలకమాడించి కురులార్చి విలువలేని చీనిచీనాంబరములఁ గట్టించి జిలుగుపైతాణంపు రవికఁదొడిగించి మగధరాజు నంతిపురమున నున్న యంతయు యాభరణము లన్నియుఁ బెట్టి తెలిసోగకనులఁ గాటుక దిద్ది యధరమునకు లాక్షయెత్తి పచ్చికస్తూరితో వదన చంద్రమండలమునకుఁ గలంకపు శోభం దెచ్చునట్లు తిలకము దిద్ది సాంకవము గండసీమ నలఁది యగరు పన్నీరు మెదిపిన మంచిగంధము మేనబూసి మల్లెపూదండలు మెడనున్న రత్నహారములతో వియ్యమొందఁజేసి సర్వవిధముల రతీదేవిని మించునట్లుచేసి యామె సోయగమునకు వారె యచ్చెరువందిరి. జరాసంధుని యంగనలు దాని సౌరుంగనుంగొని యాఁడువారికే మనసు కరఁగుచున్నదనిరి. మగధరాజు దూరముననుండి యామెలనాఁగం జూచి "యిది త్రైలోక్యరాజ్యలక్ష్మి. ఇదియెందున్న నది సకల సంపదలతోఁ దులఁదూఁగదే? ఇంతటి యపూర్వలావణ్యమును బ్రహ్మ యెట్లుసృజింపఁ గల్గెనో" నని యచ్చెరువొందుచుండ ముదుసలి పేరటాండ్రుం బురోహితులు సౌందర్యతిలకం జంద్రపాలునకు మ్రొక్కింపుమనిరి. సుందరాంగులాయంగనను మెల్లనఁదోడ్కొని చంద్రపాలుఁడున్న నెలవునకుఁ బోయిరి. వచ్చుచున్న బిడ్డంజూచి తండ్రి సంతోషబాష్పములకు మాఱు దుఃఖబాష్పములు విడిచె. కూఁతు కన్నీరుతోవచ్చి తండ్రిం గౌఁగిలించుకొనెను. కుమారియుఁ దండ్రియు నొండొరుల నాలింగనముఁ జేసి

గొని పెద్దపెట్టున నేడ్చిరి. కొంతవగచి చంద్రపాలుఁడు బిడ్డంజూచి "నీకావివాహము కాకపోవుంగాక! కళానందుఁడే నిన్ను వరియించుంగాక!" యనిదీవించెను. మగువ లాపల్కులు విని యెట్టటో చిఱునగవుఁ దోఁప బలిమిచే జనకుని మ్రోలనుండి యీవలకుం దెచ్చిరి. అనంతర ఘుంతిని జరాసంధునకు మ్రొక్కింప వలసినదని బ్రాహ్మణులు సెలవొసంగ నంగన లామెను మహారాజు మందిరమునకుం గొంపోయి కనకపీఠముపైఁ గూర్చున్న తేరికిఁ బ్రణామం బొనర్పుమనిరి. తనప్రియజనకునిఁ గారాగృహమున నునిచినవానిఁ దన మనోహరుఁ గళానందుఁ గడతేర్పసిద్ధముగా నున్నవానిఁ దనమనోరథము భగ్నముచేయఁదలఁచినవాని నారాజుం గాంచునప్పటికి బాలికకు వశముగాని యాగ్రహము వొడమె. అంతట నయ్యబల కనుగొలఁకులు ముడివడి నేత్రంబులు కెంపుమీఱ మొగ మలుకచేఁ జేవురింప నిలువెల్లఁ బొడసూపిన పులకాంకురములు కోపానలధూమశిఖలు ధగధగ మెఱయు రతినాలదీధితులుఁ గోపాగ్ని ప్రజ్వరిల వెడలుమంటలుగాఁగ గంధసింధురముపైఁ గవియు నాఁడుసింగముపోలె మహిషాసురునిపై నుంకించు శర్వాణియుఁబోలె నరకుని నఱుక నరుగు సత్యభామయుంబోలె పండ్లుగీటుచు జరాసంధునంతటివానికే భయజనకమైతోఁపఁ గెలఁకులనున్న చేడియలకు వెఱపుదోఁచెననేల? అటునిల్చి పేరలుకచే మృదూక్తులు తడబడ నిట్లనియె. "కుక్రచిత్తా జరాసంధహతకా! నేను నీకుఁ బాదాభివందనమాచరింపను. పవిత్రమైన నామేను బహుళపాపభూయిష్టమైన నీమేను సోఁకనిచ్చుదాననే? నన్ను నీవు నీయుంపుడుకత్తె కొడుకునకుఁ గులగోత్రములు లేనివానికి నీవంటి నీచున కిచ్చి పెండ్లిచేసెదవే గాని నామనసు వాసమనసుతో నామేను వానిమేనుతోఁ గలుప నీతరముగాదు. నేను రాచదానను. నాపలుకులు వినుము. ఇటు సూర్యుఁ డటుపొడిచినను నీమనోరథము సిద్ధింపదు. వివాహము ముగిసిన [illegible]

నాఁడు సకలాద్భుతములు నీకన్నులతో నీవుచూచెదవు. ఈపాపఫల మ
చిరకాలమున ననుభవింతువుగాక! నే నుత్తమయగు నిల్లాలిబిడ్డనై నినే
ని పార్వతీచరణములు నమ్మితినేని నాశాపము నీకుం దగులకపోదు ”
అని మొగముఁద్రిప్పి యచ్చటనుండి మరలి నడువ నంగనలు భయము
న వడఁకుచుఁగదలఁజాలరైరి. రాజు దానిపలుకులువిని మీసముపైఁ
జేయివైచి తలయూఁచి యిపుడు దీని నేమనుటకును సమయముకాదు.
వివాహమైన వెనుక దీని పొగరడఁగును. మీరును వెంటఁబొండు. రే
పు కళ్యాణము జరుగునని యానతియిచ్చి వారలనంపి పందిళ్లు వేయించి
తోరణములు గట్టించి కలయంపులు చల్లించి బంధుమిత్రుల రావించి
సిద్ధమై యుండెను.



## పదునేడవ ప్రకరణము.



అంతట లోకబాంధవుఁడగు పద్మబాంధవుఁ డస్తమించి జరాసం
ధు నంతిపురమున నున్న సేవకులు లోనగు పెండ్లివారికి మహానందము
ను గళానందునకు లోనగువారికి విచారమును గలుగఁజేసెను. రణార్ణ
వుఁడు విరహతాపమునఁజేసి తెల్లవాఱునెపుడు వివాహమగు నెప్పుడ
ని పొగలుచుఁ దామరతూఁడులపాన్పుపైఁ బవ్వళించి చందన మొదలు
నిండ నలంది సుందరాంగులు తాళవృంతముల విసర నిట్టూర్పులు వి
డుచుచు విశ్రాంతిలేక యుండెను. కళానందుఁడు చీకఁటిపడుట మొద
లు తనకష్టమింక నొక్కనాఁటితోఁ గడచిపోవునని నిశ్చయించుకొని ధై
ర్యమొక్కటియే తనకుసాయముగ నుండదగినదని దానిని విడువఁడ
య్యె. ఆరేయి యెంతయైనను గళానందునకు నిద్రరాదయ్యెను. రెండు
జాములరాత్రియగుడు నొక్కమాఱు వానికిఁ దనముదుసలి తల్లియు
సౌందర్యతిలకయుఁ దనదురవస్థయు జ్ఞప్తిరా నతివిషణ్ణహృదయుఁడై

ర్యము విడచి యిట్లు విచారింపఁజొచ్చెను. " హా సుందరీ ! నాకతమునఁగ
ద నీవింతకష్టములుపడుట ! ఎంత కాలము నుండి వర్ధిలిన యనురాగలత
యెంతలో నెట్టులయ్యె ? నీనిమిత్తమకాదె యిలువెడలి ద్వారకానగర
ము జేరి నందనందనపాదరాజీవముల నాశ్రయించి యిటఁ రాఁబురికొ
ల్పితి. చేదిరాజు సేవకులచేఁ బట్టువడి యెన్నెన్నో సిలుగులఁబడి యెట్టకే
లకు జాతవేదుని కృపచే మరల ద్వారకఁజేరితిని. ద్వారకనుండి కొండం
తయాసతో బయలుదేఱి నినుగాంచి మునువడిన చిక్కు లన్నియు మ
ఱచితి. పట్టుమని యొక నెలయైనను మనసుదీఱ నిన్గలిసియుండ లేదు.
ఇంతలోనె పాపపుదైవమునకు మనమైత్రి కన్నులుకుట్టె. హా ! నావం
టి మందభాగ్యునకు నీనంటి మహారసికురాలిపొందు లభించునే ? ఈదు
రాత్ముఁడగు జరాసంధునకు నేఁగావించిన యెగ్గేమియు లేదు. అయ్యో !
సుందరీ ! అనుక్షణము నీకు దాసుఁడనై యుండి నీకనుగొలకులసన్న మెలఁగు
నన్నువిడిచి నీవెట్లు ప్రాణములునిలిపితివో ! దైవమా ! ఎంతలో నం
తటికోర్కులు భగ్నముఁజేసి నాయవస్థ నింతవఱకుఁ దెచ్చితి ! భువనైక
సుందరియగు నామందయానను గూడి భూలోకస్వర్గము ననుభవింతు
ననుకొంటిఁగాని యింత చిన్నతనమందె దారుణముగ భైరవదేవునకు జ
రాసంధునిచేత నర్పింపఁబడి యకాలమరణ మొందుదునని యెన్నఁడు
ననుకొనలేదు. వాసుదేవా ! నీచరణారవిందముల నమ్ముకొనియుంటి.
నాఁడె వత్తునని వ్రాసితివి. నన్నిపాపి తుదముట్టించిన వెనుక నీవువచ్చిన
నేమి రాకున్న నేమి మిత్రులెవరైన నాకు సాయముజేతురేమోయని
వెదకిచూచిన నట్టివాఁడొకఁడును గానఁబడఁడు. నాకాప్తుఁడగు సుజయు
నీరాజుగూడ జరాసంధునిచేఁ జిక్కి నాయవస్థనె యనుభవించుచున్నాఁ
డు. హాతల్లీ! వీరమాతవని నిన్ను జనులు సన్నుతిజేసినప్పుడెల్ల నీగరు
వంపుఁ గొడుకుఁ దలఁచి యెంతయు సంతసించెడుదానవు. ఇంక నేమగు
దువు? అయ్యో! కొమరుకును జగన్మోహనయగు కోడలు గాఁపురముచేయుఁ

జాలయానందింపవలయు నని గంపెపుకోరికతో నున్నదానవు. కడకు నీయుప్పైన నాచేతఁ గడవదయ్యె." అనివగచి యంతలో మరల ధైర్యముఁ దెచ్చుకొని ఛీ! నాకేటికీవగపు చాలుఁజాలు నని సర్వప్రపంచవ్యవహారసన్యాసముఁ జేసి యిహపరసాధనమని నారాయణనామస్మరణముఁ జేయుచుఁ దెల్లవారుటకు నిరీక్షించుచుండెను.

సౌందర్యతిలకయు దాను వివాహోచితమైన మంగళాలంకారములఁ దాల్చియు నానందవార్ధి మునుఁగుటకుమాఱు దుఃఖవారినిధి మునిఁగి నాలుగుజాములు తెప్పవాల్పక రాఁదలఁచిన యాదారుణయవస్థ నెట్లుతప్పించుకొనఁ నగునని యోజింపఁ దొడఁగెను. అందఱును గుఱ్ఱుపెట్టి నిద్దురబోయి దేహములు మఱచియుండ నీబాలిక పాన్పుపై లేచి కూరుచుండి యీసును రోషము, వగపు, గోపము నొక్కసారి పొడిచి తన్ననేక భంగుల నాడింపఁ బ్రియునిఁ దనయవస్థను దలఁచి యిట్లని విచారింపఁదొడఁగెను." హా హృదయేశ్వరా! అయ్యయో! హృదయేశ్వరుఁడు గానివాని నేనట్లు పిలుచుకొంట వ్యర్థముగాదే నిన్నుగాంచిన గడియమొదలు భర్తగాఁ బడయుటలంపున నెందఱ దేవతలఁ బూజించితి, నెన్నినోములు పరమభక్తితో నోఁచితిని. ఎందఱ బ్రాహ్మణులకు దానము లొనర్చితి. నానోఁచిన నోము లిట్లుపండె. ఆవిప్రుల దీవనలిట్లు ఫలించె. నాబ్రదు కింతయాఱడివోవునని యెన్నఁడు ననుకొననైతి. హా కళానందా! నీవు నాకు తప్పక దక్కుదువని జరాసంధునంతవానితోఁ బగసాధించితి. తండ్రి చెఱలోనున్నను రాజునకలుకవొదమినను నిన్నునమ్ముకొనికాదె మనోధైర్యములం జిక్కఁబట్టియుంటి. నీమనస్సు మెప్పింపవలయునని కాదె యెన్నెన్నో దేశములలోనుండి దినుసుచీరలు దెప్పించుకొంటిని. నీమనస్సు హాయియని యానందించుటకేగదా వీణపై నపురూపరాగముల నలవరించుట. అట్టి నీవు నాకు దూరమైపోవ నింక జగమేల? నేనేల? కళానందునకర్పించిన యీమేను

రణార్ణవుని ప్రక్కఁ దార్తురే? వివాహము ముగిసినవెనుక వధూవరుల నేకాంతగృహమున కంపుటయు నీయాయుధముతో నాదురాత్ముని యుసుఱుఁగొని నన్ను నేఁబొడిచికొని శయనాగారము రక్తాలంకృతమై పీనుఁగులపెంటయై యుండఁజేసి జరాసంధాదివీరు లచ్చెరువడి నా సాహసము మెచ్చ, నగర మట్టుడికినట్లుడుక చంద్రపాలుఁడు బళి యని వినుతించియేడ్వ నత్యుత్సాహముతోఁ బ్రవర్తించెద. రాచపుట్టువునకుఁ జావన్న భయమగునా? ప్రాణసంరక్షణముకన్న మానసంరక్షణ మెక్కుడుగదా! ఈ హేయజీవనముకన్న మరణము శ్లాఘనీయము. అయ్యో! అంతదారుణమేల నేఁ జేయవలయు? ఈసమయమున నందకుమారుఁడు రారాదే. వచ్చి దీనికి విఘ్నముఁ జేసి నాదుమనోరథసిద్ధి చేయరాదే. అట్టిమాత్ర మదృష్టవంతులయినవారు లేరే? రుక్మిణికి మున్ను గట్టగడగదా మనోరథము నెఱవేఱినది. అంతటిభాగ్య మింతటి యదృష్టహీనులకా? హా పార్వతీ! హా మాధవా! హా మిమ్ము నిశ్చయముగ నమ్మియుంటి. పాలముంచిన నీళ్ళముంచిన మీరకారే మీరుగాకున్న నీశరీరము విడిచిపోవుట నిశ్చయము. లోకములో నా పాటు లెంతబీదకన్నియకును గలుగవు. మీకు జాలి యింకనైనఁ గలుగదే? అని పరిపరివిధములఁ బలవించుచునుండ నంతలోఁ దెల్లవారెను.

ఆదినమందే వివాహమహోత్సవ మగుటఁ బెండ్లికుమారు మహావైభవముతో నూరేగింపు మరియు, రాజద్రోహముసల్పి వధార్హుఁడైన కళానందుని హీనదశ దెలియునట్లు రణార్ణవు నూరేగింపువో వెనుకఁ దోడుకొని పోవలయుననియు మహారాజానతిచ్చె. కావున ప్రభాకరుఁ డుదయమొందిన పిదప మంత్రులు సామంతులు దండనాయకులు పరిచారకులు మొదలగు యామహోత్సవము వెంటరా సిద్ధముగ నుండిరి. మునుముందు పురజనులును బురజనులవెనుక నేనూఱాశ్వికులును నాశ్వికులపిఱుంద నూఱు భద్రగజములపై నధిరోహించిన

ఘుష్యద్వీరశతమును, దద్గజబృందమధ్యమున సకలకాంచన రత్నభూషణములతో గన్నులు మిఱుమిట్లుగొలుపు నొకమహాదంతావళముపై నెక్కి రణార్ణవుఁడును వెడలిరి. ఆగజావళివెనుక నొకముసలియేనుఁగుపై నలంకారశూన్యుఁడై దీనాననుఁడై విచారవినమ్రవదనుఁడై కళానందుఁడు బలిమిచేఁ గూరుచుండఁజేయఁబడెను. ఆయేనిక కనులుఁగానక యిట్టటు మార్గమునకుఁదొలఁగుచు నెన్నఁడు దానినెవ్వరు నిరుపయోగమగుట స్నానముఁజేయింపమి సహింపరాని దుర్గంధభూయిష్ఠమై వార్ధకమున నడుగులు తడబడ మెల్లగ నడచుచుండె. తనశత్రువైన రణార్ణవునికి జరగు మహోత్సవమునందె తననిట్లు చేయుట కేవలము జరాసంధుఁడు తన్నవమానము నొందఁజేయవలయుననియె యని కళానందుఁడెఱిఁగి పరమనీచున కట్టిమహాగౌరవము నెఱయుచుండఁ దనకంతదారుణపరాభవము సేకుఱినందులకు బిట్టువగచి తన్ను మున్నెఱింగిన మిత్రబాంధవుల మొగము లావేసముతోఁ జూడనోపక వంచినతల యెత్తఁడయ్యె. యోగిని యీమహోత్సవముఁ జూడ నోపక బహుదీనవదనయై కన్నుల నశ్రుజలములు గాఱ వదలఁజాలక నొకచోఁ జతికిలఁబడి ప్రశ్నములడుగవచ్చినవారి నూరక యంపసాగెను. ధారుణిదేవి కుమారునిదుస్థితియు నిశ్చయమయిన దుర్మరణమును విని కంఠమున కొకత్రాటితో నురిబెట్టుకొనియె. అంతలో నది దాసిగాంచి యురిదీసివేసి మరణమును దప్పించెనుగాని యాముదుసలి మతిచెడి యసంబంధప్రలాపము లాడఁజొచ్చెను. చంద్రపాలునిభార్య నాఁటిదినమున వీధిమొగముఁ జూడక లోనఁ బండుకొని నిరాహారయై మొగమువాయ బిట్టేడువసాగెను. కాణభూతియు నామహోత్సవ మధ్యమునందుండి మూఁగకేకలు వేయుచు నింతయు భంగముసేయుట కుపాయము గానఁబడదయ్యె నీశ్వరా యని విలపించుచుండె. రణార్ణవుఁడు మహానందవికసితముఖుఁడై యామదగజేంద్రముపై సమర్చఁబడిన హౌదాలోఁ బచ్చపట్టుపరు

పుపయిం గూరుచుండి తెల్లపట్టు మెత్తలకత్త మిల్లి, మస్తమందు రతనాల కుళ్ళాయి వివిధదీధితులుచిమ్మ మేని విలువలేని తొడవుల మేలిరవలు చూచినవాండ్రి కత్యద్భుతమునొందింప విరహతాపము నభినయించుచు సాయంకాల మగుటకు సుముహూర్తసమయమునకు నెదురుచూచు చుండెను. తన వివాహమునకు మదిం బొంగుచుకన్నం గళానందుని పరాభవమున కెక్కుడు మురియుచుండెను.

సర్వవర్ణుడు తనయజమానుని విషయమునకు సంతోషించి యూదినముం జిరకాలమునుండి తనమేను నాశ్రయించియున్న ముక్తికి యొకకొంత పోవునట్లు తానమాడి యజమానుడు విడిచిన వలువలు కొన్నికట్టుకొని కారుమేనికిం జందనము మెత్తి తాంబూలమునమలుచు వారకాముల యాటపాటలకు మిట్టపడ్లు తెఱచి నగుచు నానందమతిశయించునపుడు కేకలువేసి పరువులెత్తుచుం గిష్కింధాపురవాసులగు రామసైనికుల జ్ఞప్తికిం దెచ్చుచుండి యందఱ నవ్వించుచుండెను. నిరుపమానవైభవములో మధ్యాహ్న మూరేగింపు మహోత్సవము జరగుటయు నందఱును రాజనగరుం జొచ్చి మాధ్యాహ్నికములందీర్చి జరాసంధసమేతులై పంచభక్ష్యపరమాన్నముల నారగించిరి. భోజనానంతరమున సంగీతగోష్ఠి కొంతతడవు నిర్వర్తించిరి. రణార్ణవుండు జాముప్రొద్దువేళ నశ్వారూఢుడై యోగిని బసకుంబోయి తెరచాటున నుండి తనపరిణయమున కామెను రమ్మని ప్రార్థించెను. అతని వేడికోలునకు సమ్మతించి దీపములు పెట్టినవెనుక వత్తుననియుం దనకొక రహస్యమగుగది సిద్ధము చేయుమనియు నానతిచ్చి వానినంపె. అప్పుడప్పుడు యోగినికడకు కాణభూతివచ్చి యాలోచించు వాడుకయున్నందున నానాడు వాడు లోనికింబోయి యోగినితోం గొంతసేపుప్రసంగించి యవ్వోచ్చనివాస మెందేనిం జని సాయంకాల మగునప్పటికి వివాహమునకు జూడ నగరునకుం బోయె. యోగినియు నొకపల్లకిలోం గూరు

చుండి మహారాజాంతఃపురమున కేగి యొకగదిలో విడిసె. అంతటి మహాత్మురాలు కోటకుఁ జనుదెంచినపుడు నగరయందుఁగలవారందఱు మహావినయసంభ్రమచిత్తులై యామె పనుపు సేయుచుండిరి. జరాసంధుఁ డామెదర్శనము మఱునాఁ డుదయమునఁ జేసి కృతార్థత నొందఁదలఁచెను. అంతట నంశుమంతుఁ డస్తగిరిఁ గ్రుంకఁ గళానంద సౌందర్యతిలకలముఖాంభోజములు వికాసహీనములయ్యె. తక్కిన పెండ్లివారి మొగములు వికసించె. కోటలో మహాకోలాహలము జరగుచుండెను. అపుడు సంజచీఁకటి బయలువెడలిన సేవకులు దీపములు వెలిఁగించుచుండిరి. జరాసంధుఁ డాకళ్యాణమునిమిత్తము కనువిశాలమయిన యొకపెద్దపందిరి నిర్మింపఁజేసి యందు విచిత్రములగు చిత్తరువులు వ్రాయించి యలంకరింపఁజేసి శృంగారలక్ష్మి తాండవమాడునట్లు చూపరులాశ్చర్యమొందునట్లు సిద్ధము చేయించె. ఆసందెచీఁకటివేళ నామహాకళ్యాణ మంటపమునం దొకమూలఁ జిచ్చంటుకొనియె. అది ముందెవ్వరుఁ గన్గొనమి నంతకంతకుఁ బెరిగి పెనుమంటలు బ్రహ్మాండము ముట్టి పొగలు ద్వారములఁ గ్రమ్మి జనులరానీయకుండుట నందఱుఁ జూచి పరుగులెత్తిరి. జరాసంధుఁడు మేడపై నిల్చి మహాకంఠధ్వనితోఁ బౌరుల సేవకులఁ బిలిచి నీరుఁబోసి యార్పుమనుచుండె. అందఱును బావులు చెఱువులు నిర్జలమగునట్లు కడవలతో నీరుఁదెచ్చి చిచ్చార్పుచుండిరి. ఎంద ఱెన్నికడవలనీరుఁ దిమ్మరించిన నాయగ్ని చల్లాఱక పచ్చనిపందిళ్ళనెల్ల భస్మీభూతములు సేయఁదొడఁగె. మేడలు మిద్దెలు నంతఃపురములు నంటుకొను ననుభయమున శుద్ధాంతకాంతాజను లాక్రందనధ్వనిసేయ నింగి ప్రతిధ్వనియొసంగె. లక్షలకొలఁదిజనులు గుంపులుగూడి బ్రహ్మాండకర్పరము పగుల నార్చుచుండిరి. ఆసమయమున నయ్యో సౌందర్యతిలక యీనిప్పునం బడియె నని మహాశబ్ద మొందు

**పుట్టెను. ఆపలుకులు విని రణాంగణవృందము చిమ్ముకోను(?)కళ్లి నలుదెసల**

నామెయున్నచోటరయుచుండ నెట్లుగఁ గాలిన దూల మొక్కటి యా తనిభుజముపై విఱిగిపడినది. అందఱును రణార్ణవుఁడు చచ్చెచచ్చెనని యఱచిరి. సేవకులు కొందఱితికి వానినీవలకీడ్చి తెచ్చిచూడ వా నివీఁపును మూఁపును గాలె. ఆగాయము లంతయపాయకరములుగావని యందఱనిరి. సౌందర్యతిలక యింటనే యున్నదని పరిచారకులువచ్చి చెప్పి యదియెవ్వరో గొంటితనమున కనిరని నిశ్చయించిరి. కళ్యాణ మంటపమును భస్మీభూతముఁజేసి మంటలు చల్లాఱె. జరాసంధుఁడు వి వాహాము మఱునాఁడు జరుగునని యెల్లవారికిం జెప్పిపుచ్చె. ఇంత య మంగళముతో నారంభమైన యీవివాహ మెట్లు జరుగునో చూడఁ బౌ రులు ముచ్చటపడుచుండిరి.



## పదునెనిమిదవ ప్రకరణము.



జగన్నాటకమునందు నాకాశ మనురంగస్థలమునఁ బగలనునొ కయంకము రాత్రి యనునొకయంకమును బ్రదర్శింపఁబడుచుండుతఱిఁ బ్రథమాంకమున రౌద్రరసమభినయించి, పద్మినీరాజు ప్రవేశించి తన కథ నెంతయుఁ జక్కగా వినిపించి నిష్క్రమించె. అంతట సంధ్య యను శుద్ధవిష్కంభమునందు జీఁకటి యనురాక్షసి ప్రవేశించి యతిభయంక వృత్తిఁ దనవ్యాప్తిఁజూపి సకలజంతువులకు భీతిగొలిపిఁ గొంతతడవున కు నిష్క్రమింప ద్వితీయాంకమునందు శృంగారరస మభినయింపఁదలఁచి నరాజు ప్రవేశించె. ఆరాజు బహుకళావంతుఁడై చూపఱకానంద ముఁగలిగించి తన కరాదివిన్యాసముల నేర్పుచే నెల్లవారలమెప్పు వడ యఁజొచ్చెను. ఆసమయంబున గిరివ్రజపురమునందు బహుకోలాహ లము జరుగుచుండెను. వివాహమునకు సమస్తప్రయత్నములును సిద్ధ మాయ్యె. క్రిందటిదినమునఁ దగులఁబడినపందిళ్లు మరలవేయించి మహా

రాజు సకిల బాంధవులఁ బిలువనంపి మహాభైరవపూజకుఁ దానును సిద్ధము గనుండెను. సౌందర్యతిలకయుఁ గాదలఁచిన యావివాహమును గూర్చి భగవంతునిపై భారముంచి శరీరమువూత్రము జరాసంధుని పనికత్తెలకొప్పగించి యూరకుండె. కళానందుఁడు గుండె రాయిచేసికొని తనదారుణమరణమునకుఁ బ్రియురాలి వివాహమునకు నీశ్వరిఘటన మిట్లుండఁబోలునని వాసుదేవుని పాదరాజీవములపైఁ జిత్తముహత్తజేసి వర్ణింపరాని మనోవేదనపాలై యుండె. జరాసంధుని సేవకులు వానికాదినమునఁ దలయంటి, రక్తాంబరము గట్టించి కంఠమున బహుమాల్యములవైచి భైరవదేవుని కర్పింపఁ దగినస్థితిలో నుంచిరి. రణార్ణవుఁడును బెండ్లికుమారుఁడై యానందమున మిన్నంటి తన పూర్వశత్రువైన కళానందుని జూడవచ్చి దురవస్థకు సంతసించి వానింబరిహసింపఁ దలఁచి "ఓహో! పెండ్లికుమారుఁడు కాఁబోలును. సౌందర్యతిలకపాం దొక్కజాములోఁ గలుగఁగలదు. వాసుదేవుని నమ్మితివిగా! అతండు నిన్ను రక్షించునులే" యని యుల్లసమాడి మరలిపోయెను.

మహీమండలమంతయు నంధకారము గప్పినతోడనే గిరివ్రజమున కభిముఖులై ముప్పురు బ్రాహ్మణోత్తములు వచ్చుచుండిరి. సంధ్యాసమయమున వారు తమకాలకృత్యముల నొకసరోవరమునందు దీర్చి పయనముసాగించి గిరివ్రజపురము చుట్టునున్న కొండలలో నొకదానికడకు వచ్చి నిల్చిరి. అందొకఁడు, కార్మొగులఁబోలు నల్లని మేనిచాయయుఁ బుండరీకములవంటి యాకర్ణాంతవిశాలనేత్రములును, లక్ష్మీనివాసయోగ్యమగు వక్షమును నాజానుబాహులును జగన్మోహన విగ్రహుఁడై చూచువారలకుఁ బురుషోత్తముఁ డితఁడని తోఁచునట్లుండె. రెండవవాఁడు, మహాకాయుఁడు, మహాభుజాదండ మండితుఁడు వీరరసప్రధానుఁడు, చూడ మహాబలావతారమనునట్లుండఁ దగి

నవాఁడు. అతని యాకృతియు బొమముడియు నున్నతనిటలము గను న్నైఖరిం గన్నవారి కాతని బలదర్పములంగూర్చి యక్కజము పొడ మకపోదు. మూఁడవవాఁడు లలితసుకుమారశరీరుఁడు, నెగుభుజంబుల వాఁడు, శాంతరసమును సౌజన్యము నుట్టిపడునట్టి మోమువాఁడు. నిరంతరధనుర్వ్యాపారమునలనఁ గాయలుగాసిన వానిభుజములం గనుఁగొనువారి కీతఁడు శౌర్యరాశియనియు మహారణముల లబ్ధవిజయుఁడనియు స్ఫురింపకపోదు. మూఁడు కాలములలీల, మూఁడు విచ్చులయచ్చున, మూఁడు మూర్తులభాతిని నాబ్రాహ్మణత్రయము నిశాప్రవేశమునఁ బాలిమెరఁ బ్రవేశించి యామహాగిరులయున్నతి కిచ్చెరువందుచుండ నం దానీలవర్ణుఁడైనజన్నిగట్టు తక్కిన యిరుగురిను మెల్లమెల్ల నొక్క కొండ నెక్కించెను. అందఱు నాశైలమెక్కి నిక్కిచూచునప్పటికి నపుడపుడే చీఁకటులువిరిసి చందమామ యించుకించుకతోఁచి కానఁబడుచుండుటచే, మహాసౌధగోపురాది సమేతమై పురముదారి దృష్టిగోచరమయ్యె. ద్వారకకన్న నెక్కుడు ద్వారములు హస్తిపురముకన్న నెక్కుడు గోపురములు నింద్రప్రస్థముకన్న నెక్కుడుమేడలు గల యాపురము సిరికిఁగాఁపురమని తలఁచి కొన్నినిముసములు దానివైశాల్యము జూచిచూచి జనసంకులమునఁ బొడముచొద నాలకించి యక్కజపడ నానీలవర్ణబ్రాహ్మణుఁ డిట్లనియె. "మీరీనగరమెన్నఁడును గాంచియెఱుంగరు. ఈనగరమునకు నైదుకొండలు వెట్టనిప్రాకారమై కాఁచుచుండును. మనుష్యమాత్రున కీపురముఁ జొరశక్యముగాదు. చొచ్చెనేని చచ్చెనని నమ్ముడు. మనమెక్కిన యీకొండ గోరథమనంబరఁగు. చైత్రకాద్రియను నింక నొక్కశైలము గలదు. అక్కడినుండి యీపోలికి రెండవ ద్వారము కలదు. అందు మూఁడుదివ్యభేరు లున్నవి. జరాసంధశత్రులు నగరము బ్రవేశింతురేని యవి తమంత మ్రోగు. మనము రాజద్వారమునఁ బోవలదు నావెంటరండు. ఇంక నాలస్యమొనర్పనేల ? క

ళానందుని సౌందర్యతిలకను రక్షించి యాదురాత్ముని శాసించి భూభారము నడంపవలయు" నని వారిం దోడుకొని చైత్రికాద్రికరిగె. ఇంతలో దూరమునుండి వారి సేవకుం డొక్కండు మేను ముచ్చెమటలు గ్రమ్మం బరుగుపరుగున వచ్చి "అయ్యలారా! ఆలస్యము సేయవలదు. ఆకోలాహలము పెండ్లియేసుండీ! కళానందుండు భైరవున కర్పింపం బడునంట. త్వరపడుండీ!" యని వగర్చుచు వారితోం జెప్పెను. నల్లనిబ్రాహ్మణుం డామాటలువిని భయము లేదని చైత్రికపర్వతమెక్కి యచ్చటనున్న భేరులం బగులంగొట్టుదమని తనసంగడికాండ్రకుం జెప్ప వారు సమ్మతించిరి. అంతట నాముగ్గురు నామూండుభేరులను ముక్కముక్కలుగ ఛేదించి యందు గాంపుండి యెదిరింపవచ్చిన సేవకుల నిరుగుర నడంచి పురముంబ్రవేశించిరి. అంత సేవకుండు ముందఱకు వచ్చి వారికి మార్గప్రదర్శకుండై యెటకుం బోవుదుమని యడుగ వారు మాలకరుల గృహములకుం గొనిపోవుమనిరి. అతండును వారిముగ్గుర రోహణకుని యింటికిం దోడుకొనిపోయి రణార్ణవునకుం గల్యాణసమయమున మెడలో వేయుటకొక సంపంగిపూలదండయు భైరవదేవునకుం బూజాసమయమున సమర్పించుటకు నొక జాజిపూలదండయు నాతండప్పుడే సిద్ధముచేసి, భోజనమునకుం బోవసమకట్టుచుండ నీవిప్రత్రయము తద్గృహముం బ్రవేశించె. సేవకుండు రోహణకుని చెవిలో నేదియో గుసగుసలాడెను. రోహణకుం డాతనిపలుకుల నాలకించి భయము భక్తియుం దన్నుం బురికొల్ప వారలకు నమస్కరించి "అయ్యా! నాయర్థము నాశరీరము నాప్రాణములు మీయవియ. మిమ్ముం దనియంజేయుట ముల్లోకములం దనియంజేయుటకద! ఈకుసుమమాలికలు ధరియించి నాయింట విందారగించి నన్ను గృతకృత్యుం జేయవేండెద. ఇంక నాజన్మము సఫలమగు కాలము వచ్చె" నని కేలుదోయి ముకుళించి ప్రార్థించె. వేడికోలు నంగీకరించి రాజునానతిచే నిర్మింపంబడిన యీరెండుదండలు మఱికొన్ని మాలికలు

ధరియించి యాత్రిమార్గులు వానియింట విందారగించిరి. నీలవర్ణుఁడు కొండొకతడవు రోహణునితోఁ జాలినమాటలాడి తనసంగడీడులతో వానియిల్లు వెడలి రాజమార్గముం బ్రవేశించె. ఆనుముహూర్త సమయమునకు నెదురుచూచుచు పురజనము మహానందకల్లోలినియం దోలలాడుచుండి వర్ణింపరానిదశలో నుండిరి. వీధి కిరుగెలఁకుల నున్న మేడలన్నియు బహుదీపకళికలతో విరాజిల్లి పట్టపగలను సందేహమును గలిగింపఁజొచ్చె. యువయువతీ జనములు మద్యపానమును జేయువారు, జేసి ప్రియజనముపై సోలువారు, సోలినవారింబిగ్గఁ గౌఁగిలించువారును; నవ్యస్త్రాలాపములం దేలువారు, మృదంగధ్వానములఁ జేయువారు, దదనుగుణముగ ధింధిమితకయని తాళమువేయువారు, దాళపులయతప్పకుండ నాట్యముసేయువారు, విన్నాణమేర్పడ వీణలవాయించువారు, దన్నాదములతో సవతువచ్చునట్లు కోకిలకంఠమెత్తి పాడువారు, బహువిధపుష్పమాల్యములు వింతతొడవులు విలువమడువులు దాల్చువారు నయి నగరమునకు మహాశోభఘటించిరి.

గిరివ్రజమునందలి నాఁటివైభవముఁగాంచి నాగరికులయ్యు వారుముగ్గురు నత్యాశ్చర్యమునొంది యింద్రవైభవము జరాసంధునివైభవముకన్న మిన్నయనుటకుఁ దగుకారణములు లేవనుకొనిరి. అట్లు జనసంకులము లగుబహువీధులు దాఁటిదాఁటి కొండొకయెడకుంజని యచ్చట గంధముఁ బూలదండలు విక్రయించు బాలికలఁగాంచి తమకు వానినొసఁగుమని వారడుగ వారలు మహారాజు నంతిపురమునకుం గొనిపోవుచుంటిమి. ఈదినమున నగరునఁ గళ్యాణముగూడ జరగును. ఇవి యన్యులకొసఁగరానివి. అని ప్రత్యుత్తరమిచ్చి చనుచుండ ముగ్గురు వారలచేతులలోనున్న గంధమాల్యంబులు బలత్కారముగ లాగికొని గంధము తమమేనుల కలందుకొని పూలదండలు కంఠముల ధరియించిరి. పుష్పలావికలు వారిమోటుతనమునకు సాహసమునకుఁ గోపించి

వీరరసముఁగన్న కొడుకులట్లు భయంకరాకారులగు వారి నేమియు ననఁజాలక తెలతెలఁబోవు మొగములతో వచ్చియురాని కోపపుమాటలతో సాగియుసాగని నడకలతోఁ దొలంగిచనిరి. అంతలో సేవకులరుదెంచి జరాసంధునితో గడగడవడఁకుచు నిట్లనిరి. దేవా ముగ్గురుబ్రాహ్మణులు మనభేరులు వ్రయ్యలుచేసినారు. పుష్పలావికలయొద్దనుండి బలాత్కారముగ గంధమాల్యముల గ్రహించిరి. వారు సామాన్యబ్రాహ్మణులట్లు గాన్పింప రని విన్నవించిరి. జరాసంధుఁ డత్యాశ్చర్యమునొంది చతురంగబలసమంచితు లగుమూర్ధాభిషిక్తులకయిన నాపురముజొర నశక్యము. బీదపాఱులకింత సాహసముండునే? వారిం దోడుకొనిరండని యానతిచ్చెను.



## పందొమ్మిదవ ప్రకరణము.



అప్పటికి రాత్రి జామయ్యెను. వివాహమునకు సర్వమును సిద్ధమైనందున సుముహూర్తము సమీపించుచున్నదని వధూవరులకు మంగళస్నానములు చేయింపనగునని పురోహితులు మహారాజునకు వర్తమానము లంపఁదొడఁగిరి. పెండ్లికొడుకు వాని చుట్టములు నెచ్చెలులు, మగధరాజమంత్రులు మొదలగు నియోగివర్గము కల్యాణమంటపమున నధివసించి జరాసంధునిమిత్త మెదురుచూచుచుండిరి. ఆర్తజనరక్షకుఁ డగునందనందనుఁ డింకనురాఁడయ్యె. ఈవివాహము జరుగుటకు విధినియోగము కలదుకాఁబోలు. అని సౌందర్యతిలక తనకర్మమును దూరుచు వివాహానంతరమున నాత్మనాశనమునఁ గృతనిశ్చయయయ్యె. కళానందుఁడును దనమరణకాలము సమీపించినదని యాసలన్నియు స్మరణముసేయుచుండె. కృష్ణుఁడువచ్చి వారలయార్తి దీర్చునయనుకొన్న యోగినియుఁ గాణభూతియు వాసుదేవునిరాక గగనకుసు

మమని నిశ్చయించి దీపములు పెట్టినది మొదలు గుర్రపునీరుఁ గుర్రుకు-
క్రొనుచు నేమువసాగిరి.

మహారాజు తమ్ముఁడోడి తెమ్మని యంపిన సేవకులు తమకడకు రాకమున్న బ్రాహ్మణులుముగ్గురు జరాసంధునగరుసొచ్చి తమరాక త్రేనికిం దెలియఁబంపిరి. మహారాజు నర్ఘ్యపాద్యములఁగూడ దేరఁబనిచి విప్రులకెదురువచ్చి వారికి వినయవినమితదేహుఁడయి విధ్యుక్తముగ నమస్కరించి యున్నతపీఠముల నాసీనులఁజేసి వారలకిట్లులనియె. “ వేదత్రయముఁబోలు మిమ్ముఁజూడ నాజన్మ పావనంబయ్యె. నాయొనర్చు సపర్యల నంగీకరించి యీమధుపర్కముల గ్రహింపఁ బ్రార్థించుచున్నవాఁడ ” నన వారుముగ్గురు మధుపర్కాదిసపర్యలు గైకొనమని నిరాకరించిరి. అందులకు రాజు ఖిన్నుఁడై తనమనమున నెద్దియో యనుమానము గాలముగఁ దవ్వుల్కొన వారలకిట్లనియె. మీరలు సద్బ్రాహ్మణులరేని నే జరపిన మధుపర్కాదిసత్కారము నేలఁ గైకొనరైరి! బలిమిని జందనమాల్యములగ్రహించుట పాడియే? సింహద్వారమునఁ బురము సొరక ముచ్చల యట్లున వెనుకటి దారిని రానగునే? మీరు బ్రాహ్మణోత్తములో వేషధారులో యని నాకు సందియ మగుచున్నది ” యని వారిమొగములు జూచుచున్న మాగధునికి నీలవర్ణుఁ డిట్లనియె. “ రాజా మేముత్తమజాతి ద్విజులము. గంధమాల్యములయందు లక్ష్మి వసించుటంజేసి బలాత్కారముగా లక్ష్మిం గైకొంటిమి. శత్రుగృహము, సింహద్వారమునఁ జొరరాదు. కావున నితరద్వారమునఁ జొచ్చితిమి. మేము, ధనయాచకులముగాము గాన నీమధుపర్కము గ్రహింపమైతిమి. మన మొండొరుల కెన్నఁ డెగ్గుఁజొనర్చుకొన లే దెట్లుశత్రులమైతి మందువో యదివినుము:—నీవును నేను జిరకాలశత్రువులము. “ ఆత్మవత్సర్వభూతాని ” యనుమాటం బట్టి లోకముల, కెగ్గు జరపువాఁడు మాకెగ్గు జరపువాఁడు. లోకములకు మేలుకావించువాఁడు మాకు

మేలు కావించువాఁడు. నీవు పాపకర్ముఁడవు. నిర్దయాత్ముఁడవు. క్రూరస్వాంతుఁడవు. పరమపుణ్యచరిత్రులగు మూర్ధాభిషిక్తుల, నిష్కారణముగ బంధించి పశుపతికి బలిపెట్టుచుందువు. భక్తవత్సలుండును, పరమపురుషుండు నగు శంకరుఁడు నిరపరాధులగు రాజన్యుల వధవలనం గాని, ప్రీతుఁడుగాఁడే మేము జగదుపకారార్థము సకలరాజమోక్షణమును, దుష్టరాజశిక్షణముఁగావింప నిందువచ్చితిమి. ఇప్పటికేనియు వివేకముం దెచ్చుకొని తోటినరపాలురనందఱ విడిచి పుచ్చుము. అట్లు విడువనొల్లవేని నీయసువు లపహరించి రాజుల విడిపింపక మరలువారము కాము. మేము నీవలన యుద్ధముఁ గావింపవచ్చిన ద్విజులము. లోకోపకారార్థము సమకట్టిన మాకు సర్వదేవతలు తోడుపడుదురు. ఇంక దాఁపనేల? మారహస్యముఁ జెప్పెద నాలకింపుము. నేను నీప్రాణాపగతుఁడనగు కృష్ణుఁడ. ఈతఁడు మహాబలనందనుఁడును, గౌరవవంశసింహమునగు భీమసేనుఁడు. ఈతఁడు ఖాండవదాహమును గావించిన మహాధన్వి యర్జునుఁడు. రాజలోకమును విడిచి పుచ్చవేని బాణములన్నిన విడిచెదవు గాక యని కఠినముగఁ బల్కి భీమార్జునుల మొగములఁ జూచుచుండె. ఆపలుకులకు జరాసంధుఁడు కినిసి భయంకరాకారుఁడయి వాసుదేవుని మొగముపైఁ జూడ్కినిల్పి యిట్లనియె. “ఓయీ! వాసుదేవా! నీవిభీషికలకుఁ బెదరి నిన్ను వేఁడుకొంటకు బుద్ధిలేని భీష్ముఁడను గాను. నిన్నే దేవుఁడని నమ్ముటకు మతిమాలిన నారదుఁడనుగాను. పరాక్రమములేని యుధిష్ఠిరుఁడనుగాను. ఎఱుక లేనివారి వెఱ్ఱిల నీవు డంబములు కొట్టినఁదగుదు గాని నాచేతి చుఱుకు చక్కగారుచియెఱిఁగిన నీవు నాయెదుట నింత సాహసముతోఁ బలికిన నేను వెఱతునే? ఒక్కసారిగాదు రెండుసారులుగా దిరువదియొక్కసారి నాతోఁ గయ్యమొనర్చి పరాజయమొంది సిగ్గువిడిచి బ్రతుకుటయేచాలు. మీఁదుమిక్కిలి మరల నామొగ మెట్లు చూడవచ్చితివి. నీవు మానా

భిమానములు శూన్యము. నీతిలేనివాఁడవు. జారుఁడవు. చోరుఁడవు.
నీకకాదు నీజాతికిఁగూడ సిగ్గుబిడియములు లేవు. అంతంతపరాభవము
లు నాటినమీఁదట నీవు శరీరముతోఁ జావక నిలిచియుంటివి. కాని
మానుషవంతుఁ డింతకాలము జీవింపఁడు నీవు తేజోహీనుఁడవు. కష్ట
జనులకన్నఁ గష్టజనుఁడవు. భగవంతుని యవతారం మని పేరుబెట్టుకొని
సకలపాపములం జేయుచుందువు. నీవు సలుపని పాతక మేదైనఁ గల
దే? గోవుం జంపితివి. ఆఁడుదాని మ్రింగితివి. మేనమామఁ బొలి
యించితివి. మేనత్తం బట్టితివి. ఇవి యీశ్వర లక్షణములే? నే నీమొగ
ముఁ జూడరాదు. ద్వారకానగరమున గోపికాలోలుఁడవై మద్యపాన
ముఁజేసి భోగములం దేలుటకు నీయంతివాఁడు లేఁడు. రాచవారిలో
నొండొరులకుఁ బగ లుదయింపఁజేయు మన్న నీబుద్ధికుశలత యసమా
నముగాఁ బాడిసమ్ముల్లు పాఱును. మాయోపాయముల బల్లిదులగు
పగరఁ దెగటార్చుటకుఁ బెట్టినది పేరు. ఎంతెంతెంచి చూచిన నవలక్షణ
ములె కాని శుభలక్షణ మొక్కటియేని నీయందు నాకుఁ బొడకట్టదు.
నీవు నాయందలి పగచే నన్ను దెగటార్పవచ్చితివి. కాని రాజలోకము
పైఁ గల కృపచేఁగాదు. భూతదయ నీయందు గోసిసను లేదు. రా
జలోకమును బశుపతి కర్పింపకుండ నడ్డగింప వచ్చితివా? మీముప్పుర
ను భైరవదేవున కర్పించెదను జూడుము. ఈశ్వరారాధనము నిమిత్తము
పట్టి తెచ్చిన రాజచక్రమును నీమాటలకు జంకి విడుతునే? ముజ్జగము
లెత్తివచ్చిన నాకంఠమునఁ బ్రాణములుండ రాజుల విడిచిపుచ్చ. మీ
రు పోరితమునకుఁ గృతనిశ్చయులైతిరేని నేనును సిద్ధముగానె యు
న్నాఁడను గాని నీకు సిగ్గులేకున్న నాకైన నింతకు లజ్జకలదు. నాచేఁ
బలుమాఱులు పరాజితుఁడవై యోఁడుదానికన్న నధముఁడవై పలా
యనము నొందిన నీతోఁ గయ్యమొనర్పఁజాల. ఈయర్జునుండు కొంచెక
వాఁడు. వీనితో రణమొనర్చుటకు సాంగ్రామికశాస్త్రధర్మము లొ

ప్పవు. కావున నేయుద్ధమయిన మహాసత్త్వుఁడును, భువనవినుతపరాక్రముఁడు మల్లయుద్ధవిశారదుఁడు నాకునచ్చిన మగఁటిమి కలవాఁడు నా చేతి పోటునకు కాఁగఁ గలాఁడు నగు వృకోదరునితోడన యొనర్చెదను. నీ! నీబ్రతుకుఁగాల్పనే? భీమార్జునులచేత నన్నుజంపింపఁ దలఁచితివి కాని నన్ను జెనక నీకు బలములేదుకదా! కపటోపాయమున నాసంగడీఁడుల హంసడిచికులఁ జంపుటయనుకొంటివో. కాని భీమసేనా! యుద్ధమున కాయితము కమ్ము." అని సేవకుం జూచి "యోరీ! మాకుమారుని సహదేవుని దోడ్కొనుము. రణారంభుని వివాహ మీయుద్ధము ముగియువఱకు నిలుపుసేయు మని మంత్రులతో నావచనములుగఁ బలుకు" మని పంచి తాను మల్లయుద్ధమునకు సన్నద్ధుఁడాయెను.

ఇంతిలో సేవకులవలన సందేశ మెఱిఁగి, తండ్రికడకు, సహదేవుఁడు దీర్ఘవిచారము సూచించు మొగముతో వచ్చి విప్రవేషులైన భీమార్జునవాసుదేవులను, వారికట్టెదుట నున్న జరాసంధుని గాంచి తండ్రికి మ్రొక్కి నిలిచెను. అంత, మాగధుఁడు కొడుకును జేరఁజీరి శిరముపైఁ జేయునైచి వత్సా! కౌరవునితో మల్లయుద్ధమును గావించెదను. నిన్ను మగధరాజ్యమున కభిషిక్తుం జేసెదను. నాయవస్థకు వగవక వంశక్రమాగత మైన యీరాజభాగమును వహించి ప్రకృతిజనరంజకముగ నేల యేలుము. మల్లయుద్ధమునఁ గెలుతునేని తపోవనమున కరుగువాఁడ. భీమసేనునిచేత వాసుదేవునియోగమున మడియుట కల్గెనేని వీరస్వర్గముఁజూఱఁగొందును. అనాథలు నీతోడంబుట్టువులు నగు కంసభార్యల నెంతయుఁ గారవమున నాదరింపుము. ముదుసలియగు నీతల్లిమాట కెదురాడకుము. ఈవాసుదేవుఁడు కపటోపాయకుశలుఁడు. నాకుఁ గల యంతమగఁటిమి సాహసము నీకడ లేవు గావున నీవు వాసుదేవునితో బద్ధసఖ్యుఁడవై యుంట లగ్గు. వాని వైరము నీపోటులకుఁ దగదు. అని సమీపమున నున్న వారలచే నించుక పుణ్యజలముఁ

దెప్పించి కుమారునకు మగధ రాజ్యాభిషేకము గావించె. సహదేవుఁడు గనుదమ్ములనుండి వేఁడినీ రొలుక నభిషేకమ న కియ్యకొనియె. బ్రాహ్మణు లాశీర్వచనము లొనర్చిరి. మఱునాఁటి యుదయమున మల్లయుద్ధము నిర్ణయింపఁబడియె. యాదవ పాండవుల రాకయు వారి సంకల్పమును గళ్యాణ మండపముపఁ దెలియుటతోడనె యచ్చటి వారందఱు విషాదసంచలిత మనస్కులై రి. పౌరు లనేకవిధములఁ దమలో దాము ముచ్చటించుకొనుచు, నిజగృహములం గూర్చి పోయిరి. మంత్రులు వాసుదేవుని రాజనీతి తంత్రమునందలి మర్మములు దెలియుటకు యోచనములు సేయుచు రాజ సమ్ముఖమునకుం బోయిరి. దండనాథులు సేనలఁ గూర్చ నావశ్యకము లేని మల్లయుద్ధ మేల నిర్ణయింపఁ బడియె. ఇది యుపద్రవ హేతువే యని వగవఁ జొచ్చిరి. సహదేవుఁడు వాసుదేవునితో సంధి యొనర్పుమనియు రాజుల బంధముక్తులఁ జేయుమనియు జనకుని వేఁడికొని సఫల మనోరథుఁడు కాఁడయ్యెను. అంతఃపురాంగనలు రాజునకు వినాశకాలము ప్రాప్తించెనని యుల్లములు తల్లడిల్ల నేడువసాగిరి. హంసడిచికులు లేనిలోపమునఁ దంభీరము మొక్కవోవునని జరాసంధుఁడు జయమునందు నిశ్చయములేక తల్లడిల్లుచు శేషించిన రాత్రి నిదురపోఁడయ్యె. బంధింపఁబడిన రాజుల కందఱకు, ముఖ్యముగాఁ గళానంద చంద్రపాలజయసేనాదులకు హృదయములు చల్లనయ్యె. ముఖారవిందములు వికసించె. సౌందర్యతిలక తనభాగ్యము పండెనని పాండవుని జయమును యాదవుని మనోరథ సిద్ధియు నగునట్లు తన యిలువేలుపుల వేఁడుకొనఁ జొచ్చె. కోరకుఁడు కాణభూతిం గలసికొని మద్యపాన మొనర్చి గంతులు వేయసాగెను. యోగినియుఁ దనపన్నుగడ కడముట్ట నెఱవేఱు నవసరము వచ్చెనని సంతసించి యెప్పటియట్ల జరాసంధ పక్షమ మాటలాడుచు నంతిపురముప నున్న స్త్రీలకు జరాసంధ విభుఁడె విజయమొందు నని ధైర్యముం జెప్పుచుండెను.

రణార్ణవుఁడు గుండెలు పగిలి కటకటా! పీటలమీఁది పెండ్లి చెడిపో యె. ఇంక వాసుదేవుఁ డాకన్నెను నాకుఁ దక్కనిచ్చునే? నాపాపము పండినది. హా నాతండ్రి! జరాసంధ యని పెద్దపెట్టున నేడువఁ దొడఁగెను. నగరమంతయు ఘూర్ణమానమహాసముద్రము భంగి మహా క్షోభము నొందె. అంతటఁ బ్రాతం బగుటయుఁ గాల్యకృత్యములు నిర్వర్తించి భీమసేన జరాసంధులు మల్లయుద్ధమునకు సిద్ధపడి సభారం గమున కెదురుగనున్న చదునగు తలమునకు వచ్చిరి. మాగధుని మం త్రులు సామంతులు దండనాయకులు నాప్తులు నుచితాసనములఁ గూ రుచుండి కృష్ణార్జునులకుం దగుపీఠములు వేయించిరి. అపుడపుడే ప్ర భాకరుఁ డీమల్లయుద్ధము మొదటినుండియుఁ జూడఁ దలంచువాఁడుంబో లె మెల్లమెల్ల నుదయగిరిశృంగ మెక్కి తొంగిచూడ నారంభించె. భీమ జరాసంధులు రంగస్థలమున నొండొరుల కభిముఖులై నిలిచిరి. ఇరుగు రును గట్టిన పుట్టములు విడిచికట్టిరి. ఇరుగురును కేశపాశములఁ గట్టిరి. ఇరువురును భుజాస్ఫాలనంబున దిక్కులు మ్రోయించిరి. ఇరుగురు భుజాస్ఫా లనంబున బ్రహ్మాండము ప్రతినాదము సేయఁ జేసిరి. ఇరువురు సింహ నాదమున సభ్యులఁ గంపింపఁజేసిరి. అప్పుడు మహావీరులగు మాగధ పాండవులు పరస్పర జయాభిలాషులై యొకరినొకర కొంచెపఱచి పంకించి యట్టహాసము గావించి యూఁతకుఁ జేచి తొడచఱచి చేతులకొనలు కలపి కొని నలయాకారములుగ భ్రమించి యొండొరులు చిక్కకునికి వీ లర యుచు నెట్టకేలకు శార్దూలద్వయంబు చందంబున గజేంద్రయుగళము భాతి మృగేంద్రద్వితయమ్ము ప్రళయసమయఘూర్ణమాన సాగరయ మళము నోజ రెండు కొండల వడువునఁ దాఁకి భీకరమల్లయుద్ధము నెఱ పిరి. అట్లు కార్తికశుద్ధమునఁ బాడ్యమినాఁడు కయ్యమారంభమై ప దునాలుగు దినములు పరివర్తిల్లె. జరాసంధుఁడు నా నాఁటికిఁ బరి భ్రాంతుఁడయ్యె. ఒకనాఁ డెమ్ములు చూర్ణమయ్యె. మఱునాఁడు

కాయమునఁ గాయములు తోఁచె. మూఁడవనాఁడు నెత్తురు తొరఁగె. ఇట్లు జరాసంధుఁడు క్రమక్రమముగ క్షీణబలుఁ డగుటయు భీమసేనుఁడు చెక్కుచెదరక నిలుచుటయుఁ జూచి సహదేవుఁడు దద్బాంధవులును దుఃఖించిరి. కృష్ణార్జునులు వికసితముఖులై భీమసేనున కుత్సాహము గలిగించుచుండిరి. చతుర్దశినాఁటిరాత్రి మహాశ్రాంతుఁ డయిన జరాసంధుని భీమసేనుఁడు వాసుదేవునియోగమునఁ బట్టి వెన్నెముక పెటుక్కున విఱిచి నోట ముక్కున రక్తము కాలువలుగట్ట జగద్భయంకరముగ వధియించె.



## ఇరువదియవ ప్రకరణము.

అత్తెఱఁగున భువనప్రథితప్రతిపక్షగజేంద్రసింహస్వప్నాయమానుఁడు సకలక్షత్త్రియప్రచయతేజోరాశి, వాసుదేవునకుఁ బెక్కుకాలపుఁ బగతుఁడును నగు జరాసంధుని భీమసేనుఁ డవలీల మర్దించి నిజవిజయంబుఁ బౌరులకుఁ బ్రకటించు తలఁపునఁ గాఁబోలు వానిమహాకళేబరము నెత్తుకొనివచ్చి పురద్వారమునఁ బాఱవైచి సింహనాదముచేసి విజయశంఖంబు పూరించి తన్ను బహూకరించు కృష్ణాగ్రజులం గాఁగిలించుకొని మహాసంరంభమున మేను మఱచి మృగేంద్రుచందమున రాణించి నిలిచె. అంతఃపురకాంతాధ్వానములుఁ జుట్టముల హాహాకారములును సేవకుల యాక్రందనరావములును బౌరుల దీర్ఘనిశ్వాసనినదంబులును బందెలనున్న రాజుల యానందసూచక జయజయధ్వనులును మేదురములై యొకరిపలుకు లొకరికి వినరానియట్లు చేసె. పౌరులాబాలగోపాలము నచ్చటికి వచ్చి పడియున్నరాజుం గాంచి యేడ్చువారుఁ, బ్రక్క నిలిచిన భీమసేను మగఁటిమి మెచ్చువారు, హా! యెంతవాని కెంత కలిగె ననువారు, గద్గదకంఠులై నిట్టూర్పు విడుచు

వారుఁ, గన్నీరు చేలాంచలములఁ దుడిచికొనువారు, రాజగుణములఁ దలఁచువారు, వానిక్రూరత వానిం గొట్టిన దనువారుఁ గృష్ణుఁ డన్యాయము చేసె ననువారు, వాసుదేవుఁడు జగద్రక్షణార్థమై న్యాయమే చేసె ననువారు, రాజుల బంధించిన నీతని కేమి యనువారు నై పలువితములఁ బ్రసంగించుచుఁ, బోవువారలకుఁ దొలఁగుచు, వచ్చువారికి దారి యిచ్చుచు నిసుముచల్లినరాలనట్లు గుంపులు కూడిరి.

అంతట సహదేవుఁడు బాష్పాకులితలోచనుఁడై, వజ్రరాతుఁడు రత్నఖేటుఁడు ననుమంత్రులు తన్నుఁబట్టి నడపింప దుఃఖవశమున నడుగు కదలుపం జాలక యెట్టెటో యవ్వీటికి వచ్చి చిరకాలరాజ్యభారము వాయుట కోయన నేలఁబడి పెద్దనిద్దురపోవుచున్న తండ్రికళేబరముం గని దుఃఖము బట్టఁజాలక యాపీనుంగుపైఁబడి కన్నీటిసోనలచే నాతని రక్తసిక్తమగుమేను దడుపుచు నిట్లనివిలపించె “హాతండ్రీ! మహారాజాధిరాజ! త్రిలోకైకభయంకర! ఎంతలేసి మూర్ధాభిషిక్తులును నీయాన దాఁట వెఱతురుకదా! సకలప్రపంచంబు నీపేరు విన్న గడగడ వడఁకుచుండు. అంతటిదుర్నిరీక్ష ప్రభావంతుఁడ వగు నీవు నేఁ డతిదీనముగ ధూళిధూసరమైచకటికినేలఁ బవ్వళించితివి. అయ్యో! నావంటి యదృష్టహీనునకు నిన్నుబోలు బంగారుకొండవంటి తండ్రి దక్కునె! తండ్రీ! రాజ్యాంగసంరక్షణ జూడ వేమి! వీఁడె వజ్రరాతుఁడను మంత్రి వచ్చియున్నాఁడు. కనువిచ్చి చూడవేమి? మాచెలియండ్రకేమి దిక్కు చెప్పితివి? అనాథయైన రాజ్యలక్ష్మి నాకేల? నీవులేమి జగమంతయు లేనియట్ల తోఁచుచున్నది. కటకటా! నేనింక శత్రుఁడనైతినే! ఆతేజము నామహాసత్వము నారాజనీతి యెందుఁ బోయె? కృష్ణు ననేకపర్యాయములు పరాజయము నొందించిన యీదక్షిణహస్త మిటు ధూళిం బడనిచ్చుట న్యాయమే? హా! కేతకీదళమా? మగధరాజ్యలక్ష్మికి వైధవ్యము కలుగునని నీవుతెచ్చినవార్త నిక్కమయ్యె హా! యెం

పాతకపువేళ నాకేల వచ్చెనో? తండ్రీ! నీయసమయమున నాకంధకార
ము కన్నులఁ గప్పినది. నేను నీతొంటివైభవమును నేఁటి దురవస్థయుఁ
జూచి భరియింపఁ జాల" నని బిట్టుగ వగచి నేలమూర్ఛిల్లె. వానియాలా
పములు విని వజ్రదత్తాదులు దుఃఖించిరి. కృష్ణార్జును లిరువుర నేత్ర
ములనుండి బాష్పబిందువులు గిరిగిర దిరుగఁ దొడఁగె. ఇంతలో సేవకు
లరుదెంచి మూర్ఛిల్లిన సహదేవునకు శైత్యోపచారములు నడిపి వానిం
దేర్చిరి. కరుణాసముద్రుఁ డైనవాసుదేవుఁడు కనికరమునఁ జేసి తన మన
సు కరఁగి నీరై పోవ వడివడి సహదేవుని కడకుఁ బోయి వానిఁ దనవిశాల
బాహువుల నెత్తి కవుంగిలించుకొని సమాశ్వాస వచనములతో నిట్లని
యె. కుమారా! నాకతమున నీవు తండ్రిలేని బిడ్డవయితివి. అతనిం
గూర్చి నీవంటి ప్రాజ్ఞుఁడు వగవం బనిలేదు. నీ తండ్రి మహావిభవము
నఁ జిరకాలము మహీతలమును బాలించి యసంగత విక్రమమున
ధాత్రీశ్వరుల గెల్చి జయలక్ష్మిం జేపట్టి యనేకాధ్వరములు సేసి వేలు
పులం దనిపి మగఁటిమిఁ జూపి తుదకు వీరపురుషోచితమైన పదవి నొం
దినాఁడు. దుష్ప్రవర్తనమును గ్రూరతయు నుండుటం బట్టి నేనాతని శా
సింపవలసె. నామేనమామను నేను జంపుకొనలేదే? నీ జనకుని నిధన
మొందించితి నని నన్ను నీశత్రునిగా భావింపకుము. కంసుఁజంపి యు
గ్రసేనుం జేపట్టితి. నీవు సన్మార్గుఁడ వగుటచే నాకాప్తుండవు తనజన
కుం జంపె నను క్రోధంబుం బోఁద్రోసి తొల్లి యంగదుఁడు రాముని
చెలిమి జేసినట్లు నీవును నాసఖ్యమును నెఱపుము. నీకు భయము లే
దు. నేను నీవాఁడను. నీతండ్రికి నగ్నిసంస్కారము చేసి పారలౌకికక్రియ
లు నిర్వర్తించి పుత్రశబ్దము సార్థకము జేయుము. అని యాదరింప స
హదేవుఁడు శాంతించి తండ్రి కగ్ని సంస్కారము గావించె. శవము
తోఁ గృష్ణభీమార్జునులు, బంధులును మంత్రులును జని జరాసంధుని
గథావశేషుని గావించి వచ్చిరి. ఉత్తరక్రియలు నెఱపి శుచియై పితృ

ఋణము దీర్చిన పిదప వాసుదేవుఁడు సహదేవునితోఁ దండ్రిచే బంధింతులైనరాజుల విడువుమని యానతిచ్చె. ఇచ్చిన, నాతఁడు తత్క్షణము కళానంద చంద్రపాల జయసేన ప్రముఖులను నుజ్జయినీశ్వర ప్రముఖులగు నన్యరాజన్యులను బంధమోక్షితులను జేసి జగదానందము జేసి వాసుదేవుని దయకుఁ బాత్రుఁడయ్యెను.

పాములవాండ్రి పెట్టెలలోఁబడిన మహాసర్పములట్లు కత్తెరబోనులం బడిన బెబ్బులులయట్లు, బంజరములఁ జిక్కిన పక్షులట్లు నింతకాలము చెఱలో నుండి, కృశించి, విన్నవదనులై, యసహాయులై, పసపలి తేజములేని కన్నులలోఁ బ్రాణములు నిల్పుకొనియున్న రాజకుమారులు బంధనముల నుండి మోక్షితులై వచ్చి యొక్కరొక్కరుగ వాసుదేవుని చరణారవిందములకు వినయ మెసంగ నమస్కరించి భక్తి మనముల సందడింపఁ జేతులు జోడించి జయజయధ్వానములు సెలఁగ నార్చుచు దమప్రాణప్రదాత యగు నాపురుషోత్తము నిట్లని నుతించిరి. "నారాయణా! అచ్యుతా! ముకుందా! మహీభారము డిలుపఁ జేయు తలఁపున యాదవాన్వయపయోధిచంద్రుఁడవై యుదయించిన వైకుంఠనాయకుఁడవు. సనకసనందన సనత్కుమారాది నిత్యముక్తులకు నెన్నఁ దరముకాని నీమహిమము మేము కొనియాడనేర్తుమే? కరుణారసము వెల్లిగొలుపు క్రీగంటిచూపులు, చల్లదన మొట్టిపడు నీవదనచంద్రమండలము మాతాపత్రయములఁ బాపె. బంధమోక్షణము భవబంధమోక్షణము నీక్షణము మాకయ్యె. తపములు దానములు యజనములు పుణ్యకర్మములు గావించియు వేయుజన్మముల కయిన నెవ్వని నెంతధన్యులు గాంచఁజాల రట్టిభగవంతుఁడు నారాయణుఁడు మాకయాచితముగ దర్శనంబిచ్చె. తల్లులకు మఱుఁగుబిడ్డలు, బిడ్డలకై వగచుతల్లులు, సతులకై కందుపతులు, పతులకై సౌఖ్యసతులు, నేఁడుగిగా కలసికొనుచుఁ సుఖభాగ్యము నీకటాక్షమున నబ్బె. హరిణ్యాక్ష హి

రణ్యాకశిపు రావణకుంభకర్ణప్రముఖులఁ దెగటార్చిన నీకోపవహ్ని జరాసంధమహారణ్యమును భీమాంపదేశమునం జేసి కాల్చె. మాకు జరాసంధునిచేత ఘోరమరణము దప్పించి ప్రాణము లొసఁగినదేవా నమస్కార ”.మని నుతియించి నిల్చిరి. నుతించిన రాజులందఱం గనుంగొని కృష్ణుఁడు వారివారిపేరు లరసి దేశములనడిగి తెలిసికొని యాదరించి కూరుచుండఁ బనిచి గౌరవించి కళానందుఁ జేరబిల్చి దగ్గఱఁ గూరుచుండఁ బెట్టుకొని నెమ్మేను నిమిరి “ వత్సా! నుగిఫ రాజ్యలక్ష్మికి వైధవ్యము, నీకుఁ గళ్యాణము నేకకాలమునఁ గదం జాగ వలయును. అందొక్కటి తీఱె రెండవది చేయించి యిటనుండి యరుగది ” నని చంద్రపాలుం జూచి, పూజ్యుఁడవయిన నీవు నీకూఁతురు పెండ్లి యిచ్చువచ్చినట్లు చేసికొనవచ్చుఁగదా! యని జయసేనుఁ గుశల మడిగి మోక్షితులగురాజులఁ గళానందుని వివాహ మగునంతకు నుండఁ బనిచె. చంద్రపాలుఁడు తనకూఁతుఁ జూడఁబోయి కౌఁగిలించుకొని యించుక సేపు వగచి యూఱడించుకొని యింటికరిగెను. కళానందుఁడు తల్లికడకుఁ బోయె. జయసేనుఁడింటికిఁ జని మంచము పట్టిన తండ్రికి జీవితాశ గల్గించె. తారావతి యానందమేమని వర్ణింతును. అనంతరము వాసుదేవుఁడు కళానందుని వివాహ మాపంచిని ... సహదేవునితోఁ జెప్పి నతఁడు వల్లెయని ప్రయత్నములు చేయింపఁదొడఁగెను.



ఇరువదియొకటవ ప్రకరణము.



వాసుదేవుఁడు గిరివ్రజపురము బ్రవేశించి రాజసూయ మొదలు కర్ణార్ణవునకు శరీరమునం దొకవిధం బైనకంప ముదయించె. అందుచేత కృష్ణుఁడు తన్నుఁ జూచినమాత్రమునఁ దనప్రాణములఁ బుచ్చుకొనునని భయముంపడి యాతని కంటఁబడక యుదిగియొదిగి తిరుగుచు నాతఁడు దూ

రమున నగపడినతోడనే బ్రాహ్మణుని గన్నఛండాలునిభంగి నెంతయు దవ్వరుగుచుఁ దనతండ్రి మరణమునకు, నంతకన్నఁ దనవివాహవిఘ్నమునకుఁ జాటుచాటునఁ గుళ్లి యేడ్చుచుండెను. జరాసంధున కగ్ని సంస్కారములు జరగునాఁడు వెంటఁ జన్నవారందఱు కూర్చుండినచోటఁ గూరుచుండక వాసుదేవుని వలని భయమునఁ దనమిత్త్రబృందముతో వెలివానివలె దూరమున నొకచెట్టునీడం గూరుచుండి కాలగతి యంత యద్భుతముగ మాఱినందులకు నెంతయుఁ బొక్కఁ జొచ్చెను. సౌందర్యతిలకపేరు తలఁపునఁ బొడమినపుడు మహామోహమును, జరాసంధునినామము మదికిఁ దవిలిన తఱి మహాదుఃఖమును, యాదవుని దలఁపున నిలిపినయెడ మహాభయమును బొడమి మూఁడును మూఁడుదయ్యములై వానిని బీడింపఁ జొచ్చెను. కృష్ణుని వలని భయముమాట యటుండ వానికిం గ్రొత్త యాపద యింకొకటి సంభవించె. మున్ను జరాసంధుఁడు జీవించియున్ననాఁడు, తనమాటయే శాసనముగఁ జెల్లినదినములలో నిరపరాధులపై నేరములు కొండెములు చెప్పి పెక్కుకొంపలుదీసి యనేకుల ప్రాణములు తీయించినవాఁడగుట నట్టివాండ్రందఱు మున్ను రాజునకోడి నోరెత్తలేక నేఁడు తమప్రతిపగలు రవులఁ జేసి, కసి దీర్చుకొనఁ దలఁచి రణార్ణవుఁ బొంటరిగఁ జిక్కునేని తుదముట్టింతమని ప్రతినలు గైకొనిరి. ఆశపథములు విని రణార్ణవుఁడు భయమ్ముమ్మరముంగులుగాఁగ నిలు వెడలక, లోననెవ్వరైన బలాత్కారమునఁ బ్రవేశించి చంపుదురో యని రాత్రులు నిదురింపక యన్నము హితవుగఁ దినక వెనుక నొనర్చిన పాపముల ఫలముగ మనసు చింత యను నిప్పులఁ బొగ్గుచుండ నొకవిధమైన భూలోకనరక మనుభవించు చుండెను. ముసుపటిరాజు జీవించియున్నపుడు వానికి జడిసి రణార్ణవునికి సర్వసమానములు నెఱపి గౌరవించిన మంత్రిసామంత దండనాయకాదులు, పౌరులు నేఁడు వాఁడు వచ్చి యెంత సేపు వేచియున్న దర్శనం

నీయక, యిచ్చిరేని మాటలాడక, యాడిరేని తత్క్షణము వాని ననలకం
పి తమకు గలతిరస్కారభావముం బ్రకటింప సాగిరి.

తండ్రి కుత్తరక్రియలు దీర్చి సహదేవుఁడు శుచియైన వెనుక ర
ణార్ణవుఁ డాతనిజూడఁ బోయి, రాజుమృతికి వగచి ప్రసంగవశమున వా
నితో నిట్లనియె. "అయ్యా! మనమిరువురము నన్నదమ్ములము. నీ
తండ్రిగారు నాకర్ధరాజ్య మొసఁగుదుమని వాక్రుచ్చినారు. నాసాయ
ము నీకుండుట నీరాజ్యమునకు శ్రేయస్కరము. నాకు మంత్రిపదము
దయచేయుము. అది యటుండఁ దండ్రి తలపెట్టినపని కొడుకు నిర్వర్తిం
చుట పితృభక్తికలవానికి ధర్మముగదా! నావివాహము మీయప్ప త
లపెట్టి యదిముగియకమున్న నాభాగ్యలోపమున వాసుదేవుని మాయఁ
బడిపోయె. కావున నీవు సౌందర్యతిలకను నాకిప్పించి పెండ్లి సేయింప
వలయునని ప్రార్థించెద" నని యింక నేమేమో చెప్పఁబోవుచుండ
నాపలుకు సహింపక సహదేవుఁడు కోపోద్దీపితవదనుఁడై "మోమూ
ర్ఖుఁడా కులహీనుఁడవు నీవు నాతమ్ముఁడవా నీకర్ధరాజ్యము మాతండ్రి
యిచ్చునుగా! నీకోరిక లింతదూర మున్నవని యెన్నఁడెఱుఁగ. నీకు
మంత్రిపదము కావలయునా! నిన్ను మంత్రిం జేసికొనుట మాఁగొంతుఁ
గోసికొనుట. నీసాయ మపేక్షించుట కొఱవితోఁ దలఁగోకుకొనుట. న
రము లేని నీనాలుక కతమునఁ గాదె సత్పురుషులు బందెలఁ బడిరి.
నీకతమునఁగాదె మాకు మావారికిఁ బలుసిలుగులు సంభవించె. నిన్ను
దేశమునుండి వెడల నడువక నిలుపుటయే మహోపకారము. నీప్రా
ణము తీయకుండుటయే నీకుఁ గళ్యాణము. ఊరక పేలక పొమ్ము
చాలుచాలు." అనవుడు రణార్ణవుఁడు భయంపడి చిన్నవోయిన మొ
గముతోఁ గనుదోయినుండి బాష్పములు రాల నేడ్చుచు మాఱుమా
టాడక యింటికిం జనియె. కళానందుఁడు తల్లిఁ గలసికొని, సౌందర్య
తిలక తల్లిదండ్రులం గలసికొని తమవివాహముహూర్త మెప్పుడెప్పు

డని తమముచ్చటలు మనసులోఁ దలఁచుకొనుచు నువ్విళ్లూరుచు గడి యయేఁడుగా దినము యుగముగాఁ గడపుచుండిరి.

జరాసంధుఁడు మృతినొందిన నాఁటిరాత్రియె యోగిని యంతిపుముఁ బాసి యదృశ్యమయ్యె. కోరికకాణభూతులు తమతమ గుడ్డియు మూగయుఁ దమ్ము విడిచిపోన యథేచ్ఛముగా నగర మంతయుఁ దిరుగ సాగిరి. పౌరులు కొందఱు వారిం బిలిచి మీయంగవైకల్య మెట్లుపోయె నని యడుగ వారు భగవంతుఁ డగువాసుదేవుఁడు మాదైన్యముఁ జూచి మావైకల్యము దొలఁగునట్లు వరమిచ్చెనని యుత్తరము చెప్పిరి. జయసేనుఁడు బంధవిముక్తుఁడై మనోవైకల్యముక్తుఁడై యింటికరిగనే కాని తారావళింగూర్చిన యనుమానము వాని మనసునుండి పాయదయ్యె. జయసేనుఁడు కళానందుఁడు మిత్రులగుటంజేసి బంధముక్తులైనమఱునాఁడు కలసికొని తమతమ కష్టసుఖములకుఁ గారణములు చెప్పుకొనుచుండఁ బ్రసంగవశమున జయసేనుఁ డిట్లనియె. “మిత్రుఁడా! ఏవిధమునో నే నెఱుఁగను గాని మాయింటికి మొగలిరేకుజా బొకటి రాజలేఖ తెచ్చె. దానిని నాకడ నుండి దొంగిలించి యెవ్వరో రాజున కిచ్చిరి. నే నాకుట్రలో నున్నవాఁడ నని రాజు నన్ను బంధించె. అందు జరాసంధమరణము సూచింపఁబడుటచే నాతని కలుకవొడమి యట్లుచేసె.” అన నవ్వుచుఁ గళానందుఁ డిట్లనియె. “మిత్రమా! ఆజాబు సౌందర్యతిలక నిమిత్తము నేనె వ్రాసితిని. పూలవర్తకుఁ డైనరోహిణకున కమ్మని యొకసన్యాసి కిచ్చితిని. అతఁడు రోహిణకున కిచ్చె. వాఁడు దానిని బూలచెండులోనిమిడ్చి సౌందర్యతిలకదాసి యగునాగవల్లి కిచ్చె. అది దాని నెవ్వనికో విక్రయించినదఁట. కొనినవాఁడు దానిని మీదాసి కీయఁబోలు. అది రణార్ణవుఁడు మీయింటనుండి దొంగిలించుకొనిపోయి రాజున కీయనోపు. ఇదియెల్ల నిక్కమని నాకుఁ దోఁచెడు”నని చెప్ప జయసేనుఁడు సంతసించి తెలివొందిన మొగముతో మిత్రుని

వీరిద్దఱిని గృహమునకుఁ బని తారావతిం బిలిచి "సుందరీ చిరకాల
ము నుండి నామనసునం బీడించుచున్న యనుమానము తీఱె. అకలంక
చరిత్రవైన నిన్ననినమాటలకు నన్ను సైరింపుము. మొగలియాకు
చరిత్ర మంతయుఁ దెలిసినది సుమీ" యని కుమారు రాజసేను నెత్తి
ముద్దాడి రాజశేఖ నూరార్చి కడుసుఖముగ నుండెను. కృష్ణుఁడు సహ
దేవుఁడుఁ గూరుచుండి యానాఁడు రాత్రి మాటలాడుచుండగ నెవ్వఁ
డో యొక సేవకుఁడు కడువేగమున వచ్చి వారియెదుటనిల్చె. దీపముల
వెలుఁగున వాసుదేవుఁ డాతని నానవాలుపట్టి "యోరీ! కుశీలవా!
యెప్పుడు వచ్చితివి? పాప మాయిందుమతి వార్త లేమి? దురాత్ముఁ
డైన శిశుపాలుఁ డామెను బలాత్కారమునఁ బెండ్లియాడెనా?" అని
యడిగె. అడుగుటయు వాఁడు వినయమునఁ జేతులు జోడించి యిట్లని
యె. "దేవా! దేవరవారి వేగులవాఁడు కుశీలవుఁడు బ్రదికియుండ నంత
మాట పుట్టునే? హేమావతిం జూడవలయు నని వంకబెట్టి చందనపుర
మున కామెయు నేనును బోతిమి. అది నిజముకా వగచి శిశుపాలుఁ
డు మమ్మనిపె. మేము చందనపురమునకుఁ బోక ద్వారకానగరమున
కరిగితిమి. అట దేవర వారు లేరని యింద్రప్రస్థమున కరుగ నచ్చ
టను మీరు లేకునికి నేఁడు వచ్చితిని. ఇందుమతిని యుధిష్ఠిర మహా
రాజుగారు సగౌరవముగ నందు నిలిపి కడు జాగరూకతతోఁ జూడవల
యు నని ద్రౌపదీదేవిగారి కప్పగించిరి. ఆమె యటఁ గుశలినియై యున్న
ది." అని విన్నవించుకొన్న కుశీలవునిం జూచి నందకుమారుఁడు చిఱు
నగవు నొలయ "సవురా! నీవెంతకయినం దగుదువురా! మంచిపని చే
సితివి. నీవీశుభవర్తమానము కరభమహామునీంద్రునకుఁ దదాశ్రమ
మునకుం బోయి విన్నవించి యటనుండి యింద్రప్రస్థపురమునకుఁ బొ
మ్ము." అని యానతిచ్చెను. కుశీలవుఁడు రెండడుగులు సాగిపోయి మరల
వచ్చి "దేవా! చెప్ప మఱచితిని. [illegible]

డు మీాకు దగ్గఱిచుట్టము(బ్రద్యుమ్నునకుంబాల్య స్నేహితుఁడునగు మ
న యశోధరునిపై( జిత్తము నిల్పినది. అతఁడు నీమొంజూచిన దాదిగ మ
దనబాణపీడితుఁడై యున్నవాఁడు. మీాఁద దేవరచిత్త” మని మనవి యొన
ర్చుకొని తనదారింబోయె. అంతలోఁ గారాగృహాధికారివచ్చి సహాదే
వున కంజలియొనర్చి నిల్చి యిట్లనియె. “మహారాజా! తండ్రిగారు కొ
న్నినాళ్ళక్రిందట నిష్కారణముగ బిచ్చమెత్తుకొను ముసలివాని నొక్కని
వాసుదేవు చారులలో నొక్కఁడని తలంచి బాధించిరి. చెఱసాలలోనికి
వచ్చినదాదిగ వాఁడు రోగపీడితుఁడై యొక్కముహూర్తము క్రిందట
మరణము నొందినాఁడు. సెలవయ్యేనేని యగ్నిసంస్కారముఁ గావించెద”
మని చెప్ప సహదేవుఁ డించుకవిచారించి దిక్కుమాలినవానిఁ గూడ మా
తండ్రి బంధించి చంపెఁగా! వాఁడు మతిలేనివాఁడు. నిరపరాధుఁడు. పాప
మని జాలినొంది వానిదహనమునకు సెలవిచ్చె. పౌరు లామరణవార్త
విని యాబాలగోపాలము వగచిరి.

అమఱునాఁడు చంద్రపాలుఁడు మహామౌహూర్తికులఁ బిలిపించి కు
మారితె విహాహముహూర్తము పెట్టించి ప్రయత్నము సేయుందొడఁ
గె. రణార్ణవునకు సౌందర్యతిలకకు మున్ను జరాసంధుఁ డెచ్చటఁ బెండ్లి
సేయ నిశ్చయించె నాచోటనె కళానందుని వివాహముగూడ నెఱపు
మని వాసుదేవుఁడు చంద్రపాలున కానతిచ్చె. అతఁ డందుకు సమ్మతించె.
సౌందర్యతిలక సర్వవిధముల సంతోషితస్వాంతయై యుండి తన చెలిమి
కత్తె యగు నాగవల్లి తలఁపునకు వచ్చుటంజేసి రాగలతికతో నాలతకూ
నయిట్లనియె. ఓసీ! ఈసమయమున నాగవల్లి యున్న నెంతబాగుండును!
మొదటినుండియు మాయిరువురసమీపము నదియెంత మనసుపడి కో
రెనో యంతద వ్వయిపోయె మొగలియాకు దొరకెంగాని దానికై పో
యిన నాగవల్లి రాదయ్యె” నని యించుక గంటదడి వెట్టి తమ చెలిమిఁ
— — తి నాగవల్లిసాంపు దానిచమత్కృతిఁ దలఁచి వగవ సా

గెను. ఆమెంజూచి రాగలతికయు నగచి యూరకుండుమని యూరార్చి కన్నీరు కొంగునఁ దుడిచె.

ముహూర్తము సమీపించుచుండఁ గళానందుఁ డానందసాగరమునం దేలె. రణార్ణవుఁడు దుఃఖార్ణవమున మునింగె. పౌరు లందఱు మహానందభరితు లైరి. వివాహమునకుఁ బూర్వమునఁ జంద్రపాలుఁడు కూఁతుఁ బెండ్లికూఁతుంజేసి చుట్టముల నెచ్చెలుల నాప్తులఁ బిలిచి విందొనర్చె. నాఁటిరాత్రి సౌందర్యతిలకయు రాగలతికయు మేడపైఁ గూర్చుండి పెండ్లిముచ్చట లాడుకొనుచుండ వడివడి మేడమెట్టులెక్కివచ్చి యొకపడుఁతుక వారి కట్టెదుట నిల్చె. ఆనెలంతి లాపడుఁతుకంజూచి నాగవల్లి నాగవల్లి యనిపిలిచి యిరువురును లేచి యొకమాఱె దానిం గౌఁగిలించుకొనిరి. అద్భుతానంద రసములవలన నుదయించిన పారవశ్యత యొకయింత తమ్ము విడిచినపిదప శరీరములు తెలియుటయు బ్రదికి ప్రాణములతో వచ్చితివే యని రాగలతికయు, నింతకాల మెందుంటి వేటిపాట్లు పడితివి. నాకతమున నీకెన్నిచిక్కులు సంభవించెనోకదా యని సౌందర్యతిలకయుఁ బలుకరించిరి. నాగవల్లి వారిద్దఱఁ గూర్చుండఁ బనిచి నేను సుఖముగ నున్నదాన, కష్టము లంతగాఁ బడలేదు. పడినవన్నియు సార్థకములయ్యె. ఇంతకును మొగలిఱేకు దొరకెనో లేదో యని యడిగెను. ఆమాటకు రాగలతిక యిట్లనియె. "పాప మాయోగిని కటాక్షమున మొగలిఱేకు లభించె. ఎవ్వఁడో జాతవేదుఁ డనునాతని సహాయమున మన కళానందుఁడు బ్రదికెనఁట! వారలిద్దఱు బెండ్లికివచ్చిన సంతోషముగ నుందుము" అనుటయు నాగవల్లి యిట్లనియె. "ఆయోగిని మీకుఁ బరమోపకార మొనర్చె. జరాసంధునియొద్దనుండి మాయోపాయమున మొగలిఱేకును ముద్దుటుంగ్రముఁ దెప్పించి రణార్ణవుని భంగపుచ్చి ఱేకు మీకుఁ బంపి యుంగరము జాతవేదున కిచ్చి పంపె. వాఁ డదికైకొని శిశుపాలునికింజూపి జరాసంధుఁడు కళానందుం

దోడితెమ్మని నని బొంకి యాయంగుళీయక మానవాలుచెప్పి నిప్రాణ వల్లభు నీవలకుం దెచ్చి కూడ శిశుపాలుఁడుపంపినసేవకులనందఱ నర్ధరాత్రిమునఁ బులిపులియని భయపెట్టి పలాయితులంజేసి కళ్యాణందుసి ద్వారకకుం గొనిపోయి మఱల నిటకుం బంపె. అచ్చట నిందుమతి యను కన్యకకుఁగూడ హానిలేకుండ జాతవేదుఁడు హేమావతీ వ్యాజమున శిశుపాలునికంట దుమ్ముగొట్టె. ఆయిందుమతి యిప్పుడిందప్రస్థమున నున్నదఁట. అని యామెచరిత్రముకూడ వారలకుం జెప్పెను. ఆచరిత్రములకు వా రాశ్చర్యమొందుచుండ నాగవల్లి మరల నిట్లనియె. ఈ విషయమున యోగినికి జాతవేదునకు నందనందనుఁడు సాయమై వేగుల వాండ్రగు కోరకకాణభూతులను యోగినికిని, గుశీలవుని జాతవేదునకు సహాయముగా నంపె. యోగిని నీకుఁ గేతకీదళమిచ్చుటయేకాక మఱి యొక మహోపకారము గావించె. మొదటి దినమున నిన్ను రణాంగణమునకిచ్చి పెండ్లిసేయ సప్రయత్నములు జరగెఁగదా! ఆనాఁడు కళ్యాణమంటపముఁ దగులఁబెట్టించి వివాహ మాపినది యోగినిగాక యెవ్వ రనుకొంటివి? అదియొక టననేల? ఇంక వేయుపనులు నామె చేసెను. ఇవియెల్ల నింతకుమున్నె కళ్యాణందున కెఱిఁగించి యాతని నానంద సముద్రమునఁ దేలించితిని. జాతవేదుని దలంచి యాతఁడు నమస్కరించి తన ప్రాణమయిన నాతని కియసిద్ధముగ నున్నవాఁడు సుఁడీ" యని చెప్ప సౌందర్యతిలక యద్భుతమునొంది మనసున భక్తియు విశ్వాసమును బెల్లుబ్బి పైకిరాఁ జేతులు జోడించి యిట్లనియె. "అమ్మా! భగవతీ! యోగినీ! నీవు మాతల్లివి. నీఋణము నాశరీరము కోసియొసఁగినఁ దీఱునే? ఎంతలెంతకష్టములు నానిమిత్తమై పడితివి. అహాహ! జాతవేదా! నాకు నిజముగ సోదరుఁడవు నీవె. నీవను తెప్పమూలమునగదా ప్రాణేశ్వరుఁడు శిశుపాలుఁ డనుసముద్రమును దాఁటుట. నాపాలిదైవములు గదా వారిరువురు! నాగవల్లి! ఇంతకాలము నీవెందుంటివే" యని

పలికి యూరకుండె. రాగలతికయు నదియేమిచెప్పునో యని చెవియొగ్గి శ్రద్ధతో వినుచుండ నాగవల్లి యిట్లనియె. “ఇంక నిజము దాఁపనేటికి? మీకుఁ దెలియఁజెయకుండమన్న సంతోషము పొంగి తనంత హృదయముపట్టక వెలికివచ్చుచున్నది. అంతంత యద్భుతములుజేసిన యోగినిని నేనె. కళానందుని విడిపించిన జాతవేదుఁడను నేనె. ఇందుమతిని గట్టెక్కించిన హేమావతిని నేనె. ఇపుడు మరలవచ్చిన నాగవల్లిని నేనె. నేను నేనే” యనిచెప్పి తలవంచుకొని కూర్చుండెను. రాగలతికయు సౌందర్యతిలకయు నామె పలుకులు నమ్మవలయునో లేదో యెఱుఁగక నిశ్చేష్టులయి యుండిరి. నాగవల్లి వారి వైఖరింజూచి “అమ్మా! నాఁడు నేను నీ యెదుటఁ బ్రతినచేయలేదా? ప్రతినలో నున్నదానికన్న నెక్కుడు కార్యములు నివర్తించి కృష్ణునితో నాలోచనము సల్పి, శిశుపాలుని భంగపెట్టి, రణార్ణవుని మోసపుచ్చి, నీప్రాణములు దక్కించి నీహృదయేశ్వరు నునుటులు రక్షించి, కేతకీదళము నీకిచ్చి కృతార్థురాలనైతి. ఇదిగో జరాసంధుని ముద్దుటుంగరము చూడుఁడీ” యని మీఁదనైన వారిదియెత్తిచూచి కథయంతయు నిజమని నమ్మిరి. సౌందర్యతిలక తన నెచ్చెలిపై యింతింత యనరాని మక్కువయు విశ్వాసముసు జూప దానిం బిగ్గఁ గౌఁగిలించుకొని “చెలీ నానిమిత్తము నీకెన్ని కష్టములు గలిగినవి. నిజముగ నీకు వేయుసంవత్సరములుదనుక దాసినయ్యెఁ దీర్పఁజాల. మగవారలయిన నిర్వహింపరాని దుర్ఘటకార్యముల నవలీల నిర్వహించితివి. నాప్రాణమునీయది. యర్థమునీయది నీవనా దైవము” వని నుతించి యాదరించె. అనంతర మందఱు బహుసల్లాపములు జరపి నిద్రించిరి.

---

## ఇరువది రెండవ ప్రకరణము.



అంతట సకలజనానందకరముగఁ బ్రభాతమయ్యె. సహదేవ మహారాజు తానొకపట్టపు టేనికకు సకలాలంకారములు చేయించి బంగరు టంబారి వేయించి యందు పట్టుపరుపులు పఱపించి కళానందునం దెక్కమనియె. మున్ను దుర్గంధ భూయిష్ఠమయిన ముసలియేనికపై నెక్కి దీనాననుఁడయి తిరిగినవీథులలోనె విలాసవంతుఁడయి సుందరాననుఁడయి పెండ్లికొడుకయి ఛత్రచామరాదులు వెంటరా నూరేగి కల్యాణ మంటపమునకు వచ్చె. అందు సహదేవమహారాజును, యాదవ పాండవ సింహులును సకలమంత్రులు, సామంతులు దండనాయకులు, పరిచారకులు, దాసదాసీజనములు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదిదివారులు, విద్వాంసులు, వైణికులు, గాయకులు నటులు, చుట్టములు, నెచ్చెలులు, నాప్తులు నందఱుఁ దత్తదుచితాసనములఁ గూరుచుండి వివాహమహోత్సవము జూచుచుండిరి. రాగలతిక నాగవల్లి మొదలగు చెలిమికత్తెలు, పేరటాండ్రు, ముత్తయిదువులు, వెంటరా సౌందర్యతిలక సిగ్గునఁ దలవంచుకొని సకలభూషణశోభితుఁడై సాక్షాన్మన్మథుని వడువున భాసిల్లు మగనిసోయగము క్రీగంటిచూపులఁజూచి తనియుచు వివాహమంటపముం బ్రవేశించెను. కళానందుని చూపులు, మనసు, ప్రియురాలివశముగా మేను మన్మథవశముగా హస్తములు పురోహితుని చేతికిచ్చి కీలుబొమ్మలాగున నాతఁడు చేయించు దైవారాధనలు చేసె. అందఱియెదుటఁ జంద్రపాలుఁడు పసిడి పళ్లెరమందుఁ గళానందుని పాదారవిందములుంచి తనభార్య కనకకలశముతో నిర్మలోదకము వోయఁ గడిగి సాలంకృతకన్యాదానముజేసి ధన్యుఁడయ్యెను. కళానందుఁడు సౌందర్య తిలక పాణిగ్రహణముచేసి యన్యోన్యకరస్పర్శనము వలన నానంద పారవశ్యము నొందిరి. అనంతరము ధారుణీదేవియుఁ జంద్రపాలుఁడు నా

నంద బాష్పములు విడువ వారిరువురు ముత్యాలతలబ్రాలొండొరుల మీఁద నొకరిని మించి యొకరు వోసికొని రూపలావణ్యముల, వయోవిభవముల, విద్యాగుణములఁ, బరస్పరానురాగముల నొకరికొకరు తగియున్నకతనఁ గొమరుం గోడలింజూచి ధారుణీదేవియుఁ గూఁతునల్లునిజూచి చంద్రపాలుఁడు నట్టివియ్యములంజూచి సకలపౌరజనములు, వారింజూచి కృష్ణభీమార్జునులును నందఱుం జూచి సహదేవమహారాజును సంతసించిరి. ఆయైదుదినములు, వచ్చినవారెల్లరు నాటలు, పాటలు, నృత్యములు, వాద్యములు చూచి విని సంతసించి విందు లారగించి వధూవరుల దీవించిరి. అనంతర మాదంపతులకు సంధానమహోత్సవము జరిగె. మదనారాతికైనఁ గోరిక లుదయింపఁజేయునట్లు సింగారించినయంతిపురముమేడపైగదిలోనం బ్రవేశించి యాదంపతులు పూవుసెజ్జల మేనులుచేర్చి చిరమన్మథాగ్ని చల్లబడునట్లు పన్నీరు మంచిగందము మేనులం జల్లి పూసికొని మనసువచ్చినట్లు కన్నులకఱవుదీఱ నొండొరులరూపములం జూచుకొని చిరకాలవియోగజనితకంపమునోవ బిగియారఁగౌఁగిళ్ల ననఁగిపెనఁగి యెడలేనిముద్దులం దనిసితనిసి మహాభోగసౌఖ్యములం దేలి మదనసామ్రాజ్య మనుభవింపఁ దొడంగిరి. ఆగాటంపు మక్కువలాతనినివోనికోర్కు లాకారణములేనియలుక లానిలుకడలేనిపట్టుదల లాసింగారపుంబండెము లాచిత్రప్రసంగము లాహాయలులు వర్ణింపసమకట్టుటకన్న ననుభవింపుఁడని వారి నొంటరిగ విడిచి యూహించుకొమ్మని చదువరుల విడిచి యనంతరకథాకథనమునకుఁబోవు టుచితము.

మఱునాఁడు వాసుదేవుఁడు భీమార్జునులతోఁగూడఁ బయనమై తన్నునుప వచ్చిన సర్వజనమును వీడ్కొని కళానందునిచేయి సహదేవుని చేతికిచ్చి యప్పగించి చంద్రపాలుని సన్మానించి సహదేవుం గవుంగిలించుకొని వానికి రాజనీతి నేర్చి పురజనుల కభయమిచ్చి రాజభక్తి బోధించి భీమార్జునసహదేవులకు సఖ్య ముండునట్లు నొక్కిచెప్పి జరా

సంధు రత్నకాంచనమయమైన తేరుపై నెక్కి వెడలె. బంధ మోక్షితులైన రాజులు వానివెంటఁజనిరి. అట్లు బయలుదేఱి గోపాలుఁడు భూపాలకపరివారముతో నింద్రప్రస్థము జేరి తమరాక మున్నే యుధిష్ఠిరునకుఁ దెలుపుమని కొందఱుభూతుల నంపె. యుధిష్ఠిరుఁడును మహానందమున మఱఁదిరిదమ్ముని నెదుర్కొని వారల దీవించి కౌఁగిలించుకొని జరాసంధసింధురమును దెగటార్చిన యాదవసింహుబుద్ధిబలమును బాండవసింహుబాహుబలమును, నగ్గించి గిరివ్రజపుర విశేషములం జెప్పుకొనుచు నాదినముం గడపిరి. మఱునాఁడు యదుకుంజరము కురుకుంజరమునుజూచి యిట్లనియె. "రాజేంద్రా! చేయదగినపనిఁ జేసితిని. ఈజగత్కంటకుఁడు తీఱుటచే నింక శిశుపాలాది శత్రువులు నాచేతిలోనివారు. నీవింక రాజసూయము నారంభింపుము. నీనలువురుతమ్ముల నలుదిక్కులకు దిగ్విజయార్థ మంపుము. జరాసంధబంధితులైన రాజులు మావలన ముక్తులయిరి. వీరల వీరిదేశముల కనిపి రాజసూయమునకు రమ్మని యానతిమ్ము. యజనమునకుం దగువోటు లరసి శాలలు నిర్మించి సంభారముల సమకూర్చి బ్రాహ్మణులను జుట్టములఁ బిలువనంపి సిద్ధముగ నుండుము. ఇందుమతిని నాతోడం దీసికొని పోయెదను. మేమందఱము మరల నదినకాలమున నచ్చెదము. మాకు సెలవొసంగుమని వీడుకొని ద్వారకానగరమునకుం జని పురజనులెదుర్కొని గౌరవింప నగరుజొచ్చి రుక్మిణిం బిలిచి యిందుమతింజూపి "దేవీ! ఈబాలిక కొన్నినాళ్ల క్రిందట నిటకువచ్చియున్నపు డామెచరిత్రము నీవు వినియె యుందువు. ఈమెకాఁపురము గిరివ్రజము. కాని యిచ్చట నేనరసినంతవఱకు నీమెచుట్టములేలేరు. కావున నీమెను మనబలగములోఁ గలిపికొనవలయును. మనయశోధరుచిత్తము దీనియందు హత్తినదఁట. వీరలకు వివాహమిచ్చుటఁ జేయవలయు." అని యిందుమతిం జూచి "బిడ్డా! నీవు వగవకుము. నాచుట్టమ వైతివి. నీకు రుక్మిణితల్లి, నేను

జనకుఁడను." అని యాదర మొలుకుపలుకుల నామె కభయ మొసఁగి మఱునాఁడు కార్తాంతికులరావించి సుముహూర్తము నిర్ణయించె. అనంతర మొక్క పుణ్యదినమున సింధుమతీయశోధరుల వివాహము మహావైభవముతో వాసుదేవుని నగరుననే నడిచెల్లె. యదుభోజ వంశజులు రాజబాంధవసమేతులై మహాసంతోషముతో నాదినములు గడపిరి. కరంభమహామునియుఁ దద్వివాహమునకువచ్చి యిందుమతికిఁ గలిగినకష్టములను వగచి యామె నాలింగనముజేసికొని దీవించి యా పెండ్లిదినము లందుండి మరల నాశ్రమమునకుఁ జనియె.

అట్లుల యుధిష్ఠిరుఁడు బంధమోక్షితులైన రాజులం గుత్తమ దేశముల కనిపి భీమార్జుననకులసహదేవుల దిగ్విజయముచే రాజుల గెల్చి ధనరాసులం దెప్పించె. ఆసింధుచతుష్టయము చతుస్సాగరము లవధియగు సకలదేశములకు సేనానేతులై యనేక మూర్ధాభిషిక్తు లరుదెంచి కప్పములుగ గ్రహించి ధనధాన్యములు గొనిపోయి వచ్చి ధర్మజుపాదారవిందముల కర్పించి కృతకృత్యులైరి. అనంతరము యాగ మునిమిత్తమువచ్చు సకలసామంతనృపాలురకు నివాసయోగ్యములగు ననేకగృహములును, పసులకు గృహములును నశ్వములకుఁ దగు పంక్తి శాలలు, సేవకులకు దాసదాసీజనములకు నివాసములుగ నిలయములును, జట్టములకు నెచ్చెలులకు సౌఖ్యప్రదములైన మందిరములును, నాట పాటలకు వేడుకలకుఁ దగు శాలలును, బ్రాహ్మణోత్తముల స్నానపానజ పహోమాదుల కనుకూలములగు పవిత్రప్రదేశములును, యాగము నిర్వర్తింపఁబడుటకు శాస్త్రోక్తప్రకారము బహువిధాగారములును, సైన్యములు వసియించుటకు విశాలపటకుటీరములును, బ్రాహ్మణభోజనములకు వంటలకు వివిధమైన పర్ణశాలలును నిర్మింపఁబనిచి యుధిష్ఠిరుఁడు, చుట్టముల, స్నేహితుల, బ్రాహ్మణులఁ, దక్కిన రాజలోకంబులఁ బిలువ నంపె. వేదములవతరించినట్లు, షడంగములు మూర్తులు గైకొన్న

ట్లు, శాస్త్రము లాకారములు దాల్చినటుల, వసుమతీచక్రమునఁ గల బ్రాహ్మణులు యాగము నిర్వర్తించుటకు ఋత్విజులు నధ్వర్యులు నుద్గాతలు నుపద్రష్టలు హోతలు మొదలగువారు నరుదెంచి రాజుచే సన్మానింపఁ బడిరి. శిఖండిదృష్టద్యుమ్న ప్రముఖ కుమారులతో ద్రుపదుఁడును పాంచాలదేశమువారెల్లరు తరలివచ్చిరి. ఉగ్రసేన వసుదేవ బలదేవ సాత్యకి సంకర్షణాక్రూర ప్రముఖులగు వృద్ధులును సాంబప్రద్యుమ్నాది కుమారులను యశోధరాది బంధువులును, రుక్మిణి, సత్యభామ, జాంబవతి, మిత్రవింద మున్నగువారును వారితో నిందుమతియు వెంటరా వాసుదేవుఁడు బయలుదేఱిన, వానితో, ద్వారకానగరమంతయు వచ్చె. భీష్మబాహ్లీక సోమదత్త భూరిశ్రవసాదులగు కురువృద్ధజనులతోడను, కృపద్రోణాశ్వత్థామలతోడను, దుర్యోధనదుశ్శాసనాదికుమారసంతతితోడను, గర్గాదియాప్తవర్గముతోడను సింధుగాంధారరాజప్రముఖులగు చుట్టములతోడను ధృతరాష్ట్రుఁడు వెడల హస్తిపురమంతయు వెడలివచ్చె. కళానందాదులతో సహదేవ మహారాజును, జరాసంధమరణమునకు నిందుమతీవివాహమునకుఁ జింతించుచు శిశుపాలుఁడును సకలమహీమండలమును వచ్చి యింద్రప్రస్థపురముఁజేరి యుధిష్ఠిరునిచే సన్మానము నొందిరి.

వచ్చిన చుట్టములను స్నేహితులను నాయాకార్యములందు నియోగించి ధర్మరాజు రాజసూయము జేయుటకు ద్రుపదరాజకన్యతో దీక్షవహించె. బహువిధాజ్యహోమముల న్వేల్పులం దనియించి, షడ్రసోపేతాన్నముల భూసురులం దృప్తినొందించి, సన్మానముల రాజుల న్ముదితాంతరంగులం గావించి, దానముల నేలవేల్పులదరిద్రదశలఁ బాపి బహుమానముల మిత్త్రులఁ జుట్టముల సంతోషింపఁజేసి, యామహారాజు ఒన్నము సేయుచుండె. పవిత్రమంత్రవాదములు, బ్రాహ్మణాశీర్వాద నినాదములు, బహుజనుల మాటలరొదలు, వందిమాగధవైతాళి

కుల యభివాదములు బ్రహ్మాండములునిండె. ఆసమయమున, లోబడిన సామంతులు, సటకు రాని రాజులు, నరివెట్టని ధారుణీశ్వరులు, మ్రొక్కని భూపాలురు, దనియనిబీదలు, దానములొందని భూసురులు, సంతసింపని వారు గానరారైరి. ఆ నక్షత్రశతుప్రకాసమయమున దీపకళికలంబోలె ధగధగ వెలయు బహురత్న ముక్తాలంకారకిరీటము మస్తకము నలంకరింప హారకేయూరాది భూషితుండయి నిజకీర్తియుంబోలె భాసిల్లు దువ్వలువలందాల్చి యిరుగడల భీమార్జునులు ధవళచామరములిడ నకులసహదేవులు ఛత్రములనిడ సాత్యకిధృష్టద్యుమ్నులు సమస్తమూర్ధాభిషిక్తుల నామధేయకీర్తనములతో మ్రొక్కింప వారికిరీటమాణిక్యకాంతులు తనయడుగుందామరలయరుణకాంతులనినుమడించి నీరాజనమొసంగ వివిధదేశాగతులు వినయసంభరితులై యర్పించుకానుకలు, కట్నములు, రత్నములు, ధనసంచయము శిరఃకంపములం గ్రిగంటిచూపుల మన్నించుచు సబాంధుజనము మహాసంతోషమొంద స్నేహితు లుప్పొంగం బాంచాలుండు కూతునల్లుంజూచి సంతసింప గొడుకుల యౌన్నత్యమునకుం గుంతి యానందబాష్పములు విడువం గురుకులము మహోన్నతదశంబ్రాపించెనని భీష్మద్రోణాదులు ముదితులుగా, శిష్యులప్రతాపములకుం గృపద్రోణులహ్లాదయములు జల్లంబడ నిర్విశేషిత శత్రుమండలుడై నిరుపమానప్రతాపుడై వ్యాస నారద పరాశర మార్కండేయ ప్రముఖులగు మునిగణము, కౌరవులు యాదవులు పాంచాలురు మాగధులు చైద్యులు తక్కినరాజులు గొలువ, పెక్కుగట్టులనడుమం బోల్చు మేరువట్లు తారకామధ్యమున వెలయు చంద్రునివలెం బ్రమథగణసమేతుండయిన శంకరు చందమున దిక్పాలకులనడుమంబోల్చు మహేంద్రునట్లు భూలోకదేవేంద్రుడై వీరనారాయణుడై నల హరిశ్చంద్రుల మఱపించుచు రాజతేజము బ్రహ్మతేజము గుమికూడినట్లు మహావిభవమునం గొలువుదీర్చియుండె. యజ్ఞాంతమున సభ్యు లెవ్వరికేయుత

గుణని యుధిష్ఠిరుఁడు భీష్మునడుగ నాతఁడు వాసుదేవుఁడర్ఘ్యమందుకొన సమర్థుఁడని పలికె. అపుడు సకలరాజలోకము వీక్షింప సహదేవుఁడు కృష్ణున కర్ఘ్యమొసఁగె. సహజవైరమున శిశుపాలుఁడు ధియోర్వర మహాకోపమున యుధిష్ఠిరు నాక్షేపించి గంగానందను నిందించి గోపాలదేవుఁడెట్టి యుద్ధసన్నద్ధుఁడయ్యె. చక్రధరుఁడు మహాక్రోధమున రాజచక్రము చూచుచుండ శిశుపాలశిరచ్ఛేదము చేసె. రాజులు గడగడవడఁకి జయజయధ్వనుల నందకుమారుం బొగడిరి. రాజసూయము, ప్రశాంతవిఘ్నమై, కురుకుల క్షేమకరమై, సర్వజనానందకరమై, భూతప్రీతిదాయకమై, పరిపత్తిఁ గల్ల యుధిష్ఠిరుఁడు ద్రౌపదీమహాదేవియు నవభృథస్నాన మాచరించి వచ్చిన ముట్టముల రాజుల వారివారి దేశములకుఁ బంపె. మాగధసహదేవుఁడు కళానందునితో గిరివ్రజమునకుం బోయి సుఖముగనుండిరి. యశోధరునితో వాసుదేవుఁడు ద్వారకానగరముం జేరె. కళానందుని రాజభక్తికి విద్యావైభవమునకు బాహుబలమునకు మెచ్చి సహదేవుఁడు వానిం దనమంత్రిగాఁ జేసికొనియె. కళానందసౌందర్యతిలక లత్యంతసౌఖ్యమున నొండొరులపైఁ గూర్ములు నానాటికి హెచ్చి హాయిగనుండిరి. వాసుదేవునియనుగ్రహమువలన నిందుమతియు యశోధరుఁడును నేకొఱంతయు లేకుండ సుఖించిరి. రణాంగణాపుఁ గాన నాఁడొంటరిగ నెందో పోవుచుండ వానిప్రతిపక్షుఁ డెవ్వఁడో వానిం జంపి పగదీర్చుకొనియె. యుధిష్ఠిరమహారాజు వాసుదేవుని బుద్ధిబలము తనకు మంత్రియై యుండ నలువురితమ్ముల బాహువిక్రమములు దనకుఁ బెట్టని నాలుగుకోటలుగాఁగఁ బ్రకృతిజనానురంజనముగఁ గురువృద్ధజన సమ్మతముగఁ గువలయానందకరముగఁ బ్రజాపాలనము సేయుచు సుఖముగనుండెను.

